## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## రామకృష్ణ మఠ్ వారి వెబ్ సైట్

## http://www.rkmath.org

Archives

www.rkmath.org/prabhaarchives

Home | Universal Temple | Activities | Languages | Human Excellence | Health | Publications | Downloads

Magazine | Telugu Books, CDs & Posters | Online Shopping

About | Archives | Subscription

శ్రీ రామకృష్ణ ప్రభ

+ Aa − What's New Our Location

Would you try to wash dirt with dirt? Will sin cure sin, weakness cure weakness? Strength, O man, strength, say the Upanishads, stand up and be strong.

*- Swami Vivekananda*

Donate | Serve with us | Contact Us

**Universal Temple**

- Temple
- Arathi
- Bhajans
- Festivals
- Rama Nama
- Worship

**Activities**

- Weekly discourses
- Relief
- Library
- Retreats
- Anna Danam
- Balanarayana Seva
- Vidya Danam
- Jnana Danam
- Satsangas
- Diksha

**Ramakrishna Prabha Magazine Archives**

Submit

2012

2011

Click to read | Click to read | Click to read

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని జళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

జనవరి 2007 వెల : రూ. 8

## యువకులారా ! నా ఆశలన్నీ మీ పైనే!!

సంబరాల సంక్రాంతి

ముక్తి మార్గంలో శక్తిశాలి యోగిని



# సుబోధ



**శ్రీరామకృష్ణులు:** (భక్తులతో) నా జగజ్జనని నిరాకారియే కాదు, ఆమె సాకార మూర్తి కూడా. ఆమె రూపాలను దర్శించవచ్చు. ప్రేమభక్తి ద్వారా ఆమె నిరుపమాన సౌందర్యాన్ని తిలకించవచ్చు. జగజ్జనని తన భక్తులకు పలురూపాలలో దర్శనం ఇస్తుంది. ఆమెను నిన్న నేను దర్శించాను. ఆమె కాషాయాంబరాలు ధరించి ఉంది; నాతో మాట్లాడింది కూడా! మరో రోజు ఆరేళ్ళ మహమ్మదీయ బాలిక రూపంలో దర్శనమిచ్చింది. నొసట తిలకం పెట్టుకొని, దిగంబరియై ఉంది. చిన్నపిల్లల్లా గంతులేస్తూ, పరిహాసాలాడుతూ నాతో కూడా నడిచింది.

బ్రహ్మం, శక్తి అభేదం. నువ్వు శక్తిని అంగీకరించకపోతే జగత్తు యావత్తూ – నేను, నువ్వు, ఇల్లు, కుటుంబం – మిథ్య అయిపోతుంది. ఆద్యా శక్తి ఉన్నందు వల్లే జగత్తుకు అస్తిత్వం ఏర్పడుతుంది. దుర్గాదేవి ప్రతిమను తయారు చేయాలంటే మొదట వెదురుబొంగును ఒకదాన్ని ఆధారం చేసుకొని, ఒక చట్రం నిర్మించాలి. ఈ చట్రం లేకుండా సుందరమైన దుర్గా ప్రతిమ తయారు కాదు.

విషయబుద్ధిని త్యజించనిదే ఆధ్యాత్మిక చైతన్యం జాగృతం కాదు, భగవత్సాక్షాత్కారం లభించదు. విషయబుద్ధి కారణంగానే కపట స్వభావం కలుగుతుంది. నిష్కపట స్వభావి కానంత వరకూ ఎవరూ భగవంతుణ్ణి పొందలేరు.

ఆఫీసుల్లో ఉద్యోగం, వ్యాపారం మొదలైన లౌకిక కార్య కలాపాల్లో నిమగ్నమైనప్పటికీ సత్యవాదిగానే ఉండాలి. ఈ కలియుగంలో సత్యసంధతయే తపస్సు.

అనేకులు బ్రహ్మ జ్ఞానం గురించి మాట్లాడతారు; కానీ వారి మనస్సులు సదా ఇల్లు, భవనాలు, ధనం పేరు ప్రతిష్ఠలు, ఇంద్రియ సుఖాలు మొదలైన విషయాలతోనే నిండి ఉంటాయి.

మాన్యుమెంటు (*కలకత్తాలోని స్మారక చిహ్నమైన ఆక్టర్లోనీ మాన్యుమెంట్ ఓ ఎత్తైన కట్టడం*) పాదం వద్ద నిలబడినంతసేపు గుర్రాలు, బళ్లు, దొరలు, దొరసానుల్ని చూడవచ్చు. కానీ మాన్యుమెంట్ పైకెక్కి చూస్తే భవనాలు, బళ్ళు, గుర్రాలు, మనుష్యులు – అన్నీ చీమల్లా కనిపిస్తాయి. వాటిని చూడడంలో ఆనందం పొందలేవు.

బ్రహ్మజ్ఞానం పొందగానే సంసారాసక్తీ, కామ కాంచనాల పట్ల వ్యామోహమూ మొదలైనవి అదృశ్యమవుతాయి. సకల వాంఛలకూ తెరపడుతుంది. కొయ్య దుంగ మండేటప్పుడు చిటపటమనే శబ్దం వస్తుంది. మండడం పూర్తయి బూడిద మాత్రం మిగిలాక, ఎలాంటి శబ్దమూ రాదు. ఆసక్తి నశించగానే ఆరాటమూ అదృశ్యమవుతుంది. చివరకు శాంతి చేకూరుతుంది.

గంగానది సమీపానికి వెళ్ళేకొద్దీ ఎక్కువ చల్లదనాన్ని పొందుతాం. అలాగే భగవంతుణ్ణి సమీపించేకొద్దీ మరింత శాంతిని పొందగలం. P

**('శ్రీరామకృష్ణ కథామృతం' నుంచి)**






నిర్వాహక సంపాదకులు: ***స్వామి జ్ఞానదానంద*** సంపాదకులు: ***స్వామి పరిజ్ఞేయానంద***



శ్రీ రామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాదు – 500 029
ఫోన్: 040–2766 7799, ఫోన్ & ఫ్యాక్స్: 040–2763 3936





# భాగ్యనగరం నుంచి శ్రీ రామకృష్ణ 'ప్రభ'






గత 63 సంవత్సరాలుగా చెన్నై శ్రీ రామకృష్ణ మఠం తరఫున అవిచ్ఛిన్నంగా వెలువడుతున్న ఆధ్యాత్మిక, సాంస్కృతిక మాస పత్రిక **'శ్రీ రామకృష్ణ ప్రభ'**. భారతీయ ఆధ్యాత్మిక సంస్కృతికి అద్దం పడుతూ మన సనాతన ధర్మ వైశిష్ట్యాన్నీ, శ్రీరామకృష్ణ, శ్రీశారద దేవి, స్వామి వివేకానంద, వేదాంత ప్రబోధనలనూ విశ్వజనీనం చేస్తూ అసంఖ్యాక తెలుగు పాఠకుల ఆదరాభిమానాలను చూరగొన్న **'శ్రీ రామకృష్ణ ప్రభ' 2007 జనవరి సంచిక** నుంచి హైదరాబాద్ రామకృష్ణ మఠ నిర్వహణలో వెలువడుతోంది.

1897లో శ్రీ రామకృష్ణ ప్రత్యక్ష సన్న్యాస శిష్యులు స్వామి రామకృష్ణానందచే మద్రాసు 'కేసిల్ కర్నన్' - ఐస్‌హౌస్ (వివేకానందర్ ఇల్లమ్)లో శ్రీరామకృష్ణ మఠం ప్రారంభమైంది. 1907లో మైలాపూరులోని విశాల ప్రాంగణంలోనికి మార్చబడిన ఈ కేంద్రం ఆధ్యాత్మిక, సాంస్కృతిక, విద్య, వైద్య రంగాల్లోనూ, ప్రకృతి వైపరీత్యాల్లోనూ సేవలను అందిండమేకాక ఇంగ్లీషు, తమిళం, తెలుగు భాషల్లో ఎన్నో గ్రంథాలు ప్రచురిస్తూ దేశ విదేశాల్లోని అసంఖ్యాక పాఠకులకు విశిష్ట సేవలందిస్తోంది. మాతృమూర్తి శ్రీశారదాదేవితో సహా స్వామి వివేకానంద, స్వామి బ్రహ్మానంద, స్వామి శివానంద, స్వామి అభేదానంద మొదలైన సాధుపుంగవులు చెన్నై దర్శించడం వల్ల నేడు ఆ మఠ ప్రాంగణం ఒక పుణ్యతీర్థంగా మారింది. అటువంటి పవిత్ర చెన్నై శ్రీరామకృష్ణ మఠం 1944 జూలై నుండి 2006 డిసెంబర్ వరకు **శ్రీరామకృష్ణ ప్రభ** ప్రచురణా బాధ్యతల్ని సమర్థంగా నిర్వహించి అశేష ఆంధ్రులకు ఎనలేని సేవలందించింది. 2007 జనవరి నుండి తెలుగు పాఠకులకు మరింత సన్నిహితంగా ఉంటూ సేవలందించే భాగ్యం హైదరాబాద్ రామకృష్ణ మఠానికి దక్కింది.

**చెన్నై శ్రీరామకృష్ణ మఠంలో నెలకొన్న విశ్వజనీన శ్రీరామకృష్ణ దేవాలయం**

**హైదరాబాద్ రామకృష్ణ మఠంలో నెలకొన్న విశ్వజనీన శ్రీరామకృష్ణ దేవాలయం**

1893 ఫిబ్రవరి నెలలో స్వామి వివేకానంద పాదస్పర్శా భాగ్యానికి నోచుకొన్న 'భాగ్యనగరం'లో స్వామి రంగనాథానంద మహరాజ్ అధ్యక్షతన 1974లో రామకృష్ణ మఠం శాఖ ప్రారంభించబడింది. స్వామీజీ విశేష కృషితో అత్యుత్తమ ఆధ్యాత్మిక కేంద్రాలలో ఒకటిగా ఖ్యాతి పొందింది హైదరాబాద్ రామకృష్ణ మఠం. శ్రీరామకృష్ణ విశ్వజనీన దేవాలయం, వేలాదిమంది విద్యార్థులకు భాషా బోధన గావించే వివేకానంద వాణీ సంస్థ, వ్యక్తిత్వ వికాసానికి తర్ఫీదునిచ్చే మానవ ప్రతిభా వికాస సంస్థ, ఉచిత వైద్యశాల వంటి అనేక సంస్థలతో విశిష్ట సేవలందిస్తోంది. ఈ సేవలతో పాటు ఇప్పుడు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాస పత్రిక ప్రచురణా బాధ్యతల్ని హైదరాబాద్ రామకృష్ణ మఠం చేపట్టింది.

**పాఠకుల పఠణా సౌకర్యార్థం 2007 జనవరి సంచిక నుంచి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను న్యూస్‌ప్రింట్ పేపరు బదులు తెల్లని క్రీమో పేపరుపై ముద్రించి, 16 పేజీలుపంచరంగులతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది పత్రికను పాత ధర (రూ.8) కే మీకు అందిస్తున్నాం.**

హైదరాబాద్ రామకృష్ణ మఠం ద్వారా ప్రచురితమవుతున్న **'శ్రీ రామకృష్ణ ప్రభ'** సమర్థంగా నిర్వహించడానికి మీ అందరి శుభాకాంక్షల్ని కోరుతున్నాం. మీ ఆధ్యాత్మిక అన్వేషణలో మేము అందిస్తున్న సేవలు సఫలీకృతం కావాలన్నదే మా ఆశ, ఆకాంక్ష.

**భగవత్సేవలో**

**స్వామి జ్ఞానదానంద, అధ్యక్షులు**

**రామకృష్ణ మఠం, హైదరాబాద్**

**ప్రతి నెలా ప్రబోధం!**
**ప్రతి ఇంటా ప్రభాతం!!**



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




**ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకుగాను 'శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయ మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.**

**మహారాజ పోషకులు** ......రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. **రాజ పోషకులు** .......రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. **పోషకులు**.........రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.



గమనిక : చెక్కు, డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో 'Sri Ramakrishna Prabha Permanent Fund', Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : President, Ramakrishna Math, Domalguda, Hyderabad- 500 029

# శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి మీ పేరు మీద పది మందీ మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥ 600/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ళ పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు) ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. ***కనీసం రెండు గ్రంథాలయాలకు తక్కువ కాకుండా*** చందా కట్టిన దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపబోయే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ'లో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| **1226** | శ్రీ నారాయణ శ్రీపతి, మలక్ పేట, హైదరాబాద్ - **36** | గ్రంథాలయం, నిశీష డిగ్రీ కాలేజ్, గద్వాల్, మహబూబ్ నగర్ - **509 125** |
| **1227** | " " | గ్రంథాలయం, పి. హనుమంతరావు డిగ్రీ కాలేజ్, మహబూబ్ నగర్-**509 001** |
| **1228** | " " | గ్రంథాలయం, సృజన డిగ్రీ కాలేజ్, మహబూబ్ నగర్ - **509 001** |
| **1229** | " " | వి.ఆర్.కె. కాలేజ్ ఆఫ్ కంప్యూటర్ సైన్స్, నాగర్ కర్నూల్ - **509 209** |
| **1230** | శ్రీ టి.వి. నరసింహాచారి, చైతన్యపురి, హైదరాబాద్ - **60** | చైతన్యపురి వెల్‌ఫేర్ అసోసియేషన్, చైతన్యపురి, హైదరాబాద్ - **500 060** |
| **1231** | శ్రీ సి.ఎస్. ధవేజీ, పోండా, గోవా - **403 401** | రాజీవ్ గాంధీ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్ &సైన్సెస్, కాకినాడ - **533 005** |
| **1232** | " " | వి.వి.ఆర్. కనక మహాలక్ష్మి డిగ్రీ కాలేజ్, విశాఖపట్నం - **530 017** |
| **1233** | శ్రీ డా॥ కె. దత్తయ్య, పెద్దబజార్, కామారెడ్డి - **503 111** | ఎ.పి. గవర్నమెంట్ రిటైర్డ్ ఎంప్లాయీస్ అసోసియేషన్, కామారెడ్డి - **503 111** |
| **1234** | శ్రీ డా॥ సుబ్బరామిరెడ్డి, రాధాకృష్ణ నగర్, కడప-**516 001** | గ్రంథాలయం, జిల్లా పరిషత్ హైస్కూల్, ఒంటిమిట్ట, కడప జిల్లా - **516 213** |
| **1235** | " " | రెడ్డి సేవా సమితి, ఎర్రముక్కపల్లి, కడప - **516 004** |
| **1236** | శ్రీ కోసూరి బంగార్రాజు, శ్రీమతి అన్నపూర్ణమ్మ, కైకలూరు | గ్రంథాలయం, గవర్నమెంట్ జూనియర్ కాలేజ్, కైకలూరు, కృష్ణా జిల్లా- **333** |
| **1237** | " " | గ్రంథాలయం, గవర్నమెంట్ డిగ్రీ కాలేజ్, కైకలూరు, కృష్ణా జిల్లా - **521 333** |
| **1238** | శ్రీ డా॥ బి. మస్తాన్ రావు, ఆర్.ఆర్.తోట, గుంటూరు-1 | గ్రంథాలయం, జెడ్.పి. హైస్కూల్, తేలప్రోలు, కృష్ణా జిల్లా - **521 109** |
| **1239** | " " | శ్రీ వేమన గ్రంథాలయం, తేలప్రోలు, కృష్ణా జిల్లా - **521 109** |

గమనిక: డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో 'Sri Ramakrishna Prabha Library Fund Scheme', Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా: President, Ramakrishna Math, Domalguda, Hyderabad -500 029

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 64 సంచిక: 1 జనవరి 2007

"ప్రతి జీవిలోనూ దివ్యత్వం గర్భితంగా ఉంది. అంతర్గతంగా ఉన్న ఆ దివ్యత్వాన్ని వ్యక్తం చేయడమే జీవిత పరమావధి." - స్వామి వివేకానంద

## ప్రార్థన

మహి జ్యోతిర్బిభ్రతం త్వా విచక్షణ భాస్వన్తం చక్షుషే చక్షుషే మయః । ఆరోహన్తం బృహతః పాజసస్పరి వయం జీవాః ప్రతి పశ్యేమ సూర్య ॥

సమస్తాన్నీ దర్శించేవాడివీ, పెద్ద అగ్నిగోళమై ప్రకాశించేవాడివీ, ప్రతి కంటికీ సంతోషాన్ని ఇచ్చేవాడివీ, విశాల సముద్రంపై ఉదయించేవాడివీ అయిన సూర్యదేవా! దీర్ఘాయుష్కులమై మేం నిన్ను నిత్యం దర్శించెదము గాక!

### సంక్రాంతి శుభాకాంక్షలు

శ్రీ రామకృష్ణ ప్రభ పాఠకులకూ, రచయితలకూ, రచయిత్రులకూ, ప్రకటనకర్తలకూ, ఏజెంట్లకూ మా హృదయపూర్వక శుభాభినందనలు.

- సంపాదకుడు

## ఈ సంచికలో...



*ముఖచిత్రం:*
*యువతరానికి స్ఫూర్తిదాత యుగనాయక వివేకానంద*

ఈ సంచికలోని రచయిత (త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకుడు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. – సంపాదకులు



SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH
Domalguda , Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799; Ph. & Fax: 040 - 2763 3936; E-mail: rkmath_hyd@yahoo.com

## చందా వివరాలు

| | ఇండియాలో | విదేశాలకు |
|---|---|---|
| విడి ప్రతి | : రూ. 8 | - |
| ఒక సంవత్సర చందా | : రూ. 85 | $15 |
| మూడు సంవత్సరాలకు | : రూ. 240 | $45 |
| ఐదు సంవత్సరాలకు | : రూ. 380 | $75 |
| ఇరవై సంవత్సరాలకు | : రూ. 1200 | $350 |

సంపాదకీయం: *జనవరి 12 న 'జాతీయ యువజన దినోత్సవం'*



# యువకులారా! నా ఆశలన్నీ మీపైనే!

యువకులందరినీ సంఘటితపరచి, సన్మార్గంలో నడిపించే స్ఫూర్తి ప్రదాత - స్వామి వివేకానంద. యువకుల శ్రేయస్సు కోసం ఆయన తపించినంతగా మరెవ్వరూ త ✓ ప ి ం చ ✓ లేదనడం అతిశయోక్తి కాదు. యువతరంపై ఆయన పెట్టుకొన్న ఆశల్ని ఆయన మాటల్లోనే విందాం: "యువకులారా! నా ఆశలన్నీ మీపైనే ఉన్నాయి. నా మాటను విశ్వసించే ప్రతీ ఒక్కరికీ ఉజ్జ్వలమైన భవిష్యత్తు ఉంది. లేవండి, మేల్కొండి. ఇదే సరైన తరుణం."

భారత స్వాతంత్ర్య సంగ్రామ యోధుడు నేతాజీ సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో స్వామీజీ గురించి ప్రస్తావిస్తూ, "స్వామి వివేకానంద తన రచనల ద్వారా, ప్రసంగాల ద్వారా యువతరాన్ని ప్రభావితం చేసినట్లు దేశంలో మరే నాయకుడూ ప్రభావితం చేయలేదు. యువకుల ఆశల్నీ, ఆశయాల్నీ సంపూర్ణంగా అవగాహన చేసుకొన్న మహనీయుడాయన. సమస్త మానవాళి శ్రేయస్సు కోసం జీవిత సర్వస్వాన్నీ త్యాగం చేసిన ఆ మహనీయుడు గనక నేడు జీవించి ఉంటే నేను ఆయన పాదాలను ఆశ్రయించేవాణ్ణి" అన్నారు.

నేతాజీ లాంటి మహానాయకుడే స్వామీజీని ఆదర్శ మూర్తిగా స్వీకరించాడంటే నేటి యువతరానికి మార్గ దర్శకుడు స్వామి వివేకానంద కాక మరెవరవుతారు? అందుకే భారతమాత పుత్రరత్నమైన స్వామి వివేకానంద జన్మదినం - జనవరి 12న ఏటా దేశమంతా **'యువజన దినోత్సవం'** జరుపుకోవడం సమంజసం, శ్లాఘనీయం.

"నేను యువకుల్ని సంఘటిత పరచడానికే జన్మించాను" అని స్వామీజీ తన జీవిత ధ్యేయాన్ని ఒక్క మాటలో వ్యక్తపరిచారు. స్వామి వివేకానంద యువతరంపై పెట్టుకొన్న ఆశలు నెరవేరాలంటే, ఆయనలోని త్యాగం, దేశభక్తి, విశాల హృదయం, నిర్విరామ కృషి నేటి యువతీ యువకులు అలవరచుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

ఇంతకీ యువకులకు స్వామీజీ ఇచ్చిన సందేశ మేమిటి? ఆయన బోధనలు ఎంతమంది చదివారు? చదివిన వారిలో ఎంతమంది ఆయన భావాలను అర్థం చేసుకోగలిగారు? అర్థం చేసుకొన్న వారిలో మరెంత మంది ఆ భావాలను ఆచరణాత్మకం చేయగలుగుతున్నారు? ఇదీ ఈనాడు మన ముందున్న ప్రశ్నల జాబితా!

స్వామీజీ బోధనల్ని యువతరం చక్కగా అర్థం చేసుకొని, ఆచరించినట్లైతే వారి జీవితాలు మహోన్నతంగా రూపుదిద్దు కుంటాయి. వేడిలో చలి దాగనట్లు, వెలుగులో చీకటి నిలువనట్లు - ఆత్మవిశ్వాసాన్నీ, ఆత్మస్థైర్యాన్నీ, ఆత్మగౌరవాన్నీ, ఆత్మవికాసాన్నీ పెంపొందించే స్వామీజీ శక్తిమంతమైన బోధనల ముందు యువతరంలో నిరుత్సాహానికీ, నిస్తేజానికీ, నిరాశా నిస్పృహలకూ, మనోభీతికీ, మానసిక రుగ్మతలకూ, అసహాయతలకూ అవకాశమే లేదు.

వెల్లువై ప్రవహిస్తున్న యువశక్తికి స్వామీజీ భావాలు ఒక ఆనకట్టలా ఉపయోగపడతాయి. అలాంటి సంఘటిత శక్తి వల్ల యువతరం ఎలాంటి సమస్యల్ని అయినా ఎదుర్కోగలదు.

యువతరంపై స్వామీజీ పెట్టుకొన్న ఆశల్ని ఆచరణాత్మకం చేయాలంటే ఉత్కంఠభరితమైన ఆయన ఉపన్యాసాలనూ, ఉత్తేజా న్నిచ్చే ఆయన లేఖావళినీ యువతీ యువకులు చదివి తీరాలి.

వివేకానందుని బోధనల అధ్యయన ఆవశ్యకతనూ, వాటి ప్రభావ ప్రాముఖ్యాన్నీ దేశవిదేశాల్లోని అగ్రగణ్యులంతా గుర్తించారు.

స్వామీజీ బోధలను నేటి యువతరం చదవాల్సిన అవసరాన్ని గుర్తు చేస్తూ జవహర్‌లాల్ నెహ్రూ ఇలా అన్నారు: "నా సమకాలికు లపై స్వామి వివేకానందుని బోధనల ప్రభావం గణనీయమైంది. ఆయన బోధలు నేటి యువతరానికి అత్యంత ప్రయోజనకరమైనవి."

స్వామీజీ బోధల నుంచి తానెంత స్ఫూర్తిని పొందారో చెబుతూ ఇండోనేషియా మాజీ అధ్యక్షులు సుకర్నో, "నా జీవితాన్ని అమితంగా ప్రభావితం చేసిన మహనీయుడు స్వామి వివేకానంద. నా దేశ ప్రజలకు సేవ చేసే స్ఫూర్తి నాకు ఆ మహనీయుని బోధనల ద్వారానే లభించింది. రోజూ నిద్రపోయే ముందు ఆయన ప్రసంగాల్నీ, రచనల్నీ చదవడం నాకు అలవాటు" అని పేర్కొన్నారు.

స్వామీజీ తన బోధనలతో స్వదేశీయులనే కాక విదేశీయుల్ని కూడా ప్రభావితం చేయగలిగారు. అది స్వామీజీకెలా సాధ్యమైంది? శక్తికి ప్రతిరూపం స్వామి వివేకానంద. నిద్రాణమై ఉన్న శక్తుల్ని

జాగృతం చేసే శక్తి ఆయన బోధనలకు ఉంది. స్వ, పర భేదాలు లేని ప్రేమ స్వామీజీది. విశ్వజనాళి శ్రేయస్సు కోసం ఆయన హృదయం తపించేది. అందుకే స్థల, కాలాలతో సంబంధం లేకుండా అందరిని ప్రభావితం చేయడం స్వామీజీకి సాధ్యమైంది.

భారత్‌లోనే కాదు ప్రపంచంలో ఎక్కడ, ఎవరికి, ఏ ఆపద కలిగినా, ఏ విపత్తు సంభవించినా స్వామీజీ ఆవేదన చెందేవారు. ఆయన హృదయం అంతటి విశాలమైనది. ఒకసారి బేలూరు మఠంలో ఉన్నప్పుడు స్వామీజీ అర్ధరాత్రి నిద్రలో నుంచి హఠాత్తుగా లేచి, వరండాలో పచార్లు చేయడం మొదలుపెట్టారు. స్వామీజీ సోదర సన్న్యాస శిష్యుడైన స్వామి విజ్ఞానానంద అది గమనించారు. ఈ హఠాత్ ప్రవర్తనకు కారణమేమిటని ఆయన స్వామీజీని అడిగారు. 'నేను నిద్రలో ఉండగా అకస్మాత్తుగా నా హృదయం కంపించినట్లైంది. ఎక్కడో మహా విపత్తు సంభవించి ఉంటుంది.



వేలమంది మరణించి ఉంటా'రని స్వామీజీ చెప్పారు. మరునాడు వార్తాపత్రికల్లో ఫిజీ ద్వీపంలో భూకంపం సంభవించిందనీ, వేలమంది మృతి చెందారనీ వార్తలు వచ్చాయి. ఇతరులు దుఃఖాల పాలైనప్పుడు స్వామీజీ హృదయం భూకంపాలను పసిగట్టి, వాటి తీవ్రతను నమోదు చేసే సిస్మోగ్రాఫ్ కన్నా శీఘ్రంగా స్పందించేది.

స్వామీజీలా విశ్వమంతా మనదనే విశాలహృదయం అలవరచుకోవాలి. అది సాధ్యం కాకపోతే, కనీసం తోటివారికి కష్టాలు కలిగినప్పుడు స్పందించగలిగితే స్వామీజీ ఆశించిన మానవతా దృక్పథం మనలో కొంతైనా ఏర్పడిందని అనుకోవచ్చు.

మనదేశంలోని నేటి స్థితిగతులను పరిశీలించి చూస్తే యువతరం ఇంకా నిద్రాణమై ఉందనిపిస్తోంది. విద్యార్జన కేవలం ధనార్జన కోసమే కాదనీ, ప్రాపంచిక భోగాలను అనుభవించడమే జీవిత పరమార్థం కాదనీ ఈ తరం యువతీ యువకులు

ల్సిన అవసరం ఎంతైనా ఉంది. మరి స్వామీజీ ఆశించిన యువతరం ఎలా ఉండాలి? స్వయంశక్తిపై ఆధారపడుతూ ఇతరులకు సహాయం చేయగలిగేలా జీవించాలి. అందు కోసం మానసిక బలహీనతల్ని వదిలిపెట్టి, ఆత్మవిశ్వాసంతో, కార్యదీక్షాతత్పరులై ముందుకు సాగాలి. పట్టుదలతో ప్రయత్నిస్తే సాధించలేనిది ఈ ప్రపంచంలో ఏదీ లేదని అప్పుడే అర్థమవుతుంది. అంతేకానీ మానవ ప్రయత్నం చేయకుండా అంతా విధిరాత, దైవనిర్ణయం అని కూర్చొంటే ఆ దేవుడు కూడా మనల్ని మార్చలేడు. "నీ చెయ్యి ఎప్పుడూ ఇచ్చే చెయ్యిగానే ఉండాలి కానీ పుచ్చుకొనే చెయ్యిగా కాదు" అన్నది స్వామీజీ సందేశం. ఈ సందేశాన్ని గుర్తు చేసే కథ ఒకటి ఉంది:

జీవితంలో రాణించే రహస్యం తెలియజెప్పాల్సిందిగా ఓ యువకుడు, దేవుణ్ణి ప్రార్థించాడు. ఒక రోజు ఆ యువకుడు అడవిలో నడిచి వెళుతున్నాడు. అక్కడ ఒక గుహ ముందు కాళ్ళు లేని నక్క ఒకటి పడుకొని ఉండడం చూశాడు. ఆ నక్కను చూసిన యువకుడికి 'కదలడానికి కాళ్ళు లేని ఈ నక్క ఆహారమెలా సంపాదించుకొంటుంది?' అని అనుమానం కలిగింది. అది ఎలా సాధ్యమవుతోందో తెలుసుకోవాలని ఆ యువకుడిలో కుతూహలం రేకెత్తింది. వెంటనే ఒక పెద్ద చెట్టు చాటున దాక్కొన్నాడు. ఇంతలో అక్కడికి ఒక సింహం వచ్చి ఆ అవిటి నక్క ముందు మాంసాహారం ఉంచింది. దాన్ని గమనించిన యువకుడు "ఏ ప్రయత్నమూ చేయకుండానే నక్కకు ఆహారం లభిస్తోంది కదా! అలాంటప్పుడు నేను మాత్రం నా జీవనభృతి కోసం ఎందుకు కష్టపడాలి? ఆ దేవుడే నాకు కావలసినవి సమకూరుస్తాడు" అని అనుకొని ఆ యువకుడు అన్ని పనులూ వదిలీ, అడవిలోనే కూర్చొన్నాడు. వారం రోజులైనా అతనికి ఎవరూ ఆహారం తీసుకురాలేదు. భోజనం లేక ఆకలితో నీరసించి పోయిన ఆ యువకునికి ఉన్నట్టుండి, "ఓరీ మూర్ఖుడా! నువ్వు సింహంలా ఉండు, నక్కలా కాదు" అనే మాటలు వినిపించాయి.

జీవితంలో విజయాన్ని సాధించాలంటే సోమరితనం వదలి, కార్యోన్ముఖులై కష్టించి పని చెయ్యాలనీ, కష్టాల్లో ఉన్న వారిని ఆదుకోవాలనీ ఈ కథ సారాంశం.

ఆ సింహంలా మన జీవితాన్ని సాగించాలంటే ఏం చెయ్యాలి? ఉత్తర క్యాలిఫోర్నియాలో ఉన్నప్పుడు స్వామీజీ తన శిష్యులతో, "మీరంతా మీకు ఇష్టమైన దానిపై మనసు పెట్టి, ధ్యానించండి. నేను మాత్రం సింహ

ఈ నెల 2 న స్వామి తురీయానంద జయంతి



– స్వామి భాస్కరానంద

# బ్రహ్మజ్ఞానిని గుర్తించడం ఎలా?



స్వామి తురీయానంద

*(స్వామి భాస్కరానంద అమెరికాలోని సియాటిల్‌లో ఉన్న 'వేదాంత సొసైటీ' అధ్యక్షులు. 'హిందూమత సారాంశం' తదితర రచనల ద్వారా సుపరిచితులు. ప్రసిద్ధ త్రైమాసిక పత్రిక 'గ్లోబల్ వేదాంత' సంపాదకులైన ఆయన తన రచన 'లైఫ్ ఇన్ ఇండియన్ మొనాస్ట్రీస్' లో పేర్కొన్న సంఘటన ఇది).*

స్వామి బ్రహ్మానందజీ శిష్యులు స్వామి దేవానంద. ఆయన శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులలో ఆధ్యాత్మికంగా ఉన్నతులుగా పేరొందిన వారిలో ఒకరైన స్వామి తురీయానందజీ గురించి ఓ సంఘటన నాకు తెలియచేశారు.

ఆ సంఘటన జరిగినప్పుడు స్వామి తురీయానందజీ వారణాసిలోని రామకృష్ణమిషన్ సేవాశ్రమంలో ఉండేవారు. వారు అమెరికా నుండి తిరిగివచ్చాక ఆ సంఘటన జరిగింది. స్వామి దేవానంద అనే యువ సాధువు కూడా అప్పుడు వారణాసి సేవాశ్రమంలో ఉండేవారు. స్వామి తురీయానందుల పవిత్ర సాహచర్యంలో కొద్దికాలం గడిపే భాగ్యం లభించినందుకు తాను చాలా అదృష్టవంతుణ్ణి అని భావించారాయన. ఆయన రోజూ స్వామి తురీయానందజీ గదికి వెళ్ళి వారికి వందనం చేసి వారికీ, ఇతర సాధువులకూ మధ్య జరిగే సంభాషణ కాసేపు వినేవారు. వారి గదిలోకి వెళ్ళి నమస్కరించగానే స్వామి తురీయానందజీ చిరునవ్వుతో అతడి గురించి కొన్ని కుశలప్రశ్నలు వేసేవారు. దానివల్ల స్వామి దేవానందజీ హృదయం ఆనందంతో నిండేది.

స్వామి తురీయానందజీ అనారోగ్యంగా ఉన్నందువల్ల ప్రత్యేకమైన ఆహారం స్వీకరించేవారు. ఒక సేవక్ స్వామీజీ వారి బాధ్యత స్వీకరించి, వారికోసం ప్రత్యేకమైన వంటకాలు తయారు చేసేవారు. ఒక రోజున ఆ సేవక్, స్వామి తురీయానందజీ కోసం ఆహారం తయారు చేయడంలో తనకు తోడ్పడాల్సిందిగా స్వామి దేవానందను అడిగారు. స్వామి తురీయానందజీకి సేవ చేసే భాగ్యం లభించినందుకు స్వామి దేవానంద చాలా ఆనందించారు. సాయం చేయడానికి వంటగదిలోకి స్వామి దేవానంద వెళ్ళగానే, సేవక్ స్వామి అక్కడ ఉన్న కల్వం చూపించి, కొన్ని మసాలా దినుసుల పేర్లు చెప్పి "అన్నీ విడి విడిగా నూరి, ముద్దగా చేసి నాకు ఇవ్వు" అన్నారు.

స్వామి దేవానంద అంతవరకూ తమ జీవితంలో భోజనానికి తప్ప, వంట గదిలోకి ఏనాడూ అడుగు పెట్టలేదు. వారి ఇంట్లో వంటవాళ్ళుండేవారు. ఇతర (భారతీయ) కుటుంబాల్లోని మగవారిలాగే ఆయన వంట చేయడం నేర్చుకోలేదు; ఏనాడూ వంట సరకులు కొనడానికైనా వెళ్ళలేదు. ఆ పనులన్నీ పనివాళ్ళే చేసేవారు.

అందువల్ల స్వామి దేవానంద వంటలలో ఉపయోగించే వివిధ దినుసులు ఎలా ఉంటాయో ఎరుగరు. వాటిని ఆయన ఎన్నడూ చూడలేదు; అవి ఏవి ఏవో వారికి తెలియనూ తెలియదు. అందుకని వారు సేవక్ స్వామితో "ఆ మసాలా దినుసులు ఎలా ఉంటాయో చూపిస్తే, నేను నూరుతాను" అన్నారు.

ఇది విన్న సేవక్ స్వామి ముందు ఆశ్చర్యపోయారు. సహాయం చెయ్యడం ఇష్టంలేక స్వామి దేవానంద ఏవో కుంటి సాకులు చెబుతున్నారనుకున్నారు ఆ స్వామి. స్వామి దేవానంద వివిధ మసాలా దినుసుల్ని ఎలా గుర్తించాలి అని ప్రశ్నించినా ఆ మాటలు ఆయన నమ్మలేదు. దీనిలో సేవక్ స్వామిజీ తప్పు లేదు. మన దేశంలో పెరిగి, అంత వయస్సు వచ్చాక రోజూ వంటలో వాడే మసాలా దినుసులు తెలియనివారుండరు. అందువల్ల ఆయన కాస్త చీకాగ్గా, "అవతలకు వెళ్ళు. నీ సాయం నాకేమీ అక్కర్లేదు" అన్నారు.

మర్నాడు రోజూలాగే స్వామి దేవానంద, స్వామి తురీయానందజీ గదికి వెళ్ళి, వారికి నమస్కరించారు. కానీ స్వామి తురీయానందజీ, స్వామి దేవానంద వైపు చూడను కూడా చూడకుండా, ముఖం పక్కకు తిప్పుకున్నారు. వారేమీ మాట్లాడలేదు కూడా! మరో మూడు నాలుగు రోజుల వరకూ ఆయన అలాగే ప్రవర్తించారు. దాంతో, స్వామి దేవానంద చాలా బాధపడ్డారు. మసాలా దినుసులు నూరే విషయంలో తనకూ, సేవక్ స్వామికీ మధ్య జరిగిన సంఘటనే స్వామి తురీయానందజీ ఇలా ప్రవర్తించడానికి కారణమని ఆయనకు అనిపించింది. సేవక్ స్వామి తన గురించి స్వామి తురీయానందజీకి ఫిర్యాదు చేసి ఉంటారని భావించారు.

ఆఖరికి స్వామి దేవానంద, స్వామి తురీయానందజీ దగ్గరకు కన్నీళ్ళు పెట్టుకుంటూ వెళ్ళి, "మహారాజ్! మీరు బ్రహ్మజ్ఞాని. మీకు అంతా తెలుసు. సేవక్ స్వామితో నేను చెప్పినది నిజమని మీకు తెలుసు. రకరకాల మసాలా దినుసుల్ని నేను నిజంగానే గుర్తించలేను" అన్నారు.

స్వామి తురీయానందజీ వెంటనే "మసాలా దినుసుల్ని గుర్తించలేనివాడివి భగవంతుణ్ణి ఎలా గుర్తిస్తావు? నేను బ్రహ్మజ్ఞానినని నీకెవరు చెప్పారు?" అన్నారు.

"నేను బ్రహ్మజ్ఞానినని నీకెవరు చెప్పారు" అని స్వామి తురీయానందజీ అన్నప్పుడు దాని అర్థం ఏమిటి? తాను బ్రహ్మజ్ఞానినని వారు ఒప్పుకోలేదా? ఇంకా బ్రహ్మానుభవం పొందని స్వామి దేవానంద కాకుండా మరొక బ్రహ్మజ్ఞాని మాత్రమే తనను బ్రహ్మజ్ఞాని అనగలడు అంటున్నారా? ఈ రెండవదే యథార్థమని నాకు అనిపించింది.

కొన్నేళ్ళ క్రితం స్వామి వివేకానంద అమెరికాలోని భక్తులకు స్వామి తురీయానందజీని పరిచయం చేస్తూ, "నా సోదర శిష్యులలో ఒకరిని మీ వద్దకు పంపుతున్నాను. ఆయన బ్రహ్మజ్ఞాని. ఆయనను చూడగానే ఉన్నతమైన ఆధ్యాత్మికత మానవ జీవితంలో ఏ విధంగా వ్యక్తమవుతుందో మీరు తెలుసుకుంటారు" అన్నారు. స్వామి తురీయానందజీ లోనే కాదు మరే మహాపురుషుడి ఆధ్యాత్మికతలోని గుణ దోషాలనైనా నిర్ణయం చేయడంలో స్వామి వివేకానందను మించిన వారెవరైనా ఉన్నారా?

ఇక్కడ కొన్ని అంశాలు వివరించాలి. భగవత్ సాక్షాత్కారం పొందినవారు అందరూ అనుకునేటట్లు కాకుండా, సాధారణంగా దైవప్రేరణ కలిగితే తప్ప ఇతరుల ఆలోచనల్ని చదవడానికి ప్రయత్నించరు. ఈ మహానుభావులది దేవుని ఆలోచనల్లో లీనమై ఉండే స్వభావం. ఇతరుల ఆలోచనల్ని తెలుసుకునే ప్రయత్నం చేయడం వారి స్వభావానికి విరుద్ధం. వయస్సు తక్కువ అవడం వల్ల, ఉన్నతులైన వ్యక్తుల ప్రవర్తన అర్థం చేసుకునే శక్తి లేకపోడం వల్ల స్వామి దేవానంద పొరబడ్డారు. తన మనస్సులోని భావాలు తాను వ్యక్తం చెయ్యకపోయినా స్వామి తురీయానందకు తెలుస్తాయనుకున్నారు. కానీ, అది నిజం కాదు.

అంతేకాదు. స్వామి తురీయానందజీ వంటి వారు కేవలం తన సేవక్ మాటలు విని స్వామి దేవానంద పట్ల ప్రతికూల అభిప్రాయం ఏర్పరచుకున్నారేమిటి అనుకోవచ్చు. స్వామి తురీయానందజీ, స్వామి దేవానందను అసలు జరిగిన సంగతేమిటి అని అడిగి తెలుసుకోవచ్చు. అప్పుడు అభిప్రాయభేదాలు తొలగిపోయి ఉండేవి. అయితే స్వామి తురీయానందజీ లాంటి సత్పురుషులు సత్యసంధులై ఉంటారు. తాము సత్యసంధులు కనుక ఇతరులను నమ్ముతారు. అందువల్లే వారు సేవక్ స్వామి మాటలు నమ్మారు.

అయినా స్వామి తురీయానంద ఎందుకు స్వామి దేవానందతో అంత ఉదాసీనంగా వ్యవహరించారు అన్నది ప్రశ్న. అతనితో ఎందుకు మాట్లాడలేదు? రామకృష్ణ సంఘంలోని పెద్దలు చెప్పినట్లు – మహాత్ములు తమ చుట్టూ ఉన్నవారి స్వభావాలను మార్చడానికి అనేక పద్ధతులను ఉపయోగిస్తారు. ఒక్కొక్కమారు వారు తమ నిస్వార్థమైన అనురాగాన్ని వర్షింపజేస్తారు, ఒక్కోమారు వారు కోపగించుకుంటారు, అప్పుడప్పుడు ఉదాసీనంగా ఉంటారు. స్వామి దేవానందలోని అవలక్షణాన్ని తొలగించడానికే స్వామి తురీయానంద అలా వ్యవహరించి ఉంటారు. వయస్సులో చిన్న అయిన స్వామి దేవానంద, స్వామి తురీయానందజీ నుండి పొందుతున్న ప్రేమ, అభిమానాల పట్ల ఆకర్షణ పెంచుకున్నారు. ఒక సాధువుకు ఈ విధమైన ప్రవర్తన భగవంతుణ్ణి హృదయ పూర్వకంగా ప్రేమించడానికి అవరోధంగా నిలుస్తుంది. ఈ అవలక్షణాన్ని గుర్తించి, స్వామి దేవానందలోని ఆ అపేక్ష తొలగేటట్లు చేయాలనుకున్నారు.

తరువాతి కాలంలో స్వామి తురీయానందజీ అనేక దీర్ఘకాలిక వ్యాధులతో బాధపడేవారు. సేవక్ స్వామీజీలు వారి సేవా శుశ్రూషలు శ్రద్ధగా చేసేవారు. స్వామి తురీయానందజీ, వారితో "మీరు నా దేహం పట్ల శ్రద్ధ చూపండి. నేను మీ మనస్సు పట్ల శ్రద్ధ చూపుతాను" అనేవారు.

ఒకమారు అకారణంగా ఒక యువ సాధువును కోపగించుకున్నారు. దానివల్ల అతని మనస్సు కలత చెందింది. ఆతణ్ణి ఎందుకలా కోపగించుకున్నారని మరో సాధువు స్వామి తురీయానందజీని ప్రశ్నించారు.

అప్పుడు స్వామి తురీయానందజీ సమాధానం చెబుతూ, "వ్యతిరేక భావాలు ఒక నల్లని మబ్బులా ఆ సాధువు మనస్సులోకి ప్రవేశించడం చూశాను. నేను కోపగించుకోవడం వల్ల బెదిరి, అతడు ఆ చెడు ఆలోచనల బారి నుండి ముక్తి పొందాడు" అన్నారు. మహాపురుషుల ప్రవర్తనను అర్థం చేసుకోవడం మనలాంటి సామాన్యులకు సాధ్యమా!

i i i i i

– అప్పాజీ వేంకట సుబ్రహ్మణ్యం



# ఆదిదేవుడు ఆదిత్యుడు



**శ్లోకం ॥ గ్రహనక్షత్ర యోగాశ్చరాశయః కరణానిచ**
**ఆదిత్యా వసవో రుద్రా అశ్వినౌ వాయు వోనలః**
**శక్రః ప్రజాపతిః సర్వే భూర్భువః స్వస్థ దైవచ**
**లోకాః సర్వేనగాః సరితః సాగర స్తథాః**
**భూత గ్రామస్య సర్వస్య స్వయం హేతు ర్దివాకరః**

గ్రహాలు, నక్షత్రాలు, రాసులు, వసు, రుద్ర, ఆదిత్య, అశ్వినులు, వాయువు, అగ్ని, ఇంద్రుడు, ప్రజాపతులు, వ్యాహృతలు, సమస్తలోకాలు, పర్వతాలు, సర్పాలు, భూమి, నదులు, సముద్రాలు, జీవులు, గ్రామాలు, మొదలైనవన్నీ ప్రత్యక్ష పరమేశ్వర స్వరూపుడైన శ్రీ సూర్యభగవానుడే!

సూర్యుణ్ణి ఆరాధించే పద్ధతులెన్నో ఉన్నాయి. అర్చన, జపం, ప్రదక్షిణ, నమస్కారం, అర్ఘ్యం, ధ్యానం, నిష్ఠ అనే ఆరు పద్ధతుల ద్వారా సూర్యుణ్ణి ఆరాధించి కృతకృత్యులు కావచ్చు. సూర్య భగవానుడు ప్రత్యక్ష త్రిమూర్తి స్వరూపుడు. ప్రతి రోజూ వేళ తప్పకుండా జపం, అర్ఘ్యం, ప్రదక్షిణం, నమస్కారం, స్తోత్రం సూర్య ప్రీతిగా నిర్వహించే వారికి సర్వకార్యాలూ సిద్ధిస్తాయి.

దేహారోగ్యానికి సూర్యారాధనను మించినది లేదు. 'ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్' అని సూక్తి. ముఖ్యంగా నేత్ర రోగాలకు సూర్యా రాధన దివ్యౌషధం. పురుషులతోపాటు స్త్రీలు కూడా సూర్యారాధన చేయవచ్చు. దీన్ని పగలే చేయాలి. ఇంటి మధ్యభాగంలో ఈశాన్య, ఆగ్నేయాలలో ఏదో ఒక చోటున సూర్యార్చన చేయవచ్చు. 40 రోజులు కానీ, 20 రోజులు కానీ, లేదా 12 దినాలు కానీ నిర్వహించవచ్చు.

సూర్య నమస్కారాలు ప్రతి దినం చేసేవారికి అన్ని వ్యాధులూ నివారణ అవుతాయి. పవిత్రులైన విప్రులు మూడు వేళలా జరిపే గాయత్రీ మంత్ర జపానికి మూలదైవం సవితా రూపుడైన సూర్య భగవానుడే. సంధ్యావందనానికి ఉన్న ప్రాశస్త్యం ఏమిటంటే అందులో సూర్యోపాసన ప్రాముఖ్యం వహించింది. సూర్యుడు ఉన్నంతసేపూ జీవితం ఉత్సాహవంతంగా ఉంటుంది. ఆయన కనుమరుగైతే సంభవించే చీకటి భయ కారణం.

వనవాసం చేస్తున్న ధర్మరాజు సూర్యుణ్ణి ప్రార్థించి ఎప్పటికీ ఖాళీ కాని అక్షయపాత్రను పొందాడు. సకల శత్రువులను సంహరించేలా వేయి సంవత్సరాలు సూర్యభగవానునిచే నిర్మిత మైన చక్రాయుధాన్ని శ్రీమహావిష్ణువు పొందాడు. ఆ చక్రమే కాలచక్రంగా పేర్కొనబడింది.

ఉత్తరాయనంలో సూర్యుడు బలవంతుడవుతాడు, కనుక అది అన్ని కార్యాలకూ శుభప్రదం, పుణ్యప్రదం. సూర్యార్చన వల్ల పూర్వజన్మ పాపకర్మలన్నీ నశిస్తాయి. సమస్త వ్యాధులూ నివారింపబడి, ఆరోగ్యం సమకూరుతుంది. మనోభీష్టాలు నెరవేర తాయి. అపమృత్యు భయం ఉండదు. ఆగామి, సంచిత, ప్రారబ్ధ కర్మలు అంతరిస్తాయి. విజ్ఞానాభివృద్ధికీ, సుఖ, సంతోషాలకూ సూర్యార్చన అత్యంత విశిష్టమైనది.

విజ్ఞానశాస్త్రం ప్రకారం సూర్యుడు ఒక నక్షత్రం. ఆ నక్షత్రాన్ని అనుసరిస్తూ భూమితో సహా కొన్ని గ్రహాలు దాని చుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

**రథసప్తమీ వ్రతం:** మాఘశుద్ధ సప్తమి సూర్యుని జన్మదినం. అది ఆయనకు ప్రీతికరమైన రోజు. దీన్ని వ్రతంగా ఆచరించాలి. ఈ రోజున సూర్యోదయ సమయంలో ఆకాశంలో నక్షత్రాలు రథాకారంగా ఏర్పడతాయనీ, అందుకే దీనికి రథసప్తమి అని పేరు వచ్చిందనీ శాస్త్రజ్ఞులు చెబుతారు. వేసవికాలానికి ప్రారంభం ఈ నాటి నుండే జరుగుతుంది. ప్రత్యక్ష దైవమైన సూర్యుడు పన్నెండు రూపాలు ధరించి, ద్వాదశాదిత్యులుగా పేరు పొంది ఈ సమస్త సృష్టికీ ఆధారభూతమవుతున్నాడు.

**ఆదిత్యః సవితా సూర్యో మిహిరోర్కః ప్రభాకరః**
**మార్తాండో భాస్కరో భాను శ్చిత్రభాను ర్దివాకరః**
**రవి ర్ద్వాదశభి స్తేషాం జ్ఞేయః సామాన్య నామభిః**

ఆదిత్యుడు, సవిత, సూర్య, మిహిర, అర్క, ప్రభాకర, మార్తాండ, భాస్కర, భాను, చిత్రభాను, దివాకర, రవి అనే 12 పేర్లూ సామాన్యంగా చెబుతారు.

రథసప్తమిని గురించి వివరిస్తూ పంచాంగకర్తలు ఇది సూర్యజయంతి మాత్రమే కాక, 'మన్వాది' అని కూడా చెబుతారు. మన్వాదికి సూర్య సంబంధం ఉంది. వివస్వంతుని కుమారుడైన వైవస్వతుడు ఏడవ మనువు. ఆతని మన్వంతరానికి రథసప్తమి

మొదటి తిథి. ఇది పితృదేవతలకు ముఖ్యమైనది. ప్రస్తుతం జరుగుతున్నది వైవస్వత మన్వంతరమే. మనం సంకల్పంలో దీన్ని చెప్పుకుంటాం.

రథసప్తమిని ఒకప్పుడు తెలుగు దేశంలో ఉగాది పండుగగా జరిపేవారు. అందుకు ఆధారం ఆనాడు ప్రారంభమయ్యే వ్రతాలే. నిత్యాన్నదానం, దంపతి తాంబూలం, పుష్ప తాంబూలం, ఉదయ కుంకుమ, చిట్టి బొట్టు సౌభాగ్య తదియ, నందవ్రతం మొదలైన వ్రతాలన్నీ రథసప్తమి నాడే పడతారు. ఏది ఎలా ఉన్నా రథసప్తమి చాలా ప్రాచీనమైనదనీ, దీని కార్యకలాపాలను గమనిస్తే ఇది సూర్యారాధనకై ఏర్పాటు చేసిన పండుగ అనీ అర్థమవుతుంది.

సూర్యుడు దక్షిణాయనంలో ఉన్నప్పుడు జీవుల మీద ఇతర గ్రహాలు తమ ప్రభావాన్ని తీవ్రంగా చూపిస్తాయి. ఉత్తరాయణంలో వాటి ప్రభావం తగ్గిపోతుంది. రథసప్తమి సూర్యుని ఉత్తర మార్గాన్ని సూచిస్తుంది. ఈ పండుగ నాడు జిల్లేడు ఆకులను తల మీద ఉంచుకొని స్నానం చేస్తూ వాటిని జారవిడవడం కామ క్రోధాది గుణాల విసర్జనకు సూచన అని గమనించాలి.

రథసప్తమిని రాజస్థాన్‌లో 'సౌర సప్తమి' అనీ, వంగదేశంలో 'భాస్కర సప్తమి' అనీ అంటారు. కొన్నిచోట్ల 'జయంతి సప్తమి'గా, మరికొన్నిచోట్ల 'మహాసప్తమి'గా కూడా పేర్కొనడం చూస్తాం.

పూర్వం యుధిష్ఠిరుడు, శ్రీకృష్ణభగవానుణ్ణి రథసప్తమి వ్రతం ఎందుకు చెయ్యాలి? ఎలా చెయ్యాలి? అని అడగగా శ్రీకృష్ణ భగవానుడిలా చెప్పాడు:

ఒకప్పుడు కాంభోజ దేశాన్ని యశోవర్తనుడనే రాజు పాలించేవాడు. అతనికి లేక లేక ముదిమి వయస్సులో ఒక కొడుకు పుట్టాడు. ఆ కొడుకు నిరంతరం అనారోగ్యవంతుడిగా ఉండేవాడు. అందుకు విచారంతో రాజు మహనీయులను దర్శించి తన కుమారుని దీర్ఘకాల అనారోగ్యానికి కారణమేమిటని ప్రశ్నించాడు.

"అయ్యా! నీ కుమారుడు పూర్వజన్మలో ఒక వైశ్యుడు. ఆతడు సంపన్నుడే కానీ ఏ విధమైన దాన ధర్మాలూ చేయలేదు. అవసానదశలో ఎవరో రథసప్తమి వ్రతం నిర్వహిస్తుండగా దాన్ని చూశాడు. ఆ వ్రతదర్శన భాగ్య ఫలితంగా మీ కుమారునిగా జన్మించాడు కానీ, దానం చేయని కారణంగా ఈ జన్మలో నిరంతర రోగగ్రస్థుడయ్యాడు" అని దైవజ్ఞులు సమాధానం చెప్పారు. అప్పుడా రాజు రథసప్తమీ వ్రతవిధానాన్ని తెలపాల్సిం దిగా జ్యోతిష్కులను అడిగాడు.

వారు చెప్పిన వ్రత విధానం ఇలా ఉంది: మాఘశుద్ధ షష్ఠి నాడు నువ్వుల పిండితో శరీరాన్ని రుద్దుకొని, నదిలోగాని, చెరువులోగాని, నూతి వద్ద కానీ స్నానం చేయాలి. ఆ తర్వాత సూర్యదేవాలయంలో పూజ చేయాలి. సప్తమి రోజున అరుణోదయంతోనే ప్రమిదలో చమురు పోసి పువ్వువత్తి వేసి దీపం వెలిగించి, దాన్ని శిరస్సుపై ఉంచుకొని నీటిలో దిగి

**నమస్తే రుద్రరూపాయ రసానాం పతయే నమః**
**అరుణాయ నమస్తే స్తు హరిద్రశ్య నమోస్తుతే**

అని శ్లోకం చెబుతూ సూర్యనారాయణమూర్తిని ధ్యానిస్తూ దీపం నీళ్ళ మీద తేలేటట్లు జాగ్రతగా నీటిలో మునగాలి. ఆ తర్వాత జిల్లేడు ఆకులతో స్నానం చేయాలి. ఆ తర్వాత బంగారు లేదా వెండి రథాన్నీ, దానికి ఏడు గుర్రాలనూ, వాటిని తోలే సారథినీ, అందులో సూర్యుని ప్రతిమనూ ఉంచి దీన్ని నదీ తీరాన కానీ, చెరువు ఒడ్డున కానీ, నూతన వస్త్రంపై ఉంచి సాయంకాలం దాకా ఉపవాసంతో పూజలు చేయాలి. వివిధ రకాల పండ్లను నైవేద్యం పెట్టాలి. ఆ తరువాత వాటినన్నింటినీ ఇంటికి తీసికొనివచ్చి, రాత్రి జాగరణ చేసి మర్నాడు పునః పూజ చేసి దానధర్మాలు చేసి పారణ చేయాలి. రథాన్నీ, సూర్యుని ప్రతిమనూ దానం చేయాలి.

ఈ వ్రతం వల్ల సర్వరోగ విముక్తి, పుత్ర, పౌత్రాభివృద్ధి, పుణ్యలోక ప్రాప్తి కలుగుతాయి.

రథసప్తమికీ ఏడు అంకెకూ కొంత సంబంధం ఉంది. సూర్యరథానికి గుర్రాలు ఏడు. సూర్యకిరణాల్లో గల రంగులు ఏడు. ఈ పర్వం జరిగే తిథి ఏడవది.

నెపోలియన్ చక్రవర్తి 18వ శతాబ్దంలో యూరప్‌లో "మతం అనే దాన్ని నేను నమ్మవలసివస్తే లోకాన్నంతా ప్రకాశింపజేసే సూర్యుణ్ణే దేవునిగా నమ్ముతాను!!" అన్నాడు.

**ఆదిత్య హృదయం:** సకల దేవతల తేజస్సునూ, ఓజస్సునూ, శక్తి, సామర్థ్య అంశాలనూ, అనుగ్రహాలనూ తనలో కలిగియుండి, తనను ఆరాధించేవారిని తరింపజేసే స్తోత్రరాజం ఆదిత్య హృదయం. ఆదిత్యుడంటే సూర్యుడు. సూర్యునికి సవిత, భానుడు భాస్కరుడు, అర్కుడు, దినమణి, దివాకరుడు మొదలైన చాలా పేర్లున్నాయి. వీటి వల్ల సూర్యుడు ఎలాంటి గుణగణాలు గలవాడో ఆయన శక్తి సామర్థ్యాలు ఎలాంటివో తెలుసుకోవచ్చు. ఆయనకు మొదటి నామం ఆదిత్యుడు. అందువల్ల దీనికి ఆదిత్య హృదయ మని పేరు వచ్చింది. 12 మంది ఆదిత్యులలో విష్ణువు కూడా ఒకరు. ఆయనదే ప్రథమస్థానం. ఆయనను ఉద్దేశించి చెప్పబడినందు వల్ల ఆదిత్యహృదయమని పేరు వచ్చింది. మానవుని ఔన్నత్యానికి కావలసిన లక్షణాలన్నీ 'ఆదిత్య హృదయం'లో ఉన్నాయి.

రామరావణ యుద్ధం అసాధారణంగా జరిగింది. యుద్ధ భూమిలో శ్రీరాముడు అలసిసొలసినట్లు అగుపిస్తున్నాడు. అప్పుడు శ్రీరాముణ్ణి విజేతను చేయడం కోసం అగస్త్యుడు ఆయనకు విశిష్టమైన ఆదిత్యహృదయాన్ని ఉపదేశించాడు.

అంతశ్శత్రువులనూ, బహిశ్శత్రువులనూ నశింపజేసే వేదమంత్రమిది. ఇది సమస్త పాపాలనూ, చింతలనూ ఉపశమింపజేసి మంగళకరమైన శుభాలనూ, సంతోషాన్నీ, విజయాన్నీ

– రెంటాల జయదేవ



(గత సంచిక తరువాయి)

ఆచార వ్యవహారాలు - అంతరార్థాలు - 11

# భస్మం చెప్పే భగవద్విషయం

**భస్మం అంటే?** : స్మృతుల్లో పేర్కొన్న సంప్రదాయాలను పాటించే స్మార్తులకు భస్మధారణ తప్పనిసరి. భగవదర్పితంగా హోమ గుండంలో వేసిన సమిధలు, నెయ్యి, ఇతర మూలికలు కాలిపోగా, మిగిలిన బూడిదనే 'భస్మం' అంటారు. అలాగే, దేవుడి అభిషేకం కోసం వాడిన బూడిదను 'భస్మం'గా పంచుతారు.

అసలు 'భస్మ' శబ్దానికి గొప్ప వ్యుత్పత్త్యర్థం ఉంది. "ఏదైతే పాపాలన్నిటినీ పటాపంచలు చేసి, భగవంతుణ్ణి స్మరింపజేస్తుందో అది 'భస్మ'మని అర్థం. 'భ' అంటే 'భర్త్సనం' (నశింపజేయు) అనీ, 'స్మ' అంటే 'స్మరణం' (గుర్తుంచుకొను) అనీ అర్థం. కాబట్టి, 'భస్మ ధారణ' అనేది దుష్టత్వాన్ని రూపుమాపి, దైవత్వాన్ని గుర్తు చేస్తుందన్న మాట.

'భస్మ' శబ్దానికే 'విభూతి', 'రక్ష' అనే పేర్లు కూడా ఉన్నాయి. 'విభూతి' అంటే ఐశ్వర్యం, సంపద అని అర్థం. ధరించినవాడికి ఐశ్వర్యాన్ని ప్రసాదిస్తుంది కాబట్టి, 'భస్మా'నికే 'విభూతి' అని పేరు. ఇక, 'రక్ష' అంటే వివిధ రకాల బాధల నుంచి రక్షణ నిచ్చేది అని అర్థం. భస్మం పెట్టుకున్న వారిని అనారోగ్యం నుంచి, అన్ని రకాల దుష్ట గ్రహ పీడల నుంచి రక్షిస్తుంది కాబట్టి, 'రక్ష' అనే పేరు కూడా దీనికి సార్థకమే!

**భస్మధారణ అంతరార్థం:**

అహంభావాన్నీ, అహంకారపూరితమైన కోరికలనూ జ్ఞానమనే అగ్నికి ఆహుతివ్వడమే 'హోమం'. పవిత్రమైన, నిస్స్వార్థమైన ప్రయోజనమనే అగ్నికి ఆహుతి ఇవ్వడంగా కూడా దీన్ని పేర్కొన వచ్చు. హోమ గుండానికి ఇచ్చిన బలి, వేసిన సమిధలు మనలోని అజ్ఞానానికీ, సోమరితనానికీ సంకేతాలు. హోమాగ్ని జ్ఞానానికి సూచిక. ఈ చర్యల ఫలితంగా ఏర్పడిన పరిశుద్ధంగా మారిన మనస్సుకు చిహ్నం – ఆ హోమాగ్నిలో మిగిలిన భస్మం. ఈ పాంచభౌతికమైన శరీరమే నేను అనే భ్రమను వదిలిపెట్టి, ఆత్మ జ్ఞానం పొందాలనీ, జనన మరణాల నుంచి బయటపడాలనీ గుర్తు చేసుకోవడం కోసం భస్మాన్ని ఒంటికి పూసుకుంటారు.

భస్మధారణ వల్ల ఈ శరీరం అనిత్యమనీ, ఏదో ఒక రోజున ఇది కూడా కాలి బూడిద కావలసిందేననీ మనకు నిత్యం స్ఫురణకు వస్తుంటుంది. భస్మాన్ని ఒంటి నిండా పూసుకుంటాడు గనక శివుడికీ, భస్మానికీ అవినాభావ సంబంధం. శివభక్తులు భస్మాన్ని తిర్యక్ పుండ్రాలుగా (త్రిపుండ్రాలుగా) ధరిస్తుంటారు. ఇలా నుదుట అడ్డంగా విభూతి రేఖలు ధరించి, మధ్యలో కుంకుమ బొట్టు పెట్టుకుంటారు. ఈ విభూతి, కుంకుమల కలయిక శివ, శక్తుల కలయికను సూచిస్తుంది. దృశ్యాదృశ్యమైన ఈ సమస్త విశ్వాన్నీ సృష్టించిన పదార్థం, శక్తుల కలయికను సంకేతిస్తుంది.

సమిధలూ, కొయ్యదుంగలూ అన్నీ కాలిపోగా, ఏర్పడే ఈ భస్మం సాక్షాత్తూ భగవంతుడికి ప్రతీక. ఎలాగంటే, ఈ సమస్త చరాచర ప్రపంచంలోని అన్నీ రూపుమాసినప్పుడు కూడా మిగిలే శాశ్వతమైన సత్యం భగవంతుడు. ఆ సంగతినే నాశనం లేని భస్మం మనకు చాటిచెబుతోంది.

భస్మానికి వైద్య గుణాలు కూడా ఉన్నాయి. అనేక ఆయుర్వేద ఔషధాల్లో భస్మాన్ని వాడతారు. శరీరంలోని అధికమైన తేమను అది పీల్చుకొంటుంది. అలాగే, జలుబు, తలనొప్పి రాకుండా నిరోధిస్తుంది.

**విభూతి ధారణ చేయకపోతే...:**

విభూతి ధారణ చేయకపోవడం ఎంత దోషమో శాస్త్రాల్లో చెప్పారు.

**ధిగ్భస్మ రహితం ఫాలం । ధిగ్గ్రామ మశివాలయమ్ ।ధిగనీశార్చనం జన్మ । ధిగ్విద్యా మశివాశ్రయామ్ ॥** (స్మృత్యంతరే)

*'భస్మధారణ చేయని ముఖం, శివాలయం లేని గ్రామం, ఈశ్వరుణ్ణి అర్చించని జన్మ, శివుని ప్రశంస లేని విద్య వ్యర్థం.'*

**వినా భస్మ త్రిపుండ్రేన । వినా రుద్రాక్షమాలయా ।**
**పూజితో - పి మహాదేవః । న స్యాత్తస్య ఫలప్రదః ॥**
**తస్మాన్మృదాపి కర్తవ్యం । లలాటే వై త్రిపుండ్రకమ్ ॥**(తిథి తత్త్వే, లైంగే)

*'భస్మంతో త్రిపుండ్రాన్ని పెట్టుకోకుండా, రుద్రాక్షమాలను ధరించకుండా చేసిన శివపూజ ఫలప్రదం కాదు. కాబట్టి, మట్టితోనైనా సరే నుదుట త్రిపుండ్రాన్ని ధరించాలి.'*

**విభూతి రేఖలు ధరించాల్సిన వైనం:**

**మధ్య మానామికాంగుష్ఠై ర్లలాటే యత్త్రిపుండ్రకమ్ ।**
**తత్త్రిపుండ్రం భవేచ్ఛస్తం । మహాపాతక నాశనమ్ ॥**
**మధ్యమానామికాంగుష్ఠై । రనులోమ విలోమతః ।**(బ్రహ్మోత్తర ఖండే)

*'మధ్య వేలు, ఉంగరం వేలు, బొటన వేలు – ఈ మూడింటితో త్రిపుండ్రాన్ని ధరించాలి. మధ్య వేలు, ఉంగరం*

వేలుతో అనులోమంగా (ఎడమ నుంచి కుడి వైపునకు) ఊర్ధ్వ, అధో రేఖలను (పై రేఖ, కింది రేఖ) పెట్టుకోవాలి. ఆ రెండింటి మధ్య బొటనవేలుతో విలోమంగా (కుడి నుంచి ఎడమ వైపునకు) మధ్య రేఖను ధరించాలి.

త్రిపుండ్రం ధరిస్తున్నప్పుడు కొందరు విభూతిని నీటితో తడిపి, ఆ పైన నుదుట పెట్టుకోవడం చూస్తుంటాం. ఇలా నీటితో తడిపి భస్మధారణ చేయాల్సిందెవరు? నీటితో తడపకుండానే విభూతి పెట్టుకోవాల్సిందెవరనేది కూడా మన గ్రంథాల్లో ఉంది.

***భస్మనా వై త్రిపుండ్రం చ । గృహిణా జల సంయుతమ్ ।***
***ధార్యం త్రిసంధ్యం స్త్రీణాం చ । యతీనాం జలవర్జితమ్ ॥***

*(పురుషార్థ ప్రబోధే)*

*'గృహస్థులు త్రి సంధ్యల్లోనూ భస్మాన్ని నీటితో కలిపి, త్రిపుండ్రాన్ని ధరించాలి. అయితే, భర్త లేని స్త్రీలు, యతీశ్వరులు మాత్రం నీటితో తడపకుండానే భస్మాన్ని పెట్టుకోవాలి.' (బ్రహ్మ చారులు కూడా జలవర్జితంగానే త్రిపుండ్ర ధారణ చేయాలి).*

***స్నాత్వా మృత్తికయా చోర్ధ్వ । పుండ్రం కుర్యాత్ ప్రయత్నతః ।***
***జపకాలే మృదా కుర్యాత్ । సంధ్యాకాలే వారిణా ।***
***భస్మనాహోమ కాలే తు । చందనం సార్వకాలికమ్ ॥***

*(ముక్తాఫలే, గర్గః)*

*'స్నానం చేసి, శుభ్రమైన వస్త్రాన్ని ధరించి, ఈ కింద చెప్పిన విధంగా ఊర్ధ్వపుండ్రాన్ని ధరించాలి. సంధ్యలో జలంతో ఊర్ధ్వపుండ్రాన్ని ధరించి, గాయత్రీ తర్పణం వరకు చేసి, ఆ తరువాత మృత్తికతో ఊర్ధ్వపుండ్రం ధరించి, గాయత్రీ జపాదికం జరిపి, ఔపాసన హోమం తరువాత భస్మంతో త్రిపుండ్రం దాల్చి దేవతార్చనం చేయాలి. అటు పిమ్మట చందనంతో త్రిపుండ్రాన్ని ధరించాలి.'*

***'మానస్తోకేన' మన్త్రేణ । మంత్రితం భస్మ ధారయేత్ ।***
***త్ర్యంబకేన చ మన్త్రేణ । సతారేణ శివేన చ ।***
***పంచాక్షరేణ మన్త్రేణ । ప్రణవేన యుతేన చ ॥***
***త్రయాయుషాణి కురుతే । లలాటే చ భుజద్వయే ।***
***నాభౌ శిరసి హృత్పార్శ్వే । బ్రహ్మ క్షత్రియ వైశ్యకాః ॥***

*(బృహజ్జాబాలోపనిషత్)*

*"మానస్తోకే" అనే మంత్రంతో భస్మాన్ని అభిమంత్రించి, 'త్ర్యంబకం' అనే మంత్రం కానీ, సతార శివ మంత్రం కానీ, ప్రణవయుక్తమైన పంచాక్షర మంత్రం కానీ – వీటిలో ఏదో ఒకదాన్ని ఉచ్చరిస్తూ, లలాటం, రెండు భుజాలు, నాభి, శిరస్సు, హృదయం, పార్శ్వ ద్వయాల్లో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాల వాళ్ళు ముగ్గురూ త్రిపుండ్రం ధరించాలి. ఇక, బ్రహ్మచారులు "త్ర్యాయుషం జమదగ్నేః" అనే మంత్రంతో శిరస్సు, లలాటం, వక్షస్థలం, స్కంధాలపై తిలకధారణ చేయాలి.'*

**మృత్యుంజయ మహా మంత్రంతో విభూతి ధారణ:**

ఒక్కముక్కలో చెప్పాలంటే, సుప్రసిద్ధమూ, వ ం ఎ ి ా వ ా ని ్వ తమూ అయిన 'మృత్యుంజయ మహా మంత్రం' పఠిస్తూ నుదుట విభూతి రేఖలు ధరించడం మంచిది. ఉపనిషత్తులు ఆ మాటే చెప్పాయి. ఆ మంత్రం ఏమిటంటే:

***ఓం త్ర్యంబకం యజామహే సుగంధిమ్ పుష్టివర్ధనమ్।***
***ఉర్వారుకమివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మా - మృతాత్ ॥***

*'సుగంధం వెదజల్లేవాడూ, ఆహారం ఇచ్చి పోషించేవాడూ, త్రినేత్రుడూ అయిన పరమేశ్వరుణ్ణి ఆరాధించెదము గాక! కాడ నుంచి దోస పండు విడివడినంత సునాయాసంగా మరణమనే బంధనం నుండి ఆయన మనల్ని విడివడేలా చేయు గాక!'*

**కుంకుమతో కలిగే ఫలితం:**

విభూతి రేఖలు ధరించడమే కాక, ఫాలభాగంలో నడి మధ్యన కుంకుమ ధరించడం మనం చూస్తుంటాం. శరీరం మొత్తం సరిగ్గా ఆ స్థానం నుంచే నియంత్రితమవుతూ ఉంటుంది. అందువల్లే అక్కడ కుంకుమ పెట్టుకోవాలి. శివుడి మూడో కన్ను కూడా నుదుటి మీదే ఉంటుంది. కాబట్టి, అక్కడ కుంకుమ ధరించడం మంచిదని యాజ్ఞవల్క్య మహర్షి కూడా పేర్కొన్నాడు. ఆ స్థానంలో అలా కుంకుమ పెట్టుకోవడం వల్ల స్వచ్ఛమైన ఆలోచనలు వస్తాయని పెద్దల మాట.

చేతన, సుప్త చేతనలు రెండూ నుదురు మధ్యనే ఉంటాయి. అక్కడ నుంచి వచ్చే ఆలోచనలు, వాటి ప్రకారం చేసే పనులు మన మీద ప్రభావం చూపుతాయి. మానవుడి మూడోకన్ను అని చెప్ప దగిన అతీంద్రియ జ్ఞానం కూడా ఆ స్థానంలోనే నెలకొని ఉంటుంది. కాబట్టి, సరిగ్గా అక్కడ కుంకుమ పెట్టుకోవడం ఆధ్యాత్మికంగా పురోగమించడానికి మనిషిని సన్నద్ధం చేస్తుంది.

అలాగే, తిలకధారణ వల్ల మనిషికి ప్రశాంతత చిక్కుతుంది. అలా మానసికంగా ప్రశాంతత చిక్కిన వ్యక్తి సరైన మార్గంలో పయనిస్తూ, మెరుగైన నిర్ణయాలు తీసుకోగలుగుతాడు.

సాధారణంగా గంధం, కుంకుమ, మృత్తిక, హోమభస్మాల్లో దేనినైనా తిలకధారణకు వినియోగిస్తారు. చందన తిలకం ధరిస్తే సౌభాగ్యం కలుగుతుంది. అవరోధాల నుంచి రక్షణ, వాటిని అధిగమించే ధైర్యం లభిస్తాయి. అలాగే, జ్ఞానం పెరుగుతుంది. పసుపు, కుంకుమల మిశ్రమం సూక్ష్మక్రిమి నాశినిగా పనిచేస్తుంది. చర్మం ఆరోగ్యంగా ఉండేలా చేస్తుంది. హోమ భస్మాన్ని ధరించడం వల్ల అదృష్టం కలిసొస్తుంది.

పాపటలో కుంకుమ బొట్టు సౌభాగ్యకరం. స్త్రీలు తల పైభాగంలో పుర్రె అంచుకు ఎగువ కుంకుమ బొట్టు పెట్టుకోవ డాన్ని హిందూ సంప్రదాయవాదులు సమర్థించారు. కుంకుమ ధారణ వల్ల చర్మ రోగాలు రావు.

మొత్తానికి, ఇలా పుండ్రధారణ, పాపట కుంకుమ బొట్టు

సేకరణ: శ్రీధర్





# మహనీయుల జీవితాల్లో మధుర ఘట్టాలు



## జిజ్ఞాసే జీవిత ఇంధనం

స్వామి రామతీర్థ ప్రముఖ ఆధ్యాత్మికవేత్తగా అంతర్జాతీయ గౌరవ మర్యాదలు పొందినవారు. ఒకసారి ఆయన ఓడలో జపాన్ వెళుతున్నారు. ఆ ఓడలో 90 ఏళ్ళ వయసు దాటిన వృద్ధుడు దళసరి కళ్ళద్దాలు ధరించి, చైనాభాష నేర్పే పుస్తకంలోని ఒక పాఠం చూసి రాస్తున్నాడు. ఆ వయసులో అంత కష్టమైన భాష అంత శ్రమకోర్చి నేర్చుకోవడమెందుకో రామతీర్థకు అర్థం కాలేదు.

అదే విషయం అడుగుతూ రామతీర్థ "కష్టమైన ఈ చైనా భాష నేర్చుకోవడానికి మీకు దోహదం చేస్తున్న ప్రేరణ ఏమిటి? చూస్తే మీ ఆరోగ్యం బాగున్నట్టు లేదు?" అన్నారు. "బ్రతికి ఉన్నంతకాలం ఏదో కొత్త విషయం నేర్చుకోవాలన్నది నా కోరిక. కొత్త కొత్త విషయాలు నేర్చుకోవాలనేది జీవిత లక్ష్యంగా లేకపోతే ఇక జీవితానికి అర్థమేమిటి? నిరంతరం ప్రవహించే జీవనధార మధ్య కొత్త జ్ఞానం, కొత్త భావాలు, కొత్త సూత్రాలు నేర్చుకోవడానికి ఒక్క క్షణం వ్యవధి లభించినా, దాన్ని వదలకూడదు" అన్నాడు ఆ వృద్ధుడు. రామతీర్థను ఆ వృద్ధుడి మాటలు ఎంతో ప్రభావితం చేశాయి.

## మృత్యువునే సవాలు చేసిన మహావీరుడు

భారత స్వాతంత్ర్య విప్లవజ్యోతి సర్దార్ భగత్‌సింగ్‌కు ఉరిశిక్ష ఖాయంగా పడుతుందని ముందే తెలుసు. అందుకే కోర్టులో సైతం తనతోపాటు శిక్ష పొందనున్న మిత్రులు- రాజగురు దత్తులకు, లియోనాయిడ్ ఆండ్రీన్ నవల 'సెవెన్ దట్ వర్ హ్యాంగ్డ్' (ఉరి తీయబడ్డ ఆ ఏడుగురు)ను చదివి వినిపిస్తూండేవాడు భగత్‌సింగ్. ఆ నవలలో వచ్చే ఒక పాత్రకు ఉరిశిక్ష పడుతుంది. అయితే ఆ పాత్ర ''నన్ను ఉరి తీయకండి'', ''నన్ను ఉరితీయకండి" అంటూ ఉంటుంది. చివరకు ఉరి తీయడానికి ఉరి కంబం వద్దకు తీసుకువెళ్ళేటప్పుడు కూడా "నన్ను ఉరి తీయకూడదు" అంటూనే ఉంటాడు.

భగత్‌సింగ్ ఆ ఘట్టం వర్ణించేప్పుడు అతని కళ్ళల్లో నీళ్ళు తొణికాయి. మృత్యువంటే రమ్మని సవాల్ చేసే తమ కామ్రేడ్, మరణభయంతో వణికే ఒక నవలా పాత్ర కోసం కన్నీరు కార్చే దృశ్యం చూసి, తక్కిన మిత్రులు ఆశ్చర్యపడ్డారు. 1931 మార్చి 23వ తేదీన భగత్‌సింగ్‌కు ఉరిశిక్ష అమలు జరుపుతున్నారు. ఉరి కంబం ఎక్కబోతున్న భగత్‌సింగ్, అక్కడే ఉన్న ఆంగ్ల మేజిస్ట్రేట్‌తో "మేజిస్ట్రేట్ సాబ్! మీరు నిజంగా చాలా అదృష్టవంతులు. ఒక భారతీయ విప్లవకారుడు, తన మహత్తర లక్ష్యసాధన కోసం నవ్వుతూ ప్రాణాలర్పించడానికి ఉరి కంబం ఎలా ఎక్కుతాడో చూసే అవకాశం మీకు దొరికింది" అని చిరునవ్వుతో ఉరి కంబపు ఉరి తాడు మెడకు తగిలించుకున్నాడు. అంతకు ముందు సోదరుడికి ఉత్తరం రాస్తూ "నా జీవనజ్యోతి ఉదయపు వెలుగులా ఆరిపోయినా, మా ఆదర్శం, మా భావాలు విద్యుల్లతల్లా ప్రపంచాన్నంతా జాగృతం చేస్తాయి. నా పిడికెడు బూడిద నశించిపోతే ప్రపంచానికి నష్టమేమిటి?" అన్నాడు. ఆ విప్లవవీరుడు అలా రాలిపోయాడు.

## చిరకాలం మనగలిగేది!

క్రీస్తు పూర్వం 6వ శతాబ్దంలో చైనాలో జీవించిన ప్రఖ్యాత తత్త్వజ్ఞుడు కన్ఫ్యూషియస్ మరణశయ్య మీద ఉన్నాడు. ఆయన శయ్య చుట్టూ ఆప్తులూ, అనుయాయులూ గుమిగూడారు. అంతా విషాదంలో మునిగి ఉన్నారు. అప్పుడు కన్ఫ్యూషియస్ అతి హీనస్వరంలో, "నా నోట్లో ఏముందో చూసి చెప్పగలరా?" అని వారిని అడిగాడు. అప్పటికే వయోవృద్ధుడైన ఆ తాత్త్వికుని పళ్ళు అన్నీ ఊడిపోయాయి. కనుక వారు, "అయ్యా! మీ నోట్లో నాలుక మాత్రమే ఉందండీ!" అని జవాబిచ్చారు.

కాసేపు ఆగి ఆయన, "మీ నోట్లో ఏముంది?" అని ప్రశ్నించాడు. "మా నోట్లో పళ్ళు, నాలుకా కూడా ఉన్నాయండీ" అని ఠక్కున జవాబిచ్చారు. వివేకి అయిన ఆ వృద్ధ తత్త్వవేత్త వాళ్ళతో ఇలా అన్నాడు: "మనిషి పుట్టినప్పుడు నోట్లో నాలుక మాత్రమే ఉంటుంది. కాలక్రమంలో పళ్ళు మొలుచుకు వస్తాయి. అవి నాలుక కన్నా కఠినంగా, బలంగా ఉంటాయి. కానీ మనిషి క్రమంగా వృద్ధాప్యంలోకి వచ్చేసరికి బలమైన ఆ పళ్ళు క్రమేణా రాలిపోతాయి. కోమలమైన, సున్నితమైన నాలుక మాత్రమే మరణ పర్యంతం ఉంటుంది."

ఇక కొన్ని క్షణాల్లో మరణించబోతున్న ఆ తత్త్వజ్ఞాని ఊపిరి తీసుకోవడం కోసం కాస్త ఆగి, ఇలా అన్నాడు: "ప్రేమాస్పదులైన మీ అందరికీ ఇదే నా చివరి సందేశం. సున్నితమైనది, సరళమైనది చిరకాలం మనగలుతుంది. కనుక సదా సరళవర్తనులై వ్యవహరించండి. ప్రతి ఒక్కరితోనూ ప్రేమగా, సరళంగా, దయగా మాట్లాడడం అలవరచుకోండి."]



కన్ఫ్యూషియస్

– స్వామి వివేకానంద



# ధీరవాణి



**భారతదేశ ఔన్నత్యం:** ఇతర దేశాలకు వ్యాపించడాని కన్నా ముందే ఆధ్యాత్మిక జ్ఞానం సనాతనమైన ఈ దేశాన్ని మాతృభూమిగా చేసుకుంది. సముద్రమంత వెడల్పుతో పారే ఇక్కడి నదులు, ఒకదాన్నొకటి తలదన్నే అత్యున్నత హిమశిఖరాలతో ఆ స్వర్గలోకాల రహస్యాలలోకే తొంగిచూస్తున్నాయా అన్నట్లు పైకి లేచే అనాది అయిన హిమాలయాలు, ఈ భారతదేశంలో వెల్లువెత్తిన ఆధ్యాత్మిక ప్రవాహాలకు మన కళ్ళముందు తారాడే ప్రతిరూపాలుగా అగుపిస్తున్నాయి. భూమి మీద నివసించిన ఋషులందరి కన్నా మహోన్నతులైన ఋషులు ఈ భారతదేశపు గడ్డ మీదే తిరుగాడారు. మానవుని స్వభావాన్ని గురించి, అతడి లోపలి ప్రపంచాన్ని గురించి ఇక్కడే మొట్ట మొదటిసారిగా ప్రశ్నలు ఉదయించాయి. ఆత్మకు చావులేదన్న సిద్ధాంతాలు; పై నుండి అజమాయిషీ చేసే భగవంతుడు ఒకడున్నాడన్న భావం; ప్రకృతిలోనూ, మనిషిలోనూ అంతర్గతంగా ఉండే ఒక దేవుణ్ణి గురించి భావం; ఇక్కడే మొదటిసారిగా వెలుగు చూశాయి.

ఇక్కడే అత్యున్నత మతాదర్శాలు, తత్త్వశాస్త్రాలు సర్వోత్కృష్ట స్థాయిల్ని అందుకున్నాయి. ఆధ్యాత్మికత, తత్త్వశాస్త్రం పెను ఉప్పెనలలాగా ఈ దేశం నుంచే మాటిమాటికీ ఉప్పొంగి, ప్రపంచాన్ని ముంచెత్తాయి. దినదినం పతనమవుతున్న మానవ జాతులకు ప్రాణం పోసి, వారిలో కొత్త ఉత్తేజం నింపడానికి మరొకసారి ఈ దేశం నుంచే అలాంటి ఉప్పెనలు వెలువడి తీరాలి. శతాబ్దాల తరబడి వందలాది పరాయి దేశాల దండయాత్రల వల్ల, ఆచార, వ్యవహారాలు వందలసార్లు తల్లక్రిందులైనందు వల్ల తగిలిన బలమైన దెబ్బలను ఈ భారతదేశమే తట్టుకుని నిలబడింది. తరగని ఉత్తేజంతో, నాశనం కాని ప్రాణంతో ప్రపంచ దేశాల్లో స్థిరంగా నిలబడిన పర్వతశిఖరం మన దేశమే. ఆది, అంతం ఎరుగని అమరమైన ఆత్మకుండే స్వభావాన్నే ఈ దేశం కూడా కలిగి ఉంది. అలాంటి దేశానికి ముద్దుబిడ్డలం మనం.

**ఆదర్శాలను మరువవద్దు:** ఓ భారతదేశమా! నీవు నాగరకత, ఔన్నత్యాల పర్వతశిఖరాలను అధిరోహించాలని అనుకుంటున్నావు. అయితే ఇలా పరాయి భావాలను చిలుక పలుకుల్లా వల్లె వేయడం ద్వారా, ఇతరులను ఇలా గుడ్డిగా అనుకరించడం ద్వారా, ఇలా ఇతరుల మీద ఆధారపడడం ద్వారా వాటిని అందుకోగలుగుతావా? ఈ బానిసత్వపు బలహీన తలతో, అసహ్యాన్ని కలిగించే దుర్మార్గపు ఆలోచనలతో, తోటి వారిని అణచివేసే ఈ క్రూరత్వంతో ఏం సాధించగలవు? ధీరులు, సాహసోపేతులు మాత్రమే పొందిన స్వేచ్ఛను పిరికితనంతో పొందగలవా? ఓ భారతదేశమా! నీ స్త్రీ జాతికి ఆదర్శం సీత, సావిత్రి, దమయంతి అని మర్చిపోవద్దు. నీవు ఆరాధించే దేవుడు సన్న్యాసులకే సన్న్యాసి, అన్ని అనుబంధాలనూ విడిచిపెట్టిన త్యాగి, ఉమాపతి అయిన శంకరుడని మర్చిపోవద్దు. నీ వివాహం, నీ సంపదలు, నీ జీవితం విషయసుఖాల కోసం కాదనీ, నీ వొక్కడివే సుఖపడడం కోసం కాదనీ మర్చిపోవద్దు. జగన్మాత బలిపీఠం మీద ఆత్మబలిదానం కావడానికే నువ్వు పుట్టావని మర్చిపోవద్దు. అనంతమైన, విశ్వజనీనమైన మాతృత్వానికి నీ సామాజిక వ్యవస్థ ప్రతిబింబమని మర్చిపోవద్దు. బడుగు వర్గాలు, విద్య లేని వారు, పేదలు, నిరక్షరాస్యులు, చెప్పులుకుట్టేవారు, వీధులూడ్చే వారు నీ రక్తమాంసాలనీ, నీ తోబుట్టువులనీ మర్చిపోవద్దు.

**ధీరుడవై మెలగు:** ఓ ధీరుడా! ధైర్యంగా ఉండు! సాహసాన్ని అలవరచుకో! నీవు భారతీయుడవని గర్వించు! "నేను భారతీయుణ్ణి. ప్రతి భారతీయుడూ నా సోదరుడే!" అని సగర్వంగా ప్రకటించు. "విద్య లేనివాడూ, పేదవాడూ, బ్రాహ్మణుడూ, చండాలుడూ నా సహోదరుల"ని ఎలుగెత్తి చాటు. దిక్కులు పిక్కటిల్లేలా, "భారతీయుడు నా సోదరుడు! భారతీయుడే నా ప్రాణం! భారతదేశపు దేవీదేవతలే నా ఆరాధ్యదైవాలు! భారతదేశపు సమాజమే నా చిన్ననాటి ఊయల! పడుచుదనపు పూదోట! వృద్ధాప్యపు స్వర్గధామమైన వారణాసి!" అని గర్జించు.

ఓ సోదరా! "ఈ భారతదేశపు నేల నా మహోన్నత స్వర్గం. భారతదేశానికి మేలు చెయ్యడం ద్వారానే నాకు మేలు కలుగుతుంది" అని ప్రకటించు. రాత్రింబవళ్ళూ, "గౌరీపతివైన ఓ ప్రభూ! జగన్మాతవైన ఓ తల్లీ! నాకు పౌరుషాన్ని ప్రసాదించండి! ఆదిశక్తివైన ఓ మాతా! నా బలహీనతలను తొలగించు! నాలోని పిరికితనాన్ని తీసివెయ్యి! నన్నొక మనిషిగా తయారుచెయ్యి!" అని ప్రార్థించు. M

('స్వామి వివేకానంద సాహిత్య సర్వస్వం' నుంచి)

– డాక్టర్ బిరుదురాజు రామరాజు

## మచిలీపట్నం దొంతులమ్మ

# ముక్తి మార్గంలో శక్తిశాలి యోగిని

నర్మదాతీరాన పుట్టి, కృష్ణాతీరాన నివసించి, ఆ రెండు నదుల పావిత్ర్యాన్నీ బందరు ప్రజలకూ, తనను ఆశ్రయించిన భక్తులకూ పంచిపెట్టిన మహాయోగిని దొంతులమ్మ (1807–1932). ఆమె బందరులో 65 ఏళ్ళు నివసించి 1932లో దేహం చాలించింది. ఉత్తరదేశంలో స్త్రీలు నీళ్ళ బిందెలు, కుండలు నెత్తిపై దొంతులుగా పేర్చి మోస్తుంటారు. ఈ యోగిని తొలిదినాల్లో నెత్తిపై నీళ్ళకుండల దొంతులు మోయడం చేత బందరు ప్రజానీకం ఆమెను 'దొంతులమ్మ' అన్నారు.

దొంతులమ్మ మొదటి 60 సంవత్సరాల జీవితచరిత్ర ఏమీ తెలియరావడం లేదు. నర్మదాతీరంలోని ఒక గ్రామంలో సూర్యానాయక్ బంజారా భార్య ఆమె. ఒకనాడు ఆమె తన భర్తకు పొలానికి చద్ది తీసుకుపోతుంటే ఒక యోగి దర్శనమిచ్చాడు. "ఇప్పటి నుండి నువ్వు సాంసారిక బంధాలు విడిచి, సుజ్ఞాన దీక్షలో ఉండాలి. భర్త ఆజ్ఞ తీసుకొని రా" అన్నాడట. ఆమె భర్త ఆజ్ఞ తీసుకొని ఆ మహాయోగి సన్నిధికి వచ్చింది. ఆయన ఆమెకు దీక్ష ఇచ్చాడు.



ఆమె ఆ తరువాత అనేక దివ్యక్షేత్రాలు, అడవులు, గ్రామాలు తిరిగి, చివరకు శ్రీశైలంలో కొంతకాలం ఉండి, బందరు చేరి స్థిరపడిందట. కొన్నాళ్ళకు అవధూతగా మారి, వీథుల వెంట తిరుగుతూ, ఎవరేది పెడితే అది తింటూ నిరంతరం ధ్యానంలో ఉండేది. ఆమె చెంతనున్న చినిగిపోయిన గుడ్డల మూట దిండుగా, భూమి శయ్యగా పరుండేది. అమ్మ మొదట బందరులోని కుమ్మర వీథిలో ఉండేది. తరువాత జగన్నాథపురంలో తమ్మ మూలాస్వామి కొలిమి వద్ద చేరింది. అమ్మను అతడు పిచ్చిదని ఉపేక్షించాడు. ఒక అమ్మాయి మెడ పట్టీ బజారులో జారిపోయి అమ్మ చేతికి చిక్కింది. అమ్మ తన గుడ్డల మూటలో భద్రపరచి, యజమానులొస్తే ఇస్తానంది. మూలాస్వామి ఆ సొమ్ము తనకిమ్మన్నాడు. ఆమె ఇవ్వనంది. ఆ కోపంతో మూలాస్వామి ఆమెను కొట్టడానికి కర్ర ఎత్తాడు. ఎత్తిన చేయి ఎత్తినట్లే స్తంభించిపోవడంతో ఆమె మహాత్మురాలని గుర్తించాడు, ఆమె పాదాలపై వ్రాలాడు; క్షమాభిక్ష యాచించాడు. అమ్మ క్షమించింది. నాటి నుండి దొంతులమ్మకు మూలాస్వామి కొలిమి ఆవాసభూమి.

దొంతులమ్మ మహాశక్తిశాలి యోగిని అని గుర్తించిన ముగ్గురు సంపన్న దేవాంగులు బట్టల వ్యాపారులు చల్లపల్లి వాస్తవ్యులు; వాళ్ళు వ్యాపారార్థం బందరు వచ్చి ఆ రాత్రి బెజవాడ రోడ్డు ప్రక్క వీథి ఇంటి అరుగుల మీద పడుకొన్నారు. ఆ ప్రక్కనే పాతగుడ్డల మూటతో దొంతులమ్మ పడుకుంది. మధ్యరాత్రి ఆమె లేచింది. ఆ పిచ్చిదేమి చేస్తుందో చూద్దామనుకుంటున్న వాళ్ళకు ఒక అద్భుత దృశ్యం గోచరించింది. వాళ్ళు చూస్తుండగా ఆమె కన్నుల నుండి సూర్యకిరణాల లాగా తళుక్కుమని మెరుపు వచ్చింది. భయం, భక్తి, శ్రద్ధ ముప్పిరిగొన్న ఆ ముగ్గురూ అమ్మను తపస్సంపన్నురాలిగా గుర్తించారు. పలకరించడమా వద్దా అని వెనుక ముందులాడుతుంటే కరుణామయి అయిన అమ్మ వాళ్ళను సమీపించి, చిన్మయానందంగా నవ్వి తన పాత గుడ్డల మూట నుండి ఇంత కారం ముద్ద తీసి ముగ్గురికీ పెట్టింది. మహాప్రసాదమని వాళ్ళు నోట్లో వేసుకున్నారు. కారపుముద్ద తియ్యగా ఉండడం వారికి మరింత ఆశ్చర్యం కలిగించింది. వాళ్ళు అమ్మకు సాష్టాంగపడ్డారు. రాత్రంతా అమ్మను చూస్తూ ఉండిపోయారు. వేకువజామున చల్లపల్లికి పోతూ సెలవడిగితే బందరుకు వచ్చినప్పుడల్లా తన వద్దకు రావలసిందిగా అమ్మ సైగలతో ఆదేశించింది.

ఆనాటి నుండి వాళ్ళు వారం వారం అమ్మను దర్శించి ఆశీస్సులందుకొని జ్ఞానులై భగవత్ సాక్షాత్కారం పొందారు. ఆ సంపన్నుల మూలంగా అమ్మ ఖ్యాతి బందరు, చల్లపల్లి చుట్టుపక్కల గ్రామాల్లో వ్యాపించింది. మంగళగిరి నుండి వచ్చి బందరులో స్థిరపడిన పేరయ్య అమ్మ ప్రసాద మహిమను తొలుత గుర్తించిన భక్తుడు. దొంతులమ్మ మిరపకాయలు, ఉల్లిపాయలు, ఉప్పు కలిపిన ముద్ద పాత గొంగడి క్రింద దాచి, భక్తులకు ప్రసాదంగా ఇచ్చేది. పేరయ్యకు ఇచ్చిన ఆ ప్రసాదం రుచి వర్ణనాతీతం. ఆ రుచి గుర్తించిన పేరయ్య అమ్మ భక్తుడై ఆత్మజ్ఞానపు రుచికి మరిగాడు.

సర్కిల్ పేటలో ఉంటూ బంగారు నగలు చేసి

పొట్ట పోసుకొనే వితంతువు చోడవరపు సుబ్బమ్మ దత్తపుత్రుడు అమ్మ చెప్పినట్లే మరణించగా, ఆమె దుఃఖంతో అమ్మను దర్శించ డానికి వెళ్ళింది. ఆమె మంద్రగబ్బల మీద కూర్చున్న దృశ్యం చూసి, అబ్బురపడింది. దొంతులమ్మ మాహాత్మ్యం ఇంతకు పూర్వమే గ్రహించిన సుబ్బమ్మ ఇది తనకు పరీక్ష అనుకొని శరణార్థి అయింది. దొంతులమ్మ ఆమెకు వైరాగ్యం బోధించి ఇల్లు వదలి తన ఆశ్రమానికి రమ్మని ఆదేశించింది. సుబ్బమ్మ అలాగే చేసి అమ్మను చేరింది. అమ్మ ఆమెను ఏడాది పాటు పరీక్షించి వేమూరి అచ్చయ్య హవల్దారుచే ఉపదేశం ఇప్పించింది. సుబ్బమ్మ జీవితాంతం దొంతులమ్మ సేవ చేసి ధన్యురాలైంది. అమ్మ సేవలో ఉన్న సుబ్బమ్మకు మరణం ఆసన్నమైతే, అమ్మ కరుణించి రెండేండ్లు జీవితం పొడిగించింది. అటు తరువాత తనలో కలుపుకున్నది.

దొంతులమ్మను అనేకమంది భక్తులు, జిజ్ఞాసువులు సేవించి కృతార్థులయ్యారు. స్వల్పమైన సాహిత్య జ్ఞానమున్న కారుమూరి కృష్ణమూర్తి యేజండ్ల అప్పాదాసనే మహానుభావుని శిష్యుడు. మహామంత్రోపదేశం కోసం అమ్మను ఆశ్రయించాడు. దొంతులమ్మ ఆయనకు మంత్రోపదేశం చేసి, గురుప్రార్థన చేయించింది. ఆయన నోట అత్యంత భావగర్భితమైన కళాఖండం ప్రార్థనా గీతంగా వెలువడింది. కృష్ణమూర్తిగారు తారకం 25 లక్షలు, బాల 7 లక్షలు, ప్రసన్నాంజనేయం 4 లక్షల జపం చేసిన పుణ్యాత్ముడు. భూతతృప్తికై అనేక సమారాధనలు చేసి, చీమల కోసమే 5 మణుగుల పంచదార పోసిన ఈ భూతదయాపరుడు దొంతులమ్మకు అంతరంగ శిష్యుడయ్యాడు. అమ్మ తలపెట్టిన అనేక సత్కార్యాలు చేసి, ధన్యుడయ్యాడు.

ఆంధ్ర గంధర్వ బిరుదాంకితుడు జొన్నవిత్తుల శేషగిరిరావు బందరులో ప్రఖ్యాత సంగీతవిద్వాంసులు హరి నాగభూషణంగారి వద్ద సంగీత సాధన చేస్తూ, అప్పుడప్పుడు పాఠాలకు ఎగనామం పెట్టి అమ్మ సేవలో ఉండేవాడు. అందువల్ల గురువుగారు ఒకసారి శేషగిరిరావును దండిస్తే, అమ్మ ఇక ఆయన వద్దకు పోనవసరం లేదని తన కృపాకటాక్షంతో మహావిద్వాంసుణ్ణి చేసింది.

దొంతులమ్మకు చివరి ఐదు సంవత్సరాలు కాళ్ళు స్వాధీనం తప్పాయి. చివరి సంవత్సరం పడుకొని ఉంది. సిద్ధి పొందడానికి కొంతకాలం ముందు సమాధిలో ఉంది. ఆ స్థితిలో పెద్దలు, పిన్నలు, విద్యార్థులు, నానాజాతులవారు వివిధ ప్రాంతాల నుండి వచ్చి, పండ్లు, పూలు సమర్పించిపోయేవారు. అమ్మ దర్శనమాత్రం చేత వారి వారి అభీష్టాలు నెరవేరేవి. అమ్మ ప్రజోత్పత్తి సంవత్సర మాఘ శుద్ధ తదియ మంగళవారం 9-2-1932 నాడు రాత్రి 11.30 గంటలకు దేహం చాలించింది.



ప్రతి సంవత్సరం మాఘమాసంలో అమ్మ సమాధి చెందిన నాటి నుండి 11 దినాలు ఆరాధనోత్సవాలు వైభవంగా జరుగుతున్నాయి. దూరదూరాల నుండి అశేష భక్తజనం వచ్చి కానుకలు, మ్రొక్కులు చెల్లించి పోతుంటారు. అమ్మ విగ్రహం లంబాడీ దుస్తులు, భూషణాలతో చూడముచ్చటగా ఉంటుంది. ఒక మూలన కుండల దొంతి పేర్చి ఉంటుంది. ఇవి ఆధునిక భక్తుల గుర్తింపు కోసం పేర్చినవి. షిర్డీ సాయిబాబా లాగా దేహం చాలించిన తరువాత సమాధి నుండి పలుకుతుంది బందరు దొంతులమ్మ. ఆమె ఆర్తుల కన్నీరు తుడుస్తుంది. స్వప్నంలో సాక్షాత్కరించి జ్ఞానబోధ చేస్తుంది. భక్తుల కేలు (చేయి) పట్టుకొని, వారి భావిజీవిత నౌకను నడిపిస్తుంది. K

## పండుగలు - పర్వదినాలు

**జనవరి - 2007**

| | | |
|---|---|---|
| 1 | సోమవారం | : కల్పతరు దినోత్సవం |
| 2 | మంగళవారం | : స్వామి తురీయానంద జయంతి |
| 10 | బుధవారం | : స్వామి వివేకానంద జయంతి |
| 12 | శుక్రవారం | : జాతీయ యువజన దినోత్సవం |
| 15 | సోమవారం | : ఏకాదశి, మకర సంక్రాంతి |
| 16 | మంగళవారం | : కనుమ |
| 20 | శనివారం | : స్వామి బ్రహ్మానంద జయంతి |
| 22 | సోమవారం | : స్వామి త్రిగుణాతీతానంద జయంతి |
| 29 | సోమవారం | : ఏకాదశి |

## శ్రీ రామకృష్ణ ప్రభ వార్షిక చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా! దిగువ పేర్కొన్న నెంబర్ల నడుమ ఉన్న సంవత్సర చందాదారుల చందా గడువు తీరిపోనున్నది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీ రామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.*

20001 - 23225 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2007 జనవరితో** తీరిపోనున్నది!

30001 - 33200 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2007 ఫిబ్రవరితో** తీరిపోనున్నది!

**శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్**

**గమనిక :**

1. మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
2. మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
3. మీకు పత్రిక ప్రతి నెలా 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

**మీ ఉత్తర ప్రత్యుత్తరాలకు:**
**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం**
**దోమల్‌గూడ, హైదరాబాద్-500 029 ఫోన్ నెం: 040 - 2766 7799**



# పండరినాథ సేవలో పరమోన్నతుడు

చిత్రాలు : గోవి   కథ : కె. అళగరాజా   తెలుగు సేత : స్వామి జ్ఞానదానంద

**1** పరమేశ్వరుణ్ణి ఆరాధించి తరించిన నందనారు లాగా నిమ్నకులజుడైన చోకామేళుడు పండరీపుర విఠలుణ్ణి కీర్తిస్తూ పరవశుడయ్యేవాడు.

జనులారా! మాంసం, మద్యం మానండి! స్త్రీలను తల్లులుగా భావించండి. మనమందరం విఠలుణ్ణి కీర్తించి, తరిద్దాం రండి!

ఏమిట్రా! నీకు ఏమైనా పిచ్చి పట్టిందా ఏమిటి? మన ఆచార వ్యవహారాలను ఎలా మార్చుకుంటాం?

వాడొక మూఢుడు! రండి రా! మనం వెళ్ళి మద్యం సేవిద్దాం!

**2** చోకామేళుని బోధనలు క్రమేణ నిమ్నకులజుల్ని ఆకర్షించసాగాయి. క్రమ క్రమంగా వారంతా భజనలు చేస్తూ ఆనందించసాగారు. కానీ కొందరు బ్రాహ్మణులు మాత్రం చోకామేళుడు భజనలు చేసుకుంటూ దేవాలయానికి వెళ్ళడాన్ని అడ్డుకున్నారు.

విద్వత్ జనులారా! మానవుడు పుట్టుకతోనే ఉన్నతుడు కాలేడు! ప్రయత్నంతోనే ఉన్నతుడవుతాడు. భగవంతుడు అందరి హృదయాలలోనూ నెలకొని ఉన్నాడు. అలాంటప్పుడు మనలో హెచ్చుతగ్గులు ఎలా వస్తాయి?

వీడికి ఎంత అహంకారం! ఇక మీదట ఈతడు ఈ గుడి వైపే రాకూడదు! ఇది పంచాయతీ తీర్పు!

ఊరి కట్టుబాటు వల్ల అప్పటి నుండి చోకామేళుడు గుడి వైపు వెళ్ళలేకపోయాడు. భగవంతుడు నెలకొనే చోటు హృదయమేనని గ్రహించి, ఇంట్లోనే భగవంతుణ్ణి ఆరాధించసాగాడు.

**3** ఒక రోజు పాండురంగని నామసంకీర్తనం చేస్తూ చోకామేళుడు గాఢనిద్రలోకి జారుకున్నాడు. అర్ధరాత్రి పండరినాథుడు ఆతనికి దర్శనమిచ్చాడు.

స్వామీ! మీరా!

చోకామేళా! ఎందుకు దిగులుగా ఉన్నావు?

**4** స్వామీ! తమను దర్శించాలని తహతహలాడే నన్ను ఊరి పెద్దలు తరిమేస్తున్నారే!

నామదేవుడు, కబీరు, తులసీదాసులా నువ్వు కూడా నా భక్తుడివే కదా! రా! దేవాలయానికి వెళదాం!

5

ఆ భావ పారవశ్యంలో చోకామేళుడు గుడికి వెళ్ళినప్పుడు గుడి తలుపులు తెరచి ఉన్నాయి. దీపాలు వెలుగుతున్నాయి. గంటలు మోగుతున్నాయి. అక్కడ పండరినాథుడు పరంజ్యోతిగా దర్శన మిచ్చాడు. చోకామేళుడు భగవంతుణ్ణి దర్శిస్తూ మైమరచాడు. ఆనందబాష్పాలు ప్రవిస్తుండగా దేవదేవుణ్ణి కీర్తించాడు.



6

అర్ధరాత్రి వేళ హఠాత్తుగా నామ సంకీర్తనలు, గంటలు మ్రోగడం విన్న అర్చకులు పరుగెత్తుకుంటూ వచ్చారు. గర్భ గుడిలో చోకామేళుడు ధ్యానమగ్నుడై ఉండడం చూసి విస్తుపోయారు. చోకామేళుడు దేవుని నగలు దోచుకోవడానికే వచ్చాడని కొందరు అనుమానించారు. మరికొందరు ఆతని పట్ల కఠినంగా ప్రవర్తించారు.




7

ఈ సంఘటన తర్వాత చోకామేళుడు సతీ సమేతంగా భాగానదీ తీరాన అడవిలో నివసించసాగాడు. ఒక ఏకాదశి రోజున రాత్రంతా నామసంకీర్తనతో గడిపి, ఉదయం స్నానం చేసి, తులసి తీర్థం పానం చేశాడు. అప్పుడు నామాలు ధరించిన ఒక వృద్ధుడు అక్కడకు వచ్చాడు.



8




మిగతా 36 వ పేజీలో....

– స్వామి సుకృతానంద



# పరిప్రశ్న



**వి. కేశవ్, వడ్లమూడి**

**? : గురువుకూ, సద్గురువుకూ తేడా ఏమిటి? అవతార పురుషుల్ని సద్గురువుగా స్వీకరించడం వల్ల కుహనా గురువుల నుంచి తప్పించుకోవచ్చు కదా!**

✍: గురువు పదాన్ని సామాన్య అర్థంలో వాడితే – గురువుకూ, సద్గురువుకూ భేదం ఉంది. ఉదాహరణకు ఒకరు ఏ వ్యక్తి వద్దనైనా కొత్త విషయాలు జీవనోపాధికై నేర్చుకొంటే ఆ విద్య చెప్పిన వ్యక్తిని గురువని పిలవవచ్చు. పాఠశాల, కళాశాలల్లోని చదువు విషయంలోనూ, మిగతా అన్ని రంగాల్లోనూ 'గురువు' పదాన్ని సామాన్య అర్థంలో తీసుకొంటున్నాం. కానీ, 'సద్గురువు' అంటే సాధకునికి భగవద్దర్శనం చేయించగలిగిన వ్యక్తి. అవతార పురుషులు ఈ సద్గురువుల కోవకు వస్తారు. సద్గురువులే ఉత్తమమైన గురువులు. వారు శిష్యుల హృదయతాపాన్ని తొలగిస్తారు. వీరిని 'బోధ గురువుల'ంటారు. కుహనా గురువులైతే శిష్యుల విత్తాన్ని (ధనాన్ని) ఆశిస్తారు. వీరు 'బాధ గురువులు'!

**టి. శ్రీనివాసరావు, పామర్రు**

**? : దేని ఎరుకతో సమస్తమూ గ్రహించగలమో అది ఏది?**

✍: అదే పరబ్రహ్మ. మట్టిని గురించి తెలుసుకొంటే, మట్టితో చేసిన వస్తువులన్నీ తెలుస్తాయి. అంటే కుండ, దాక, బాన – ఇలా! కాగా, ఈ సృష్టి అంతా ఆ బ్రహ్మం నుంచి వచ్చింది. కాబట్టి, ఆ బ్రహ్మాన్ని తెలుసుకొంటే సృష్టి రహస్యమంతా తెలుస్తుంది.

**డాక్టర్ వై. అప్పారావు, అనకాపల్లి**

**? : సాధువులు, పీఠాధిపతుల చేతిలో దండం (కర్ర) చివర కాషాయజెండా ఉంటుంది. అది పవిత్రభావాలకు గుర్తా? వివరించగలరు.**

✍: స్వామీజీలు సర్వసంగపరిత్యాగం చేస్తారు. సన్న్యాస స్వీకార సమయంలో కాషాయ వస్త్రాలతో పాటు దండం చేత బట్టాలి. అది కాయక, వాచిక, మానసిక నియంత్రణకు చిహ్నం. అంటే– మనస్సు, వాక్కు (మాటలు), చేతలు అదుపులో ఉంచుకొని లక్ష్యం చేరాలి. భగవత్సాక్షాత్కారమే లక్ష్యం. దీన్ని ఎప్పుడూ గుర్తుంచుకోవడానికే దండ స్వీకరణ.

**ఎమ్. కిరణ్‌కుమార్, కనిగిరి**

**? : నా వద్ద కొన్ని శ్రీశ్రీ కాళీదేవి ఫోటోలు ఉన్నాయి. వాటిని ఇంట్లో ఉంచకూడదనీ, శక్తిని హరిస్తుందనీ అంటున్నారు. నిజమా?**

✍: సమాజంలో మూఢ నమ్మకాలకూ, భయాలకూ కొదవ లేదు. శ్రీశ్రీ కాళీదేవి, అమ్మవారి ఫోటోలు మీకెప్పుడూ హాని చెయ్యవు. శ్రీరామకృష్ణ పరమహంస ఇష్టదైవం కాళీదేవి. ఆమెను ఇష్టదైవంగా శ్రీశారదాదేవి, స్వామి వివేకానంద అంగీకరించారు, అర్చించారు. ఆమె పరమేశ్వరుని శక్తి, సకల శుభాలనిచ్చే జగజ్జనని. ఆమె మీకు శక్తినిస్తుంది.

**బి. శ్రీశైలమ్, కాకినాడ**

**? : *"శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే/సహస్రనామ తత్ తుల్యం రామనామ వరాననే॥"* - ఇలా పరమశివుడు పార్వతీదేవికి రామనామ మహిమను వివరించాడు. ఈ శ్లోకం మూడుసార్లు చదివితే రామనామం వెయ్యిసార్లు పఠించడంతో సమానమట. వివరించండి.**

✍: ఋషుల వాక్కులపై విశ్వాసం ఉంచి, పఠిస్తే మంచిదే. మూడేసార్లు పఠించి, వెయ్యిసార్లు రామనామ జపం చేశానని ఉప్పొంగిపోకుండా, ఎక్కువగా చేస్తే ఫలితం తప్పక ఉంటుంది. కృష్ణకిశోర్ అనే భక్తుడు శ్రీరామకృష్ణుల సమకాలికుడు, భక్తుడు. ఆ కృష్ణకిశోర్ ఒకసారి బృందావనంలో ఉన్న రోజుల్లో వేరే ప్రదేశానికి వెళుతున్నాడు. దోవలో దాహం వేసింది. ఒక బావి వద్ద ఉన్న వ్యక్తిని చూసి తనకు మంచినీళ్ళు తోడి ఇమ్మన్నాడు. కానీ, ఆ వ్యక్తి తాను అంత్యజుణ్ణని చెప్పాడు. అప్పుడు మూడుసార్లు కృష్ణనామోచ్చారణ చేసి నీళ్ళు ఇమ్మన్నాడు. కృష్ణకిశోర్ భక్తిని శ్రీరామకృష్ణులు కొనియాడారు. భగవన్నామంపై కృష్ణకిశోర్‌కు అచంచల విశ్వాసం. ఎవరైనా మూడుసార్లు నామ స్మరణ చేస్తే వారి పాపాలు తొలగి పునీతులవుతారనే విశ్వాసం ఆయనది.

**ఎమ్. వెంకటరావు, ఘట్టాయి గూడెం**

**? : కాశీలో మరణిస్తే ముక్తి లభిస్తుందంటారు. కాశీలో దేహత్యాగం చేసిన వాళ్ళను పుణ్యాత్ములుగా పరిగణించినట్లయితే, 'జ్ఞానాదేవతు కైవల్యమ్' అనే వేదోక్తికి విరుద్ధంగా కనపడుతోంది కదా!**

✍: అనాదిగా కాశీలో మరణిస్తే ముక్తి లభిస్తుందని చెబుతారు. అది అవిముక్త క్షేత్రం. విశ్వనాథుడెప్పుడూ కాశీ క్షేత్రాన్ని వదలడు. శ్రీరామకృష్ణులు కూడా అక్కడ అనుభూతి పొందారు. అక్కడ మరణించిన జీవుల్ని అమ్మవారు తన హస్తంతో తీయడం, శివుడు తారకమంత్రోపదేశం చేయడం ప్రత్యక్షంగా చూశారు. 'జ్ఞానాదేవతు కైవల్యం' అనే మాట జ్ఞానులకు వర్తిస్తుంది. అది వేదోక్తి. కాశీలో మరణిస్తే విశ్వనాథుడు తారక మంత్రోపదేశం చేస్తాడనే అచంచల విశ్వాసం ఉంటే, అదే 'జ్ఞానంగా' భావించాలి. ఆ జ్ఞానంతో ముక్తి లభిస్తుంది. శ్రీ శారదాదేవి విశ్వాసం కూడా అదే. 'శ్రీరామకృష్ణ కథామృతం', 'శ్రీశారదాదేవి వచనామృతం'



– స్వామి తపస్యానంద

# ఆధ్యాత్మిక అన్వేషణ

**శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులైన స్వామి శివానందజీ నుండి మంత్రదీక్ష పొందినవారు స్వామి తపస్యానందజీ మహరాజ్** (1904 - 1991). **రామకృష్ణ సంఘ ఉపాధ్యక్షులుగా వ్యవహరించిన స్వామి తపస్యానందజీ మహరాజ్ గొప్ప పండితులు. భారతీయ, పాశ్చాత్య తత్త్వశాస్త్రాలలో దిట్ట, బహుగ్రంథకర్త. వివిధ సందర్భాల్లో ఆధ్యాత్మిక అన్వేషకులు వెలిబుచ్చిన సందేహాలకు స్వామి తపస్యానందజీ మహరాజ్ ఆలోచనా స్ఫోరకంగా ఇచ్చిన సమాధానాలే ఈ 'ఆధ్యాత్మిక అన్వేషణ'.**

**ప్రశ్న:** ఆధ్యాత్మిక బోధనలకు అనుగుణంగా నడచుకోని పెద్దల కార్యసరళి పట్ల ఒక సాధకుడు ఏ విధమైన మానసిక వైఖరిని అవలంబించాలి?

**జవాబు:** సాధకుడు కనుక దృఢంగా ఉన్నట్లయితే పెద్దలకు నచ్చజెపుతూ, అలాంటి కార్యాలను మానుకోవాలిసిందిగా ఒప్పించవచ్చు. వారు కనుక మారడానికి ఒప్పుకోకపోతే, ఆ సాధకుడు తనను అలాంటి పెద్దల ప్రభావం నుంచి త ్ ఎ ి ఎ ం చ ా లి ఎ ం దిగా భగవంతుణ్ణి శ్రద్ధగా ప్రార్థించవచ్చు. అతడు నిజమైన సాధకుడై ఉండి, అతని ప్రార్థన శ్రద్ధాభక్తులతో కూడినదై ఉంటే అతనికి తప్పక సహాయం లభిస్తుంది.

**ప్రశ్న:** ఆధ్యాత్మిక పథంలో పురోగమిస్తున్నానని నాకు బోధపడేదెలా?

**జవాబు:** చాలా సందర్భాలలో పురోగతి అనేది క్రమంగా జరుగుతుంది. అలా క్రమంగా జరిగేది ఏదైనా సరే గమనించడం కష్టతరమవుతుంది. ఉదాహరణకు చాలా పెద్ద పరిమాణం గల గడియారంలో ఉండే ముల్లు యొక్క కదలిక. చిన్నతనం నుంచి ఒక భాషను మనం నేర్చుకుంటూ ఉన్నప్పటికీ, ఆ పురోగతిని గమనించడం కష్టమవుతుంది. కానీ పురోగతి ఎల్లకాలం జరుగుతూనే ఉంటుంది. బల్లపై నిద్రిస్తున్న వ్యక్తిని ఆ బల్లతోపాటే మోసుకుపోయినట్లుగానే ఆధ్యాత్మిక సాధకుడు కూడా తాను ఎరుగనప్పటికీ సదా పురోగమిస్తూనే ఉంటాడని శ్రీశారదాదేవి చెప్పి ఉన్నారు. నిద్రిస్తున్న ఆ వ్యక్తికి తన పురోగతి గురించిన ఎరుకే లేదు. కానీ నిద్ర నుంచి లేచిన తరువాత అప్పటికే తన గమ్యస్థానాన్ని చేరుకుని ఉండడాన్ని అతడు గమనిస్తాడు. తెలియకున్నప్పటికీ కూడా అతడు ఎల్లకాలం ముందుకు సాగుతూనే ఉన్నాడు. అయితే ఇదంతా అతణ్ణి బల్లపై

ఎ ా ా న ్ ం క ్ ం పోతుంటేనే సుమా! ఆధ్యాత్మిక జీవితం పట్ల మన దృక్పథం ప్రాపంచిక విషయాలపట్ల ఉన్నట్లు కాకుండా అందుకు భిన్నంగా ఉండాలి. సాంసారిక విషయాలలో మన దృక్పథం పరిమాణాత్మకమైనది. మన పురోగతి లేదావిజయం అనేది వాటి పరిమాణాన్ని బట్టి నిర్ధారిస్తారు. కానీ ఈ విధమైన మనస్తత్త్వాన్ని వీడనంత కాలం మనం ఆధ్యాత్మిక జగత్తులోకి అడుగు పెట్టనట్లే!



సాధకుడనేవాడు నిబద్ధుడై ఉండాలి. అలాంటి సాధకుణ్ణి గాలం వేసి చేపలు పట్టే జాలరితో పోల్చవచ్చు. ఆ జాలరికొక్కానికి ఎర వేసి, ఎంత సమయం తీసుకున్నప్పటికీ చివరికి ఏదో ఒక చేప దాన్ని మింగకమానదు అనే దృఢవిశ్వాసంతో ఉంటాడు. శ్రీరామకృష్ణులు సాధకుణ్ణి ఒక సాంప్రదాయిక రైతుకూ, వ్యాపారపరంగా వ్యవసాయం చేపట్టినవానికీ మధ్య ఉన్న తేడాతో ఎ ో ల ం స్తారు. అనావృష్టి లేదా ధరల తగ్గుదల లాంటివి మొదలైన వెంటనే ఆ రెండోరకం వ్యక్తి వ్యవసాయాన్ని విడిచిపెట్టి మరో వృత్తి చేపడతాడు. కానీ సాంప్రదాయిక రైతు మాత్రం అలా చేయడు. నిజమైన సాధకుడు కేవలం ఆధ్యాత్మిక సాధనే చేయదగిన కార్యంగా భావిస్తాడు. అందువల్ల అతడు లాభనష్టాలను బేరీజు వేసుకోవడం మానుకొని, ఏదో ఒక నాటికి తన సాధనలు తప్పక ఫలిస్తాయనే దృఢచిత్తంతో ముందుకు సాగుతాడు.

మనలోని విశ్వాసం, అభిలాషలు మరింత దృఢతరమవుతున్నట్లయితే మనం సాధనలో పురోగమిస్తున్నట్లు ధ్రువపరచుకోవచ్చు. నిరుత్సాహకరమైన, డీలా పడే సందర్భాలు కూడా మనకు అప్పుడప్పుడు తారసపడతాయి. అలాంటప్పుడు చిరుదీపం లాంటి మన అభిలాషలు కూడా మరింత మసకబారతాయి. కానీ శ్రద్ధగా సాధన చేసే ప్రతి ఒక్కరి విషయంలో

– స్వామి గౌతమానంద



# యువతరానికి స్ఫూర్తిదాత యుగపురుష వివేకానంద

యౌవనం ఆదర్శానుసరణకు సరైన సమయం. మనిషి యౌవనంలోలా మరి ఏ ఇతర దశల్లోనూ ఆదర్శం కోసం అన్వేషించడు. ఒక్కోసారి ఈ అన్వేషణ బుద్ధిపూర్వకంగా చేస్తాడు. కొన్నిసార్లు తనకు తెలియకుండానే ఆదర్శాల కోసం అన్వేషిస్తాడు. స్వామి వివేకానంద జన్మదినాన్ని (జనవరి 12) 'జాతీయ యువజనోత్సవం'గా దేశమంతా జరుపుకోవడం ఎంతైనా సమంజసం. ఆయన బోధనలు యువతకు ఆదర్శప్రాయాలు.

### ఉపోద్ఘాతం

ప్రపంచంలోని వివిధ రంగాల్లో స్ఫూర్తిదాయకమైన ఆదర్శాలను వినడానికీ, ఆచరించడానికీ యువతరం చాలా ఆసక్తి కనబరుస్తుంది. వైజ్ఞానిక శాస్త్రం కానివ్వండి, సాంకేతిక పరిజ్ఞానం కానివ్వండి, క్రీడలు, సాహిత్యం, కళలు, లేక ఆధ్యాత్మిక జీవనం – ఇలా ఏదైనా కానివ్వండి. ప్రతిచోటా స్ఫూర్తిదాయకమైన ఆదర్శం కావాలంటుంది యువతరం.

అయితే ఒక్క ఆధ్యాత్మిక జీవనంలో తప్ప మిగతా అన్ని రంగాల్లో విజయులైన యువ వీరులకు అసంతృప్తి మాత్రమే మిగిలింది. ఈ అసంతృప్తికి కారణం ఏమిటని మనం ఆలోచిస్తే ఆధ్యాత్మికత లేనిదే శాశ్వతానందం లభించదని తెలుస్తుంది.

**వివేకానంద ఎందుకు?** : యువతరం గమ్యం ఏమిటి? దాన్ని ఎలా చేరుకోవాలి? అంటూ యువతీ యువకులు అడుగుతుంటారు. నేటి యువకులలో చాలామంది స్వామీజీ బోధనల ద్వారా తమ ప్రశ్నలకు సమాధానం తెలుసుకోవచ్చు.

ప్రపంచంలో ఎక్కడి వారికైనా సరే యువతరానికి స్వామి వివేకానంద ఆదర్శప్రాయుడు. ఆయన అసామాన్యమైన భౌతిక బలం, నిశితమైన బుద్ధి, బాధాతప్త జీవుల పట్ల అంతులేని జాలి, ప్రేమ, అన్నిటినీ మించిన మనో నిబ్బరం, సమస్యలను ఎదుర్కొని పోరాడే మనస్తత్త్వం, నాయకత్వం, లొంగని శక్తి, అపారమైన ఆధ్యాత్మిక జ్ఞానం దీనికి కారణం. ఆయన అరవై ఏళ్ళ క్రితమే రాజకీయ స్వాతంత్ర్య సముపార్జనకి భారత యువతకు జాతీయ స్ఫూర్తిగా నిలిచారు. నేటి యువతరం ఆర్థిక, సామాజిక రంగాల్లో స్వాతంత్ర్యం సంపాదించడానికి అలాంటి శక్తిని ఉపయోగించి చివరకు ఆత్మజ్ఞానం (లేదా భగవత్ సాక్షాత్కారం) అనే ఆధ్యాత్మిక స్వాతంత్ర్యాన్ని పొందవచ్చు.

స్వామీజీ బోధనల్ని వివిధ రంగాల్లో పరికించి అవి యువతరానికి ఏ విధంగా స్ఫూర్తినిస్తాయో చూద్దాం.

**1. మనిషి ఔన్నత్యాన్ని గుర్తుంచుకోవడం:** సాధారణంగా మన యువతీ యువకులు ఊరకే అల్లరి చేయడానికో, లేకపోతే వినాశకరమైన పనులు చెయ్యడానికో తమ శక్తిని వినియోగిస్తున్నారు. తమ సామర్థ్యాలను సరైన మార్గంలో వారు ఉపయోగించలేక పోతున్నారు. తమ సామర్థ్యాన్ని తగిన విధంగా నిర్దేశిస్తే యువతరం అంతులేని ఆనందాన్నీ, విజయాన్నీ సాధించగలదు. ఇలాంటి సమయంలోనే వారికి స్ఫూర్తిమంతమైన ఆదర్శం కావాలి. అయితే ఏది వారికి స్ఫూర్తినిస్తుంది?! ప్రతి మనిషీ సజీవమైన దైవం అనే నమ్మకం పెంచుకోవాలి. ఏ ఒక్క మనిషికైనా మనం సహాయం చేయగలిగితే ఆలయంలో ఉన్న దేవుణ్ణి ఆరాధించినట్లే!

**2. శీలాన్ని పెంపొందించుకోవడం ఎలా?:** శీలం అంటే ఏమిటనే ప్రశ్న యువతరం తరచూ అడుగుతుంటుంది. శీలం అంటే ఆ వ్యక్తి యొక్క జీవనవిధానమే అవుతుంది. శారీరక దారుఢ్యం, పవిత్రత, జాలి, నిజాయతీ, సత్యసంధత, ముక్కుకు సూటిగా మాట్లాడే తత్త్వం, నిరాడంబరత, నిస్స్వార్థం, లోకోపకారం – ఈ గుణాలన్నీ ఓ మనిషికి ఉన్నత లక్షణాలు కలగడానికి దోహదం చేస్తాయి. ఈ గుణాల్ని అభివృద్ధి చేసుకుంటూ తద్విరుద్ధ గుణాల్ని దూరంగా ఉంచే మనిషి ప్రపంచాన్నే ప్రభావితం చేయగలిగిన గొప్ప శీలవంతుడవుతాడు. అలాంటి మహత్తరమైన

శీలం కోసం ప్రార్థన, ధ్యానం చేస్తూ మహాత్ముల, దేశభక్తుల నాయకుల జీవిత చరిత్రల్ని చదవాలి.

**3. మీలోని దివ్యత్వాన్ని ఎన్నడూ మరువవద్దు:** యువకులు తరచూ "పొగత్రాగడం, మధుపానం, మాదకద్రవ్యాలు సేవించడం విషయ వాంఛలు – వీటన్నిటినీ ఎలా అధిగమించాలి" అని అడుగుతూ ఉంటారు. ముందుగా ఈ అలవాట్లన్నీ మన శరీరాన్నీ, ఇంద్రియాల్నీ, మనసునీ బలహీనపరుస్తాయని తెలుసుకోవాలి. దీని వల్ల ఈ వ్యసనాల పట్ల ఆకర్షణ అనే జబ్బును మెల్లమెల్లగానే అయినా తగ్గించుకోవచ్చు. దానితోపాటే ఆత్మ నిగ్రహం వల్ల కలిగే మహత్తర ప్రయోజనాలను గుర్తు చేసుకుంటే, అతడు దానిపట్ల ఆకర్షితుడవుతాడు. దీని వల్ల సంకల్పశక్తి అధికమై నిర్లిప్తత అలవడుతుంది. తద్వారా అతి క్లిష్టమైన వ్యసనాల నుంచి కూడా నెమ్మదిగా బయటపడవచ్చు. ఆత్మనిగ్రహం, ఆత్మోద్ధరణ అనే అద్భుతమైన ఆదర్శాన్ని స్వామీజీ మన ముందు ఉంచారు. ప్రతి జీవిలోనూ దివ్యత్వం గర్భితంగా ఉంది. అంతర్గతంగా ఉన్న ఆ దివ్యత్వాన్ని వ్యక్తం చెయ్యడమే జీవిత పరమావధి. స్వార్థరహిత కర్మలు, పూజ, మనో నిగ్రహం, తత్త్వచింతన వీటిల్లో ఏ ఒక్కటైనా, లేక అన్నీ అయినా అవలంబించి ముక్తి పొందు. ఇదే మతమంటే. ఇతర సిద్ధాంతాలూ, కర్మకాండలూ, గ్రంథాలూ, ఆలయాలూ, రూపాలు – ఇవన్నీ కూడా అప్రధానమైనవే.

**4. పవిత్రంగా, దృఢంగా ఉండండి:** తిరిగి భగవంతుణ్ణి చేరడం, లేక మానవుడి సహజ స్వభావమైన దివ్యత్వం పొందడం అనే ఉత్కృష్ట ఆదర్శం వైపు స్వామీజీ యువతరాన్ని ప్రేరేపిస్తారు.

ఈ లక్ష్యం సాధించడానికి మనిషికి తగినంత భౌతిక, మానసిక శక్తి ఉండాలి. విషయపరమైన భావనలు లేకుండా పవిత్రమైన జీవితం గడపడం ద్వారా ఇది సాధ్యపడుతుంది. ఈ భావాన్ని స్వామీజీ ఎంత చక్కగా విశదీకరిస్తారో చూద్దాం.

"మానవ శరీరంలో ఉన్న అన్ని రకాలైన శక్తుల్లో అత్యంత శక్తిమంతమైన దాన్ని 'ఓజస్' " అని అంటారు యోగులు. ఈ ఓజస్సు మెదడులో గుప్తంగా ఉంటుంది. శిరస్సులో ఎంత ఎక్కువ ఓజస్సు ఉంటే మనిషి అంత శక్తిమంతుడవుతాడు, అంత తెలివి తేటలు కలవాడవుతాడు. ఆధ్యాత్మిక శక్తి అధికంగా కలవాడవు తాడు. పవిత్రంగా ఉన్న వారు మాత్రమే ఈ ఓజస్సును ఊర్ధ్వ ముఖంగా పంపి, మెదడులో గుప్తపరచగలుగుతారు. అందుకనే పవిత్రత అనేది అత్యంత విలువైన గుణంగా పరిగణితమవుతోంది.

**5. యోగ్యమైన విద్యకున్న ప్రాముఖ్యం:** ఈనాటి విద్యా విధానంలో ఉన్న లోటుపాట్ల మూలంగా యువతలో ఉన్న ప్రతిభా పాటవాలు సరిగ్గా అభివృద్ధి చెందడం లేదు. అందువల్ల వారు నిరుద్యోగులుగా ఉండిపోయి, జీవితంలో విసిగి వేసారి, హింసను అవలంబిస్తున్నారు. కాబట్టి మన విద్యా విధానాన్ని సత్వరం సంస్కరించాల్సిన అవసరం ఉంది. యోగ్యమైన విద్యలోని ముఖ్య లక్షణం ఏమిటంటే విద్యార్థికి ఏకాగ్రత నేర్పడం. ఈ ఏకాగ్రత అనేది ఏదో ఒక్క అంశానికే సంబంధించినది అవకూడదు. బంధరహితంగా ఉండడం కూడా నేర్చుకోవాలి.



నిశ్చయాత్మక భావాలు మాత్రమే మనం విద్యార్థులకు బోధించాలి. యువకులు కేవలం కుటుంబ పోషణార్థమే విద్యను అభ్యసించకూడదు. విద్య అనేది యువతీ యువకులను తమ కాళ్ళ మీద తాము నిలబడగలిగేటట్లు చేయాలి.

స్వామి వివేకానంద మన యువతరానికి ఈ విధంగా సలహా ఇచ్చారు: "సాధారణ ప్రజానీకానికి జీవన పోరాటంలో తోడ్పడని విద్య, శీలాన్ని పెంపొందించుకోవడానికి పనికిరాని విద్య, దాతృత్వభావాన్నీ, సింహానికి ఉండే ధైర్యాన్నీ ఇవ్వలేని విద్య – అసలు అలాంటి దాన్ని 'విద్య' అనగలమా? నిజమైన విద్య మనిషిని తన కాళ్ళమీద తాను నిలబడేటట్లు చేస్తుంది."

**6. విలువల్ని బోధించడమే, అన్ని అనర్థాలకూ విరుగుడు:** భౌతిక వాదపు వైఖరి వల్ల మన యువతరం సత్యసంధత, పవిత్రత, స్వార్థరహిత సేవ, దైవభక్తి అనే ఆధ్యాత్మిక విలువలన్నిటినీ కోల్పోతున్నది. తద్వారా వారు దృఢ సంకల్పాన్ని అలవరచుకో లేకపోతున్నారు. జాతీయ జీవనానికి వెన్నెముక లాంటి ఆధ్యాత్మిక జీవితాన్ని అవలంబించడానికి యువతరాన్ని ప్రోత్సహించే తరుణం ఆసన్నమైంది. ఈ ఆధ్యాత్మిక దృక్పథం అలవడినప్పుడు సమాజానికి హాని చేసే గుణాలన్నీ మటుమాయమవుతాయి. "భారతదేశంలో చాలా సమస్యలున్నాయి. వీటిల్లో.... ఘోరమైన ప్రాపంచికత, దానికి వ్యతిరేకమైన మూఢనమ్మకం – ఈ రెంటినీ నివారించాలి" అని స్వామిజీ అంటారు.

ఆధ్యాత్మికతకు ఉత్పత్తి స్థానం మన దేశం. ఆ ఆధ్యాత్మికత పొంగి పొరలి ప్రపంచాన్ని ముంచెత్తాలి కానీ ప్రస్తుతం రాజకీయ సాంఘిక పథకాల వల్ల అది శిథిలమవుతోంది.

**7. సంతోషంగా ఉండడం ఎలా?:** స్పర్థలు, పోటీపడే తత్త్వం, అవినీతి, సాంఘికపరమైన నిర్బంధాలు – వీటి గురించి మన యువతరం తరచూ ఫిర్యాదు చేస్తూ ఉంటుంది. ఈ వ్యాకులతల వల్ల 'మేము సంతోషంగా లేం' అంటారు. కానీ నిజం ఏమిటంటే సంతోషం, విచారం – ఇవి రెండూ కూడా మనలోనే ఉన్నాయి. స్వార్థం లేని మనిషి ఎప్పుడూ సంతోషంగా ఉంటాడు. స్వామీజీ "మనిషి తెలివి తక్కువగా తనను తాను సంతోషపెట్టుకో గలనని అనుకుంటాడు. కానీ సంవత్సరాల తరబడి ప్రయత్నించిన తర్వాత స్వార్థం విడిచిపెట్టడంలోనే నిజమైన సంతోషం ఉందనీ తన సంతోషానికి కారణం తాను తప్ప ఇతరులు కాదనీ తెలుసు కుంటాడు" అంటారు. భౌతికమైన అవసరాలు తీరడం ద్వారానే సంతోషంగా ఉంటామని యువతరం అనుకుంటుంది. కానీ అది నిజం కాదు. "ప్రపంచంలో ఉన్న దుఃఖాలన్నిటినీ కేవలం భౌతిక



సహాయంతో తీరవు. మనిషి స్వభావంలో మార్పు రావాలి. ఆధ్యాత్మికతతో, మంచి విద్యను అ బ . ́ య స ి ం చి నప్పుడే కష్టాలన్నీ తొలగుతాయి" అంటారు స్వామీజీ.

***8. కర్తవ్యం ఏమిటి?:*** తప్పు ఏదైనా దాన్ని ఖండించడమే తమ కర్తవ్యమని యువతరం అంటుంది. అలా చేయవచ్చు కానీ విజ్ఞప్తులు, చర్చలు లాంటి వాటి ద్వారా శాంతి యుతంగా చేయాలి. అంతకన్నా ముఖ్యమైన పని వాళ్ళ కర్తవ్యం ఏమిటో వాళ్ళు తెలుసుకోవడం. స్వామిజీ ఈ విధంగా సలహా ఇస్తారు: "మనుష్యులు ధనం కోసం తాపత్రయ పడుతూ పోరాటం సాగిస్తారు. దానికే వారు అలవాటుపడతారు... చివరికి ఇదే మా కర్తవ్యం అంటారు. ఇది కేవలం అర్థం లేకుండా ధనార్జన కోసం ఆశ పడడమే. వాళ్ళ నిజమైన కర్తవ్యం ఏమిటంటే దేనికీ దాసోహం కాకుండా స్వతంత్ర జీవులుగా పనిచేసి, తాము చేసే పని అంతా దేవునికే అర్పణ చేయడం".

**9. అవినీతికి వ్యతిరేకంగా పోరాడాలి:** మన యువకులు సమాజంలోని అవినీతిపై ఆగ్రహిస్తూ ఉంటారు. కళాశాలల్లో సీట్లు సంపాదించడంలో, ఆఫీసుల్లో ఉద్యోగాలు సంపాదించడంలో, ఉపకార వేతనాల ఎంపికల్లో, క్రీడా రంగాల్లో ధనం, పలుకుబడి చేసే అన్యాయాల పట్ల వారు కోపం వ్యక్తం చేస్తారు.

మన నాయకులకు సత్యసంధత, ప్రేమ, కఠోరపరిశ్రమ మొదలైన విలువలపై నమ్మకం లేకపోవడమే అవినీతికి మూల కారణం. మన విద్యావిధానం కూడా ఈ విలువల గురించి బోధించడం లేదు. కాబట్టి ముందుగా యువతరం తమకు తాము ఈ విలువల్ని పెంపొందించుకోవాలి. అటుపిమ్మట తమను తాము వ్యవస్థీకరించుకుంటే ఈ చెడుకు వ్యతిరేకంగా గొప్ప శక్తిని వెచ్చించగలుగుతారు. స్వామి వివేకానంద "మోసం చేసి ఏ మంచినీ సాధించలేం. ప్రేమ, సత్యం, మానసికశక్తి – వీటి మూలంగానే గొప్ప గొప్ప పనుల్ని సాధించగలుగుతారు. కాబట్టి మీలో గల మానవత్వం మీరు చూపండి" అంటారు.

**10. రాజకీయాలు వద్దు :** జీవితంలోని ప్రతి రంగంలో రాజకీయ కార్యక్రమాలు, సిద్ధాంతాల ప్రభావం ఉండడంతో సహజంగానే యువతరం రాజకీయ ఆలోచనల నుంచి తప్పించుకోలేదు. కాబట్టి వాళ్ళు ఏది మంచి వ్యవస్థో తెలుసుకోవచ్చు. కానీ ప్రత్యక్షంగా రాజకీయాల్లో పాల్గొనడం వల్ల చదువులకు ఆటంకం కలుగుతుంది. చదువు పూర్తయ్యాక వారు రాజకీయాల్లో చురుగ్గా పాల్గొనవచ్చు. తరగతులను బహిష్కరించడం విద్యార్థుల భవిష్యత్తుకు మంచిది కాదు. కలకత్తా విశ్వవిద్యాలయానికి చెందిన ప్రఖ్యాత ఉపకులపతి సర్ ఆశుతోష్ ముఖర్జీ (ఆయన్నే బెంగాల్ సింహం అంటారు) విద్యార్థులు తరగతులు బహిష్కరించడాన్ని తాను స్వయంగా అడ్డుకుని "భవిష్యత్ భారతావని నిరక్షరాస్యులతో నిండడం నేను సహించను" అన్నారు.

నిజమైన రాజనీతి విశారదునిగా, బాధ్యతగల రాజకీయ వేత్తగా మారేందుకు తగిన శీల నిర్మాణానికి అకుంఠిత శిక్షణ అవసరమని మన యువతరానికి తెలియాలి. కాబట్టే స్వామి వివేకానంద నాయకులు కాబోయేవారు ముందుగా తోటి మనిషి పట్ల ప్రేమ, గౌరవం కలిగి ఉండాలి అంటారు. "ప్రపంచానికి కావాల్సింది శీలం. స్వార్థ చింతన లేని మనుష్యులు ప్రపంచానికి అవసరం. ఆ నిస్వార్థ ప్రేమ వల్ల అతడు పలికే ప్రతి మాటా పిడుగులా శక్తివంతమై బయటకు వెలువడుతుంది" అన్నారాయన.

గ్రామీణుల పేదరికం, అజ్ఞానం గురించి మన యువతరం తరచూ ఫిర్యాదు చేస్తుంటుంది. నిజమే కానీ ఈ పరిస్థితి మారాలంటే పల్లెల్లో సేద్యానికీ, తత్సంబంధ పరిశ్రమలకీ శాస్త్ర విజ్ఞానం, సాంకేతిక విజ్ఞానం ఉపయోగించి పరిశ్రమించాలి. లౌకిక విద్యతో పాటు ఆధ్యాత్మిక విద్య చేర్చి విలువలకు ప్రాధాన్యం ఇచ్చే విద్యను గ్రామీణులకు బోధించడానికి తగిన విద్యా సంస్థల్ని ప్రారంభించాలి. వేలమంది స్త్రీ, పురుషులు పవిత్రతతో హృదయ పూర్వకమైన నిరంతర ప్రయత్నం చేసినప్పుడు, శాశ్వతమైన భగవద్భక్తి కలిగిన నాడు... బీదల పట్ల కరుణ చూపిన నాడు... గ్రామీణుల స్థితి మెరుగుపడుతుంది.

**11. సేవా ధర్మం:** చాలామంది యువకులు "మేమసలు ఎందుకు సేవ చేయాలి" అని అడుగుతారు. స్వామి వివేకానంద "ఇతరులకు మంచి చేయడం కూడా భగవంతుణ్ణి పూజించడమే" అంటారు. పూజల సారాంశమే ఇది – పవిత్రంగా ఉండి ఇతరులకు మేలు చెయ్యడం. నీ తోటివారిని నువ్వు ప్రేమిస్తావా? భగవంతుణ్ణి వెతుకుతూ ఎక్కడికి వెళతావు? ఈ బీదవాళ్ళంతా, దుఃఖపీడితులైన బలహీనులైన వీరంతా దేవుళ్ళు కారా? ముందు వీరినెందుకు పూజించరాదు? "నువ్వు నిస్వార్థపరుడివా? అలా అయితే ఏ ధార్మిక గ్రంథమూ చదవకుండానే, ఏ చర్చికీ, గుడికీ వెళ్ళకుండానే నువ్వు పరిపూర్ణుడవుతావు" అంటారు స్వామీజీ. "ఒక్క విషయం గుర్తుంచుకుందాం. భారతదేశ జాతీయ ఆదర్శాలు రెండు – త్యాగం, సేవ. ఆ మార్గంలో తీవ్రంగా కృషి చెయ్యండి. మిగిలినవన్నీ వాటంతట అవే చక్కబడతాయి. దానిలోనే ముక్తి ఉంది" అని స్వామీజీ అన్నారు. స్వామీజీ అమూల్య రచనలు 'స్వామి వివేకానంద ఉత్తరాలు', 'కొలంబో నుంచి ఆల్మోరా దాకా – ఉపన్యాసాలు" – ఈ రెండూ మన యువతరం ప్రతి దినం చదవాలి. ఇవి క్రమం తప్పకుండా చదివితే వారి ఆలోచనలు ఎంతో ప్రభావితమై, భవిష్యత్తులో విజయపరంపరలతో నిండిన మహత్తర జీవితం గడపడానికి స్ఫూర్తి లభిస్తుంది. వారికి ఆత్మ వికాసం, సమాజానికి శ్రేయస్సు కలుగుతాయి.

P P P P P

**అనువాదం: డాక్టర్ నిభానుపూడి గిరిజా నిర్మల**



# గోరుముద్ద

– స్వామి సుప్రియానంద



"రామకృష్ణ మఠం వారు నడిపే వృద్ధాశ్రమాల చిరునామాలు ఇస్తారా?" అంటూ అనేకమంది అడుగుతూ ఉంటారు. వృద్ధాశ్రమాన్ని ఆంగ్లంలో ఓల్డ్ ఏజ్ హోమ్ (Old Age Home) అంటారు. ఇతర దేశాల్లో ఇవి చాలా సంఖ్యలో ఉన్నాయి. దీనికి కారణం 'ఎవరికి వారే యమునా తీరే' అన్నట్లుగా ఉండే వారి స్వభావం. వారి జీవనశైలి. మరి మన దేశంలో వీటి అవసరం ఎందుకు వచ్చింది?

భారతీయ సంస్కృతిలో ఉమ్మడి కుటుంబాలు ఒక బలమైన వ్యవస్థ. పిల్లలు వృద్ధులైన తల్లిదండ్రులను ప్రేమతో చూసుకొనే వారు. వారిని గౌరవించేవారు. దానికి తగ్గట్టుగా పెద్దలు కుటుంబ ఆచార వ్యవహారాల్ని పిల్లలకు నేర్పేవారు. అపార అనుభవంతో గడించిన వారి 'విజ్ఞత' పిల్లలకు వారసత్వంగా లభించేది. ఇంటికి 'పెద్ద దిక్కు'గా వృద్ధులు నావకు 'చుక్కాని'లా వ్యవహరించేవారు. 'నేను కుటుంబానికి ఉపయోగపడుతున్నాను' అన్న తృప్తితో ఆనందంగా జీవన యాత్ర కొనసాగించేవారు.

ఇప్పుడా కథ అడ్డం తిరిగింది. ఉమ్మడి కుటుంబ వ్యవస్థ మాయమైంది. పిల్లలకు 'వృద్ధ' తల్లితండ్రులు ఒక అనవసరపు 'ఖర్చు'. ఇక వారిపై ప్రేమ – గౌరవం మాట సరేసరి. 'నా వాళ్ళకు నా అవసరం లేదు. నేను వాళ్ళకు పనికిరాను. అసలు ఈ ప్రపంచంలో నా వాళ్ళు అనేవారు ఎవరూ లేరు.' అని తలచుకుంటూ వృద్ధులు మానసికంగా అనాథులవుతున్నారు. 'వృద్ధాశ్రమం'లో చేరాలని కోరుకుంటున్నారు.

కాని 'వృద్ధాశ్రమం'లో చేరాక కూడా వారి సమస్యలు పెరుగుతున్నాయి. పొందాలనుకున్న శాంతి లభించడం లేదు. వేరొకచోట పరిస్థితులు బాగా ఉండొచ్చన్న ఆశ. శరీరంలో ఓపికలేదు. అయినా తప్పదు క్రొత్త వృద్ధాశ్రమాల కోసం అన్వేషణ. ఏమిటీ 'చాదస్తం'? ఏమైంది మన 'పెద్దరికం'? ఎక్కడ మన 'విజ్ఞత'? వీటికి సమాధానం మనమే రాబట్టుకోవాలి. 'వృద్ధాప్యం' గురించి లోతుగా ఆలోచించాలి.

**శ్రీ శారద – రామకృష్ణ – వివేకానందుల జీవిత సందేశాలు మనకు 'ఆదర్శం'. ఆదర్శాన్ని ఆచరించడానికి ప్రయత్నించడమే 'సాధన'. దానిలోనేవుంది – 'సార్థకత'. 'ఆదర్శం' వినసొంపుగా ఉంటుంది. కానీ 'ఆచరణ' తొందరగా మింగుడు పడదు. పసిబిడ్డ నోరుగట్టిగా మూసుకొని, ముద్ద మింగనని మొండికేసినప్పుడు అమ్మ తినిపిస్తుంది 'గోరుముద్ద'.** ꕤ

ఆంగ్లమూలం: డాక్టర్ ఎస్. రమణి

భారతీయ మహిళా మణిదీపాలు: సావిత్రి

# మృత్యువుపై గెల్చిన మహా పతివ్రత

భారతీయ స్త్రీమూర్తుల్లో సావిత్రిది ఓ ప్రత్యేక స్థానం. మరణించిన తన భర్తను పునర్జీవితుణ్ణి చేసి, పాతివ్రత్య బలాన్ని చాటిన మహిళ ఆమె. ప్రాతః స్మరణీయులైన ఏడుగురు గొప్ప సాధ్వీమణుల్లో ఆమె ఒకరు. సంప్రదాయబద్ధులైన వివాహిత హిందూ స్త్రీలు తమ భర్తల ఆయురారోగ్యాల కోసం ప్రతి ఏటా ఆమె పేరు మీద 'సావిత్రీ వ్రతం' ఆచరిస్తుంటారు.

మద్ర దేశాధిపతి అయిన అశ్వపతి మహారాజు కుమార్తె సావిత్రి. నిజానికి, అశ్వపతి, మాళవి దంపతులకు చాలాకాలం దాకా సంతానం కలగలేదు. పిల్లలు పుట్టాలని కోరుతూ ఆ భార్యాభర్తలు పద్దెనిమిదేళ్ళు సావిత్రీదేవిని ఉపాసించారు. సావిత్రీ దేవి వరప్రసాదంగా వారికి అమ్మాయి పుట్టింది. ఆమెకు సావిత్రి అని పేరు పెట్టి పెంచుకోసాగారు. చదువులో, సౌందర్యంలో, సౌశీల్యంలో సాటి లేని మేటిగా సావిత్రి పెరిగి పెద్దదైంది. సాళ్వ దేశ మహారాజైన ద్యుమత్సేనుడి కుమారుడు సత్యవంతుడి గుణగణాలు విన్న ఆమె అతని మీద ప్రేమ పెంచుకుంది.



విధివశాత్తూ ద్యుమత్సేన మహారాజు అంధుడయ్యాడు. శత్రుమూకలు దాడి చేసి, రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్నాయి. దాంతో, ఆ రాజు భార్యాపుత్రులతో కలసి అడవుల్లో నివసిస్తు న్నాడు. వారందరూ అక్కడ జపధ్యానాదులు చేస్తూ, కఠోర నియమాలు పాటిస్తూ జీవితం గడుపుతున్నారు. కుమారుడైన సత్యవంతుడు తల్లితండ్రుల బాగోగులు చూస్తూ, వారితోనే ఉంటున్నాడు. అతణ్ణి చిత్రాశ్వుడు అని కూడా పిలుస్తారు. ఎల్లప్పుడూ సత్యమే పలుకుతుంటాడు కాబట్టి ఆతడు 'సత్యవంతు డ'ని పేరు పొందాడు.

ఒకసారి అడవిలో కట్టెలు కొట్టి, ఆ మోపు తీసుకొని వెళుతున్న సత్యవంతుణ్ణి సావిత్రి చూసింది. రాచనగరుకు తిరిగి వచ్చిన తరువాత ఆమె తన తండ్రిని కలసి, సత్యవంతుణ్ణి వివాహమాడాలనే కోరికను వెలిబుచ్చింది. భూత, భవిష్యత్, వర్తమానాలు తెలిసిన నారద మహర్షి కూడా అప్పుడు రాజ ప్రాసాదంలోనే ఉన్నాడు. సత్యవంతుడు అల్పాయుష్కుడనే సంగతిని అశ్వపతికి తెలియజేశాడు మహర్షి. మహా తేజస్వి, బుద్ధిమంతుడు, శూరుడు అయిన సత్యవంతుడు ఆ రోజు నుంచి సరిగ్గా ఓ ఏడాది కాలానికి మరణిస్తాడని నారదుడు తెలిపాడు. అయితే, సావిత్రి మటుకు తన మనస్సు సత్యవంతుడి మీదే లగ్నమై ఉందని స్పష్టం చేసింది. త్రికరణశుద్ధిగా వరించిన సత్యవంతుణ్ణే పెళ్ళాడతానని పేర్కొంది. దాంతో, చివరకు ఆమె కోరినట్లే సత్యవంతుడితో వివాహం జరిగింది.

వివాహం తరువాత సావిత్రి కూడా రాజభోగాలన్నీ విడిచిపెట్టి, భర్త వెంట అరణ్యాలకు వెళ్ళిపోయింది. నిరాడంబర జీవితం గడుపుతూ, భర్తనూ, అత్తమామల్నీ సేవిస్తూ కాలం గడపసాగింది. అయితే, నారదుడు చెప్పిన భవిష్యత్తును ఆమె మర్చిపోలేదు. సరిగ్గా మరో నాలుగు రోజుల్లో నారదుడు చెప్పిన ఏడాది కాలం పూర్తవుతుందనగా, అత్యంత క్లిష్టమైన త్రిరాత్ర వ్రతాన్ని (మూడు రాత్రుల ఘోర తపస్సు) ఆమె చేపట్టింది. భర్తను కాపాడాల్సిందిగా రేయింబవళ్ళు సావిత్రీదేవిని ప్రార్థించ సాగింది. అయితే, అంత కష్టంలోనూ, బాధలోనూ ఆమె తన రోజువారీ కర్తవ్యాలను విస్మరించలేదు. మూడు రోజులూ గడిచిపోయాయి. నారదుడు చెప్పిన ఆఖరి రోజు రానే వచ్చింది. రోజువారీ పనులన్నీ పూర్తి చేసిన సావిత్రి దుఃఖాన్ని దిగమింగు కుంటూ, అత్తమామల పాదాలకు నమస్కరించింది. వారు, "దీర్ఘ సుమంగళీ భవ!" అని ఆశీర్వదించారు. వారి ఆశీర్వచనాలు ఫలించాలని దైవాన్ని ప్రార్థించింది సావిత్రి.

ఆ రోజు కూడా సూర్యాస్తమయం వరకు ఉపవాసం కొనసాగించి, ఆ పైన వ్రతాన్ని ముగిస్తూ పారణ చేయాలని పతి

వ్రతా శిరోమణి సావిత్రి నిశ్చయించుకుంది. ఇంతలో ఆ రోజున సమిధలు, దర్భలు, పండ్లు తీసుకురావడానికి సత్యవంతుడు అడవికి బయలుదేరాడు. సావిత్రి కూడా ఎలాగో ఒప్పించి, ఆతని వెంట బయలుదేరింది. అడవికి వెళ్ళి కట్టెలు కొడుతుండగా సత్యవంతుడికి తీవ్రమైన శిరోవేదన పట్టుకుంది. దాంతో సావిత్రి తన ఒడినే దిండుగా చేసి, భర్తను నేల మీద పడుకోమంది.

కొద్దిక్షణాల కల్లా ఆమె ఎదుట ఓ దివ్యపురుషుడు కనిపించాడు. కాటుక లాంటి నల్లటి శరీరం, చింతనిప్పుల లాంటి కళ్ళు, చేతిలో పాశంతో ఉన్న ఆ వ్యక్తి సావిత్రి ఎదుట నిల్చొని, సత్యవంతుడి వంక చూస్తున్నాడు. అతను మృత్యుదేవత అయిన యముడు. సావిత్రి చూస్తూ ఉండగానే సత్యవంతుని శరీరం నుంచి జీవుణ్ణి వేరు చేసి, పాశంతో బంధించిన యమధర్మరాజు దక్షిణ దిశగా పురోగమించసాగాడు. కొంత దూరం వెళ్ళిన యమధర్మరాజు తన వెంట సావిత్రి కూడా వస్తున్న విషయాన్ని గుర్తించాడు. అది చూసి ఆయన ఆశ్చర్యపోయాడు. "అమ్మా! ఇక నువ్వు నన్ను అనుసరించి రావద్దు. వెనక్కి తిరిగి వెళ్ళి, నీ భర్త మృతదేహానికి అంత్యక్రియలు జరిపించు" అని పేర్కొన్నాడు. కానీ, సావిత్రి మాత్రం "పతులు వెళ్ళే చోటకే సతులు పోవడం ధర్మం. కాబట్టి, నా భర్తను అనుసరించేందుకు నన్ను అనుమతించు. పతివ్రతలు తమ భర్తలను విడిచి ఉండలేరు. ఇది శాశ్వత ధర్మం" అని పలికింది.



సావిత్రి మాటలకు సంతోషించిన యముడు, "సాధ్వీ! నీ మాటలు, పతిభక్తి నాకు ముచ్చటేస్తున్నాయి. నీ భర్త అయిన సత్యవంతుడి ప్రాణాలు తప్ప మరేదైనా వరం కోరుకో" అన్నాడు. అప్పుడు సావిత్రి, "ఓ దేవదేవా! రాజ్యం పోగొట్టుకొని, అంధుడైన నా మామగారికి రాజ్యప్రాప్తి, నేత్రదృష్టి ప్రసాదించవలసింది" అని కోరింది. ఆమె ప్రార్థనను మన్నించిన యమధర్మరాజు అందుకు అంగీకరించి, "అలాగే"నంటూ వరమిచ్చాడు. ఇప్పటికే, ఎంతో అలసిపోయావు గనక వెనక్కి వెళ్ళిపోవాల్సిందని సావిత్రితో చెప్పాడు. కానీ, సాధ్వీ లలామ సావిత్రి మాత్రం, "యమధర్మరాజా! అందరినీ సమభావంతో చూసే ధర్మదేవతవు నీవు. మీకు తెలియని ధర్మం ఏముంది! జీవుల పాపాలు పోగొట్టే మీ దయ లేకపోతే ఇక మమ్మల్ని కాపాడేదెవరు?" అంది.

**అనువక్త: రెంటాల జయదేవ**



సావిత్రి తెలివితేటలు యముణ్ణి ముగ్ధుణ్ణి చేశాయి. అంతట ఆ సమవర్తి ఆమెకు మరో వరం ఇవ్వజూపాడు. అప్పుడు సావిత్రి పుత్ర సంతతి లేని తన తండ్రికి కుమారులు కలిగేలా వరం కోరింది. యముడు ఆ వరం కూడా అనుగ్రహించాడు. అయినప్పటికీ, సావిత్రి పట్టువిడవక అనుసరిస్తూ, ధర్మవాక్యాలతో యమధర్మరాజును సంతుష్టుణ్ణి చేసింది. అంతట ఆయన సత్యవంతుడి ప్రాణాలు తప్ప, మరేదైనా ఇంకొక్క వరం ఇవ్వడానికి సిద్ధపడ్డాడు. సావిత్రి ఆ అవకాశాన్ని వదిలిపెట్టుకోదలచలేదు. "యమధర్మరాజా! నా భర్త వంశ ప్రతిష్ఠ నిలబెట్టేలా సద్గుణశీలురైన సంతానాన్ని నాకు దయతో అనుగ్రహించవలసింది" అని వినయంగా ప్రార్థించింది. సావిత్రి కోరిన కోరికలో దాగి ఉన్న మర్మం గ్రహించని యమధర్మరాజు ఆలోచించుకోకుండా "ఆ వరం కూడా అనుగ్రహిస్తున్నాను" లెమ్మన్నాడు.

అలా అని ముందుకు పోతున్న యమధర్మరాజును విడిచిపెట్టకుండా సావిత్రి వెంట రాసాగింది. అక్కడ నుంచి మానవులు ప్రవేశించలేని మార్గమంటూ, సావిత్రిని వెనక్కి మరలి పొమ్మన్నాడు యముడు. అప్పుడు ఆ పతివ్రతా శిరోమణి, "దయామూర్తీ! ఇప్పుడే నీవు నాకు పుత్ర సంతాన భాగ్యం ప్రసాదించావు. సత్యవంతుడు పునర్జీవితుడైతేనే, పతివ్రతనైన నాకు సంతాన భాగ్యం కలుగుతుంది. ఆయన లేకుండా నాకు భోగభాగ్యాలు, స్వర్గ సౌఖ్యాలు వద్దు" అని పేర్కొంది. పతి లేకుండా సతికి సంతాన భాగ్యమెలా కలుగుతుందన్న ఆమె వాదనతో తాను ఓటమి పాలైనట్లు యమధర్మరాజు గ్రహించాడు. సాధ్వీమణి అయిన సావిత్రి పతిభక్తికి మెచ్చి, సత్యవంతుడికి ప్రాణం పోశాడు.

సావిత్రి మామగారైన ద్యుమత్సేనుడు రాజ్యం, నేత్రదృష్టి పొందాడు. సావిత్రి తల్లితండ్రులకు పుత్ర సంతానం కలిగింది. అందరూ ఆనందంగా కాలం గడిపారు.

ప్రేమ, ఏకాగ్రచిత్త భక్తి, వజ్ర సంకల్పం ఉంటే చివరకు మృత్యువును కూడా జయించవచ్చని సతీ సావిత్రి కథ మనకు చెబుతోంది. స్త్రీల పట్ల, స్త్రీత్వం పట్ల భారతదేశంలో ఉన్న మర్యాద మన్ననలకు ఈ కథ ఓ తార్కాణం.

* * * * *

వ్యాఖ్యాత: సామవేదం షణ్ముఖశర్మ



# శివమహిమ్నః స్తోత్రం

(గత సంచిక తరువాయి)

**క్రియాదక్షో దక్షః క్రతుపతి రధీశస్తనుభృతా -**
**మృషీణా మార్త్విజ్యం శరణద సదస్యాః సురగణాః ।**
**క్రతు భ్రంశస్త్వత్తః క్రతుఫల విధానవ్యసనినో**
**ధ్రువం కర్తుః శ్రద్ధా విధురమభిచారాయ హి మఖాః ॥ 21 ॥**

**ఈ**శ్వరార్పణ లేని కర్మ ఎలాంటి దుష్ఫలితాలనిస్తుందనేదానికి ఉదాహరణ –దక్షయజ్ఞ విధ్వంస గాథ. అంతేకానీ బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో ఒకరైన శివుణ్ణి అవమానించడం లాంటి చిన్న పురాణగాథగా పరిమితం కాదు. ఇందులో అసలు ఈశ్వరత్వాన్ని అంగీకరించడం కనిపించదు. ఈశ్వరుడు ఉంటే ఉన్నాడు, లేకుంటే లేడు, మనకెందుకు ఆ చర్చ, మన కర్మ మనకు ఫలమిస్తోంది చాలు అనే వాదన దక్షప్రజాపతిది. సృష్టి చేయడం, దాన్ని పాలించడం అతడి పని. తన శక్తిని తాను నమ్ముకుని తానే దక్షుణ్ణి అనుకునే పరిమిత అహంకార బుద్ధి దక్షుడు. ***క్రియాదక్షో దక్షః*** – క్రియాదక్షుడు యజ్ఞానికి ఎన్ని కావాలో అన్నీ పెట్టుకున్నాడు. ఆయన దగ్గర చక్కగా చేయించగలిగే నేర్పు ఉంది. క్రమపతి అంటే యజమాని. సాక్షాత్తూ క్రియాదక్షుడైన దక్షుడే యజమానిగా ఉన్నాడు. అతడెవరంటే... ***అధీశః తను భృతాం*** – తనువు అంటే శరీరం. తను భృతాం భరించే వారు. అంటే ప్రజలు; అధీశః (వాళ్ళకు) ప్రభువు; అంటే ప్రజాపతి. దక్షుడు బ్రహ్మ ఇచ్చిన శక్తితో వచ్చిన సృష్టికర్తల్లో, ప్రజాపతుల్లో ఒకడు. బ్రహ్మకు సృష్టిరచనలో సహాయపడేవాడు, ప్రజాపతి క్రమపతి (యజమాని)గా ఉన్నాడు. పదవి ఇస్తే అహంకారంతో అంతా తన సమర్థత అనుకున్నాడు. బ్రహ్మదేవుడు ఎందుకు పదవి ఇచ్చాడంటే.... అంతకు ముందు దక్షుడి కుమార్తె అయిన సతీదేవిని శివునికిచ్చి వివాహం చేయాల్సిన పరిస్థితి వచ్చింది. నిజానికి సతీదేవి పరమేశ్వరుని యొక్క శక్తి, అమ్మవారు. తనకు ప్రజాపతిత్వం యొక్క శక్తి సిద్ధించాలంటే అమ్మవారు తనకు ప్రజగా (అంటే సంతానంగా) లభిస్తే, తద్వారా ఇతడి సృష్టికర్తృత్వ సామర్థ్యం మరింత పెరుగుతుంది అమ్మ అనుగ్రహం చేత అని బ్రహ్మదేవుడి ఆజ్ఞ తీసుకుని అమ్మవారి కోసం తపస్సు చేశాడు. అమ్మవారు శివుని శక్తి. శివుడు – శక్తి ఎప్పుడూ ఉన్నవారే. అమ్మవారు ప్రత్యక్షమై "సరే నేను జన్మిస్తాను, కానీ నన్ను శివునికిచ్చి వివాహం చేయి. ఏ రూపంతో వచ్చినా నేను శివుణ్ణి చేపట్టాల్సిందే! మాది సహజమైన దాంపత్యం" అన్నారు దక్షునితో. ఈశ్వరుడుంటే ఉన్నాడు కానీ నేను సర్వసమర్థుణ్ణి అనే భావన దక్షునికి ఉంది. ప్రార్థించే వరకూ అమ్మవారు! ప్రార్థించి, ఫలమిచ్చి తన కుమార్తె అయ్యాక తన కుమార్తె తాను చెప్పినట్లు వింటుందనే మానసిక మోహం కమ్ముకుంది. దాంతో, అతడు స్వయంవరం ప్రకటించినప్పుడు ఈశ్వరుణ్ణి తప్ప అందరినీ పిలిపించాడట. అమ్మవారు వరమాల పట్టుకుని సభా భవనంలోకి ప్రవేశించారట. శివుడు లేడక్కడ! తండ్రి వైపు ప్రశ్నార్థకంగా చూసిందట. కానీ అతడు అది అర్థం కానట్లు "చూడు! ఇక్కడ ఇంతమంది దేవతలు చక్కగా అలంకరించుకుని కూర్చున్నారు. వీరు నాతో సమానమైనవారు; మన తాహతుకు తగినవారు. వీరిలో ఎవరినైనా వరించు" అన్నాడు. (అంటే శివుడు మన తాహతుకు తగడు అని చెప్పడమన్నమాట!) ఈశ్వరుడు సర్వవ్యాపకుడు. అప్పుడు అమ్మవారు "ఓం నమశ్శివాయ" అంటూ పంచాక్షరీ మంత్రం జపిస్తూ మాలను విడిచిపెట్టారట. సర్వవ్యాపకుడైన ఈశ్వరుడు వెంటనే ప్రత్యక్షమై, ఆ మాల వేసుకుని అంతర్ధానమయ్యాడట. అప్పుడు బ్రహ్మ, విష్ణువు దక్షుణ్ణి ఓదార్చి "ఈశ్వరత్వం నీకు తెలియడం లేదు. నువ్వు ఈ పెళ్ళి చెయ్యాల్సిందే" అని బోధించారట. ఇంత జరిగాక పెద్దల మాట కాదనలేక మనస్సు అంగీకరించకపోయినా వారిద్దరి వివాహం చేశాడట'. ఇలా అమ్మవారిని పరమేశ్వరునికి ఇచ్చిన కన్యాదాన ఫలం వల్ల బ్రహ్మదేవుడు దక్షుడికి ప్రజాపతుల్లో పెద్దవాడిగా పదవి ఇచ్చాడట. తన సమర్థత వల్లే ఆ పదవి వచ్చిందనుకొని, ఈ పదవితో వచ్చిన శక్తిని దుర్వినియోగం చేసుకుని ఈశ్వర అవజ్ఞ చెయ్యడానికి మరొక కర్మ ప్రారంభించాడు. ఈశ్వరుడు అవసరం లేకుండానే ఫలితం పొందవచ్చుని బుజువు చెయ్యడమే దక్షుడు చేసిన యజ్ఞంలోని మర్మం.

***ఋషీనాం ఆర్త్విజ్యం*** – ఋషులు ఋత్విక్కులై అక్కడ కూర్చున్నారు. యజ్ఞ మంత్రాలు చదవడానికి వాళ్ళు సిద్ధమయ్యారు. ***సదస్యాః సురగణాః*** – ఇంక ఆ సదస్సులో దేవతలందరూ వచ్చి కూర్చున్నారు. (ఇంత చేసినా) ***క్రతు భ్రంశః త్వత్తః*** – క్రతువు భ్రంశం చేసే వాడు వచ్చాడట. (అతడే) ***క్రతుఫల విధాన వ్యసనినో*** – అంటే క్రతు ఫల విధానం సమకూర్చే వ్యసనం ఉన్నవాడు. క్రతువు అనేది – సంకల్పం మొదలుకుని ఇచ్ఛ, జ్ఞానం, క్రియం .. ఇలా ఎన్నో సమకూరితేనే కర్మ చేస్తారు. ఆ కర్మ చేసే వ్యవస్థ తనలో ఉండాలి. ఇదంతా అయ్యాక ఫలం రావాలి. ఇదంతా ఈశ్వరుని వ్యవస్థ వల్ల నడుస్తోంది. అన్నీ ఏర్పాటు చేసుకొని ఈశ్వర అవజ్ఞ అనేది ప్రధానంగా ఉండడం

వల్ల.. **క్రతు ఫలవిధాన వ్యసనినః** – అంటే క్రతుఫల విధానం ఏర్పాటు చేసే ఆ పరమేశ్వరుడు; *క్రతుభ్రంశః* = క్రతు భ్రంశుడయ్యాడు. **ధ్రువం కర్తుః శ్రద్ధా విధుర మభిచారాయ హి మఖాః** – ఇక్కడ *శ్రద్ధా విధురం* అంటే శ్రద్ధ లేకుండా చేసే; *మఖాః* = యజ్ఞములు అభిచారములే అంటే నాశన హేతువులు; *ధ్రువం* – ఇది నిశ్చయం. ఇందులో సందేహం లేదు. శ్రద్ధ అంటే ఈశ్వర అస్తిత్వ భావన: ఆస్తిక్య బుద్ధే శ్రద్ధ. ఈశ్వర అస్తిత్వ భావన లేకుండా చేసే కర్మలన్నీ నాశనహేతువులు అని చెప్పడానికి ఇక్కడ దక్షయజ్ఞ విధ్వంస ఘట్టాన్ని చూపిస్తున్నారు.



యజ్ఞం ఏర్పాటు చేసినప్పుడు అందరూ వచ్చి కూర్చున్నారు. ఇంత సమకూరాక ఈశ్వరుడు లేకపోయినా యజ్ఞం ఫలించకుండా ఎలా ఉంటుంది అనుకున్నాడు. అప్పుడు దధీచి మహర్షి వచ్చి అంతా చూసి 'అన్నీ బాగున్నాయి, కానీ యజ్ఞంలో ఈశ్వరుడు కనిపించడం లేదేమ'న్నాడు. *"క్రతు ఫలాధీశు భువన రక్షా ధురీణు భోగి కంకను రప్పింపు యాగమునకు"* అని దధీచి బోధించాడు. తనే సమర్థుడిననే అహంకారంతో ఉన్న దక్షుడు కోపగించుకొని, "ఇతణ్ణి గెంటివేయండి" అన్నాడట. "నువ్వు గెంటడమేమిటి, ఈశ్వరుడు లేని యజ్ఞంలో మేము ఉండం" అంటూ దధీచి ఆయనతో పాటు గౌతముడు లాంటి వాళ్ళు కొంతమంది లేచి వెళ్ళిపోయారట. మిగిలిన వాళ్ళు కూర్చుని ఉన్నారు. నారదుడు కైలాసానికి వెళ్ళి అమ్మవారితో మనవి చెయ్యగా, అమ్మవారు బయల్దేరి వచ్చారు. అమ్మవారంటే ప్రకృతి, పరమేశ్వరుని యొక్క శక్తి. తన కుమార్తె కదా అనే తక్కువ భావనతో దక్షుడు అమ్మవారిని (ప్రకృతిని) అవమానించాడు; 'శివుడు రానక్కర్లేదు' అన్నాడు. 'ఆయన లేని చోటికి నేనొస్తానా' అంటూ అమ్మవారు *"ఆహా లెస్స వివేకమే పురహరుం దాశించి యున్నాడనీ స్వాహాకారము శంభు బాసి యిట నీ సత్రంబు నీ మృష్టాన్నము భుజింప వచ్చి...."* ఆ శివుణ్ణి వదిలి నీ ఇంట తిండి తినడానికి నేనొచ్చానను కున్నావా... అని ఈశ్వరుడు కనిపించేటట్లు చేసింది. ఆమె ఎప్పుడు ఉపసంహరింపబడిందో వెంటనే పరమేశ్వరుడికి కోపం వచ్చి, వీరభద్రుడి రూపంతో వచ్చి మొత్తం ధ్వంసం చేసాడు. ఆయనను అలా కదిలించింది ప్రకృతి. అందుకే ఈశ్వరత్వ స్పృహ లేకుండా ధర్మాన్ని అతిక్రమించి చేసే కర్మలన్నీ కూడా చివరకు ఇదే గతి పొందుతాయి. ఏ కాలానికైనా, ఎవరికైనా, ఏ సమాజానికైనా ఇది పాఠం. (ఈశ్వర భావన లేని సమాజం అభివృద్ధి చెందలేదు. వ్యక్తి యొక్క ఆధ్యాత్మిక ప్రయోజనం పక్కన పెట్టినా సామాజిక అభివృద్ధికి కూడా ఈశ్వర భావన అవసరం. అందుకే ఆధ్యాత్మిక చింతన లేని సమాజం అభివృద్ధి చెందదు).

దక్షయజ్ఞం ధ్వంసం అయిన తరువాత బ్రహ్మదేవుడు "ఈశ్వర అవజ్ఞ చేసి ఈ గతి పొందావు" అని వెళ్ళి పరమశివుణ్ణి "నువ్వు ఆగ్రహించడం తగునా" అని ప్రార్థన చేశాడట. "నేను ఆగ్రహించానా! తాను చేసిన పనికి తగ్గ ఫలితం అనుభవించాడు. ఫల ప్రదానం చేశాను నేను ఆ విధంగా" అంటే ఆయన, "నువ్వే అనుగ్రహించాలి" అన్నాడు బ్రహ్మ. పరమేశ్వరుడు దయామయుడు (అందువల్లనే మన బ్రతుకులన్నీ నవ్యంగా సాగిపోతున్నాయి). తప్పుచేసిన వాణ్ణి శిక్షించాలి కాబట్టి ఫలప్రదానలీల. పరమేశ్వరుడు బయలుదేరి వెళ్ళాడు. అప్పటికే యజ్ఞవాటిక అంతా మృతదేహాలు, పారేసిన యజ్ఞ ద్రవ్యాలు మొదలైన వాటితో భయంకరంగా ఉంది. దక్షుడు శిరస్సు తెగి పడి ఉన్నాడు. పరమ మంగళ స్వరూపుడైన శివుడు అడుగు పెట్టగానే వాతావరణమంతా మంగళకరంగా మారిపోయింది. అప్పుడు పరమశివుడు ఆ యజ్ఞం పూర్తి చెయ్యడానికి వచ్చాడు. బ్రహ్మదేవుడు తన బిడ్డను బ్రతికించాల్సిందిగా వేడుకున్నాడు. వెంటనే పరమేశ్వరుడు వీరభద్రుణ్ణి పిలిచి, అతకడానికి తల తీసుకు రమ్మన్నారు. ఇంత శిక్షించి మళ్ళీ అనుగ్రహించడం వీరభద్రుడికి ఇష్టం లేదు. కానీ ఈశ్వరాజ్ఞ దాటలేడు. శివనింద చేస్తే ఇలాంటి దుర్గతి పడుతుందని ప్రపంచానికి తెలియడం కోసం మేక తలను తీసుకువచ్చాడు. మృత్యుంజయుడైన పరమేశ్వరుడు దక్షుడికి ఆ మేక తలను అతికించి, ప్రాణం పోశాడు. దక్షుడు అప్పుడు ఈశ్వరుడు లేని కర్మకు ప్రేరణ లేదు, కారణం లేదు, ఫలం లేదు, ఈశ్వరుడే ప్రధానం అని తెలుసుకున్నాడు. అప్పుడు నమస్కారం చేసి యజ్ఞమంతా ఈశ్వరమయం అన్నాడట. ఈశ్వరార్పణగా చేసేదే యజ్ఞం, అదే యజనం, ఆరాధన. అందుకే ఇక్కడ పురుషారాధన మృతే పరమపురుషుణ్ణి ఆరాధించకుండా చేసే కర్మ క్షీణమవుతుంది అన్నారు. పరమేశ్వరుణ్ణి స్తుతించి పశ్చాత్తప్తుడై ఆయన అనుగ్రహం చేత మళ్ళీ ప్రజాపతిగా కొనసాగించబడ్డాడు. ఇది దక్షయజ్ఞ విధ్వంసం గురించిన కథ.

**ప్రజానాథం నాథ ప్రసభమభికం స్వాం దుహితరం**
**గతం రోహిద్భూతాం రిరమయిషు మృష్యస్య వపుషా**
**ధనుష్పాణేర్యాతం దివమపి సపత్రాకృతమముం**
**త్రసంతం తే – ద్యాపి త్యజతి న మృగవ్యాధరభసః ॥ 22 ॥**



(మిగతా 29 వ పేజీలో.....)

రచన: శ్రీమతి గరిమెళ్ళ లక్ష్మి



# సంబరాల సంక్రాంతి



తెలుగు వాళ్ళకు అతి ముఖ్యమైన పెద్ద పండుగ సంక్రాంతి. సూర్యుడు ధనూరాశి నుంచి మకర రాశిలోకి ప్రవేశించే మకర సంక్రమణం (మకర సంక్రాంతి) చాలా ముఖ్యమైనది.

సూర్యుడు ధనూరాశిలో సంచారం చేసే నెలరోజుల కాలాన్ని 'ధనుర్మాసం' అంటారు. ఇది చంద్రమానం ప్రకారం మార్గశిర – పుష్య మాసాలలో వస్తుంది. సూర్యుడు ధనూరాశిలో ప్రవేశించి ధనుర్మాసం మొదలవడాన్ని 'నెలగంటు పట్టడం' అంటారు. ధనుర్మాసం నెల రోజులూ దేవాలయాల్లో విశేష ప్రాతఃకాల పూజలు జరుగుతాయి. ప్రతి ఇంటి ముంగిట్లో ఆవు పేడతో కళ్ళాపి జల్లి, రకరకాల ముగ్గులు వేస్తారు. ఇంటికి వెల్ల (సున్నం) వేయించుకోవడం, గడపలకు రంగువేసి పసుపు కుంకుమలతో అలంకరించి గుమ్మాలకు బంతిపూల తోరణాలు కట్టడం ఆనవాయితీ. ధనుర్మాస పూజ ఇళ్ళలో కూడా చేస్తారు. తెల్లవారుజామునే లేచి దేవతార్చన చేసి బ్రాహ్మణులకు భోజనం పెట్టి ప్రసాదం స్వీకరిస్తారు. కొన్ని ప్రాంతాలలో మహిళలు మార్గశిర లక్ష్మీవార వ్రతం ఆచరిస్తారు. ధనుర్మాసంలో శ్రీహరిని కీర్తిస్తూ హరిదాసులు ఇంటింటికీ వస్తారు.

**భోగి:** భోగి పండుగ నాడు తెల్లవారు జామున ఇంటి ముంగిట భోగిమంట వేస్తారు. ఉదయాన్నే అభ్యంగన స్నానం చేసి కొత్త బట్టలు ధరిస్తారు. సాయంకాలం చిన్న పిల్లలకు భోగిపళ్ళు పోసి హారతి ఇచ్చి, దిష్టి తీస్తారు. పేరంటాళ్ళకు మొలకెత్తిన సెనగలు, పండ్లు, తాంబూలం ఇస్తారు. కొన్ని ప్రాంతాల వారు బొమ్మల కొలువు పెట్టి పేరంటం చేస్తారు.

**సంక్రాంతి:** రెండోరోజు సంక్రాంతి. ప్రతి ఇంటి గుమ్మం లోనూ సంక్రాంతి నాడు రథం ముగ్గు వేసి పసుపు కుంకుమలు, పూలు చల్లి సంక్రాంతి పురుషుణ్ణి ఆహ్వానిస్తారు. ఈ రోజు నుండి ఉత్తరాయణం ప్రారంభమవుతుంది. దీనిని 'పెద్ద పండుగ', 'పెద్దల పండుగ' అని కూడా అంటారు. ఈ రోజున పితృదేవతలకు తర్పణాలు వదిలి, బ్రాహ్మణులకు భోజనాలు పెడతారు. ఈ రోజు చేసే వ్రత దానాదులు ఎంతో ఫలప్రదమైనవి. సంక్రాంతి నాటికి పంట రైతుల ఇళ్ళకు చేరుతుంది కనుక దీనిని 'పంటల పండుగ' అని కూడా అంటారు. ఎన్నో కష్టనష్టాలకు ఓర్చి ధాన్యలక్ష్మిని ఇంటికి చేర్చే రైతులకు ధాన్యం, కొత్త బట్టలు ఇవ్వడం ఆనవాయితీ. సూర్యుని వల్ల వర్షాలు పడి పంటలు పండుతాయి. మనకి ప్రతీ వస్తువూ కూడా ఆ భగవానుని వల్లే లభిస్తుంది. ఆయన ద్వారా లభించినవి ఆ స్వామికి నివేదన చేసి బంధు మిత్రులతో భుజించడం పరిపాటి. ఈ పెద్దపండుగకు కొత్త అల్లుళ్ళను ఇంటికి పిలిచి, కొత్త బట్టలు, కానుకలు ఇస్తారు. సంక్రాంతి నాటి సాయంకాలం పసుపు, కుంకుమ, గాజులు, పువ్వులు, పండ్లు, తాంబూలం, చెఱకు ముక్కలు ముత్తైదువులకు పంచుతారు. కొన్ని ప్రాంతాల్లో నువ్వులు, బెల్లం కలిపి ఉండలు చేసి అందరికీ పంచుతారు.

కొన్ని ప్రాంతాలలో మహిళలు 'దీపాల వ్రతం' చేస్తారు. ఇది మూడేళ్ళ వ్రతం. మొదటి ఏడాది మట్టితో చేసిన రెండు కొత్త మండిగలలో (పెద్దసైజు ప్రమిద) లీటరు నువ్వుల నూనె పోసి, పత్తితో చేసిన రెండు పెద్ద వత్తులు వేసి ఉత్తరాయణ పుణ్యకాలం రాగానే పూజ చేసి, ఆ దీపాలు వెలిగిస్తారు. మర్నాడు సంతర్పణ చేస్తారు. రెండో ఏడాది 2 లీటర్ల నూనెతో, 3వ ఏడాది 3 లీటర్ల నూనెతో దీపాలు వెలిగిస్తారు. ఈ వ్రతం వల్ల సంపదలు, ఆయురారోగ్యాలు లభిస్తాయంటారు.

**కనుమ:** సంక్రాంతిలో మూడోరోజు కనుమ పండుగ. ఇది పశువుల పండుగ. పొలం దున్నడంతో మొదలుపెట్టి, పంట ఇంటికి వచ్చే వరకూ పశువులు ఎంతో సాయపడతాయి. ఆ మూగ జీవాలని పూజించడానికే పశువుల పండుగ. కనుమ నాడు ఉదయం పశువులను చెరువుకి తీసుకెళ్ళి, శుభ్రంగా కడిగి పసుపు రాసి కుంకుమతో బొట్లు పెట్టి పూలదండ వేసి పూజిస్తారు. ఎడ్లకు అరిసెలు వండి తినిపిస్తారు. ఆవులకూ, దూడలకూ పులగం వండి పెడతారు. 'కనుమ నాడు మినుము కొరకాలి, లేకపోతే యముడు ఇనుము కొరికిస్తాడు' అంటారు. అందువల్ల ఆ రోజు గారెలు చేస్తారు. 'కనుమ నాడు కాకి కూడా మునుగుతుంది' అంటారు. ఆ రోజు ఉదయాన్నే తప్పని సరిగా తల స్నానం చేస్తారు. అలాగే, కనుమ నాడు ఎవరూ ప్రయాణం చేయరు. ఇలా ఎన్నో ఆచారాలు, అలవాట్లతో జరుపుకొనే సంక్రాంతి తెలుగు వారి సిసలైన పండుగ. J



(... 27 వ పేజీ తరువాయి) **శివమహిమ్నః స్తోత్రం**

ఒకసారి అతను **అభికం** = కాముకుడయ్యాడు. ఆ కాముకత్వం ఎంతదాకా వెళ్ళిందంటే.. త్వాం దుహితమ = కుమార్తెనే (దుహిత అంటే కుమార్తె) కామించేటంత నీచత్వానికి దిగజారాడట బ్రహ్మ దేవుడు. పరమేశ్వరుని సంకల్పం చేత ఆయన ఆజ్ఞతో సృష్టి చెయ్యడానికి బ్రహ్మదేవుడు సంకల్పించుకుని తన మనస్సు నుంచి ప్రజాపతుల్నీ, మహర్షుల్నీ సృష్టించిన తరువాత ఈ సృష్టి అంతా వర్ధిల్లడానికి ధ్యానంలో ఉన్నారు. ఆ ధ్యాన స్థితిలో ఆయన ఉండగా ఆయన యొక్క భ్రూ మధ్యం నుండి మానస కన్య ఉద్భవించింది. ఆమెను సరస్వతి అనీ, సంధ్య అనీ ఇంకా అనేక పేర్లతో చెబుతారు.

సృష్టి వర్ధిల్లడానికి ప్రేరక వస్తువు కావాలి. ప్రేరేపించే వస్తువు కోరిక. కోరిక అనే శక్తి కావాలంటే, అది కూడా కామేశ్వరుడైన శివుడివ్వాలి. అందుకు బ్రహ్మదేవుడు పరమేశ్వరుని ఉపాసన చేస్తే ఆయనలోని బ్రహ్మ కామనలో నుంచి మన్మథుడు పుట్టాడు. బ్రహ్మ అతనికి విల్లు బాణాలు ఇచ్చి వాటితో సృష్టిలోని అందర్నీ ప్రేరేపించమని చెప్పాడు. ఆయుధాలు ఇవ్వగానే మన్మథుడు మొదట బ్రహ్మగారి మీదే ప్రయోగించాడు. అప్పుడు...



**ప్రసభమధికం** = అప్పుడే ఉద్భవించిన సంధ్యను చూసి బ్రహ్మ మోహితుడయ్యాడు. అప్పుడు సంధ్య **గతం రోహిద్భూతాం** = (రోహితమనే) ఎర్రని మృగరూపం ధరించి పరుగెత్తింది. అప్పుడు బ్రహ్మ కూడా (మగ) మృగమై పరుగెత్తాడు. (మగ మృగాన్ని 'ఋష్యము' అంటారు). దీని అర్థం కామాది వికారాలు ఎంతటి వాడినైనా మృగంగా మారుస్తాయి. ఆ మృగభావాల్ని దెబ్బ తియ్యాలంటే వేటగాడు కావాలి. బ్రహ్మదేవుడు పరుగెత్తడం చూసి దేవతలందరూ ఈశ్వరుణ్ణి శరణు వేడారు. పరమేశ్వరుడు వేటగాడిలా విల్లంబులు ఎక్కుపెట్టాడు. పరమశివుని తీవ్రమైన బాణపు ధాటికి భయపడి, సిగ్గుపడి బ్రహ్మ యథాస్థితికి వచ్చి ఆసనం మీద కూర్చున్నాడు. దేవతలందరూ నవ్వు వచ్చినా గట్టిగా నవ్వకూడదు కనుక ముసిముసిగా నవ్వుకున్నారు. మన్మథుడు విజయ గర్వంతో చూశాడట; అతణ్ణి కోపంగా చూశాడట బ్రహ్మ. "ఏ స్వామి దగ్గర నా పరువు పోయిందో ఆ స్వామి కంటి మంటల్లోనే నువ్వు భస్మమైపోతావు జాగ్రత్త" అని శపించాడు.

**ధనుష్పాణేర్యాతం దివమపి సపత్రాకృతమముం** = అంతరిక్ష లోకంలోకి వెళుతున్న ఆ మృగాన్ని వేటాడడానికి నువ్వు ద్యులోకానికి చేరుకున్నావు ఓ పరమేశ్వరా; చేరుకుని, సపత్రాకృత మముం = ఆ బాణంతో బాధించిన నువ్వు; ధనుష్పాణేర్యాతం = ధనువును చేత ధరించి వచ్చిన; **మృగవ్యాధా** = ఓ వేటగాడా; ఇప్పటికీ నువ్వు అలా చేస్తున్నట్టు ఉండడాన్ని బ్రహ్మ దేవుడు భయపడుతూనే ఉన్నాడు. అంటే ప్రభువుకు భయపడుతూ పని చేసినప్పుడే పాలన సరిగా ఉంటుంది. తనను గమనించే పరమేశ్వరుడు ఒకడున్నాడని తెలుసుకుని బ్రహ్మదేవుడు ఈ సృష్టి అంతా చేస్తున్నాడు, కనుక **అద్యాపి** = ఇప్పటికి కూడా ఏదైనా పొరపాటు చేస్తే ఆ వేటగాడు శిక్షిస్తాడని భయపడి, తన మృగత్వాన్ని అణచుకుని సృష్టిచేస్తున్నాడు. **దివమపి** = దివిలో ఈ దృశ్యం ఉన్నది అని చెబుతున్నారు.

నక్షత్రాల్ని మొత్తం 12 రాశులుగా విభజన చేసి రకరకాల పేర్లు పెట్టారు. పుష్పదంతుడు గొప్ప విజ్ఞాన వేత్త. ఇక్కడ (దివమపి) ఆకాశంలో కూడా అనడంలో మనం గమనించాల్సింది ఉంది. ఆకాశంలో గ్రహించడానికి రోహితమనే శబ్దం ఉపయోగించారు – అంటే ఎర్రనిది అని భావం, సంధ్య ఎర్రగా ఉంటుంది. బిడియం, సిగ్గు, లజ్జ – వీటి రంగు ఎరుపు. సిగ్గుతో పరుగెత్తిన మృగం ఎర్రగానే ఉంది. అది ఒక భావనకు సంకేతం. అనురాగం రంగు కూడా ఎరుపే. అందుకే ఆయన కూడా ఆ రూపంలోనే పరిగెత్తారు. రోహితమృగం అని చెప్పబడిన నక్షత్రం రోహిణీ నక్షత్రం. దీని వెనుక దీన్ని చూస్తున్నట్లుగా ఉన్న నక్షత్రం పేరు మృగశిర. దాని శీర్షం మృగంలా ఉంటుంది. దీనిని చూస్తూ దీనిపై ఎక్కుపెట్టిన బాణంలా ఒక నక్షత్రం ఉంటుంది. అది ఆర్ద్రా (రుద్ర) నక్షత్రం. మహాతేజోమయమైన ఆర్ద్రా నక్షత్రం శివుని నక్షత్రం. వాటి ఉదయాస్తమయాలలో కూడా ఆరుద్ర ఉదయిస్తూ ఉంటే, మృగశిర వెళ్ళడం గోచరిస్తుంది. ఈ రెండిటి ఉపాసనే మనకు మార్గశిర మాసంలో చెప్పబడు తుంది. ధనుర్మాసం అంటే ఎక్కుపెట్టిన ధనువు నుంచి మృగ భావాన్ని కొట్టడం. ధనుర్మాసంలో శివోపాసన అత్యంత ప్రసిద్ధి అని శివపురాణం చెబుతోంది.

బుద్ధిశక్తి తన నుంచి తానే ఒక ఊహను, ఆలోచనను సృష్టించుకొని, దాని మీద మమకారం పెట్టుకుని దాని వెంట పరిగెడుతుంది. బుద్ధి ఒక మృగమైంది అన్నాడు. ఇదే పశుత్వం అంటే. పశుత్వాన్ని నాశనం చెయ్యడానికి పశుపతి అయిన రుద్రుడు రావాలి. అందుకే ఆది శంకరులవారు "ఓ పరమేశ్వరా! కారుచీకటితో నిండిన నా మనస్సనే అడవిలో మదమాత్సర్యాలు అనే మాయమృగాలు బలిసి తిరుగుతున్నాయి. ఇక్కడకు రా! నీకు మంచి జంతువుని చూపిస్తున్నాను" అన్నారు. Z

– స్వామి జగదాత్మానంద

విజయవంతంగా జీవించడం ఎలా?

# ద్వేషం వదలండి! దైవాన్ని చూడండి!!

(గత సంచిక తరువాయి)

## ‰×ã`Ç°`ÇÞ=°<Í q+¬=•†Ç°O

ద్వేషంతో కుతకుతలాడే మనుష్యులు ఎల్లప్పుడూ కలవరంతో, క్రూరంగా ప్రవర్తిస్తారు. ద్వేషం మనస్సును సంకుచితం చేసి, ఆలోచనా శక్తినీ, వివేచనా శక్తినీ కుంటు పరుస్తుంది. శత్రుత్వం అంటే నల్ల కళ్ళద్దాలు పెట్టుకోవడం! అది మన వివేకాన్ని మరుగుపరుస్తుంది. నువ్వు ఇతరుల్లో ఏ లక్షణం ఇష్టపడవో, అదే లక్షణం నీలో పెంపొందించుకుంటావు. అలాంటి మనిషిలో పగ అనే తీవ్రమైన ఆవేశం ఉంటుంది. ద్వేషమున్న వ్యక్తి మానసిక, శారీరక ఆరోగ్యం నాశనమవుతుంది. ద్వేషింపబడే వాడు తనను ద్వేషించేవాణ్ణి అసహ్యించుకుంటాడు. ద్వేషించే వాడు ఒత్తిడికీ, ఆందోళనకూ గురైతే, ద్వేషించబడేవాడి మదిలో అవిశ్వాసం, అసహాయత చోటు చేసుకుంటాయి. ఇతరులను ద్వేషించేవారిని అందరూ దూరంగా ఉంచుతారు. వాళ్ళు నిస్పృహ చెంది ఒంటరితనంతో బాధపడతారు.

ఉత్తర భారతదేశంలో ఒక సన్న్యాసి చేతిలో పైసా లేకుండా ఒక చోట నుండి మరొక చోటుకు తిరిగేవారు. ప్రజలు మహాజ్ఞాని అయిన సన్న్యాసి పలుకులు శ్రద్ధగా వినేవారు. పెద్ద మనిషి తరహాగా ఉండమనీ, ఇతరులతో క్రూరంగా ప్రవర్తించవద్దనీ ఆయన ప్రజలకు బోధించేవారు. ఒకమారు వేయిమందికి పైగా ఉన్న సభలో ఆయన, "ద్వేషాన్ని మించిన భయంకరమైన పాపం ఇంకొకటి లేదు. ద్వేషం ఓ భయంకర రోగం. ద్వేషంతో ద్వేషాన్ని ఎన్నటికీ జయించలేం. ద్వేషాన్ని ప్రేమ, దయ అనే ఆయుధాలతో జయించండి!" అని చెప్పారు.

ఈ పరివ్రాజక సన్న్యాసి ఎవరో కాదు గౌతమ బుద్ధుడే. 2500 ఏళ్ళ క్రితం బుద్ధుడు చేసిన బోధలు అన్ని కాలాలలో, అన్ని రకాలైన దుఃఖాలకూ, బాధలకూ దివ్య ఔషధం లాంటివి. మీరు ఎవరినైనా ద్వేషిస్తున్నారా? అదే మీలో ఉన్న బలహీనత. అదే మీరు చేసే పెద్ద తప్పిదం. దాన్ని తక్షణం వదిలిపెట్టండి!

ఎప్పుడైతే మీరు ఇంకొకర్ని ద్వేషించడం ప్రారంభిస్తారో, మిమ్మల్ని ఆదేశించే శక్తి వారికి ఇచ్చినట్టే! వాళ్ళు మీ నిద్ర, ఆకలి, రక్తపోటు, ఆరోగ్యం, సంతోషం – అన్నింటినీ ఆదేశిస్తారు. వారిని గురించి తలుచుకుంటేనే మీకు ఎంత చీకాకు కలుగుతుందో మీ శత్రువులకు తెలిస్తే వారు సంతోషంతో గంతులేస్తారు. మీకు మీ శత్రువుల పట్ల ఉన్న ద్వేషం వల్ల వారికి ఏ హానీ కలగదు సరికదా అది మిమ్మల్ని బాధ, దుఃఖం అనే నరకానికి తీసుకువెళుతుంది.

స్వామి వివేకానంద, "ఇతరుల పట్ల మీరు అసూయా ద్వేషాలు చూపితే ఆ ఫలితం మీకే వడ్డీతో సహా చుట్టుకుంటుంది. దాన్ని ఏ శక్తీ నిరోధించ లేదు. మీరు ఒకసారి వాటిని కదిపితే అవి తిరిగి మీద పడినప్పుడు వాటిని భరించి తీరాల్సిందే! ఈ విషయం గుర్తు పెట్టుకుంటే మీరు చెడ్డపనులు చేయకుండా ఉంటారు!" అని బోధించారు.

## ãHË^•¥yß

ఒక పిచ్చికుక్క ఒక స్త్రీని కరిచింది. ఆమెకు తగిన చికిత్స జరగకపోవడం వల్ల ఉన్మాదం లేదా నీటిని చూసి భయపడే (జలభీతి) వ్యాధి లక్షణాలు కనపడసాగాయి. ఆమె బంధువులు ఆమెను వైద్యశాలలో చేర్చారు. ఒక నిపుణుడైన వైద్యుడు ఆమెకు వైద్యం చేయసాగాడు. ఆమె మనస్సు కొంచెం శాంతించాక వైద్యుడు ఆమెతో, "ఈ కాగితం, కలం తీసుకొని మీ వీలునామా వ్రాయండి!" అని చెప్పాడు. ఆమె ఆపకుండా ఏదో వ్రాయ సాగింది. వైద్యుడు ఆమె మనస్సు దుర్బలమవుతోందని భావించి ఆమెతో, "ఏం చేస్తున్నారండీ?" అని ప్రశ్నించాడు. ఆమె, "నేను ఎవరెవర్ని కరవాలనుకుంటున్నానో వాళ్ళందరి పేర్లతో ఒక పట్టిక తయారుచేస్తున్నాను!" అని చెప్పింది. మరణించే ముందు కూడా కొందరు పగతీర్చుకోవడానికీ, ఇతరుల జీవితాలు నాశనం చెయ్యడానికీ పన్నాగాలు పన్నుతూ ఉంటారు. కొందరు, "నువ్వు చేసిన మోసాన్ని మర్చిపోలేను. చచ్చి దయ్యంగా మారి అయినా నిన్ను ఏడిపించుకు తింటాను!" అని శాపనార్థాలు పెడుతూ ఉంటారు. ఈ దేహం పోతుందేమో కానీ పగ తీర్చుకోవాలన్న కోరిక మాత్రం పోదు.

## x=ô~¡°Q®„²æ# x„¬C

కొందరు బయటకు తెలియనీయకుండా పగకు ఆశ్రయం కల్పిస్తారు. మాటలోనూ, ప్రవర్తనలోనూ వారి మనస్సును బయట పడనివ్వరు కానీ, వారిలో పైకి కనపడకుండా దాగిన పగ వారి వ్యక్తిత్వాన్ని బలహీనపరుస్తుంది.

ఒక ముప్ఫై నాలుగేళ్ళ స్త్రీ ఒక వైద్యుడి వద్దకు వచ్చింది. నెలల తరబడిగా నిద్రలేమితో, ఆందోళనతో, విపరీతమైన అలసటతో బాధపడుతోంది. మందులు వాడుతున్నా ప్రయోజనం లేకపోయింది. ఆమె తరచూ ఆత్మహత్య చేసుకోవాలనుకునేది. తరచి తరచి ప్రశ్నించాక వైద్యుడు ఆమె రోగానికి అసలు కారణం తెలుసుకున్నాడు. ఆమె రహస్యంగా అభిమానం పెంచుకున్న ఒక వ్యక్తిని ఆమె చెల్లెలు వివాహం చేసుకుంది. దానితో ఆమె





తన చెల్లెలు మీద అనిష్టాన్ని పెంచుకుంది. బయటకు తన చెల్లెలితో ఆమె ఆప్యాయంగానే వ్యవహరిస్తున్నా మనస్సులో ఆమెపై ద్వేషాన్ని పెంచుకుంది. అదే ఆమె శారీరక, మానసిక అనారోగ్యాలకు కారణం. ఈ సమయంలోనే ఆమెకు ఒక సాధువు సహాయం చేశాడు. "చూడమ్మా! ద్వేషం చాలా చెడ్డభావం. నీ చెల్లెలి పట్ల ఉన్న ద్వేషాన్ని అధిగమించేందుకు సహాయపడాల్సిందిగా చిత్తశుద్ధితో భగవంతుణ్ణి ప్రార్థించి శరణువేడు!" అని ఆమెకు సలహా ఇచ్చాడు. ప్రార్థన ద్వారా, భగవంతుడి శక్తి మీద ఉన్న విశ్వాసం చేత క్రమంగా తనలోని ద్వేషభావాన్ని ఆమె అధిగమించింది. క్రమంగా ఆమె నిద్రలేమితనం, నిస్పృహ, దిగులు తగ్గిపోయాయి. ఆమె ఓ కొత్త మనిషిగా మారిపోయింది. మునుపటి కన్నా సంతోషంగా ఉండసాగింది.

## ãÀ„=°`Ë [~òOKÇO_•!

ఇతరుల దుష్ప్రవర్తన, పొగరుబోతుతనం చూసినప్పుడు, వారు మనల్ని వేధించడానికి ప్రయత్నించినప్పుడు, మనం సహజంగానే కోపగించుకుంటాం. తప్పుడు ఆరోపణలు, తృణీకారం, తప్పుడు ప్రచారాలు మనకు కోపం తెప్పిస్తాయి. పోటీపడే తత్త్వం కూడా ద్వేషానికీ, శత్రుత్వానికీ దారి తీస్తుంది. మీ మంచి ఉద్దేశాలను ఇతరులు అపార్థం చేసుకున్నప్పుడు, ప్రజలు మిమ్మల్ని మోసం చేసినప్పుడు మీరు సహజంగానే కోపగించుకుని, ప్రతీకారం తీర్చుకోవాలనుకుంటారు. కానీ సాధువులు ఈ ప్రతీకారం అన్నభావాన్ని ప్రేమతో జయించాలని చెబుతారు. ధ్యానం చేస్తున్న సమయంలో, నిద్రపోయే ముందు ప్రేమ, ఆదరాలతో కూడిన ఆలోచనలనూ, ప్రకంపనాలనూ మీరు ద్వేషించే వ్యక్తులకు పంపడానికి ప్రయత్నించాల్సిందిగా చెబుతారు. ధర్మం, భక్తి అనేవి మన హృదయాలను పవిత్రం చేసి, మన బాంధవ్యాలను మెరుగు పరచేందుకు ఉద్దేశించినవి. పట్టు విడవకుండా ప్రార్థిస్తే మనం ఆ ద్వేషం, అసూయల నుండి రక్షింపబడతాం.

మనిషి మౌలికంగా దైవస్వరూపుడని తమ అనుభవ జ్ఞానంతో ఋషులు బోధించారు. శరీరంలో నివసిస్తున్న ఆత్మే ఆ భగవంతుడు. కుల, వర్గ, మత విచక్షణ పోవాలంటే, మనం ఆత్మ నిజస్వభావాన్ని తెలుసుకోవాలి. అందరిలోనూ ఒకే ఆత్మ ఉన్నప్పుడు మనం ఎవరిని ద్వేషించగలం? అన్ని కులాలలోనూ అదే ఆత్మ ఉన్నప్పుడు ఏ కులాన్ని ద్వేషించగలం? ఈ శరీరం ఒక వాహనమైనప్పుడు, ఆత్మ తన ఇష్టం వచ్చినట్లు శరీరాలను మార్చుకోగలిగినప్పుడు, వేర్వేరు కులాల వారిని ద్వేషించడమనేది వేర్వేరు పాత్రలలో కనిపించినందుకు ఒక నటుణ్ణి ద్వేషించినట్లవుతుంది. విషయపరిజ్ఞానం మరింత విస్తరించినప్పుడు, మన దృక్పథం మారిపోతుంది, తద్ద్వారా జీవితానికొక నూతనత్వం వస్తుంది.

## Jª•^•Î¼O Hê^Î°!

'మన ఇళ్ళు శిథిలం చేసి, మనల్ని ఎంతగానో బాధించి, సంబంధ బాంధవ్యాలకు హాని తలపెట్టినవారిని, మన ఇంటి మహిళల్ని అవమానించిన వారిని ద్వేషించకుండా ఉండడం సాధ్యమేనా?' అనే ప్రశ్న తలెత్తుతుంది.

ఒక మనిషి క్రూరుడనీ, అదుపులో ఉండడనీ, హింసకు దిగుతాడనీ, జంతువు లాంటి వాడనీ అతణ్ణి ద్వేషించడం, ఒక మూడో తరగతి విద్యార్థి ఆల్జీబ్రా తెలియక పరీక్ష తప్పి మరొక విద్యార్థిని ద్వేషించినట్లుంటుంది. మీరు 'ఒక రాయిని అది రాయి అని ద్వేషిస్తారా? దాన్ని తన్నుకుని ముందుకు పడకుండా జాగ్రత్త పడతాం, అంతే! భూమి మీద ఉన్న అనేక వస్తువులలో అది కూడా ఒకటని మనం భావిస్తాం. నీచుల్నీ, అజ్ఞానుల్నీ, దుష్టుల్నీ, పశుప్రాయుల్నీ ద్వేషించడం ఆ రాయిని ద్వేషించడం లాంటిదే. బుద్ధుడు "ద్వేషాన్ని ప్రేమతో జయించండి!" అని చెప్పాడు. తనను శిలువ వేసిన వారి గురించి ప్రార్థిస్తూ ఏసుక్రీస్తు, "ఓ తండ్రీ! వారిని క్షమించు. వారేమి చేస్తున్నారో వారికి తెలియదు!" అన్నాడు. అదే విధంగా, "దుర్మార్గుల్నీ, పాపాత్ముల్నీ లక్ష్యపెట్ట వద్దు!" అని పతంజలి తన యోగసూత్రాలలో చెప్పాడు. ద్వేషం మనోబలం మీద వ్యతిరేక ప్రభావం చూపిస్తుంది. ద్వేషం మనల్ని ఎంత సంకుచిత స్వభావులుగా మార్చగలదో దిగువ చూడవచ్చు.

పుణేలోని ఒక వార్తాపత్రికలో ఈ వార్త ప్రచురించబడింది.

"ఒక ఎనిమిదేళ్ళ బాలుడు దయ్యం పట్టి బాధపడుతున్నాడు. ధనవంతుడైన అతడి తండ్రి ఆ బాధ తొలగడానికి చాలా డబ్బు ఖర్చు చేశాడు. కానీ, లాభం లేకపోయింది. నరసోబావాడిలోని దత్తాత్రేయస్వామి గుడిలో అలాంటి బాధలు నివారిస్తారని వాళ్ళు విన్నారు. ఆ పిల్లవాణ్ణి అక్కడకు తీసుకువెళ్ళి రెండు నెలలుండి ఆ దేవుడికి పూజలు, ప్రార్థనలు చేశారు. చివరకు ఆ దయ్యం ఆ పిల్లవాణ్ణి ఎందుకు ఆవహించిందో చెప్పింది. "నేనొక దోవలో నడిచివెళుతున్నాను. ఈ మనిషి నా మెడకు ఉచ్చువేసి చంపి, నా దగ్గర ఉన్న ఐదువందల రూపాయల్ని దోచుకున్నాడు.



ఇస్తాను. నా కొడుకును వదిలిపెట్టు!" అన్నాడు. కానీ ఆ దయ్యం, "వీడు నన్ను చంపాడు. వీణ్ణి చంపితీరతాను, వదలను!" అని చెప్పింది. ఆ దెయ్యం వదలలేదు. త్వరలోనే ఆ పిల్లవాడు చనిపోయాడు. అలా ఆ వ్యక్తి, తనను చంపినవాడి మీద పగతీర్చుకోవడం కోసం దయ్యంగా మారి దుర్భరమైన జీవితాన్ని కొనసాగించాల్సి వచ్చింది. ఆ హంతకుడు ఎలాగూ తన పాపానికి తగిన శిక్షను పొందేవాడు. పగ తీర్చుకోవాలన్న కోరిక ఏడు జన్మలపాటు ఆ దయ్యం రూపంలో ఉండడమే కాక, అతడు ఏ విధమైన ఆధ్యాత్మిక పురోగతినీ సాధించలేకపోయాడు. మీరు దేన్ని ద్వేషిస్తారో, చివరకు మీరే అది అవుతారు. ఎలాగైతే భయాన్ని గురించి ఆలోచించడం మిమ్మల్ని భయంలో పడవేస్తుందో, ద్వేషం మీరు ద్వేషించే మనిషి యొక్క మానసిక స్థితే మీకు కూడా కలిగేలా చేస్తుంది.

పవిత్రమైన ప్రేమ మనిషి వ్యక్తం చేయగలిగే వైఖరులన్నింటిలోకీ అత్యుత్తమమైనది, అత్యున్నతమైనది. ప్రేమే భగవంతుడు. మనం పవిత్రప్రేమను ప్రకటించినపుడు మనలోని దివ్యత్వాన్నే వ్యక్తీకరిస్తాం. కానీ పవిత్రప్రేమను ప్రకటించడం అంత సులభం కాదు. దానికి చాలా ప్రయత్నం చెయ్యాలి. అయితే మనిషి నేడో, రేపో ఆ స్థితి తప్పక పొందుతాడు. కాబట్టి ఆశ వదలుకోవాల్సిన పనిలేదు. ప్రయత్నాన్ని కొనసాగనివ్వండి. ఫలితం అత్యద్భుతంగా ఉంటుంది. కోల్‌రిడ్జ్ ఇలా చెప్పాడు:

"పెద్దా చిన్నా అన్నింటినీ ఎవడు బాగా ప్రేమిస్తాడో, వాడే అద్భుతంగా ప్రార్థించగలడు. ఎందుకంటే మనల్ని ప్రేమించే మన ప్రియమైన దేవుడే అన్నింటినీ సృష్టించి, అన్నింటినీ సమానంగా ప్రేమిస్తున్నాడు గనుక!"

## ‡é\© „¬_Í ‹¬Þƒ•ì=O ^ÍÞ‘•xH÷ ^¥if‹¬°ëOk

సాంఘిక శాస్త్రవేత్త అయిన పిట్రిమ్ ఎ. సోరోకిన్ ఈ కాలపు పోటీవ్యవస్థ వల్ల కలిగే హాని గురించి "ఈ పోటీ పడే స్వభావం అత్యంత మృదువుగా లేక వినాశకరంగానైనా వ్యక్తమై, వ్యక్తులలోనూ, సంఘాలలోనూ, పరస్పర సహకారానికి బదులు పరస్పర పోరాటాన్నీ, ప్రేమకు బదులు ద్వేషాన్ని ఎక్కువ చేస్తుంది".

పోటీలో పాల్గొనే వ్యక్తి సహజంగానే గెలవాలనుకుంటాడు. లక్ష్యాన్ని సాధించడానికి అన్నిరకాల పద్ధతులనూ ఉపయోగిస్తాడు. నైతికమైన పోటీ అయితే మంచిదే. కానీ పదవి, సంపదలు, హోదా కోసం, రాజకీయ నాయకుల ఎన్నికల రంగంలో, వ్యాపార రంగంలో ఈ పోటీ పడే స్వభావం ప్రమాదకరంగా ఉంటుంది. ఈ పోటీ పడే స్వభావం మనిషిలో దాగి ఉన్న దుష్టత్వాన్ని వెలికి తీస్తుంది. అలాంటి మనిషి తన లక్ష్యాన్ని సాధించడానికి తన శక్తితో మోసం, లంచం, బెదిరింపు మొదలైన అన్ని రకాల పద్ధతుల్నీ ఉపయోగిస్తాడు.

పాశ్చాత్య దేశాలలో అమలులో ఉన్న వినాశకరమైన పోటీపడే స్వభావం కన్నా భారతదేశంలో సాంఘిక వ్యవస్థగా నెలకొన్న వృత్తి ఆధారిత కులవ్యవస్థ మెరుగైనది. దీన్ని అర్థం చేసుకోవాలంటే ప్రాచీన భారతదేశంలోని గ్రామాల్లో ప్రజల జీవన విధానాన్ని అధ్యయనం చెయ్యాలి. వడ్రంగి, కమ్మరి, కుమ్మరి, మంగలి, చాకలి మొదలైన వారి మధ్య ఎలాంటి పోటీ లేదు. ప్రతి ఒక్కడూ తాను బ్రతకడానికి ఇతరుల మీద ఆధారపడేవాడు. వాళ్ళ పిల్లల బ్రతుకుతెరువు కోసం ప్రత్యేక శిక్షణ ఇవ్వాల్సిన అవసరం వారికి ఉండేది కాదు. ఏదైనా వృత్తి చేపట్టాలంటే నలుగురి వద్దకూ తిరిగి యాచించాల్సిన అవసరం వారికి ఉండేది కాదు. ఎవరైనా కొత్తవాడు తమకు పోటీగా తమ వృత్తిలోకి దిగి, తమకు బ్రతుకు తెరువు లేకుండా చేస్తాడేమోనని దిగులు పడాల్సిన అవసరం వారికి ఉండేది కాదు. ప్రజలు శాంతంగా, హాయిగా బ్రతికేందుకు తోడ్పడిన ఈ జీవన విధానం పోరాటాన్నీ, ద్వేషాన్నీ పెంచే పోటీపడే స్వభావం కన్నా మెరుగైనది కాదా? అలా అని కులవ్యవస్థను తిరిగి నెలకొల్పాలని నేను చెప్పడం లేదు. పోటీ స్వభావం వల్ల అధికమయ్యే ద్వేషానికీ, శత్రుత్వానికీ ఈ పాతవ్యవస్థలో స్థానం లేదని చెబుతున్నాను. కానీ ఈ రోజులలో ఒక వృత్తి, కులంగా రూపాంతరం చెందడం సాధ్యమే నన్న విషయాన్ని మనం త్రోసిపుచ్చలేం. రైల్వే ఉద్యోగులు తమ పిల్లల కోసం రైల్వేలలో రిజర్వేషన్ కల్పించాలనీ, తంతి తపాలా శాఖ ఉద్యోగులు తమ పిల్లలకు అదే శాఖలో రిజర్వేషన్ ద్వారా ఉద్యోగాలు కల్పించాలని కోరితే అందులో ఆశ్చర్యపోయే దేముంది? ఇదే పద్ధతి కొనసాగితే ఆయా పేర్లతో కులాలు పుట్టుకొస్తాయి. దర్జీలు, కుమ్మరుల లాగా రైల్వే కార్మికుల కులం, తంతి తపాలా కార్మికుల కులం తయారవుతాయి. అప్పుడు వారు కూడా ఒకరితో ఒకరు పోట్లాడుకుంటారా?

నేను ఇక్కడ పోటీపడే స్వభావం వల్ల తలెత్తే అసూయా ద్వేషాలు, మొదలైన చెడు భావాలను తరిమి కొట్టడానికి పూర్వపు కులవ్యవస్థ ఎలా పనిచేసిందో చెప్పడానికి ప్రయత్నిస్తున్నాను అంతే! మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చి, ఎన్నికలు జరపడం ప్రారంభించిన తర్వాత మన గ్రామాలలోని ప్రజల మధ్య సమైక్యత దెబ్బతింది. అంతకు పూర్వం వాళ్ళు, "మా బ్రతుకుతెరువు (కులవృత్తి) మాకు ఉంది, మీ బ్రతుకుతెరువు (కులవృత్తి) మీకు ఉంది, మీరు హాయిగా బ్రతుకుతూ మమ్మల్ని కూడా బ్రతకనివ్వండి!" అన్న సూత్రంతో కలిసిమెలిసి పనిచేసేవారు. 'కుల వ్యవస్థను పారద్రోలండి!' అని వేదికలెక్కి కేకలేసే రాజకీయ నేతలు అనేకమంది ఉన్నారు. కానీ వారు చేసే పనులు మాత్రం కుల వ్యవస్థను మరింతగా రెచ్చగొట్టి, కుల ప్రాతిపదికన ఓట్లు సంపాదించి, సర్వత్రా ద్వేషాగ్నిని రగిలిస్తాయి. మీరు ఏ కులాన్నైనా ద్వేషించడం మొదలుపెడితే మీరు దానిలో ఏ మాత్రం మంచిని చూడలేరు. లొసుగుల్నే చూడగలరు. కాబట్టి ఈ ప్రతికూల భావాన్ని

నివేదిక: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి



# ఆద్యంతం ఆనందమయం

## అనంతపురం భక్తసమ్మేళనం




ప్రారంభోత్సవంలో అధ్యక్షోపన్యాసం చేస్తున్న స్వామి గౌతమానందజీ, భక్తసమ్మేళనంలో పాల్గొన్న స్వామీజీలు

**రా**యలసీమ ముఖ్యపట్టణం అనంతపురంలో 2006 డిసెంబర్ 2,3,4 తేదీల్లో శ్రీరామకృష్ణ – వివేకానంద భావప్రచార పరిషత్ ఆధ్వర్యంలో 16 వ వార్షిక భక్తసమ్మేళనం అత్యంత వైభవంగా జరిగింది. ఈ సమ్మేళనంలో 26 మంది స్వామీజీలు, నలుగురు మాతాజీలు పాల్గొని మూర్తిత్రయ సందేశాలను తెలియజేశారు. 2500 మంది భక్తులు ఈ సమ్మేళనంలోని ఆధ్యాత్మిక విందును ఆరగించి ఆనందించారు.

**డిసెంబర్ 2 : మధ్యాహ్నం 2.30** గంటలకు చెన్నై శ్రీరామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి గౌతమానందజీ జ్యోతి ప్రజ్వలన చేసి భక్తసమ్మేళనాన్ని ప్రారంభించారు. స్వామీజీలతో వేదపఠనం, చిలకూరి దీవెన, స్మృతిల ప్రార్థనా గీతాలాపనతో, జి. శ్రీధరమూర్తి స్వాగత వచనాలతో సమావేశం ప్రారంభమైంది. కన్వీనర్ డాక్టర్ పన్నాల 'శ్యామసుందర మూర్తి, జాయింట్ కన్వీనర్లు వై.రామకృష్ణారావు – విజయవాడ, ఆర్. చంద్రశేఖర గుప్త – కదిరి, పాపిరెడ్డి – హైదరాబాద్, భావప్రచార పరిషత్ సంక్షిప్త నివేదికలు సమర్పించారు. సభికులందరూ బ్రహ్మీభూత స్వామి స్వాత్మానందజీ మహరాజ్, స్వామి పరమార్థానందజీ మహరాజ్‌లకు మౌనశ్రద్ధాంజలి ఘటించారు. ఈ ప్రారంభ సమావేశంలో చెన్నై శ్రీరామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి గౌతమానందజీ మాట్లాడుతూ 'ఆంధ్రప్రదేశ్‌లో జరిగే భక్తసమ్మేళనంలో పాల్గొనడం తనకెంతో ఆనందదాయకమనీ, వివేకానందస్వామి తెలిపిన ఒకే లక్ష్యం, ఒకే ధ్యేయం ఇచట పాల్గొనే భక్తులలో కనిపిస్తున్నదని' అన్నారు. కడప రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి ఆత్మవిదానందజీ ప్రసంగిస్తూ 'వంద సంవత్సరాల క్రితమే శ్రీరామకృష్ణులు కడపలో ఒక ముస్లిం భక్తుణ్ణి ప్రభావితం చేసి ఆంధ్రప్రదేశ్‌లో భావప్రచారానికి నాంది పలికారని' తెలిపారు. హైదరాబాద్ రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ 'మూర్తిత్రయ సందేశం ప్రతి ఇంటికీ చేర్చాలనే ఉద్దేశంతో సాహిత్యాన్ని అతి చౌక ధరలకే హైదరాబాద్ రామకృష్ణ మఠం అందిస్తుంద'ని చెప్పారు. విజయవాడ రామకృష్ణ మిషన్ కార్యదర్శి



భక్తులతో సంకీర్తనం చేయిస్తున్న స్వామి జ్ఞానదానందజీ



రాసలీల నృత్య ప్రదర్శన

భక్త సమ్మేళనానికి విచ్చేసిన శారదా మఠం మాతాజీలు, భక్తులు



స్వామి శశికాంతానందజీ మాట్లాడుతూ 'ఈ భక్త సమ్మేళనం అపూర్వం, అపురూపం అనీ, ఇది ఉపన్యాసాల వేదిక కాదు ఉపాసనా వచనాలనిచ్చే వేదిక అనీ' వర్ణించారు. రాజమండ్రి రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి అక్షరాత్మానందజీ 'పూర్వం దేవాలయాల్లో ప్రతీ సంవత్సరం జరిగే గ్రామోత్సవాల వలె ఈ సమ్మేళనం ఆంధ్రప్రదేశ్‌లో జరిగే వార్షికోత్సవం అనీ, రామకృష్ణ - శారదా మఠాల అడుగుజాడల్లో శ్రీరామకృష్ణ సేవాసమితులు గూడా నిర్వహించబడాలనీ' సూచించారు. అనంతపురం శాసన సభ్యులు శ్రీ బి.నారాయణ రెడ్డి మాట్లాడుతూ స్వామీజీల పాద ధూళి సోకిన ఈ ప్రాంతం పవిత్రమైందనీ, అనంతపురంలో నిర్మాణమయ్యే శ్రీరామకృష్ణ నూతన మందిరానికి తనవంతు సహాయ సహకారాల్ని అందిస్తానని చెప్పారు. కదిరి భక్తబృందం భజనలతో ప్రారంభ సమావేశం ముగిసింది. **సాయంత్రం 4.30 గంటలకు** ప్రవ్రాజిక భవానీప్రాణ మాతాజీ (శారదా మఠం, గుంటూరు) 'మానవత్వ దివ్యత్వపు మేలు కలయిక - శ్రీశారదాదేవి' అనే అంశపై మాట్లాడుతూ శారదాదేవి మానవత్వాన్నీ, దివ్యత్వాన్నీ సోదాహరణంగా వివరించారు. 'శ్రీరామకృష్ణులు రత్నాల్లాంటి శిష్యుల్ని ఎన్నుకొని శిక్షణనిచ్చారు. కానీ, శ్రీశారదాదేవి సీమల పుట్టల్లాగా ఉన్న ప్రజలను ఎన్నుకొని వారందరి బాధ్యతల్ని స్వయంగా స్వీకరించి 'ఆదర్శగురువు'గా నిలిచారని ప్రవ్రాజిక ధర్మాత్మప్రాణ మాతాజీ (గుంటూరు) అభివర్ణించారు. ప్రవ్రాజిక అచింత్యప్రాణ మాతాజీ (కోల్‌కత) 'శ్రీశారదామాత పలికిన ప్రతి మాట, దివ్యత్వపు మూట. తరతమ భేదాల్లేని ఆమె మాతృత్వపు ప్రేమ వెల్లువలో అందరినీ ముంచెత్తింద'ని తెలిపారు. 'యోగఃకర్మసు కౌశలం' అనే గీతోపదేశాన్ని శారదాదేవి తన జీవితంలో ఏ విధంగా ఆచరించి చూపారో సోదహరణంగా ప్రవ్రాజిక బోధమయప్రాణ మాతాజీ (గుంటూరు) వర్ణించారు. డాక్టర్ కమలా ఎస్. జయరావు 'అసహనం ఎక్కువగావున్న ఆధునిక మహిళలకు సహనమూర్తి శ్రీశారదాదేవి జీవితమే ఆదర్శమని' వివరించారు. స్వామి జ్ఞానదానందజీ తన దివ్యనామ స్మరణతో భక్తులందరినీ పరవశింపజేశారు. శ్రీరామకృష్ణ పరమహంస సందేశాలతో కూడిన 'యుగావతార్' వీడియో ప్రదర్శనతో ఈ సమావేశం ముగిసింది.



'శ్రీ రామకృష్ణ కథామృత సందేశం' గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న స్వామి గౌతమానందజీ

**డిసెంబర్ 3 :** ఉదయం ఉషోదయ సమావేశం శ్రీరామకృష్ణ సుప్రభాతం, శ్రీరామకృష్ణ కథామృత పఠనం, సంకీర్తనతో ప్రారంభమైంది. ఆ రోజు జరిగిన **ప్రథమ సమావేశం**లో స్వామి శశికాంతానందజీ 'భావప్రచార ఉద్యమంలో భక్తుల పాత్ర' వివరిస్తూ శ్రీరామకృష్ణ సంఘానికి ఒక కన్ను గృహస్థ భక్తులైతే, రెండో కన్ను సన్న్యాసులనీ అన్నారు. ఈ సంఘ నిర్వహణ అందరి బాధ్యతని గుర్తుచేస్తూ సమాజ జాడ్యాలను నిర్మూలించేందుకు శ్రీరామకృష్ణ సందేశం ఓ ఔషధం' అని వివరించారు. ఆధునిక జీవితంలో ప్రార్థనా ప్రభావాన్ని స్వామి శ్రీకాంతానందజీ వివరిస్తూ శ్రీరామకృష్ణులు జగజ్జననిని ఆవేదనతో ప్రార్థించి సాక్షాత్కరించుకొన్నారు. అలాగే అర్జునుడు శ్రీకృష్ణుణ్ణి ప్రార్థించడం వల్లనే విశ్వరూప దర్శనం సాధ్యమైందని ప్రార్థనా ప్రాముఖ్యాన్ని వివరించారు. 'సాధకుల కరదీపిక దైవంతో సహజీవనం' అంటూ డా॥ పి.వి.రెడ్డి (తిరుపతి) శ్రీరామకృష్ణులతో సహజీవనం గడిపి ధన్యులైన నాగమహాశయుడు, గిరీశ్ చంద్రఘోష్, వినోదిని మొదలైన భక్తుల జీవిత చరిత్రలే మనకు కరదీపికలని సూచించారు. ఆధునిక ప్రపంచానికి శ్రీరామకృష్ణ సందేశాన్ని స్వామి గౌతమానందజీ 'చేసే ప్రతి పనీ దైవకార్యంగా భావించి శ్రద్ధగా చేయడంవల్ల భగవంతుణ్ణి చేరుకోవచ్చని ఆధునిక ప్రపంచానికి శ్రీరామకృష్ణులిచ్చిన సందేశాన్ని వక్కాణించారు. 'పెద్దబాల శిక్ష' అనే అంశంపై స్వామి సుప్రియానందజీ ఆధ్యాత్మిక సాధనలో ఆహార నియమాల ప్రాముఖ్యతను వివరించారు. **ద్వితీయ సమావేశంలో** శ్రీరామకృష్ణులు గృహస్థులకూ, సన్న్యాసులకూ ఏ విధంగా శిక్షణనిచ్చారో స్వామి సుకృతానందజీ(కడప) విశదీకరించారు. స్వామి వివేకానంద పాశ్చాత్య తత్త్వవేత్తల రచనలను చదివి నాస్తికవాదం అలవరచుకొన్నప్పటికీ శ్రీరామకృష్ణుల సంగం ద్వారా ఏ విధంగా ఆస్తికత్వాన్ని పెంపొందించుకొన్నారో స్వామి తత్త్వమయానందజీ(త్రిసూర్)పేర్కొన్నారు. డాక్టర్ బి.మంగమ్మ (కర్నూల్)శ్రీరామకృష్ణులు మొదట చూపులోనే శిష్యుల అర్హతను తెలుసుకొని తనకు కావలసిన విధంగా శిష్యులను ఎలా మలచేవారో శ్రీరామకృష్ణుల మంత్రదీక్షా విధాన వైశిష్ట్యాన్ని వివరించారు. మనస్సనే పాలు సంసారమనే నీళ్ళలో కలవకుండా ఉండడం ఎలాగో శ్రీరామకృష్ణుల ఉపమానం ద్వారా 'పరమహంస పంచసూత్రాల్ని' స్వామి పరిజ్ఞేయా



'మహిషాసుర మర్దిని' నృత్య ప్రదర్శన



'స్వామీజీయే మాకు నేత' అని పాడుతూ నృత్యం చేస్తున్న చిన్నారులు

మహాశయుని కథామృతం' శ్రీరామకృష్ణుల భక్తులకు అందించిన అమృతమని కథామృత విశిష్టతను గుర్తుచేశారు. ఈ సమావేశం భావనపాడు భక్తబృందం భజనలతో ముగిసింది. **తృతీయ సమావేశం** యండగండి భక్తబృందం సంకీర్తనతో ప్రారంభమైంది. స్వామి నిత్యస్థానందజీ (మైసూర్) 'స్వామి వివేకానంద గొప్ప మానవతావాది అనీ, చేసే ప్రతిచర్య, పలుకు ఇతరులకు క్షేమం చేకూర్చేదిగా ఉండాలనీ స్వామి వివేకానంద ఇచ్చిన సందేశాన్ని వివరించారు. శ్రీరామకృష్ణుల అద్వైత తత్త్వం గురించి ఆర్. చంద్రశేఖర్ గుప్త(కదిరి) చెప్పారు. డాక్టర్ పి.మురళీకృష్ణ (తిరుపతి) స్వామి వివేకానంద బోధనలతో పాశ్చాత్య శిష్యులైన మెక్లౌడ్, గుడ్విన్, సోదరి నివేదిత ఎలా ప్రభావితులయ్యారో వివరించారు. స్వామి వివేకానంద ఇచ్చిన దరిద్ర నారాయణ, మూర్ఖ నారాయణ అనే మహామంత్రాల్ని గాంధీజీ తన జీవితంలో ఆచరించిన విధానాన్ని స్వామి గుణేశానందజీ (విశాఖపట్నం) తెలిపారు. డాక్టర్ పి.పి.వి.డి. నాగత్రిశూలపాణి (అనంతపురం) గీతాచార్యుడు బోధించిన చతుర్యోగాల్ని స్వామి వివేకానంద ఆచరణ యోగ్యం చేసిన విధానాన్ని వివరించారు. నిడదవోలు భక్తబృందం సంకీర్తనతో తృతీయ సమావేశం ముగిసింది. **చతుర్థ సమావేశంలో** డాక్టర్ కె.సుబ్రహ్మణ్యం (మధురై) శ్రీరాముడు నరోత్తముడు, శ్రీకృష్ణుడు పురుషోత్తముడు, శ్రీరామకృష్ణుడు 'భార్యాదేవోభవ' అనడం వలన సర్వోత్తముడైనాడని వివరించారు. ఇతరులు నిత్యజీవితంలో చేసే మంచి పనులను మెచ్చుకోవడం, ప్రోత్సహించడం కూడా త్యాగమే అంటూ నిత్య జీవితంలో వైరాగ్యం ఎలా అభ్యసించాలో స్వామి అక్షరాత్మానందజీ వివరించారు. శ్రీ నృత్య కళానిలయం (అనంతపురం) నిర్వహణలో శ్రీమతి జి. సంధ్యామూర్తి బాలల బృందం ప్రదర్శించిన శివతాండవం, కృష్ణలీలలు, మహిషాసుర మర్దిని నృత్య ప్రదర్శన భక్తులను విశేషంగా ఆకట్టుకుంది.

**డిసెంబర్ 4** : అనంతపురం భక్తబృందం భజనలతో ప్రథమ సమావేశం ప్రారంభమైంది. భాగవతంలో వర్ణించిన నవవిధ భక్తులను – శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం గురించి స్వామి వీరేశానందజీ (మైసూర్) వివరించారు. స్వామి బోధమయానందజీ (చెన్నై) నిత్య జీవితంలో మూర్తి త్రయ సందేశాల్ని ఆచరిస్తే మానవ కల్యాణం చేకూరుతుందని తెలిపారు. ప్రజల్లో పేదరికాన్ని రూపు మాపడానికీ, విద్య ద్వారా ప్రజల్ని జాగృతం చెయ్యడానికీ – స్వామీజీ ఇచ్చిన దరిద్ర దేవోభవ, మూర్ఖదేవోభవ అనే ఈ రెండు మంత్రాల్ని నేడు ప్రపంచమంతా ఆచరిస్తుందని స్వామి గౌతమా నందజీ స్వామీజీ సందేశ ప్రభావాన్ని విశ్లేషించారు. ఎమ్. నరసింహారెడ్డి(కదిరి)జీవిత ఆరంభం నుండి అంతం వరకు శ్రీరామకృష్ణులు పొందిన దివ్యభావ స్థితులను వివరించారు. దిరిసవంచ భక్తబృందం భజనలతో ఈ సమావేశం ముగిసింది. **ద్వితీయ సమావేశంలో** స్వామి స్వసంవేద్యానందజీ(రాంచి) తల్లికీ పిల్లలకీ ఉండే సంబంధమే విశ్వకుటుంబంలో శ్రీశారదాదేవికి, శిష్యులకు మధ్య ఉన్న సంబంధం అంటూ ప్రత్యక్ష శిష్యులతో శారదాదేవి అనుబంధాన్ని తెలిపారు. ఒక క్షణం సత్సంగం దొరికినా చాలు అది భవ సాగరాన్ని దాటించే నౌకలా సహాయపడుతుందని సత్సంగ మహిమను స్వామి జ్ఞానదానందజీ వివరించారు. స్వామి అచింత్యానందజీ(రాజమండ్రి)స్వామి శివానంద మహరాజ్ విశాఖపట్నం, కడప సందర్శించడం వల్ల ఆంధ్రదేశం పావనమైందని పేర్కొంటూ ఆయన జీవిత సందేశాల్ని వివరించారు. స్వామి ఈశప్రేమానందజీ(విజయవాడ)సత్యమంటే భగవంతుడు. సత్యాన్ని త్యజిస్తే భగవంతుణ్ణి త్యజించినట్లే అంటూ సత్యమేవ జయతే! అనే అంశంపై ప్రసంగించారు. శ్రీశారదామాత సమాధి స్థితులను తన వశంలో ఉంచుకున్న వైనాన్ని స్వామి జితకామా నందజీ(మైసూర్)వర్ణించారు. కుమారి లలిత(మారుటేరు) భక్తిగీతంతో ఈ సమావేశం ముగిసింది. **ముగింపు సమావేశంలో** భక్త సమ్మేళనం గురించి స్వామీజీలు, భక్తులు తమ అభిప్రాయాల్ని వెల్లడించారు. భక్తసమ్మేళన కార్య నిర్వాహక సంఘ కార్యదర్శి శ్రీ ఆర్.చంద్రశేఖర్ గుప్త(కదిరి)వందన సమర్పణ చేయగా **రామకృష్ణ శరణం** బృందగానంతో భక్త సమ్మేళనం విజయవంతంగా ముగిసింది. భక్త సమ్మేళనంలో పాల్గొన్న భక్తులు త్రిమూర్తుల సందేశామృతాన్ని తమ హృదయాల్లో నింపుకుని ఆనందంతో ఇల్లకు తిరిగి వెళ్ళారు. D



'రామకృష్ణ శరణం'తో చరణాలు కలిపి నృత్యం చేస్తున్న భక్తులు

.... 17 వ పేజీ తరువాయి

9

అలానే ప్రతి ద్వాదశి నాడూ ఆ పెద్ద మనిషి, చోకామేళుడి ఇంటికి వచ్చేవాడు. ఆయన సామాన్యుల హృదయాలలో నెలకొన్న సాక్షాత్తూ విఠలుడేనని ఆ దంపతులు గ్రహించారు. ఒక ద్వాదశి రోజు చోకామేళుడు మైమరచి నిద్రపోయాడు. కొంత సేపటికి హఠాత్తుగా లేచి.....

అరెరే! ఇదేమిటి! అలా నిద్రపోయానే! స్వామి వచ్చే సమయం అయింది తొందరగా వంట చేయి! నేను స్నానం చేసి వస్తాను.

అలాగే స్వామీ!

10

చంద్రభాగా నదిలో స్నానం చేయడానికి చోకామేళుడు వెళ్ళినప్పుడు అక్కడ ఉంటున్నవాళ్ళు ఆతణ్ణి అడ్డుకున్నారు.

అయ్యా! ఆరగింపు కోసం సాక్షాత్తూ భగవంతుడు మా ఇంటికి వచ్చాడు. ఆయనకు వడ్డించడానికి ముందు స్నానం చేసి వెళదామని వచ్చాను.

ఏమిటా ప్రేలాపనలు! భగవంతుడేమిటీ! నీ ఇంట భోజనం చేయడమేమిటి!?

చోకామేళుడు భగవంతుణ్ణి అవహేళన చేస్తున్నాడంటూ పండితులు ఆ దేశపు రాజు గారికి ఫిర్యాదు చేశారు.

11

చోకామేళుడు మహారాజు సమీక్షంలో హాజరు పరచబడ్డాడు.

నీ ఇంట ఆరగించడానికి భగవంతుడు వస్తున్నాడని నువ్వు చెప్పావా?

అవును మహారాజా!

మూర్ఖుడా! భగవంతుని పట్ల నీకు భయభక్తులే లేవే! ఎవరక్కడ? ఈతడు చేసిన అపచారానికి ప్రతిఫలంగా అడవిలో మదపుటెద్దుల మధ్య వీణ్ణి వదలండి. అవి తమ కొమ్ములతో ఈతణ్ణి పొడిచి చంపుతాయి!

రాజు గారి ఆజ్ఞ ప్రకారమే భటులు చోకామేళుణ్ణి అరణ్యంలో ఎడ్ల నడుమ వదిలారు. భక్తుడైన చోకామేళుడు ఏమవుతాడో అని ఒక భటుడు మాత్రం చాటున ఉండి గమనిస్తున్నాడు. చోకామేళుడు విఠలుణ్ణి స్మరిస్తూ, మైమరచి నామసంకీర్తన చేయసాగాడు. అప్పుడు....

12

విఠ్ఠల, విఠ్ఠల, పాండురంగ!

ఎంత ఆశ్చర్యం! మదపుటెద్దులు సైతం తన్మయత్వంతో చోకామేళుని చుట్టూ స్థాణువుల్లా నిలబడిపోయాయే!

**13** వెంటనే భటుడు వెళ్ళి, జరిగినదంతా మహారాజుకు చెప్పాడు. మహారాజు కూడా చోకామేళుని మహత్త్వాన్ని గ్రహించి, ఆతణ్ణి చూడడానికి పరుగున వచ్చి ఆతణ్ణి విడిపించాడు. చోకామేళుడు ఆనందంగా ఇంటికి తిరిగి వచ్చాడు.

ఎప్పటిలాగే ఒక ద్వాదశి నాడు ఆ దేవదేవుడు వృద్ధుని రూపంలో భోజనం ఆరగించడానికి చోకామేళుడి ఇంటికొచ్చాడు. అప్పుడు...




వీధిలో వెళుతున్న ఒక పండితుడు ఈ సంభాషణ మొత్తం విన్నాడు. నిమ్నజాతికి చెందిన చోకామేళుడు తన ఇంట భగవంతుడు ఆరగించాడని చెప్పడాన్ని ఆతడు సహించలేకపోయాడు. పట్టరాని కోపంతో చోకామేళుణ్ణి చెంపదెబ్బ కొట్టాడు. తరువాత ఆ పండితుడు స్నానం చేసి గుడికి వెళ్ళాడు.

**14** ఎంత ఆశ్చర్యం! ఆ పండితుడు గుడికి వెళ్ళేసరికి భగవంతుని చెంప వాచి ఉంది. దేవుడి పీతాంబరం మీద పెరుగు అంటుకుని ఉంది. వీటిని చూసి ఆ పండితుడితో పాటు అర్చకులూ, భక్తులూ ఆశ్చర్యచకితులయ్యారు. ఆ పండితుడు చోకామేళుని చెంపపై కొట్టడం వల్లనే భగవంతుని చెంప వాచిందని అందరూ గ్రహించారు.

**15** పూర్ణకుంభాది మర్యాదలతో చోకామేళుని తీసుకురావాలని పండరినాథుడు అర్చకులను ఆజ్ఞాపించాడు.




**16** *భక్తుడు:* బాహ్యనేత్రాలతో భగవంతుణ్ణి దర్శించడం సాధ్యమేనా?

*శ్రీరామకృష్ణులు:* "మామూలుగా బాహ్యనేత్రాలతో భగవంతుణ్ణి దర్శించలేం. అయితే, సాధన చేస్తున్నప్పుడు ప్రేమమయ శరీరమొకటి మనలో ఏర్పడుతుంది. ఆ శరీరానికి ప్రేమ మయమైన కళ్ళు, చెవులు ఉంటాయి. వాటి ద్వారా నువ్వు భగవంతుణ్ణి



దర్శించవచ్చు. భగవంతుని మాటలను వినవచ్చు. నా బిడ్డలారా! నిజంగానే భగవంతుని దర్శనం పొందవచ్చు. మనం ఎలా కూర్చొని మాట్లాడుకుంటున్నామో, అలాగే భగవంతుణ్ణి దర్శించి, ఆయనతో సంభాషించవచ్చు. నేను చెబుతున్నవి వట్టి ఉబుసుపోక మాటలు కావు, అక్షర సత్యాలు సుమా!"

– శ్రీ రామకృష్ణ పరమహంస

– భండారు పర్వతాలరావు



వివిధ దేవాలయాల విశిష్టతలు: బూదగవి

# వార్తల్లోకెక్కని విచిత్ర సూర్యదేవాలయం



**సూ**ర్యదేవాలయం అనగానే మనకు కోణార్క గానీ, అరసవిల్లి గానీ గుర్తుకు వస్తాయి. కానీ బూదగవి గుర్తుకురాదు. అనంతపురం జిల్లా ఉరవకొండ మండలంలో ఉన్న చిన్నపల్లె బూదగవి. ఆ పల్లెలోనూ ఒక ప్రాచీన సూర్యభగవానుని ఆలయం ఉంది. అయితే, అది శిథిలావస్థకు చేరుకొని, ఆలనా పాలనా లేకుండా ఉంది. స్థానిక పెద్దలు చెప్పేదాన్ని బట్టి ఈ ఆలయ నిర్మాణం 500 ఏళ్ళ క్రితం జరిగి ఉండవచ్చు.

ఈ ఆలయంలో అనేక విశిష్టతలు గోచరిస్తున్నాయి. ఆలయాలు దక్షిణ ముఖంగా ఉండడం అరుదు. ఈ గుడి దక్షిణ ముఖం అయితే ఇదే ఆలయంలో తూర్పు ముఖంగా శివలింగం ఉండడం విశేషం. దాదాపు నాలుగు అడుగుల ఎత్తున్న ఈ లింగంపై ఏదో ఒక ఆకారం చెక్కబడి ఉంది. గుడిమల్లంలోని పరశురామేశ్వర ఆలయం లాంటి వాటిలో తప్ప ఇతర ఆలయాల్లో లింగంపై వేరే ఆకారం ఉండడం కూడా అరుదే. ఇదే ఆకారం ఉరవకొండ మండల పరిధిలోని ప్రాచీన శివాలయాలన్నిటిలోనూ లింగాలపై కనిపిస్తుండడం గమనించదగ్గ విశేషం.

సూర్యభగవానుని విగ్రహం నిలుచున్న భంగిమలో ఉంది. మూలవరులకు ఇటు, అటు అమ్మవార్ల విగ్రహాలున్నాయి. మూడు విగ్రహాలూ ఒకే రాతిపై మలచి ఉండడం విశేషం. చాలా కాలం దాకా ఈ ఊరి వాళ్ళు దీన్ని రామాలయం అనుకునేవారు. పురావస్తు శాఖవారు వచ్చి, పరిశోధించి ఇది సూర్య దేవాలయమని తేల్చి, ఈ ఆలయాన్ని రక్షిత నిర్మాణంగా ప్రకటించారు. కానీ ఆలయ జీర్ణోద్ధరణకు ఎలాంటి చర్యా చేపట్టలేదు.

సూర్య విగ్రహానికి ఎదురుగా నేలపై పరిచిన బండలపై సూర్య నమస్కారాలు చేస్తున్న భంగిమలో ఒక భక్తుని ఆకారం చెక్కబడి ఉంది. ఈ గుడి సూర్యదేవాలయం అనుకొనడానికి ఇది కూడా దోహదం చేస్తోంది. మరొక విశేషం, ఈ దేవాలయంలో ఏ వైపు గోడయినా మూడు రాళ్ళతోనే నిర్మితమై ఉండడం ఆశ్చర్యకరం. ఆలయ వాస్తులోని ఈ ప్రత్యేకత అంతరార్థమేమిటో ఎవరూ చెప్పలేక పోతున్నారు. ఇలా చిన్నదే అయినా, అనేక ప్రత్యేకతలతో ఒప్పారే ఈ ఆలయ జీర్ణోద్ధరణకు ప్రభుత్వం, భక్త సమాజాలు నడుంకట్టాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ముందుగా కనీసం నిత్యపూజా నైవేద్యాలతో, [illegible] అభినందనీయమే.

# వార్తావాహిని

## వరద బాధితులకు విజయవాడ రామకృష్ణ మిషన్ సేవలు

కృష్ణా, గుంటూరు జిల్లాల్లో 2006 అక్టోబరులో సంభవించిన భారీ వర్షాల కారణంగా అనేక గ్రామాలు వరదలకు గురైయ్యాయి. విజయవాడ రామకృష్ణ మిషన్ వరద బాధితులకు తక్షణ ప్రాథమిక సహాయక సేవలు అందించింది. ఉంగుటూరు, మచిలీపట్నం, పామర్రు, కైకలూరు, పెదన, పమిడిముక్కల, చల్లపల్లి, తెనాలి, నగరం మండలాలకు చెందిన 33 గ్రామాల్లో నిత్యావసర వస్తువులను అందించింది. మొత్తం 3600 కుటుంబాలకు చెందిన 11,858 మంది లబ్ధి పొందారు. ఈ సేవల నిమిత్తం సుమారు పది లక్షల రూపాయలు ఖర్చయ్యింది. విరాళాలు అందించిన దాతలకూ, స్వచ్ఛంద సేవలందించిన కార్యకర్తలకూ విజయవాడ రామకృష్ణ మిషన్ తరఫున కృతజ్ఞతల్ని తెలియజేస్తున్నాం. L **– నివేదిక: స్వామి శశికాంతానంద**

## రామకృష్ణ మిషన్ సహాయక చర్యలు

**శ్రీలంక**లోని **బట్టికలోవా**లో నెలకొన్న రామకృష్ణ మిషన్ కేంద్రం సునామీ బాధితులకు పునరావాస పథకం చేపట్టింది. ఈ పథకం కింద మొత్తం 116 శాశ్వత గృహాలను నిర్మిస్తోంది. ఇందులో ఇప్పటి వరకు పూర్తయిన 24 గృహాలను బాధితులకు అప్పగించారు. మరో 92 ఇళ్ల నిర్మాణం కొనసాగుతోంది. I

**బీదసాదలకు సహాయం:** నిరుపేదలైన ప్రజల కోసం రామకృష్ణ మిషన్‌కు చెందిన పలు కేంద్రాలు సహాయ హస్తం అందించాయి. బారానగరం, బెల్గాం, చాప్రా, దేవఘర్, కతిహార్, పూరీ, శారదాపీఠ్ కేంద్రాలు మొత్తం 8,826 దుప్పట్లను బీదసాదలకు పంపిణీ చేశాయి. W

**ఉచిత నేత్ర వైద్య శిబిరం:** రామకృష్ణ మిషన్‌కు చెందిన పలు కేంద్రాలు ఉచిత నేత్ర వైద్య శిబిరాల్ని నిర్వహించాయి. బెల్గాం, చెంగల్పట్టు, మెదినీపూర్, ముంబాయి, ముజాఫర్‌పూర్, నారాయణపూర్, శ్యామలతాల్, శిల్చర్, అల్సూర్ కేంద్రాలు 3,059 శుక్లాల రోగులకు పరీక్షలు చేశారు. 519 మందికి ఉచితంగా ఇంట్రా ఆక్యులర్ లెన్స్ అమర్చి, మందులిచ్చారు. Z

## అల్సూర్(బెంగుళూరు)లో స్వామి వివేకానంద కాంస్య విగ్రహం:

అల్సూర్ రామకృష్ణ మఠం నిర్వహణలో నవంబర్ 4 వ తేదీన అల్సూర్ సరస్సు పార్కులో స్వామి వివేకానంద కాంస్య విగ్రహాన్ని కర్ణాటక ముఖ్యమంత్రి శ్రీకుమారస్వామి ఆవిష్కరించారు. E

## రాబోయే భక్తసమ్మేళనం హుజూర్‌నగర్‌లో



అనంతపురంలో 2006 డిసెంబర్ 3వ తేదీన రామకృష్ణ – వివేకానంద భావప్రచార పరిషత్ సంస్థాపర సమావేశం జరిగింది. ఈ సమావేశంలో ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ జిల్లాల నుండి రామకృష్ణ సేవాసమితుల కార్యకర్తలు, ఉపాధ్యక్ష స్వామీజీలు పాల్గొన్నారు. ఈ సమావేశంలో రాబోయే 17వ అర్థవార్షిక సమావేశం 2007 జూలైలో విజయవాడలోనూ, 17వ వార్షిక భక్తసమ్మేళనం 2007 డిసెంబర్‌లో హుజూర్‌నగర్ (నల్గొండ జిల్లా) లోనూ జరుపుటకు నిర్ణయింపబడినది. T

**– నివేదిక: డాక్టర్ పన్నాల శ్యామసుందరమూర్తి**

## విజయవాడలో ఉపాధ్యాయ, యువజన సదస్సులు

విజయవాడ రామకృష్ణ మిషన్ జాతీయ యువజన దినోత్సవం మరియు స్వామి వివేకానంద జయంతిని పురస్కరించుకొని 2006 నవంబరు 24 వ తేదీన ఉపాధ్యాయ సదస్సు మరియు 25 వ తేదీన యువజన సదస్సును రామకృష్ణ మిషన్ హై స్కూల్ సీతానగరంలో నిర్వహించింది. ఈ సదస్సుల్లో గుంటూరు, విజయవాడ, నూజివీడు మున్నగు పరిసర ప్రాంతాల నుండి 150 మంది ఉపాధ్యాయులు, 700 కు పైగా యువతీయువకులు పాల్గొన్నారు. ఈ సదస్సుల్లో స్వామి జగదాత్మానందజీ (అధ్యక్షులు, రామకృష్ణ శారదాశ్రమం, పొన్నంపేట, కర్ణాటక), స్వామి శాంతిమయానందజీ (రామకృష్ణ మఠం, బెంగుళూరు) డాక్టర్ పరిమి ఎస్.ఆర్. (ఇంజనీర్ మరియు విద్యావేత్త, విజయవాడ) సదస్సుల్లో పాల్గొని ఉపాధ్యాయులకూ యువతకూ స్ఫూర్తిదాయక సందేశాలనిచ్చారు.

స్వామి జగదాత్మానందజీ -Panchaseela of Education; డాక్టర్ పరిమి - How can you facilitate the Learning process? మరియు స్వామి శాంతిమయానందజీ -Unfoldment of Personality అనే అంశాలపై ప్రసంగించారు.

వివేకానంద సాహిత్యం మరియు వ్యక్తిత్వ వికాసానికి సంబంధించిన పుస్తకాలు తగ్గింపు ధరలకు అందించబడ్డాయి. వివేకానంద సాహిత్యం యువతకు ఉచితంగా ఇవ్వబడింది.

విజయవాడ రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి శశికాంతానందజీ స్వాగతోపన్యాసంలో ఐదేళ్ళ క్రితం రామకృష్ణ మిషన్ విజయవాడ కేంద్రం, ఆవిర్భవించిన నాటి నుండి ప్రతి ఏటా జరిగే ఈ సమ్మేళనాలు ముఖ్యంగా యువతను బాగా ఆకట్టుకొంటున్నందుకు సంతోషాన్ని వెలిబుచ్చారు. స్వామి సుప్రియానందజీ వందన సమర్పణతో ఈ సమ్మేళనాలు ముగిసాయి. A

**– నివేదిక: బ్రహ్మచారి శివేశచైతన్య**



# సురభి



**నేను (స్వామి శాంతానంద):** జీవిత లక్ష్యమేమిటి?

**మాతృదేవి:** భగవదనుభూతి పొందడం, సదా సర్వ వేళలా ఆయన పాదపద్మాల మీద మనస్సు నిలపడం.

సాధకునికి ఇష్టానిష్టాలు ఉండరాదు. అతడు అన్నిటినీ సహించాలి. గురుదేవులు హృదయ్‌తో, 'నా మాటల్ని నువ్వు సహించు, నీ మాటలు నేను సహిస్తాను. అప్పుడే సరి పోతుంది. లేకపోతే మనల్ని రాజీ చేయడానికి ఆలయ అధికారులు కావాల్సి వస్తుంది' అనేవారు.

**నేను:** అమ్మా! కొద్దిగా ప్రాణాయామం చేస్తున్నాను. చేయనా?

**మాతృదేవి:** కొద్ది కొద్దిగా చేయి, ఎక్కువగా చేసి మెదడును వేడెక్కించడం మంచిది కాదు. మనస్సు దానంతట అదే వశపడినప్పుడు ఇక ప్రాణాయామం ఎందుకు?

**నేను:** కుండలిని జాగృతి పొందకపోతే ఎలాంటి ప్రయోజనమూ లేదు.

**మాతృదేవి:** జాగృతి పొందుతుంది. భగవంతుని నామజపం చేసేకొద్దీ అన్నీ సిద్ధిస్తాయి. మనస్సు వశం కాకుండా పోయినా ఒకచోట కూర్చొని, జపం చేయవచ్చు కదా! కుండలిని జాగృతి పొందడానికి ముందుగా అనాహత ధ్వని వినిపిస్తుంది. జగజ్జనని అనుగ్రహం లేకుండా ఏదీ జరగదు.

కాశీ విశ్వనాథుని దర్శనం అసంభవమని నాకొకసారి అనిపించింది. ఎందుకంటే ఆ శివలింగం చాలా చిన్నది. పైగా ఎల్లప్పుడూ బిల్వదళాలతో మూయబడి ఉంటుంది. ఈ స్థితిలో ఆయన దర్శనం ఎలా సాధ్యమవుతుంది! ఇలా మనస్సులో ఆలోచనలు చెలరేగాయి. హఠాత్తుగా చూస్తే నా దగ్గర నల్లని ఒక శివలింగం – విశ్వనాథుడే. ఒక భక్తురాలు శివుని శిరస్సును స్పృశిస్తూండడం చూశాను. నేను కూడా త్వరగా వెళ్ళి వారి శిరస్సు స్పృశించాను.

**నేను:** అమ్మా! రాతితో మలచబడిన శివలింగం నాకు నచ్చదు.

**మాతృదేవి:** ఇవేం మాటలు నాయనా! ఎందరో కాశీకి వస్తున్నారు. విశ్వనాథుణ్ణి స్పృశించి ఉన్నతులవు తున్నారు. ఎలాంటి ఇష్టానిష్టాలూ లేకుండా విశ్వనాథుడు వారి పాపాలనన్నిటినీ స్వీకరిస్తున్నాడు.

**నేను:** భగవంతుడే అందరి తల్లీ తండ్రీ అయినప్పుడు ఆయన ఎందుకు మనల్ని పాపాలు చేయని స్తున్నాడు?

**మాతృదేవి:** ఆయనే ఈ జీవరాశు లన్నిటిగా పరిణమించి ఉన్నారనడం సత్యమే. కానీ ప్రతి ఒక్కరూ తమ సంస్కారాలకు తగ్గట్లు, పనులకు తగ్గట్లు కర్మఫలాన్ని అనుభవిస్తున్నారు. సూర్యుడొక్కడే అయినా ఆతని కిరణాలు ప్రతిఫలించడం స్థలమూ, పదార్థమూ, స్వభావానికీ తగ్గట్లు మారుతుంది.

**నేను:** అమ్మా! నాకు ధ్యానం చక్కగా కుదరాలనీ, అందులోనే మగ్నమై ఉండాలనీ ఆశీర్వదించండి.

మాతృదేవి నా శిరస్సుపై తమ చేయి ఉంచి, "నిత్యా నిత్యాలను గురించి ఎల్లప్పుడూ విచారణ చేస్తూ ఉండు" అంటూ ఆశీర్వదించారు. B

***(శారదాదేవి శిష్యులైన స్వామి శాంతానంద స్మృతుల నుంచి)***

Printed and published by Swami Jnanadananda owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

# భక్తులకు సదవకాశం

రామకృష్ణ సంఘు తెలుగు ప్రచురణ విభాగం చెన్నై నుండి హైదరాబాదుకు తరలివస్తున్న సందర్భంగా రామకృష్ణ మఠం, హైదరాబాదు వారు రామకృష్ణ-వివేకానంద సాహిత్యంపై భారీ రాయితీ కల్పించి తెలుగుప్రజలకు అందజేస్తున్నారు. ఆస్తిక మహాశయులు ఈ సదవకాశాన్ని వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము.

## రాయితీ కల్పించబడిన పుస్తకములు ; వాటి అసలు ధర, తగ్గింపుధరలతో సహా












| క్ర. సం. | పుస్తకం పేరు | అసలు ధర రూ-పై | తగ్గింపు ధర రూ-పై |
|---|---|---|---|
| 1. | శ్రీ రామకృష్ణ బోధామృతము | 50-00 | 20-00 |
| 2. | పరమావధికి మార్గము | 30-00 | 05-00 |
| 3. | శ్రీ వివేకానంద లేఖావళి | 50-00 | 10-00 |
| 4. | కొలంబో - ఆల్మోరా ఉపన్యాసాలు | 60-00 | 20-00 |
| 5. | వ్యక్తిత్వ వికాసం | 15-00 | 05-00 |
| 6. | రాజయోగం | 12-00 | 05-00 |
| 7. | భక్తి యోగం | 15-00 | 05-00 |
| 8. | కర్మ యోగం | 15-00 | 05-00 |
| 9. | జ్ఞాన యోగం | 40-00 | 15-00 |
| 10. | ధ్యానం దాని పద్ధతులు | 15-00 | 05-00 |
| 11. | శ్రీ వివేకానంద జీవితం మహాత్మ్యం | 15-00 | 04-00 |
| 12. | సోదర సోదరీమణులారా | 55-00 | 20-00 |
| 13. | నా భారతం అమర భారతం | 25-00 | 05-00 |
| 14. | లేవండి మేల్కొనండి (పది సంపుటములు) | 475-00 | 100-00 |
| 15. | శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 40-00 | 10-00 |
| 16. | శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర | 45-00 | 15-00 |
| 17. | స్వామి - శిష్య సంవాదములు | 50-00 | 20-00 |
| 18. | భారత జాతికి నా హితవు | 12-00 | 03-00 |
| 19. | శ్రీ రామకృష్ణ కథామృతం(3 సంపుటములు) | 300-00 | 75-00 |
| 20 | శ్రీ రామకృష్ణ పరమహంస(2 సంపుటములు) | 200-00 | 40-00 |
| 21. | శ్రీ శారదాదేవి వచనామృతం, చరితామృతం (2 పుస్తకములు) | 180-00 | 25-00 |
| 22. | షికాగో నగరోపన్యాసములు | 07-00 | 02-00 |
| 23. | హనుమాన్ చాలీసా | 10-00 | 02-00 |














## రామకృష్ణ మఠం

దోమల్‌గూడ, హైదరాబాదు - 500 029.
ఫోన్ : 27633936, 27633937
e-mail : rkmath_hyd@yahoo.com

NSJ PRESS CELL : 93475 22222

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) 'వేదచూడామణి'** : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము

యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.

వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య

స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

**(ఆ) 'వేదార్థచూడామణి'** : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము

యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.

వయస్సు : 15 సం॥, ఆ పైన

స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) వేదాధ్యాపకుడు** : (సామవేదము/ అథర్వవేదము – వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)

కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము

అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవము : 2 సంవత్సరములు

సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

**(ఆ) వేదభాష్యాచార్యుడు** : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)

విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత

అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవార్హత : 5 సం॥

సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 – 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

కులప్రశాసకుడు

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

ఫిబ్రవరి 2007 వెల : రూ. 8

మనసున్న మనిషిలా మారాలంటే!

ఆత్మవిశ్వాసానికి 'నిక్' నేమ్



# సుబోధ



**భక్తుడు:** ఏ రూపాన్ని దృష్టిలో ఉంచుకొని ధ్యానం చెయ్యాలి?

**శ్రీరామకృష్ణులు:** ఏ రూపం చేత ఎక్కువగా ఆకర్షితుడవవుతావో, ఆ రూపాన్ని మనస్సులో పూర్తిగా నిలుపుకో. అన్ని రూపాలూ పరబ్రహ్మమే అని గ్రహించినవాడు కృతార్థుడవుతాడు. మానవ రూపంలో ఉన్న అవతారాలన్నీ ఆయన నీడలు మాత్రమే అని గ్రహించాలి.

**భక్తుడు:** భగవంతుణ్ణి మనం కళ్ళతో చూడ గలమా?

**శ్రీరామకృష్ణులు:** దైవకృప కలిగినప్పుడు దేవుడు దివ్యనేత్రాలు ప్రసాదిస్తాడు. ఈ భౌతికమైన కళ్ళతో చూడలేం. అర్జునునికి కూడా దివ్య చక్షువులు ప్రసాదించి, పిమ్మట తన విశ్వరూపాన్ని ప్రదర్శించాడు కృష్ణుడు. రాగభక్తి కలవాడికి దైవకృప తప్పకుండా సిద్ధిస్తుంది. ప్రతిఫలం ఆశించకుండా ప్రేమించడం వీరి స్వభావం.

**భక్తుడు:** మేమంతా సామాన్యులం. ఎన్నో పాపాలు చేస్తుంటాం. మా గతి ఏమవుతుంది?

**శ్రీరామకృష్ణులు:** చెట్లను ఆశ్రయించిన పక్షులు రెండు చేతులతో చప్పట్లు కొట్టగానే ఎలా ఎగిరిపోతాయో భగవన్నామం ఉచ్చరించడం వల్ల మానవులు చేసే పాపకర్మలు అలాగే వదలి పోతాయి. భగవన్నామమే చప్పట్లు. పాపాలే పక్షులు. శరీరం చెట్టు లాంటిది. సూర్యరశ్మి వల్ల చెరువులోని నీరు ఆవిరి అయినట్లు, భగవన్నామ సంకీర్తనం వల్ల పాపాలు ఆవిరి అయిపోతాయి.

**భక్తుడు:** దేవుడు మమ్మల్ని ఈ సంసారంలో ఎందుకు దింపాడు?

**శ్రీరామకృష్ణులు:** సంసారం కర్మక్షేత్రం. కర్మల ద్వారా జ్ఞానాన్ని సముపార్జించవచ్చు. చేయదగిన కర్మల, చేయరాని కర్మల గురించి గురువు ఉపదేశిస్తాడు. అంతేగాక నిష్కామకర్మ చేయాల్సిందిగా గురువు శిష్యులకు బోధిస్తాడు. కర్మ చేసేకొద్దీ మనోమాలిన్యం నశిస్తుంది. సమర్థుడైన వైద్యుడి సలహా మేరకు ఔషధం పుచ్చుకొని రోగాన్ని నయం చేసుకోవడం లాంటిది ఇది.

**భక్తుడు:** భగవంతుడు మమ్మల్ని సంసారం నుండి ఎందుకు విముక్తుల్ని చేయకున్నాడు?

**శ్రీరామకృష్ణులు:** ఈ కామినీ కాంచనాల్ని అనుభవించాలన్న కోరిక వదలిపోయినప్పుడు మనల్ని ఆయన సంసారం నుండి విముక్తుణ్ణి చేస్తాడు. ఒకసారి ఆసుపత్రిలో పేరు నమోదు చేసుకొన్నాక సదరు వ్యక్తి అక్కడ నుండి ఎక్కడికీ వెళ్ళలేడు. రోగం నయం కానిదే అతడు వెళ్ళడానికి వైద్యుడు అనుమతి ఇవ్వడు. P

**('శ్రీరామకృష్ణ కథామృతం' నుంచి)**



నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద** సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**

**శ్రీ రామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**

**ఫోన్: 040–2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com**



# శ్రీ బాలాజీ ఆరోగ్యవరప్రసాదిని పథకం (svims)







శ్రీ వేంకటేశుని నివాసస్థలమైన తిరుమల గొప్ప యాత్రా స్థలంగా పేరుగాంచింది. రోజూ అసంఖ్యాకులైన భక్తులూ, యాత్రికులూ లౌకిక-పారలౌకిక క్షేమానికై పవిత్రమైన ఏడుకొండలూ ఎక్కి తమ మొక్కులు తీర్చుకుంటారు.

మానవజాతికి అంకితమైన *టిటిడి* సేవలలో మానవ జీవితంలోని క్లేశాలను ఉపశమింప చేసే ప్రయత్నం ముఖ్యంగా చెప్పతగ్గది. టిటిడి ఇప్పటికే కుష్టువ్యాధితో బాధపడేవారి కోసం ఒక లెప్రొసేరియమ్, శారీరకమైన లోపాలుగల వారి కోసం ఒక కేంద్రం, పేదలకోసం ఒక శరణాలయం, ఒక ప్రాథమిక వైద్యశాలలను నిర్వహిస్తోంది. పేదలకి అత్యంత ఆధునిక వైద్య సహాయం అందజేయటానికి, భగవంతుని అనుగ్రహం వలన **టిటిడి** – కొత్త ఢిల్లీలోని AIIMS, పాండిచ్చేరిలోని JIPMER, చండీగఢ్‌లోని PGIMS లకి సమానమైన– 'శ్రీ వేంకటేశ్వర ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్' అనే సూపర్ స్పెషాలిటీ కేంద్రాన్ని ప్రారంభించింది. సర్వతోముఖమైన మానవ సంక్షేమం దీని లక్ష్యం; రోగనివారణకై సేవ-పరిచర్యలు చేయడంతోపాటు శ్రీవెంకటేశ్వర ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌వారు వైద్య విద్య బోధించడం, ట్రైనింగ్ (శిక్షణ) ఇయ్యటం, శాస్త్రీయమైన పరిశోధన– అభివృద్ధిల కోసం తగిన సౌకర్యాలను కల్పించడం కూడా చేస్తున్నారు. సమాజంలో సాటివారైన అభాగ్యులకీ, వికలాంగులకీ ఈ ఉన్నతమైన సాంకేతిక వైద్య సహాయం అందించాలని దేవస్థానంవారు గాఢంగా వాంఛిస్తున్నారు.

ఈ లక్ష్యసాధనకై శ్రీవేంకటేశ్వర మెడికల్ సైన్సెస్‌వారు **'శ్రీబాలాజీ ఆరోగ్య వరప్రసాదిని'** అనే ఒక కొత్త పథకం ప్రారంభించారు. ప్రతి ఒక్కరికీ అందుబాటులో ఉండే ధరలతో అధునాతన వైద్య సదుపాయాలు అందించడం దీని లక్ష్యం. సహృదయులైన దాతలను, ప్రజలను ఈ లక్ష్యసాధనలో మాకు తోడ్పడమని కోరుతున్నాము.

## విరాళం వివరాలు

ఈ పథకం కోసం కనీసం రూ॥1,000/- విరాళంగా ఇవ్వాలి. రూ. 1,000/–కి తక్కువగా ఉన్న విరాళాలను దాతలకు తెలియ బరచకుండానే శ్రీవారి హుండీ ఎకౌంట్‌లో వేయడం జరుగుతుంది. విరాళాలన్నింటినీ ఒక జాతీయ బ్యాంకులో డిపాజిట్ చేసి, వాటిపై





వచ్చే వడ్డీని ఈ పథకం కోసం ఉపయోగించడం జరుగుతుంది. విరాళంగా ఇచ్చే సొమ్ము **"కార్యనిర్వహణాధికారి, శ్రీ బాలాజీ ఆరోగ్య వరప్రసాదిని స్కీమ్** (SVIMS), **టిటిడి, తిరుపతి"** పేర్న చెక్కు / డిడి తీసి **"డైరెక్టర్, శ్రీవేంకటేశ్వర ఇన్స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్, టిటిడి, తిరుపతి** –517 501" అనే చిరునామాకు పంపగలరు. ఫోన్: 0877–2286131 లేక 2287152.

**వ్యక్తులపేర్నకానీ, కంపెనీ లేక సంస్థల పేరుతోకానీ విరాళాలు పంపవచ్చు. ఈ స్కీములో ప్రస్తుతానికి ఆదాయపు పన్ను మినహాయింపు లేదు.**

## ఈ పథకంలోని ముఖ్యాంశాలు

- రూ॥ లక్ష లేక అంతకు పైన విరాళమిచ్చే దాత పేరు ఆస్పత్రిలోని రిసెప్షన్ హాలులో ప్రదర్శించడం;
- రూ॥ ఐదు లక్షలు లేక అంతకుపైన విరాళమిచ్చే దాత పేరు డబ్బు చెల్లించే గదులకి పెట్టడం;
- రూ॥ ఐదు లక్షలు లేక అంతకుపైన విరాళమిచ్చే దాత సంవత్సరానికొక పెద్ద ఆపరేషన్ స్పాన్సర్ చెయ్యవచ్చు.
- రూ॥ 15 లక్షలు విరాళమిచ్చే దాతపేరు ఒక విభాగానికి పెట్టడం;
- రూ॥15 లక్షలు విరాళమిచ్చే దాతపేరు ఒక కాంప్లెక్స్‌కి పెట్టడం;
- రూ॥ ఒక కోటి విరాళమిచ్చే దాతపేరు పి.జి. హాస్టల్‌లోని ఒక విభాగానికి కానీ, ఆపరేషన్ థియేటర్‌కి కానీ, నర్సుల హాస్టల్ భవనానికి కానీ లేక రోగికి తోడుగా వచ్చేవారు ఉండే సత్రానికి కానీ పెట్టడం;
- రూ॥ 5 కోట్లు లేక అంతకు పైన విరాళమిచ్చే దాత పేరు ఆడిటోరియమ్‌కి కానీ, లేక లైబ్రరీ భవనానికి పెట్టడం;
- రూ॥ 10 లక్షలు అంతకుపైన విరాళమిచ్చే దాత పేరుతో శ్రీ వేంకటేశ్వర ఇన్స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌లో ఒక విద్యాపీఠం నెలకొల్పటం జరుగుతుంది; ఇవి కేవలం పరిశోధనా విభాగానికి చెందినవై ఉంటాయి.
- దాతలు SVIMSకి ఆవశ్యకమైన వస్తువులు, వాహనాలు విరాళంగా ఈయవచ్చు; లేక గ్రామీణ ప్రాంతాలలో జరిగే హెల్త్ కేంప్ ఒకటి స్పాన్సర్ చేయవచ్చు.

## అదనపు సౌకర్యాలు

రూ॥ 5 లక్షలు లేక అంతకుపైన విరాళమిచ్చే దాతలకు క్రింది సౌకర్యాలు కల్పిస్తాము: దాతకీ, దాతకుటుంబానికి సంవత్సరంలో మూడు రోజులు (వరుసగా కానీ, మూడు వేర్వేరు రోజులుకానీ) వీలుని బట్టి **ఎఆర్‌పి** కౌంటర్‌లో ఉచిత బస సౌకర్యం లేక వీలును బట్టి, డబ్బు చెల్లించే పద్ధతిలో **విఐపి** బసవసతి కల్పిస్తాము. దాతకి, దాతకుటుంబానికి (అయిదుగురికి మించకుండా) సంవత్సరానికి మూడురోజులు (వరుసగా లేక మూడు వేర్వేరు దినాల్లో) వైకుంఠం ఒకటో క్యూ కాంప్లెక్సు సెల్లార్ గుండా దర్శనానికి అనుమతిస్తాము. సంవత్సరానికి ఒకమారు దర్శనానికి వచ్చినప్పుడు దాతకు10 చిన్న లడ్లు ప్రసాదంగా ఇస్తాము. దాత దర్శనానికి వచ్చినప్పుడు సంవత్సరానికి ఒకమారు ఒక శాలువాను బహుమానంగా ఇస్తాము.

**దాత మొదటిమారు దర్శనానికి వచ్చినప్పుడు శ్రీవారు, పద్మావతీ అమ్మవారి బొమ్మలుగల బంగారుపూత పూసిన ఒక వెండి పతకం ఒకటి ఇస్తాము.**

ఈ సౌకర్యాలన్నీ దాతకు జీవితపర్యంతమూ, కంపెనీలకు 20 సంవత్సరాలవరకూ కల్పించబడతాయి.





R.O.C.NO: PR4/13721/PRO/03



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకుగాను 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయ మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు** ..... రూ. 10,000/- అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు** ............రూ. 5,000/- అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**..................రూ. 1,000/- అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| | | *ఇప్పటి వరకు వసూలైన మొత్తం .....* | 8,34,023 |
| పోషకులు : | శ్రీ కె. నాగేశ్వరరావు | పరవాడ, విశాఖపట్నం - 531 021 | 1,000 |
| | శ్రీమతి కె.వి. విజయలక్ష్మి | బెర్‌క్రై, హోసూర్ తాలుకా, కృష్ణగిరి జిల్లా - 635 105. | 1,000 |
| | శ్రీ డి.వి. బ్రహ్మాజీ | బాపట్ల, గుంటూరు జిల్లా. | 1,000 |
| | శ్రీ ఎమ్. అప్పలస్వామి | రాజాం, శ్రీకాకుళం జిల్లా. | 1,000 |
| | శ్రీ వి. వేంకటరమణ | చింతలవలస, విజయనగరం జిల్లా - 535 005. | 1,100 |
| | | మొత్తం ... | 8,39,123 |



గమనిక: చెక్కు, డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో 'Sri Ramakrishna Prabha Permanent Fund', Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా:
**President, Ramakrishna Math, Domalguda, Hyderabad- 500 029.**

# శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి మీ పేరు మీద పది మందీ మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥ 600/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ళ పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు) ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. ***కనీసం రెండు గ్రంథాలయాలకు తక్కువ కాకుండా*** చందా కట్టిన దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపబోయే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ'లో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| 1240 | శ్రీమతి జి. అనసూయ రెడ్డి, కెనడా | జిల్లాపరిషత్ హై స్కూల్, కర్వేటి నగర్, చిత్తూర్ జిల్లా - 517 582. |
| 1241 | శ్రీ ఎమ్. ఆదినారాయణ, హైదరాబాద్ - 500 060. | జిల్లాబోర్డ్ హై స్కూల్, కైకారమ్, పశ్చిమ గోదావరి జిల్లా - 534 416. |
| 1242 | " " | జిల్లాబోర్డ్ హై స్కూల్, భీమడోలు, పశ్చిమ గోదావరి జిల్లా. |
| 1243 | శ్రీ శ్రీకాంత్, శ్రీమతి కృష్ణవేణి నందూరి, అమెరికా | గవర్నమెంట్ డిగ్రీ కాలేజ్, శృంగవరపు కోట, విజయనగరం జిల్లా - 532 591 |
| 1244 | " " | మల్లెల సంజీవయ్య మెమోరియల్ మున్సిపల్ హై స్కూల్, నెల్లూర్- 524 002 |
| 1245 | శ్రీ. కె. కృష్ణానందం, విశాఖపట్నం - 530 043. | ఆదర్శ లా కాలేజ్, హనుమకొండ, వరంగల్ - 506 001. |
| 1246 | " " | అఖిల భారతి లా కాలేజ్, హనుమకొండ, వరంగల్ - 506 001. |
| 1247 | శ్రీ. టి. వేంకటనారాయణ, పాలకొల్లు, ప.గో.జిల్లా. | జిల్లాపరిషత్ హై స్కూల్, ఎలమంచిలి, ప.గో.జిల్లా-534 268. |

గమనిక: డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో 'Sri Ramakrishna Prabha Library Fund Scheme', Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా: **President, Ramakrishna Math, Domalguda, Hyderabad -500 029**

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 64 | సంచిక: 2 | ఫిబ్రవరి 2007

"ప్రతి జీవిలోనూ దివ్యత్వం గర్భితంగా ఉంది. అంతర్గతంగా ఉన్న ఆ దివ్యత్వాన్ని వ్యక్తం చేయడమే జీవిత పరమావధి." - స్వామి వివేకానంద

## ప్రార్థన

ఏ వేదంబు పఠించెలూత,
భుజగంబే శాస్త్రముల్సూచె దా/
నే విద్యాభ్యసనం బొనర్చె గరి,
చెంచే మంత్రమూహించె, బో/
ధావిర్భావ నిదానముల్ చదువులయ్యా?
కావు! మీ పాద సం/ సేవాసక్తియె కాక
జంతుతతికిన్, శ్రీకాళహస్తీశ్వరా!

నిన్నున్నమ్మినరీతి నమ్మనొరులన్,
నీకన్న నాకెన్న లే/ రన్నల్దమ్ములు తల్లిదండ్రులు
గురుం డాపత్సహాయుండు నా/
యన్నా! యెన్నడు నన్ను సంసృతి
విషాదాంబోధి దాటించు య/
చ్ఛిన్నానంద సుఖాబ్ధిదేల్చెదోకదే
శ్రీకాళహస్తీశ్వరా!

– ధూర్జటి మహాకవి రచించిన
'శ్రీకాళహస్తీశ్వర శతకం' నుంచి

## ఈ సంచికలో...



**ముఖచిత్రం**: అచల కైలాసాన్నీ, నిశ్చల మానసాన్నీ స్ఫురింపజేసే విమల పరమహంస





**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
**Domalguda , Hyderabad - 500 029. Andhra Pradesh**
**Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com**

## చందా వివరాలు

| | ఇండియాలో | విదేశాలకు |
|---|---|---|
| విడి ప్రతి | : రూ. 8 | - |
| ఒక సంవత్సర చందా | : రూ. 85 | $15 |
| మూడు సంవత్సరాలకు | : రూ. 240 | $45 |
| ఐదు సంవత్సరాలకు | : రూ. 380 | $75 |
| ఇరవై సంవత్సరాలకు | : రూ. 1200 | $350 |



సంపాదకీయం:

ఈ నెల 19న శ్రీ రామకృష్ణ పరమహంస జయంతి

# మనసున్న మనిషిలా మారాలంటే!

సర్వధర్మ సాధనా వరిష్ఠుడూ, త్యాగానికి పరాకాష్ఠ అయిన శ్రీరామకృష్ణ పరమహంస జీవిత గాథను చదివిన వారి ఒడలు పులకరించక మానదు; మనస్సు ఆనందానుభూతులకు లోనుగాక మానదు. కానీ ఆయనను అనుసరించడం అనే మాటకొస్తే సామాన్యులకు సాధ్యమేనా? ఆయనంత తీవ్రంగా భగవంతుని కోసం మనం తపించగలమా? ఆయనలా భగవంతుని పట్ల సంపూర్ణ శరణాగతినీ, అచంచల భక్తివిశ్వాసాలనూ అలవరచుకోగలమా? మట్టి, బంగారం రెండూ సమానమే అని ఆయనలా త్యజించగలమా? మరి ఆయనలా తీవ్ర సాధనల్ని అనుష్ఠించగలమా?..ఇలా మదిలో మెదిలే ప్రశ్నలు ఎన్నెన్నో!

శ్రీరామకృష్ణునిలా 'ఆధ్యాత్మిక శిఖరాలను అధిరోహించాలి, దైవత్వాన్ని పొందాలి' అనే ఆలోచనల్ని ప్రక్కనపెట్టి దైవత్వాని కన్నా ముందు మానవత్వం ఉన్న మనిషిలా మారడం నేర్చుకోవాలి. ప్రస్తుత సమాజంలో అవతారపురుషులకూ, గురువులకూ, ఆచార్యులకూ కొదవ లేదు. ఇప్పుడు ఉన్న కొరతల్లా మానవత్వం ఉన్న మనుషులే! కాబట్టి ఆ కొరత తీరాలంటే ముందు మనం మనసున్న మనుషులుగా మారాలి. ఆ తరువాతే దైవత్వం గురించి చర్చ.

మానవతా దృక్పథాన్ని అలవరచుకోవడానికి శ్రీరామకృష్ణుల జీవితం మనకు ఎలా దోహదపడుతుందో తెలియజేసే కొన్ని అంశాల్ని పరిశీలిద్దాం.

**ఆదర్శపుత్రునిగా:** దైవసమానులైన తల్లితండ్రులను నిరాదరిస్తూ ఎక్కడో ఉన్న దేవుణ్ణి కొలవడానికి గుళ్ళూ, గోపురాలకు తిరిగే సంతానాన్ని నేటి సమాజంలో మనం చూస్తున్నాం. జన్మనిచ్చి, విద్యాబుద్ధుల్ని నేర్పించి, ప్రయోజకుల్ని చేసిన తల్లితండ్రులను అనాథల్లా వృద్ధాశ్రమాలకు తరలిస్తున్న పుత్రరత్నాల సంఖ్య నానాటికీ పెరుగుతోంది. అలాంటి వారు తల్లితండ్రులను ప్రేమానురాగాలతో సేవిస్తూ ఎలా ఆదరించాలో శ్రీరామకృష్ణులు తన జీవితంలో ఆచరించి చూపారు. అలాంటి ఓ సంఘటనను గుర్తు చేసుకొందాం.

ఒకసారి శ్రీరామకృష్ణులు తీర్థయాత్రలకు వెళ్ళినప్పుడు బృందావనంలో గంగామాయి అనే ఒక వృద్ధురాల్ని కలుసుకున్నారు. ఆమె చాలా ఏళ్ళుగా బృందావనంలోనే సాధనలు చేస్తోంది. ఆధ్యాత్మికంగా ఎంతో ఉన్నతిని పొందిన ఆ మహాభక్తురాలి భక్తి పారవశ్య స్థితుల్ని చూసి శ్రీరామకృష్ణులు ఎంతో ముగ్ధులయ్యారు. శ్రీరామకృష్ణులు తనతో ఉండడం వల్ల తన తపస్సు ఫలించిందని ఆమె ఆనంద పరవశురాలయ్యేది. చివరికి గంగామాయి చూపిన ప్రేమానురాగాల ఫలితంగా శ్రీరామకృష్ణులు ఆమెతో పాటు బృందావనంలోనే ఉండిపోయారు.

ఇలా కొద్దిరోజులు గడిచాక ఒకరోజు హఠాత్తుగా శ్రీరామకృష్ణులకు దక్షిణేశ్వరంలో ఒంటరిగా ఉంటున్న తల్లి చంద్రమణీదేవి జ్ఞాపకం వచ్చింది. వృద్ధాప్యంలో ఆమెను చూసుకొనే వారెవరూ లేక ఎంత కష్టపడుతోందో అని తల్లి తలంపు మదిలో మెదలగానే ఒక్క నిమిషం కూడా అక్కడ ఉండలేక పోయారు. వెంటనే కలకత్తాకు బయలుదేరి వచ్చేశారు.

ఆదర్శపుత్రునిగా శ్రీరామకృష్ణుల్ని అనుసరించిన నాడు హృదయమనే కావడిలో తల్లితండ్రులను సురక్షితంగా మోసే శ్రవణకుమారునిలాంటి పుత్రులు వేలాది మంది సమాజంలో ఉద్భవిస్తారు.

**ఆదర్శ సోదరునిగా:** 'విత్తం' ఉంటే 'చిత్తం' అని చుట్టూ తిరిగేవాళ్ళే గాని, కష్టాల్లో ఉంటే కన్నెత్తైనా చూడని కుటుంబ వ్యవస్థ నేటి సమాజంలో చోటుచేసుకొంది. కుటుంబం కష్టాల్లో ఉన్నప్పుడు కుటుంబ సభ్యులంతా ఉమ్మడిగా ఆ కుటుంబ నిర్వహణ బాధ్యతల్ని వహించాలి. అంతేకానీ బాధ్యతల్ని విస్మరించి తప్పించుకుపోతే అలాంటి కుటుంబం శాంతిసౌఖ్యాలతో ఎలా వర్ధిల్లగలదు?

బాల్యంలోనే తండ్రి మరణించడం వల్ల గదాధరుని (శ్రీరామకృష్ణ) కుటుంబం ఆర్థిక ఇబ్బందుల్ని ఎదుర్కోవలసి వచ్చింది. కష్టాల్లో ఉన్న కుటుంబాన్ని ఆదుకొనే బాధ్యత శ్రీరామకృష్ణుల అన్నగారైన రామ్‌కుమారునిపై పడింది. అందువల్ల ధనార్జన నిమిత్తం రామ్‌కుమార్ కామార్పుకూర్ నుండి కలకత్తా వెళ్ళి అక్కడ ఒక సంస్కృత పాఠశాలను ప్రారంభించాలని సంకల్పించాడు. ఆ పాఠ శాల నిర్వహణలో తనకు సహాయపడేందుకు తనతో పాటు కలకత్తా రావల్సిందిగా అన్న రామ్‌కుమారుడు తమ్ముడు గదాధరుణ్ణి అడిగినప్పుడు వెంటనే అన్నగారితో కలకత్తా బయలుదేరి వెళ్ళాడు గదాధరుడు.

కష్టాల్లో ఉన్న కుటుంబ బాధ్యతల్ని స్వీకరించి ఒక ఆదర్శ సోదరునిగా శ్రీరామకృష్ణుల్ని మనం అనుసరించిన నాడు శ్రీరామ లక్ష్మణుల్లాంటి ఆదర్శ సోదరుల్ని సమాజంలో మరలా మనం చూడగలిగే అదృష్టానికి నోచుకోగలం.



**ఆదర్శపతిగా:** ఆఫీసుల్లో పనిచేసి సాయంత్రం ఇంటికి తిరిగి వచ్చేసరికి శ్రీమతులు కప్పు కాఫీతో ఎదురవకపోతే శివతాండవం చేసే శ్రీవార్ల ఘనకార్యాల్ని మనం తరచూ వింటూనే ఉన్నాం. రోజంతా ఇంటిపనులతో తలమునకలైన ఇల్లాలి అవస్థలను అర్థం చేసుకొని, ఆప్యాయతతో ఎలా ఆదరించాలో శ్రీరామకృష్ణులను చూసి నేటి భర్తలు నేర్చుకోవాలి. అప్పుడు 'అశాంతి నిలయాలు' కాస్తా 'శాంతి నిలయాలు'గా మారుతాయి.

దక్షిణేశ్వరంలో శ్రీరామకృష్ణులు తీవ్ర సాధనల్లో నిమగ్నమై ఉన్న రోజుల్లో జయరాంబాటీలో ఉన్న శారదాదేవికి తన భర్త పిచ్చివాడైనాడనే వార్తలు చెవిన పడ్డాయి. పిచ్చివాడైన భర్తను సేవించడమే తన కర్తవ్యంగా భావించి శారదాదేవి తండ్రిని తోడ్కొని జయరాంబాటి నుండి కలకత్తాకు కాలినడకన బయలు దేరింది. దారి మధ్యలో జ్వరానికి గురైన శారదాదేవి ఎన్నో ఇబ్బందులను ఎదుర్కొని చిట్టచివరకు దక్షిణేశ్వరం చేరుకుంది. రోజులు తరబడి కాలినడకన ప్రయాణించడంతో, నీరసించిన శారదాదేవిని చూసి శ్రీరామకృష్ణులు ఎంతో కలత చెందారు. శారదాదేవికి తన గదిలోనే పడక ఏర్పాటుచేసి, ఆమెకు దగ్గరుండి స్వయంగా ఆయనే అన్ని సపర్యలూ చేశారు.

ఎప్పుడూ భార్యలే భర్తలకు సేవలందించాలని కాకుండా, భార్యల కష్టాలకు భర్తలు కూడా స్పందించాలి. అప్పుడే 'భర్త' అంటే 'భరించేవాడు' అనే నిర్వచనానికి సార్థకత చేకూరుతుంది.

**ఆదర్శ శ్రేయోభిలాషిగా:** మన శ్రేయోభిలాషుల అభిమతానికి విరుద్ధంగా ఏదైనా జరిగితే ఉపేక్షాభావం వదలి దాన్ని సరిచేయడానికి ప్రయత్నించాలి. అంతేకానీ, మనకు అవసరం ఉన్నప్పుడు అన్ని విధాలా ప్రయోజనాల్నీ పొంది, అవి తీరాక నిర్లక్ష్యవైఖరి చూపించడం నిజమైన శ్రేయోభిలాషి లక్షణం కాదు.

శ్రీరామకృష్ణుల జీవితంలో రాణీ రాస్మణి పాత్ర ఎంతో ముఖ్యమైంది. ఆమె శ్రీరామకృష్ణులకు సర్వవిధాలా సహాయ సహకారాలను అందించేందుకు ఎప్పుడూ ముందుండేది. ఆమె శ్రీరామకృష్ణుల శ్రేయస్సుకై దేన్నైనా త్యాగం చేయడానికి వెనుకాడేదికాదు. అలాగే శ్రీరామకృష్ణులు కూడా రాస్మణి అభిమతాలు నెరవేరాలని ఆశించేవారు.

దక్షిణేశ్వరాలయంలో కాళీమాతకు నివేదించిన అన్న ప్రసాదంలో కొంతభాగం శ్రీరామకృష్ణుల గదికి పంపడం, మిగిలిన భాగాన్ని ఆలయానికి వచ్చిన సాధు సన్న్యాసులకూ, భక్తులకూ వితరణ చేయడం రాణీ రాస్మణి జీవించి ఉన్నప్పటి నుండి ఆనవాయితీగా వస్తున్నది. అయితే ఒకరోజు శ్రీరామకృష్ణులకు కాళీమాత ప్రసాదం రాలేదు. గదికి తన వంతు ప్రసాదం రానందున రామకృష్ణులు చాలా ఆవేదన చెందారు. ప్రసాదం కోసం ఎంతసేపు వేచిచూచినప్పటికీ ప్రసాదం రాలేదు. శ్రీరామకృష్ణులే స్వయంగా ఆలయాధికారి వద్దకు వెళ్ళి "ఏమయ్యా! ఈ రోజు ప్రసాదం ఎందుకు పంపలేదు?" అని అడిగారు.

కేవలం ప్రసాదం కోసం శ్రీరామకృష్ణులు అంత కలత చెందడం యోగిన్ అనే యువకుడు (తరువాతి కాలంలో రామకృష్ణుల సన్న్యాస శిష్యుడు స్వామి యోగానంద) చూసి తనలో తాను "ఇంత చిన్న విషయానికి అంత రాద్ధాంతమా! పప్పు, బియ్యం మూటగట్టుకొనే పూజారుల బుద్ధి ఎక్కడకు పోతుంది?" అని అనుకొన్నాడు. శ్రీరామకృష్ణులు ఆలయాధికారిని కలిసి గదికి తిరిగి వచ్చి అక్కడే కూర్చొన్న యోగిన్‌తో ఇలా అన్నారు: "నేనెందుకు అలా ప్రసాదం కోసం అంతగా ఆతురత చెందానో తెలుసా? కాళీమాతకు అర్పించిన ఆ ప్రసాదాన్ని ఇక్కడకు వచ్చే భక్తులకూ, సాధువులకూ, సన్న్యాసులకూ వితరణ చెయ్యాలి. అలాంటి సత్సంకల్పంతో రాణీ రాస్మణి తన ఆస్తినంతటినీ ఆలయానికి కేటాయించింది. కానీ పూజార్లు అన్నప్రసాదాన్ని విక్రయించి డబ్బు సంపాదించుకుంటున్నారు. ఆమె ఆశించిన విధంగా ప్రసాద వితరణ జరగాలని నేను ఇంతగా ఆరాటపడుతున్నాను." రాణీ రాస్మణి అభిలాష నెరవేరాలనే శ్రీరామకృష్ణుల నిస్వార్థచింతనతో కూడిన ఆవేదనను చూసి యోగిన్ ఆశ్చర్య పోయాడు.

'ఎన్ని మోసాలో అన్ని మార్గాలు' అనే సూక్తిని అనుసరిస్తున్న నేటితరం 'మానవత్వం, దైవత్వాని'కి దగ్గరి బాట అని గ్రహించాలి.

శ్రీరామకృష్ణులు మానవతా దృక్పథంతో ఆదర్శపుత్రునిగా, ఆదర్శ సోదరునిగా, ఆదర్శ పతిగా, ఆదర్శ శ్రేయోభిలాషిగా అనుసరించిన విధానాన్ని ఆచరణలో చూపగలిగితే మానవత్వం గల మనుష్యుల కొరత తీర్చగలం. **'మనసున్న మనిషిగా'**



యువవాహిని

– డాక్టర్ జానమద్ది హనుమచ్ఛాస్త్రి



# అచంచల దీక్షతోనే అన్నిటా విజయం



అమెరికా అధ్యక్షుడిగా విశేష ఖ్యాతి నార్జించిన అబ్రహామ్ లింకన్ 1816 నుంచి 1860 వరకు అనుభవించిన కష్టనష్టాలు, జయాప జయాలు అంతులేనివి. ఆయన ఎనిమిదిసార్లు దేశాధ్యక్ష ఎన్నికల్లో ఓడిపోయాడు. మూడుమార్లు ఉద్యోగం పోగొట్టుకున్నాడు. రెండుసార్లు వ్యాపారంలో దివాలా తీశాడు. ఆరు నెలల పాటు తీవ్ర మనస్తాపంతో కుమిలిపోయాడు. పదిహేడేళ్ళ పాటు ఋణగ్రస్తుడిగా గడిపాడు. చివరకు 1860 ఎన్నికలలో గెలిచి, అమెరికా అధ్యక్షుడయ్యాడు. బానిస వ్యవస్థ నిర్మూలన కోసం పోరాడి చరిత్రకెక్కాడు. ఆయన అంత సాధించడానికి ప్రధాన కారణం పట్టుదల, అచంచల దీక్ష.



అబ్రహామ్ లింకన్

దృఢ సంకల్పం ఉంటే తప్పకుండా సంకల్ప సిద్ధి కలుగుతుంది. నెపోలియన్ చక్రవర్తి ఆకారంలో చాలా పొట్టి. అలాంటి వాడు ప్రపంచాన్నే జయించాడు. అందుకు కారణం – ఉక్కు లాంటి చెక్కు చెదరని అతని మనసే! గొప్ప వక్తగా పేరు తెచ్చుకున్న డెమస్తనీస్‌కు నిజానికి మహా నత్తి. ఆయన నాలుక కింద గులకరాళ్ళు ఉంచుకొని, సాగర తీరంలో కేకలు వేసి, తనకున్న నత్తిని పోగొట్టుకొన్నాడు. మహావక్తగా నివాళులందుకొన్నాడు. సహనం, పట్టుదల వల్లనే ఆయన ఆ స్థాయికి ఎదగగలిగాడు. ప్రజల ఎగతాళినీ, నిందలనూ లెక్కచేయకుండా బీదవాడైన బెంజిమిన్ డిజ్రేలీ ఇంగ్లండు ప్రధాని కావడానికి కారణం – అతని పట్టుదలే. 'రోమన్ సామ్రాజ్య ఉత్థాన పతనాలు' రాయడానికి గిబ్బన్ 20 ఏళ్ళు కష్టపడ్డాడు.



డెమస్తనీస్

వంద కిలోమీటర్ల సుదీర్ఘ ప్రయాణమైనా సరే ఒక్క అడుగు వేయడంతోనే ప్రారంభమవుతుంది. 'ఉద్యమేన హి సిద్ధ్యంతి' అనడంలోని పరమార్థం అదే. అసాధ్యం సాధ్యం కాగలదు.

టిట్టిభ పక్షి జంట ఒకటి సముద్రతీరంలో గూడు కట్టుకుని ఉండేది. ఆడపక్షి గుడ్లు పెట్టినప్పుడల్లా, సముద్రరాజు అలలతో వాటిని ముంచెత్తి, మింగేసేవాడు. సముద్రుని దురాగతాన్ని గమనించిన మగపక్షి, 'సముద్రాన్నే ఎండగట్టి, నా గుడ్లను స్వాధీనపరచుకొంటాను' అంది. ఆ పిట్ట తన ముక్కుతో, రెక్కలతో నిరంతరాయంగా సముద్ర జలాలను భూమిపైకి వేయసాగింది. ఇతర పక్షులు, ఆ మగ టిట్టిభ పక్షి విషయం తెలుసుకొని, తాము కూడా ఈ మహత్తర కృషిలో పాలుపంచుకున్నాయి. పక్షిజాతులన్నీ సమైక్యంగా చేస్తున్న పనిని గమనించి, గద్దలు, రాబందులు మొదలైన పక్షిజాతులన్నీ క్రమంగా ఆ పనికి పూనుకున్నాయి. ఈ సంగతి విన్న పక్షిరాజు గరుత్మంతుడు కూడా వైకుంఠం వదలి వచ్చి, పక్షి సమూహాలతో చేయి కలిపాడు. వాహనం లేక కష్టపడుతున్న విష్ణువు స్వయంగా సముద్ర తీరం చేరాడు. గరుత్మంతుడు పక్షిజాతుల దైన్యాన్ని తన స్వామికి నివేదించాడు. కరుణామయుడైన శ్రీమహావిష్ణువు సముద్రరాజుకు నచ్చజెప్పి, ఆ తీతువు పక్షి జంటకు గుడ్లను తిరిగి అప్పగించేటట్లు చేశాడు. 'హితోపదేశం'లోని ఈ కథ పట్టుదల ఫలితాన్ని చెబుతుంది. శ్రమాశీలికి అపజయం ఉండదు.

ఈ సందేశాన్ని భర్తృహరి రచన ఆధారంగా తెలుగులో 'సుభాషిత త్రిశతి' రాసిన ఏనుగు లక్ష్మణకవి 'ధైర్యపద్ధతి'లో విపులీకరిస్తూ ఇలా అన్నాడు:

***"ఆరంభింపరు నీచమానవులు***
***విఘ్నాయాస సంత్రస్తులై***
***యారంభించి పరిత్యజించెదరు***
***విఘ్నాయత్తులై మధ్యముల్***
***ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్***
***ధృత్యున్నతోత్సాహులై***
***ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ***
***ప్రజ్ఞానిధుల్ గావునన్"***

"అల్పులు అడ్డంకులు ఏర్పడతాయని భయపడి పనినే అసలు ప్రారంభించరు. మధ్యములు పని ప్రారంభిస్తారు. కానీ, విఘ్నాలు వచ్చిన వెంటనే ఆ పనులను మానుకుంటారు. కానీ, ధీరులైనవారు ఎన్ని అవరోధాలు ఎదురైనా తాము చేపట్టిన కార్యాన్ని సాధించి విజయులవుతారు" అని ఆ పద్య తాత్పర్యం.

విజయానికి మూలం కార్యదీక్ష, పట్టుదల. అయితే, చెడ్డ విషయాల కోసం పట్టుపట్టడం మొండి పట్టుదల అవుతుంది. 'మొండి పట్టుదల' మానవుని ప్రగతికి చేటు. కాబట్టి, మంచిని సాధించడానికి పట్టుదల ఉండాలి. ఆ పట్టిన పట్టు విడవకుండా మనిషి ముందుకు సాగాలి.

MMMMM

– భండారు పర్వతాలరావు



వివిధ దేవాలయాల విశిష్టతలు: ప్రొద్దుటూరు

# అపూర్వ కవితా రససిద్ధి కరుడు అగస్త్యేశ్వరుడు



ప్రొద్దుటూరులోని అగస్త్యేశ్వరుడు

కడప జిల్లా ప్రొద్దుటూరులోని అగస్త్యేశ్వరాలయం చాలా ప్రాచీనమైంది. ఇది చోళుల కాలం నాటిదని ప్రసిద్ధి. క్రీస్తుశకం 15వ శతాబ్దంలో విజయనగర సేనాని నరసా నాయకుడు ఈ ఆలయాన్ని అభివృద్ధి పరచాడని అంటారు.

ఈ గుడి 140 అడుగుల పొడవు, 120 అడుగులు వెడల్పు ఉండి, నలుదిక్కులా నాలుగు ద్వారాలతో శోభిల్లుతోంది. ఇక్కడి దేవేరి రాజరాజేశ్వరీదేవి. ఇక్కడ భ్రమరలింగేశ్వర, సుందరేశ్వర, కోదండరామ ఆలయాలు, నవగ్రహ మండపం ఉన్నాయి. అగస్త్యేశ్వర, రాజరాజేశ్వరీ మూర్తులకు విడి విడి ఆలయాలున్నా రెండు గుడులనూ కలుపుతూ ఉండే మండపం ఒకటే. శ్రీఅగస్త్యేశ్వర లింగంపై రససిద్ధికి సంబంధించిన గంటలున్నాయి. ఇది అరుదైన సంగతి. అంతరాలయంలో వీరభద్ర, వినాయక, కార్తికేయ సన్నిధులు ఉన్నాయి. ఇక్కడ కార్తికేయుడు నెమలిని అధిరోహించి ఉండడం ఒక విశేషం.

ఇక్కడ ఉన్న నవగ్రహ మండపం మామూలుగా తెలుగునాట కనిపించే మాదిరిది కాదు. ఇక్కడి నవగ్రహ మూర్తులు విలక్షణమైనవనీ, ఇలాంటి మూర్తులు ఒక్క కర్ణాటక రాష్ట్రంలో తప్ప మరెక్కడా లేవని అంటారు. ఇక్కడి వీరభద్రమూర్తి సమభంగ భంగిమలో నిల్చొని ఉంటారు. కాళ్ళ క్రింద మేక తల ఉండడం విశేషం. ఈ ఆలయ పునరుద్ధరణ కృషిలో భాగంగా పశ్చిమాన గల ప్రధాన రాజగోపురంపై అయిదు బంగారు కలశాలను ప్రతిష్ఠించారు. తూర్పున కూడా రాజ గోపుర నిర్మాణం పూర్తయింది. ఉత్తర, దక్షిణ రాజ గోపురాలపై బంగారు కలశాల ప్రతిష్ఠాపనకు ఏర్పాట్లు జరుగుతున్నాయి.

తెలుగునాట కొన్ని ఆలయాలకూ, కవులకూ సంబంధం కనిపిస్తుంది. కృష్ణాజిల్లా శ్రీకాకుళంలోని ఆంధ్రవిష్ణువు ఆలయంలో కూర్చుని శ్రీకృష్ణ దేవరాయలు 'ఆముక్త మాల్యద'ను రచించాడంటారు. కాగా, ప్రొద్దుటూరు అగస్త్యేశ్వరాలయంలో కూర్చుని ప్రభావితులైన 20వ శతాబ్దపు కవి 'సరస్వతీ పుత్ర' పుట్టపర్తి నారాయణాచార్యుల వారు తమ గేయకావ్యం 'శివ తాండవం' రచించారంటారు. రోజూ ఈ గుడి చుట్టూ ఆచార్యులవారు 101 ప్రదక్షిణాలుచేస్తూ ఆ కావ్యరచన చేశారట. ఇక్కడ ఆ మహాకవికి ఒక స్మారక చిహ్నాన్ని ఏర్పాటు చేశారు. ఈ ఆలయ విశిష్టతకు అది కూడా మెరుగులుదిద్దే అంశమే. P

## పండుగలు – పర్వదినాలు

ఫిబ్రవరి – 2007

| | |
|---|---|
| 2 శుక్రవారం | : స్వామి అద్భుతానంద జయంతి |
| 13 మంగళవారం | : ఏకాదశి |
| 16 శుక్రవారం | : మహాశివరాత్రి |
| 19 సోమవారం | : భగవాన్ శ్రీరామకృష్ణ జయంతి |
| 27 మంగళవారం | : ఏకాదశి |



## శ్రీ రామకృష్ణ ప్రభ వార్షిక చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా! దిగువ పేర్కొన్న నెంబర్ల నడుమ ఉన్న సంవత్సర చందాదారుల చందా గడువు తీరిపోనున్నది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీ రామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.*

30001 - 33200 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2007 ఫిబ్రవరితో** తీరిపోనున్నది!

40001 - 42200 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2007 మార్చితో** తీరిపోనున్నది!

**శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్**

**గమనిక :**

1. మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
2. మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
3. మీకు పత్రిక ప్రతి నెలా 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

**మీ ఉత్తర ప్రత్యుత్తరాలకు:**
**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం**
**దోమల్‌గూడ, హైదరాబాద్-500 029 ఫోన్ నెం: 040 - 2763 3937**



## (లాటూ మహరాజ్ జీవిత ఘట్టాలు)

శ్రీరామకృష్ణులు కామార్పుకూర్ వెళ్ళినా లాటూ (శ్రీరామకృష్ణుల సన్న్యాస శిష్యులు స్వామి అద్భుతానంద) మాత్రం దక్షిణేశ్వర్ వెళ్ళేవాడు. పంచవటి దగ్గరో, గంగానది ఒడ్డునో గంటల తరబడి ఒంటరిగా కూర్చొని సమయం గడిపేవాడు. ఒకసారి అలా కూర్చొని ఉండగా శ్రీరామకృష్ణుల అన్న కుమారుడైన రామ్‌లాల్ వచ్చాడు. అతనికి లాటూ స్వభావం తెలుసు గనక, దూరం నుండే లాటూ ఏ స్థితిలో కూర్చున్నదీ గ్రహించాడు. నది ఒడ్డున ఆ బాలుడు నిరుత్సాహంగా, నిశ్చలంగా కూర్చుని కన్నీరు కారుస్తున్నాడు. యజమాని అయిన రాంబాబు బాధ్యతారహితంగా ప్రవర్తించావంటూ లాటూను చీవాట్లు పెట్టాడేమో, అందుకే మనస్సు గాయపడి, ఆ బాలుడు దుఃఖిస్తున్నాడేమో అను కున్నాడు రామ్‌లాల్. దగ్గరకు వెళ్ళి అతడి దుఃఖానికి కారణం అడిగిన రామ్‌లాల్, ఆ బాలుడు చెప్పింది విని ఆశ్చర్యపోయాడు. ఆ సంఘటన రామ్‌లాల్ మాటల్లోనే చూద్దాం:

"నది ఒడ్డున లాటు కూర్చుని ఏడవడం చూశాను. అతని దుఃఖానికి కారణం అడిగాను. "ఠాకూర్ (శ్రీరామకృష్ణులు) ఇక్కడ లేనందు వల్ల నాకు విచారంగా ఉంది" అన్నాడు. శ్రీరామకృష్ణుల గురించి అతని భావన అద్భుతం. "శ్రీరామకృష్ణులు చెయ్యలేనిది అంటూ ఏదీ లేదు, వారు తల్చుకుంటే ఏదైనా వారికి సాధ్యమే" అని ఆ బాలుని ఆలోచన. ఈ తలంపుతో అతను శ్రీరామకృష్ణులు తన ఎదుట ప్రత్యక్షమవుతారని భావిస్తూ వారిని పిలుస్తున్నాడు. ఈ ఆలోచన మనస్సులో ఉంచుకొని ఆ అబ్బాయి మధ్యాహ్నం నుండి సాయంకాలం వరకూ అక్కడే కూర్చుని ఉన్నాడు. సంధ్యాసమయం అవడంతో నేను లాటూని ఇంటికి వెళ్ళమన్నాను. దానికి అతడిచ్చిన సమాధానం విని మీరు కూడా ఆశ్చర్యపోతారు. "శ్రీరామకృష్ణులు (వారిని అతను 'పరమహంస మాశయ్' అనేవాడు) ఇక్కడే ఉన్నారని నేను దృఢంగా విశ్వసిస్తున్నాను. వారిని కలవకుండా నేను ఎక్కడకీ వెళ్ళను" అని ఆ బాలుడు అన్నాడు. "వారు ఇక్కడ లేరు, స్వగ్రామానికి వెళ్ళారు" అని నేను ఎన్నిమార్లు చెప్పినా, అతను అన్నిమార్లూ కూడా పట్టు విడవకుండా "లేదు, మీకు తెలియదు, పరమహంస మాశయ్ ఇక్కడ ఉన్నారు" అన్నాడు దృఢంగా.

అతను అంత నమ్మకంగా చెబుతుంటే నేను నిశ్శబ్దంగా ఉండిపోయాను. తరువాత సాయంకాల పూజ నిర్వహించడానికి ఆలయంలోకి వెళ్ళాను. ఆలయానికి రాగానే లాటూకు ప్రసాదం ఇవ్వనే లేదని గుర్తుకొచ్చింది. కాస్త ప్రసాదం తీసుకుని లాటూ దగ్గరకు వెళ్ళాను. అక్కడ లాటూ వంగి, తన నుదురు నేలకు ఆన్చి నమస్కరిస్తూ కనపడ్డాడు. అది చూసి నేను నోట మాట రాక మౌనంగా నిలబడి పోయాను. రెండు నిమిషాల తరువాత లాటు తలెత్తి, ఎదురుగా నిలబడి ఉన్న నన్నుచూసి ఆశ్చర్యంగా "పరమహంస మాశయ్‌ని ఇప్పుడే చూశాను ఇంతలో ఆయన ఎటు వెళ్ళిపోయారు?" అని నన్ను అడిగాడు. శ్రీరామకృష్ణులపై లాటుకి ఉన్న అచంచల విశ్వాసాన్ని చూసి నేను విస్మయం చెందాను" అని ముగించాడు రామ్‌లాల్.

స్వామి అద్భుతానంద

లాటూ మహరాజ్ ఎప్పుడూ ఓ మాట చెబుతుండే వారు. "ఎవరికైనా సేవ చేయడం అనేది చాలా కష్టమైన పని. తన తల్లితండ్రులకు సేవ చేయనివాడు గురు సేవ చేయగలడా? గురువును తన తల్లిగానో, తండ్రిగానో భావించగలిగినప్పుడే గురుసేవ చేయడం కొంతవరకైనా సాధ్యం అవుతుంది. సేవకుడు ఎన్ని కఠినమైన పదాలూ, చీవాట్లూ, దండనలూ ఎదుర్కోవాలో? గురుమహరాజ్ ఎన్నడూ మమ్మల్ని విడిచి పెట్టలేదు. ఆ సందర్భాలను గనక మేము లెక్కపెడితే మేము వారి సేవ చేయగలిగి ఉందుమా?" అనేవారాయన.

ఒకరోజు గురుమహరాజ్ స్నానం చేస్తారని ఒక బాల్చీలో నీళ్ళు నింపి, కాస్త అపరిశుభ్రంగా ఉన్న చోట ఆ బాల్చీని ఉంచాడు లాటు. గురుదేవులు అది చూసి, "మూర్ఖుడా! ఈ నీళ్ళు స్నానం చేయడానికేనా? ఎవరైనా స్నానం ఎందుకు చేస్తారు? దేహం శుభ్రమవడానికి! అవునా, కాదా? మలినంగా ఉన్నచోట ఆ నీళ్ళు పెడితే ఆ నీటిని స్నానానికి ఎలా ఉపయోగిస్తాం? మలినమైన దానితో శుభ్రపరచగలమా? నీళ్ళు నారాయణుడే అని నాకు తెలుసు, అలాగని ఆ పరమేశ్వరుడికి మురికి నీటిని అర్పిస్తామా? ఎన్నో రకాల నీళ్ళున్నాయి. భగవదారాధనకు ఉపయోగించే నీళ్ళు, పాత్రలు, బట్టలు శుభ్రపరిచే నీళ్ళు, మనం ముఖం కడుక్కునేందుకు ఉపయోగించే నీళ్ళు– ఇలా వేర్వేరు అవసరాలకు తగినట్లు వివిధ రకాల నీళ్ళున్నాయి. కొన్ని రకాల నీటిని త్రాగడానికి కానీ, పూజకు కానీ ఉపయోగించలేం" అన్నారు. ఈ సంఘటనను లాటూ మహరాజ్ చెబుతుండగా ఒక గృహస్థ భక్తుడు విని గ్రంథస్థం చేశాడు. O

– డాక్టర్ బిరుదురాజు రామరాజు



ఆంధ్రయోగి త్రైలింగస్వామి

# నరరూపంలో నడయాడిన కాశీ విశ్వనాథుడు

జగద్వంద్యుడైన శ్రీరామకృష్ణ పరమహంస (1836-1886) త్రైలింగ స్వామి గురించి "ఆ మహానుభావుని ఉనికిచేత కాశీక్షేత్రం పవిత్రమైనద"న్నారు. ఆయనను నడయాడే విశ్వనాథుడిగా కీర్తించి శ్రీ రామకృష్ణులే స్వయంగా తన చేతులతో పాయసం తినిపించారు. ఇక, క్రియాయోగాన్ని పునఃప్రతిష్ఠించిన యోగిరాజు శామాచరణ లాహిరీ మహాశయుడు (1828-1895) తానై ఆ మహితాత్ముని దర్శించి ఆలింగనభాగ్యాన్ని పొందారు. కాగా, విగ్రహారాధనను ఖండిస్తూ కాశీలో ఉపన్యసిస్తున్న ఆర్యసమాజ స్థాపకుడు మహర్షి దయానంద సరస్వతి (1824 - 1883) ఆ పరమాత్మ స్వరూపుని జాబు అందుకొని ఉపన్యాసాలు చాలించి తిరిగివెళ్ళారు. హిందూ వేదాంత డిండిమ ధ్వనితో పాశ్చాత్యుల చెవులు గింగురుమనిపించిన స్వామి వివేకానంద (1863-1902) సైతం ఆ మహాత్ముణ్ణి దర్శించి ధన్యుడనయ్యా ననుకున్నారు. ఆ మహానుభావుడు 280 ఏళ్ళ దీర్ఘకాలం ఈ భూమిపై నడయాడి, స్వచ్ఛందంగా మేను చాలించిన తెలుగు భీష్ముడు. అష్టసిద్ధు లనూ అరచేతి ఉసిరిక చేసుకొన్న ఆంధ్ర యోగి. కాశీక్షేత్రపాలకుడైన కాలభైరవుని శాంతభక్తుడు, కాళీమాత అనుంగు బిడ్డడు. ఆ మహామహుడు - త్రైలింగస్వామి. ఆయన జీవితం ఆంధ్రుల చరిత్రలో పరమాద్భుత ఘట్టం.



త్రైలింగస్వామి అసలు పేరు శివరామయ్య. విజయనగరం జిల్లా సమీపాన గల హోలియా గ్రామంలో విద్యావతి, నరసింహారావులనే సంపన్న బ్రాహ్మణ దంపతులు ఉండేవారు. చాలాకాలం నిస్సంతుగా ఉండిన ఈ దంపతుల పూజలు ఫలించి పుష్యశుద్ధ ఏకాదశి శనివారం రోహిణీ నక్షత్రంలో (19-12-1607) శివరామయ్య జన్మించాడు. విద్యావతి గొప్ప శివభక్తురాలు. ఒకనాడామె పూజలో ఉండగా శివలింగం నుంచి ఒక కాంతిరేఖ వెలువడి, చెంతనే నిద్రిస్తున్న ఆ శిశువులో లీనమైంది. తల్లితండ్రులు ఆ వింత చూసి శివరాముని భవిష్యజ్జీవితానికి అది సంకేతమనుకున్నారు. అనుకున్నట్లే శివరాముడు పెరిగినకొద్దీ శాంత గంభీరుడయ్యాడు. సవతి తమ్ముడు శ్రీధరునితో తప్ప తక్కిన సాటి పిల్లలతో దూరంగా ఉండేవాడు. చురుకుదనం, కారుణ్యం - ఈ రెండూ శివరామునిలో బాల్యం నుంచే కొట్టవచ్చినట్లు కనబడే మేలి గుణాలు.

శివరామయ్య యువకుడైన తరువాత సర్వసంపదలున్నా సుఖభోగాలను ఇష్టపడలేదు. ప్రాపంచిక విషయాలకు విముఖంగా ఉండేవాడు. తండ్రి తన కొడుకును వివాహబంధంతో నాలుగు గోడల మధ్య కట్టి పడేయాలనుకున్నాడు. కానీ శివరాముడు ఇష్టపడలేదు. తల్లి కొడుకునే సమర్థించింది. భక్తి యోగం ఉపదేశించింది.

స్వగ్రామం విడిచిన శివరామయ్య తిరిగి తిరిగి పాటియాలా సంస్థానంలోని బస్తూర్ ప్రవేశించి, 1679లో భగీరథస్వామి అనే యోగిపుంగవుణ్ణి కలుసుకున్నాడు. ఇద్దరూ కలసి పుష్కరతీర్థానికి వెళ్ళారు. ఆ పుణ్యతీర్థంలోనే భగీరథస్వామి శివరామునికి సన్న్యాస దీక్ష ఒసగి, గణపతిస్వామి అనే దీక్షానామం ఇచ్చారు. అప్పుడు శివరామయ్య వయస్సు 78 ఏళ్ళు.

గురువుగారి ఆశ్రమంలోనే గణపతి స్వామి 10 ఏళ్ళకు పైగా సాధనచేసి అనేక అద్భుత శక్తులు గడించాడు. భగీరథస్వామి (1696) దేహం చాలించిన తరువాత గణపతిస్వామి ఆశ్రమం విడిచి తీర్థయాత్రలుచేస్తూ 1697లో సేతుబంధ రామేశ్వరం చేరారు. కార్తీక శుక్ల పంచమికి దేశం నలుమూలల నుండీ రామేశ్వరానికి వచ్చిన తైర్థికుల్లో కొందరు గణపతిస్వామిని గుర్తించి, స్వస్థలానికి తిరిగి రావలసిందిగా కోరారు. కానీ ఆయన ఒప్పుకోలేదు.

రామేశ్వరం వీథుల్లో తిరుగుతుండగా గణపతిస్వామికి ఒక బ్రాహ్మణ బాలుని శవాన్ని శ్మశానానికి తీసుకుపోతూ తల్లితండ్రులు, బంధువులు దీనాతిదీనంగా విలపిస్తున్న దృశ్యం కనబడింది. ఆయన హృదయం ద్రవించింది. గణపతిస్వామి కన్నుల నుండి కారుణ్యం జాలువారింది. శవానికి అడ్డం తిరిగి, కమండలం నుండి పుడిసెడు నీళ్ళు తీసి మంత్రించి శవంపై చల్లారు. వెంటనే ఆ బ్రాహ్మణ బాలుడు బ్రతికి లేచాడు. తల్లితండ్రులు కన్నీటితో గణపతిస్వామి కాళ్ళు కడిగారు. చుట్టూమూగిన జనం గణపతిస్వామి సాక్షాత్తూ రామేశ్వరుడని కీర్తించారు. స్వామి మహిమలు రామేశ్వరం అంతటా తరంగాల్లా వ్యాపిస్తుండగా, ఉన్నట్లుండి ఆయన అక్కడి నుండి చల్లగా జారుకున్నారు. రెండు సంవత్సరాల తరువాత సుధామపురి చేరారు.

అటు నుండి 1701లో నేపాల్ అడవులలో తిరిగారు. నేపాల్ అడవుల్లో కాయకసరులు తింటూ గణపతిస్వామి తపస్సు చేస్తుండగా



ఒక అద్భుతం జరిగింది. ఒక రాజబంధువు ఆ అడవికి పులివేటకై వచ్చాడు. తుపాకీ దెబ్బ తప్పించుకున్న వ్యాఘ్రం పరుగెత్తిపోయి తపో మగ్నులైన గణపతిస్వామి పాదాల వద్ద కూర్చుంది. పులిని వెంటాడుతూ వచ్చిన రాజబంధువు ఆ దృశ్యం చూచి స్తంభించిపోయాడు. ఆతణ్ణిచూసి పులి గాండ్రించింది. ఆ ధ్వనికి తపోభంగమైన స్వామి కన్నులు తెరచి చేయెత్తారు. ఆ ఎత్తిన చేయి పులికి అభయహస్తం కాగా, వేటగానికి పులిని చంపవద్దని ఆజ్ఞాహస్తం అయింది. జీవం పోయలేని వారికి జీవిని చంపే అధికారం లేదని స్వామి వారి హితబోధ. రాజబంధువు తిరిగిపోయి నేపాల్ రాజుకు ఈ వింత చెప్పాడు. మహారాజు ఖాట్మండు నుండి తరలి వచ్చి స్వామికి సాగిలపడి కానుకలు ఇవ్వజూపాడు. స్వామి ఆ బహుమతులను అంటలేదు. జీవహింస కూడదని చెప్పి, దీక్ష ఇచ్చి, మహారాజును సాగనంపారు. గణపతిస్వామి గురించి అద్భుతవార్తలు రాజభటుల ద్వారా సామాన్యజనం విని తండోపతండాలుగా అడవికి రాసాగారు.

ఏకాంతానికి భంగం కలగడంతో గణపతిస్వామి ఆ ప్రదేశం విడిచి, 1707లో త్రివిష్టపం ప్రవేశించారు. అక్కడ పలుచోట్ల యోగసాధన చేశారు. 1707లో స్వామి మానస సరోవర ప్రాంతాలు చేరారు. అక్కడ పాము కాటుకు బలై పోయిన అయిదేళ్ళ కొడుకు శవాన్ని ఒడిలో పెట్టుకొని ఓ వితంతువు కరుణార్ద్రంగా విలపించసాగింది. అది చూసిన గణపతిస్వామి ఆ తల్లిని సమీపించి, తమ పవిత్ర స్పర్శతో బాలుణ్ణి పునర్జీవితుణ్ణి చేశారు. ఈ అద్భుతం చూసిన జనం స్వామిని చుట్టుముట్టి, జేజేలు కొట్టసాగారు. స్వామి అదృశ్యులై కొండలోయల్లో సాగిపోతూ కనపడ్డారు.

వారణాసి భారతదేశపు తీర్థరాజం. పండితరాజులకూ, యోగి రాజులకూ పరీక్షా స్థానం. పరమ శివుని ఆవాసభూమి, ఆనంద కాననం. గణపతిస్వామి తమ 130వ ఏట కాశీ ప్రవేశించి ఆ పట్టణంలో మరో 150 ఏళ్ళు సంచరించారు. స్వామివారు అనేక తావుల్లో, గంగాఘట్టాల్లో యోగసాధన చేశారు. 300 పౌన్ల బరువు, దీర్ఘకాయంతో, దిసమొలతో, మెడలో పెద్ద రుద్రాక్ష మాలతో, కుండబొజ్జతో కాశీ వీథుల్లో ఆయన తిరుగుతుంటే స్వామిని 'సచల విశ్వనాథు'డనేవారు. గంటల తరబడి గంగా తరంగాల పైన స్వామి రాజహంసలా తేలియాడేవారు. జాముల కొద్దీ ఆ నదీమతల్లి గర్భంలో మునిగి ఉండేవారు. జనమంతా గంగ ఒడ్డున నిలబడి, స్వామిని దర్శించేవారు.

కాశీలో ఒక మహారాష్ట్ర స్త్రీ రోగగ్రస్తుడైన భర్తతో ఉంటూ, ఆతని ఆరోగ్యం కోసం అనుదినం కాశీవిశ్వేశ్వరునికి అభిషేకం చేసి వస్తుండేది. కొత్తగా వచ్చిన ఈ దిగంబర సన్న్యాసిని చూసి ఆమె అసహ్యించుకుంది. దిగంబరంగా ఉండేవాడవు అడవుల్లో ఉండక, జనుల మధ్య, అందులోనూ స్త్రీల ఎదుట ఎందుకు తిరుగుతున్నావని తూలనాడింది. స్వామి పట్టించుకోలేదు. విశ్వేశ్వరుడు ఆమె కలలో కనబడి, 'దిగంబరస్వామిని ఆశ్ర యిస్తేనే నీ భర్త రోగం నయమవుతుంది' అన్నాడు. ఆమె భర్త దీర్ఘకాలిక ఆంత్ర వ్రణ పీడితుడు. గత్యంతరం లేక ఆమె తాను తూలనాడిన దిగంబర సన్న్యాసినే ఆశ్రయించి, క్షమాభిక్ష వేడింది. తన పతి ప్రాణాలు రక్షించమని ప్రార్థించింది. ఆమె దీనాలాపాలకు స్వామి కరిగిపోయి, విభూతి ప్రసాదమిచ్చారు. ఆమె భర్త అల్సర్ వ్యాధి మటుమాయమైపోయింది.

త్రైలింగస్వామి కాశీలోని దశాశ్వమేథ ఘాట్ నుండి 1800లో తమ బస పంచగంగా ఘట్టంలోని బిందుమాధవ్‌కు మార్చారు. ఆనాటి నుంచి మహాసమాధి పర్యంతం మౌనవ్రతం పాటించారు. స్వామి తమ అవసరాల కోసం గానీ, ఇతరుల ప్రశ్నలకు సమాధానాలు చెప్పడానికి గానీ సైగలు చేసేవారు. అందువల్ల కొందరు ఆయనను 'మౌన బాబా' అని పిలిచేవారు.

త్రైలింగస్వామి దిగంబరంగా వీథుల్లో తిరగడం ఆ పట్టణంలో ఉంటున్న కొందరు ఆంగ్లేయులకూ, వారి భార్యలకూ కంటగింపుగా ఉండేది. వాళ్ళు కాశీ మేజిస్ట్రేటుకు చెప్పారు. ఆయన కూడా ఆంగ్లేయుడే. స్వామిని పట్టి కోర్టుకు తేవలసిందిగా ఆయన పోలీసులను ఆదేశించాడు. పోలీసులు స్వామిని పట్టి, కొట్టి, బలవంతంగా కోర్టుకు తీసుకువచ్చారు. స్వామి ఆ దెబ్బలకు ఉలకలేదు, పలకలేదు. కోర్టులో ప్లీడరు, న్యాయాధీశుడు అడిగిన ప్రశ్నలకు స్వామి జవాబు చెప్పలేదు. స్వామిని ఎరిగిన సబ్ మేజిస్ట్రేటు, కొందరు ప్లీడర్లు వారి మహిమలు చెప్పారు. స్వామి నిర్వికారులనీ, సర్వ సమదృష్టి కలవారనీ, దేహబుద్ధి లేనివారనీ చెప్పారు. మేజిస్ట్రేటు అంతా విని, తాను తినే మాంసాహారం స్వామి తింటాడా అని ప్రశ్నించాడు. స్వామి ఆతను తినే మాంసాహారం తింటామనీ, కానీ తాము తినే ఆహారం మేజిస్ట్రేట్ తింటారా అంటూ సైగలు చేశారు. ఆ వెంటనే బర్రుమనే ధ్వనితో తమ చేతిలోనే మల విసర్జన చేసి, మేజిస్ట్రేటుకు చూపుతూ నోట్లో వేసుకున్నారు. ఆ దృశ్యం చూసిన మేజిస్ట్రేటుకు మతి పోయినంత పని అయింది. అయితే స్వామి మలవిసర్జన కార్యంతో కోర్టు అంతా పచ్చి గంధపు పరిమళం వ్యాపించింది. స్వామి మహత్తు కన్నులారా చూసిన మేజిస్ట్రేటు ప్రభావితుడై, త్రైలింగస్వామి కాశీపట్టణ వీథుల్లో స్వేచ్ఛగా తిరుగవచ్చుననీ వారిని ఎవరూ అడ్డు పెట్టరాదనీ ఉత్తర్వు జారీ చేశాడు.

ఒకనాడు విజయనగరం రాజుగారి ప్రాసాదం ముందు నుండి స్వామి పోతున్నారు. ఆయనను చూసిన రాజు, స్వామిని

ఆభరణాలతో అలంకరించి సాగనంపారు. స్వామి బయటకు రాగానే కొందరు దొంగలు ఆ వస్తువులు, వస్త్రాలు దోచుకొని పారిపోయారు. వెంటనే రాజు వారిని పట్టి తెప్పించి, స్వామి ముందు నిలబెట్టి "వీరికేమి శిక్ష" అని అడిగారు. "క్షమయే శిక్ష" అని త్రైలింగ స్వామి బదులిచ్చారు.

1868లో రామకృష్ణ పరమహంస కాశీకి వచ్చినపుడు తమ మేనల్లుడు హృదయనాథ్‌తో కలిసి స్వామిని దర్శించారు. స్వామి, పరమహంసను సగౌరవంగా ఆహ్వానించి ప్రక్కన కూర్చుండబెట్టుకొన్నారు. ఆతిథ్య మర్యాదగా నశ్యపుకాయ ఇచ్చారట. నిరీహులూ, నిస్పృహులైన త్రైలింగస్వామిని శ్రీరామ కృష్ణులు హృదయనాథ్‌కు చూపుతూ, 'నడయాడే విశ్వనాథుడు' అని వర్ణించారు. రామకృష్ణులు మరోసారి అర్ధమణుగు పాయసం వండించి, తీసుకుపోయి స్వహస్తాలతో త్రైలింగ స్వామికి తినిపించారు. ఒకసారి పరమహంస 'ఈశ్వరుడు ఏకమా అనేకమా' అని త్రైలింగ స్వామిని అడిగారు. సమాధిలో ఉండిచూస్తే ఏకమనీ, వ్యావహారిక జ్ఞానావస్థలో ఉండి చూస్తే అనేకమనీ సైగలతో సమాధానం చెప్పారు త్రైలింగస్వామి. శ్రీరామకృష్ణులు తమ మేనల్లునికి స్వామిని చూపిస్తూ "ఇదే నిజమైన పరమహంస స్థితి" అన్నారు. శ్రీరామకృష్ణ పరమహంస మరొకసారి త్రైలింగస్వామిని తమ బసకు ఆహ్వానించి, అఖండగౌరవంతో ఆతిథ్యం ఇచ్చారు.

త్రైలింగస్వామి అవతారం చాలించిన ఘట్టం కూడా అద్భుతమైనదే. స్వామి జీవిత చరిత్ర రచయిత ఉమాచరణ ముఖోపాధ్యాయకు ఆరేళ్ళ ముందే స్వామి తాము దేహం చాలించే విషయం చెప్పారు. ఆరేళ్ళ తరువాత ఒకనాడు స్వామి గంటల తరబడి గంగా విహారం మనసారాచేసి వచ్చి, ఉన్నట్లుండి తాము దేహం చాలిస్తున్నామనీ, ఈ దేహానికి వీడ్కోలు చెప్పండనీ అనుచరులతో అన్నారు.

స్వామిని 32 ఏళ్ళు సేవించిన నమ్మినబంటు మంగళదాస్ కన్నీరుమున్నీరై విలపించాడు. భావితరాల భక్తుల పూజల కోసం స్వామివారి రాతి విగ్రహం చేయించుకోవడానికై మరికొంత వ్యవధి ఇవ్వాల్సిందిగా ప్రార్థించాడు. స్వామి అతని కోరికను మన్నించి, నెలరోజుల గడువు ఇచ్చారు.

అనుచరులు దూరదూరాల భక్తులందరికీ స్వామి తెర మరుగై పోతున్నారనే వార్త అందించారు. అస్సామ్‌లోని గోలా ఘాట్‌లో పని చేస్తున్న ఉమాచరణ ముఖోపాధ్యాయ హుటాహుటిన స్వామి సన్నిధికి చేరాడు. భోలానాథ్, సదానంద్, బ్రహ్మనాథ్, కాళీచరణ్ ప్రభృతులు వచ్చారు. మహా సమాధికి పది రోజుల ముందు స్వామి పంచగంగా ఘట్టంలో ఒక స్థలం ఎంపికచేసి, చిన్న భూగృహం నిర్మింపజేసు కున్నారు. పదోరోజు ఉదయం 8 – 9 గంటల మధ్యన భూగృహంలోకిపోయి తలుపు వేయించుకున్నారు. తమకు తామై తలుపు తట్టే దాకా బయటి నుండి ఎవరూ తలుపులు తీయవద్దన్నారు. ఈలోగా స్వామివారి నల్లరాతి విగ్రహం సిద్ధమైంది. మధ్యాహ్నం 3 గంటల దాకా స్వామి యోగ సమాధిలో ఉండి, ఈవలికి వచ్చారు. అందరికీ వీడ్కోలు చెప్పి హితోపదేశం సైగలతోనే చేశారు. హారతులు అందుకున్నారు. మళ్ళీ యోగాసనంలో కూర్చొని, ఆ సాయంకాలమే బ్రహ్మ రంధ్రం ఛేదించుకొని విశ్వచైతన్యంలో విలీనమయ్యారు. సర్వజిత్ నామ సంవత్సర పుష్యశుద్ధ ఏకాదశి సోమవారం పుణ్య దినాన (26-12-1887) త్రైలింగస్వామి తమ లీలానాటక ప్రదర్శనానికి తెరదించారు. కాశీలో ఆయన నిర్మింపజేసుకున్న భూగృహం, ఆయన విగ్రహం నేటికీ చూడవచ్చు. k

---

## పరమహంసే చూపిన 'నిజమైన' పరమహంస

**కా**శీలో బస చేసినప్పుడు అక్కడ సుప్రసిద్ధ సాధు సన్న్యాసులను శ్రీరామకృష్ణులు దర్శించారు. వారిలో ఒకరైన త్రైలింగస్వామిని చూసి, ఆయన ఎంతో ఆనందించారు. అప్పుడప్పుడు ఆయన త్రైలింగస్వామి గురించి ఇలా అనే వారు: "సాక్షాత్తూ విశ్వనాథుడే తన అభివ్యక్తీకరణార్థం త్రైలింగస్వామి దేహాన్ని ఆశ్రయించి ఉన్నాడు. స్వామి ఉనికితో కాశీ పావనత్వం మరింత ఇనుమడించింది. ఆయన ఉన్నతోన్నత జ్ఞానావస్థలో ఉన్నారు. ఆయన దేహస్మృతి రహితుడై ఉన్నారు. మండుటెండలో ఎవరూ కాలు కూడా మోపలేనంత విపరీతమైన వేడిగా ఉండేది గంగాతీరం ఇసుక. కానీ త్రైలింగస్వామి ఆ ఇసుక మీద హాయిగా పడు కొని ఉన్నారు. క్షీరాన్నం స్వయంగా వండి, తీసుకువెళ్లి ఆయనకు తినిపించాను. ఆ సమయంలో ఆయన మౌన వ్రతంలో ఉన్నారు. నేను సంజ్ఞతో, 'భగవంతుడు ఏకమా? అనేకమా?' అని అడిగాను. ఆయన కూడా సంజ్ఞతో ఇలా జవాబిచ్చారు: 'సమాధ్యవస్థలో ఉన్నప్పుడు భగవంతుడు ఏకమనే తెలియవస్తుంది. కానీ, నేను, నువ్వు, జీవుడు, జగత్తు ఇత్యాది అనేకజ్ఞానం ఉన్నంత వరకు భగవంతుడు కూడా అనేకంగానే అనుభూతమవుతూ ఉంటాడు.' త్రైలింగ స్వామిని చూపుతూ, 'నిజమైన పరమహంస స్థితి అంటే ఇదే' అని హృదయ్‌తో చెప్పాను."k

**(స్వామి శారదానంద రచన *'శ్రీరామకృష్ణ పరమహంస'* సమగ్ర సప్రామాణిక జీవితగాథ నుంచి)**

- స్వామి సుప్రియానంద



(గత సంచిక తరువాయి)



# గోరుముద్ద





వృద్ధాప్యాన్ని గురించి ఆలోచించినప్పుడు మనకు మొట్టమొదట స్ఫురించేది దానిమీద మన కున్న'అయిష్టత'. వృద్ధాప్యం కావాలని ఎవరూ కోరుకోరు. మనిషి జీవితాంతం యవ్వనావస్థలో ఉండాలని ఎంత ప్రయత్నించినా వృద్ధాప్యం నుండి తప్పించు కోలేడు.

'వేదాంత సారం'లో ప్రతిజీవి ఖచ్చితంగా ఎదుర్కోవలసిన ఆరు ఉపద్రవాలను 'సదానంద' వివరిస్తారు. అందులో వృద్ధాప్యం ఒకటి. ఇది తప్పించుకోడానికి ప్రయత్నించిన దృష్టాంతం మహాభారతంలో ఉంది.

'యయాతి' అనే ఒక రాజు విధివశాన శుక్రాచార్యుని కోపాగ్నికి ఆహుతై తన యవ్వనాన్ని కోల్పోయి వృద్ధాప్యం పొందుతాడు. యయాతి తనకు కలిగిన విపరీత పరిణామం నుండి రక్షించమని శుక్రుడిని ప్రార్థిస్తాడు. అప్పుడు శుక్రుడు 'నీ ముసలితనం ఎవరిలోనైనా ప్రవేశపెట్టు అప్పుడు నీకు నీ యవ్వనం తిరిగి వస్తుంది' అంటాడు. యయాతి తన కుమారుల్ని పిలిచి, 'మీరు ఎవరైనా నా ముసలితనం తీసుకొని మీ యవ్వనాన్ని నాకివ్వండి. వేయి సంవత్సరాల తరువాత మీ యవ్వనం మీకిచ్చేస్తాను' అని బ్రతిమాలతాడు. ఎవ్వరూ ఒప్పుకోరు, 'పూరువు' అనే కుమారుని మనసు చలించి తన తండ్రి కోర్కె తీర్చడానికి సిద్ధపడతాడు. యయాతి తన వార్ధక్యాన్ని పూరువు నందు ప్రవేశపెట్టి తిరిగి యవ్వనాన్ని పొంది ఎన్నో సుఖాలను అనుభవిస్తాడు. వేయి సంవత్సరాలు పూర్తి అయ్యాయి. అయినా యయాతికి విషయ సుఖాల మీద ఆసక్తి తగ్గనేలేదు. ఇక ఇవి తగ్గవనీ, పెరుగుతూనే ఉంటాయనే జ్ఞానం అతనికప్పుడు కలుగుతుంది. తన వృద్ధాప్యాన్ని తానే ఎదుర్కోవాలన్న తలంపుతో దానిని తిరిగి పొంది వనవాసానికి వెళ్ళి ఆధ్యాత్మిక చింతనలో తన శేష జీవితాన్ని గడుపుతాడు యయాతి.

ఇది ఆ కాలం కథ. వాస్తవానికి దూరం - అని కొట్టిపారేసే అవకాశం ఉంది. మరి ఇప్పటి వాస్తవం - ఒక బట్టతల పెద్దమనిషి స్కూటర్ అద్దం ముందు నుంచొని తనకున్న నాలుగు వెంట్రుకలను అదేపనిగా దువ్వుకోవడం. వృద్ధాప్యంలో కూడా నిమ్మకు నీరెత్తినట్టు తాపీగా కూర్చొని పేకాడే పెద్దల గురించి ప్రస్తావిస్తారు - కథామృతంలో శ్రీరామకృష్ణులు.

యయాతి పొందిన జ్ఞానం ఎలా వస్తుంది?

చాలామందికి జీవితంలో తప్పులుచేసి ఎదురు దెబ్బలు తిన్న తరువాత కలుగుతుంది జ్ఞానోదయం. కానీ కొంతమంది ఇతరులుపడే కష్టాలనుచూసి వారు తప్పటడుగులు వేయకుండా జాగ్రత్త పడతారు. ఇది ఒక రాజకుమారుడి కథ. నవ యవ్వనంలో ఉన్న ఈ రాజకుమారుడు ఒక రోజు వృద్ధులు పడుతున్న బాధను కళ్ళారా చూసాడు, అతనిలో ఎన్నో ఆలోచనలు రేకెత్తాయి. తన యవ్వనం అశాశ్వతం. రాజ్యం- రాజరికం ఏదీ తన సొంతం కాదు అని తలచిన వెంటనే అన్నీ వదిలిపెట్టి అడవికెళ్ళాడు. ఇక మొదలయింది సముద్ర మథనం. ఆ సముద్ర మథనంలో 'అశాశ్వతం' విషంగాను 'శాశ్వతం' అమృతంగాను మిగిలాయి. అతడికి విడిపోయింది చావు- పుట్టుకల చిక్కుప్రశ్న. అతడే సిద్ధార్థుడు. అయ్యాడు గౌతమ బుద్ధుడు.

యయాతిది వానప్రస్థం అయితే సిద్ధార్థుడిది సన్యాసం. ఇక మన కథకొద్దాం. మన కిప్పుడు వృద్ధాప్యంలో కావల్సింది వృద్ధాశ్రమాలా? లేక...!! **(వచ్చే సంచికలో)**





# ధీరవాణి





## శ్రీరామకృష్ణుల అవతార ఆవశ్యకత

శంకరాచార్యుల తేజోవంతమైన మేథ, చైతన్య ప్రభు విశాలహృదయం...ఇలా మేథస్సు, మనస్సు సమోన్నతంగా మమేకమైన మహాత్ముడు జన్మించే సమయం ఆసన్నమైంది. ఏ మది సర్వమతాల్లోనూ, సకల జీవుల్లోనూ, సమస్త విశ్వంలోనూ ఆ విధాతను ఆవిష్కరించు కోగలదో అలాంటి మనస్సు మహిమాన్వితంగా ప్రపంచానికి పరిచయ మైంది. అలాంటి మహామనస్వి, అవతార పురుషుడి పరమ పాదాలవద్ద కొన్నేళ్ళపాటు తరించే అదృష్టం నాకు కలిగింది. హీనులు, అతిదీనులు, దరిద్రనారా యణులు... అందరూ ఆ మహనీయునికి అత్యంత ఆప్తులే. ఉన్నతమైన మేథస్సుకి, ఉదార హృదయానికి అనుసంధానమైన ఆ మహిమాన్వితుడు అందరి ఆత్మబంధువే... అనురాగ సింధువే.

అత్యద్భుత విశేషమేమిటంటే, పాశ్చాత్యభావాలు నిండిన ఒక మహా నగరానికి సమీపంలో ఆయన జీవిత మహత్కార్యం చోటు చేసుకోవడం! ఆ మహా నగరం పాశ్చాత్య భావాల వెనుక వెర్రిగా పరుగులు తీయడమే కాక భారతదేశంలో మిగిలిన అన్ని నగరాల కన్నా ఎక్కువ విదేశీయతను అలవరచుకుంది. అక్కడ ఆయన ఎలాంటి పుస్తక పాండిత్యమూ లేకుండానే జీవించారు. ఈ మహా మేధావి తన పేరు వ్రాయడం కూడా సరిగా నేర్చుకోలేదు. కానీ మా విశ్వవిద్యాలయంలోని అత్యంత మేధావులైన పట్టభద్రులు ఆయనలో ఒక మహా మనీషిని కనుగొన్నారు. ఆయనొక వింత మనిషి. ఆయనే శ్రీరామకృష్ణ పరమహంస.

**శ్రీరామకృష్ణుల సందేశం...**

ఆధునిక ప్రపంచానికి ఆయన ఇచ్చిన సందేశం: "ఏ మతాన్నీ, సిద్ధాంతాన్నీ విమర్శించ వద్దు. ఎందుకంటే అన్ని మత సిద్ధాంతాల్లోనూ మంచి ఉంది. మతం అంటే ఉబుసుపోక చెప్పే కబుర్లు కాదు. మతం అంటే ఆధ్యాత్మిక అనుభూతి. అది మీ జీవితాల ద్వారా నిరూపించండి. అనుభవం ఉన్నవారే నిజంగా అర్థం చేసుకోగలరు. ఆధ్యాత్మికతను అందుకున్నవారే, దాన్ని మరొకరికి అందించగలరు. వారే మానవాళికి గురువులు. వారు మాత్రమే శక్తిమంతమైన కాంతి పుంజాలు." అలాంటి వ్యక్తులు ఎంత ఎక్కువమంది తయారైతే, ఆ దేశం అంత ఎక్కువ అభివృద్ధి చెందుతుంది. అలా కానినాడు ఆ దేశం అధఃపాతాళానికి జారిపోతుంది. ఇక ఏ శక్తీ ఆ దేశాన్ని రక్షించలేదు. కాబట్టి, "మీరు ఆధ్యాత్మికతను కలిగి ఉండి, సత్యాన్ని మీకు మీరుగా అనుభూతి పొందండి!" అన్నదే మా గురుదేవులు ఈ ప్రపంచానికి ఇచ్చిన సందేశం.

**మతాలన్నీ సత్యాలే ...**

త్యాగానికీ, ఆత్మ సాక్షాత్కారానికీ ఇదే సమయం. తోటి మానవులను ప్రేమించడం మాటలలో కాక, చేతలలో చూపించాలి. అప్పుడు మాత్రమే అన్ని మతాల మధ్య సమన్వయాన్ని మీరు చూడగలుగుతారు. వివాదాలు, తప్పులు పట్టడాల అవసరం లేదని మీరు తెలుసుకుంటారు. అప్పుడే మీరు మానవాళికి సహాయపడడానికి తగిన అర్హతను పొందుతారు.

మతాలన్నింటిలోనూ ప్రాథమికంగా ఉన్న ఏకత్వాన్ని ఈ ప్రపంచానికి స్పష్టంగా చాటిచెప్పడమే మా గురుదేవుల జీవిత లక్ష్యం. ఇతర గురువులు తమ తమ పేర్ల మీద మతాలను బోధించారు. కానీ పంథొమ్మిదవ శతాబ్దపు ఈ మహాగురువు ఏ మతాన్నీ నిరసించలేదు. ఏ మతాన్నీ ఆయన సరిదిద్దడానికి ప్రయత్నించలేదు. ఎందుకంటే, మతాలన్నీ సత్యాలే, అవన్నీ ఒకే సనాతన ధర్మానికి చెందిన వివిధ భాగాలే అని ఆయన అనుభవపూర్వకంగా తెలుసుకున్నారు. M **(స్వామి వివేకానంద సాహిత్య సర్వస్వం 'లేవండి! మేల్కొనండి' నుంచి)**

**శ్రీ రామకృష్ణుల సందేశం దేశమంతా వ్యాప్తి చెందిన నాడే భారతదేశం ఉన్నత స్థితికి చేరుకోగలదు. -స్వామి వివేకానంద**



యువవాహిని

– సేకరణ : స్వామి అచింత్యానంద



# ఆత్మవిశ్వాసానికి 'నిక్' నేమ్



***"మానవ చరిత్రనంతటినీ పరికిస్తే, ఘనకార్యాలు చేసిన వారి జీవితాల్లో అన్నింటి కన్నా ఎక్కువ సామర్థ్యాన్నిచ్చిన మూలశక్తి - వారి ఆత్మ విశ్వాసమే! మనిషికీ, మనిషికీ మధ్య ఉన్న తేడా ఆత్మవిశ్వాసమే! 'ఆత్మవిశ్వాసం' అన్నింటినీ సాధించగలదు!"***

***- స్వామి వివేకానంద***



*స్వామీజీ చెప్పిన అక్షరసత్యమైన ఈ మాటలకు ప్రత్యక్ష ఉదాహరణ – ఆస్ట్రేలియాకు చెందిన నిక్ వుజిసిచ్. పుట్టుకతోనే కాళ్ళూ చేతులూ లేకుండా వట్టి మొండెంగా జన్మించిన ఆయన ఎన్నో కష్టనష్టాలు ఎదుర్కొని, కేవలం ఆత్మవిశ్వాసంతో, దేవుని మీద అపారమైన నమ్మకంతో జీవితంలో పురోగమించారు. ఉన్నత స్థాయికి ఎదిగిన ఆయన స్ఫూర్తిదాయక గాథ ఆయన మాటల్లోనే:*

**నా** పేరు **నిక్** వుజిసిచ్ (Nick Vujicic). ప్రపంచంలోని కోట్లాది ప్రజల హృదయాల్ని ఆకట్టుకోవడానికి నన్ను సాక్షిగాచేసిన భగవంతునికి శతకోటి వందనాలు! 1982, డిసెంబర్ 4వ తేదీన ఆస్ట్రేలియాలోని మెల్‌బోర్న్ నగరంలో జన్మించిన నాకు పుట్టుకతోనే కాళ్ళు, చేతులు లేవు. ఈ 'లోపానికి' వైద్యులు ఎలాంటి వైద్యపరమైన వివరణా ఇవ్వలేదు. మీరు ఊహించినట్లే నేనెన్నో సవాళ్ళనూ, అవరోధాలనూ ఎదుర్కొన్నాను. నా తల్లిదండ్రులకు మొదటి సంతానమైన నేను కాళ్ళు, చేతులు లేకుండా జన్మించాను! ఈ విధమైన పరిణామానికి సిద్ధపడే సమయమూ లేదు, ముందుగా ఎలాంటి సూచనా లభించలేదు. వైద్యులు దిగ్భ్రాంతి చెందారు. దీనికి వారి వద్ద సమాధానాల్లేవు! అలా ఎందుకు జరిగిందో వైద్యపరమైన కారణాలు ఇంకా తెలియలేదు. నా తమ్ముడు, చెల్లెలు మామూలుగానే జన్మించారు.

పుట్టుకతో నాకున్న అంగవైకల్యం చూసి, చర్చిలోని వారంతా దుఃఖించారు. నా తల్లితండ్రులు కుప్పకూలిపోయారు. "భగవంతుడు ప్రేమమయుడైతే, ఇలాంటి దుఃస్థితి ఎందుకు కలగాలి?" అనే సందేహం వారికి కలిగింది. నేనెంతో కాలం బతకనని మా నాన్న భావించాడు. అయితే అంగవైకల్యం మినహా, నేను ఆరోగ్యమైన శిశువునని వైద్యపరీక్షల్లో తేలింది.

నేను ఎలాంటి జీవితం గడపాల్సి వస్తుందో అని మా అమ్మా నాన్న ఆందోళన చెందసాగారు. నా చిన్నప్పుడు దేవుడు వాళ్ళకు అపారమైన శక్తినీ, ధైర్యస్థైర్యాలనూ ప్రసాదించాడు. ఆ తరువాత నేను బడికి వెళ్ళే సమయం వచ్చింది.

ఆస్ట్రేలియాలోని చట్టం ప్రకారం అంగవికలురైన నా లాంటివాళ్ళు మామూలు పాఠశాలకు వెళ్ళే అవకాశం లేదు. ఆ చట్టాన్ని మార్పించాలనే పోరాటానికి కావలసిన శక్తిని నా తల్లికి దేవుడు ప్రసాదించాడు.

పాఠశాలకు వెళ్ళడమంటే నాకెంతో ఇష్టం. నేనూ అందరి లాగే జీవించాలని ప్రయత్నించాను. అయితే, ఆరంభంలో నేనెన్నో కష్టాలు అనుభవించాల్సి వచ్చింది. నా చుట్టూ ఉన్నవాళ్ళు నన్నూ, నా అవిటితనాన్నీ అవహేళన చేశారు. అవన్నీ ఎదుర్కొంటూ, వాటికి అలవాటుపడడం నాకెంతో కష్టమైంది. అయితే, నా తల్లితండ్రుల సహాయ, సహకారాలతో అలాంటి విపరీత పరిస్థితుల్ని ఎదుర్కొనే వైఖరినీ, లక్షణాలనూ పెంపొందించుకున్నాను. శారీరకంగా అంగవైకల్యం ఉన్నా, మానసికంగా నేను అందరిలాంటివాడినేనని నాకు తెలుసు. నాకు ఎదురయ్యే అనానుకూలతల్ని భరించలేక, నేను ఎన్నోసార్లు పాఠశాలకు వెళ్ళకూడదనుకున్నాను. అయితే, వాటిని లెక్కచేయవద్దనీ, కొంతమంది పిల్లలతో మాట్లాడి, వారిని నా మిత్రులుగా చేసుకోవాల్సిందిగా నా తల్లితండ్రులు నన్ను ప్రోత్సహించి, పాఠశాలకు పంపేవారు. నేను కూడా వాళ్ళాంటి వాడినేనని విద్యార్థులందరూ కొద్దికాలంలోనే తెలుసుకున్నారు. అప్పటి నుండి దేవుడి అనుగ్రహం వల్ల నాకు కొత్త స్నేహితులు లభించారు. నా పరిస్థితిని నేను మార్చు





కోలేననీ, దానికై ఎవరినీ నిందిం చలేననీ, ఒక్కొక్కప్పుడు నాకు నిస్పృహ, కోపం కలిగేవి. బ ˏ ˇ ∩ ˇ వ ం తుడు మనల్ని అందరినీ ప్రేమిస్తా డనీ, మన బాగోగులు చూసుకుం టాడనీ నేను తెలుసుకున్నాను. ఒక పసివాడిగా ప్రేమంటే నాకు కొంతవరకు అర్థమైంది కానీ, భగవంతుడు నన్ను ప్రేమిస్తే, నన్నిలా ఎందుకు సృష్టించాడో నాకు అర్థం కాలేదు. నేను ఏదైనా తప్పు చేయడం వల్ల ఇలా జరిగి ఉంటుందా? అదే అయ్యుంటుంది. ఎందుకంటే, బడిలోని పిల్లలందరిలోకీ నేనే వికృతమైన వాణ్ణి. చుట్టూ ఉన్న వారందరికీ భారం కాబట్టి ఎంత తొందరగా నేను వెళ్ళిపోతే అందరికీ అంత మంచిదని భావించేవాడిని. బాల్యంలోనే నా దుఃఖాన్నీ, జీవితాన్నీ అంతం చేసుకోవాలని అనుకున్నాను. అయితే మా అమ్మా నాన్న, తోబుట్టువులు నాకు ధైర్యాన్నిచ్చి, నాకు అండగా నిలిచారు. వారికి కృతజ్ఞతలు.

ఇతరుల అవహేళనల వల్ల నాలో ఆత్మన్యూనతాభావం కలిగి, ఒంటరితనంతో నేనెంతో కలత చెందేవాణ్ణి. వాటితో మానసికంగా పోరాడాను. ఇతరులు కూడా తమ జీవిత సమస్యలను ఎదుర్కొని, వాటిని భగవంతుని అనుగ్రహంగా స్వీకరించాలి. అందుకే, నా కథనూ, నా అనుభవాలనూ ఇతరులతో పంచుకోవాలనుకుంటున్నాను. ఇతరులు కూడా నా లాగే తమ శక్తిని తెలుసుకొనేలా అవరోధాలను ఎదుర్కొనే ధైర్యం వారికి కలిగించి, వారికి స్ఫూర్తినివ్వాలని నా కోరిక.

పరిస్థితులను యథాతథంగా ఆమోదించరాదనేదే నేను నేర్చుకున్న మొదటి పాఠం. అలాగే, "భగవంతుణ్ణి ప్రేమించే వారికి భగవంతుడు అన్ని విధాలా సహాయం చేస్తాడు." ఆ సంగతి మనందరికీ తెలుసు! 'తగిన కారణం లేకుండా భగవంతుడు మనకు జీవితంలో ఏ ఆపదా ఎదురుకానివ్వడు' అని తెలుసుకొని నేనెంతో శాంతిని పొందాను. భగవంతుడు నన్ను సరిచేస్తాడనీ, అది ఆయన శక్తికి నిదర్శనమనీ నేను నిజంగానే విశ్వసించాను. ఆ తరువాత నాకు ఓ విషయం అర్థమైంది. మనం దేని కోసమైనా ప్రార్థిస్తే, భగవంతుని సంకల్పం కూడా అదే అయితే జరుగుతుంది. భగవంతుని సంకల్పమే గనక లేకుంటే అది జరగదు. అప్పుడు మరేదో మంచిని మనకు దేవుడు అనుగ్రహిస్తాడు. ఆ సంగతి నేను గ్రహించాను.

ఫైనాన్షియల్ ప్లానింగ్ అకౌంటింగ్ అనే అంశంతో నేను అర్థశాస్త్రంలో పట్టాపొందాను. ఇతరులకు స్ఫూర్తినిచ్చే ఉపన్యాసాలు ఇస్తాను. అవకాశం వచ్చినప్పుడు బయటకు వెళ్ళి, నా జీవితాన్ని ఇతరులకు తెలియజేయడం నాకిష్టం. నేటి యువతరం ఎదుర్కొనే పరిస్థితుల్లో వారిని శక్తిమంతులుగా తయారుచేసే ప్రసంగాలను తయారుచేశాను. ఆర్థికరంగంలోనూ నేను ఉపన్యాసాలిస్తాను.

భగవంతుడు నాతో ఏం చేయించాలనుకుంటున్నాడో అలా చేయడం, ఆయన ఎలా నడిపిస్తే అలా నడవడం, యువతరానికి స్ఫూర్తినివ్వడం నాకిష్టం. జీవితంలో సాధించాల్సిన లక్ష్యాలు, కలలు నాకెన్నో ఉన్నాయి. భగవంతుని ప్రేమానురాగాలకు అత్యుత్తమ సాక్షిగా, ప్రపంచంలో స్ఫూర్తిదాయకమైన వక్తగా, సమావేశాల్లో పాల్గొనాలని నా కోరిక. స్థిరాస్తుల్లో పెట్టుబడి పెట్టి, ఆర్థికంగా స్వతంత్రుణ్ణై, నాకు అనుగుణంగా ఉండేలా ఒక కారు రూపొందించుకొని, నా చరిత్ర ఇతరులకు తెలిసే విధంగా Oprah Winfrey Show లో చూపే ముఖాముఖి చర్చలో పాల్గొనాలని నా అభిలాష ! ఎన్నో మంచి పుస్తకాలు వ్రాయాలనేది నా కల. ఈ ఏడాదే నా మొదటి పుస్తకం వ్రాయడం పూర్తి చేయాలని నా ప్రయత్నం. ఆ పుస్తకం పేరు– "చేతులు లేవు, కాళ్ళు లేవు! అయితేనేం దిగులే లేదు!"

ఏదైనా చేయాలనే తపన, ఉత్సాహం కలిగి ఉంటే, అదే భగవంతుని సంకల్పమైతే, సమయం వచ్చినపుడు దాన్ని తప్పక సాధిస్తామని నా నమ్మకం. కారణాలు లేకుండానే, మనకు మనం నిరంతరం అవరోధాలు కల్పించుకుంటాం. ఇంకా నీచం ఏమిటంటే సర్వశక్తిమయుడైన భగవంతునికి కూడా మనం పరిధులు కల్పిస్తాం. భగవంతుణ్ణి ఒక "పెట్టెలో" బంధిస్తున్నాం. దేవుడి కోసం మనం ఏదైనా చేయదలిస్తే, మన శక్తి సామర్థ్యాలపై దృష్టిని కేంద్రీకరించడం కన్నా, మన చేత భగవంతుడు అది చేయించడానికి సంసిద్ధులమై ఉండడమే ముఖ్యం. ఎందుకంటే, ఏదీ మనంతట మనం చేయలేం, దేవుడే మన ద్వారా ఆ పని చేయిస్తాడు. ఆ ఎరుక ముఖ్యం. 'భగవంతుని శక్తి'లోని అద్భుతమైన విషయం అదే. కాబట్టి, భగవంతుని పని కోసం మనం సంసిద్ధంగా ఉండాలి. అలా ఉంటే, అప్పుడిక మనం ఆధారపడేది మన శక్తి సామర్థ్యాల మీద కాదు, భగవంతుని కృప మీదే ! a





# పరుగున వచ్చే పరంధాముడు

చిత్రాలు : తంగరాజు    కథ : టి.ఎమ్. ఎస్    తెలుగు సేత : స్వామి జ్ఞానదానంద

**1** బమ్మెర పోతన ఆంధ్రదేశంలో ప్రసిద్ధిపొందిన సహజ కవి, పండితుడు. భక్త పోతనగా పేరొందిన మహాభక్తుడు. ఆయన రచనల్లో 'శ్రీమదాంధ్ర భాగవతం' సుప్రసిద్ధం. 'భాగవతం'లో గజేంద్రమోక్ష ఘట్టాన్ని రచిస్తున్నప్పుడు జరిగిన సంఘటన ఇది:




**2**




**3**




**4** కొన్ని రోజుల తరువాత ఒక రోజు పోతన బావగారు నడుముకు తువ్వాలు చుట్టుకొని, స్నానం చేయడానికి సిద్ధమవుతున్నాడు. ఆతని మనుమడు వేదగిరి బావి దగ్గర ఆడుకుంటున్నాడు.



5

అదే తగిన సమయమని గ్రహించిన పోతన కావాలనే వేదగిరిని తీసుకువెళ్ళి, ఓ గదిలో దాచిపెట్టి వచ్చాడు. (పోతన ఓ పెద్ద రాయిని బావిలో పడేసి, పిల్లవాడు ఆ బావిలో పడిపోయాడని చిన్న నాటకం ఆడినట్లు మరో కథ కూడా ప్రచారంలో ఉంది). ఆ తరువాత...




6

ఇలా అంటూనే పోతన బావగారు కలవరపాటుతో నడుముకి చుట్టుకున్న తువ్వాలుతోనే పరుగెత్తుకొని వచ్చాడు.




8

బావ అలా విలపించడం ఒక్కక్షణంచూసిన తరువాత పోతన నెమ్మదిగా అసలు సంగతి బయటపెట్టాడు.






మిగతా 28 వ పేజీలో...

– స్వామి సుకృతానంద





# పరిప్రశ్న



**ఎమ్.ఎల్.ఎన్.రావ్, హైదరాబాద్.**

**? : కుండలినీ విద్య అంటే ఏమిటి? ఎలా సాధించాలి? బ్రహ్మ సాక్షాత్కారానికి ఇది అవసరమా?**

✍: ఇది యోగ శాస్త్ర పారిభాషిక పదం. తంత్ర శాస్త్రంలోని యోగ శాస్త్రం ప్రకారం మానవునిలో ఏడు భూమికలున్నాయి. వాటిని కేంద్రాలంటారు. వెన్నెముక కింద భాగం 'మూలాధారం' అంటారు. ఇక్కడ అనంతశక్తి చుట్టగా చుట్టుకొని నిద్రాణ అవస్థలో ఉంటుంది. వెన్నెముకకు రెండు వైపులా 'ఇడ' 'పింగళ' అనే నాడుల మధ్య సుషుమ్న నాడి ద్వారా పై చక్రాలకు ఈ శక్తిని తీసుకెళ్ళాలి. చివరి భాగమైన సహస్రారంలో చేరిస్తే బ్రహ్మ సాక్షాత్కారం అవుతుంది. ఈ కుండలినీ శక్తి మూలాధారం, స్వాధిష్ఠానం (జననేంద్రియ స్థానం); మణిపురం (నాభిస్థానం) ల మధ్య ఉంటుంది. వెన్నెముక మధ్యభాగం(అనాహత స్థానం) లో ఉంటే అలాంటి వ్యక్తి ఎప్పుడూ భగవత్ చింతన, ధ్యానంలో కాలం గడుపుతాడు. అతనికి లోక వ్యవహారాలపై ఆసక్తి ఉండదు. ఈ కుండలినీ శక్తి గురించి కథామృతంలో శ్రీరామకృష్ణులు వివరించారు.

**శ్రీ శుద్ధ చైతన్యస్వామి, పుణుగోడు.**

**? : దశావతారాల్లో కొందరు బలరాముణ్ణి అవతారంగానూ, మరి కొందరు బుద్ధుణ్ణి అవతారంగానూ స్వీకరిస్తారు. అవతారపురుషుల్లో చెప్పబడింది బలరాముడా? బుద్ధుడా? వివరించండి.**

✍: భక్తజయదేవుని కాలం నుంచే బుద్ధుణ్ణి అవతార పురుషునిగా అంగీకరించారు. అంతకు పూర్వం సనాతనులు దానవులే బౌద్ధులుగా పుట్టారని, వారిని వేదం చదవ నివ్వకుండా ఉంచడం కోసమే గౌతముడు వేదాల్ని తిరస్కరించినట్లు చెబుతారు. శ్రీరామకృష్ణులు, స్వామి వివేకానందులు బుద్ధుణ్ణి అవతారంగా అంగీకరించారు. సిద్ధార్థుడు జ్ఞాని అన్నారు శ్రీరామకృష్ణులు.

స్వామీజీ బుద్ధుణ్ణి 'కర్మను కర్మకోసమేచేసే నిస్వార్థ కర్మయోగి, జీవుల పట్ల కరుణా ప్రేమస్వరూపుడు బుద్ధుడ'ని వర్ణించారు. గయ వెళ్ళి అక్కడ బోధివృక్షం క్రింద ధ్యానించారు. అలౌకిక అనుభూతిని కూడా వివేకానంద పొందారు.

ఈ ప్రకారంగా చూస్తే బుద్ధుడు అవతారపురుషుడే. అలా అని బలరాముణ్ణి మనం కించపరచవలసిన అవసరంలేదు శ్రీకృష్ణ బలరాములు, శ్రీరామలక్ష్మణుల వలె అవతరించారు. లక్ష్మణ స్వామిని అవతారం అనకపోయినా, బలరాముణ్ణి అవతారంగా వైష్ణవులు అంగీకరిస్తారు. (శ్రీకృష్ణ, బలభద్ర, సుభద్రలను పూరీ జగన్నాథ క్షేత్రంలో పూజిస్తారు).

**మత్స్య కూర్మ వరాహశ్చ నారసింహో వామనః ।**
**రామో రామశ్చ రామశ్చ కృష్ణః కల్కిరేవ చ ॥**

ఈ శ్లోకం ప్రకారం బలరాముణ్ణే అవతార పురుషునిగా స్వీకరించాలి. P

## ✍ ప్రియ పాఠకులారా !

అనివార్య కారణాల వల్ల జనవరి నెలలో **నేను** మీ వద్దకు రావడం కొంత ఆలస్యం అయినందుకు చింతిస్తున్నాను.

అనుకొన్న సమయానికి పిల్లలు ఇంటికి చేరకపోతే తల్లి తండ్రులు ఎంతో ఆవేదనకూ, ఆతురతకూ గురి అవుతారు. నా కోసం మీరు పడిన అలాంటి ఆవేదనే మీ ఉత్తరాల ద్వారా కనిపించింది. ఫోన్లద్వారా వినిపించింది. నాపై మీకున్న ప్రేమాభిమానాలకు శతకోటి కృతజ్ఞతలు.

మీ వద్దకు కొంత ఆలస్యంగా వచ్చినా నన్ను సహృదయంతో మన్నించి ఎప్పటిలాగే అభిమానంతో ఆదరిస్తారని ఆశిస్తూ... వందనములతో,

ఇట్లు
మీ
**శ్రీ రామకృష్ణ ప్రభ**



– స్వామి తపస్యానంద



# ఆధ్యాత్మిక అన్వేషణ



**శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులైన స్వామి శివానందజీ నుండి మంత్రదీక్ష పొందిన వారు స్వామి తపస్యానందజీ మహరాజ్** (1904 - 1991). **రామకృష్ణ సంఘ ఉపాధ్యక్షులుగా వ్యవహరించిన స్వామి తపస్యానందజీ మహరాజ్ గొప్ప పండితులు. భారతీయ, పాశ్చాత్య తత్త్వశాస్త్రాలలో దిట్ట, బహుగ్రంథకర్త. వివిధ సందర్భాల్లో ఆధ్యాత్మిక అన్వేషకులు వెలిబుచ్చిన సందేహాలకు స్వామి తపస్యానందజీ మహరాజ్ ఆలోచనా స్ఫోరకంగా ఇచ్చిన సమాధానాలే ఈ 'ఆధ్యాత్మిక అన్వేషణ'.**

**ప్రశ్న:** ఒక వ్యక్తి యొక్క ఆధ్యాత్మిక జీవిత పురోగతికి సత్సంగం ఆవశ్యకత ఎంతైనా ఉందని ఉపనిషత్తులు బోధిస్తున్నాయి. కానీ ఫలానా వ్యక్తి సత్పురుషుడని మనం గుర్తించేదెలా? నిజమైన సత్పురుషులకూ,బూటకపువారికీ మధ్య వ్యత్యాసాన్ని తెలుసుకొనేదెలా?

**జవాబు:** భక్తి విశ్వాసాలు జనించి, దృఢతరమయ్యేందుకు సత్సంగమనేది ముఖ్యమైన కారకమన్న విషయం సత్యం. అలాగే నిజమైన సత్పురుషులు అరుదన్న విషయం కూడా సత్యమే. ఆదర్శప్రాయుడైన సత్పురుషునికి ఉండాల్సిన లక్షణాల గురించి 'భాగవతం' ఇలా వర్ణిస్తోంది:

"ప్రాపంచిక విషయాల పట్ల తీవ్ర అనురక్తే బంధనానికి మూల కారణమని వివేకులు పలుకుతారు. కానీ అలాంటి అనురక్తి ఒక సత్పురుషునిలో గనక కలిగితే అది అతనికి మోక్ష ద్వారాన్ని తెరుస్తుంది.

సత్పురుషులు జీవితంలోని ఒడుదొడుకులన్నిటినీ సమభావంతో స్వీకరిస్తారు. వారి మనసంతా అందరి పట్లా దయతో, స్నేహభావంతో నిండి ఉంటుంది. స్వభావరీత్యా వారు ప్రశాంతచిత్తులు. అందువల్ల వారికి శత్రువులు ఉండరు. మంచితనమే వారి ఆభరణం.

కేవలం నాపై మాత్రమే ఆధారపడే స్వభావంతో కూడిన అచంచల భక్తిని వారు సాధన చేస్తారు. వారు తమ కర్మలన్నిటినీ నాకు అర్పిస్తారు. నా కోసమై వారు తమ బంధుమిత్రులను త్యజిస్తారు. వారు నా మహిమలనూ, గుణగణాలనూ వింటారు. వాటి గురించి నలుగురితో మాట్లాడతారు. అది విన్నవారు కూడా తద్ద్వారా పవిత్రులవుతారు. ఆ విధంగా నా మీద భక్తి గలవారు జీవితంలోని రకరకాల దురదృష్టాల నుంచి రక్షించబడతారు.

పైన వర్ణించబడిన విధంగా సాంసారిక అనురక్తిని త్యజించినవారు సత్పురుషులు అనబడతారు. అలాంటివారి సాంగత్యం పొందినవారు కూడా సాంసారిక అనురక్తి నుంచి ముక్తులవుతారు."
*(భాగవతం – 3.5.19–23)*

పైన పేర్కొన్నదాన్ని బట్టి సాధువు లేదా సత్పురుషుడు అంటే దయాళువూ, అందరి మంచీ కోరేవాడూ, స్వార్థం – దంభం లేనివాడూ, అన్నిరకాల అనురక్తులకూ అతీతుడూ, మనోచాంచల్యం – నైరాశ్యాల నుంచి ముక్తి పొందినవాడూ, భగవంతుని పట్ల శరణాగతిని సాధన చేసేవాడూ, ప్రశాంతచిత్తుడూ, సదా భగవంతుడి గురించి చింతించడం, మాట్లాడడం, సేవించడం లాంటి కార్యాలలో నిమగ్నమయ్యేవాడని మనకు బోధపడుతోంది.

'భాగవతం'లోని ఈ వర్ణనను ఆధారంగా చేసుకొని ఎవరికి వారే వ్యక్తుల గురించి నిర్ణయించుకోవచ్చు. ఇదే ఆదర్శం. నిజ జీవితంలో అపరిపూర్ణులైన వ్యక్తులు మాత్రమే మనకు తారసపడినప్పటికీ, అదీ మనకు గీటురాయిలా ఉపయోగపడుతుంది.

కానీ సాధారణంగా జనం శాస్త్రాల్లో చెప్పబడిన ప్రమాణాలను కాదని, తమ ఊహాజనిత ప్రమాణాలనే అనుసరిస్తుంటారు. మంత్ర తంత్రాలు ప్రదర్శించడం, భవిష్యత్తును ఊహించడం, వ్యాధులను నయం చేయడం లాంటి వాటినే పవిత్రతకు కొలమానాలుగా తరచూ భావిస్తుంటారు. అలాంటి ప్రదర్శనల ద్వారా ఆ వ్యక్తి కేవలం మానసిక శక్తులను మాత్రమే సాధించాడని తెలుస్తుంది. మనకు తెలిసిన కండబలం, ధనబలం, బుద్ధిబలం మొదలైన ప్రాపంచిక శక్తుల లాంటివే ఈ మానసిక శక్తులు కూడా!

నిజమైన సత్పురుషులు వారి సాధనల ఫలితంగా కొన్ని శక్తులను సంపాదించినప్పటికీ వాటిని ఎన్నడూ ఉపయోగించరు సరి కదా, వాటిని కనీసం బహిరంగపరచరు కూడా! శ్రీరామకృష్ణులు అష్టసిద్ధులను సాధించినప్పటికీ, ఆధ్యాత్మికంగా అవి ఏవగింపు కలిగించేవిగా భావించి వాటిని విడిచిపెట్టారు. ఎన్నడూ వాటిని ఉపయోగించనే లేదు. ఈ మానసిక శక్తులకు సంబంధించినంత వరకు వారు అతి సాధారణ వ్యక్తిగానే మసలేవారు. కానీ, 'భాగవతం'లో పేర్కొన్నట్లు పవిత్ర జీవనం గడిపారు. అందువల్ల మానసిక శక్తులను కాంక్షించేవారు ఎన్నడూ ఆయన వద్దకు వెళ్ళలేదు. భగవంతుణ్ణి కోరేవారూ, భక్తిని కోరేవారూ మాత్రం ఆయన చుట్టూరానే తిరిగేవారు. తద్ద్వారా తమకు కావాల్సిన దాన్ని ఆయన నుంచి పొందేవారు. M

– డాక్టర్ గోనెళ్ళ సీతారామలింగేశ్వరరావు





# శబర శివభక్తుడికి సారూప్య ముక్తి



**బో**యకులంలో పుట్టి, ఏ యోగమూ తెలియకపోయినా, కేవలం ప్రేమతో సాక్షాత్తూ త్రిలోచనుడైన శివునికి సులోచనాలుగా తన నేత్రాల్ని అర్పించిన వీరమాహేశ్వరుడు భక్త కన్నప్పగా ప్రసిద్ధుడైన తిన్నడు. ఈతడినే ధీరుడని కూడా అంటారు. ఉపమన్యు మహర్షి ప్రోక్తమైన స్కాందోపపురాణంలోని 'శ్రీశివభక్త విలాసం'లో ఆతని కథ కనిపిస్తుంది.



పూర్వం సువర్ణముఖి నదీ తీరంలో కాంచీపురమనే ప్రసిద్ధ ఈశ్వర క్షేత్రం ఉంది. అక్కడకు కొద్ది దూరంలో ఏనుగు ఆకారంలో వేణుగిరి అనే పర్వత ప్రాంతంలో గోధాపురమనే ఓ శబర గ్రామం ఉండేది. చుట్టుపక్కలున్న కోయ పల్లెలన్నింటికీ ప్రధానమైన తండా ఇదే! శబర నాయకుడైన నాగ, అతని భార్య దత్త దంపతులకు చాలాకాలం సంతానం లేదు. వాళ్ళ పూజలు, పునస్కారాలు ఫలించి, చివరకు వల్లీ సమేత కుమారస్వామి అనుగ్రహంతో వాళ్ళకు ఓ మగబిడ్డ కలిగాడు. "ఈ బాలుడు శివభక్తిలో నారాయణుణ్ణే మించి పోతాడు" (నారాయణుడు శివుడికి ఒకే కన్ను అర్పించగా, ఈ బాలుడు రెండోది కూడా ఇవ్వబోతాడు) అని అశరీరవాణి పలికింది. వీర లక్షణాలను బట్టి అతనికి 'ధీరుడు' అని పేరు పెట్టారు.

పన్నెండేళ్ళ వయస్సులో ధీరుడు ఆయుధం పట్టి, ఓ గురువు దగ్గర సంప్రదాయబద్ధంగా విలువిద్యతో పాటు ఇతర యుద్ధవిద్యలు అభ్యసించి, అందులోని మెలకువలు ఇట్టే పసిగట్టాడు. పల్లె పొలిమేరల్లోని జనాన్ని క్రూర జంతువుల నుంచి కాపాడడం కోసం ఒకసారి తండ్రి వెంట ధీరుడు అడవికి వేటకు వెళ్ళాడు. అడవి చివరి దాకా వెళ్ళి, వేటలో బాగా అలసిన ధీరుడు తన మిత్రులతో కలసి సువర్ణముఖి నదిలో స్నానంచేసి, సేద తీరాడు. ఇంతలో పక్కనే కనబడుతున్న ఉన్నత శిఖరం మీద నుంచి గంభీరమైన స్తోత్ర నాదం వినిపించింది. ఆసక్తి కలిగి, కొండ ఎక్కి అక్కడకు వెళ్ళిన ధీరుడికి పడమటి దిక్కుగా చూస్తున్న ఎత్తైన శ్రీకాళహస్తీశ్వర స్వామి లింగం, అంత క్రితమే ఎవరో అర్చకులు పూజాదికాలుచేసి వెళ్ళిన ఛాయలు కనిపించాయి. జగన్మనోహరమైన ఆ శివలింగం పూర్వం శ్రీ (సాలీడు), కాళము (పాము), హస్తి (ఏనుగు)లతో పూజితమై, 'శ్రీకాళహస్తీశ్వర లింగం'గా పేరుపొందింది.

ఆ శివలింగాన్ని చూడగానే ధీరుడిలో భక్తి పెల్లుబికింది. ఇంతకాలం శివసేవ చేయకుండా తాను గడిపినదంతా పాపకాలమని తలపోశాడు. శివలింగంపై ఉన్న నిర్మాల్యాన్ని శుభ్రంగా తుడిచి, దగ్గరలోని రేలుపూలను సేకరించి అలంకరించాడు. గూడేనికి కూడా తిరిగిపోకుండా, రాత్రీ పగలూ ఆ శివునితోనే గడపసాగాడు. అడవికి వెళ్ళి అడవి జాతి పూలెన్నో సేకరించి, వాటిని తలపాగాలో దోపుకొని వచ్చేవాడు. అడవి జంతువుల్ని వేటాడి, మృదువైన భాగాలున్న ఆ మాంసాన్ని నిప్పుల్లో కాల్చి, వెడల్పాటి టేకు ఆకుల్లో పొట్లం కట్టుకు వచ్చేవాడు. నీళ్ళకు ముంత లేకపోయే సరికి, శివలింగం కడగడం కోసం నోటి నిండా నీళ్ళు నింపుకొని వచ్చేవాడు. గుడికి తిరిగి వస్తూనే లింగంపై అంతకు ముందు ఉన్న వాటిని చెప్పు కాలితో తుడిచేవాడు. పుక్కిటి నీటిని లింగంపై ధారగా పోసేవాడు. పాగాలో దోపుకొని తెచ్చిన పూలను శివుని నెత్తి మీద ఉంచేవాడు. ఆకు పొట్లం విప్పి, అందులో ఇంకా వేడిగా ఉన్న ముక్కల్ని నోటితో ఊది, చల్లార్చి, కొంచెం రుచిచూస్తూ, బాగున్న భాగాలను ఏరి, వాటిని పుట్టతేనెలో ముంచి, శివలింగం ముందు ఆకులో పేర్చి శివునికి అదే ఆదరంగా ఆరగింపు పెట్టేవాడు.

మొదట్లో ధీరుడు అలా మాంసాహారాన్ని ప్రేమతో అందించినా శివునిలో స్పందన రాలేదు. అతడు కొంత నిరుత్సాహపడి, ఒక రోజు "శివయ్యా, నీకీ మాంసాలు కిట్టవా, చెప్పు? చెప్పకపోతే నేను చచ్చినంత ఒట్టు. నేను కూడా పస్తయినా ఉంటాగాని, నీళ్ళు కూడా ముట్టనయ్యా. ఆ ఏదీ నోరు తెరు" అంటూ, లింగానికి దగ్గరగా మాంసపు ముద్దల్ని చేతితో అందించాడు. ఆశ్చర్యం! ఆ శివలింగంలో శివుని దివ్య ముఖారవిందం పొడగట్టింది. శంకరుడు చిరునవ్వు చిందించి, నోరు తెరవగానే ధీరుడు ఆ భక్ష్యాలను నోట్లో పెట్టాడు. శివుడాతని ప్రేమను ఆస్వాదించసాగాడు. ధీరుని హృదయం ఆనందంతో పండింది. అలా తెచ్చిన ఆహారమంతా శివునిచేత తినిపించాడు. అంతా అయ్యాక, "సామీ బాగున్నాయా?" అని అడిగితే, శివుడు "అవును" అన్నట్లు తల ఊపి అదృశ్యమయ్యాడు. అలా జరిగిన తొలి రోజు ధీరుని జీవితంలో మరపురాని రోజు. వనవీరుడైన ధీరుడు రాత్రివేళ కూడా స్వామి సన్నిధిని వీడక సావధానుడయ్యాడు. మరునాడు తెల్లవారింది. ధీరుడు ఛెంగున గెంతి స్వామి అనుమతి తీసుకొని అడవిలోకి పరుగెత్తాడు.

అప్పుడు 'శివకోశు'డనే శివార్చకుడు నిత్యపూజ చేయడానికి అక్కడికి వచ్చి, అక్కడి దృశ్యాన్ని చూచి హతాశుడయ్యాడు. కుళ్ళిన మాంసం, ఎముకలు ఓ వారగా

పోగయి, ఈగలు ముసురుతూ ఉండగా, ఆ పవిత్ర సన్నిధిని దుర్వాసనతో కలుషితం చేస్తున్నాయి. శివకోశుడు గుండెలు బాదుకొంటూ, ఆ 'అపవిత్ర' పదార్థాల్ని దూరంగా పారవేశాడు. తాను కష్టపడి తెచ్చిన పవిత్ర స్వర్ణముఖి జలాలతో లింగాన్ని ప్రక్షాళన చేశాడు. పుణ్యాహవచనాన్ని ఆచరించి, ఆ ప్రాంతాన్ని శుద్ధిచేశాడు. మనసు కుదురుచేసుకొని, ఎప్పటిలాగే తన పూజా కార్యక్రమం ముగించుకొని తిరిగి వెళ్ళాడు.

ఆ తరువాత, అడవి తల్లి ముద్దుబిడ్డ ధీరుడు వేట నుంచి తిరిగివచ్చాడు. "జాగైంది దొరా, కరుణించు దేవరా" అనుకొంటూ ఎప్పటిలాగే లింగం మీది నిర్మాల్యాన్ని తొలగించి, తన పుక్కిటి నీటితో అభిషేకించి, మాంసాన్ని ఆప్యాయంగా నివేదించాడు. శివుడు దాన్ని ఎంతో ఇష్టంగా తిన్నాడు. ఇలా ఆరు రోజులు గడిచాయి. అర్చకుడు ప్రతి రోజూ గుడికి రావడం, అక్కడ పడి ఉన్న మాంసం, ఎముకలపోగులుచూసి బాధపడడం, ప్రక్షాళన, పుణ్యాహవచనం, పూజా కలాపాలు నిర్వహించడంచేస్తూనే ఉన్నాడు.

ఇక లాభం లేదు లెమ్మని, రోజూ ఇలా గుళ్ళో మాంస ఖండాలు పెడుతున్నదెవరో గమనించాలని అర్చకుడు శివకోశుడు తీర్మానించుకున్నాడు. ఉషః కాలాన్నే సిద్ధమై, శివకోశుడు శివసన్నిధిని చేరుకొని, మామూలుగానే తన నిత్యకలాపం ముగించుకొని, దగ్గరలోని మర్రిచెట్టు వెనుక పొదలో దాగి కూర్చొని చూడసాగాడు. మధ్యాహ్న సమయానికి ధీరుడు తాను వేటాడి వండిన మాంసంతో చెమటలు కక్కుతూ తిరిగి వచ్చాడు. శివకోశుడు ఉగ్గబట్టుకొని చూస్తున్నాడు. ధీరుడు వచ్చి చెప్పుకాలితో శివనిర్మాల్యాన్ని తీసేయడం, పుక్కిటబట్టి తెచ్చిన జలాలతో శివుణ్ణి కడగడం చూశాడు. "హరా, హరా ఏం గతి పట్టింది నీకు!" అనుకుంటూ ఆ బ్రాహ్మణుడు వెర్రి చూపులు చూస్తున్నాడు. ఇంతలో తామరాకులతో కట్టిన పెద్ద పొట్లం విప్పాడు బోయ. అందులోని మాంస ఖండాలని నైవేద్యంగా శివుడికి అందించాడు. కానీ, ఎప్పటిలా శివుడు దాన్ని ఆరగించ లేదు. ధీరుడు కంగారుపడ్డాడు. కంటికి అడ్డుగా ఉన్న గిరజాలను వెనక్కి తోసుకొని లింగం కేసి చూశాడు. అక్కడ కనపడిన దృశ్యం చూసేసరికి అతని గుండె గుభిల్లుమంది. శివయ్య ఎడమ కంటి నుంచి ధారాపాతంగా రక్తం! దాంతో, ధీరుడు తట్టుకోలేక నేల మీద పడిపోయాడు.


తంజావూరు బృహదీశ్వరాలయంలో అభిషేకం

కొంతసేపటికి లేచి, వెక్కుతూనే ఆ రక్తస్రావాన్ని తుడిచి చూశాడు. ధార ఆగలేదు. ధీరుడి దుఃఖధార కూడా ఆగలేదు. ఇది "ఏనుగు దంతంతో గానీ, లేడి గిట్టతోగాని పొడిస్తే అయిందా? లేకపోతే ఆ పూజారోడు చాదస్తంతో కంట్లో గుచ్చేసుంటాడు" అనుకొంటూ, ఆ పక్క లోయలో నుంచి 'విశల్యకరణి' అనే మూలికను తెచ్చి, దాని రసాన్ని ఆ కంటికి తాకించాడు. కంటి నిండుగా పోశాడు. అయినా లాభం లేకపోయింది. ధార పెరుగుతోంది. ఇక ఈ నాటు వైద్యాలు పనిచేయవని తెలిపోగా, ధీరుడిలో ఏదో మెరుపు మెరిసింది. "శివయ్యా, మా పెద్దోళ్ళు సెప్తుంటారు - 'ముల్లుని ముల్లుతోనే తీయా'లని. అలాగే 'కన్నుకి కన్నే మందు'! ఈ దెబ్బతో రోగం కుదిరిపోవాల" అంటూ వెనకా ముందూ ఆలోచించకుండా బాణంతో తన కన్నును అవలీలగా తీసేసి శివుడి కంటి మీద అతికించాడు.



ఆశ్చర్యం! రక్తం కారడం ఆగిపోయింది. ధీరుడు తన కంటిని తానే నమ్మలేకపోయాడు. అతని ఆనందానికి మేరలేదు. ఆ పైన మాంసాన్ని అందించబోయాడు. కానీ, ఇప్పుడు కుడి కంట్లోంచి రక్తం కారుతోందే! అప్పుడిక ధీరుడు తన రెండో కన్నుని త్రవ్వబోయాడు.

"తీరా రెండో కన్నూడబీకేస్తే అయ్య కన్నెక్కడున్నాదో ఎట్టా తెలిసేది?" అనుకొని, ఆ లింగపు కుడికంటి కిందుగా తన కుడికాలి బొటనవేలిని ఆనవాలుగా పెట్టుకొని, బాణం ములుకుతో తన కుడి కంటిని పెరకబోతుండగా అతని చేతిని దృఢంగా ఒక సుతి మెత్తని హస్తం పట్టుకొని, "ఆగు ధీరూ! నాకది కాదు కావలసింది, ఇదీ'' అని ఆపింది. అక్కడ ముల్లోకాలనూ ముంచెత్తే తేజంతో అవిర్భవించిన ముక్కంటి, కోయదొరను తన సువిశాలమైన సువర్ణ బాహువుల్లో బంధించి వేశాడు (**నవెూ హిరణ్య బాహవే సేనాన్యే..**) - ఆతనికి ఊపిరాడనీయకుండా! ఇక ధీరుడేమైపోయాడో! సిద్ధులు, ఖేచరులు ఈ ఉత్సవాన్నిచూచి పూలజల్లు కురిపించారు.

స్పృహలోకి వచ్చిన శబరదొర తన ఎదురుగా ఆది కుటుంబం ఆవిర్భవించగా ఆశ్చర్యంతో ఆలోకించాడు. అక్కడ గణపతి, స్కందుడు, ఉమాసహితంగా - పరమేశ్వరుడు! అది సంపూర్ణా విర్భావం - గణదేవతలు, ఇంద్రాది సకల దేవతలు స్తుతిస్తూ ఉన్నారు. కానీ ఇదేంటీ, తను చూడగలుగుతున్నాడు మామూలుగానే! కళ్ళను తడుముకొని చూస్తే రెండు కళ్ళు మామూలై.... "అరే నా నుదుటి మీద ... మూడోకన్నా.. దీనితో చూస్తే...అంతా శివమయం. శివం శివం శివం!" "దొరా, రుద్రయ్య ఇదేం అన్యాయం, నాకు మూడో కన్నా?" అంటాడతడు మతిపోయి, శివుడు తనకు 'సారూప్య ముక్తి'ని అనుగ్రహించినట్లు తెలీక! "నా భక్తిలో పండినవాడు ఏ జాతి వాడైతే ఏమి? అలా కానివాడు సన్యాసి అయితే మాత్రమేమి? చెప్పు దొరా, నాకింకా తృప్తిగా లేదు, నీకేం ఇవ్వమంటావు?" అన్న శివుని అపార కరుణకు నోట మాటరాని ధీరుడు శివుని కాళ్ళపైబడి "శంకరయ్యా శరణు, శరణు. నా చూపును కాజేసింది అందుకనా? మాంసపుముద్దలతో చూసే 'చర్మ' చూపును తీసేసి, 'నిన్నే' చూపించే 'వెచ్చని కంటి'ని ఈయడానికా!" అనగానే పరమేశ్వరుడు భక్తుని విడువలేక, అతనిని కూడా తనతో పాటు కైలాసం తీసుకొని పోయాడు.

కపటం లేని తన భక్తితో శివుణ్ణి వశపరచుకొని, తానూ శివుడే అయిన ధీరుని మహిమను కళ్ళారా చూసి, మనసారా నమస్కరించిన శివకోశుడు పవిత్రుడై, కాలక్రమంలో శివైక్యం చెందాడు. M

– స్వామి జగదాత్మానంద



## విజయవంతంగా జీవించడం ఎలా?

# ఆశావహ దృక్పథంతో అసంతృప్తి మటుమాయం

(గత సంచిక తరువాయి)

q¯•'lOz ‡•eOÑz# ãa\©+¬µ "Œ~¡°

భారతీయులలో సమైక్యతను దెబ్బతీయడానికి బ్రిటీష్ పాలకులు అతి జాగ్రత్తగా ఒక కుట్ర పన్నారు. మన దేశంలో చదువుకున్నవారికీ, నాయకులకూ కూడా ఈ విషయం తెలిసినట్లు లేదు. తారాచంద్ వ్రాసిన 'భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర' అనే పుస్తకంలో మిస్టర్ ఉడ్, అప్పటి వైస్రాయ్ ఎల్జిన్‌కు, "ప్రజల మధ్య తగాదాలు పెట్టడం ద్వారా మన అధికారాన్ని ఇన్నాళ్ళుగా నిలుపుకుంటూ వస్తున్నాం. మీరు దాన్ని కొనసాగించాలి. కాబట్టి అందరూ ఒకే తాటి మీదకు రాకుండా ఉండేందుకు మీకు చేతనైనది చెయ్యండి!" అని వ్రాసినట్లు తెలిపారు.

బ్రిటీష్‌వారు భారతదేశాన్ని వదిలిపెట్టినప్పటికీ మనమే ఈ దేశంలో ఒకరినొకరు అనుమానిస్తూ, ద్వేషం రాజుకునేటట్లు చేస్తున్నాం. అసూయా ద్వేషాలను వదిలించుకోలేకపోతే మనం మంచి పౌరులం కాలేమన్న విషయాన్ని విద్యాధికులు కూడా గ్రహించడం లేదు. పౌరసత్వ స్వభావాన్ని గురించి విశదంగా బోధించడంలో మన విద్యావ్యవస్థ దారుణంగా విఫలమైంది. స్వతంత్ర భారతదేశంలో జీవిస్తున్నా మనమింకా బానిసలలాగా బ్రతకడం ఎంత విషాదకరం!

హిందూ సమాజంలోని వేర్వేరు కులాల మధ్య గల అపనమ్మకం పగ, వైరాలకు కారణం ఏమిటో మనం ఇప్పుడు తెలుసుకునే ప్రయత్నం చేద్దాం. బ్రిటీష్ వారి పరిపాలనా కాలంలో ప్రభుత్వ ఉద్యోగాల కోసం విపరీతమైన పోటీ ఏర్పడింది. దీనివల్ల వెనుకబడిన తరగతులలో బ్రాహ్మణుల పట్ల అసూయ నెలకొంది. ఇతర కులాలలో అనుమానపు బీజాలు నాటుకునేందుకు కారణం బ్రాహ్మణులుచేసిన అన్యాయం ఎంత మాత్రం కాదు. భారతదేశం నలుమూలలా బ్రాహ్మణుల పట్ల ఈ అనుమానం, ద్వేషం ఏర్పడలేదు. ఉదాహరణకు, బెంగాల్ రాష్ట్రంలో ఎక్కువ భాగం ప్రభుత్వ ఉద్యోగాలు బ్రాహ్మణేతరులకు లభించడం వల్ల అక్కడ ఈ ద్వేషం అంత ఎక్కువగా లేదు.

ఏది ఏమైనా, బ్రాహ్మణులు తాము ఉన్నత వర్గానికి చెందిన వాళ్ళమని భావించేవాళ్ళు. (నిజంగానే వాళ్ళు ఉన్నతవర్గానికి చెందిన వాళ్ళా? అజ్ఞానం, పేదరికం, సంకుచితత్వం, స్వార్థం, బాధలు –అన్ని కులాల్లోనూ ప్రబలంగా ఉన్నవే కదా!) కారణం ఏదైనా వారు మిగిలిన కులాల వారి పట్ల ప్రేమ, గౌరవం చూపలేదు. వారిలో కొద్దిమంది అక్కడక్కడ ఇతర తరగతుల వారి సంక్షేమం కోసం పాటుపడి ఉండవచ్చు కానీ, ఎన్నడూ ప్రోత్సాహకరంగా, సువ్యస్థితమైన కృషి సల్పలేదు. అల్పవర్గాల వారి మనసులో క్రమంగా ఆధ్యాత్మిక వైఖరిని పుట్టించడానికి నిజంగా ఎలాంటి ప్రయత్నమూ జరగలేదు. వారి ఉద్ధరణకు ఉన్నత వర్గాల వారు అసలు ప్రయత్నించలేదు. శతాబ్దాల తరబడి చదువు, సంస్కృతులు లేకపోయినా, ఇతరులు తమను చిన్నచూపుచూసినా, ఆధునిక విద్య అభ్యసించాక సమాజంలోని కింద వర్గాల వారు ఆత్మన్యూనతాభావాన్ని పోగొట్టుకుని, ఆత్మవిశ్వాసాన్ని పొందారు. పూర్వం తమను తక్కువచూపు చూసినవారి పట్ల కోపాన్ని వెళ్ళగ్రక్కారు. కానీ ఈ నిస్పృహ చెందిన బలహీనవర్గాల వారిని రెచ్చగొట్టి, వారిని బ్రాహ్మణులకు వ్యతిరేకంగా తయారుచేసింది బ్రిటీష్ వారేనని ఎవరూ అర్థం చేసుకోలేకపోయారు. ఎవరికివారు కత్తులు నూరుకోవడంలో మునిగి ఉన్నారు మరి!

పూర్వం బ్రాహ్మణులు గ్రామాలలో పాఠశాలలు నడిపి పిల్లలకు వ్రాయడం, చదవడం నేర్పేవారు. ఆయా పాఠశాలల్లో చదువుకున్నవారు వీరికి అవసరమైన వసతులను సమకూర్చేవారు. కొద్దిమంది(బ్రాహ్మణ) విద్వాంసులు మాత్రమే రాజుల ప్రాపకంలో ఉండేవారు. బ్రిటీష్‌వారు వారి ప్రభుత్వంలో పనిచేయడానికి అవసరమైన శిక్షణనివ్వడం కోసం పాఠశాలలు ప్రారంభించారు. ఈ ఆధునిక పాఠశాలలు సాంప్రదాయికమైన పల్లెటూరి పాఠశాలలతో పోటీకివచ్చి వాటి కన్నా శక్తిమంతంగా తయారయ్యాయి. అధ్యాపక వృత్తిలో ఉన్న బ్రాహ్మణ కులం ఈ కొత్త పాఠశాలలోచేరి ఆధునిక విద్యను నేర్వవలసి వచ్చింది. ఈ విద్యతో వారు ప్రభుత్వ ఉద్యోగాలు సంపాదించారు. ఇతర కులాల వారు ఈ కొత్త పాఠశాలలో చేరడానికి ప్రతిబంధకాలు లేకపోయినా బ్రతుకుతెరువు కోసం తమ వంశ పారంపర్యంగా సంక్రమించిన వృత్తుల మీద ఆధారపడి, ఆధునిక విద్య పట్ల శ్రద్ధచూపలేదు. తమకు పారంపర్యంగా సంక్రమించిన నమ్మకాల వల్ల వారు ఉద్యోగరీత్యా దూరప్రాంతాలకు పోవడానికి కూడా ఇష్టపడలేదు. ప్రభుత్వంలోని ముఖ్యమైన ఉద్యోగాలన్నీ క్రమంగా బ్రాహ్మణులకే లభించసాగాయి. మంచి వేతనాలు లభించడంతో వాళ్ళు అందరి గౌరవం చూరగొన్నారు. వాళ్ళ పిల్లలు ఆధునిక విద్య నేర్చి స్వాతంత్ర్యం కోసం పోరాడాలనీ, బ్రిటీష్ వారిని తరిమివెయ్యాలని అనసాగారు. బ్రిటీష్ వారికి ఈ సవాలును ఎలా ఎదుర్కోవాలో తెలుసు. వారు నిమ్నకులాల వారితో, "చూడండి! ప్రభుత్వ ఉద్యోగాలన్నీ ఈ బ్రాహ్మణుల సొంతం అయ్యాయి.

నిమ్నకులాల వారు అగ్రకులాల వారిని విశ్వసించలేదు. బ్రిటీష్‌వారి దుష్టపన్నాగాలను మిగిలిన కులాలవారికి వివరించకుండా అలక్ష్యంచేశారు. ఈ లోపల బ్రాహ్మణేతరులు కూడా ఆధునిక విద్య నభ్యసించి, తద్వారా సత్ఫలితాలు పొందనారంభించారు.

కానీ అప్పటికే ఉద్యోగావకాశాలు సన్నగిల్లాయి. దాంతో విపరీతమైన పోటీ ఏర్పడింది. ఆధునిక విద్యలోని కౌశలం మీద పట్టు సాధించడంతో అధికభాగం ఉద్యోగాలు బ్రాహ్మణుల సొంతమయ్యాయి. సహజంగానే మిగిలిన వారు వాళ్ళను చూసి అసూయపడసాగారు. పరస్పర ఆరోపణలు ఎక్కువై బ్రాహ్మణులకు ఉద్యోగాలు లభించకుండా ఉండడానికి ప్రయత్నాలు మొదలయ్యాయి. బ్రాహ్మణులుగానీ, బ్రాహ్మణేతరులుగానీ హానికరమైన ఈ సందర్భాన్ని విదేశీయులు తమకు అనుకూలంగా మలచుకోవడానికి ప్రయత్నిస్తున్నారని గ్రహించలేకపోయారు. పరస్పర ద్వేషం, శత్రుత్వం బానిసల లక్షణాలంటారు. దురదృష్టవశాత్తూ ప్రజలకు ఈ లక్షణం అలవడడమే కాక ఇంకా వృద్ధి చెందింది కూడా! పూర్వం పరాయిపాలనలో ఉన్నప్పుడు వివిధ బానిస వర్గాల వారు ద్వేషం, అపోహ, అనిష్టాల మూలంగా నిరంతరం పరస్పరం పోట్లాడుకునేవారు. దురదృష్టవశాత్తూ, ఇప్పటికీ ఇది తగ్గుముఖం పడుతున్నట్లు లేదు.


గొండావలేకర్ బ్రహ్మచైతన్య మహరాజ్

ఏ సమాజంలోనైనా, అభివృద్ధి సాధించిన వర్గాలు బలహీనవర్గాల సంక్షేమం కోసం పాటుపడకపోతే, తమ గొయ్యి తామే తవ్వుకున్నట్లు! పోటీలకు ఎదురు నిలిచి, ఉద్యోగాలు సంపాదించిన బ్రాహ్మణులు నిజంగా సంతోషాన్ని పొందగలిగారా? లేదు. తమ బ్రతుకు తెరువు కోసం, తమ సొంత ఊళ్ళు, ఇళ్ళు, వాకిళ్ళు విడిచి ఒకచోట నుంచి మరో చోటికి పోతూ, పారంపర్యంగా సంక్రమించిన ఆధ్యాత్మిక సాధనల్ని వదులుకొని, తమ పిల్లల భవిష్యత్తు గురించి ఆతురతకు గురిఅయ్యారు.

పాశ్చాత్యదేశాల అడుగుజాడల్లో నడుస్తున్న భారతీయులకు నేడు కూడా పోటీపడడం తప్పనిసరి అయింది. కానీ, నిజంగా ప్రయత్నిస్తే వారికి ఈ (జగడం) తీవ్రతను తగ్గించడం కష్టం కాదు. ఆధ్యాత్మికత ప్రధానమైన మనస్తత్త్వం ఈ లక్ష్యాన్ని సాధించడంలో తప్పక ఉపయోగపడగలదు. వర్గాలుగా ఏర్పడడం, తమ వర్గానికి ఒక ప్రత్యేకతను పెంపొందించుకోవడం ఇంచుమించు ఒక ప్రకృతి నియమం. కానీ మనం ద్వేషమనే బీజం నాటితే అది సర్వత్రా వినాశనానికి దారితీస్తుంది. దాదాపు అన్ని మతాలలోనూ శాఖలు, ఉపశాఖలు చాలానే ఉన్నాయి. క్రైస్తవుల్లో కూడా సుమారు 250 శాఖలు, ఉపశాఖలున్నాయి.



అదే విధంగా మహమ్మదీయులలో కూడా! ఈ రాజకీయ ప్రపంచంలో చిన్న చిన్న వర్గాలుగా, పార్టీలుగా విడిపోవడం సర్వసాధారణమైపోయింది.

బహుశా అది తప్పనిసరే కూడా! కానీ ఇది ఇతర వర్గాల పట్ల శత్రుత్వంగా పరిణమించకూడదు. ద్వేషం అనేది ప్రమాదకరమైన శక్తి అన్న విషయాన్ని మర్చిపోకూడదు. పరస్పర అవగాహననూ, సమైక్యతనూ పెంపొందించడానికి ప్రతి వర్గం, అవతలి వర్గంలోని విశిష్ట లక్షణాలనూ, సుగుణాలనూ గుర్తించడానికి యత్నించాలి. వారి లోటుపాట్లను గోరంతలు కొండతలు చెయ్యకూడదు. అలాచేస్తే, ఆ పాపపు పని వల్ల గొప్ప నష్టం వాటిల్లుతుంది.

## ^Î†Ç°#° ã„¬ª•kOKÍ ãÀ„=°

గొండావలేకర్ బ్రహ్మచైతన్య మహరాజ్ 1914 వరకు జీవించారు. ఆయన ఆత్మసాక్షాత్కారం పొందిన మహాత్ముడు. ఆయన తన శిష్యుణ్ణి రక్షించిన సంఘటన చెప్పుకోదగింది. బ్రహ్మచైతన్య మహరాజ్ వద్ద మంత్రదీక్ష తీసుకున్న ఒక శిష్యుడు చెడు సావాసాలకు లోనై, వ్యసనాలకు బానిస అయ్యాడు. ఒక వేశ్య మోజులోపడి తన సంపద మొత్తం పోగొట్టుకున్నాడు. అతడి బంధువులు అతణ్ణి వదిలిపెట్టేశారు. బ్రహ్మచైతన్య మహరాజ్ ఇతర శిష్యులు, అనుయాయులు అతణ్ణి తమతో చేరనివ్వలేదు. ఒకసారి మహరాజ్ గడగ్‌లో భీమారావ్ అనే వ్యక్తి ఇంట్లో ఉన్నారు. ఆ శిష్యుడు ఇంటి ముందు బిచ్చగాడిలా నిలబడి ఇంట్లోకి రానివ్వమని ప్రాథేయపడుతున్నాడు. బ్రహ్మచైతన్య మహరాజ్ అతణ్ణిలోనికి పంపమన్నారు. ఇంట్లోకి వచ్చిన వెంటనే అతడు స్వామి పాదాల ముందు మోకరిల్లి, లేచి చేతులు కట్టుకు నిలబడ్డాడు. ఆ సాధుపుంగవుడు, "అందరూ నిన్ను నిర్లక్ష్యంచేసి వదలిపెట్టి ఉండవచ్చు. నేను మాత్రం నిన్ను కించపరచను" అన్నారు. మనస్సుకు ఊరటనిచ్చే ఈ మాటలు విని అతడు వెక్కివెక్కి ఏడవసాగాడు. అతడు కొంత సాంత్వన పొందిన తరువాత, "నువ్వు నిజంగా పశ్చాత్తాపపడుతున్నట్లయితే, నేను నీ బాధ్యత తీసుకుంటాను. కానీ నువ్వు శ్రీరాముడి మీద ప్రమాణంచేసి మళ్ళీ అలాంటి పనులు చెయ్యనని మాట ఇవ్వాలి!" అన్నారు. ఆ మనిషి తనపై కరుణ చూపాల్సిందిగా కోరి, గురువు పట్ల విధేయత ప్రకటించాడు. ఆ మహాత్ముడుచూపిన ప్రేమ, జాలి అతనిలో అపరాధ భావన పోగొట్టి, ఆత్మవిశ్వాసం నింపాయి. అతడు తన మాట నిలబెట్టుకుని ఆధ్యాత్మిక పథంలో ముందుకు

మిగతా 32వ పేజీలో ...



– స్వామి అభేదానంద

వ్యాఖ్యానం : స్వామి మేధానందపురి



# శ్రీ రామకృష్ణ ధ్యానం



అనాది అయిన సృష్టిలో పరమాత్మ ధర్మరక్షణ కోసం, సత్పురుషులను కాపాడడం కోసం అవతరిస్తూ ఉంటాడు. నిరాకార నిర్గుణ బ్రహ్మం మాయను ఉపాధిగా చేసుకొని ఈశ్వరుడు అవుతాడు. ఆయననే 'కారణం, అవ్యక్తం, అంతర్యామి' అని కూడా అంటారు. దాని నుండే సూత్రాత్మ లేక హిరణ్యగర్భుడు (సమష్టి సూక్ష్మశరీరాల అభిమాన దేవత) ఉత్పత్తి అవుతాడు. ఆ హిరణ్యగర్భుడి నుండి విరాట్ పురుషుని ఉత్పత్తి జరుగుతుంది. ఆ తరువాత సృష్టికర్తలైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వర తదితర దేవతల, ప్రపంచంలోని సర్వ జీవరాశుల సృష్టి జరుగుతుంది. అవతరించిన అవతారానికి ఆ నిర్గుణ నిరాకార బ్రహ్మంలోనూ, అవ్యక్తమైన ఈశ్వరునిలోనూ సూత్రాత్మల విరాట్ స్వరూపాలలోనూ ఉన్న బ్రహ్మం యొక్క సంపూర్ణ జ్ఞానం ఉంటుంది. అందుకే శ్రీకృష్ణపరమాత్మ అర్జునునికి ఉపదేశించే సమయంలో విరాట్ స్వరూపాన్ని చూపగలిగాడు. అంటే అవతార మూర్తికీ, ఆ నిరాకార బ్రహ్మానికీ ఏ విధమైన తేడా లేదు. అంతేకాక తక్కువ స్థాయిలో ఉన్న మూర్తిలో కానీ, అవతారమూర్తిలో కానీ ఉత్కృష్టమైన వ్యాపక బ్రహ్మాన్ని ఉపాసించడం వల్ల ఎక్కువ ఫలితం కలుగుతుంది.

అందుకే విశ్వవ్యాపకమైన 'శ్రీరామకృష్ణ ధ్యానం' గురించి చెప్పుకుందాం:

**హృదయ కమల మధ్యే రాజితం నిర్వికల్పం**
**సదసదఖిల భేదాతీతం ఏక స్వరూపం**
**ప్రకృతి వికృతి శూన్యం నిత్యమానంద మూర్తిం**
**విమల పరమహంసం రామకృష్ణం భజామః**

'తైత్తిరీయోపనిషత్తు'లో 'తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్' అని చెప్పారు. అంటే జీవుణ్ణి సృష్టించి, ఆ పరమాత్మే ఆ జీవిలో ప్రవేశిస్తాడు. పరమాత్మ సర్వ వ్యాపకుడైనా, జీవుని కర్మానుసారం భోగానికి ఆధారమైన శరీరం ఎక్కడ ఉందో దానిలో ఉన్న మనస్సులో ప్రతిబింబిస్తుంది. అందుకే జడమైన శరీరం, బుద్ధి, ఇంద్రియాలు చైతన్యంలా కనిపిస్తున్నాయి. 'అంగుష్ఠ మాత్ర పురుషో అంతరాత్మ' అన్నారు. అంటే వారివారి బొటనవేలు పరిమాణంలో హృదయాకాశంలో ఆ పరమాత్మ ఉన్నాడు. అక్కడ అంతఃకరణం (మనస్సు) కూడా ఉంది. అందుకే మన ఇష్టదేవత అయిన రామకృష్ణ పరమహంస వారిని హృదయంలో ఉన్నట్లు భావించాలి. హృదయంలో ద్వాదశదళ కమలం ఉన్నట్లూ, దానిలో చిన్మయ మూర్తులైన పరమహంస వారు విరాజిల్లుతున్నట్లూ భావించాలి. దీనినే **'హృదయ కమల మధ్యే రాజితం'** అని వర్ణించారు. ఆ పైన విశేషణాలు చెబుతున్నారు.



**నిర్వికల్పం:** వారు కల్పనారహితులు. అంటే సంపూర్ణ చైతన్య ఘన స్వరూపులు.

**సదసదఖిల భేదాతీతం:** ఆత్మ నుండి ఆకాశం ఉత్పన్నమైంది. ఆకాశ రూపంలో ఉన్న పరమాత్మ నుండి వాయువు, అలాగే అగ్ని, జలం, పృథ్వి ఉత్పన్నమయ్యాయి. ఇక్కడ ఆకాశం, వాయువులను 'అసద్' రూపాలుగానూ; అగ్ని, జలం, పృథ్వులను 'సద్' రూపాలుగానూ చెబుతున్నారు. ఈ పంచభూతాల సమ్మిళిత సూక్ష్మాంశాల వల్ల మనస్సు, ప్రాణం, జ్ఞానేంద్రియాలూ, కర్మేంద్రియాలూ ఏర్పడ్డాయి. ఈ పంచభూతాల పంచీకృత స్థూల భూతాల వల్ల శరీరం ఏర్పడింది. అంటే ఈ పంచ భూతాలతో ఏర్పడినవే సృష్టిలోని అన్ని పదార్థాలు! కానీ కారణమైన పరమాత్మ ఈ సృష్టికి అతీతుడు, ఆధారం, అధిష్ఠానం అయి ఉన్నాడు. దాన్నే 'సదసదఖిల భేదాతీతం' అన్నారు.

**ఏక స్వరూపం:** అన్ని కుండలలోనూ ఒకే ఆకాశం ఉన్నట్లు, జడ, చేతనాలన్నింటిలోనూ ఒకే పరమాత్మ ఉన్నాడు. దీనినే భౌతికశాస్త్రం అన్ని పదార్థాలనూ అణువులుగా విభజించి, ఆ అణువులలో ఉన్న ఎలక్ట్రానులు కేంద్రకాన్ని అనుసరించి పరిభ్రమిస్తున్నాయని చెప్పింది. జడపదార్థాలలో అణువులను చలింపచేసేది 'శక్తి' అని

వైజ్ఞానికులు చెబితే, వేదాంతులు లేక సనాతన ధర్మావలంబులు 'పరమాత్మ శక్తి' అన్నింటిలో నుండి భ్రమణం కావిస్తోందని చెబుతారు. దీనినే 'శ్రీమద్భగవద్గీత'లో

**ఈశ్వర సర్వ భూతానాం హృద్దేశే - ర్జున తిష్ఠతి ।**
**భ్రామయన్ సర్వభూతాని యంత్రా రూఢాని మాయయా ॥**

అని ఉపదేశించారు. అన్ని వేదాలలోనూ బ్రహ్మం ఒక్కటే అని చెప్పారు. అందుకే ఇక్కడ "ఏకస్వరూపం" అని చెబుతూ, భిన్న రూపాలలో ఐక్యాన్ని సూచించారు. అవివేకులు మాత్రమే 'శివ - కేశవుల' మధ్య భేదాన్నిచూశారు. శ్రీరామకృష్ణుల తండ్రి అయిన క్షుదీరామ్‌కు 'గయ'లో విష్ణుమూర్తి దర్శనం ఇచ్చి "నీ పుత్రునిగా జన్మిస్తున్నాను" అని చెప్పారు. అదే సమయంలో తల్లి అయిన చంద్రమణీ దేవికి శివతేజాంశం గర్భంలో ప్రవేశించింది. కనుకనే వేదాలలో కూడా 'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి' అని చెప్పారు.

**ప్రకృతి వికృతి శూన్యం:** 'ప్రకృతి' అంటే కారణమైన ఈశ్వరుడు, అవ్యక్త బీజ స్వరూపుడు. ఆయన ఉపాధి మాయ. ఆ మాయకు అతీతమైనది 'నిరాకార నిర్గుణ నిర్విశేష బ్రహ్మం.' కారణమైన ఈశ్వరుని నుండి కార్యరూపమైన 'జగత్ ఉత్పత్తి' అయినట్లు మొదట్లో చర్చించడం జరిగింది. కార్యాన్ని 'వికృతి' అంటారు. కనుకనే ఇక్కడ కార్యకారణాలకు అతీతమైన పరమాత్మనే 'ప్రకృతి - వికృతి శూన్యం' అన్నారు.

**నిత్యం ఆనంద మూర్తిం:** శ్రీకృష్ణపరమాత్మ, అందరూ ఆత్మరూపంలో ఎల్లప్పుడూ ఉన్నారని చెబుతూ, అర్జునుణ్ణి శోకించ వద్దన్నాడు. ప్రతి జీవి జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలను అనుభవిస్తున్నా, వీటి కన్నా వేరై, వీటికి సాక్షిగా, ద్రష్టగా ఉండి ఈ అవస్థలను చూస్తున్నాడు. మనః శరీర ఇంద్రియాలు నిద్రలో పనిచేయకున్నప్పటికీ, 'నేను సుఖంగా నిద్రించాను, నాకు ఏమీ తెలియదు' అంటున్నాడు. మరి ఈ అనుభవం ఎవరికి కలిగింది? అని విచారిస్తే మనః శరీర ఇంద్రియాలకు అతీతమైన ఆత్మానుభవమని తేలుతోంది. ప్రతి మానవుడూ జాగ్రదావస్థలో మనః శరీర ఇంద్రియాలతో జడ చేతనాలను కల్పిత తాదాత్మ్య సంబంధం ద్వారా ఏకీభవించి, అహంభావంతో సంసారంలో పరిభ్రమిస్తున్నాడు. ఈ మూడు అవస్థలకూ సాక్షి అయిన చైతన్యాత్మ నిత్యం. అది ఆనంద స్వరూపం. ఇప్పుడు ఆత్మను 'నిర్గుణం' అంటారు. అంటే దానిలో గుణాలు లేవు, కానీ ఆత్మస్వరూపం లక్షణాన్ని చెబుతూ, 'సచ్చిదానందస్వరూపం' అన్నారు. 'సత్' అంటే ఎప్పుడూ అస్తిత్వం గల వస్తువు. ఆకాశకుసుమం, వంధ్యా పుత్రునిలా లేని వస్తువు కాదు. మరి కొండ-గుట్ట, రాయి-రప్ప, చెట్టు-గోడ మొదలైన వాటిలా ఆత్మ జడం కాదు, అందుకే 'చిత్' అన్నారు. అంటే జ్ఞానస్వరూపం. జంతువులకు కూడా జ్ఞానం ఉంది.



అంటే అవి దుఃఖాన్నే ఎక్కువ అనుభవిస్తాయి. అందుకే దుఃఖం లేని ఆనంద స్వరూపుడని చెప్పారు. దీన్నే ఇక్కడ 'నిత్యమానంద మూర్తిమ్" అని వర్ణించారు. అలాంటి శుద్ధ స్వరూపులైన పరమహంసను భజిద్దాం.

**నిరుపమం అతిసూక్ష్మం నిష్ప్రపంచం నిరీహం**
**గగన సదృశ మీశం సర్వభూతాదివాసం**
**త్రిగుణ రహిత సత్ చిత్ బ్రహ్మరూపం వరేణ్యం**
**విమల పరమహంసం రామకృష్ణం భజామః**

శ్రీరామకృష్ణ పరమహంస వారి జీవితచరిత్రను ఆమూలాగ్రం చూస్తే, ఈ రోజుల్లో అంత తీవ్ర సాధనచేసినవారు గానీ, చేస్తున్నవారు గానీ కనిపించరు. అందుకే పరమహంస వారు "నేను పదహారణాల సాధనచేశాను. అందులో 16వ వంతు సాధన చేసినట్లయితే నీవు ముక్తుడవు కాగలవు" అన్నారు. అందుకే వారి జీవనం 'నిరుపమానం'.

**నిరుపమం:** 'ఆత్మతత్త్వం అవాఙ్మానస గోచరం'. అంటే మనో వాక్కులకు అతీతమైంది. దాన్ని పోల్చడానికి మరో వస్తువు లేదు. అందుకే భగవంతుని అవతారమైన పరమహంస వారిని 'నిరుపమం' అన్నారు.

**అతి సూక్ష్మం:** భూతాలన్నిటిలో ఆకాశం అతి సూక్ష్మ భూతం. కానీ అది కూడా ఆత్మ నుంచే ఉత్పన్నమైంది. స్థూల బుద్ధి గలవారికీ, లౌకిక బుద్ధి గలవారికీ, బహిర్ముఖులకూ పరమహంస వారి జీవనం అవగాహనకు రాదు. అందుకే వారిని 'అతిసూక్ష్మం' అనే విశేషణంతో చెప్పారు.

**నిష్ప్రపంచం:** అంటే ప్రాపంచిక బుద్ధి లేకుండడం! లౌకిక వాసనల శూన్యత అని చెప్పవచ్చు. పరిశుద్ధమైన మనస్సు శుద్ధాత్మతత్త్వంతో సమానం. నిదురించే జీవిలో అహంకార, మమకారాలు ఉండవు. అజ్ఞానావరణంతో ప్రతి జీవి నిద్రావస్థలో బ్రహ్మంతో ఐక్యమై ఉన్నాడు. అతనికి 'నేను దొంగను, హంతకుడను, తల్లిని, తండ్రిని' లాంటి భావాలు ఉండవు. కానీ జ్ఞానులకు ఈ అహంభావం జాగ్రదావస్థలో కూడా ఉండదు. వారికి ఈ ప్రపంచంతో ఏ అవసరాలూ ఉండవు. జడం చైతన్యం కాదు. చైతన్యం జడం కాదు. ఆత్మ చైతన్యం. ప్రపంచం జడం. జ్ఞానులెప్పుడూ ఆత్మనిష్ఠులై ఉంటారు. ఆత్మస్వరూపులై ఉంటారు. అలాంటి జ్ఞానుల్లో అగ్రగణ్యులైన 'పరమహంస' వారిని "నిష్ప్రపంచులు" అనడంలో ఆశ్చర్యం ఏముంది!

**నిరీహం:** 'ఇహం' అంటే కోరిక. 'నిరీహం' అంటే కోరికలు లేకపోవడం. కోరికలు ఉన్న వారికి భగవత్ సాక్షాత్కారం సులభం కాదు. ఎల్లప్పుడూ భగవంతుణ్ణి స్మరించే వారికి కోరికలుండేందుకు తావెక్కడిది! ఆ కాలంలో ఒక పెద్ద వ్యాపారి



శ్రీరామకృష్ణ పరమహంస వారికి పదివేల రూపాయలు ఇస్తానన్నాడు. పరమహంస వారు దాన్ని స్వీకరించలేదు సరికదా "రంపంతో నా తల కోస్తున్నట్లుంది" అన్నారు. ఇక కామినీ విషయం చెప్పేదేముంది! జగన్మాత స్వరూపిణి శారదా దేవిని స్పర్శించలేకపోయారు. ముఖ్యమైన కామ, కాంచనాల విషయంలో కోరికలు లేనివారికి ఇతర కోరికలు కలుగుతాయనుకోనక్కర్లేదు కదా! అందుకే వారిని 'నిరీహం' అన్నారు.

**గగన సదృశం:** గగనం అంటే ఆకాశం. ఆకాశ సదృశం అంటే ఆకాశంలా వ్యాపకతత్త్వమైన చైతన్య అవతారులే పరమహంస వారు. ఖగోళశాస్త్రం ప్రకారం కొన్ని నక్షత్రాల వెలుగు (ప్రకాశం) ఇంతవరకూ పృథ్విని చేరలేదు. అంటే ఆ నక్షత్రాలు ఎంత దూరంలో ఉన్నాయో మీరే ఆలోచించండి. సూర్యుణ్ణి ఒక బంతి (ఫుట్‌బాల్)తో పోల్చినట్లయితే, దాని ముందు మన పృథ్వి ఒక బఠాణీ గింజతో సమానం. కానీ సూర్యచంద్రులు, నవగ్రహాలు, పృథ్వి, అసంఖ్యాకమైన నక్షత్రాలు - ఇవన్నీ కలిసి ఒక బ్రహ్మాండం. అందుకే ఆ తల్లిని 'అనేక కోటి బ్రహ్మాండ నాయిక' అన్నారు. ఇంత వ్యాపక, గంభీరమైన విషయాన్ని పరమహంస వారు వర్షాకాలంలో గంగలో కనిపించే పీతల సంతానంతో పోల్చారు. అప్పుడు "బేలూరు మఠం వద్ద పారే గంగాజలాన్ని దోసిళ్ళలోకి తీసుకున్నట్లయితే అసంఖ్యాకంగా ఎండ్రకాయ పిల్లలు దోసిళ్ళలోకి వస్తాయి. దాన్ని బట్టి మీరే ఆలోచించండి, మొత్తం నీళ్ళలో ఎన్ని పీతలున్నాయో!" అన్నారు. ఒక్కొక్క పిల్లను ఒక్కొక్క బ్రహ్మాండంతో పరమహంస వారు పోల్చారు. అందువల్లే వేదాలలో *"పాదోస్య సర్వభూతాణి త్రిపాదస్యా అమృతం దివి"* అన్నారు. ఆ పరమాత్మ యొక్క ఒక పాదంలో భూతాలన్నీ ఉన్నాయి. మిగిలిన మూడు పాదాలూ భూతాల కన్నా వేరుగా ఉన్నాయి. ఆ వ్యాపక తత్త్వాన్ని మానవులు తమ అల్పబుద్ధితో ఎలా చింతన చేయగలరు? అందుకనే పరమహంస వారు "ఉప్పు బొమ్మ సముద్రం లోతు తెలుసుకోవడానికి బయలుదేరి సముద్రం మధ్యలో కరిగిపోయింది" అన్నారు. ఈ వ్యాపక తత్త్వాన్ని సూచించడానికి 'గగన సదృశం' అన్నారు.

**ఈశం:** 'ఈశం' అంటే శాసకుడని అర్థం. వ్యాపక చైతన్యమే సృష్టికి ముందు మాయను ఆధారంగా చేసుకొని అంతర్యామి ఈశ్వరుడు అవుతాడు. అతడే సూత్రాత్మనూ, విరాట్టుణ్ణీ, తదితర దేవ, గంధర్వ, యక్ష, రాక్షస, కిన్నెర, కింపురుషాదుల్నీ శాసిస్తూ ఉంటాడు. తత్త్వ మొకటే! రెండు కావు. అందుకనే పరమహంస వారిని పరతత్త్వంతో ఒకటిగా భావించి *'ఈశం'* అన్నారు.

**సర్వభూతాదివాసం:** పైన పేర్కొన్న తత్త్వం జడ, చైతన్యాలన్నింటిలో సమానంగా ఉంది. కనుక దాన్నే "సర్వభూతాది వాసం" అన్నారు.

**త్రిగుణ రహితం:** సత్త్వ, రజో, తమో గుణాలను 'త్రిగుణా'లంటారు. త్రిగుణాలు మాయాంతర్గతములైనవి. చైతన్యం త్రిగుణాతీతం. అందువల్లే శ్రీరామకృష్ణులను 'చైతన్య తత్త్వం'గా భావించాలనే ఉద్దేశంతో "త్రిగుణ రహితం"అన్నారు.

**సత్ చిత్ బ్రహ్మరూపం:** ముందు సచ్చిదానంద రూపాన్ని వర్ణించాం. ఆత్మతత్త్వం కన్నా వేరైనదంతా కల్పితమే! కల్పిత వస్తువులకు అస్తిత్వాన్నీ, స్ఫూర్తినీ ఇచ్చేది, అధిష్ఠాన రూపంలో ఉన్న చైతన్య తత్త్వం. దాన్నే వేదాల్లో మహావాక్యాల ద్వారా చెప్పారు. *"అహం బ్రహ్మాస్మి", "అయం ఆత్మా బ్రహ్మ", "తత్త్వమసి", "ప్రజ్ఞానం బ్రహ్మ"* అన్నారు. ఈ ఏకత్వ భావాన్నే సచ్చిదానందరూపుడైన జీవుడే బ్రహ్మమని చెబుతూ, *'సత్ చిత్ బ్రహ్మరూపం'* అన్నారు.

**వరేణ్యం:** అంటే "సంభజనీయం". భజించడానికీ, సేవించటానికీ, గ్రహించడానికీ, అనుభవించడానికీ ఆ తత్త్వ మొక్కటే యోగ్యమైంది. బొందిలో ప్రాణం ఉండగా ఆ తత్త్వాన్ని అనుభవించినట్లయితే మన అస్తిత్వం ఉన్నట్లు; లేకుంటే అస్తిత్వం సమసిపోయినట్లే! తత్త్వజ్ఞానం కలుగకపోతే, పునర్జన్మలు తప్పవు. అందువల్ల వరించాల్సిన యోగ్యమైన వస్తువు ఆ పరతత్త్వం ఒక్కటే! అది చెప్పడానికే తత్త్వంతో అభిన్నులయిన ఆ పరమ హంసవారిని "వరేణ్యం' అన్నారు. అలాంటి శుద్ధస్వరూపమైన పరమహంస వారిని భజించెదము గాక!

**"వితరితుమవతీర్ణం జ్ఞానభక్తి ప్రశాంతీః**
**ప్రణయ గలిత చిత్తం జీవదుఃఖా సహిష్ణుం**
**ధృతసహజ సమాధిం చిన్మయం కోమలాంగం**
**విమల పరమహంసం రామకృష్ణం భజామః"**

**వితరితుం:** అజ్ఞానులకు జ్ఞానం, నాస్తిక పామరులకు భక్తి, లౌకిక దుఃఖ దావాగ్నిలో తిరుగాడే వారికి శాంతి పంచేందుకు అవతరించిన వారు శ్రీరామకృష్ణ పరమహంస. *'సర్వం ఖల్విదం బ్రహ్మ'* - అంటే ఈ కనిపించేది అంతా పరబ్రహ్మ స్వరూపమే అని, కేవలం చైతన్యమేననీ అర్థం. దీన్ని అవహేళనచేసిన నరేంద్రనాథుని అజ్ఞానం పారద్రోలి, మూడు రోజులపాటు చైతన్యాన్ని దర్శించే జ్ఞానం అనుగ్రహించిన మహానుభావులు శ్రీరామకృష్ణులు. నాస్తికుడైన గిరీశ్‌చంద్ర ఘోష్‌కు భక్తిని కలిగించిన దయామయుడు. కల్పతరు దినాన కోరినవారి కోరికలను ఈడేర్చి ప్రశాంతి నొసగిన అవతార మూర్తి. అందుకే **'వితరితుమవతీర్ణం జ్ఞానభక్తి ప్రశాంతీః'** అన్నారు.

**ప్రణయ గలిత చిత్తం:** రాణీ రాసమణి అల్లుడైన మధురనాథ్ బిశ్వాస్‌తో ఒకసారి శ్రీరామకృష్ణులు యాత్రలు చేస్తూ, కొంతమంది పేద ప్రజలనుచూసి వారి మధ్యలో కూర్చొని, మధురనాథ్‌ను వారందరికీ తినడానికి ఆహారం, కట్టుకొనేందుకు బట్టలు, తలకు రాసుకొనేందుకు నూనె ఇమ్మన్నారు. ఇదే రామకృష్ణ సంఘం సేవా కార్యక్రమాలకు నాంది. అందుకనే ఇప్పుడు కూడా సంఘ సభ్యులు ఈశ్వర భావంతో జీవుల సేవచేస్తూ **'ఆత్మనో మోక్షార్థం జగత్ హితాయ చ'** అనే లక్ష్యం కోసం పాటుపడుతున్నారు. దాన్ని ఇక్కడ 'ప్రణయగలిత చిత్తం' అన్నారు.

**జీవదుఃఖా సహిష్ణుం:** అంటే జీవుల దుఃఖంచూసి ఎవరి హృదయం ద్రవించిందో వారు అని అర్థం. తరువాతి కాలంలో ఇదే విషయాన్ని స్వామి వివేకానంద విదేశం నుంచి సోదర శిష్యులకు లేఖ వ్రాస్తూ 'దీనులనూ, దుఃఖితులనూచూసి ఎవరి మనస్సు ద్రవిస్తుందో వారే మహాత్ములు. అలా కాని వారిని దురాత్మునిగా లెక్కకట్టాలి' అన్నారు. 'విద్యా విహీనులనూ, ఆకలితో అలమటించేవారిని చూసీచూడనట్టుగా వదిలేసి, వారి పరిశ్రమ వల్లే ధనవంతులు, విద్యావంతులు అయినవారిని నేను దేశద్రోహులుగా జమ కడతాను' అన్నారు.

**ధృత సహజ సమాధిం:** స్వాభావికంగా శ్రీరామకృష్ణ పరమహంస వారి మనస్సు ఎల్లప్పుడూ సమాధి స్థితికి చేరేది. దాన్ని ఎంతో ప్రయత్నంచేసి వారు క్రిందికి తీసుకువచ్చి భక్తులతో మాట్లాడగలిగేవారు.



మాస్టర్ మహాశయ్ ('మ') మొదటిసారిగా పరమహంస వారినిచూసి ఆశ్చర్య చకితులై, 'భగవన్నామ స్మరణతో ప్రాపంచిక బాహ్యస్మృతిని పూర్తిగా కోల్పోవడం సాధ్యమా' అని తర్కిస్తూ వీరిలో ఆ స్థితిని చూశారు.

**చిన్మయం:** చిత్+మయం. అంటే చైతన్య ప్రాచుర్యం అని అర్థం. శరీరంలో ఉన్నా కూడా వారు ఎల్లప్పుడూ ఆ చిన్మయ రూపిణి అయిన కాళీమాతను స్మరిస్తూ ఆ చైతన్యం యొక్క ఆనందాన్ని అనుభవించేవారు. రాత్రి సమయంలో కేవలం రెండు మూడు గంటలు నిద్రించి మధ్య రాత్రి 'పంచవటి'కి వెళ్ళి ధ్యానంలో నిమగ్నమయ్యేవారు. అందుకనే వీరిని "చిన్మయం" అనే విశేషణంతో స్తుతించారు.

**కోమలాంగం:** శ్రీరామకృష్ణుల శరీరం అత్యంత కోమలం. ఒకసారి రాత్రి సమయంలో భుజించే అల్పాహారంలో 'లూచీ' (చిన్నపూరీ)ని త్రుంచుతుండగా చేతి వ్రేలు గాయపడి రక్తం కారసాగింది. అంత సున్నితమైన శరీరం ఆ అవతారమూర్తిది. కనుకనే "కోమలాంగం" అనే విశేషణంతో సంబోధించారు. అట్టి శుద్ధ స్వరూపులైన పరమహంస వారిని భజిద్దాం. N



**''Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation, inwardly, and by work done in a spirit of service outwardly"**

- Swami Ranganathananda

... 17వ పేజీ తరువాయి















చేపలు చెరువులో ఎంత లోతులో ఉన్నప్పటికీ, ఎర వేయగానే గబగబా వచ్చి, దాన్ని చుట్టుముడతాయి. అలాగే భక్తి శ్రద్ధలు సమృద్ధిగా ఉన్న భక్తుల వద్దకు భగవంతుడు అమిత వేగంతో వస్తాడు. - శ్రీరామకృష్ణ పరమహంస

వ్యాఖ్యాత: సామవేదం షణ్ముఖశర్మ

# శివమహిమ్నః స్తోత్రం

విలేఖనం: శ్రీమతి ఎన్. శేషు



(గత సంచిక తరువాయి)

**స్వలావణ్యాశంసా ధృత ధనుష మహ్నాయ తృణవత్**
**పురః ప్లుష్టం దృష్ట్వా పురమథన పుష్పాయుధమపి ।**
**యది స్త్రైణం దేవీ యమ నిరత దేహార్ధ ఘటనా -**
**దవైతి త్వామద్ధా బత వరద ముగ్ధా యువతయః ॥23॥**

ఈ శ్లోకంలో పరమేశ్వరుని అర్ధనారీశ్వర స్వరూపాన్ని చూపిస్తున్నారు. అర్ధనారీశ్వరాకృతిలోని విశేషం ఏమిటంటే- జగత్తు కోసం (ఉన్నది) ఒక్కటే (అయినా అది) రెండయింది అని చెప్పడం. అర్ధనారీశ్వర ఆకృతి అంటే రెండుగా కనపడుతున్న ఒక్కటి - జననీ జనకులుగా గోచరించే పరమేశ్వరుడు. ఆయన పరమేశ్వరుడు, ఆమె పరమేశ్వరి.

అమ్మవారికి ఒక భావన ఉండేదట - **స్వ లావణ్యాశంసా** = 'నా లావణ్యంతో ఈయన్ని నేను జయించగలను' అనే ఆశంస ఆమె దగ్గర ఉంది. ఆమె మొదట శివుణ్ణి జయించడానికి వెళ్ళింది. దేనితో- స్వలావణ్యా! ఏమిటా లావణ్యం అంటే, ఆవిడ సామాన్యురాలు కాదు. ప్రపంచంలో ఉన్న సౌందర్యమంతా ఆ తల్లి కాలి ధూళి కణం నుండి వచ్చిందే. అంటే, ఆ తల్లి ఎంత అందమైందో ఊహించండి! ఆ తల్లి సౌందర్యం ఊహకు కూడా అతీతమైంది. **స్వలావణ్యాశంసా ధృత ధనుష మహ్నాయ తృణవత్**. ఇక్కడ **ధృత ధనుషం** = ధనుస్సు పట్టుకున్న మన్మథుణ్ణి; **అహ్నాయ** = శీఘ్రంగా; **తృణవత్ పురఃప్లుష్టం దృష్ట్వా**= ఎండు గడ్డి తగలబెట్టినట్లు తగలబెట్టాడు; అమ్మవారి ఎదురుగా తగలబెట్టాడు. (అప్పుడయినా అమ్మ వారికి "ఈయనను భౌతికమైన కామనా వికారం లొంగదీయలేదు" అని తెలియాలి.) **పురమథన** = పురమథనా, **పుష్పాయుధ మపి** = పుష్పాయుధుడైన అతడు ధనుస్సు పట్టి నిలబడితే, నువ్వు తగలబెట్టడం చూసినప్పటికీ ఆ తల్లి తన లావణ్యంతో గెలవగలననుకుంది.

**యది స్త్రైణం దేవీ యమ నిరత దేహార్ధ ఘటనా దవైతి త్వామద్ధాబత వరద ముగ్ధా యువ తయః** - మన్మథ దహనంచేసిన తరువాత ఆయన అమ్మవారికి లొంగిపోయి, సగం దేహమిచ్చాడు. అప్పుడు అమ్మవారు "ఈయన నాకు లొంగిపోయారు" అనుకున్నారట. ఎదురుగా మన్మథుడు దహనమైనా ఆవిడ అలా అనుకున్నారంటే 'పాపం అమాయకురాలు' అంటున్నారిక్కడ. **బత** = ఆహా, అయ్యో ఆశ్చర్యం; **ముగ్ధా యువ తయః**= ఆవిడ అమాయకురాలు కనుక ఆయన నాకు లొంగిపోయారు అనుకుంది. ఎందుకు? **దేహార్ధ ఘటనాత్** = (ఆయన) దేహంలో సగం ఇవ్వడంతో ఆమెకు లొంగిపోయాడనుకుంది. ఇందులో మన్మథుణ్ణి కాల్చడం, అమ్మవారికి అర్ధదేహాన్ని ఇవ్వడం అనే రెండు విశేషాలు చూపిస్తున్నారు. ఇక్కడ దేహార్ధ ఘటనాత్ అంటే పార్వతీ పరమేశ్వరుల కల్యాణం చూపిస్తున్నారు. ఈ సృష్టికి సంబంధించిన కామానికి అధిదేవతను తగలబెట్టి, అమ్మవారిని సగం చేసుకున్నాడు. అంటే అర్థం తాను అమ్మవార్ని వివాహమాడడం కానీ, తన దేహంలో సగం ఇవ్వడం కానీ ఈ సృష్టిగతమైన మనోవికారాలకు సంకేతం కాదు. మనోవికారాల్ని అప్పటికే తగలపెట్టాడు (కామ దహనంతో). అమ్మవారిని స్వీకరించడం సృష్టికి అతీతమైన లీల. అమ్మవారు అలా అనుకుంటే ఆమె పొందే ఆనందం కోసం అలా అనుకునే భావన ఆయన కలగజేశారు. అమ్మవారు శివుడికి ప్రథమ భక్తురాలు, శివుడు భక్తవత్సలుడు. అమ్మవారు భక్తితో శివుణ్ణి వశ్యం చేసుకోవాలనుకున్నందు వల్ల **దేహార్ధ ఘటనాత్** - సగభాగాన్ని ఇచ్చాడు. తన సహజ విరాగస్థితి నుండి చ్యుతం కాకుండానే ఆవిడను చేపట్టాడు. ఆత్మ స్థితి నుండి జారకుండానే గృహస్థాశ్రమం నిర్వహించినవాడు ఆయన.

**యమనిరత** = పరమనిగ్రహ సంపన్నుడు పరమేశ్వరుడు. పరమేశ్వరుడు లోకంలో ఇన్ని విధాలుగా కనిపిస్తున్నా తన స్థితి యందు తానుంటాడు. అతడు శాశ్వతుడు, భక్తవత్సలుడు. తపస్సుకు మాత్రమే లభ్యుడు. ప్రకృతి నిండా పరమేశ్వరుడు వ్యాపించి ఈ జగత్తును నిర్వహిస్తున్నాడు కానీ, ప్రకృతికి తాను లొంగిపోలేదు. ప్రకృతి యందు తన శక్తినంతా నింపి తాను నిండినప్పటికీ ప్రకృతికి అతీతంగానే ఉన్నాడు అనే మరొక సంకేతాన్ని ఇందులో చెబుతున్నారు. ఇలా అర్ధనారీశ్వర తత్త్వాన్నీ, శివపరిణయగాథనూ చెబుతూ, శ్రీచక్రాకృతిని (శ్రీవిద్యాస్వరూపాన్ని) కూడా ఇందులో చూపిస్తున్నారు. శ్రీవిద్య అనేది ఆ పార్వతీ పరమేశ్వరుల ఉపాసన - సమత్వభావనతో కూడిన భావనను తెలియజేసే ఉపాసన - సమయోపాసన, సమయాచారం. అంటే



శివశక్తులు ఉభయులూ ఏకమని తెలిసి చేసే ఉపాసన. ఆదిశంకరులు "*చాంపేయ గౌరార్ధ శరీరకాయా కర్పూర గౌరార్ధ శరీరకాయా, ధమ్మిల్లకాయైచ జటాధరాయ నమశ్శివాయై చ నమశ్శివాయ...*'' అంటూ వర్ణిస్తూ రెండు భాగాలు చూపుతున్నారు. ఎడమ భాగం సంపెంగ లాంటి బంగారు ఛాయతో, రెండో వైపు కర్పూరంలా తెల్లటి కాంతితోనూ ఉందట (అది శివుడి కాంతి). వంకీలు తిరిగిన కేశాలతో అమ్మవారు చక్కగా ప్రకాశిస్తున్నారట. వారి పేర్లూ ఒక్కటే – శివా, శివః ('శివా' స్త్రీ లింగం, 'శివః' పుంలింగం). ఒకే శివత్వం శివా శివులుగా వచ్చింది. ఈ అర్ధనారీశ్వర స్తుతిలో మనం స్థూలంగా భావన చేయడానికి అనువైన చక్కని ధ్యానమూర్తిని అద్భుతంగా ఇచ్చారు.

శివశక్తుల ఏకత్వాన్ని నిక్షిప్తంచేసిన ఈ శ్లోకం ద్వారా ఆదిదంపతులు ఉభయుల్నీ స్మరింపచేసి ఒక్కసారి శ్రీచక్రభావన, అర్ధనారీశ్వర భావన అన్నీ మన హృదయంలో ముద్రింపజేస్తున్నారు పుష్పదంతాచార్యులు.

**శ్మశానేష్వాక్రీడా స్మరహర పిశాచాః సహచరా**
**శ్చితాభస్మాలేపః స్రగపి నృకరోటీ పరికరః ।**
**అమంగళ్యం శీలం తవ భవతు నామైవ**
**మఖిలం**
**తథాపి స్మర్తౄణాం వరద పరమం**
**మంగళమసి ॥ 24**

ఇప్పటి వరకూ శివుని స్థూల స్వరూపాల్నీ, సగుణ స్వరూపాల్నీ, లీలల్నీ ఆధారంచేసుకుని తత్త్వాన్ని చెబుతున్నారు. అటు తరువాత పూర్తిగా తత్త్వంలోకి వెళుతున్నారు. శివుడు ప్రధానంగా తత్త్వ స్వరూపుడు. ఆయన రూపంలోనే ఏదో విశేషం ఉంది. మూడు కన్నులు, జటాజూటం, నెత్తి మీద నీరు, నుదుట నిప్పు, ఒంటి నిండా బూడిద, అంతలోనే కైలాసం, అంతలోనే శ్మశానం. శివుడి స్వరూపాన్ని మనం స్థూలంగా వింటున్నాం కానీ మన వేదాలు, పురాణాలు పరిశీలిస్తే– శివుడెక్కడ ఉంటాడు? కైలాసంలో తిరిగే ఆ స్వామి ఎక్కడ తిరుగుతున్నాడంటే.....

**శ్మశానే ష్వాక్రీడా** = శ్మశానంలో ఆడుకుంటున్నాడు; **స్మరహర** = మన్మథుణ్ణి దహించినవాడు; **పిశాచాః సహచరాః** = శరీరం లేని వాళ్ళు నీకు సహచరులు; **చితాభస్మా లేపః** = చితా భస్మం పూసుకునేవాడు; **స్రగపి నృకరోటీ పరికరః** = (నృకరోటీ =పుర్రె) కపాలాల మాల వేసుకున్నవాడు (స్రగ=మాల). ఆయన రూపమంతా ఈ విధంగా అమంగళ్యమైనా, ఆయనను స్మరిస్తున్న వారికి మహామంగళ స్వరూపుడు ఆయన. **పరమం మంగళం** = అంతకు మించి శుభం లేదు; **వరద మంగళం** = శ్రేష్ఠమైనవి ఇచ్చేవాడివి నువ్వు. (అని రెండు చెబుతున్నారు)

ఒక వైపు "*చాంపేయ గౌరార్ధ శరీరకాయా...*" అంటూ ఆ దివ్యస్వరూపాన్ని వర్ణిస్తూ, వెంటనే ఈ రూపాన్నిచూపిస్తున్నారు. అలా ఉన్నా ఇలా ఉన్నా కూడా ఆ స్వామి పాదాల మీద గంధర్వులు, సురులు, యక్షులు మొదలైనవారు వచ్చి పడుతున్నారు. సర్వవ్యాపకుడైన పరమేశ్వరుడు అన్ని చోట్లా ఉంటాడు. అన్నీ తగలబడిపోయే లక్షణం ఉన్నవే, కానీ తగలబడని లక్షణం కలవాడు ఒక్కడే. అన్నీ నశించాక మిగిలింది శ్మశానం, ఆయన అక్కడ ఒక్కడే ఉన్నాడు. ఆయన మహా శ్మశానంలో ఉన్నాడు. మహా ప్రళయకాలంలో సర్వ జగత్తు లయమై పోతుంది. ఒక చోటు మాత్రం లయం కాదు – అది కాశీ క్షేత్రం. దాన్ని ఆయన ఆ సమయంలో త్రిశూలం ఎత్తి పట్టుకుంటారు. అందుకు అన్నీ నశించినా అది నశించకుండా ఉంది కనుక కాశీని మహా శ్మశానం అన్నారు.

**శ్మశానేష్వా క్రీడా** = ఆ శ్మశానంలో ఆయన ఆనందంగా విహరిస్తున్నారు. అలా విహరిస్తుంటే... **పిశాచాః సహచరాః** అన్నప్పుడు... స్థూలదేహాన్ని విడిచిపెట్టినా సూక్ష్మదేహాలుంటాయి, అన్నిటికీ పూర్తి లయం జరగదు. మళ్ళీ జగత్తులోకి వెళ్ళేవారుంటారు, శరీరబంధం లేని వాళ్ళుంటారు. కర్మ పరిపాకం తీరని జీవులు మళ్ళీ పుట్టాలి. వాటినే 'పిశాచాః' అన్నారు. వాటికి కూడా శివుడే ఆశ్రయుడు. ఎలాంటి వాళ్ళనైనా కాదనకుండా దగ్గరకు తెచ్చుకుంటాడు; (అందుకే సిస్టర్ నివేదిత 'హి నెవర్ రెఫ్యూజెస్ ఎనీ వన్' = శివుడు ఎవర్నీ కాదనడు అన్నారు.) వాడు పిశాచమా, దైవమా, రాక్షసుడా అని చూడడు. అలలన్నీ సముద్రాన్ని ఆశ్రయించుకుని ఉన్నట్లు జీవులు ఆయన్ని ఆశ్రయించుకుని ఉన్నాయి; ఆయనలోనే లీనమవుతాయి.

చితాభస్మాలేపః అనడంలో అర్థం – సర్వ జగత్తునీ అగ్ని స్వరూపుడైన కాలాగ్నిహోత్రుడికి దగ్ధంచేసిన తరువాత మిగిలిన దాన్ని ఒంటికి పూసుకున్నాడట! ఎందుకంటే అలా వదిలేస్తే అది గాలికి చెల్లాచెదురై పోతుంది. అందుకు తానే ఒంటికి పూసుకున్నాడు – అంటే దాచుకున్నాడు. జగత్ సృష్టికి కావాల్సిన బీజాలు ఆ విధంగా సారరూపంగా దాచుకున్నాడు. ఆయన ఒక్కసారి చెయ్యి విదిలిస్తేచాలు అవి రాలుతాయి, మళ్ళీ సృష్టింపబడుతుంది జగత్తు. అలాగే **సృగపి** అంటే పుర్రెలు, అంటే ఖాళీ అయిపోయిన తలకాయలు. తలపులు, గొడవలు, అలజడులు అన్నీ ఖాళీ అయిపోయి శూన్యమైన మనస్సు ఉంటే

అవి శివుణ్ణి చేరుతాయి. వేటికీ అంటని ముక్తసంగస్థితిలో చేరిన జీవుడి యొక్క జ్ఞానం మాత్రమే ఈశ్వరుణ్ణి చేరుతుంది. జ్ఞానుల ఆలోచనలన్నీ ఆయన్నే చుట్టుకుని ఆయన్నే ఆశ్రయించుకుని ఉంటాయి. ఇంత తెలిసినవారు ఇది మంగళమనీ, ఇది అమంగళమనీ ఎవరైనా అనగలరా? సృష్టిలో సర్వం శివమయం అని తెలిసినవాడు దేనికీ చలించకుండా ఉంటాడు. ఈశ్వరుణ్ణి అర్థం చేసుకొని యోగీశ్వరునిలా ఉండగలడు. ఈ దేహంపై తాను అనే భావన లేని యోగి పరమేశ్వరునికి చేరువవుతాడు.

పైగా అమంగళ్యాన్ని ఎవరు భరించగలరు? అమంగళం ముట్టుకుంటే తాను అమంగళుడవుతాడని భయమున్నవాడు అమంగళ్యాన్ని ముట్టుకోడు. అమంగళం తన దగ్గరున్నా తన మంగళత్వానికి లోటు లేదనుకున్నవాడు అమంగళాన్ని భరిస్తాడు. ఎవరైతే సహజ మంగళుడో ఆయన వద్ద అమంగళం ఉన్నా అతనికి ఏమీ కాదు; సరికదా అమంగళానికి కూడా మంగళత్వం వస్తుంది. విషం లోకమంతా వ్యాపించినప్పుడు (విషం) భయంకరమైనదే. కానీ 'నీలకంఠా' అని దణ్ణం పెడుతున్నాం; ఎందుకంటే అది ఆయన దగ్గర ఉంది కనుక మనల్నేమీ చెయ్యదు. అలాగే గజాసురుడు నేను మరణించాక "నా శరీరాన్ని వస్త్రంగా కట్టుకో" అన్నాడు. గజాసురుని కోరిక తీర్చడానికి ఆ గజచర్మం కట్టుకుంటాడు శివుడు. అంత వరకూ గరుకుగా, రక్తం ఓడుతున్న ఆ చర్మం ఆయన కట్టుకోగానే నల్లటి పట్టు వస్త్రంగా మారిపోయిందట. స్పర్శ చేత అమంగళాన్ని కూడా మంగళంగా మార్చగలిగేటంత మంగళస్వరూపుడు శివుడు. అందుకే –

"*చితాభస్మమైన గాని, శివ నీ తనువంటు కొనుచు విభూతిగా వందనీయ మిదుగో మాకు, అశుభమ్ములు నిన్నుచేరి అతి శుభమ్ములు అవును శివా...*" అన్నాడు ఒక భక్తుడు ఆర్తితో.

సర్వ జగత్తు ఏ స్థితిలో ఉన్నా ఆశ్రయమిచ్చేవాడు పరమేశ్వరుడు. ఆయన సర్వాశ్రయుడు అని తెలిసిన వాడు ఆయనలోనే లీనమై ఆనందిస్తాడు; అది మహాలయం.

**మనః ప్రత్యక్చిత్తే సవిధమవధాయాత్తమరుతః**
**ప్రహృష్య ద్రోమాణః ప్రమద సలిలో త్సంగి తదృశః ।**
**యదా లోక్యాహ్లాదం హ్రద ఇవ నిమజ్యా మృత మయే**
**దధత్యం తస్తత్త్వం కి మపి యమిన స్తత్కిల భవాన్ ॥ 25**

సాధన ఏ విధంగా చెయ్యాలో ఇందులో చెబుతున్నారు. **భవాన్ తత్ కిలః**= అది నీవే; యోగులు దేన్ని చేరుతున్నారో అది నీవు. ఇక్కడ చెబుతున్న "అది" మాటకు అందనిది. మాటా, మనస్సూ పట్టుకోలేనిది ఒక్కటే – అది పరబ్రహ్మ. అందుకే దాన్ని "తత్" అంది వేదం. "ఆ "అది" అన్నది అనిర్వచనీయ వస్తువు" అనీ, "ఆ తత్ నువ్వు" అనీ చెబుతున్నారు. "ఇంతవరకూ వర్ణించిన దివ్యమంగళ స్వరూపాలన్నీ నీ యొక్క తత్త్వమే" అంటున్నారు.



**యమినః** = యోగులు; యమిని అంటే నిగ్రహించేవాడు, యమము = నిగ్రహం. నిగ్రహశక్తి కల యోగులందరూ నిన్ను చేరుతున్నారు. **మనః ప్రత్యక్ చిత్తే సవిధమవ ధాయాత్తమరుతః** = మనస్సుని ప్రత్యక్ చిత్తం చెయ్యమన్నారు. ప్రత్యక్ = ఎదురు తిరుగుట, లోపలకి వెళ్ళడం. మన 'మనోరూప చైతన్యం యొక్క లక్షణం బయటకు పరుగు పెట్టడం. ఇంద్రియాలనే తొమ్మిది తలుపులలో నుంచి మనస్సనే బాలుడు బయటకు పరుగెడుతూనే ఉంటాడు. దాన్ని అదుపులో పెట్టుకోవడం మనకి చేతనవడం లేదు. ప్రత్యక్ చిత్తే= ఎదురీత, మనః ప్రత్యక్చిత్తే సవిధ మవధాయా= ఇంద్రియాల నుంచి మరల్చి అలాంటి మనస్సును లోపలకు పంపేవాడే ధీరుడు. **ఆత్తమరుతః** = మనస్సును నిగ్రహించే సాధనం. ముందు ఊపిరిని నిగ్రహించడం. మనస్సు నిలవాలి అంటే ప్రాణాయామం చెయ్యమంటారు. ప్రాణాయామంచేసి ఊపిరిని నిగ్రహిస్తే, ప్రాణాన్ని అంటిపెట్టుకున్న బుద్ధి క్రమంగా నిగ్రహించబడి క్రమంగా సాధన పెరుగుతుంది. (అందుకు) **సవిధమవధాయ ఆత్తమరుతః** = ఊపిరి నిగ్రహించాలి. అందుకు భక్తి, ధ్యానం, కర్మ – అన్నీ ధ్యాన యోగంతో మిళితం కావాలి. ధ్యానయోగంలోకి వెళితే కానీ అసలు తత్త్వం గోచరించదు. వాయువును నిరోధించి, మనస్సును అంతర్లీనంచేసి, యోగీశ్వరులు క్రమక్రమంగా మహానందమయమైన నిన్ను దర్శిస్తున్నారు. ఆ సచ్చిదానంద ఘనమైన పరమేశ్వరుడి స్వరూపాన్ని దర్శించగానే వాళ్ళకు కలుగుతున్న ఆనందం ఏమిటంటే... **ప్రహృష్యద్రోమాణః** = వాళ్ళ ఒళ్ళంతా పులకించి పోయి; **ప్రమద సలిలోత్సంగి తదృశః**= ఆనందంతో బాష్పాలు రాలుస్తూ; **యదా లోక్యాహ్లాదం**= దేన్ని చూడడం వల్ల ఒళ్ళంతా పులకించి, ఆనందబాష్పాలు రాలుస్తూ మునిగిపోతారో ఆ ఆనందంలో వాళ్ళు మరి తేలాలనుకోరు;

**హ్రద ఇవ నిజ్యామృతమయే!** హ్రద ఇవ = ఒక అమృతపు మడుగులో పడితే మరి తేలాలనిపించదు. అమృతమంటే ఈశ్వరానుభవం; అందులో మునిగిపోవడం వల్ల ఒళ్ళంతా పులకించి ఆనందాశ్రువులు రాలుస్తూ ఉండిపోతారు యోగులు. (ఎక్కడంటే) **దధత్యంతస్తత్త్వం** = ఆ అంతస్తత్త్వాన్ని ధరించడం చేత వాళ్ళు అలాంటి స్థితికి వెళతారు. "ఆ అంతస్తత్త్వమే నువ్వు శివా" అని విశేషంగా ఈ శ్లోకంలో చెబుతున్నారు. అంటే పరమేశ్వరుడు యోగులందరూ చేరే గమ్యస్థానం. దాని పేరు లింగం. లిం= సర్వ జగత్తూ దేని యందు లీనమవుతుందో; గం = సర్వజగత్తూ దేనిని పొందుతోందో, అది లింగం! దాన్ని పొందితే ఇక వాళ్ళకు బాహ్యం అక్కర్లేదు. అంతర్దృష్టి ఉన్న వాళ్ళకు మాత్రమే ఈశ్వరుడు గోచరిస్తాడు. బాహ్య దృష్టి ఉన్నవాడికి గోచరించదు. ఈ బాహ్యాలు ఏవీ పట్టనివాడు గనుకనే "శ్మశానేష్వా క్రీడా" ఇత్యాదులను చెప్పి ... చేసేవాళ్ళకే ఈశ్వరుని అఖండైశ్వర్యం లభిస్తుంది అన్నారు. G *(తరువాతి వివరణ వచ్చే సంచికలో...)*



(....23వ పేజీ తరువాయి)

## ఆశావహ దృక్పథంతో అసంతృప్తి మటుమాయం

### అంధత్వాన్ని జయించిన అతివ

ఓ అంధురాలు జీవితం పట్ల ఆశావహ దృక్పథం ఏర్పరచుకుని, తన విధి విధానాల్ని మార్చుకున్న కథ చూద్దాం. ఆమె భగవంతుడి గురించి, ఆధ్యాత్మికత గురించి మాట్లాడదు. కానీ ఆమె వ్యక్తిత్వంలోని ఔన్నత్యం ఆమె సాధించిన గొప్ప ఆధ్యాత్మిక పురోగతిని తెలియజేస్తుంది. డాక్టర్ ప్రభుశంకర వ్రాసిన 'జన – మన' అనే కన్నడ రచన నుంచి దీన్ని తీసుకున్నాం.

అమెరికావాసి అయిన శ్రీమతి హేరియట్ అంధురాలు. సంగీతం నేర్చుకోవడానికి ఆమె మన దేశానికి వచ్చింది. చిన్నతనంలో ఒక ప్రమాదంలో ఆమె కంటిచూపు పోయింది. కానీ పట్టుదలతో బ్రెయిలీ లిపి నేర్చుకుని, విశ్వవిద్యాలయ పట్టా సాధించింది. ఆమె ఈ రచయితతో సంభాషిస్తూ, చూపులేని లోటును తన తల్లితండ్రుల సహకారంతో ఎలా అధిగమించిందో, జీవితంలో ఎలా పురోగమించిందో వివరించింది. "నా తల్లితండ్రులు గొప్ప ధైర్య విశ్వాసాలతో ఉండేవారు. చూపులేని కుమార్తెను చూసుకునే బాధ్యతను వహించి, క్రమంగా ఈ కొత్త పరిస్థితికి అలవాటుపడ్డారు. మిగిలిన పిల్లలతో ప్రేమగా ఎలా వ్యవహరించారో నాతో కూడా అంతే ప్రేమగా వ్యవహరించారు.

"అంటే?"

"వాళ్ళు నేనొక అంధురాల్ని అని, నా పట్ల ప్రత్యేకమైన శ్రద్ధ అవసరమని అనుకోలేదు. వాళ్ళు నన్ను కట్టడిచెయ్యలేదు. నేను పరిగెత్తాను, ఈత కొట్టాను, గెంతులు వేశాను. వాళ్ళు నా పనుల్లో మాటిమాటికీ తలదూర్చి నన్ను ఆపలేదు. నేను ఎలా పురోగమిస్తున్నానో గమనించేవారు. అత్యవసరమైనప్పుడూ, నేనేదైనా ప్రమాదంలో చిక్కుకుంటానని భావించినప్పుడు మాత్రం నాకు సహాయపడడానికి వచ్చేవాళ్ళు. ఇది నాకెంతో తోడ్పడింది."

"ఎలా?"

"నేను ధైర్యం, ఆత్మవిశ్వాసం పెంచుకోగలిగాను. స్వేచ్ఛగా పెరిగే అవకాశం లభించింది. చూపులేనిదాన్ననీ, జీవితంలో ఇతరులవలే పైకి ఎదగలేననీ నేనెప్పుడూ అనుకోలేదు."

"మీరు మీ ఆహారాన్ని ఎలా ఏర్పాటు చేసుకుంటున్నారు?"

"నా వంట నేనే చేసుకుంటాను. నేను అంత బాగా వంట చేయడంచూసి మా అమ్మ కూడా ఆశ్చర్యపోతుంది. చేతితో స్పర్శించడం ద్వారా వంట సామగ్రిని, సరుకుల్ని గుర్తించగలను. నా చెయ్యి కొలతకు ఉపయోగపడుతుంది. శబ్దాన్ని బట్టి పాలు పూర్తిగా కాగినదీ, లేనిదీ గుర్తించగలను. రకరకాల ధాన్యాలూ, కూరలూ ఉడకడానికి ఎంతసేపు పడుతుందో నాకు తెలుసు. వంట చెయ్యడమనేది నాకు సమస్య కానేకాదు."

"శ్రీమతి హేరియట్ గారూ! మీలో ఇంకొక ఆశ్చర్యకరమైన విషయం చూశాను. మీరు ఎప్పుడూ ఆనందంగా ఉంటారు. ఈ భవనంలోని పైఅంతస్తులో ఉన్న స్నేహితురాలి దగ్గరకెళ్ళి మీరు గట్టిగా నవ్వుతూ, అరుస్తూ ఉంటే పైకప్పు ఎగిరిపోతుందేమో అనిపిస్తుంది. మీరు అలా సంతోషంగా ఉండడానికి కారణం?"

"నా సంతోషానికి చాలా కారణాలే ఉన్నాయి. ఈ ప్రపంచంలో చాలా మందికి కూడు, గుడ్డ, ఉండడానికి కనీసం గుడిసె కూడా లేవు. నాకు అవన్నీ ఉన్నాయి. పైగా నేను చదువుకున్నాను. నాకు విద్య అబ్బింది. ఇవేమైనా తక్కువ సంపదా? ఇవే నా ఆనందానికి మూలం! ఇంతకన్నా ఇంకేం కావాలి!"

"అంధత్వం వల్ల మీరు నిస్పృహ చెందలేదా?"

"లేదు! ఎప్పుడూ లేదు! ఈ ప్రపంచం మనకు ఎంతో ఇచ్చింది. అందుకు ప్రతిగా మనం ఏమిస్తున్నాం? చాలా తక్కువ. అయినా ఈ ప్రపంచం మనకు ఇంకా ఇస్తూనే ఉంది. ఇంతకన్నా ఎక్కువ ఆశించడం సబబు కాదేమో! బహుశా ఇంకా ఎక్కువ కావాలని అడిగేందుకు మనకు హక్కు ఏం ఉంది? ఈ విషయం గుర్తుంచుకుంటే మనం సంతోషంగా ఉండగలం."

శ్రీమతి హేరియట్ ధైర్యం మనందరికీ ఆదర్శం కావాలి. అంగవైకల్యాన్ని అధిగమించడానికి ఆమెకు చెప్పుకోతగ్గ ధైర్యముంది.

ఒకసారి హేరియెట్ బ్యాంకుకు వెళ్ళారు. పది నిమిషాలలో కావలసిన పనికి గంటకు పైగా పట్టింది. కనీస మర్యాదగానైనా ఆమెకు ఏం కావాలని ఎవరూ అడగలేదు. ఆమె తననేదో ప్రత్యేకంగా గౌరవించాలని కోరలేదు. అమెరికా నుంచి వచ్చిన చెక్కును తన ఖాతాలో జమచేయడానికి ఇచ్చి, తనకు కావలసిన డబ్బు తీసుకోవడానికి మరొక చెక్కు ఇచ్చారు. ఒక అట్టముక్క సహాయంతో ఆమె సంతకంచేశారు. ఇంతసేపూ ఆమె ముఖంలో కాస్తంత చిరాకు కూడా కానరాలేదు. ఆమె ఏ మాత్రం విసుగు చెందలేదు.

మరొకసారి ఆమె స్నేహితురాలు శస్త్రచికిత్స చేయించుకోవడానికి ఆస్పత్రిలో చేరింది. స్నేహితులు ఎంత వద్దంటున్నా వినకుండా రాత్రింబవళ్ళూ ఆ స్నేహితురాలికి సహాయం చేసింది. తాను అంధురాలైనప్పటికీ, ఆస్పత్రి గోడలను ఆసరాగా చేసుకుని, అటూ ఇటూ తిరిగి పనిచేసింది.

ఒడుదొడుకులు మన ప్రవర్తనను దెబ్బతీయనివ్వకుండా, శ్రీమతి హేరియట్‌లాగా మనం జీవితాన్ని ఎదుర్కోగలమా? తోటివారి కన్నా మనం అదృష్టవంతులం. కానీ మన కోరికలకూ, అసంతృప్తికీ అంతులేదు. మనం ఎప్పుడూ ఏదో లేదన్న అసంతృప్తితోనే ఉంటాం. బలహీనతల్ని అధిగమించడానికి ప్రయత్నించి, ఆశావహమైన గుణాలను దృఢతరం చేసుకున్నప్పుడు మాత్రమే మన జీవితం సంతోషమయం, అర్థవంతం కాగలదు. I

*(సశేషం) అనువాదం: అమిరపు నటరాజన్*

ఆంగ్లమూలం: డాక్టర్ ఎస్. రమణి

అనువక్త: రెంటాల జయదేవ



భారతీయ మహిళా మణిదీపాలు: మదాలస

# ఆత్మజ్ఞానం నేర్పిన అరుదైన మహిళ

**పి**ల్లలకు అందమైన పేర్లు పెట్టుకోవాలని చాలా తాపత్రయ పడుతుంటాం. ఒక తండ్రి అలాగే తన బిడ్డల కోసం వెతికి వెతికి, ఆలోచించి మరీ మంచి పేర్లు పెట్టాడు. అయితే ఆ పేర్లు విని ఆయన భార్య ఫక్కున నవ్వింది. అవన్నీ పనికిరాని పేర్లని తేల్చేసింది. ఆత్మ స్వభావానికీ, ఆ పేర్లకూ పొత్తు కుదరడం లేదని తేల్చి చెప్పింది. భారత పురాణేతిహాసాల్లో జ్ఞానమూర్తిగా ఓ విశిష్ట స్థానాన్ని సంపాదించుకొన్న ఆ స్త్రీమూర్తి మదాలస. జోలపాటలతోనే కన్నబిడ్డలకు ఆత్మతత్త్వాన్ని చల్లగా అందించి, తన కడుపున పుట్టిన పిల్లలు మళ్ళీ గర్భనరకం అనుభవించకూడదని, మహా తత్త్వజ్ఞానులుగా వాళ్ళను రూపొందించిన ఆదర్శమూర్తి ఆమె. అలాంటి మదాలస మన తల్లులందరికీ ఆదర్శం కావాలి.

గంధర్వ రాజైన విశ్వావసు కుమార్తె మదాలస. ఆమె రూపవతి, యౌవనవతి, గుణవతి. భూలోకంలోని శత్రుజిత్తు మహారాజు కుమారుడైన ఋతధ్వజుణ్ణి ఆమె వివాహమాడింది. ఋతధ్వజుడికి కువలయాశ్వుడనే పేరు కూడా ఉంది. ఋతధ్వజుడు, మదాలస కొన్నేళ్ళు సుఖంగా సంసారం సాగించారు. అయితే, వారి పట్ల విధి క్రూరంగా వ్యవహరించింది.

వనవాటికల్లో నివసిస్తున్న మహర్షులను కొందరు రాక్షసులు తీవ్రంగా పీడించసాగారు. ఆ ఋషి పుంగవులను కాపాడాల్సిందిగా శత్రుజిత్తు మహారాజు తన కుమారుడైన ఋతధ్వజుణ్ణి ఆదేశించాడు. దాంతో, ఋతధ్వజుడు ఆ పని మీద వెళ్ళాడు. కాగా, అక్కడ అరణ్యంలో ఓ రాక్షసుడు మారువేషంలో వచ్చి, మోసకారి మాటలతో ఋతధ్వజుణ్ణి అక్కడే ఉండేలాచేసి, తాను రాచనగరుకు వెళ్ళాడు. అక్కడ శత్రుజిత్తు మహారాజును కలిసి, ఆయన కుమారుడైన ఋతధ్వజుడు రాక్షసుల చేతిలో మరణించాడని అబద్ధం చెప్పాడు. భర్త మరణవార్త వినగానే మహాసాధ్వి మదాలస సైతం ప్రాణాలు విడిచి పెట్టింది. ఋతధ్వజుని తల్లితండ్రులైన మహారాజు, మహారాణి మాత్రం ఎలాగో గుండె దిటవుచేసుకొని, దుఃఖాన్ని దిగమింగుకోవడానికి ప్రయత్నించారు. ఋషులను కాపాడే ప్రయత్నంలో ఋతధ్వజుడు వీరమరణం పొందాడని, భర్త చనిపోయాడని తెలియగానే ప్రాణాలు వదలడం ద్వారా మదాలస పతివ్రతగా నిలిచిపోయిందని వారు తమను తాము సమాధానపరుచుకున్నారు.

ఇలా ఉండగా, ఋతధ్వజుణ్ణి మోసపుచ్చి అడవిలోనే ఉంచి వచ్చి, అతను మరణించాడంటూ నగరంలో అబద్ధ ప్రచారంచేసిన రాక్షసుడు, తిరిగి అడవికి వెళ్ళాడు. ఋతధ్వజుడు వెళ్ళిపోవడానికి అనుమతినిచ్చాడు. రాచనగరుకు తిరిగి వచ్చిన ఋతధ్వజుడికి జరిగిన కథ తెలిసింది. మదాలస ప్రాణాలు వదిలిపెట్టిందన్న విషయం అతణ్ణి విపరీతంగా బాధించింది. భార్యకు తర్పణం విడిచి, యథావిధిగా ఉత్తర కాలక్రియలు చేశాడు. అప్పటి నుంచి మళ్ళీ పెళ్ళంటూ చేసుకోకుండా, ధర్మబద్ధంగా మిగిలిన జీవితాన్ని గడపాలని నిశ్చయించుకున్నాడు.

ఇది ఇలా ఉండగా, ఋతధ్వజుడి గుణగణాల కారణంగా నాగలోకానికి చెందిన ఇద్దరు రాకుమారులతో అతనికి స్నేహం కుదిరింది. ఆ ఇద్దరు రాకుమారులూ నాగలోకాధిపతి అయిన అశ్వతరుని కుమారులు. భూలోకానికి తరచూ వస్తూ వెళుతుంటారు. ఆ ఇద్దరు కొడుకుల వల్ల ఋతధ్వజుడి కథ, అతని శీలసంపద గురించి నాగరాజైన అశ్వతరుడు విన్నాడు. జరిగినది తెలుసుకొని చలించిపోయాడు. ఋతధ్వజుడికి ఏదైనా సాయం చేయాలని నిశ్చయించుకున్నాడు. తపస్సుచేసి, ఆ పైన పరమశివుణ్ణి ప్రార్థించి, మదాలసకు మళ్ళీ ప్రాణం వచ్చేలా చేశాడు. పరమేశ్వరుడి వరప్రసాదం వల్ల – మరణించినప్పటి వయసుతో, పూర్వరూపంతో మదాలస ఇప్పుడు నాగరాజైన అశ్వతరుడికి కుమార్తెగా జన్మించింది. నాగలోకాధిపతి కోరిక మేరకు ఆమెకు పూర్వజన్మ స్మృతి ఉండేలా పరమ శివుడు అనుగ్రహించాడు. అంతేకాక, యోగశాస్త్రంలో ప్రావీణ్యం సంపాదించి, ఆమె మహాయోగిని అయ్యింది.

దాంతో, ఇప్పుడిక మదాలస ప్రతి విషయాన్నీ భిన్నమైన దృక్పథంతో చూడగలుగుతోంది. తనతో సహా సమస్త ప్రపంచమూ మిథ్య అని ఆమె గ్రహించింది. సచ్చిదానంద స్వరూపమైన ఆత్మజ్ఞానం ఆమెకు సిద్ధించింది.

ఇది ఇలా ఉండగా, ఋతధ్వజుణ్ణి రప్పించి, మదాలసను అతనికి అప్పగించాడు నాగలోకాధిపతి. మళ్ళీ బతికివచ్చిన భార్యతో సహా భూలోకానికి తిరిగొచ్చిన ఋతధ్వజుడు సుఖంగా కాలం గడపసాగాడు.



కొంతకాలానికి శత్రుజిత్తు కాలధర్మం చెందాడు. తండ్రి మరణంతో ఋతధ్వజుడు మహారాజు అయ్యాడు. మదాలస ముగ్గురు కుమారులకు జన్మనిచ్చింది. వారికి విక్రాంతుడు, సుబాహువు, అరిమర్దనుడు (లేదా శత్రుదమనుడు) అని పేర్లు పెట్టారు. నిజానికి, ఇలా పిల్లవాడు పుట్టిన ప్రతిసారీ మదాలస బిగ్గరగా, సుదీర్ఘంగా నవ్వేది. పిల్లవాడు ఏడుస్తున్న ప్రతిసారీ వాణ్ణి ఉయ్యాలలో పడుకోబెట్టి, ఓదార్చే నెపంతో చిత్రమైన జోలపాట పాడేది. "నాయనా! నువ్వు శుద్ధుడివి. నిరంజనుడివి. నిర్వికారుడివి. నీకు పేరు లేదు. నీకు ఇక్కడ పెట్టిన ఈ పేరు వట్టి కల్పితం మాత్రమే. ఈ దేహం కానీ, ఈ మనస్సు కానీ నువ్వు కావు. పంచభూతాత్మకమైన ఈ శరీరానికీ, మాయకూ అతీతమైన చిరంతనమైన ఆత్మవు నువ్వు" అని అర్థం వచ్చే జోలపాటతో పసిపిల్లవాడికి ఆత్మతత్త్వం బోధించేదామె. ఆ రకంగా ముగ్గురు కొడుకుల్లోనూ మదాలస ఆత్మ జ్ఞానం కలిగించింది. ఫలితంగా, ఆ ముగ్గురికీ ప్రాపంచిక విషయాల పట్ల అనాసక్తి ఏర్పడింది. వివాహం చేసుకోకుండా వారు నిష్కామకర్మలు చేయసాగారు.

కొంతకాలానికి మదాలసకు నాలుగో కుమారుడు పుట్టాడు. వాడికి పేరు పెట్టబోతున్న ఋతధ్వజ మహారాజు, పక్కనే ఉన్న భార్య మదాలస వైపుచూశాడు. ఈసారి కూడా ఆమె గట్టిగా నవ్వేసింది. తాను పేరు పెట్టినప్పుడల్లా ఆమె నవ్వుతుండడం చూసిన ఋతధ్వజుడు ఈసారి ఈ నాలుగో పుత్రుడికి పేరును నువ్వే ఎంపిక చేయాల్సిందిగా ఆమెను కోరాడు. అప్పుడు మదాలస ఆ నాలుగో కుమారుడికి 'అలర్కుడు' అని పేరు పెట్టింది. వాడు పెరిగి పెద్దవాడై, ధర్మాత్ముడూ, బుద్ధిమంతుడై ఖ్యాతి సంపాదిస్తాడని చెప్పింది.

అయితే, 'అలర్క' శబ్దానికి 'పిచ్చి కుక్క' అని అర్థం. అలాంటి పేరు పెట్టావేమిటని మహారాజు అడిగేసరికి, ఏదో పిలుచుకోవడం కోసం ఆ పేరు పెట్టానని ఆమె చెప్పింది. నిజానికి, రాజుగారు పెట్టిన మునుపటి మూడు పేర్లూ అర్థరహిత మైనవేననీ మదాలస పేర్కొంది. దానికి కారణం కూడా ఆమె చెప్పింది. ఆత్మ అనేది అంతటా వ్యాపించి ఉంటుందనీ, దానికి ఆకారమంటూ లేదనీ వివరించింది. దేహాలన్నిటిలోనూ ఉన్న ఆత్మ ఒక్కటేనని స్పష్టంచేసింది. కాబట్టి విక్రాంతుడు (విశేషమైన గమనం కలవాడు), సుబాహువు (చక్కటి బాహువులు కలవాడు), శత్రుదమనుడు (శత్రువుల పీచమణచేవాడు) అనే పేర్లు వట్టి అర్థం లేనివని మదాలస తేల్చేసింది. ఆత్మజ్ఞానం లేనివాడు వెర్రి పనులుచేస్తాడు కాబట్టి, 'వెర్రి కుక్క' అని అర్థం వచ్చేలా 'అలర్కుడు' అని పేరు పెడితే తప్పేమిటని, నాలుగో కుమారుడికి తాను పెట్టిన పేరు గురించి వివరించింది.

మదాలస మాటల్లోని తర్కం, ఔచిత్యం రాజుకు అర్థ మయ్యాయి. దాంతో, అతనేమీ అనలేకపోయాడు. అయితే, నాలుగో కుమారుడైన అలర్కుడికైనా తత్త్వబోధ చేయకుండా పెంచాల్సిందిగా భార్యను కోరాడు. ధర్మాచరణ మార్గంలో నిపుణుడిగా అతణ్ణి తీర్చిదిద్దాల్సిందిగా అభ్యర్థించాడు. దాని వల్ల నాలుగో కుమారుడైనా కర్మ మార్గంలో పయనిస్తూ, వంశాభివృద్ధి చేసి, దేవతలు, మానవులు, ఇతర ప్రాణుల సేవలో తరిస్తాడని చెప్పాడు. భర్త కోరిక మేరకు మదాలస తమ ఆఖరి పుత్రుడికి ఆ రకమైన బోధచేసింది. అతడు క్రమంగా పెరిగి పెద్దవాడవు తున్న కొద్దీ, మహారాజు ఆచరించాల్సిన ధర్మాలను బోధించింది. ఆత్మ నిగ్రహం, యుక్తాయుక్త పరిజ్ఞానం, ధర్మాన్నీ, న్యాయాన్నీ కాపాడడం, పరోపకారంలాంటి ఉత్తమ అంశాలను అతనికి నూరిపోసింది.

కాలగమనంలో వృద్ధుడైన ఋతుధ్వజుడు కుమారుడైన అలర్కుడికి పట్టాభిషేకం జరిపి, రాజ్యభారం అతనికి అప్పగిం చాడు. తపస్సు చేసుకోవడం కోసం అడవికి పయనమయ్యాడు. మదాలస సైతం భర్తను అనుసరించింది. వెళ్ళిపోయే ముందు మదాలస ఓ బంగారు ఉంగరాన్ని కుమారుడు అలర్కుడికి ఇచ్చి, "నాయనా! గృహస్థాశ్రమంలో ఉండి రాజ్యపాలన చేస్తున్నప్పుడు నీకు రకరకాల సమస్యలు ఎదురుకావచ్చు. మరీ పెద్ద కష్టం ఎదురైనప్పుడు ఈ ఉంగరం తీసి, దీని లోపల చిన్న చిన్న అక్షరాల్లో రాసిపెట్టిన శాసనపత్రం చదువుకో. నీకు సరైన దోవ ఏదో తెలుస్తుంది" అని చెప్పింది.

మదాలస, ఆమె భర్త అడవికి వెళ్ళిపోయాక, అలర్కుడు ధర్మం తప్పకుండా, ప్రజల్ని కన్నబిడ్డల్లా పాలించసాగాడు. అలా ఎన్నో ఏళ్ళు గడిచాయి. విజయం, సౌభాగ్యం దక్కాయి. సమస్త రాజ్యభోగాలు, సంసార సుఖాలు అనుభవించాడు. అయితే, అవేవీ అతనికి అపరిమిత ఆనందాన్నీ, సంతృప్తినీ ఇవ్వలేకపోయాయి.

ఈ క్రమంలో అలర్కుడు విషయ సుఖాలకు దాసుడయ్యా డనే సంగతి అప్పటికే సుదీర్ఘ కాలంగా అడవిలో ఆశ్రమ జీవితం గడుపుతున్న అతని అన్నయ్య సుబాహువుకు తెలిసింది. దాంతో, అతను తన తమ్ముడికి ఎలాగైనా ఈ రాజ్య సుఖాలపై విరక్తి కలిగించి, ఆత్మజ్ఞానం కలిగేలా చేయాలని నిర్ణయించుకున్నాడు.

అనుకున్నదే తడవుగా అలర్కుడి రాజ్యంపై దండయాత్ర జరిపి, ఆక్రమించుకోవాల్సిందిగా సుబాహువు కాశీ రాజును ప్రేరేపించాడు. కాశీ రాజు నేర్పు, యుద్ధతంత్రం అలర్కుణ్ణి విషాదం పాలుచేశాయి. అతనికి ఇక ఏం చేయాలో పాలుపోలేదు.

**(మిగతా 38 వ పేజీలో....)**




# రామకృష్ణ మిషన్



**5/475, ట్రంకు రోడ్డు, కడప - 516 001 (ఆంధ్ర ప్రదేశ్)**

ఫోను: 08562 - 241633, *E - mail: kadapa math@ yahoo.com; website: www.rkm-kadapa.org*

## విజ్ఞప్తి

**రా**యలసీమ ప్రాంతానికి చెందిన కడప పట్నంలో రామకృష్ణ మిషన్ శాఖ 2005లో ప్రారంభమైంది. ఆధ్యాత్మిక, సాంఘిక, సేవా రంగాలలో సేవలందించడానికి కడప శివార్లలో శాటిలైట్ - టౌన్‌షిప్‌గా రూపుదిద్దుకుంటున్న సుందరమైన ప్రాంతంలో రాష్ట్ర ప్రభుత్వం రామకృష్ణ మిషన్‌కు పది ఎకరాల భూమిని కేటాయించింది. ఈ స్థలంలో క్రింద తెలిపిన కార్యక్రమాలతో ఆధ్యాత్మిక సేవా కేంద్రం అభివృద్ధికి రామకృష్ణ మిషన్ ఒక బృహత్తర ప్రణాళికను రూపొందించింది.




1. **శ్రీరామకృష్ణుల విశ్వజనీన మందిరం**
2. **సాధు నివాస భవనం**
3. **కార్యాలయం, గ్రంథాలయం, పుస్తక విక్రయశాల**
4. **పాఠశాల భవనం** - పేద విద్యార్థులకు ఉత్తమ ప్రమాణాలతో విద్య నేర్పడానికీ, ఉన్నత పాఠశాలల విద్యార్థులకు ఉచితంగా ప్రత్యేక శిక్షణా తరగతులు నిర్వహించడానికీ ఈ పాఠశాల భవనం.
5. **ఉచిత హాస్టల్ భవనం:** ఉన్నత పాఠశాలలకు చెందిన పేద విద్యార్థుల బస కోసం ఈ ఉచిత హాస్టలు.
6. **ఆరోగ్య కేంద్రం:** హోమియో, ఆయుర్వేదం, ఫిజియోథెరపీ విభాగాలతో ఉచిత వైద్య సేవలందిస్తుంది.
7. **సభా ప్రాంగణం:** విద్యా సాంస్కృతిక కార్యకలాపాలు, ఉచిత మధ్యాహ్న భోజన వసతి నిర్వహించడానికి వీలుగా విశాలమైన భవనం.
8. **మానవ వనరుల అభివృద్ధి (హెచ్.ఆర్.డి) సంస్థ:** స్పోకెన్ ఇంగ్లీషు, కంప్యూటరు శిక్షణ, యోగా, విలువల ఆధారిత విద్యల శిక్షణ తరగతులను ఈ సంస్థ నిర్వహిస్తుంది.
9. **హెచ్.ఆర్.డి సంస్థ అతిథి బోధకులకు వసతి గృహం:** మానవ వనరుల అభివృద్ధి సంస్థ రెసిడెన్షియల్ కోర్సులో శిక్షణ పొందే విద్యార్థులకూ, అతిథి బోధకులకూ బస కోసం వసతి గృహం.
10. **గ్రామీణాభివృద్ధి సంస్థ:** గ్రామీణ యువకులకు తోటల పెంపకం, సాగునీటి యాజమాన్యం, గ్రామీణ ఆర్థికవ్యవస్థ, తేనెటీగల పెంపకం, పుట్టగొడుగుల పెంపకం, నీటి పంపుల మరమ్మత్తుల లాంటి అంశాల్లో శిక్షణ కోసం భవనం.

సహజ సుందరంగా శోభిల్లుతున్న ఆ పది ఎకరాల స్థలంలో ఇప్పటికే ఈ పని ప్రారంభమైందని హితులకూ, శ్రేయోభిలాషులకూ సంతోషంగా తెలియజేస్తున్నాం. దాదాపు 550 లక్షల రూపాయల అంచనాలతో ప్రారంభమైన ఈ ప్రజోపయోగమైన పనులకు ప్రతి ఒక్కరి నుంచీ ధన, వస్తు సహాయ, సహకారాలు అర్థిస్తున్నాం. విరాళాలను కృతజ్ఞతతో స్వీకరిస్తాం.

**'రామకృష్ణ మిషన్, కడప'** పేరిట చెక్కులు, డ్రాఫ్టుల రూపంలో విరాళాలను **'సెక్రటరీ, రామకృష్ణ మిషన్, 5/475, ట్రంకు రోడ్డు, కడప - 516 001'** అనే చిరునామాకు పంపవలసిందిగా కోరుతున్నాం. మీరిచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం మినహాయింపు ఉంది. పెద్ద మొత్తాలిచ్చే దాతల పేర్లు పాలరాతి మీద, ప్రత్యేక శిలా ఫలకాల మీద వ్రాయిస్తాం.

భగవత్సేవలో

**స్వామి ఆత్మవిదానంద**

కార్యదర్శి

– రెంటాల జయదేవ



### ఆచార వ్యవహారాలు - అంతరార్థాలు - 12

# పూజాదికాలకు ఆసనం అవసరమా?

మనం ఏ కార్యక్రమం నిర్వహిస్తున్నా సరే, మన శారీరక భంగిమ, మన శ్రద్ధాసక్తులు మనకు తెలియకుండానే ఆ పని మీద ప్రభావం చూపుతాయి. మరీ ముఖ్యంగా, పూజ, జపం, ధ్యానం లాంటివి చేస్తున్నప్పుడు మనం ఎలా కూర్చున్నాం, దేని మీద కూర్చున్నామనేది గమనించాల్సిన విషయం. ఎందుకంటే, మనంచేసే ఆ జప ధ్యానాలు నిర్విఘ్నంగా పూర్తి అయి, సత్ఫలితాలు ఇవ్వడానికి అవి కీలకం.

**ఆసనం అంటే?:** సర్వసాధారణంగా ఏదైనా ప్రార్థనచేస్తున్నప్పుడు, ఏదైనా వైదిక కార్యక్రమాలు నిర్వహిస్తున్నప్పుడూ కాళ్ళు మడత పెట్టి, పద్మాసనంలో కూర్చోవడం హిందువుల సంప్రదాయం. ఆ పద్మాసన భంగిమలో కూడా వట్టి నేల మీద కాకుండా ఏదైనా ఆసనం పరుచుకొని, దాని మీద కూర్చోవడం ఆచారం. సరైన ఆసనం మీద కూర్చొని, వైదిక కర్మకాండ నిర్వహిస్తే పూర్తి ఫలితం సిద్ధిస్తుంది. ఆసనం వాడడం వెనుక ఇలా ఎంతో ప్రాధాన్యం ఉంది.

**ఆత్మ సిద్ధి ప్రధానాచ్చ సర్వ రోగ నివారణమ్ ।**
**నవ సిద్ధి ప్రధానాచ్చ ఆసనం పరికీర్తితమ్ ॥**

'ఆత్మ జ్ఞానం కలిగించడానికి, సర్వ రోగాలనూ నివారించడానికి, నవ సిద్ధులనూ ప్రాప్తింపజేయడానికీ 'ఆసనం' ఎంతో అవసరం'.

'ఆసనం' అనే మాటకు ఓ విశేష వివరణ కూడా పెద్దలు చెప్పారు. 'ఆసనం'లోని 'ఆ' అంటే ఆత్మ సాక్షాత్కారాన్ని కలిగించేది. 'స' అంటే సర్వరోగాలనూ హరించేది. 'నం' అంటే నవ సిద్ధులనూ ఇచ్చేది అని విశేష అర్థం. అందుకే, పూజా పునస్కారాలకూ, జపతపాలకూ ఆసనం ముఖ్యమైన అవసరం.

ఆసనంగా వేటిని ఉపయోగిస్తారంటే – పులిచర్మం, కృష్ణాజినం (నల్ల జింక చర్మం), కంబళి, చిత్రాసనం, దర్భాసనం, ధావళి, పట్టు వస్త్రం, నూలు వస్త్రాలను ఆసనాలుగా ఉపయోగించవచ్చు.

**ఆసనం వాడడం ఎందుకు?:** ఇంతకీ అసలెందుకు ఆసనం వినియోగించాలి, వినియోగిస్తే తక్షణ ప్రయోజనం ఏమిటని ఎవరికైనా సందేహం రావచ్చు. దీనికి మన పెద్దవాళ్ళు శాస్త్రీయమైన ఓ వివరణ ఇచ్చారు. కఠోర జపతపాలుచేస్తున్నప్పుడు సాధకుడిలో గణనీయమైన స్థాయిలో శక్తి ఉత్పన్నమవుతుంది. ఆ అంతర్గత శక్తి అతని ముఖవర్చస్సులో ద్యోతకమవుతూ ఉంటుంది. వట్టి నేల మీద కూర్చొని జపతపాలు నిర్వహించడం వల్ల ఓ ఇబ్బంది ఉంది. మన శక్తిని భూమి ఆకర్షించే ప్రమాదం ఉంది. కాబట్టి, దర్భాసనం పరచుకొని, దాని మీద కూర్చొని, జపతపాలుచేస్తే ఆ ఆసనం భూమ్యాకర్షణ శక్తిని నిరోధిస్తుంది. ఆ రకంగా జపతాపాల వల్ల సాధకుడిలో ఉత్పన్నమైన శక్తి వృథా కాకుండా కాపాడుతుంది.

**ఆసనాన్ని బట్టి మారే ఫలితం:** ఏ ఆసనం మీద కూర్చొని జప ధ్యానాలుచేశామనే దాన్ని బట్టి మనకు దక్కే ఫలితం మారుతుందని పెద్దల మాట.

**కృష్ణాజినే జ్ఞానసిద్ధి ర్మోక్ష శ్రీ ర్వ్యాఘ్ర చర్మణి ।**
**స్యా త్పౌష్టికం చ కాశేయం శాన్తికం వేత్ర విష్టరమ్ ॥**

'యోగ, జప, ధ్యాన, స్తోత్ర పూజా సమయాల్లో జింక చర్మంపై కూర్చుంటే జ్ఞానం సిద్ధిస్తుంది. పులి చర్మంపై కూర్చుంటే మోక్షం కలుగుతుంది. దర్భాసనం మీద కూర్చుంటే పుష్టిని కలిగిస్తుంది. పేము (బెత్తం) ఆసనం మీద కూర్చున్నట్లయితే, శాంతిని కలిగిస్తుంది'.

ఇదే శ్లోకానికి ఇతర రూపాలు కూడా ఉన్నాయి.

**కృష్ణాజినే జ్ఞానసిద్ధి ర్మోక్ష శ్రీ ర్వ్యాఘ్ర చర్మణి।**
**వశాజినే వ్యాధినాశః కంబళే దుఃఖమోచనమ్॥** (ఆచారార్కే)

'కృష్ణాజినం వల్ల జ్ఞానసిద్ధి, పులిచర్మం వల్ల మోక్షం కలుగుతాయి. ఆడ ఏనుగు చర్మాన్ని ఆసనంగా వాడితే వ్యాధులు నశిస్తాయి. ఇక, కంబళాన్నివాడితే దుఃఖాల నుంచి విమోచనం కలుగుతుంది'.

**శాంతికే కంబళఃప్రోక్తఃసర్వేష్టం చిత్రకంబళే॥**(ఆచారార్కే)

'శాంతి కర్మల్లో కంబళిని వాడాలి. ఇక, చిత్రాసనం (ఊలుతో చేసిన ఎర్రటి ఆసనం) మీద కూర్చొని జప ధ్యానాలు చేస్తే, అన్ని కోరికలూ నెరవేరతాయి'.

**కృష్ణాజినే నోపవిశే । త్కదాచిత్పుత్రవాన్ గృహీ ॥**
(స్మృతిసార సముచ్చయే)

'పుత్రవంతుడైన గృహస్థు కృష్ణాజినం మీద కూర్చొనరాదు'. కాబట్టే, దర్భాసనం మీద కృష్ణాజినానికి బదులుగా చిత్రాసనాన్నీ, దాని మీద వస్త్రాన్నీ పరచుకోవడం ఆచారం.

ప్రతి ఒక్కరూ తమ ప్రార్థనా స్థలాన్ని పరిశుభ్రంగా ఉంచుకోవాలి. గ్రామీణ ప్రాంతాల్లో పర్ణశాలల్లో నివసించే వారు ఆవు పేడతో ఆ స్థలాన్ని అలికి ఉంచుకోవడం మంచిది. ఇక, ఆవు పేడతో అలికిన ఆసనం మీద కూర్చొని, పూజాదికాలు నిర్వహిస్తే, పవిత్రత కలుగుతుంది.

**కృష్ణాజినం, వ్యాఘ్రాజినాల్లోని విశేషం:**

బ్రహ్మచారులకు శక్తినీ, పుష్టినీ, బ్రహ్మ వర్చస్సునూ ఇచ్చే గుణం ముంజ దర్భలోనూ, కృష్ణాజినంలోనూ ఉంది. బ్రహ్మచర్య పాలన ఎంతో కీలకం కాబట్టి, ఉపనయన సమయంలో వటువుతో ముంజ దర్భను మొలనూలుగా



ధరింపజేస్తారు. అలాగే, కృష్ణాజినం కూడా బ్రహ్మచర్య పాలనకు తోడ్పడుతుంది. కృష్ణాజినం కన్నా వ్యాఘ్రాజినం (పులి చర్మం)లో ఈ శక్తి ఇంకా ఎక్కువ. అందుకే, బ్రహ్మచారులకు కృష్ణాజినం, సన్న్యాసులకు వ్యాఘ్రాజినం శ్రేష్ఠమని చెప్పారు.

వీలుంటే గోళ్ళతో సహా ఉన్న పులిచర్మాన్ని సంపాదించి, దాన్ని ఆసనంగా వాడాలి. అలా ఉపయోగిస్తే, ఆధ్యాత్మికత పెంపొందుతుంది. అంతేకాక, సాధకుడి శరీరంలో అది విద్యుచ్ఛక్తిని కలిగిస్తుంది.

పులి చర్మాన్ని కానీ, జింక చర్మాన్ని కానీ ఆసనంగా వాడుతున్నప్పుడు తల భాగం మన ముందు వైపు ఉండేలా దాన్ని పరుచుకోవాలి. అంతే తప్ప అడ్డంగా వేసుకోకూడదు. ఇక, కంబళి, దర్భాసనం మొదలైన ఆసనాల్ని ఉపయోగిస్తున్నప్పుడు చివరలు ముందుకు ఉండేలా వేసుకోవాలి.



**మంత్ర సిద్ధికి మహత్తర సాధనం దర్భాసనం:** మంత్ర సిద్ధికి దర్భాసనం అతి ముఖ్యమైనది, పవిత్రమైనది. దీనికి కారణం లేకపోలేదు. నవగ్రహాల్లో కేతువు అనుగ్రహానికి చెప్పిన సమిధ దర్భ. ఇది ఒక విధమైన గడ్డి జాతికి చెందిన మొక్క. నదీ తీరాల్లో పెరుగుతుంటుంది. దర్భనే 'కుశం' అని కూడా అంటారు. మృదువుగా ఉండేవి, గరుకుగా ఉండేవి అంటూ రెండు రకాల దర్భలున్నాయి. ఈ రెండూ యజ్ఞాల్లో వాడడానికి చాలా ప్రశస్తమైనవి. శుభానికైనా, అశుభానికైనా కర్మకాండల్లో ఈ దర్భల్ని వాడతారు. అందుకే, వీటిని 'యజ్ఞ భూషణ'మని పిలుస్తారు. దర్భలతో ఆసనాలు అల్లుతారు. వాటినే జపం చేసుకొనేవారు ఉపయోగిస్తుంటారు.

మంత్రసిద్ధికీ, దర్భాసనానికీ లంకె ఏమిటంటే - జ్యోతిశ్శాస్త్ర రీత్యా నవగ్రహాల్లో కేతువు మోక్షకారకుడు. అలాగే, తపస్సు, మంత్ర కుశలత, బ్రహ్మజ్ఞానం, వేదాంతం, వైరాగ్యం, విశేష బుద్ధి మొదలైనవి కేతువు అనుగ్రహంతో సిద్ధిస్తాయి. ఎందుకంటే, కేతు గ్రహానికి అధిదేవత - బ్రహ్మ. కేతువు అనుగ్రహానికి చెప్పిన సమిధ దర్భ కాబట్టి, దర్భాసనం మీద కూర్చొని జపధ్యానాలుచేస్తే, దోషాలు పోయి, పైనపేర్కొన్న సుగుణాలు సిద్ధిస్తాయి. మనస్సుపై ప్రభావంచూపే గుణం కూడా ఉన్నందువల్లే పూజ, జపధ్యానాదులకు దర్భాసనం వాడాల్సిందిగా చెప్పారు.

**ఆసనమేదీ అందుబాటులో లేకుంటే?:** మామూలుగా అయితే, శుభ్రంచేసిన నేల మీద దర్భాసనం పరచి, దాని మీద వ్యాఘ్ర చర్మం కానీ, కృష్ణాజినం కానీ వేసి, దాని పైన చిత్రాసనం వేసుకొని కూర్చోవడం సర్వశ్రేష్ఠం.

పులి చర్మం, జింక చర్మాల మీద కూర్చొని జపధ్యానాలుచేస్తున్నప్పుడు వట్టి చర్మం మీద కూర్చోకూడదు. వాటి మీద పట్టు వస్త్రం కానీ, శుచియైన తెల్లటి నూలు వస్త్రం కానీ పరుచుకొని, కూర్చోవడం శుభప్రదం.

పూజాదికాలకు సిద్ధమైనప్పుడు కొన్ని సందర్భాల్లో ఎలాంటి ఆసనాలూ అందుబాటులో లేకపోవచ్చు. అలాంటప్పుడు వాటి గురించి దిగులు పడకుండా, కనీసం ఒక్క దర్భ పుల్లనైనా కింద పరుచుకోవాలి. దాని మీద శుచియైన తెల్లటి వస్త్రం పరుచుకొని, కూర్చోవాలి. ఇంతకు మునుపే చెప్పినట్లు, భూమ్యాకర్షణ శక్తి సాధకుడి ప్రాణశక్తిని లాగుతుంటుంది కాబట్టి, ఉత్త నేల మీద కూర్చోకూడదు.

వైదిక కార్యకలాపాలు నిర్వహిస్తున్నప్పుడు అందుకు తగిన ఆసనం మీద కూర్చొని, ఆ క్రతువు నిర్వహించాలని మన ధర్మశాస్త్ర గ్రంథాలు చెబుతున్నాయి.

**పీటను వాడవచ్చా?:** అతుకులు లేని ఒకే చెక్క ముక్కను ఆసనంగా ఉపయోగించవచ్చు. పీటను ఆసనంగా ఉపయోగించేది అందుకే! అయితే, దాని మీద శుచియైన తెల్లటి నూలు వస్త్రాన్ని పరుచుకొని కూర్చోవాలి, ఆసనంగా వాడాలి.

**ఏ కర్మకు ఏ రంగు వస్త్రం?:** చేస్తున్న పనిని బట్టి ఏ రంగు వస్త్రాన్ని ఆసనంగా వాడాలనేది కూడా మారిపోతుంటుంది. ఏ రకమైన కర్మలకు ఎలాంటి రంగు వస్త్రం వాడాలంటే -

***స్యాదాభిచారికం నీలా రక్త వశ్యాదికం భవేత్ ।***
***ధావళ్యే శాన్తికం మోక్షః సర్వార్థాం చిత్ర కంబళే ॥***

*'అభిచార కర్మల్లో నీలి వర్ణపు వస్త్రాన్ని ఆసనంగా ఉపయోగించాలి. వశీకరణ కర్మల్లో రక్త వర్ణపు వస్త్రాన్ని ఆసనంగా వాడాలి. శాంతికరమైన కర్మల్లో తెల్లటి వస్త్రాన్ని ఆసనంగా వినియోగించాలి.*

**ఈ ఆధునిక కాలంలో...:** నిజానికి, సాధువులు, మహర్షులు అరణ్యాల్లో నివసించే రోజుల్లో ఈ వ్యాఘ్రాజినాలు, కృష్ణాజినాలు సులభంగా దొరికేవి. వాటిని ఆసనాలుగా వాడడానికి అభ్యంతరమూ ఉండేది కాదు. కానీ, ఈ ఆధునిక కాలంలో అలా జంతు చర్మాలను కలిగి ఉండడం, వాటి కోసం జంతువులను చంపడం లాంటివి 'వన్యప్రాణి సంరక్షణ చట్టం' కింద నేరం. కాబట్టి, ఆధునిక కాలానికి తగ్గట్లుగా దర్భాసనాన్ని వినియోగిస్తూ, జపధ్యానాలు నిర్వహించడం మంచిది. అలా ఆచారాన్ని పాటిస్తూనే, ఆధ్యాత్మికంగా అనంత ఫలాన్ని పొందవచ్చు.




# గ్రంథపరిచయం

**శ్రీరామకృష్ణ కథామృతం ప్రశ్నోత్తరాలు**
**అనుసృజన: చిలుకూరు వెంకటేశ్వర్లు**
**వెల: రూ. 200/- పేజీలు: 656**
**ప్రతులకు: ఋషి ప్రచురణలు, మెయిన్ రోడ్, హనుమాన్ పేట, విజయవాడ -3.**

వంగ భాషలో మహేంద్రనాథ్ గుప్తా 'శ్రీరామకృష్ణ కథామృతం' రచించారు. దాన్ని స్వామి నిఖిలానంద ఆంగ్లంలోకి అనువదించారు. ఆ ఆంగ్ల అనువాదాన్ని చిలుకూరు వెంకటేశ్వర్లు తెలుగులోకి ఈ 'శ్రీరామకృష్ణ కథామృతం: ప్రశ్నోత్తరాలు' పేరిట స్వేచ్ఛగా అనువదించారు. మూల గ్రంథంలోని పరిసరాల, ప్రకృతి వర్ణనలను, పాటలను దాదాపు తొలగించి, ప్రశ్నోత్తరాల రూపంలో శ్రీరామకృష్ణుల సంభాషణలను ప్రధానంగా ఈ పుస్తకంలో పొందుపరిచారు రచయిత. క్లుప్తీకరణాన్నే లక్ష్యం చేసుకొన్న రచయిత శ్రీరామకృష్ణుల ముఖతఃజాలువారిన అమృతమయమైన వాక్కుల సారాంశాన్ని మాత్రమే పలుచోట్ల అందించడం జరిగింది. దీన్నిలోపంగాపెద్దచేసి పరిగణించనవసరం లేదు. ఈ గ్రంథం చదివిన పాఠకునికి తప్పక మూల విస్తృత గ్రంథాన్ని చదవాలనే స్ఫూర్తి, ప్రేరణా కలిగించేలా రచయిత దీన్ని రూపొందించారనడం సత్యదూరం కాదు. ముద్రారాక్షసాల విషయంలో మరింత జాగ్రత్త వహిస్తే బాగుండేది. C

**- శ్రీధర్**

**సాధన రహస్యము**
**రచయిత : అనుభవానందస్వామి**
**వెల: 100/- పేజీలు: 282, శ్రీరామకృష్ణ భక్త సమాజం, శ్రీఅనుభవానంద గ్రంథమాల, 11-1-13, ఎం.జి. రోడ్డు, బాపట్ల**
**గుంటూరు జిల్లా - 522 101,**

మహాపురుషుల ఆచరణలే తరువాతి తరంలో సంప్రదాయాలుగా భాసిస్తాయి. ఆదర్శప్రాయం అవుతాయి. అనుభవానంద స్వామి వారి సాధనా సారాంశమే ఈ 'సాధన రహస్యము' రచన. మొత్తం 36 అధ్యాయాలుగా భక్తి, జ్ఞాన, కర్మ, రాజయోగాల సారాన్ని సమగ్రంగా, సులభగ్రాహ్యంగా, హృదయానురంజకంగా, ఆచరణ సాధ్యంగా స్వామి వారు ఈ గ్రంథంలో పాఠకులకు అందించారు.

ఈ గ్రంథ రచన లేఖా రూపంలో సాగింది. శ్రీమాతాజీ త్యాగీశానంద గారి జిజ్ఞాస ఈ రచనకు ప్రేరణ. అయితే, సాధకులను తరింపజేసి మోక్షగాముల్ని చేయడమే ఈ గ్రంథ పరమార్థంగా కనిపిస్తుంది.

గడచిన యాభై సంవత్సరాలుగా సాధకులకు మార్గదర్శనం చేస్తూ ఆధ్యాత్మిక జిజ్ఞాసువుల సమస్యలను చక్కగా పరిష్కరిస్తూ, ఇప్పటికి పదకొండు ముద్రణలు పొందిన ఈ 'సాధన రహస్యము' గ్రంథం అపూర్వమైనది, అపురూపమైనది.

ప్రతి సాధకుడూ చదివి, మననం చేయవలసినది 'సాధన ... ఎంత మాత్రమూ లేదు. M

**గమనిక: గ్రంథ సమీక్షార్థం పుస్తకాలను పంపేవారు తప్పనిసరిగా రెండేసి ప్రతులు పంపాలి.**

*(....34వ పేజీ తరువాయి)*

## ఆత్మజ్ఞానం నేర్పిన అరుదైన మహిళ

అడవికి వెళుతూ తల్లి చెప్పిన మాటలు గుర్తుకొచ్చిన అలర్కుడు, అప్పుడు ఆ ఉంగరంలోని శాసనం బయటకు తీసి చదివాడు.

"అన్ని రకాలైన సాంగత్యాలనూ విడిచిపెట్టు. ఒకవేళ అలా విడిచిపెట్టడం సాధ్యం కాకపోతే, కేవలం సజ్జనులతోనే సాంగత్యం పెట్టుకోవాలి. ఎందుకంటే, మంచివాళ్ళతో స్నేహ సంబంధమనేది అన్ని బాధలనూ నివారించే దివ్యమైన ఔషధం. అలాగే, అన్ని విధాలైన కోరికలనూ వదిలేయాలి. అలా వదిలిపెట్టడం సాధ్యం కాకపోతే, ఈ చావు పుట్టుకల వలయం నుంచి బయటపడేసే మోక్షాన్ని మాత్రమే కోరుకోవాలి. ఇది ఒక్కటే కామ వ్యాధికి మందు" అని ఉంగరంలోని ఆ లిఖిత శాసనంలో ఉంది.

అది చదవగానే అలర్కుడికి జ్ఞానోదయమైంది. అతనికి ఒక్కసారిగా సంతోషం కలిగింది. నిరంతరమైన శాంతి, ఆనందం సాధించాలంటే అందుకు మార్గమేమిటో బోధపడింది. 'మోక్షం పట్ల కోరిక కలిగితే కానీ మానవుడికి సుఖశాంతులు సిద్ధించవు. ఇక ఆ మోక్షం పట్ల కోరిక అనేది మంచివాళ్ళతో సాంగత్యం వల్ల గానీ కలగదు' అనే సత్యం అతనికి బోధపడింది.

దాంతో అలర్కుడు పట్టణం వదిలిపెట్టి వెళ్ళి, మహాయోగి అయిన దత్తాత్రేయ మునీంద్రుణ్ణి శరణు వేడాడు. దత్తాత్రేయుని అనుగ్రహం వల్ల అలర్కుడికి ఆత్మ జ్ఞానం సిద్ధించింది. ఆ మహర్షి నుంచి అతడు యోగాభ్యాసాలనూ, ఇతర ఆధ్యాత్మిక అనుష్ఠానాలనూ నేర్చుకున్నాడు. ఆ తరువాత అతను ఆనందంగా తన రాజ్యాన్ని కాశీరాజుకు అప్పగించేసి, తపస్సు చేసుకోవడానికి అడవికి వెళ్ళిపోయాడు.

అలా మదాలస సంతానమంతా వైరాగ్యంతో మోక్షమార్గాన్ని అనుసరించింది. అతి గొప్పదైన మోక్ష మార్గంవైపు నడిచేలా కన్నకొడుకులకు ఆత్మ బోధ చేసిన మదాలస ఉత్తమ స్త్రీ. ఆత్మ జ్ఞానం ఉన్నప్పటికీ, ఆమె తన సతీ ధర్మాన్ని విడనాడలేదు. భర్తతో సంసార జీవితాన్ని వదిలేసి, తపస్సుకు అడవికి బయలుదేరే వరకూ ఆమె పతినే ప్రత్యక్ష దైవంగా భావించి, అనుసరించింది. జీవిత భాగస్వామిగా తన ధర్మాన్ని తాను నిర్వర్తించింది.

# వార్తావాహిని



వివేకానంద సేవాభవనాన్ని ప్రారంభిస్తున్న స్వామి జ్ఞానదానందజీ

## వేట్లపాలెంలో 'వివేకానంద సేవాభవనం'

**తూ**ర్పుగోదావరి జిల్లా వేట్లపాలెంలో 'వివేకానంద సేవాభవనం' ప్రారంభమైంది. స్థానికులు ఉత్సాహంగా రూ.15 లక్షల విరాళాల్ని సేకరించి నిర్మించుకున్న ఈ భవనాన్ని హైదరాబాద్ రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ 2006 డిసెంబరు 15న ప్రారంభించారు. ఈ భవనంలో ఉచిత హోమియో వైద్యశాల, గ్రంథాలయం, కంప్యూటర్ శిక్షణ సదుపాయం తదితర విభాగాలను కూడా స్వామిజీ ప్రారంభించారు. ఉదయం ఊరేగింపుతో ఆరంభమైన కార్యక్రమంలో భాగంగా స్థానిక శ్రీరామకృష్ణ ధ్యానమందిరంలో పూజ, హోమం, భజన నిర్వహించారు. అనంతరం స్వామి జ్ఞానదానందజీ పేద విద్యార్థులకు యూనిఫారమ్ పంపిణీ చేశారు. మధ్యాహ్నం జరిగిన బహిరంగ సభలో స్వామీజీ మాట్లాడుతూ దైవస్మరణ తోనే మానసిక ప్రశాంతత సాధ్యమని, సమాజసేవతో అది మరింత ఇనుమడిస్తుందన్నారు. దాదాపు 5 వేల మంది హాజరైన ఈ కార్యక్రమంలో స్వామి అక్షరాత్మానందజీ, స్వామి ఈశప్రేమానందజీ, పి.శ్యామసుందరమూర్తి తదితరులు పాల్గొన్నారు.

– నివేదిక : వి.వీరభద్రరావు

## కర్నూలు శ్రీరామకృష్ణ సేవాసమితి సప్తమ వార్షికోత్సవం

**క**ర్నూలు శ్రీరామకృష్ణ సేవాసమితి సప్తమ వార్షికోత్సవాన్ని ఘనంగా జరుపుకొంది. 2006 డిశంబరు 22న స్థానిక అంబేద్కర్ భవనంలో జరిగిన ఈ ఉత్సవంలో కడప రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి ఆత్మవిదానందజీ, స్వామి సుకృతానందజీ తదితరులు పాల్గొన్న ఈ కార్యక్రమానికి దాదాపు 500 మంది భక్తులు విచ్చేశారు. విద్యార్థులకు ప్రతిభా పాటవ పోటీలు, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు.

– నివేదిక : డా. కె.జి. శరత్ చంద్ర

## విజయవాడ నుంచి 'వివేకవాహిని'...



**జా**తికి జవజీవాలు, మానవాళికి మహత్తర జీవనలక్ష్యాలు నిర్దేశించిన స్వామి వివేకానంద ప్రతి పలుకూ ప్రచండ సూర్యకిరణమే. అంతటి మహిమాన్విత మూర్తి, ఆధ్యాత్మిక స్ఫూర్తి సందేశ సారాంశాన్ని ఆధునిక తరానికి అందించాలనే ఆశయంతో విజయవాడ రామకృష్ణమిషన్ 'వివేకవాహిని' పేరుతో సంచారప్రచార వాహనానికి శ్రీకారం చుట్టింది. శ్రీరామకృష్ణ, వివేకానంద సాహిత్యం, చిత్రప్రదర్శన, తదితర విభిన్నమాధ్యమాలుగా ఈ 'వివేకవాహిని' పల్లెలు, పట్టణాలు, విద్యాసంస్థల్లో అందరికీ అందుబాటులో ఉంటుంది. స్వామి వివేకానంద జన్మదినం(జాతీయ యువజన దినోత్సవం) సందర్భంగా జనవరి 12న చెన్నై శ్రీరామకృష్ణమఠం వరిష్ఠ సాధువు పూజ్య స్వామి సోమానందజీ మహారాజ్ 'వివేకవాహిని'ని ప్రారంభించారు. మూర్తిత్రయ భావప్రచారంలో ఈ పథకం సఫలీకృతం కావాలని ఆశీస్సులను అందించారు. స్వామి సుప్రియానందజీ స్వాగతో పన్యాసంలో 'వివేకవాహిని' ఆవశ్యకతను వివరించారు.సమావేశానికి ముఖ్య అతిథిగా ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం ఉపకులపతి శ్రీ బాలమోహన్ దాస్ హాజరయ్యారు.స్వామి వివేకానంద చికాగో చారిత్రాత్మక ఉపన్యాసం రోజునే నాగార్జున విశ్వవిద్యాలయం ప్రారంభానికి నోచుకుందని గుర్తు చేశారు. అతిథిగా హాజరైన కాకతీయ విశ్వ విద్యాలయం మాజీ ప్రధాన ఆంగ్లోపన్యాసకులు శ్రీలక్ష్మణ మూర్తి ప్రసంగిస్తూ గత నలభై సంవత్సరాలుగా వివేకానంద సాహిత్యం చదవని రోజు లేదని,విజయంతమైన జీవితానికి అంతకు మించిన దివ్యౌషధం వేరే లేదన్నారు. విజయవాడ రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి శశికాంతానందజీ 'వివేకవాహిని' పథకానికి విరాళాలిచ్చిన దాతలకు ధన్యవాదాలు తెలిపారు. అనంతరం 'స్వామి వివేకానంద' లఘు చిత్రాన్ని(డాక్యుమెంటరీ) ప్రదర్శించారు. యువసమ్మేళనంలో యువకులు ఉత్సాహంగా పాల్గొన్నారు.

– నివేదిక: బ్రహ్మచారి ఉద్ధవ



మూర్తిత్రయ భావ ప్రచారానికి సిద్ధంగా 'వివేకవాహిని'

**నేను *(స్వామి శాంతానంద)* :** అంతా భగవంతుని ఇచ్ఛ అయినప్పుడు ఆయన ఎందుకు కర్మఫలం నుండి మనల్ని విడిపించకూడదు?

**మాతృదేవి:** ఆయన సంకల్పిస్తే తప్పకుండా విడిపించవచ్చు. కానీ గురుదేవులు కూడా కర్మఫలం అనుభవించాల్సి వచ్చింది కదా! ఆయన పెద్దన్నగారు సన్నిపాతంలో నీళ్ళు తాగారు. అందువల్ల గురుదేవులు ఆ నీటి పాత్రను లాగుకున్నారు. దాంతో కోపగించుకొన్న ఆయన, 'నేను నీళ్ళు తాగడం అడ్డుకున్నావు కదా! నువ్వు కూడా అంతిమ కాలంలో ఏమీ తినలేక పోదువుగాక!' అని శపించారు. గురుదేవులు కూడా దానిని అనుభవించవలసి వచ్చింది. చివరి రోజుల్లో ఆయన ఏమీ తినలేకపోయేవారు. ఇవన్నీ ఎందుకు, ఎలా జరుగుతున్నాయో అర్థం చేసుకోవడం నిజంగా ఎంతో కష్టం.

**నేను:** అమ్మా! జపం చేసేటప్పుడు లెక్కించాలా?

**మాతృదేవి:** లెక్కిస్తూ జపంచేస్తే, మనస్సు లెక్క మీదే ఉంటుంది. నువ్వు మామూలుగానే జపంచేయి.

**నేను:** జపంచేసేటప్పుడు మనస్సు ఎందుకు గాఢంగా లగ్నమవదు?

**మాతృదేవి:** అవన్నీ నిరంతర అభ్యాసం వల్లనే సాధ్య మవుతాయి. మనస్సు వశమవలేదని జపంచేయడం మాను కోవద్దు. నువ్వు అభ్యసిస్తున్న దాన్ని విడవకుండా అభ్యసించు. భగవంతుని పవిత్రనామాన్ని జపిస్తూవస్తే, గాలి లేని చోట వెలుగుతున్న దీపశిఖలా నీ మనస్సు దానంతట అదే నీ వశమవుతుంది. గాలి వీచినప్పుడు దీపశిఖ నిలకడగా ఉండదు. అలాగే కల్పనలు, కోర్కెలు ఉన్నంత వరకు మనస్సు నిలకడగా ఉండదు.

మంత్రాన్ని సరిగ్గా ఉచ్చరించకపోతే కూడా విజయం సిద్ధించడానికి సమయం ఎక్కువ పడుతుంది. 'రుక్మిణీనాథాయ' అనేది ఒక స్త్రీకి ఇచ్చిన మంత్రం. కానీ ఆమె రుక్కు అనే జపం చేసేది. ఆ కారణం వల్ల ఆమె పురోగమనానికి ఆటంకం వచ్చింది. తరువాత భగవంతుని కృప వల్ల సరైన మంత్రం లభించింది.

**నేను:** దేహాన్ని ఆరోగ్యంగా ఉంచుకోవడానికి కొన్ని రోజులుగా





యోగాసనాలు నేర్చుకుంటున్నాను. బాగా జీర్ణమవడానికీ, బ్రహ్మచర్య పాలనకూ ఇది సహాయపడుతుంది.

**మాతృదేవి:** వీటిని అధికంగాచేసే కొద్దీ మనస్సు శరీరం మీదకు ఎక్కువగా మళ్ళుతుంది. మధ్యలో వదిలేస్తే శరీరానికి హాని వాటిల్లుతుంది. ఇవన్నీ చక్కగా గ్రహించి తరువాత యోగాసనాలు అభ్యసించు.

**నేను:** బాగా జీర్ణమవడానికి నేను ఐదు, పది నిమిషాలే వీటిని చేస్తున్నాను.

**మాతృదేవి:** అలా అయితే ఫరవాలేదు. ఎలాంటి శరీర వ్యాయామమైనా ప్రారంభించిన తరువాత మధ్యలోనే ఆపితే అది ఆరోగ్యానికి హానికరమని నీకు సూచించడానికే ఇలా అన్నాను. నాయనా! నీకు చైతన్యం కలగాలని ఆశీర్వదిస్తున్నాను.

C **(మాతృమూర్తి శ్రీశారదాదేవి శిష్యులైన స్వామి శాంతానంద స్మృతుల నుంచి)**

- డాక్టర్. కంభంపాటి సుబ్రహ్మణ్యం



# యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా



**సృ**ష్టికర్త బ్రహ్మ, స్థితి నియామకుడు విష్ణువు, లయాధీశ్వరుడు శివుడు. ఈ కార్య క్రమం ప్రతిక్షణం, ప్రతిచోటా జరుగుతూనే ఉంది, జరుగుతూనే ఉంటుంది. కొత్త మొగ్గలు, కొత్త మొక్కలు, కొత్త శిశువులు, కొత్తవి అనేకం జన్మిస్తూనే ఉంటాయి. ప్రపంచ వ్యాప్తంగా అవి పెరుగుతూనే ఉంటాయి. వాటికి పోషణ సమకూర్చడం శ్రీమన్నారాయ ణుని బాధ్యత. చివర్లో నిష్క్రమణ జరిపించేది శంకరుల వారు. ఈ విధంగా ప్రతి విషయంలోనూ సృష్టి స్థితి లయలు నిర్విరామంగా జరుగుతూనే ఉన్నాయి. ఈ కార్యక్రమాలకు శక్తి అవసరం. బ్రహ్మకు సృష్టించే శక్తినీ, ఆ జ్ఞానాన్నీ; నారాయణునికి పోషించే శక్తినీ, అవసరమైన ఐశ్వర్యాన్నీ; శివునికి లయింపజేసే శక్తినీ, వైరాగ్యాన్నీ ఇచ్చేది వారి సతీమణులే. బ్రహ్మ భార్య సరస్వతి, విష్ణువు యొక్క సతీమణి లక్ష్మీదేవి, పరమేశ్వరుని పత్ని పార్వతీదేవి. భార్యల ముఖ్యత్వాన్నీ, తత్వాన్నీ, శక్తినీ గుర్తించిన త్రిమూర్తులు వారికి తమ యొక్క శరీరాలయందే తగిన స్థానాల్ని ఇచ్చి, ప్రతిష్ఠచేసి ప్రజలకు శక్తి యొక్క ఘనత, ప్రాముఖ్యతను తెలియజేశారు. చతుర్ముఖ బ్రహ్మ తన సతీమణి సరస్వతీదేవికి తన జిహ్వయందు (ఆసన మొసంగినాడు) ఆసీకృతము చేశాడు. సంరక్షకుడు, సకల లోక పరిపాలకుడు, సర్వ శక్తిసంపన్నుడు అయిన విష్ణువు తన భార్య శ్రీలక్ష్మి దేవి యొక్క ఆవశ్యకతను, ఔన్నత్యాన్నీ గ్రహించినవాడై, ఆమెను తన హృదయమునందే ఆసీనురాలినిగా చేశాడు. ప్రపంచానికి నూతనత్వాన్ని, ప్రసాదించేది లయం. నూతనత్వం కావాలీ అంటే పాతది నిష్క్రమించాలి. ఆవిధంగా నిష్క్రమింపజేసే లయకారకుడైన శివుడు శక్తి స్వరూపిణి అయిన దుర్గాదేవిని తన అర్థాంగిగా చేసుకొన్నాడు. బ్రహ్మనాలుకపై సరస్వతి, వెంకటేశ్వరుని హృదయంలో శ్రీలక్ష్మి, శివుని సగభాగంగా శక్తి - ఈ ముగ్గురు మూర్తులు సృష్టి స్థితి లయాలు సర్వకాలములందు జరుపుతూ భారతీయులకు ఆరాధ్యదైవాలుగా వెలశారు. అయితే ఈ త్రిమూర్తులు వారి సతీమణులకు తగిన స్థానాలనిచ్చి సత్కరించారే తప్ప వారి శక్తిని గుర్తించి దేవతాస్వరూపిణిగా ఉన్నతాసనాలను ఒసగి పూజించలేదు.

శక్తి స్త్రీ స్వరూపిణిగానే మిగిలి పోయింది. పురుషులు స్త్రీతత్వానికి దైవస్థానాన్నిచ్చి అర్చించలేదు. “యత్ర నార్యస్తు పూజ్యంతే నందంతి తత్ర దేవతాః”, అనే ఉత్తమ వాక్యం అమలుకు రాని ఒక వాక్కుగానే మిగిలి పోయేది. ఆ సద్వాక్యాన్నీ స్త్రీని, శక్తి స్వరూపిణిగా, దేవాతా మూర్తిగా గుర్తించి ఆమెకు ఉన్నత స్థానాన్ని సమర్పించి, ఆ సింహాసనంపై అధిష్ఠింపజేసి అర్ఘ్య పాద్యాదులతో షోడశ పూజచేసి అర్చించిన ఘనత కలియుగము నందు వెలసిన అవతారమూర్తి శ్రీ రామకృష్ణులకే దక్కింది. సతీమణి శ్రీ శారదాదేవిని సర్వశక్తి స్వరూపిణిగా గుర్తించి స్త్రీత్వానికి దైవత్వాన్ని జోడించి పూజించిన మహనీయుడు శ్రీరామకృష్ణుడు. “మాతృ దేవోభవ, పితృ దేవోభవ”-అనే వేదవాక్కులకు సరియైన శ్రీరామకృష్ణ ప్రోక్త “నారీ దేవో భవ!”.

శ్రీరామకృష్ణులు స్త్రీజాతి యొక్క ఔన్నత్యాన్ని, దైవత్వాన్ని ప్రపంచానికి తెలియజేశారు. అందుచేతనే స్వామి వివేకానంద శ్రీ రామకృష్ణులవారిని ‘అవతార వరిష్ఠాయ రామకృష్ణాయ’ అని స్తుతించారు. M

**సర్వ మంగళ మాంగళ్యే శివే సర్వార్థసాధికే**
**శరణ్యే త్ర్యంబకే గౌరి నారాయణి నమోస్తుతే.**

**శు**భము లన్నింటిలోనూ ఉండెడి శుభత్వం నీవై, కోరదగిన ప్రయోజనము లన్నింటినీ సిద్ధింప జేయుదానవై, అందరికీ శరణమొసంగు దానవై, త్ర్యంబకుడు అని కీర్తింపబడు శివుని ధర్మపత్నివై, పసుపు, తెలుపు రంగుల కలయిక గౌరవర్ణము కలదానవైన ఓ నారాయణీ ! నీకు నమస్కారములు.

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) 'వేదచూడామణి'** : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

**(ఆ) 'వేదార్థచూడామణి'** : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) వేదాధ్యాపకుడు** : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

**(ఆ) వేదభాష్యాచార్యుడు** : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-
హైదరాబాద్ కులప్రశాసకుడు

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

మార్చి 2007, వెల : రూ. 8

ఈ సంచిక నుంచి
**యువవాహిని**
ప్రత్యేకం

## 'సర్వజిత్' శుభ స్వాగతం





# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకుగాను 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయ మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**......రూ. 10,000/- అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............రూ. 5,000/- అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**..................రూ. 1,000/- అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| పేరు | చిరునామా | రూ. |
|---|---|---|
| | ఇప్పటి వరకు వసూలైన మొత్తం ..... | 8,39,123 |
| మహారాజ పోషకులు : డాక్టర్ ఎస్.జి.కె. మూర్తి | హైదరాబాద్. | 1,00,000 |
| పోషకులు : ఎమ్.ఎస్.రావు | ఠాగూర్ నగర్, కర్నూల్ - 518 002. | 1,116 |
| శ్రీమతి వి. ఇందిరమ్మ | టెక్కమిట్ట, నెల్లూరు - 524 303. | 1,150 |
| శ్రీ మద్దాలి ఎస్. మూర్తి | హైదరాబాద్. | 1,200 |
| శ్రీ రాజశేఖర్‌రెడ్డి | కాకినాడ. | 1,000 |
| | మొత్తం ... | 9,43,589 |

# శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి మీ పేరు మీద పది మందీ మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥ 600/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ళ పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు) ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. కనీసం రెండు గ్రంథాలయాలకు తక్కువ కాకుండా చందా కట్టిన దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపబోయే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ'లో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| 1248 | శ్రీమతి కామాక్షి గంటి, (శ్రీ కాళీప్రసాద్ గంటి జ్ఞాపకార్థం) అమెరికా. | బి.ఎస్. మక్తా లైబ్రరి, సోమాజిగూడ, హైదరాబాద్. |
| 1249 | " | చింతల్ బస్తి లైబ్రరి, ఖైరతాబాద్, హైదరాబాద్. |
| 1250 | శ్రీమతి యు. సుశీల, తార్నాక, హైదరాబాద్ - 500 017. | అడిక్‌మెట్ లైబ్రరి, హైదరాబాద్ - 500 044. |
| 1251 | శ్రీమతి పార్వతి బాలకృష్ణన్, కొచ్చి - 682028, ఎర్నాకులమ్ | బాకారమ్ లైబ్రరి, గాంధీనగర్, హైదరాబాద్. |
| 1252 | " | విజయపురి లైబ్రరి, సికింద్రాబాద్ - 500 017. |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



గమనిక: చెక్కు, డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా:
Sri Ramakrishna Prabha, Ramakrishna Math, **Domalguda, Hyderabad- 500 029.**

ఆధ్యాత్మిక-అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 64 సంచిక: 3 మార్చి 2007

"ప్రతి జీవిలోనూ దివ్యత్వం గర్భితంగా ఉంది. అంతర్గతంగా ఉన్న ఆ దివ్యత్వాన్ని వ్యక్తం చేయడమే జీవిత పరమావధి."

- స్వామి వివేకానంద

## ప్రార్థన

నాన్యా స్పృహా రఘుపతే హృదయేస్మదీయే
సత్యం వదామి చ భవానఖిలాంత రాత్మా।
భక్తిం ప్రయచ్ఛ రఘుపుంగవ నిర్భరాం మే
కామాదిదోషరహితం కురు మానసం చ॥

- రామచరిత మానస.



రాఘవా । నా హృదయంలో వేరే ఆశ ఏమీ లేదు, నిజంగా చెప్పుచున్నాను. నీవు అందరి హృదయాల్లో ఉండే అంతరాత్మవు. నిన్ను శరణువేడి నా భారమును తగ్గించుకొనే భక్తి భావమును ప్రసాదింపుము. నా మనస్సులో ఉన్న కామాది దోషములను హరింపుము.

## ఈ సంచికలో...





**ముఖచిత్రం:** శ్రీసీతాలక్ష్మణ ఆంజనేయ సమేత శ్రీరామచంద్రుడు



SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

సంపాదకీయం

# ఓ కోయిలా! మళ్ళీ కూయవే...

ప్రభాతానికి సుప్రభాతం పాడుతూ స్వాగతం పలికే కోకిలమ్మ మధురాలాపన అంటే మనందరికీ ఇష్టమే. అలాంటి కోకిల 'కవిత్వం' అనే కొమ్మపై కూర్చొని 'రామ రామ' అని రెండక్షరాలను మధురంగా ఆలపించింది. రస భరితమైన రామాయణాన్ని మనకు అందించింది. ఆ కోకిల మరెవరో కాదు. ఆదికవి వాల్మీకి.

**కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్ ।**
**ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్॥**

వాల్మీకి ఆలపించిన రాగాలు అమోఘం. అవి మనో వికాసాలు. వ్యక్తి ధర్మానికీ, కుటుంబ ధర్మానికీ, సంఘ ధర్మానికీ అద్దం పట్టే ఆదికావ్యం 'రామాయణం'. భారత జాతి సత్య, ధర్మాచరణలను ప్రపంచానికి చూపిన సజీవ కావ్యం. తండ్రి ఆజ్ఞ కష్టమైనా, నష్టమైనా శిరసావహించే తనయుడు శ్రీరాముడు. సుఖాల్లోనే కాదు కష్టాల్లోనూ నీ వెంట నేనుంటానంటూ భర్త అడుగుజాడల్లో నడిచే పతివ్రతా శిరోమణి సీతమ్మ. అన్నావదినల సేవయే నా కర్తవ్యం అంటూ అన్న వెంట పయనమైన సేవాతత్పరుడు లక్ష్మణుడు. తన భర్త లక్ష్మణుని వెంట తాను వెళితే రాముని సేవకు ఆటంకమేమోనని తలచి అన్ని సుఖాల్ని వదలిన అత్యంత త్యాగశీలి ఊర్మిళ. అన్న లేని అయోధ్య అరణ్యంతో సమానమంటూ రాజ్యాధిపత్యాన్ని తిరస్కరించిన నిస్వార్థమూర్తి భరతుడు. ఇలా మరెందరో ఆదర్శమూర్తుల, త్యాగధనుల, శీలవంతుల గాథలను మనకు అందించింది రామాయణం. ఈ రామాయణం నాటి కన్నా నేడే అత్యవసరం అనడంలో అతిశయోక్తి కాదేమో!

తల్లితండ్రుల్ని ఎలా గౌరవించాలో పిల్లలకు తెలియదు. పిల్లల్ని ఎలా సన్మార్గంలో నడిపించాలో తల్లితండ్రులకు తెలియదు. అన్యోన్యత లేని ఆలుమగల మధ్య కలహాలు– ఇవన్నీ కుటుంబం బయట, లోపల అశాంతికి కారణాలు. నిత్యజీవితంలో మనకు ఎదురయ్యే సమస్యలన్నింటికీ పరిష్కారం 'రామాయణం' చూపిస్తోంది. 'ఒకేమాట, ఒకే బాట' అంటూ సత్యాన్నీ, ధర్మాన్నీ ఆచరించి 'వ్యక్తి ధర్మాన్ని' చాటాడు శ్రీరాముడు. కుటుంబంలో తల్లిదండ్రులపై, భార్యపై, సోదరులపై ప్రేమాభిమానాలు కనబరుస్తూ 'కుటుంబ ధర్మాన్ని' పాటించిన శ్రీరాముని జీవనశైలి మనకో నిదర్శనం. సంఘంలో నలుగురినీ గౌరవిస్తూ, ఇతరుల తప్పులను మన్నిస్తూ, ప్రశాంత చిత్తంతో మృదు మధురంగా భాషిస్తూ, అందరి మన్ననలనూ పొందిన శ్రీరాముని వ్యక్తిత్వం 'సంఘ ధర్మాని'కి ఓ చక్కని తార్కాణం.

ఓ నూతన దంపతులు రైల్వే స్టేషన్లో కూర్చొన్నారు. వారి ప్రక్కనే ఓ వయోవృద్ధుడు రామాయణం చదువుతున్నాడు. ఆ యువకుడు రామాయణం చదువుతున్న వృద్ధున్ని చూసి 'చదవడానికి మీకింతకన్నా వేరే పుస్తకం దొరకలేదా'? అంటూ హేళనగా నవ్వాడు. వృద్ధుడు ఆ యువకుని వైపు చూసి చిరునవ్వు నవ్వి మరలా రామాయణాన్ని చదవడం ప్రారంభించాడు. ఇంతలో రైలు వచ్చింది. జనంతో కిక్కిరిసిన ఆ రైలు లోనికి ఎలాగో కష్టపడి వృద్ధుడు ఎక్కాడు. ఆ యువకుడు కూడా ఎంతో కష్టపడి సామాన్లతో సహా ఎక్కాడు.

అంతలోనే రైలు కదిలింది. వెనుకకు తిరిగి చూస్తే భార్య మాత్రం ప్లాట్‌ఫారం మీదనే ఉండిపోయింది. ఆత్రుతతో గొలుసు లాగాడు. ఆమెను రైలు ఎక్కించాడు. ఇదంతా గమనిస్తున్న ఆ వృద్ధుడు యువకునితో 'రామాయణం చదివి నట్లైతే నువ్వు ఈ తప్పు చేసేవాడివి కాదు. శ్రీ రాముడు అరణ్య వాసానికి వెళ్ళినప్పుడు ఒకసారి గంగానదిని దాటాల్సి వచ్చింది. గుహుడు పడవ తీసుకొచ్చాడు. శ్రీరాముడు ముందుగా సీతమ్మను పడవ ఎక్కించాడు. భర్త, మొదట భార్య క్షేమాన్ని ఆలోచించాలి. అదే మన సంస్కృతి, సంప్రదాయం అని రామాయణం చదివితే తెలిసి ఉండేది' అన్నాడు. మానవ అభ్యుదయానికీ, సమాజశ్రేయస్సుకీ రామాయణంలోని అన్ని పాత్రలూ ఆచంద్రార్కం ఆదర్శ నీయాలే. ఆకాశంలో నక్షత్రాలనైనా లెక్కపెట్టవచ్చునేమో గాని శ్రీరాముని సుగుణాలను వర్ణించడం సాధ్యం కాదని అంటాడు వాల్మీకి మహర్షి.

**మృదుభాషి...** రాముడు సదా ప్రశాంతచిత్తం గలవాడు. మృదువుగా మాట్లాడే స్వభావం కలవాడు. ఒకవేళ ఎవరైనా పరుషంగా మాట్లాడితే బదులివ్వని శాంత పురుషుడు.

**స చ నిత్యం ప్రశాన్తాత్మా మృదుపూర్వంతు భాషతే ।**
**ఉచ్యమానోపి పరుషం నోత్తరం ప్రతిపద్యతే ॥**

మనతో ఎవరైనా పరుషంగా మాట్లాడితే సహనాన్ని కోల్పోతాం. కోపోద్రిక్తులం అవుతాం. ఒకవేళ పరుషంగా తిరిగి బదులు ఇవ్వకపోయినా మనస్సులో మధన పడుతూ మనశ్శాంతిని కోల్పోతాం. ఇతరులు పరుషంగా మాట్లాడినంత మాత్రాన మనం కూడా అదేవిధంగా ఎందుకు మాట్లాడాలి? ఎవరి స్వభావం వారిదని భావించి శ్రీరామునిలా వ్యవహరించ గలిగితే మన ప్రశాంతతను ఎవ్వరూ భగ్నం చేయలేరు.

**వినయశీలి...**ఎవరైనా పెద్దలు ఇంటికి వస్తే గుమ్మంలోనే గుక్కతిప్పుకోనన్ని ప్రశ్నలు వేసి అనుచితంగా ప్రవర్తించడం మన సంప్రదాయం కాదని తెలుసుకోవాలి. వసిష్ఠుడు తమ రాజప్రాసాదానికి విచ్చేసినప్పుడు శ్రీరాముడే ఎదురేగి భక్తిప్రపత్తులతో ప్రణమిల్లి తోడ్కొని వచ్చాడు. ఇది ఆయన వినయశీలత్వానికి ప్రతీక. ఇలా ఏ స్థాయికి ఎదిగినా పెద్దల యందు వినయవిధేయతలే వ్యక్తిత్వానికి ప్రకాశాన్నిస్తాయి.

**పూర్వభాషి ...** సాధారణంగా సమాజంలో కొంత హోదాకు ఎదిగాక కిందస్థాయిలో ఉన్న వ్యక్తులను పలక రించటం, పరిచయం చేసుకోవటం నామోషీగా భావిస్తారు. ఇక ధనమదం, విద్యామదం ఉన్నవాళ్ల సంగతి చెప్పనక్కర లేదు. కానీ శ్రీరాముడు తన ప్రస్థానంలో ఏనాడూ అహానికి ఆస్కారమివ్వలేదు. ఏ స్థాయిలో ఉన్న వ్యక్తులైనా ఎదురైతే తానే ముందుగా పరామర్శించే వాడు. అందుకే ఆయన మితభాషి, హితభాషి, స్మితభాషే కాదు పూర్వభాషి కూడా. శ్రీరాముని లాంటి ఆదర్శ పురుషులు కావాలంటే...

**సీతమ్మలాంటి స్త్రీలు రావాలి...**సహనశీలి సీత లాంటి స్త్రీలు సమాజంలో ఉంటే రాముల్ని సృష్టించడం సులభం. 'మాతృదేవోభవ' అనే సంస్కృతి మనది. అలాంటి ఉన్నతమైన భారతమాత కడుపున పుట్టిన స్త్రీలు నేడు అంతఃసౌందర్యాన్ని మరచి బాహ్యసౌందర్యాలకే ప్రాధాన్యతను ఇస్తున్నారు. స్త్రీ స్వేచ్ఛ, స్త్రీ సంక్షేమం, స్త్రీ అభ్యుదయం లాంటి నినాదాలు వింటున్నాం. కానీ 'ఆధునిక విద్య'తో పాటు 'ఆధ్యాత్మిక విద్య' తోడైనప్పుడే మహిళాభ్యుదయం సాధ్యం.

The Women of India must grow and develop
in the footprints of Sita, and that is the only way.

- Swami Vivekananda

'సీత అడుగుజాడల్లో మహిళలు నడుచుకోవాలి. మహిళాభ్యుదయానికి అదొక్కటే మార్గం' అని స్వామి వివేకానంద ఉద్ఘాటించారు. సీత లాంటి పవిత్రాత్మురాలికి జన్మనిచ్చి భరతమాత ధన్యమైంది. మరి అలాంటి సీతమ్మలే నేడు కరువయ్యారు. స్త్రీ సహనానికి మారుపేరు. ప్రస్తుతం స్త్రీలలో ఆ ఓర్పు లేకనే సమాజంలో ఈ మార్పు. భర్త గట్టిగా ఒక మాటంటే భరించలేక అలిగి అమ్మగారింటికి పలాయనం అయ్యే నేటి స్త్రీలకు సీతమ్మ జీవితం ఆదర్శం కావాలి.

గోరంత కలతల్ని కొండంత చేసుకొని మనోద్వేగాలకూ, మానసిక ఒత్తిళ్ళకూ గురి అవుతోంది నేటి నవతరం. మనశ్శాంతి కోసం, సమస్యల పరిష్కారం కోసం 'కౌన్సిలింగ్ కేంద్రాలు' అంటూ పాశ్చాత్యుల ధోరణిని అనుసరిస్తోంది నేటి యువతరం. పాశ్చాత్యుల పోకడలను ప్రక్కకు నెట్టి భారతదేశ సంస్కృతిని అనుసరించిన నాడే సమాజం శాంతిసౌఖ్యాలతో విరాజిల్లుతుంది.

రామాయణ పఠనం, శ్రవణం, మననమే మన సామాజిక సమస్యలన్నిటకీ పరిష్కారం. రామరాజ్యం మళ్ళీ రావాలంటే రసభరిత రామాయణ మధుర గానాన్ని మనమంతా ఆస్వాదించాలి. అందుకు **ఓ కోయిలా మళ్ళీ కూయవే!** అంటూ వాల్మీకి కోకిలాన్ని ప్రార్థిద్దాం. 'రామరాజ్యం' పున రావిర్భావాన్ని కాంక్షిద్దాం. a



# భక్తిని చాటిన శ్రీ చైతన్యుడు

- ధాతారం మూర్తి

**శ్రీ** నిత్యానంద ప్రభువును, శ్రీహరిదాస ఠాకూరును పిలిచి శ్రీ చైతన్యుడిలా ఆదేశించాడు: "ఓ మిత్రులారా నగరవీథుల్లోకి వెళ్ళండి! ప్రతివారినీ కలసి శ్రీహరి నామసంకీర్తన చేయమని ఉపదేశించండి. అలాచేసి ప్రతి సాయంత్రం, తిరిగి నా వద్దకు వచ్చి, మీ ప్రచార ఫలితాన్ని నాకు చెప్పండి!" అన్నారు. వెంటనే వారిద్దరూ నగరంలోకి వెళ్ళి జగాయి, మాధాయి అనే ఇద్దరు క్రూరాత్ములను కలుసుకున్నారు. మహాప్రభువు చెప్పిన ఉపదేశం వినగానే ఆ పాపాత్ములు శ్రీ నిత్యానంద, హరిదాసులను అవమానించి హింసించారు. కానీ శ్రీ చైతన్యుడు అనుగ్రహించిన భక్తి ప్రభావం వలన ఆ క్రూరులు పరివర్తన చెంది మహా భక్తులుగా మారిపోయారు. అలా మారిన వారిని చూసి నదియా ప్రజలు ఆశ్చర్యచకితులయ్యారు. "నిమాయి పండితుడు మహామేధావి మాత్రమే కాదు, అతడు భగవంతుడు పంపిన ఒక గొప్ప మతప్రచారకుడు" అని జనులనుకునేవారు. ఆనాటి నుంచి శ్రీ చైతన్యుడు తన ఇరవై మూడో ఏట వరకూ నదియాలో మాత్రమేగాక దాని చుట్టుపక్కల ముఖ్య గ్రామాల్లోనూ, పట్టణాల్లోనూ తన బోధామృతాన్ని పంచసాగాడు. తన భక్తుల ఇళ్ళలో అతడు తన దివ్యలీలలను, మహిమలను వ్యక్తం చేసేవాడు. భక్తి రహస్యాలను వారికి బోధించాడు.

భక్తులతో కలసి అతడు సంకీర్తనం చేసేవాడు. నదియా నగరంలోని శ్రీచైతన్యుని అనుయాయులు వీథుల్లో శ్రీహరినామ సంకీర్తనం చేయడంప్రారంభించారు. ఫలితంగా నగరంలో ఒక నూతన చైతన్యం పెల్లుబికింది. కానీ స్మార్త బ్రాహ్మణులు శ్రీ చైతన్యుని సంకీర్తన విజయానికి అసూయ చెందారు. శ్రీ చైతన్యుడు చేసే సంకీర్తన హిందూధర్మానికి విరుద్ధమని చాంద్‌కాజీ అనే అధికారి వద్ద నేరారోపణం చేశారు. కాజీ ఆ పండితుని ఇంటికి వచ్చి అక్కడున్న మృదంగాన్ని పగులగొట్టాడు. నిమాయి పండితుడు తన కొత్త మతప్రచారాన్ని ఉపసంహరించుకోకుంటే అతనిపైనా అతని అనుచరుల పైనా బలవంతంగా మహమ్మదీయ మతం విధించాల్సి వస్తుందని కాజీ



# దైవ సాక్షాత్కారానికి వివాహం అడ్డమా ?

**త**నకు వివాహమైన రోజుల్లో తన మానసిక స్థితి ఏ విధంగా ఉందో కాలాంతరంలో యోగీంద్రుడు (స్వామి యోగానంద) ఇలా వర్ణించి చెప్పారు: 'నేను వివాహం చేసుకున్న వెంటనే, భగవత్సాక్షాత్కారం అనేది ఇకమీదట అసంభవం అని భావించాను. కామ కాంచన పరి త్యాగమే తొలి పాఠంగా బోధించే శ్రీరామకృష్ణుల వద్దకు నేనిక వెళ్లవలసిన అవసరం ఏముంది? ఇకఈ బ్రతుకు చక్కబడటం సాధ్యంకాదు. నేను ఎంత త్వరగా ఈ జీవితం ముగిస్తే అంతమంచిది. ఇంతకు ముందు నేను ప్రతిరోజూ గురుదేవులను కలుసుకునేవాణ్ణి. కానీ నావివాహ మైన తర్వాత వారిని చూడటం పూర్తిగా మానివేశాను. పశ్చాత్తాపంతో కుమిలిపోతూ, నిరాశా నిస్పృహలతో రోజులు భారంగా నెట్టుకు వస్తూ కాలం గడిపాను."

యోగీంద్రుని పెళ్ళి విషయం శ్రీరామకృష్ణుల చెవినపడింది. తన శిష్యుణ్ణి చూడాలని ఆయన ఎంతో ఆరాటపడ్డారు. ఎన్నోసార్లు అతడికోసం కబురుపంపారు. కానీ యోగీంద్రుడు మాత్రం రాలేదు. తాను ఎన్నిసార్లు కబురుపంపినా తన వద్దకు రాని శిష్యుణ్ణి రప్పించుకోవటానికి పరమహంస ఒక చక్కని ఉపాయం యోచించారు. యోగీంద్రుడు పెళ్ళి చేసుకోవడానికి ముందు, కాళీ ఆలయంలో పనిచేసే ఒక వ్యక్తి తనకు కొన్ని వస్తువులు తెచ్చిపెట్టమని కోరుతూ యోగీంద్రునికి కొంత పైకం ఇచ్చాడు. యోగీంద్రుడు ఆ వస్తువులను కొని, తన మిత్రుడి ద్వారా వాటిని ఆ వ్యక్తికి అందజేశాడు. ఇంకా తనవద్ద కొంతపైకం మిగిలివుందనీ, దానిని త్వరలోనే అందజేయగలననీ కూడా తన మిత్రుని ద్వారా కబురు పంపించాడు. ఈ సంగతి గురుదేవులకు వివరంగా తెలుసు. ఇప్పుడు, శ్రీరామకృష్ణులు యోగీంద్రునికు ఇలా కబురు చేశారు: "ఏం మనిషివయ్యా నువ్వు? ఇక్కడ ఒకవ్యక్తి కొన్ని వస్తువులను తెమ్మని నీకు కొంతసొమ్ము ఇచ్చాడు. ఆ వస్తువులు కొనగా ఇంకా నీ వద్ద మిగిలి ఉన్న సొమ్మును నువ్వు ఆ వ్యక్తికి తిరిగి ఇవ్వలేదు. పైగా, ఎప్పుడు ఆ పైకం తిరిగియిచ్చేదీ అతనికి కబురైనా చెయ్యలేదు".

ఈ మాటలు యోగీంద్రుని అహాన్ని బాగా దెబ్బతీశాయి. ఈ ఆరోపణకు అతడి మనస్సు ఎంతో క్షోభించింది. అతను ఈ విధంగా పరితపించి పోయాడు. 'ఎంతో కాలంగా నాతో పరిచయం ఉండి కూడా, గురుదేవులు నన్ను ఒక మోసగానిగా భావిస్తున్నారు. ఇవ్వాళే నేను అక్కడకు వెళ్ళి ఈ వ్యవహారానికి ఏదో విధంగా స్వస్తి చెబుతాను. ఆ తర్వాత నేను ఆ కాళీ దేవాలయం వైపు చూస్తే ఒట్టు.' అని మనసులో అనుకున్నాడు. ఆ రోజు మధ్యాహ్నమే యోగీంద్రుడు బయలు దేరి కాళికాలయం చేరాడు. అతడు శ్రీరామకృష్ణులు నివసించే గది వద్దకు వెళ్ళేసరికి అక్కడ శ్రీరామకృష్ణులు తన గదిముందు తాను ధరించే వస్త్రాన్ని చేతిలో పట్టుకొని ఒకానొక పారవశ్యస్థితిలో ఉన్నట్లుగా కనిపించారు. యోగీంద్రుణ్ణి చూసీచూడగానే, ఆయన తానున్నచోటునుంచి గబగబా ముందుకు వస్తూ, "నీకు పెళ్ళయినంతమాత్రాన ఏం కొంప మునిగిపోయింది? నాకు మాత్రం పెళ్లి కాలేదా? దీనికి అంత భయపడాల్సిన పని ఏముంది? దీని (తనను ఉద్దేశిస్తూ శ్రీరామకృష్ణులు వాడే మాట ఇది) అనుగ్రహం గనుక ఉన్నట్లయితే లక్షలాది వివాహాలు కూడా నిన్ను ఏమీ చెయ్యలేవు. ఒకవంక సంసార జీవితం సాగిస్తూనే, మరోవంక దైవ సాక్షాత్కారం పొందవచ్చు" అన్నారు.

ఈ మాటలు విని యోగీంద్రుడు నిశ్చేష్టుడై నిలబడి పోయాడు. తాను విన్నది ఏమిటి? ఇది సాధ్యమేనా? నిరాశా నిస్పృహలతో నిండిపోయిన దయనీయస్థితినుంచి, ఒక్కసారిగా ఆశాజనకమైన మహోన్నత స్థితికి ఎదిగిన అనుభూతి అతడిలో చోటుచేసుకుంది. తాను పైకం తిరిగి ఇవ్వలేదని తనపై గురుదేవులు నిందమోపటం అంతా తనను ఇక్కడికి తిరిగి రప్పించుకోవడానికీ, చూడటానికేనా? అతడి హృదయం మీద ఉన్న పెద్ద భారం తొలగిపోయినట్లయింది. స్వేచ్ఛగా ఊపిరిపీల్చుకున్న అనుభూతి కలిగింది. చెమ్మగిల్లిన కళ్ళతో యోగీంద్రుడు గురుదేవుల పాదాలను స్పృశించాడు. ఠ

**(మార్చి 8న స్వామి యోగానంద జయంతి)**




ఇతర ఆదాయ వనరుల మీదకు మళ్ళించడం విశేషం. ఈ వసంత ఋతువులో చెట్లు చిగురించి పూతకు వస్తాయి. వాటిని పరిరక్షించుకుని మామిడికాయలను, మామిడి పళ్లను దింపుకుని సందడి చేసుకుంటారు ఎందరో రైతులు. వసంత ఋతువు ప్రకృతి శోభకు ప్రతీక. పచ్చని చెట్లు ప్రగతికి సోపానాలు. అలా ప్రకృతిని ఆరాధించి ప్రకృతి అందించిన ఫల రసాదులతో ఆనందమయ జీవితం గడపమని ఉగాది కర్మయోగి అయిన కృషీవలుణ్ణి ఆశీర్వదిస్తుంది.

**– ఎ.ఎస్. మూర్తి**

దైవజ్ఞులైన పండితుల వివరణ ప్రకారం ఈ సర్వజిత్ ... మధ్య పరస్పర సహకారం వృద్ధి ...

**(ఉగాది 2007 మార్చి 20వ తేదీన)**

**పు**ణ్యభూమి, కర్మభూమి అయిన భారతదేశంలో ... ఆధ్యాత్మికతతో పాటు శాస్త్రీయ పరిజ్ఞానం వెల్లి విరిసి జాతిని ప్రగతిపథంలో నడిపించింది. ... ఖగోళశాస్త్రం అత్యంత ప్రామాణిక మైందిగా ప్రపంచ శాస్త్రజ్ఞులే అంగీకరించారు. ఈ శాస్త్రం విశ్వంలోని నక్షత్ర, గ్రహ, ఉపగ్రహ స్థితిగతులను, మానవజాతి మనుగడపై వాటి ప్రభావాలను సుస్పష్టంగా వివరించింది.

తెలుగు వారి తొలి పండుగ ఉగాది. అనేక ఖగోళ రహస్యాలను ... సంవత్సర తొలిరోజు ఉత్తరాయణంలో, వసంత ఋతువు, ప్రారంభంలో చైత్ర శుద్ధ పాడ్యమినాడు తెలుగువారు జరుపుకునే ఉగాది యుగాదికి రూపాంతరం. కాలాన్ని గణిస్తూ ఆ కాలంతో పాటు కదిలే సృష్టి చక్రానికి ఒక రూపాన్ని, దానితో మానవ జీవితానికి గల సంబంధాన్ని గుర్తుచేసే ఈ ఉగాది పండుగ మనకు ఎన్నో విజ్ఞాన విశేషాలను ఆవిష్కరిస్తుంది.



ఈ సృష్టికి 'చక్రం' అని పేరు. అంటే నిరంతరం పరిభ్రమిస్తూ పదేపదే బయలుదేరిన ప్రదేశానికి రావడమే పరిభ్రమణం. భారతీయ కాలమానం ప్రకారం మనకు ఉన్న సంవత్సరాలు 60. ఇవి ప్రభవతో ప్రారంభం అయి అక్షయతో ముగుస్తాయి. ప్రభవ అంటే కొత్త కాల గమనాన్ని గణించడానికి ఎంచుకున్న మొదటి సంవత్సరం ప్రభవించిన సమయం. అక్షయ అంటే 60 సంవత్సరాలు పూర్తి అయినా ముగింపులేని కాలగమనం. అదే స్థితికి వచ్చి అక్షయం–అంటే తరిగిపోకుండా మళ్ళీ తన కక్ష్యలో గమనాన్ని కొనసాగించడం.

ఇందులో సంవత్సర ప్రారంభ ఉగాది విశిష్టమైంది. మన సంస్కృతికి సంబంధించి పండుగలను, యితర ముఖ్య శుభకార్యాలను ఈ సంవత్సర, మాస తిథుల ప్రకారమే జరుపుకొంటారు. అలాంటి గణనకు సంవత్సరంలో మొదటి తిథి ఉగాది.

ఏ పండుగకైనా మతపార్శ్వము, వేదాంత పార్శ్వము, భక్తి పార్శ్వము, సామాజిక పార్శ్వము అని నాలుగు ముఖాలుంటాయి. మతపరంగా, వేదాంతపరంగా, భక్తిపరంగా ఉగాదితో వసంత ఋతువు ప్రారంభమవుతుంది. చైత్రశుద్ధ నవమి శ్రీరాముని జన్మదినం. రామాయణ ధర్మాన్ని వేదపరంగా అర్థం చేసుకుని, భక్తితో ఈ ఉత్సవాల్లో శ్రీరాముని సేవించడం ద్వారా మనం ధర్మ, వేదాంత, భక్తి మార్గాలను అనుష్ఠించి ఉగాదితో ప్రారంభించి వసంత నవరాత్రులను వైభవో పేతంగా జరుపుకుంటాం.

సామాజిక పరంగా కూడా మన ఉగాది విశిష్టమైంది. సంక్రాంతి సంబరాలతో పంటను ఇంటికి చేర్చుకున్న రైతులు ఈ ఉగాది వచ్చేనరికి స్థిమితపడి తమ దృష్టిని



# శ్రీరామకృష్ణ మఠం

రిజర్వ్ లైన్ , న్యూ నాథమ్ రోడ్ , మదురై -625 014
E-mail: rkmath@ eth.net Ph: (0452) 2680 224, 2681 181





## విరాళాలకై విన్నపం

ప్రియ మిత్రులకు,

నమస్సులు, హృదయపూర్వక శుభాకాంక్షలు.

జగజ్జనని శ్రీ మీనాక్షి కొలువైన మదురై నగరం దక్షిణ భారత దేశంలోని ప్రముఖ యాత్రా స్థలాలలో ఒకటి. మదురైలోని శ్రీరామకృష్ణమఠంశాఖ 1987లో ప్రారంభించబడింది. 1998లో ఈ మఠం ఆవరణలో శ్రీ రామకృష్ణులవారి దేవాలయ సంప్రోక్షణ జరిగింది. అప్పటినుంచి మదురైలోని శ్రీ రామకృష్ణ మఠం అనేక ధార్మిక,సేవా కార్యక్రమాలను నిర్వహిస్తోంది. భవిష్యత్తులో ఎన్నో మహత్కార్యాలను సాధించవలసిన 9 ఏళ్ళ పసిపాప ఇప్పుడీ మఠం.



## నూతన భవన నిర్మాణం



1. గ్రంథాలయం, ఉచిత పఠనాలయం, ఆడిటోరియం...
2. రామకృష్ణ, వివేకానంద, సనాతనధర్మ ప్రచారానికి పుస్తక విక్రయశాల
3. కార్యాలయం, అభ్యాగతుల (విజిటర్స్) గది...

- మొదటి అంతస్తు :గ్రంథాలయం, ఉచిత పఠనాలయం, ఆడిటోరియంల నిర్మాణం (3423 చ.ద. అడుగులు)...
- క్రింది అంతస్తు : పుస్తక విక్రయశాల, అభ్యాగతుల గది, కార్యాలయాల నిర్మాణం. (3439 చదరపు అడుగులు)
- నిర్మాణదశలో ఉన్న ఈ కొత్త భవనానికి అయ్యే మొత్తం ఖర్చు సుమారు రూ. 45.3 లక్షలు అని అంచనా.
- ఈ భవన నిర్మాణానికి ఉదారులైన భక్తులు శ్రేయోభిలాషులు, స్నేహితుల నుండి విరాళాల్ని కోరుతున్నాం.

విరాళాలను 'Sri Ramakrishna Math, Madurai' పేరున చెక్కు లేదా డి.డి.తీసి Sri Ramakrishna Math, Reserve Line, New Natham Road, Madurai - 625 014 కు పంపవలసిందిగా మనవి. అన్ని విరాళాలనూ కృతజ్ఞతతో స్వీకరిస్తాము. ఒక లక్ష, అంతకుమించి విరాళాలిచ్చే దాతల పేర్లను ప్రత్యేకంగా ప్రదర్శించబడును.

మీ కోసం, మీ కుటుంబ సభ్యుల సంక్షేమం కోసం మదురైలోని జగజ్జనని శ్రీ శ్రీ మీనాక్షి, శ్రీశ్రీ సుందరేశ్వరశివుణ్ని, భగవాన్ శ్రీ రామకృష్ణులు, దివ్య జనని శ్రీ శారదాదేవి, స్వామి వివేకానందులను ప్రార్థిస్తూ,

ధన్యవాదములతో,

భగవత్సేవలో
**స్వామి కమలాత్మానంద**
అధ్యక్షులు



- స్వామి సుప్రియానంద

మనిషి జీవితాన్ని నాలుగు భాగాలుగాచేసి వాటిని నాలుగు ఆశ్రమాలుగా రూపొందించింది మన ధర్మశాస్త్రం. అవే బ్రహ్మచర్య, గృహస్థ,వానప్రస్థ, సన్న్యాస. ఏ ఆశ్ర మానికి తగ్గ ధర్మాలు వాటికున్నాయి. 'ధర్మం' అన్నది ఒక కట్టుబాటు. కట్టుబాటును అతిక్రమిస్తే వచ్చేవి కష్టాలు. అన్ని బాధ్యతలు నెరవేర్చి వృద్ధాప్యం లోనూ గృహస్థ ధర్మాన్ని అంటిపెట్టుకొని ఉంటే అది కుటుంబంలో అశాంతికి దారి తీస్తుంది. కారణం వానప్రస్థాశ్రమ ధర్మాన్ని ఆచరించక పోవడమే! ముసలితనంలో 'అత్తపెత్తనం' మామగారి 'ఆధిపత్య ధోరణి' అధర్మాలు – అందుకే అశాంతి.

వానప్రస్థాశ్రమానికి ఉండాల్సిన మానసిక పరిపక్వత, సిద్ధత లేనపుడు వృద్ధాశ్రమాలలో చేరినా ఫలితం ఉండదు. వృద్ధాప్యం అనివార్యమైన 'శారీరక మార్పు'. ఇది జీవితంలో వచ్చిన మొదటి మార్పుకాదు. కానీ 'బాల్యం' నుంచి యవ్వనంలో వచ్చే మార్పులాగా ఉత్సాహాన్ని తీసుకురాదు. నిరుత్సాహం– నిరాశ వృద్ధాప్యానికి నేస్తాలు. ఉదయం– అస్తమయాల మధ్య ఎంత భేదం. ఒకటి వెలుగు బాట – ఇంకొకటి చీకటి కోట. ఈ చీకటిని ఎలా ఛేదించాలి ? వృద్ధాప్యాన్ని ఎలా ఎదుర్కోవాలి ?

శరీరం,మనసు–బొమ్మాబొరుసు ల్లాంటివి. కానీ శరీరాన్ని పట్టించుకున్నంతగా మనసుని పట్టించుకోం. కాని మనసును నిరంతరం ఉత్సాహపరచుకుంటూ ఉండాలి. శరీరానికే వృద్ధాప్యం కాని మనసుకు కాదు. అది చంచలం. లేనిది ఉన్నట్టు, ఉన్నది లేనట్టు చూపించే గుణం మనసుకుంది. జీవితానికి గమ్యం లేనపుడు మనసుపెట్టే కష్టాలు అన్నీ ఇన్నీ కావు. కోరికల వలతో మనిషిని బంధిస్తుంది ఈ మనసు. బంధ విముక్తుల్ని చేసేది కూడా ఈ మనసే !

ఇది ఒక చైనా దేశం కథ. వివాహానంతరం ఒక అమ్మాయి అత్తగారింటికి వెళ్తుంది. మొదటి ఆరు నెలలు అత్తాకోడళ్ళు ఎంతో అన్యోన్యంగా ఉంటారు. ఆ తరువాత ద్దరి మధ్య గొడవలు మొదలవుతాయి. గోరంతలు 'ండంతలై చివరకు కోడలు పుట్టింటికి పరుగెడుతుంది. క్కడ ఆమె తండ్రిగారి స్నేహితుడైన ఒక డాక్టర్‌తో తన ాధల్ని వెళ్ళబోసుకుంటూ

'ఎలాగైనా మా అత్త మరణిస్తే గాని నాకు సుఖశాంతు



కూర్చొని ముద్దుమాటలతో చిలిపి చేష్టలతో ఆనందింప జేసిన ఆ చిన్నారిలో ఇప్పుడు కనిపిస్తున్న ఈ రాక్షసత్వాన్ని చూసి ఆశ్చర్యపడ్డాడు ఆ డాక్టర్.

తర్వాత ఇలా అన్నాడు. ' అమ్మా! నీ మీద ప్రేమతో ఈ పనిచేస్తున్నాను. ఒక మందు నీకిస్తాను. దానిని మీ అత్తగారికివ్వాలి. అది తీసుకున్న సంవత్సరం తరువాత ఆమె మరణిస్తుంది. వెంటనే చనిపోతే, అందరికీ అనుమానం రావొచ్చు. అప్పుడు మన పన్నాగం బయట పడుతుంది. అందుకే ఒకేసారి కాకుండా కొద్దికొద్దిగా చంపే మందు ఇస్తున్నాను. ఒక సంవత్సరం నీవు ఓపిక పట్టాలి. అత్త ఎలాగూ చనిపోతుంది. కాబట్టి నీవు ఆమెను ఈ సంవత్సర

కాలం పాటు ప్రేమగా చూసుకుంటూ సేవ చేస్తానని నాకు హామీ ఇవ్వు. అప్పుడు ఎవరికీ అనుమానం రాదు' అమ్మాయి సరేనని అంగీకరించింది. మందు తీసుకుని అత్తగారింటికి వెళ్లింది. అత్తకు తినిపించి ప్రేమతో సపర్యలు చేయడం ప్రారంభించింది. అత్తకు అమితానందం. తన కోడలుచేసే సేవకు స్పందించింది. ఆమె చూపిన ప్రేమకు దాసోహం అయ్యింది. తనకు ఓపికలేక పోయినప్పటికీ కోడలికి చిన్నచిన్న పనుల్లో సహాయం చేయడం మొదలు పెట్టింది. కోడలిని తన సొంత కూతురిలా భావించింది. అప్పుడు కుటుంబంలో ప్రశాంతత చోటు చేసుకుంది. అందరి ముఖాల్లో సంతోషం వెల్లివిరిసింది.

ఆరు నెలలు గడిచాయి. కోడలు పుట్టింటికి వెళ్ళి మళ్ళీ ఆ డాక్టర్‌ని కలిసింది. ఆమె ముఖంలో విషాదం. గద్గద స్వరంతో ఇలా అంది. 'డాక్టర్! నేను ఓ పెద్ద తప్పు చేశాను. దేవతలాంటి మా అత్తను నిర్దాక్షిణ్యంగా చంపు తున్నాను. నా చేతులతో ఆమెకు విషం తినిపించాను. ఆరు నెలల్లో నన్ను ప్రేమించే నాదేవత నాకుండదు. ఆమెను ఎలాగైనా నేను రక్షించుకోవాలి'. ఈ మాటలు విన్న డాక్టర్ నవ్వి 'అమ్మా నేనిచ్చిన మందు, విషం కాదు. మీ అత్తగారికి ఏ అపాయంలేదు. అప్పుడు నీ మనసులో ఉన్నది విషం. ఇప్పుడది లేదు. మీ అత్తాకోడళ్ళ మధ్య ఈ ఆరు నెలల్లో నెలకొన్న ప్రేమానురాగాల ప్రవాహంలో ఆ 'విషం' కొట్టుకు పోయింది. మనసులో ఏ కల్మషం లేకుండా జీవించు' అన్నాడు.

ఇది మనసు కథ, ప్రతి మనిషి కథ. శ్రీరామకృష్ణుల వారు శుద్ధ మనస్సుతో భగవంతుణ్ణి చూడొచ్చన్నారు.'మానవ జన్మ లక్ష్యం 'భగవంతుణ్ణి పొందడమే' అని నొక్కి వక్కాణించారు. ఇదే జీవిత లక్ష్యం అయినప్పుడువృద్ధాప్యం నమన్యగా అనిపించదు. శరీరానికి, మనసుకు ఉన్న అవినాభావ సంబంధాన్ని గుర్తుంచుకొని మనో నిబ్బరంతో వృద్ధాప్యాన్ని ఎదుర్కోవాలి. 'శరీరమాద్యం ఖలు ధర్మ సాధనమ్' అని ఎప్పటికీ మరిచిపోకూడదు. మన 'స్వ (ఆశ్రమ) ధర్మాన్ని' మనసా కాయా వాచా ఆచరించాలి. 'కలుపు మొక్కల' వంటి 'అనవసరపు ఆలోచనల్ని' తీసేసి 'సార్థకత' అనే 'జీవిత వంట'ను దక్కించుకోవాలి. కార్యోన్ముఖులు కావాలి. ✍



**"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation, inwardly and by work done in a spirit of service outwardly".**

**- Swami Ranganathananda**

యువవాహిని

# మహనీయుల జీవితాల్లో మధురఘట్టాలు

– సేకరణ : శ్రీధర్

# నా జీవితంకన్నా దేశం గొప్పది...

**పూజ్యులైన తండ్రిగారికి,**

నన్ను ఉరికంబం నుంచి తప్పించేందుకు కన్నతండ్రిగా మీరు పడుతున్న తపనకు కొడుకుగా సంతోషపడతానేమో, కానీ ఈ దేశపౌరుడిగా మాత్రం సిగ్గుపడుతున్నాను. మీ కొడుకునైనందుకు మీ ఆశల్ని, ఆకాంక్షల్ని గౌరవిస్తాను. కానీ మీ కన్నా ముందు ఈ మాతృభూమి రుణం తీర్చుకునే హక్కు నాకు లేదంటారా? నేను బ్రిటిషర్లపై చేసిన దాడిని నేరంగా భావించటం లేదు. అందుకే నేనెప్పుడూ మీ ముందు నిర్దోషినని నిరూపించుకునేందుకు, కోర్టులో వాదించేందుకు అంగీకరించలేదు. నాన్నా... నా జీవితం మనదేశం కన్నా విలువైందేమీ కాదు. అసలు ప్రతి యువకుడి జీవితం కూడా ఇలా మాతృభూమికే సమర్పణం చేయాలని నమ్ముతాను కూడా. అందుకు ఎన్ని ప్రతిఘటనలనైనా ఎదుర్కోవాలి. అలాంటి ప్రగతి కోసం నిలబడే ఏ వ్యక్తి అయినా కాలం తీరిన పాత విశ్వాసాల్ని సవాలు చేయాలి. నాకు తెలుసు నా మెడకు ఉరితాడు బిగించడమే జీవితంలో ఆఖరిక్షణం కాగలదని. అయినా ఒక లక్ష్యం కోసం పోరాడిన జీవితానికి అలాంటి ముగింపు గర్వకారణమే కాని దయనీయం కాదు. ఎలాంటి స్వార్థం లేకుండా, ఎలాంటి పారితోషికం ఆశించకుండా నా జీవితాన్ని దేశస్వాతంత్ర్యం కోసం అర్పించాననే సంతృప్తితో, చిరునవ్వుతో మృత్యువును ఆహ్వానిస్తున్నాను. మానవాళికి సేవచేయటానికి, పీడితులకు విముక్తిని కల్పించటానికి యువతరం ముందుకొచ్చినప్పుడే నవయుగానికి నాందీప్రస్తావన జరుగుతుంది. నాన్నా... నా మరణాంతరమూ ముందు తరాలకు త్యాగమనే సుగుణం తీగసాగేలా చూడండి. ఎలాంటి పరీక్షాసమయంలోనైనా మహత్తరమైన మానసిక దృఢత్వాన్ని సడలనీకుండా చూసుకొమ్మని ప్రోత్సహించండి... ఇక సెలవు...

ఇట్లు
మీ ప్రియపుత్రుడు
**భగత్‌సింగ్.**

1931 మార్చి 23న భగత్‌సింగ్ సగర్వంగా ఉరికంబం ఎక్కాడు.

**తనను ఉరితీసే తుదిక్షణాల్లో కన్నతండ్రికి భగత్‌సింగ్ రాసిన ఆఖరి లేఖ...**



# ధీరవాణి

సంస్కృతంలో రెండు గొప్ప ఇతిహాసాలున్నాయి. అవి రామాయణం, మహాభారతం. ప్రాచీన భారతీయుల ఆచార వ్యవహారాలు, నాటి సమాజ స్థితి, నాగరకత మొదలైనవి ఆ గ్రంథాల్లో ఇమిడి ఉన్నాయి. అన్నిటికంటే అతిప్రాచీనమైన ఇతిహాసం రామాయణం.

రామాయణ కర్త వాల్మీకి ముని. రామాయణం అతిచక్కని రచన. విశ్వసారస్వతంలో రామాయణానికి దీటైంది లేదు.

**ఆదర్శనారి ఆమె...**

## సీత సహనం శిరోధార్యం

సీతారాములుభారతీయులకు ఆదర్శప్రాయులు. పిల్లలందరూ, ముఖ్యంగా బాలికలు సీతను ఆరాధిస్తారు. పవిత్రురాలు, భక్తురాలు, సహనశీలి అయిన సీతను పోలివుండటం కంటే భారతీయమహిళ కోరదగ్గ ఉన్నతి మరొకటి లేదు. ఈ పాత్రను పరిశీలించినప్పుడు, పాశ్చాత్యుల ఆదర్శంకంటే భారతీయుల ఆదర్శం ఎలా వేరైనదో మీకు స్పష్టమౌతుంది.



జాతికంతకూ సహనానికి సీత ప్రతీక. 'చేతల్లో శక్తి చూపించండి' అంటారు పాశ్చాత్యులు. 'సహనంలో మీ శక్తిని చూపించండి' అంటారు భారతీయులు. పాశ్చాత్యుల్లో వ్యక్తి సంపాదన సామర్థ్యాన్ని బట్టే గెలుపును నిర్వచిస్తారు. మరి మనదేశంలో త్యాగాన్ని బట్టి మనిషి గొప్పతనాన్ని లెక్కకడతారు. చూశారా! ఎంత వ్యత్యాసం! అందుకే ఆదర్శ భారతీయతకు సీతఉత్తమోదాహరణ. సీత అనే స్త్రీ నిజంగా ఒకప్పుడుండేదా?, ఆమె కథ నిజమా?, కాదా? అనే ప్రశ్నలు మనకొద్దు. సీత అనే ఆదర్శం ఉందని మనం గుర్తుచేసుకుందాం. సీతాదర్శం యావద్దేశవ్యాప్తమై జాతీయ జీవనంలోకి అంతగాఢంగా చొచ్చుకొనిపోయింది. భారతీయుల ప్రతి రక్తకణంలోనూ కలిసిపోయిన పౌరాణికగాథ అది. మంచికిగాని, పవిత్రతకుగాని, పాతిప్రత్యానికి గాని, భారతీయ మహిళా ధర్మానికి గాని సీత పెట్టింది పేరు. పురోహితుడు ఒక స్త్రీని ఆశీర్వదించేటప్పుడు సీతవలె ఉండమనే ఆశీర్వదిస్తాడు. ఒక శిశువును దీవించేటప్పుడు సైతం అతడు సీతలా ఉండమనే అంటాడు. వారంతా సీత పిల్లలు. సీతలా ఉండటానికి ప్రయత్నిస్తున్నారు. సీత ఎలాంటిదంటే క్షమాశీలి, సహనశీలి, పరమసాధ్వి. దుర్భర కష్టాలు అనుభవించే సమయంలో కూడా ఆమె నోటివెంట రాముణ్ణి గురించి ఒక్క కటువైన మాట కూడా వెలువడలేదు. అంతా తన విధిగా భావించి, తన కర్తవ్యం నిర్వర్తించింది. అడవుల పాలైన సమయంలో కూడా ఆమెలో ఏమాత్రం పరుషత లేదు. అపకారానికి ప్రత్యప కారం ఎన్నటికీ తలపెట్టదు. అది భారతీయ ఆదర్శం.

**గమనాలు వేరైనా గమ్యం ఒక్కటే...**

చెడును జయించి దానిపై గెలుపు సాధించామనే పాశ్చాత్యుల ధోరణికీ, సహనంతో శత్రువునైనా జయించవచ్చనే భారతీయ ఆదర్శానికీ గమ్యం మాత్రం ఒక్కటే. ఆ ఇద్దరి లక్ష్యం చెడును రూపు మాపటం. కాని గమనాలు వేరు వేరు అన్న భ్రాంతితో కలహించుకోవద్దు. అదే నా ఆకాంక్ష. ◙

(స్వామి వివేకానంద సాహిత్య సర్వస్వం నుంచి...)

> నిత్య సత్యవ్రతయై, పతివ్రతా తిలకమై మానవులకు, దేవతలకు పరమాదర్శమైన సీత చరిత్ర నిత్య ప్రకాశవంతమే. ఆ మహాసాధ్వి సీత మన జాతికి అధిష్ఠాన దేవతై ఎప్పుడూ సుస్థిరంగా నిలిచి ఉంటుంది. నిత్య పావని, అగాధ సహనశీలి, పరమశాంత మూర్తి అయిన ఆ తల్లి ఆధునిక నారీమణులకు కూడా ఆరాధ్యనీయురాలే. ఆమెను గురించి వర్ణించటం ముంజేతి కంకణానికి అద్దం చూపటమే.
>
> – స్వామి వివేకానంద



# సమత్వమే యోగం

- ప్రవ్రాజిక బోధమయ ప్రాణ

**(2006 డిసెంబర్‌లో జరిగిన 'అనంతపురం-భక్తసమ్మేళనం'లో ప్రవ్రాజిక బోధమయ ప్రాణ చేసిన ప్రసంగం ఇది)**

**ఈ** కాలంలో 'యోగం' అనే పదం దేశవిదేశాలలో అందరినీ ఆకట్టుకుంటున్న అంశం. యోగం అంటే ఏమిటో తెలియ కుండానే దానిపై విపరీతమైన మోజు పెంచుకుంటు న్నారు. పలువురు దీన్ని పలు రకాలుగా అర్థం చేసుకుంటు న్నారు. ఫలితంగా ఎన్నో చక్కని భావాలతో పాటు కొన్ని తేలిక పాటి భావాలు కూడా ఈ పదాన్ని ఆశ్రయించాయి. కాళ్ళుపైకి, తల క్రిందికి పెట్టటంలాంటి కొన్ని శారీరక వ్యాయామాలను 'యోగం' అని పిలుస్తున్నారు. ప్రాణా యామం చేసి ఏకాగ్రత సంపాదించడమే యోగమని కొందరి భావం. ఇంద్రజాలాలు, గారడీలు చేయగలిగిన వాడే యోగి అని కొందరి భ్రాంతి. సర్వం త్యజించి అడవుల్లోకి పోయి, ముక్కు మూసుకొని తపస్సుచేసే వాడే యోగి అని మరి కొందరి విభ్రాంతి. ఇటువంటి భ్రాంతి, విభ్రాంతులను వదిలించుకొని యోగమంటే ఏమిటో స్పష్టమైన అవగాహన కలగాలంటే భగవద్గీత లాంటి శాస్త్రాలను అధ్యయనం చేయాలి. మహాపురుషుల జీవితాలను మననం చేసుకోవాలి.

యోగం అనే పదం 'యుజ్' అనే ధాతువు నుంచి పుట్టింది. 'యుజ్' అంటే కలపడం, జీవాత్మను పరమాత్మతో కలిపే ప్రక్రియ యోగం. అయితే ఆ పరమాత్మ అంతర్యామి రూపంలో మనలోనే కొలువుదీరి ఉన్నాడు. కాబట్టి మనం ఇక్కడకూ అక్కడకూ పోవాల్సిన పనిలేదు. ఇక్కడే ఈ శరీరం లోనే ఆ దివ్యానుభూతిని పొందగలం. ఈ విధంగా గీత నేర్పే యోగం లౌకిక జీవితానికీ, ఆంతరంగిక సృష్టించుకునే అడ్డుగోడలను పెకిలించివేస్తుంది. రెండింటి మధ్య చక్కని ఒద్దికను ఏర్పరుస్తుంది. జీవిస్తూ, పనిచేస్తూ అందరితో పాటు నివసిస్తూనే యోగం ఎలా అనుష్ఠించవచ్చో చూపిస్తుంది. గీతలో శ్రీ కృష్ణుడు అర్జునుడికీ, తద్వారా మనకీ ఇచ్చిన ముఖ్యమైన ఉపదేశాల్లో ఒకటి "తస్మాద్యోగీ భవ".

ఈ యోగం అతి పురాతనమైనది. కాకపోతే కాల క్రమంలో యోగం నశించినప్పుడు దాన్ని మళ్ళీ వృద్ధిలోకి తీసుకురావటానికి అవతార పురుషులు ఉద్భవిస్తారు. అందుకే శ్రీ కృష్ణుడు ఇలా అన్నాడు:

**స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప..**
**స ఏ వాయం మయా తేద్య యోగః ప్రోక్తః పురాతనః...**

అదే విధంగా ఈనాడు శ్రీ శారదాదేవి అదే సనాతన యోగాన్ని ఈ కాలంలో మనందరికీ అర్థమయ్యే విధంగా అచరించి చూపించారు.

యోగానికి భగవద్గీత కొన్ని చక్కని నిర్వచనాలను ఇస్తుంది. వాటిని అధ్యయనంచేస్తూ ఆమె జీవితంలోకి తొంగి చూసినట్లయితే యోగ సాధన పార్ట్ టైమ్ జాబ్ లేదా రిటైర్‌మెంట్ తరువాత ఉద్యోగం కాదనీ, నిత్య జీవితంలో యోగ సాధన సాధ్యమనీ మనకు అర్థమవుతుంది. యోగి, సంసారి అన్నవి రెండు వ్యతిరేక పదాలు కావు. యోగిగా ప్రతి మనిషి సంసారం చేయాలి. సాంసారిక జీవితాన్ని ఆధ్యాత్మికం చేయడం సాధ్యం అని ఆమె మనకు సూచించారు.

మొదటిగా 'సమత్వం యోగ ఉచ్యతే' అనే నిర్వచనాన్ని తీసుకుందాం.

అమ్మ జీవితం ఈ నిర్వచనానికి ఉత్తమ ఉదాహరణ. మనం ఈ 'సమత్వం' అనే దాన్ని సమదర్శిత్వం, సమచిత్తత్వం అని రెండు

యోగి సర్వత్రా, ప్రతి ఒక్కరిలోనూ ఒకే పరమాత్మను చూస్తాడు. కాబట్టి అతడికి సమదర్శిత్వం అలవడుతుంది.

అమ్మ జీవితాన్ని పరిశీలిస్తే ప్రాపంచిక వైన భేదాలు, భిన్నత్వాలు ఏవీ ఆమెను



తాకేవి కాదు. ఆమె దగ్గరకు వచ్చిన వారిలో ధనికులు, పేదలు, దుర్జనులు, సజ్జనులు, దేశీయులు, విదేశీయులు, భిన్న మతాల వారు, విభిన్న జాతుల వారు ఉండేవారు. కానీ అమ్మ ఈ భేదాలకు అతీతంగా వ్యవహరించే వారు. ఆమె ప్రేమ, ఆదరణ అందరి పట్లా సమంగా ఉండేవి. అమ్మ అందరికీ అమ్మే అన్నట్లుండేవారు. స్థితప్రజ్ఞునిగా పేరుగాంచిన స్వామి శారదానందకు అమ్మ ఇంట్లో ఎంత స్వాతంత్ర్యం ఉండేదో, ఒక ముస్లిం దొంగ అంజాద్‌కు కూడా ఆమె ఇంట్లో అంతే హక్కు, స్వాతంత్ర్యం ఉండేది.

ఆమె ఆ బ్రహ్మకోటి జనని. ఒకసారి దుర్గా పూజ సందర్భంగా ఇంటిల్లిపాదికీ బట్టలు కొనే భారం ఒక స్వదేశీ ప్రియుడైన బ్రహ్మచారి చేతుల్లో పడ్డప్పుడు అతడు ఏరికోరి స్వదేశీ ముతక వస్త్రాలను తెచ్చాడు. ఇంట్లో ఎవరికీ అవి నచ్చలేదు. అతడి అభిప్రాయాన్ని సరిదిద్దుతూ అ వ ం ృ "నాయనా! వారు (అంటే విదేశీయులు) కూడా నా బిడ్డలే కదా. నేనెవరిపట్లా పక్షపాతం చూపలేను" అన్నారు. అమ్మలో సమదర్శిత్వం, అభేద బుద్ధి ఎంత దృఢంగా ఉండేదంటే చివరికి దారిలో ఎదురైన బందిపోటు దంపతుల్ని సొంత తల్లి తండ్రుల్ని పిలిచినంత సహజంగా 'అమ్మ' 'నాన్న' అని పిలిచారు. ఆమెలోని ఈ అభేద బుద్ధీ, సరళతా వారిలో కూడా మార్పు తెచ్చింది. స్వంత కూతురి కంటే మిన్నగా, ఆప్యాయంగా కన్నీళ్ళతో వీడ్కోలు పలికారు. అంతేకాదు, కూతుర్నీ, అల్లుడినీ చూడడానికి సుదూరంలో ఉన్న దక్షిణేశ్వరానికి కూడా తరచూ వెళ్ళేవారు.

**అయ్యం నిజో పరోవైతి గణనా లఘుచేతసాం।**
**ఉదార చరితానంతు వసుధైక కుటుంబకం॥**

'వీడు నా వాడు, వాడు పరాయివాడు అని అల్పబుద్ధి గలవాళ్ళు భావిస్తారు. విశాల బుద్ధి కలవారికి ఈ విశ్వమంతా ఒకటిగా కని పిస్తుంది'. ఈ సమదర్శిత్వం కొద్దిగా నైనా అలవరచు కున్నప్పుడే బాహ్య జీవితంలో 'భిన్నత్వంలో ఏకత్వం' సాధించడం సులభ మవుతుంది. అలాగే ఆధ్యాత్మిక జీవితంలో కూడా కొన్ని అడుగులు ముందుకు వేసి అందరిలోనూ ఉన్న ఆ భగవంతుడికి దగ్గర వుతాం. ఇదే అమ్మ జీవితం మనకు నేర్పేపాఠం. a

**('సమచిత్తం'తో ఎలా జీవించాలో చూపిన అమ్మ జీవితం... వ చ ే ౕ సంచికలో)**

**భగవత్సాక్షాత్కారం పొందిన వారు ఎలా ఉంటారు? వారికేమయినా తలపైన రెండు కొమ్ములు మొలుస్తాయా? కాదు! వారు అత్యంత వినయవంతులై, అన్ని జీవులనూ తన వారిగా భావిస్తూ, ప్రేమిస్తారు. వారు అందరినీ భగవంతుని రూపాలుగా సేవిస్తారు. - శ్రీ శారదా దేవి**

## పండుగలు - పర్వదినాలు

### మార్చి - 2007

| | | |
|---|---|---|
| 3 | శనివారం | : శ్రీ చైతన్య జయంతి |
| 8 | గురువారం | : స్వామి యోగానంద జయంతి |
| 15 | గురువారం | : ఏకాదశి |
| 20 | మంగళవారం | : ఉగాది |
| 27 | మంగళవారం | : శ్రీరామనవమి |
| 29 | గురువారం | : ఏకాదశి |





# పవిత్రతకు పరమేశ్వరుని పరీక్ష

చిత్రాలు : గోవి    కథ : అళగరాజా    తెలుగు సేత : స్వామి జ్ఞానదానంద









**4** ఆ యువతి ఏడుపులు విని పలువురు అక్కడికి వచ్చి ఏం జరిగిందో తెలుసు కోవాలని....

అమ్మా ! నీకు ఏమి సాయం కావాలో చెప్పు తల్లీ!

నేనేమి చెప్పనమ్మా ! ఈ శవంగా పడి ఉన్నది నా భర్త. కడపటి రోజుల్ని గంగా తీరంలో గడపాలని ఆయన కోరిక. అందువల్ల చాలా దూరం నుంచి ఇక్కడకు వచ్చాం. చివరికి యిలాంటి పరిస్థితి దాపురించింది.

అంతా విధి తల్లీ ! నిన్ను చూస్తే జాలేస్తుంది. నీకు ఏమి సాయం కావాలో చెప్పు! చేసి పెడతాం !

**5** ఈయనకు అంత్యక్రియలు చేయాలి ! నాకు సాయం చేయడానికి ఎవరు ముందుకు వస్తారు ?

సాయం చేయడానికి ఎవరూ లేకపోవటం ఏంటి? మేమంతా ఉన్నాం కదా !

**6** ఒంటరి అయిన ఆమెను చూసి సాయం చేస్తున్నామనే నెపంతో, మనసులో దురాలోచనలతో పలువురు యువకులు ముందుకు వచ్చారు.

అమ్మాయీ ! నీకు ఏమి సాయం కావాలో చెప్పు ! వెంటనే చేసి పెడతాం!

నేనున్నానుగా! నాకు చెప్పు !

వట్టి మాటలెందుకు ? చని పోయిన నీ భర్తను నాభుజంమీద తీసుకెళ్లి అంత్యక్రియలు నేను చేయిస్తాను.

అయ్యా! మీకందరికీ ధన్యవాదములు. కానీ ఒక నిబంధన. శారీరకంగా, మానసికంగా పవిత్రుడైన వ్యక్తి మాత్రమే ఈయనకు అంత్యక్రియలు చేయాలి.

మిగతా 36 వ పేజీలో...

# పరిప్రశ్న

– స్వామి సుకృతానంద

– కృష్ణశర్మ, విశాఖపట్టణం

**?: సాలగ్రామం అంటే ఏమిటి? ఎక్కడ లభ్యం? ఎలా ఉపయోగించాలి?**

✍:మహావిష్ణువును స్మార్తులు, వైష్ణవులు సాలగ్రామంలో పూజిస్తారు. శివపూజకు నర్మదానదిలో లభ్యమయ్యే బాణలింగంవలే నేపాల్ నుంచి ప్రవహించే గండకీ నదిలో సాలగ్రామాలు లభ్యమవుతాయి. అందులోనూ ఎన్నో రకా

లు...

'సా...

సర్వ...

– ...

**?: ...**

**వా...**

**ధర్మ...**

గడ...

అ...

తగి...

వది...

లో...

– ...

**?: ...**

**మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగ ధారణామ్' మనస్సును హృదయంలో నిలిపి, ప్రాణమును, శిరస్సులో నిలపడం అంటే అర్థం ఏమిటి?**

✍: భగవంతుడు మనకు తల్లి, తండ్రి, మిత్రుడు, బంధువు. మనం ఎలా జీవించాలో చెబుతూ నశ్వరమైన దేహాన్ని ఎలా వదిలిపెట్టాలో వివరిస్తున్నాడు. 'జీవించి ఉండగా సర్వకాల సర్వావస్థల్లో, నన్ను స్మరిస్తూ నీ కర్తవ్యాన్ని నిర్వహించు. చివరి క్షణాల్లో నువ్వు ఏ విధంగా నశ్వర శరీరాన్ని వదలాలో చెబుతాను విను' అంటున్నాడు పరమాత్మ తన భక్తుడిని ఉద్దేశించి. మనందరం కూడా అలాచేస్తే సచ్చిదానంద స్వరూపుడైన ఆయన్నే చేరుకుంటాము. అన్ని ఇంద్రియాల్ని నియంత్రించి మనస్సును పరమాత్మ స్థానమైన హృదయంలో నిలిపి (భగవంతునిపై ఉంచి ) ప్రాణ

# ఆధ్యాత్మిక అన్వేషణ

- స్వామి తపస్యానంద

**ప్రశ్న:** భగవంతునికి 'ముక్త్యారునామా' (Power of Attorney) ఇవ్వడమంటే ఏమిటి? సాధకుడు ఏ సమ యంలో దానికి అర్హుడౌతాడు?

**జవాబు:** 'ముక్త్యారునామా' అనే ఈ పదాన్ని శ్రీరామకృష్ణులు గిరీశ్‌చంద్రఘోష్ అనే భక్తుని విషయంలో ప్రయోగించారు. గిరీశ్‌చంద్రఘోష్ అచంచల విశ్వాసం, తెలివితేటలు, నిజాయతీ గల వ్యక్తి. కానీ అతడు ఒక కళాకారుడు. స్వభావరీత్యా విచ్చలవిడిగా తిరిగేవాడు. దినచర్యను ఏమాత్రం పాటించనివాడు. నియమనిబంధ నలకు దూరంగా ఉండేవాడు. అయితే శ్రీరామకృష్ణులు కొన్ని నియమాలను అతనికి సూచించారు. కానీ గిరీశ్ వాటిని పాటిస్తానని మాటివ్వలేకపోయాడు. కనీసం భోజనానికి, నిద్రకు కూడా తగిన సమయపాలన లేని తన దినచర్యనే దానికి కారణంగా చూపాడు. ఆ సమయానికి ఏది అనుకుంటే అదే చేసేవాడు తప్ప ఎన్నడూ ప్రణాళికా బద్ధంగా పనిచేసేవాడు కాదు. అందువల్ల శ్రీరామకృష్ణులు అతనిని తనకు 'ముక్త్యారునామా'ను ఇవ్వమన్నారు. దీని అర్థమేమంటే, న్యాయశాస్త్ర ప్రకారం మీరు మీ 'ముక్త్యారు నామా'ను మరొక వ్యక్తికి సమర్పిస్తే, మీ తరపున అన్ని పనులను అతడే చక్కబెడతాడు; మీరు ఏమాత్రం వాటి గురించి ఆలోచించాల్సిన అవసరం ఉండదు. అదే విధంగా శ్రీరామకృష్ణులు గిరీశ్ ఆధ్యాత్మిక పురోగతికి సంబంధించిన బాధ్యతనంతా ఆయనే వహించేందుకు సిద్ధమయ్యారు. ఇక్కడ కొన్ని విషయాలను గుర్తుంచుకోవాలి.

` గిరీశ్ అసాధారణమైన విశ్వాసం, నిజాయతి, తెలివితేటలు కలవాడు. అందుచేత ఏదైనా చెప్పాడంటే, దాని అసలు భావం తెలుసుకునేందుకు అతడికి చాలా కాలం పట్టినా, ఎంతో నిక్కచ్చిగా చెప్పేవాడు.

` శ్రీరామకృష్ణుల ఆధ్యాత్మిక ఔన్నత్యంపై, ఇతరుల పరిరక్షణలో వారికున్న శక్తి సామర్థ్యాలపై గిరీశ్‌కు ప్రగాఢ నమ్మకం. అటువంటి సంపూర్ణవిశ్వాసం, అర్పణభావం అతడి మనసును శ్రీరామకృష్ణుల పవిత్ర సాంగత్యం వైపు నిర్నిరోధంగా మరల్చాయి. ఆ సాంగత్య ప్రభావం
వల్ల క్రమంగా అతనిలో మార్పు కనిపించింది.
అతని విశ్వాసం, తెలివితేటలు... జయాప జయాలను, సుఖదుఃఖాలను సమదృష్టితో చూసేలా,
త న జీ వి తా న్ని వ ం ల చే ఎా ం . ా ల ం గా ఉ ప యా గ ప డ్డా ం యి .
శ్రీరామకృష్ణులతో మమేక మవుతున్నాననే భావం అతని స్వభావంగా మారసాగింది. ఇదే లేకుంటే 'ముక్త్యారునామా' ఇచ్చేందుకు ఆధారభూతమైన అహంకార త్యాగమనేది అతనిలో జరిగి ఉండేది కాదు.

` శ్రీరామకృష్ణులది ఒక విశిష్ట వ్యక్తిత్వం. ప్రతి సాధ కునిలో దాగివున్న ఉత్తమ లక్షణాలను వెలికితీసే శక్తి వారిది. అందువల్ల ఇవన్నీ కూడా అతనిలో క్రమంగా ఆధ్యాత్మిక పరివర్తనను కలిగించాయి.

ఈ షరతులన్నిటినీ కనీసం కొంతవరకైనా తృప్తిపరచ గలిగినప్పుడే ఎవరైనా 'ముక్త్యారునామా' ను ఇవ్వడం గురించి మాట్లాడవచ్చు. గిరీశ్‌కు ఉన్న అచంచల విశ్వాసం, శ్రద్ధవంటివి ఇతరులలో అరుదు. అటువంటప్పుడు, భగవంతుడు దాన్ని సాధించేందుకు తమకు శక్తియుక్తు లను పరిమితంగానే ఇచ్చాడనీ, ఆయన అనుగ్రహం వలన జరిపే స్వయంకృషే తమ జీవితంలో ఆధ్యాత్మిక పురోగతికి మార్గమని భావిస్తూ మానవ ప్రయత్నంచేయడం ఉత్తమం. 'ముక్త్యారునామా' ఇచ్చిన వ్యక్తి మనసు చాలా ప్రశాంతంగా ఉంటుంది – ఇదే ఆ వ్యక్తికి కొలబద్ద. శ్రద్ధ, విశ్వాసాలతో అలా చేసిన వ్యక్తిని జయాపజయాలు, సుఖదుఃఖాలు ఏమాత్రం ఉద్వేగ పరచవు. అలా జరగనినాడు ఆ వ్యక్తి నిజంగా 'ముకార్త్యునామా'ను ఇవ్వలేదని మనం నిర్ణయించవచ్చు.

హిందీ మూలం : - స్వామి ఆత్మానంద     తెలుగుసేత : శ్రీమతి జి.యస్. లక్ష్మి

**తు**లసీదాస్ రామచరిత మానస్‌లో రామరాజ్యాన్ని చాలా అందంగా వర్ణించారు. తులసీదాస్ 'రామరాజ్య స్థాపన మొట్టమొదట అయోధ్యలో కాదు చిత్రకూటంలో జరిగింది'. అంటారు. అసలు అయోధ్యలో రామరాజ్యం స్థాపించాలని దశరథ మహారాజు సంకల్పం. ఆయన శ్రీరామునికి పట్టాభిషేకం చేయబోతున్నటు ప్రకటించారే కానీ ఆయన ఆలోచన ఫలించ లేదు. దానికి గల కారణాలు అన్వేషిస్తే, అక్కడ ఉన్న అడ్డంకులు చక్కగా అవగతమవుతాయి. దశరథ మహారాజు రేపు రామునికి పట్టాభిషేకం జరుగుతుందని ప్రకటించారు. కానీ ఆయన ప్రవర్తన ఆ కార్యానికి అను కూలంగా లేదు. ఆ పవిత్ర కార్యానికి ముందురోజు సంయ మనంతో నియమంగా ఉండవలసిన సమయంలో తన మూడవ రాణి కైకేయి దగ్గర ఉన్నారు మహారాజు. దశరథుని మోహం, కైకేయి కోపం, మంథర లోభం నెలకొన్న అయోధ్యలో రామరాజ్యం ఎలా సాధ్యమౌతుంది? రామరాజ్యానికి అర్థమే కామక్రోధ లోభాలవంటి ఆవేశాల నియంత్రణ. ఏ వ్యక్తి తన జీవితంలో ఈ విధంగా ఆవే శాలను నియంత్రించుకోగలడో అతనిలో రామరాజ్యం స్థాపించే ఆలోచనకి అంకురార్పణ జరుగుతుంది. అటు వంటి వ్యక్తులు గల సమాజానికే రామరాజ్యం స్థాపించే హక్కు ఉంటుంది. అందుకే చిత్రకూటంలో రామరాజ్య స్థాపన జరిగింది అని చెప్పారు. అక్కడ ఒక నావికుడు ప్రథమ నాగరికుడు. భరతుడు శ్రీరాముణ్ణి అయోధ్యకి తీసుకెళ్ళడానికి చిత్రకూటం వచ్చినా రాముడి ఉదాత్తమైన జీవన విధానంతో అక్కడ రామరాజ్య స్థాపన జరిగి పోయింది. చిత్రకూటం దగ్గరకి చేరేటప్పటికి భరతుడి దృష్టికి రామరాజ్యం ప్రతిభ గోచరించింది. రామచరిత మానస్‌లో తులసీదాస్ ఈ విధంగా రాశారు. 'భరతుడు చిత్రకూటం సమీపించినా అతివృష్టి, అనావృష్టి, ఎలుకలు, మిడతలు, పక్షులు వంటి ప్రాణులు సృష్టించే ఉత్పాతాలు, పొరుగు రాజుల ఆక్రమణలు వంటి ఈతిబాధల వలన భీతిచెందిన ప్రజలు ఒక సుభిక్షమైన దేశంలోకి, ఉత్తమమైన రాజ్యంలోకి వెళ్ళి సుఖపడుతున్నట్లు అతనికి అనిపించింది. శ్రీరాముని రాకతో మంచి రాజు పాలనలో ప్రజలు ఎంతో సుఖంగా ఉన్నట్లు వనసంపద అంతా సుశోభితంగా ఉందట. అందమైన అడవులతో కూడిన పవిత్రమైన దేశం, వివేకం ఆ దేశపు రాజు, వైరాగ్యం మంత్రి, యమ(అహింస, సత్యం, ఆస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం) నియమాలు (పరిశుభ్రత, సంతోషం, తపం, స్వాధ్యాయం,ఈశ్వర ధ్యానం) ఆ రాజ్యపు సైనికులు! శాంతి, సుబుద్ధి అందమైన రాణులు! పర్వతమే రాజధాని! రాజ్యానికి అవసరమైన అన్ని అంశాలు కలిగినవాడు ఆ రాజు. శ్రీరామచంద్రుని శరణులో ఉన్న అతని మనస్సు ఆనందంతో నిండి ఉంది. మోహం అనే రాజుని సైన్యంతో సహా పరాజితుణ్ణిచేసి వివేకం అనే రాజు నిరంతరం రాజ్యమేలుతున్నాడు. అతని రాజ్యంలో సుఖశాంతులు ఉన్నాయి. లతలు, వృక్షాలు, గడ్డి కూడా పుష్పించి ఫలించాయి. ఆ ప్రదేశమంతా ఆనంద మయంగా, మంగళకరంగా ఉంది.' ఈ విధంగా తులసీదాస్ రామరాజ్య స్వరూపాన్ని వర్ణించారు. భరతుడు పధ్నాలుగు సంవత్సరాలు కఠినమైన తపస్సుచేసి, కామ క్రోధ లోభ ప్రవృత్తుల్ని తరిమివేయడంలో సఫలీకృతు డయ్యాడు. అప్పుడు అక్కడ రామరాజ్యమేర్పడింది. ఒకవైపు శ్రీరాముడు చిత్రకూటంనుంచి అయోధ్య రావడానికి నిరాకరించి అడవులకు వెళ్ళిపోయాడు. రెండవవైపు భరతుని వంటి మహాసన్యాసి పధ్నాలుగు సంవత్సరాల కాలం తన దివ్యమైన వ్యక్తిత్వం ద్వారా యాగాగ్ని ప్రజ్జ్వ లింపజేసి దాని మంటలలో అయోధ్యలో ఉన్న కాలుష్యాన్ని దహనం చేశాడు. చెడునంతా నాశనం చేశాడు. తత్ఫలి తంగా అయోధ్యలో రామరాజ్యం మొదలయింది. శ్రీ రాముడు పధ్నాలుగు సంవత్సరాల కాలం బాహ్య శత్రు వుల్ని నాశనం చేశాడు. భరతుడు పధ్నాలుగు సంవత్సరాల కాలం ఆంతరంగిక శత్రువుల వినాశం చేపట్టాడు.

ఈ విషయం ... శత్రుఘ్నుడితో ... తీసుకున్నాడు.
శత్రుఘ్నుడి ... రామరాజ్యం ... ప్రేమించండం
రామ ... అయోధ్యలో ... స్థాపించాడు.
మంథర ... లంకాయుద్ధం
ఏర్పడ ... వానరులు.
'మోక్ష ... కోకుండా
వరకు ... స్నానాదికాలు
ప్రకటి ... రామరాజ్యం ... అయోధ్యలో ధరించిన
రామ ... చేసేవారే నాకు
శ్రీరాముడు ... అయోధ్య తిరిగి ... నీతి
వస్తాడు. శ్రీరాముడు అడవి నుంచి అయోధ్యకు

... మైన పని జరిగితే ... ఏ మాత్రం ... భయపడ కుండా
పనికోసం ... రాగా శ్రీరాముడు ... నన్ను ఆపాలి.'
'గురుదేవుల అంటాడు.
ఆజ్ఞ నాకు చివరిలో
శిరోధార్యం. తులసీదాస్
నేను ఈ
స్నానం
సిద్ధంగా
చేస్తాను,
కానీ రాశారు
'అక్కడ
మొదట



నా మిత్రులకి
కలగదు. అందరూ ఆనందంగా, ఆరోగ్యంగా ఉంటారు.
స్నానం చేయించండి.'
ఎక్కడా నిరుపేదలు, దుఃఖితులు ఉండరు, దీనులు మూర్ఖులు ఉండరు,
అన్నాడు. ఇంతకీ
అందరూ శుభ లక్షణాలు కలవారే ఉంటారు'. ఇది రామరాజ్యం అంటే!
శ్రీ ఆయన మిత్రులు
ఎవరు? వానరులు!

## సామరస్యం చాటిన శ్రీరామనవమి...

శ్రీరామనవమి అనగానే మా రామేశ్వరంలో జరిగిన ఓ సంఘటన గుర్తొస్తుంది.మా తాతని,ముత్తాతనీ అక్కడ అత్యంత ఆత్మీయులుగా భావించేవారు. రామేశ్వరమంటేనే రాముడు రావణుడిపై సంగ్రామాన్ని ప్రకటించిన పుణ్యస్థలం. అక్కడ ఏటా సీతారాముల కల్యాణం వైభవంగా జరిగేది. అన్ని మతాలవారికీ అవి మధురక్షణాలే. రామతీర్థమనే కొలనులో అలంకృత ఉత్సవవిగ్రహాల్ని ఊరేగింపుగా తీసుకుపోవటానికి మా ముత్తాత తెప్పకట్టేవారు. ఆ కొలను చాలా లోతుగా ఉండేది. ఆ కొలను మధ్య తేలాడే ఆ తెప్పమీద చిన్న మంటపమూ, ఆ మంటపం మీద సుందరమైన బంగారునగలతో అలంకరించిన శ్రీరామచంద్రమూర్తి విగ్రహమూ ఉండేది. ఆ కల్యాణాన్ని చూడటానికి రామేశ్వరమంతా ఒక్కచోట చేరుతుంది. ఒక ఏడాది మా ముత్తాత యథావిధిగా తెప్పకట్టిన సమయంలో దుర్ఘటన సంభవించింది. శ్రీరాముని విగ్రహం తలకిందులై నీట మునిగిపోయింది. అంతే... ఆయన ఒక్క క్షణం కూడా తటపటాయించకుండా నీళ్లలో దూకి విగ్రహాన్ని పైకి తెచ్చారు. ఊరు ఊరంతా ఆ దృశ్యానికి పులకించిపోయింది. ఆ నవమిన అగ్రతాంబూలాన్ని దేవాలయ పూజారులు మా కుటుంబానికి అనుగ్రహించారు. ఆ విగ్రహాలు దొరికినందుకు సర్వేశ్వరునికి కృతజ్ఞతలు స్తుతిస్తూ రామేశ్వరం మసీదులో మావాళ్లు ప్రత్యేక ప్రార్థనలు చేశారు. మానవ సౌభ్రాతృత్వానికి ప్రకాశవంతమైన ఉదాహరణగా ఈ సంఘటనని నేనెప్పుడూ భావిస్తాను. శ్రీరామనవమి అనగానే నా స్మృతిపథంలో ఈ సంఘటనే మెదులుతుంది. ముఖ్యంగా నేటిభారతం ఈ ఉదాహరణ నుంచి ఎంతో నేర్చుకోవాలి.

**- రాష్ట్రపతి అబ్దుల్‌కలామ్**

# ఆచమనంలోని అసలు కథ

- రెంటాల జయదేవ

వైదిక కర్మలు ఏం జరుపుతున్నా ఆరంభంలో తప్పనిసరిగా ఆచమనం చేస్తుంటాం. వైదిక కర్మచేస్తున్న వ్యక్తి, చేయిస్తున్న పురోహితుడు - ఇద్దరూ ఎవరికి వారు ఉద్ధరణితో కుడిచేతిలో మూడుసార్లు నీళ్ళు పోసుకొని, దాన్ని పానంచేస్తారు. దీన్నే 'ఆచమనం' అంటారు. ఈ తప్పనిసరి ఆచారానికి కూడా ఓ పరమార్థం ఉంది. ఆచమనం, సంకల్పం, సమర్పణం - ఈ మూడూ పూజలో కీలకమైనవి. వీటిని తప్పనిసరిగా ఆచరించాలి. ఇవి లేని పూజ రాక్షసమవుతుంది. భగవన్నామాలను స్మరిస్తూ ఆచమించనట్లయితే, ఆ పూజ నిరర్థకమని పెద్దల మాట. కాబట్టి, సరైన పద్ధతిలో ఆచమనం ఎలాచేయాలో, దాని పరమార్థం ఏమిటో తెలుసుకుందాం.

**ఆచమనం ఎలా చేయాలి?**

ఆచమనం చేసేటప్పుడు కుడిచేతి బొటనవేలిని మధ్య, చూపుడు వేళ్ళ మొదట ఉంచాలి. ఉంగరం వేలు, చిటికెన వేళ్ళను మాత్రం చాచి ఉంచాలి. అప్పుడది 'గోకర్ణాకృతి' (అంటే, ఆవు చెవి ఆకారం) అవుతుంది. అలా గోకర్ణాకృతిగా ఏర్పరచుకొని, ఉద్ధరణితో కలశ పాత్రలోని జలాన్ని మినప గింజ మునిగేటంత పరిమాణంలో కొద్దిగా పోసుకొని, ఆచమనం చేయాలి.

**గోకర్ణాకృతి హస్తేన। మాషమగ్నం పిబేజ్జలమ్ ॥**
**తన్న్యూన మధికం పీత్వా। సురాపాన సమం భవేత్॥** (వ్యాసః)

*'గోకర్ణం (ఆవు చెవి) లాగా చేతిని ఉంచి, మినప గింజ మునిగేటంత జలాన్ని పానం చేయాలి. అంత కన్నా ఎక్కువ తాగినా, తక్కువ తాగినా అది సురాపానంతో సమాన మవుతుంది.'*

***సంహతాంగుష్ఠ హస్తేన। గృహీత్వా చాంబు వీక్షితమ్॥***
***ముక్తాంగుష్ఠ కనిష్ఠాభ్యాం। త్రిః పిబే ద్బ్రహ్మతీర్థతః॥*** (వ్యాసః)

*'అంగుష్ఠంతో కూడిన గోకర్ణాకృతి హస్తంతో నురుగు, బుడగలేవీ లేకుండా చూసుకొని, ఆ జలాన్ని తీసుకొని, అంగుష్ఠ, కనిష్ఠిక (చిటికెనవేలు)లను వదిలేసి, 'బ్రహ్మ తీర్థం'తో మూడు సార్లు ఆచమించాలి.'* ***అంగుష్ఠాగ్రం సమాకుంచ్య। మధ్యమామధ్య పర్వణి॥ గోకర్ణం తద్ధి విజ్ఞేయం। సర్వే ష్వాచమనే ష్వపి॥*** (వ్యాసః) *'అంగుష్ఠాగ్రాన్ని (బొటనవేలు పైభాగాన్ని) మధ్యమామధ్య పర్వం వరకు వంచితే అది 'గోకర్ణాకృతి' అవుతుంది. అన్ని ఆచమనాల్లోనూ ఇదే విధానాన్ని అనుసరించాలి.'*

ఆచమనం చేసేటప్పుడు మూడుసార్లు ఎప్పటికప్పుడు ఉద్ధరణితో నీళ్ళను చేతిలో పోసుకొని, తాగాలి. అంతేకానీ, ఒకేసారి పోసుకొని, మూడుసార్లు తాగకూడదు. అలాగే, ఆచమనం చేసేటప్పుడు అరచేతికి పళ్ళు తగలకూడదు. శబ్దం చేయకుండా జలాన్ని తాగాలి.

**ఎన్నిసార్లు ఆచమించాలి?**

మూడుసార్లు ఆచమించాలని మన ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి.

***ప్రథమం యత్ పిబతి తేన ఋగ్వేదం ప్రీణాతి ।***
***యద్ ద్వితీయం తేన యజుర్వేదం ప్రీణాతి***
***యద్ తృతీయం తేన సామవేదం ప్రీణాతి ॥***

*'మూడుసార్లు ఆచమనం తీసుకోవడం ద్వారా ఋగ్వేద, యజుర్వేద, సామవేదాలు మూడూ తృప్తి పొందుతాయి. దాంతో, కోరిన కోర్కెలు తీరుస్తాయి.'*

'మనుస్మృతి' (2/ 60) ***త్రిరాచామేదపః పూర్వమ్ ।*** అని పేర్కొంది. అంటే, *'ప్రారంభంలో తప్పకుండా మూడుసార్లు ఆచమనం చేయాలి'* అని అర్థం.

ఆచమనంచేయడం వల్ల గొంతు, స్వరం శుభ్రమవు తాయి. దాంతో, మంత్రాలు స్పష్టంగా ఉచ్చరించడానికి వీలవుతుంది. సంకల్ప సహితంగా పూజాదికాలు, వ్రతాలు నిర్వహిస్తున్నప్పుడు మూడుసార్లు ఆచమనంచేసి, ప్రారంభించాలి. చేసే ప్రార్థనలు సుదీర్ఘమైనవి అయినప్పుడు గొంతు తడుపుకోవడం కోసం మళ్ళీ మూడుసార్లు ఆచమనం చేయవచ్చని చెబుతారు. ఆచమనం చేయడం వల్ల శారీరక, మానసిక, మౌఖిక పాపాలన్నీ ప్రక్షాళన మవుతాయని, దాంతో కంటికి కనిపించని ఎన్నో శుభాలు జరుగుతాయని పెద్దలు అంటారు.

**ఆచమనంలో చెప్పే ఆ ఇరవై నాలుగు నామాలూ ఏవంటే?**

ఆచమన సమయంలో గోవిందాది 24 నామాలతో పరమాత్మను స్మరించడం సంప్రదాయం. దీనికి కారణం చూస్తే – భక్తికి ప్రాణాధారం భగవన్నామ స్మరణ. ఈ గోవిందాది నామ స్మరణ వల్ల సాధకుడి మనసు బ్రహ్మ తత్త్వానికి అనుకూలంగా తయారవుతుంది. దాంతో, సాధన సరైన క్రమంలో జరుగుతుంది, సత్వరమే ఫలసిద్ధి కలుగుతుంది.

భక్తి మార్గం ప్రకారం 'ఆచమనా'న్ని కొందరు పెద్దలు ఇలా వివరించారు. భగవంతుడు మొదట గోలోక శ్రీకృష్ణరూప పరతత్త్వంగా, తరువాత వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులుగా చతుర్వ్యూహ తత్త్వంగా, ఆ తరువాత ఈశ్వర రూపంలో అంతర్యామి తత్త్వంగా, అటుపైన రామకృష్ణాది అవతారాలుగా వైభవతత్త్వంగా, ఆ పిదప అర్చావతార తత్త్వంగా, వివిధ దేవతా వ యా ం ు ్త ల [illegible] అవతరించాడని శాస్త్రాలు చెబుతున్నాయి. దీన్నే 'అర్థ పంచకం' అంటారు.

పైన చెప్పిన వాటిలో వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులు వ్యూహతత్త్వానికి చెందినవారు.

ఈ నలుగురికీ ఒక్కొక్కరికీ మూడేసి నామాలు ప్రకాశ మూర్తులుగా, రెండేసి నామాలు విలాసమూర్తులుగా ఉన్నాయి. ఆ రకంగా అంతా కలిపి 24 నామాలు అవుతాయి.

'వాసుదేవు'డికి 'కేశవ, నారాయణ, మాధవ' అనే మూడు నామాలు ప్రకాశమూర్తులైతే, 'అధోక్షజ, పురుషోత్తమ' అనే రెండు నామాలు విలాస మూర్తులు.

'సంకర్షణు'డికి 'గోవింద, విష్ణు, మధుసూదన' అనే మూడు నామాలు ప్రకాశమూర్తులైతే, 'ఉపేంద్ర, అచ్యుత' అనే రెండు నామాలువిలాసమూర్తులు.

'ప్రద్యుమ్ను'డికి 'త్రివిక్రమ,వామన, శ్రీధర' అనే మూడు నామాలు ప్రకాశమూర్తులు కాగా, నారసింహ, జనార్దన' అనే రెండు నామాలు విలాస మూర్తులు.

'అనిరుద్ధ'డికి 'హృషీకేశ, పద్మనాభ, దామోదర' అనే మూడు నామాలు ప్రకాశమూర్తులు కాగా, 'హరి, కృష్ణ' అనే రెండు నామాలు విలాసమూర్తులు.

చతుర్వ్యూహ రూపంగా 'వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ'లు ఉండనే ఉన్నాయి. ఈ మొత్తం 24 నామాలతో ఆచమనాదాలు చేయడం వల్ల ఆ యా నామాలతో పరమాత్మను స్మరించినట్లై, ఆయన కృప పొందుతాం. ఏ దేవుడి పూజలోనైనా సరే ఈ కేశవాది 24 నామాలూ స్మరించడం ముఖ్యం.

**కేశవాది నామాల అంతరార్థం:**

1. మొదట ఉద్ధరణితో కలశంలోని నీటిని, కుడి అరచేతిలోకి ఇందాక చెప్పినట్లుగా పోసుకొని, 'ఓం కేశవాయ స్వాహా' అంటూ ఆ జలాన్ని పానం చేయాలి. అంటే, 'కేశవునికి ఈ జలం సమర్పిస్తున్నాను. ఆ కేశవుడు నాలోని సమస్త పాపాలనూ భస్మం చేయుగాక!' అని తలుస్తూ, ఆ జలాన్ని పానం చేయాలన్నమాట.

2. ఆ తరువాత 'ఓం నారాయణాయ స్వాహా' అంటూ ఇందాక చెప్పినట్లు నీళ్ళు తీసుకొని, పానం చేయాలి. అంటే, 'నాలోని సమస్త పాపాల్నీ భస్మం చేయడం కోసం ఈ నీటిని నారాయణుడికి సమర్పిస్తున్నాను' అని తలచుకోవడమన్న మాట.

3. అటుపైన 'ఓం మాధవాయ స్వాహా' అంటూ ఇందాకటిలానే, జలం పానం చేయాలి. ఈ సారి పాప

# అభంగుల రచనలో అనుంగు సోదరి

ఆంగ్లమూలం : డాక్టర్ ఎస్. రమణి　　　అనువక్త : రెంటాల జయదేవ

**మ**హారాష్ట్రలో వరాకరీ సంప్రదాయానికి చెందిన అగ్రశ్రేణి వ్యక్తులలో ప్రముఖురాలు ముక్తాబాయి (క్రీ.శ. 1279 -1297). మహారాష్ట్రకు చెందిన ప్రముఖ యోగి, సంకీర్తనాచార్యుడు జ్ఞానదేవ్ జీవితంతో ఆమె జీవితం ముడిపడి ఉంది.



గోదావరి నదీతీరంలో అపేగాంవ్ అనే గ్రామం ఉంది. ఆ గ్రామానికి చెందిన విఠల్‌పంత్ కులకర్ణికి, రుక్మాబాయితో వివాహం జరిగింది. ఆ దంపతులకు చాలాకాలం పాటు సంతానం కలుగలేదు. కొద్ది కాలం తరువాత విఠల్ పంత్‌కు ఈ ప్రాపంచిక జీవితం పట్ల నిరాసక్తత ఏర్పడింది. అప్పుడు ఆయన వారణాసికి చెందిన రామానంద అనే సాధువును ఆశ్రయించాడు. సన్న్యాసం స్వీకరించాలనే తన అభిలాషను వ్యక్తంచేశాడు. నిజానికి, గృహస్థు గనక సన్న్యాసాశ్రమం స్వీకరించాలంటే, అందుకు అతని భార్య అంగీకరించి, అనుమతినివ్వాల్సి ఉంటుంది. అయితే, తనకు పెళ్ళే కాలేదంటూ విఠల్ పంత్ ఆ సాధువు దగ్గర అబద్ధమాడాడు. ఆ మాటలు నమ్మిన రామానందుల వారు విఠల్ పంత్‌కు సన్న్యాస దీక్ష ప్రసాదించారు. చైతన్యానంద అనే సన్న్యాస నామం ఇచ్చారు.

కాగా, వారణాసిలో జరిగిన ఈ పరిణామాలేవీ రుక్మాబాయికి తెలియదు. భర్త క్షేమంగా తిరిగి రావాలని ఆమె దైవ ప్రార్థనలు చేస్తూ గడపసాగింది. ఒకసారి రామానందుల వారు రామేశ్వరం వెళుతూ, మార్గమధ్యంలో అనుకోకుండా రుక్మాబాయిని కలిశారు. మాటల సందర్భంలో విచారించడంతో, ఆమె భర్తే విఠల్ పంత్ అనే విషయం తెలిసింది. జరిగిన పొరపాటు గ్రహించిన ఆయన ఆ సాధ్వి బాధను గమనించి, సత్ సంతానానికి జన్మనిస్తావంటూ ఆశీర్వదించారు. వారణాసికి తిరిగి వచ్చిన తరువాత రామా నందుల వారు విఠల్ పంత్ (చైతన్యానంద)ను ఆలండికి తిరిగి వెళ్ళాల్సిందిగా ఆజ్ఞాపించారు. మునుపటిలా యథావిధిగా గృహస్థాశ్రమ జీవితం గడపాల్సిందిగా ఆదేశించారు. గురువు గారి ఆజ్ఞను విఠల్‌పంత్ శిరసావ హించక తప్పలేదు.

కాలక్రమంలో విఠల్ పంత్, రుక్మాబాయి దంపతులకు నలుగురు సంతానం కలిగారు. వారిలో మొదటి ముగ్గురూ మగ పిల్లలు కాగా, నాలుగో సంతానం కుమార్తె. ఆ ముగ్గురు కుమారులకూ వరుసగా నివృత్తి, జ్ఞానదేవ్, సోపాన్ అని పేర్లు పెట్టారు. కుమార్తెకు ముక్తి అని నామకరణంచేశారు. నిజానికి, విఠల్ పంత్ వాళ్ళు బ్రాహ్మణులే అయినప్పటికీ, ఊళ్ళోని అగ్రవర్ణాల వారంతా వారిని అంటరానివారిగా చూసేవారు. అదేమంటే, ఒకసారి సన్న్యాసం తీసుకున్న వ్యక్తి మళ్ళీ గృహస్థు కావడానికి వీల్లేదని వాదించేవారు. ప్రాణ త్యాగమొక్కటే దీనికి ప్రాయశ్చిత్తమని పేర్కొనేవారు. దాంతో, చివరకు విఠల్ పంత్, రుక్మాబాయిలు తమ పిల్లల్ని అనాథల్నిచేసి, తాము గంగానదిలో దూకి ప్రాణత్యాగం చేసుకున్నారు.

భగవంతుని పట్ల అపార భక్తి విశ్వాసాలున్న పవిత్రులైన ఆ దంపతులకు జన్మించిన పుత్రులకు ఉపనయనం చేయనివ్వకుండా ఊరి వాళ్ళు అడ్డుపడ్డారు. అయితేనేం, చాలా మంది బ్రాహ్మణుల కన్నా ఎంతో ఉన్నతమైన విద్యను ఆ పిల్లలు అధ్యయనం చేశారు. ఆ కుమారుల్లో పెద్దవాళ్ళిద్దరూ భిక్షాటనకు వెళ్ళేవారు. చిన్నవాడైన మూడోవాడు తమ చెల్లెలు ముక్తి (ఈమెనే ముక్తాబాయి అని కూడా పిలిచేవారు) ఆలనా పాలనా చూసుకొనేవాడు. అన్నదమ్ములందరిలోకీ బాగా తెలివైనవాడైన జ్ఞానదేవుడు సమాజం తమ పట్ల చూపుతున్న వివక్షను ధిక్కరించాడు. మనుషులు, పశు పక్ష్యాదులు, చెట్టూచేమలతో సహా అన్నిటా ఆ పరబ్రహ్మ స్వరూపం వ్యాపించి ఉన్నందువల్ల అందరూ గొప్పవారేనని జ్ఞానదేవుడు అభిప్రాయపడ్డాడు. ఆ మాటే అందరితో చెప్పాడు. దీంతో, క్రమంగా ఆ అన్నదమ్ముల పట్ల బ్రాహ్మణుల వైఖరి మారింది. ఆ పిల్లల పట్ల వారిలో ఆదరణ పెరిగింది. ఆ రోజుల్లో పైథాన్‌ను గొప్ప విద్యాధ్యయన కేంద్రంగానూ, అక్కడి వారిని మహా పండితులుగానూ భావించేవారు. ఉపనయనం, దీక్షాదులు జరగనప్పటికీ, ఈ పిల్లలు చాలా మంది బ్రాహ్మణుల కన్నా ఉన్నతులని సాక్షాత్తూ ఆ పైథాన్

ఉన్నాయి.

జ్ఞానదేవుడు వేదాంతాన్నీ, ఇతర తత్త్వశాస్త్రాలనూ క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. అటుపైన భగవద్గీతపై తనదైన వ్యాఖ్యానాన్ని 'జ్ఞానేశ్వరి' పేరిట రచించారు. ఆయన తరచూ పంఢార్‌పూర్‌ను సందర్శించి, సంత్ నామదేవుడితో కాలం గడిపేవారు. ముక్తాబాయి తన సోదరులతో కలసి ఉండేది. కాలం గడిచేకొద్దీ ఆమెకు కూడా అతీంద్రియ శక్తులెన్నో సిద్ధించాయి. ఆమె కూడా యోగినిగా ప్రాచుర్యం పొందింది.

విఠోబా దేవుణ్ణి దర్శించి, కొలిచేందుకు ఒకరోజున ముక్తాబాయి తన సోదరులతో కలసి పంఢార్‌పూర్‌కు వెళ్ళింది. సదా అక్కడే ఉండే నామ్‌దేవ్ మిగిలినవారందరి కన్నా తానే భగవంతుడికి ప్రీతిపాత్రుడనని భావించే వారు. అక్కడకు వెళ్ళిన ముక్తాబాయి దేవుడికి ప్రణామం చేసింది. అయితే, నామదేవుడికి మాత్రం ప్రణామాలు అర్పించ లేదు. కేవలం దేవుడికి దగ్గరలో ఉన్నంత మాత్రాన ఎవరికీ ప్రణమిల్లాల్సిన పనిలేదనీ, ఆధ్యాత్మిక గురువంటూ ఎవరూ లేని నామ దేవుడికి నమస్కరించనవసరం లేదనీ ఆమె పేర్కొంది. చర్చోపచర్చల అనంతరం సంత్ గోరా కుంభార వద్దకు వెళ్ళాల్సిందిగా నామదేవుడికి చెప్పారు. ఆలండి గ్రామంలో కుండలు చేసుకొనే కుమ్మరి వాడు గోరా కుంభార. నామదేవుడు నిఖార్సయిన యోగి అవునో, కాదో ఆయన నిర్ణయిస్తాడని తెలిపారు. గోరా కుంభార ఓ వెదురు బెత్తంతో యోగులను పరీక్షించేవాడు. ఆయన నామదేవుడి దగ్గరకు వెళ్ళగానే నామదేవుడు ఎంతో ఆందోళన చెందాడు. దాంతో, నామదేవుడు ఇంకా పచ్చి కుండ లాంటి వాడేననీ, ఇంకా కాలాల్సి ఉందనీ గోరా కుంభార ప్రకటించాడు. మార్గదర్శనంచేసే గురువు అవసరం నామదేవుడికి ఉందని స్పష్టం చేశాడు. దాంతో నామదేవుడు అప్పుడిక జ్ఞానదేవుడి శిష్యుడూ, గతంలో తన ప్రత్యర్థి అయిన విశోబా కేచర్ వద్దకు వెళ్ళాడు. ప్రపంచంలో దేవుడు లేని చోటంటూ ఏదీ లేదని ఆయనకు విశోబా ప్రదర్శించి చూపాడు. అలాగే, ఇతర సాధు సత్పురుషుల కన్నా తాను గొప్పవాడినని ఎవరైనా అనుకోవడం అవివేకమని స్పష్టం చేశాడు. దాంతో, నామదేవుడికి జ్ఞానోదయమైంది. ఆయనలో పరిణతి చోటు చేసుకుంది. ఫలితంగా,ఆయన ఇప్పుడు అసలైన యోగిగా అవతరించాడని గోరా కుంభార అంగీకరించాడు. ముక్తాబాయి సైతం అప్పుడిక నామదేవుణ్ణి యోగిగా గుర్తించి, ఆయనకు ప్రణమిల్లింది. ముక్తాబాయికి సంబంధించి మరో గాథ ప్రచారంలో ఉంది. సోదరుడైన జ్ఞాన దేవుడి ఆదేశం మేరకు ఆమె చాంగదేవ్ వటేశ్వర్ అనే యోగికి ఆధ్యాత్మిక మార్గదర్శినిగా వ్యవహరించేటట్లు కథనం. ఆ యోగి తపీ నది ఒడ్డున నివసించే వాడు. ముక్తాబాయి మరాఠీ భాషలో ఎన్నో 'అభంగు'లను రచించింది (అభంగ్ అంటే ఆధ్యాత్మిక భజన అని అర్థం). ఈ విశ్వం మొత్తం పర బ్రహ్మమనే నూలుతో వడికిన ఒకే గుడ్డముక్క అని ఆమె ఓ అభంగ్ లో అభివర్ణించింది. అలాగే, జనం పరుషమైన మాటలతో నిందించినప్పటికీ యోగులు కోపగించరాదని పేర్కొంది.



ఈ రకమైన అభంగ్ రాయడానికి ఓ కారణం ఉంది. కొంత మంది వ్యక్తుల ప్రవర్తనతో కోపగించిన జ్ఞాన దేవుడు ఒకసారి పర్ణశాలలోకి వెళ్ళి, తలుపు వేసుకొని అందులోనే ఉండిపోయారు. బయటకు రావడానికి నిరాకరించారు. ఆ సందర్భంలో ముక్తాబాయి ఈ అభంగ్ రచించింది. సోదరుడైన సంత్ జ్ఞానదేవుడి జీవితం నుంచి ఆమె జీవితాన్ని విడదీయలేం. నిజానికి, ఆమె జీవితం గురించి విడిగా తెలిసింది చాలా తక్కువ.

ముక్తాబాయి జీవిత కాలం కూడా తక్కువే! కేవలం పద్దెనిమిదేళ్ళ వయసులోనే పిడుగుపాటుకు గురై ఆమె మరణించింది. అయితేనేం, ఆమె అభంగులు, అన్న అయిన జ్ఞానదేవుడి జీవితంలో ఆమె పాత్ర ఇప్పటికీ ఈ యోగినిని చిరస్మరణీయం చేశాయి. a

విజయవంతంగా జీవించడం ఎలా ?

# అపనిందలా!.... ఆలకించకండి!

మూలం: స్వామి జగదాత్మానంద అనువాదం : అమిరపు నటరాజన్

**మి**మ్మల్ని ఎవరైనా విమర్శిస్తే మీరు ఎలా ప్రతిస్పందిస్తారు? ఆ విమర్శ నిజమైనది, నిర్మాణాత్మక మైనదీ అయినా దాన్ని అంగీకరించడం మీకు కష్టంగా తోస్తుందా? మీలోని లోటుపాట్లను బలహీనతలను సరిచేసుకోవడానికి మీరు సంకోచిస్తారా? జీవితంలో పురోభివృద్ధి సాధించడానికి మీరు సంకోచించడం ఎందుకు?

ఇతరులు మీ గురించి ఏమి అంటున్నారని మీరు నిజంగా దిగులుపడనవసరం లేదు. ఎల్లప్పుడూ మీ గురించి ఆలోచించడం తప్ప ఇతరులకు వేరే పని లేదా? డేల్ కార్నీజీ చెప్పినట్టు, వారిని చికాకు పెడుతున్నవి వారి సొంత సమస్యలు కావచ్చు గదా! వాళ్ళు మీ గురించి కటువుగా మాట్లాడారే అనుకోండి. మీ పరిస్థితిని చక్కగా పరిశీలించి, అర్థం చేసుకుని ఆ తర్వాత మిమ్మల్ని విమర్శించారని మీరు అనుకుంటున్నారా? కన్నడంలో ఒక సామెత ఉంది. "తప్పులెంచేవారు మంచిపనులన్నింటిలో కూడా తప్పు పడతారు!" అని దానికి అర్థం. ఇతరులకు నిజమైన ప్రేమ, కరుణ లేనప్పుడు మీ త్యాగం వారు ఎలా అర్థం చేసుకోగలరు?

మీ గురించి ఇతరులు చేసే విమర్శలలో కొంత నిజం ఉందేమో! కానీ విమర్శలు చాలావరకు ఊహాగానాలు. ఇతరులను మెప్పించాలనే కోరికతోనూ, ఇతరులను అవమానించాలన్న కోరికతోనూ విమర్శలు చేస్తారు. చాలావరకు విమర్శలకు



కారణాలు విమర్శకుల అసహనం, అసూయలే. వక్రబుద్ధితో, ఇతరులను బాధించి వాళ్ళు ఆనందాన్ని పొందుతారు. అటువంటివారి విమర్శలవల్ల మీరు నిజంగా కలత చెందితే మీకు ఆత్మవిశ్వాసం లేదని అర్థం! మీరు మీ బాధ్యతను చక్కగా ఎరిగి, ఆత్మవిశ్వాసం కలిగి ఉంటే ఇతరులు చేసే అన్యాయపు విమర్శలు మిమ్మల్ని ఏ మాత్రం ప్రభావితం చెయ్యవు. అటువంటి విమర్శకుల గురించి మీరొక విషయం తప్పక తెలుసుకోవాలి. వాళ్ళు పరులని విమర్శించినప్పుడు వారి అహంభావం అధికమవుతుంది. ఇతరులలో తప్పులెంచేవాడికి తాను అధికుణ్ణనే భావం ఉంటుంది. కొన్ని సందర్భాలలో 'తామేమీ తెలివితక్కువ వాళ్ళం కాము!" అనే భావాన్ని కలిగించడం ద్వారా విమర్శలు విమర్శకుల అహంకారాన్ని సంతృప్తి పరుస్తాయి.

తమకన్నా సమర్థవంతుల్నీ, తమకన్నా జయప్రదంగా పనిచేసిన వారిని విమర్శించడం ఈ రెండిటికీ ఒక విధమైన ఆనందాన్ని కలిగిస్తుంది. కొందరు తమకు భాషమీద పట్టు ఉందని చూపించుకోవడానికి విమర్శిస్తారు. అలా చేసేటప్పుడు తాము ఏ విధంగా విమర్శిస్తున్నామో వారికి అర్థం కాదు.

**ఇతరులు మిమల్ని బాధపెట్టారని మీరు భావించవచ్చు. ఎందుకు? ఎందుకంటే మీరు సున్నితంగా ఉన్నారు కాబట్టి. మీరు అంతరంగంలో బలవంతులుగా ఉంటే ఆ విమర్శలన్నింటినీ పట్టించుకోకుండా ఉండగలరు. మీ సంతోషానికీ మానసిక ప్రశాంతతకూ వేరొకరి మాటల మీద ఆధారపడనివ్వకండి. - స్వామి పవిత్రానంద**

**"[illegible] ఇటుకలతో గట్టి పునాదిని నిర్మించుకునేవాడే సృజనాత్మకమైన మనిషి"**

మేధావులు, తెలివిగలవారు అని చెప్పబడేవారు కొందరు, ఇతరులలోని సుగుణాలను ఒప్పుకోవడం తాము అసమర్థుల మని అంగీకరించడమే అనుకుంటారు. అందుచేత ఏ విధంగానూ ఇతరులను పొగడకుండా జాగ్రత్త పడతారు. అయితే, నిజమైనా, కాకపోయినా, ఇతరుల్ని విమర్శించడం [illegible]

తన కొడుకు నల్లటివాడైనా తల్లికి వాడే అందగాడు. కానీ పొరుగున ఉన్న సన్నటి నల్లటి పిల్లవాణ్ణి, "వాడా! వాడికి తాటిచెట్టులాగ పొడవైన కాళ్ళు, పెంకులాంటి నల్లటి ముఖం!" అని ఈసడిస్తుంది. నేనొకసారి ఒక పరిచయస్థునితో, "వరదలో వందమందికి పైగా ప్రాణాలు కోల్పోయారు!" అన్నాను. అతడు, "అయ్యో పాపం! జనాభా విపరీతంగా పెరిగిపోవడం లేదా? దాన్ని తగ్గించడానికి దేవుడు ఏదో ఒకటి చెయ్యాలి కదా! ఏదో ఒకరోజు పుట్టిన వారందరూ చావక తప్పదు" అన్నాడు. కానీ అదే వరదలో అతని దగ్గర చుట్టం ఎవరైనా మరణిస్తే, "ప్రపంచ జనాభా మరింత పెరగకుండా ఉండడానికే చనిపోయాడు లెండి!" అని మనం అంటే అతడికి ఎలా ఉంటుంది?

తమ స్వ విషయాల గురించి మాట్లాడేటప్పుడు మనస్సు చాలా ఆర్ద్రమైనట్టు మాట్లాడతారు గానీ ఇతరుల విషయాలను విశ్లేషిస్తున్నప్పుడు చాలా హేతుబద్ధంగా ప్రవర్తిస్తారు. చాలా వరకు విమర్శలు ఈ రకానికి చెందినవే. ఇతరుల దుఃఖాలను దయతో, సహృదయంతో అర్థం చేసుకోవడానికి ఆధ్యాత్మిక వైఖరి అవసరం. అటువంటి ఆధ్యాత్మికత అందరికీ ఉండదు.

మీరొక పని ఎంత బాగా చేసినా మీరు ఏదో ఒకరకమైన విమర్శను ఎదుర్కోవలసి వస్తుంది. విమర్శలు మనల్ని జాగరూక పరచే హెచ్చరికవంటివి.

ఒక సన్న్యాసి మట్టి కుప్పపైన తలపెట్టుకుని చెట్టు క్రింది నిద్రపోతున్నాడు. దారినపోయేవాడొకడు, "సర్వసంగ పరిత్యాగికి దిండు కావలసి వచ్చిందే!" అని దెప్పి పొడిచాడు. మరునాడు ఆ సన్న్యాసి తల క్రింద ఏమీ లేకుండానే పడుకున్నాడు. అదే బాటసారి మళ్ళీ అదే త్రోవన వెళుతూ, "ఆహా! ఎటువంటి యోగి! తన గురించి దారినపోయేవాళ్ళు అనే మాటల్ని వినడమే ఈయన పని కాబోలు!" అన్నాడు. సాధారణంగా సాధువులు "ఓ భగవంతుడా! మేము నిన్ను కూడా సులభంగా ప్రసన్నం చేసుకోగలమేమో కానీ ఈ మానవుల్ని సంతోషపెట్టడం అసాధ్యం" అంటారు.

గౌతమబుద్ధుడు "మౌనంగా ఉన్నవారిని విమర్శిస్తారు. అతిగా మాట్లాడేవారిని విమర్శిస్తారు, మితభాషుల్ని కూడా విమర్శిస్తారు! ఈ ప్రపంచంలో విమర్శకు గురికానివారు ఎవ్వరూ లేరు!" అని చెప్పాడు.

ఐన్‌స్టీన్ తన సాపేక్ష సిద్ధాంతాన్ని ప్రచురించినప్పుడు తోటి శాస్త్రజ్ఞులే దాన్ని తెలివితక్కువ సిద్ధాంతంగా కొట్టిపారేశారు. విమర్శకులకు హృదయం ఉండదు.

విమర్శకులు ఏదైనా అనవచ్చు. కానీ ఆ మాటలు నిరాధారమైనవని మీకు నమ్మకం కలిగితే మీరు వాటిని

Statement about ownership and other particulars about **Sri Ramakrishna Prabha** (according to Form IV Rule 8, circulated by Registrar of Newspapers for India).

1. Place of Publication : Hyderabad - 500 029
2. Periodicity of Publication : Monthly
3. Printer's Name : Swami Jnanadananda
   Nationality : Indian
   Address : Ramakrishna Math, Domalguda, Hyderabad-500 029
4. Publisher's Name : Swami Jnanadananda
   Nationality : Indian
   Address : Ramakrishna Math, Domalguda, Hyderabad-500 029
5. Editor's Name : Swami Parijneyananda
   Nationality : Indian
   Address : Ramakrishna Math, Domalguda, Hyderabad-500 029
6. Name & Address of the individuals who own the news [illegible] shareholder holding more than [illegible]% of the capital : Ramakrishna Math, Domalguda, Hyderabad-500029

I, Swami Jnanadananda, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/-
**Swami Jnanadananda**




ఆ రాజమాతకు అవి తుదిక్షణాలు... ఆగమేఘాల మీద ఆమె పాదాల వద్దకు వాలాడు చక్రవర్తి... తల్లిని అనుక్షణం కంటికి రెప్పలా చూసుకొమ్మని ఆస్థాన వైద్యుల్ని ఆదేశించాడు. కాని సున్నితంగా తిరస్కరిస్తూ ఆ మాతృమూర్తి 'నాయనా... నాకే వైద్యమూ అవసరం లేదు. ఇక నేను సెలవు తీసుకునే సమయం ఆసన్నమైంది' అంటూ కొడుకును ఆశీర్వదిస్తున్నట్లు తలపై నిమిరింది. అంతటి మహాచక్రవర్తి కూడా ఒక్కసారిగా పసిపిల్లాడిలా విలపిస్తూ 'అమ్మా! నీవు లేకుండా నేనెలా జీవించను , ఆ సింహాసనాన్ని ఎలా ఊహించుకోను' అంటూ పాదాలపై మోకరిల్లాడు. అంతటి నిష్క్రమణ స్థితిలో కూడా ఆ తల్లి 'నాయనా! ఎందుకు దిగులు పడుతున్నావు. ఈ దేశంలోని ప్రతి స్త్రీమూర్తిలో నేను నీకు కనిపిస్తాను. నేనెక్కడికీ వెళ్లను. నా ఆత్మ ఈ మట్టిలో, ఈ గాలిలో మమేకమయ్యే ఉంటుంది. ఈ దేశ ఔన్నత్యం కోసం, సంక్షేమం కోసం పాటుపడే బిడ్డల్ని కనీ పెంచే ప్రతి తల్లినీ నా ఆత్మ చైతన్యపరుస్తూనే ఉంటుంది. బిడ్డల్ని వీరులుగా, దేశభక్తులుగా తీర్చిదిద్దేందుకు ప్రేరకశక్తిగా ఇక్కడే ఉంటాను.' అని ఆ బిడ్డ ఒడిలో ఒరిగిపోయింది... చరిత్రకు ఓ వీరుణ్ని పరిచయం చేసి... వీరమాతగా మిగిలిపోయింది.. ఆ రాజమాత జిజాబాయి... ఆ చక్రవర్తి ఛత్రపతి శివాజీ...

భారతచరిత్రలో ఆమె ఓ స్ఫూర్తిమంతమైన మాతృమూర్తి. ఒక తల్లి తలుచుకుంటే ఈ ప్రపంచానికి ఎంతటి వీరుణ్ని ప్రసాదించగలదో అక్షరాలా నిరూపించిన చైతన్యస్ఫూర్తి. మన ఆడపడుచు ఒక కూతురిగా, భార్యగా,కోడలిగా, తల్లిగా, చివరికి పాలనాదక్షత కలిగిన ఏలికగా కూడా ఎంతటి కీర్తి శిఖరాలను అధిరోహించ గలదో అనటానికి ఒక్క జిజాబాయి చాలు. ఎప్పుడో పదిహేడో శతాబ్దపు రోజుల్లోనే ఆమె ఈనాటి ఆధునిక మహిళకు మించి అస్తిత్వం కోసం తపన పడింది. అదే తపనతో తుదికంటా పోరాడింది. చరిత్రలో తనకంటూ ఓ స్థానాన్ని పదిలపరచుకుంది. ముగ్గురన్నదమ్ముల ఒక్కగానొక్క చెల్లెలిగా జిజా అల్లారుముద్దుగా పెరిగినా, ఏనాడూ ఆమె సామాన్యబాలికల్లా ఆటపాటలవైపు, అందచందాల వైపు ఆసక్తి చూపకపోయేది. ముస్లిం పాలనలో పరతంత్ర మైన భారతావని దుస్థితిని తలచుకుంటూ పదేళ్ల వయసులోనే ఆవేదనతో, ఆగ్రహంతో తండ్రి దగ్గర రాజకీయాలపై అవగాహన పెంచుకుంది. చరిత్ర, రాజకీయం... తదితర అంశాలు పురుషులకే అని ఈనాటికీ చాలా మంది మహిళలు వాటికి దూరంగా ఉంటారు. కాని జిజాబాయి గురువుల దగ్గర, పెద్దల దగ్గర పూర్తిగా రాజకీయ అంశాల్నే ప్రస్తావించేది. సమాజం మార్పులో మహిళా పాలు పంచుకోవాలని ఆకాంక్షించేది. అదే పట్టుదలతోదత్తాజీ సాహెబ్ దగ్గర యుద్ధవిద్యలన్నీ నేర్చుకుంది జిజాబాయి. ఈతరం యువతులు నేర్చుకో వలసిన ప్రత్యేకాంశమిది. భౌతికంగా కూడా స్త్రీలు శక్తి మంతులుగా ఉండాలని, పురుషుడిదే రక్షణబాధ్యత అన్న భావాన్ని విడనాడాలని ఆచరణలో చూపారామె.

**సామాజిక సంస్కర్తగా...**

సంప్రదాయానికి ఎంత విలువ ఇచ్చినా సంస్కరణనూ జిజా విస్మరించలేదు. అది తన ఇంటి నుంచే ప్రారంభించారు. ఆమె మామగారు చనిపోయిన మరుక్షణమే ఆనాటి

సామాజిక పరిస్థితులకు తలవంచి అత్తగారు సతీసహగమనానికి సిద్ధమయ్యారు. కాని జిజా ససేమిరా అంటూ 'అత్తగారూ! మామగారిపై మీకున్న అనురాగానికి అంజలి ఘటిస్తున్నాను. కాని తల్లిగా మీకు బాధ్యత లేదంటారా? ఇక ఆచారాలంటారా! అవి మనం కల్పించుకున్నవే, భారతంలో బిడ్డల కోసం కుంతి ప్రాయోపవేశం వదులుకోలేదా! మిమ్మల్నెవరూ తప్పుపట్టరు. మా కోసం విరమించుకోండి' అంటూ అత్త గారిని సతీసహగమనం నుంచి తప్పించింది.

***నీతినే సమర్థించే నిజమైన సహధర్మచారిణిగా...***

తనవారు పరాయిపాలకులకు బానిసలుగా మారి, వారికి సామంతులుగా పనిచేస్తూ రాజభోగాల్లో తేల్చాలని ఏనాడూ కోరుకోలేదు జిజాబాయి. ఈ విషయంలో స్వయానా భర్తను కూడా విమర్శించగలిగే నీతిమంతురాలామె. అందుకే ఓ సందర్భంలో భర్తముందు 'మీరు నిజాముల దగ్గర ఉంటూ తెచ్చే సిరిసంపదలు, వజ్రవైఢూర్యాలు ఏవీ నాకక్కరలేదు. స్వతంత్ర పాలకుడిగా రొట్టెముక్క తెచ్చినా నేను సంతోషిస్తాను. మీరు మహావీరులు. స్వతంత్రంగా ఎందుకు రాజ్యాన్ని స్థాపించలేరు?' అని ఆవేదనపడింది. ఆ రోజే ఆమె ప్రతిన బూనింది.... 'భోగలాలస లేనివాడు, దేశం కోసం ప్రాణాల్నీ తృణప్రాయంగా భావించే యోధుడు, అశేష జనవాహినిని నడిపించగల సమర్థుడు ఈ దేశానికి కావాలి. అలాంటి బిడ్డను ఈ దేశానికి నేనందిస్తాను' అని.

***అసహాయత నుంచి ఆధారపడే ధోరణి నుంచి స్త్రీలు బయటపడాలి. ఏ చిన్నకష్టం వచ్చినా ఒదిగిపోయి భోరున విలపించేందుకు మరో ఒడికోసం ఎదురుచూడటం మానుకోవాలి. మానసికంగా శక్తిమంతులై ఎంతటి విపత్కర పరిస్థితులనైనా ఒంటరిగా ఎదుర్కోవాలి. పరాక్రమం, పోరాటతత్వం పురుషుల సొంతమనే భ్రమలనుంచి బయటపడాలి. ఆకోణంలోనూ తమకు అడుగుజాడలను పరచిన ఝాన్సీరాణి, రుద్రమదేవి వంటి నారీమణులను ఆదర్శంగా తీసుకోవాలి....***

***- స్వామి వివేకానంద***

***మహావీరునికి మాతగా...***

తను పసినాట నుంచి కన్నకలలు కొడుకు రూపంలో తీర్చుకుంది జిజా. ఈ దేశానికి తను ఏ రీతిలో సేవ చేయాలనుకుందో, ఆ ఆశల్ని, ఆకాంక్షల్నీ... ఆదర్శాన్ని, ఆవేశాన్ని కొడుకు శివాజీకి ఉగ్గుపాలలో రంగరించి పోసింది ఆ మాతృమూర్తి. నువ్వు నా కన్నా ముందు ఈ భరతభూమికి బిడ్డవని చెప్పకనే చెప్పింది. తన భర్త తనను విడిచి మరొకరిని పెళ్ళాడినా జిజా ఏనాడూ కొడుకు ముందు కుంగిపోలేదు. అమ్మా, నాన్నై, అనీ తానై శివాజీని పెంచి పెద్దచేసింది. రాముడిలోని సహనం, అర్జునుడిలోని సాహసం కలగలిసిన గుణసంపన్నుడిగా తీర్చిదిద్దింది. **పిల్లల్ని సంస్కారవంతులుగా చేయటానికి పెద్దలు కూడా తమ జీవితాలను ప్రయత్నపూర్వకంగా దిద్దుకోవాలని** గట్టిగా నమ్మింది. కనుకనే విలాసవంతమైన జీవితపు ఛాయలున్న భర్త వద్ద శివాజీని ఉంచలేదామె. ఈ విషయంలో భర్త సవాలును కూడా స్వీకరించింది. తండ్రి వద్ద కన్నా తల్లి వద్దే కొడుకు మరింత పరిపూర్ణుడవుతాడని నిరూపిస్తానంది. 'లోకుల దృష్టిలో భార్యగా నేను అసమర్థురాలినే కావచ్చు. కాని తల్లిగా ఎప్పటికీ ఓడిపోను. 'అన్నట్లుగానే వీరమాతగా నిలిచింది. ఈర్ష్య, అసూయలతో కుటుంబానికి కుదురులాంటి మహిళ ఈనాడు ఇంత ఆదర్శంగా ఉంటుందా! అన్నదే ఎవరికి వారు ఆలోచించుకోవాలి. రాత్రి కాగానే కొడుకు శివాజీని ఒళ్లో కూర్చో బెట్టుకొని హరిశ్చంద్రుని సత్యదీక్ష, శ్రీరాముని పితృవాక్యపరిపాలన, శీలసంపద, ధృవుడి దృఢసంకల్పం, కార్యదీక్ష, శిబి చక్రవర్తి దానగుణం...ఇలా ఎన్నో నైతికవిలువల కథలను గోరుముద్దలతో కలిపి తినిపించేది జిజాబాయి. ఆ తరువాత కొడుకుకు తనకు మించిన యుద్ధవిద్యలు నేర్పించింది.

***సమరసేనానిగా మలచి...***

చేతికందివచ్చిన శివాజీని దేశరక్షణకు, దుష్టశిక్షణకు సిద్ధం చేసింది జిజాబాయి. హైందవజాతిని మట్టుపెట్టే ప్రయత్నం చేస్తున్న ప్రతి ఒక్కరిపైకీ కొడుకును కరవాలంగా ఝుళిపించింది. ఒక్కటొక్కటిగా దేశంలోని కోటలెన్నింటినో ఆక్రమించేలా శివాజీని ప్రోత్సహించింది. ఆ ప్రయత్నంలో పరమతసహనానికి, స్త్రీరక్షణకు, సౌభ్రాతృత్వాలకు ఎలాంటి ఆటంకం కలగకూడదని షరతు విధించింది. కొడుకును ఛత్రపతిగా, చక్రవర్తిగా చేసి ఈ నేల రుణం తీర్చుకుంది జిజాబాయి.

ఇలా ఈ వీరమాత తన తుదిశ్వాస విడిచే వరకూ తన అస్తిత్వాన్ని తన ప్రతి జీవనమలుపులోనూ చాటుకుంటూనే ఉంది. నేటిమహిళ ఆ మాతృమూర్తి చరితను నిరంతరమూ మననం చేసుకొని జీవితంలో ఆచరిస్తూనే ఉండాలి. తమ ఉనికిని చాటుకోవటమంటే భౌతికంగా నవనాగరిక జీవనంలో సాగిపోవటం కాదు... ఆలోచనల్లో, ఆశయాల్లో పరిణతి, సమాజపు ప్రక్షాళనలో తమవంతు పాత్ర...ఇవన్నీ ప్రధానమే... a

**యత్రనార్యస్తు పూజ్యంతే .... రమంతే తత్ర దేవతాః**

**మహత్తరమైన మహిళా దినోత్సవం (మార్చి8)రోజున వీర మాత జిజాబాయిని స్ఫూర్తిగా తీసుకుంటారని ఆశిస్తూ...**

**శుభా కాంక్షలు...**

# శివమహిమ్నః స్తోత్రం

వ్యాఖ్యాత : సామవేదం షణ్ముఖ శర్మ విలేఖనం : శ్రీమతి ఎన్.శేషు

(గత సంచిక తరువాయి)

**త్వమర్కస్త్వం సోమస్త్వమసి పవనస్త్వం హుతవహ -**
**స్త్వమాపస్త్వం వ్యోమ త్వము ధరణిరాత్మా త్వమితి చ**
**పరిచ్ఛిన్నమేవం త్వయి పరిణతా బిభ్రతి గిరం**
**న విద్మస్తత్తత్త్వం వయమిహ తు యత్ త్వం న భవసి ॥26॥**

పరమేశ్వరా నువ్వు అష్టమూర్తి స్వరూపుడవు అని అందరూ అంటున్నారు. కానీ నిన్నూ నీ మహాస్వరూపాన్నీ ఇంత వాడవు అన్నారంటే పరిమితి పెట్టినట్లే కదా! కనుక నువ్వు అష్టమూర్తులుగా ఉన్నవాడవు అని చెప్పనయ్యా. నువ్వు కానిది ఏదీ లేదంటాను. ఈ జగత్తులో **ఇహతుయత్త్వం నభవసి** = ఏది కాకుండా ఉంటావు నువ్వు; కనుక అష్టమూర్తులని పరిమితిగా మాకర్థం కావడానికి చెప్పుకున్నా నువ్వు అపరిమితుడవు అని చెప్తున్నారు. అష్టమూర్తి తత్త్వం చెప్తూనే దానికి కూడా మించిన భావం మనకి అందచేస్తున్నారు పుష్పదంతులవారు. అష్టమూర్తి ఉపాసన చాలా విశిష్టమైనది. ఈశ్వరుణ్ణి అష్టమూర్తిగా అర్చిస్తేనే మనం 'ఈశావాస్యమిదం సర్వం' అనే లక్ష్యాన్ని చేరుకోగలం. ఈశ్వరుని చేత ఈ జగమంతా నిండి ఉన్నది అనే అవగాహన కలిగితే చాలు. ఈ జగమంతా అంటే మనం కూడా ఈ జగంలో భాగమే. సర్వం ఈశ్వర మయం అనే జ్ఞానంతో ఉపాసన చేసినవాడే అహం బ్రహ్మములో లీనమై అహం బ్రహ్మాస్మి అనే స్థితికి వెళ్తాడు. ఆ కారణం చేత అద్వైత స్థితికి అష్టమూర్తి ఉపాసనే ఆలంబనం. ఈ విషయాన్ని భాష్యకారులు, వేదాంత వేత్తలు - అందరూ చెప్పారు. "అష్టమూర్తి స్వరూపుడివై నువ్వీ జగత్తంతా వ్యాపించి ఉన్నావని అందరూ అంటున్నారు కనుక నేను అంటున్నాను; కానీ కేవలం అష్టమూర్తి స్వరూపుడివి మాత్రమే కాదు నువ్వు. నువ్వు కానిది ఏదీ లేదు అని నేను తెలుసుకుంటున్నాను. అష్టమూర్తి తత్త్వంగా జగత్తంతా వ్యాపించినా దానికి అతీతంగా ఉన్నవాడవు నువ్వు" అని ప్రస్తావిస్తున్నారు ఇందులో.

**త్వమర్కః** = నువ్వే సూర్యుడివి; **త్వం సోమః** = నువ్వే చంద్రుడవు; **త్వమసి పవనః** = నువ్వే వాయువువి; **హుతవహః** = అగ్నివి నువ్వే; **ఆపస్త్వం** = నువ్వు జలానివి; **త్వం వ్యోమః** = నువ్వు ఆకాశానివి; **త్వం ధరణి** = నువ్వు భూమివి; **ఆత్మాత్వమితి చ** = నువ్వే ఆత్మవు. ఆత్మ అంటే జీవభావం. జగత్తుకి ఆత్మ పరమేశ్వరుడు, వ్యక్తికి ఆత్మ జీవుడు. అష్టమూర్తి ఆయనే అని తెలిస్తే ఈ జీవుడుకూడా ఆయనే అవుతాడు. అప్పుడు జీవాత్మ అనేది పరమాత్మగా అయి సోహం అనే స్థితికి చేరుకుంటుంది. పరిచ్ఛిన్నా మేవం = ఈ ఎనిమిది విధాలుగా నువ్వు కనబడుతున్నప్పటికీ నీ నుంచి ఎనిమిది స్వరూపాలు పరిణమించి వచ్చినప్పటికీ, కేవలం ఎనిమిదింటిగానే కాకుండా ఇంకా అనంతుడవని నేననుకుంటున్నాను అని ఇందులో చెప్తున్నారు.

ఆదిశంకరుల వారు "దక్షిణామూర్తి స్తోత్రం"లో జీవబ్రహ్మైక్యాన్ని బోధించి ఇది తెలియాలంటే గురువుని ఆశ్రయించాలి అన్నారు. ఎవరా గురువు అంటే - విశ్వగురువైన ఈశ్వరుడ్ని ఆశ్రయించాలి.

**త్రయీం తిస్రో వృత్తీస్త్రిభువనమథో త్రీనపి సురా -**
**నకారాద్యైర్వర్ణైస్త్రిభిరభిదధత్ తీర్ణవికృతి।**
**తురీయం తే ధామ ధ్వనిభిరవరుంధానమణుభిః**
**సమస్తం వ్యస్తం త్వాం శరణద గృణాత్యోమితి పదమ్ ॥27॥**

**గృణాతి** = చెప్తున్నాది; **త్వాం** = నిన్ను; ఓం ఇతి పదం--- ఓం అనే పదం నిన్ను చెప్తోంది; పదము అంటే వర్డ్ (word) అని మాత్రమే కాదు, స్థానము అని కూడా ఉంది. ప్రణవస్థానమే నిన్ను (పరమేశ్వరుణ్ణి) తెలియజేస్తున్నది. ప్రణవంలో అకార ఉకార మకారాలున్నాయి. వినపడేవి ఈ మూడే. కానీ వినపడనివి ఇంకా ఉన్నాయి. అ ఉ మ అనేది స్థూల నాదం అయితే వాటి వెనకాల ఉన్నవి సూక్ష్మ ధ్వనులు. ఆ సూక్ష్మ ధ్వనులన్నిటినీ కలిపి ఒకటిగా మనం భావనచేస్తే మొత్తం నాలుగుదశలుగా చెప్పవచ్చు. వీటిలో మొదటివి అ, ఉ, మ అనే మూడు **త్రయీం** అనే దాన్ని అంటే వేదాన్ని తెలియ జేస్తాయి. (ఈశ్లోకంలో అదే చెప్తున్నారు.) ఇది ఋగ్, యజుః



సామములు అనే వేదాలను తెలియజేస్తుంది. వేదమంత్రములు అకార, ఉకార, మకారాలనుంచి వచ్చాయి. అలాగే త్రిస్రోవృత్తి – మనలో ఉన్న జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్తి అవస్థ మెలుకువ, కల, గాఢ నిద్ర అనే మూడు అవస్థలని తెలియ జేస్తుంది ఈ అ ఉ మ; **త్రిభువనం** = మూడు భువనాల్నీ, అంటే భూ, భువః, సువర్లోకాలు, తెలియ జేస్తుంది; **త్రీనపి సురాన్** = ముగ్గురు దేవతలు – బ్రహ్మ, విష్ణు, రుద్రులు; అకారా ద్యైర్వర్ణః = అకార, ఉకార, మకార వర్ణముల ద్వారా వీటన్నిటినీ తెలియజేస్తోంది; త్రిభిః = ఇలా మూడింటినీ తెలియజేస్తున్న అకార, ఉకార, మకారములకు పైన తీర్ణ వికృతి–ప్రకృతి అంటే మూల పదార్థం. దానినుంచి వచ్చిన వికృతులు అనేకం. మట్టి ప్రకృతి అయితే కుండలు వికృతులు. అలాగే ప్రకృతి నుంచి వచ్చిన అకార ఉకార మకారాలని దాటిపోతే ఉండేది తీర్ణ వికృతి అంటే వికృతుల్ని దాటిన స్థానం; అకార, ఉకార మకారాలు బయటికి వినపడేవి; జాగ్రత్ స్వప్న సుషుప్తులు బయటికి కనపడేవి; ముల్లోకాలూ బయటికి కనబడేవి, మూడు వేదాలూ బయటకి వినబడేవి. బయటకి కనబడేవన్నీ మూడింటితో కూడుకున్నవి. దీనికి మూలమై ఉండే, బయటకి కనపడనివి సూక్ష్మమైనవి అది – **తురీయంతేధామ** – తురీయ మంటే నాల్గవది. అదే నీ యొక్క **ధామ** = అసలు స్వరూపం. అంటే శివుడిని దర్శించాలంటే ఈ మూడింటినీ దాటి దాంట్లోకి వెళ్ళాలి. అంటే... ఓమ్... అనగానే బయటకి వినబడే ఈ శబ్దం ఏ నిశ్శబ్దంలో లీనమవుతోందో ఆ నిశ్శబ్దమే తురీయధామం; ఆ తురీయధామమే శివస్థానం.

ఉపనిషత్తు ఈ విషయమే "ప్రపంచోపశమం శాంతం శివం చతుర్థం మన్యంతే – నాల్గవది శివం" అంది. నాల్గవది అంటే తురీయమైనది. అతీతం అనగానే దీనికి సంబంధించని విషయం కాదు. మనకి కనిపించే చెట్టుకి కనిపించని వేళ్ళున్నాయంటే సంబంధం లేకుండా ఉన్నాయని కాదు, అందుకు అకార ఉకార మకారాలు, మూడు జగత్తులు తురీయంతో సంబంధమై ఉన్నాయి. అందుకు సంబంధమైన తురీయ ధామంలో చేరుకోగలగడమే శివుడ్ని గ్రహించడమంటే. శివుడనేది ఆ తురీయమే కాదు, ఈ మూడు ఆ తురీయం మొత్తం కలుపుకుని శివుడు అనే జ్ఞానం మనకి కలగాలి. **సమస్తం వ్యస్తం త్వాం** = మొత్తంగా కలిపి ప్రణవం నువ్వే, అలాగ కాకుండా విడివిడిగా తీసిచూస్తే అదీ నువ్వే. అంటే బ్రహ్మ శివుడు, విష్ణువు శివుడు, రుద్రుడు శివుడు, జాగ్రదవస్థలో ఉండే చైతన్యం శివుడే, స్వప్నంలో ఉండే చైతన్యం శివుడే, సుషుప్తిలో ఉండే చైతన్యమూ శివుడే, ముల్లోకాలూ – మూడు కాలాలూ కూడా శివుడే. విడివిడిగా ఒక్కొక్కటీ శివుడే. అంతా కలిపినా అతడే. దీన్ని బట్టి ప్రపంచాన్ని నిరసించడం కాదు – ప్రపంచాన్ని పరమేశ్వరమయంగా దర్శించు అని వేదం మనకి చెప్తున్నది. ప్రణవోపాసన ద్వారా మొత్తం ప్రపంచమంతా ఒక్కటే అని తెలుస్తోంది.

**ధ్వనిభిరవరున్ధానమణుభిః** --- అణుభిః అంటే అత్యంత సూక్ష్మములైన; ధ్వనిభిః = ధ్వనులతో; అవరుంధానం = వ్యాపించి; అత్యంత సూక్ష్మంగా వ్యాపించి ఉంటుందా తురీయం దీన్ని యోగి అనుభవించగలడు. అణుభిః ధ్వనిభిః అవరున్ధానం అంటే తురీయమైన నీ ధామం అంతా సూక్ష్మమైన అణువులతో వ్యాపించి ఉంది. ఆ సూక్ష్మమైన ధ్వనులేమిటో మనం గ్రహించవలసిన అవసరం ఉంది. ఇవన్నీ కలుపుకుని మొత్తం ప్రణవం అయింది. ఈశ్వరుడి యొక్క సమస్త తత్త్వం ఇందులో నిక్షిప్తం చేసారు. **సమస్తం వ్యస్తం త్వాం శరణద** అంటూ విడివిడిగా చూసినా, మొత్తం కలిపి ఒక్కటిగా చూసినా ఈశ్వరుడే అని శరణదా = శరణు ఇచ్చువాడా, ఆశ్రయం ఇచ్చువాడా, రక్షణనిచ్చువాడా పరమేశ్వరా అని చెప్పారు.

**(తరువాతి వివరణ వచ్చే సంచికలో...)**



# రామకృష్ణ మఠం

వైటిల పోస్టు, కొచ్చి, ఎర్నాకుళం జిల్లా, కేరళ-682019., ఫోను నెం. 0484-2301860

పరివ్రాజిక రోజుల్లో స్వామి వివేకానందను అతిథిగా ఆదరించిన ఘనత కొచ్చి నగరానికి దక్కింది. స్వామిజీ సందర్శనంతో పావనమైన కొచ్చి- వైటిలాలోని రామకృష్ణ మఠం శాఖ 1999లో బేలూర్ రామకృష్ణ మఠం అనుబంధ సంస్థగా గుర్తింపబడింది. అప్పటినుండి ఈ కేంద్రం విద్యా, వైద్య, ఆధ్యాత్మిక, సాంస్కృతిక రంగాలలో అనేక సేవలు అందిస్తుంది. 1946లో నిర్మించిన రెండు భవనాలు ప్రస్తుతం శిథిలావస్థలో ఉన్నాయి. ఆ భవనాలు నిరుపయోగమైనవని ఇంజనీర్లు ధృవీకరించారు. ఈ కేంద్రం నిర్వహిస్తున్న సేవా కార్యక్రమాలకు కొత్త భవనాల్ని నిర్మించాల్సి ఉంది. ఈ బృహత్ పథకాల నిర్వహణకు ఉదారులైన దాతలనుండి విరాళాలు కోరుతున్నాం.

**ఈ కేంద్రం నిర్వహిస్తున్న సేవా కార్యక్రమాలు :**



**వైద్యసేవలు :** అలోపతి, హోమియోపతి, ఆయుర్వేద విభాగాలలో వారానికి 5 రోజులు 300 మంది రోగులకు సేవలందిస్తున్నాం. సుదూర గ్రామాల నుండి వచ్చే పేదవారికి ఉచితంగా మందులు ఇస్తున్నాము. అయితే ఇక్కడ రోగ నిర్ధారణకు ఆవశ్యకమైన సామగ్రి సమకూర్చాలి. ఈ భవనం శిథిలావస్థలో ఉన్నందువల్ల దీనిని పునర్నిర్మించాలి. వైద్యశాల ప్రారంభించి, మందులు సమకూర్చుకొనడానికి నిధులు అవసరం.



**విద్యా సేవలు :** 5వ తరగతి నుంచి 10వతరగతి వరకూ అర్హులైన పేద విద్యార్థులు 50 మందికి మేము ఉచితశిక్షణా తరగతులు నిర్వహిస్తున్నాం. పేద విద్యార్థులు 200 మందికి విద్యావ్యాసంగానికి ఉపయోగపడే స్టడీ మెటీరియల్ పంపిణి చేయడానికి నిధులు అవసరం.

**వ్యక్తిత్వ వికాస కార్యక్రమం :** 100 మంది విద్యార్థులకు మేము ఆదివారాలు వ్యక్తిత్వ వికాస తరగతులు నిర్వహిస్తున్నాం. వారికి వ్యాసరచన – వక్తృత్వ పోటీలు, చిత్రలేఖనం – సంగీత పోటీలు నిర్వహించి బహుమతులు ఇస్తున్నాం.

**ఆధ్యాత్మిక- సాంస్కృతిక సేవలు :** ప్రతీరోజు సాయంత్రం మందిరంలో పూజ, భజన కార్యక్రమాలతో పాటు ప్రతి ఆదివారం ఆధ్యాత్మిక ప్రసంగాలు నిర్వహిస్తున్నాం. శ్రీ రామకృష్ణులు, శ్రీ శారదాదేవి, స్వామి వివేకానందుల జయంతి ఉత్సవాలను, నవరాత్రి ఉత్సవాలను, ఇతర పర్వదినాల్లో ప్రత్యేక కార్యక్రమాలను నిర్వహిస్తున్నాం.

**నూతన భవనాల నిర్మాణం :**

1. వైద్యశాల భవనం
2. గ్రంథాలయం, పుస్తక విక్రయశాల భవనం
3. సాధు నివాసం, వంట, భోజనశాల, అతిథి గృహం

- మేము చేపట్టిన ఈ సేవా కార్యక్రమాల నిర్వహణకూ, నూతన భవన నిర్మాణాలకూ భక్తులు, శ్రేయోభిలాషులు, స్నేహితుల నుండి వచ్చే విరాళాలపై మాత్రమే ఆధారపడి ఉన్నాం.
- మీరిచ్చే విరాళాలు సమాజంలో మన తోటివారైన నిరుపేదలకు సేవలు అందించడానికి ఎంతగానో తోడ్పడతాయి.
- మీరిచ్చే అన్ని విరాళాలనూ కృతజ్ఞతతో స్వీకరిస్తాం. విరాళాలిచ్చే ప్రముఖ దాతల పేర్లు పాలరాతిపై చెక్కి కొత్తగా నిర్మిస్తున్న భవనంలో ప్రదర్శిస్తాం.
- మీరిచ్చే విరాళాలన్నింటికీ ఆదాయపుపన్ను చట్టంలోని సెక్షన్ 80 G కింద పన్ను మినహాయింపు ఉంటుంది.

**Ramakrishna Math, Kochi** పేరిట చెక్కు లేక డి.డి. తీసి, విరాళాలను **Ramakrishna Math, Vyttila P.O., Kochi -682 019** కు పంపవలసిందిగా మనవి. మీ సహాయ సహకారాలకై ఎదురుచూస్తూ,

ధన్యవాదములతో,

*భగవత్సేవలో*

స్వామి ఆత్మస్వరూపానంద
అధ్యక్షులు



యువవాహిని

# భయం వీడితే జయం మనదే!

- బి. సైదులు

క్లాస్‌రూమ్ కురుక్షేత్రంగా మారిపోయే సమయం ఆసన్నమైంది కదూ. ఏడాదంతా పడ్డ శ్రమకు ఇది నిజంగా 'పరీక్షా' సమయమే. ఆ రోజు అర్జునుడు బాధతో యుద్ధమంటే విముఖత చూపాడు . అందుకే 'క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప..' అంటాడు కృష్ణుడు, అర్జునిడితో. ముందు మనసుని దృఢపరచుకోమంటాడు. స్వామి వివేకానందకు నచ్చిన శ్లోకమిది. అందుకే స్వామి 'అభీః, అభీః...' అంటారు పదేపదే. కాని ఇప్పుడు మనం పరీక్షల భయంతో ఆందోళన పడుతున్నాం. ఇలాంటి సమయంలో మనలోనే కృష్ణుడి లాంటి 'మోటివేటర్' మేల్కొనాలి. ధైర్యంగా పరీక్ష రాయించాలి... పాస్ చేయించాలి. అందుకు మానసికంగా కొంత యోగం... సాధనా యాగం అవసరం.

అందుకే నాలుగు అంశాల్ని దృష్టిలో పెట్టుకుంటే మనం విజయం సాధించనట్లే.. అవి

**నిర్భయం... పఠనం...మననం...లేఖనం**

## నిర్భయం...

ముందు నిర్భయంగా నిలబడండి. కురుక్షేత్రంలో అర్జునుడు వెనకడుగు వేసినప్పుడు కూడా కృష్ణుడు చెప్పిందిదే . 'క్షుద్రం హృదయ దౌర్బల్యం..' అన్నాడు. ఎల్‌కేజీ నుంచి మనకు పరీక్షలేమీ కొత్తకాదు. గతంలో పరీక్ష ముందు మీరు పడ్డ ఆందోళనను గుర్తుచేసుకోండి. పరీక్ష రాశాక ఆ ఆందోళనకు ఎంత నవ్వుకున్నారో మననం చేసుకోండి. ఆ పరీక్షలకు ఈ పరీక్ష కూడా భిన్నమైందేమీ కాదు. మనం ఎప్పుడైతే భయం వీడి ప్రశాంతంగా ఉంటామో, మన మెదడు నిర్మలంగా పనిచేస్తుంది. కిచెన్‌లో నుంచి ఏది అడిగితే అది ప్రేమతో ఇచ్చే అమ్మలా మనం చదివి దాచుకున్న జవాబులన్నింటినీ మెదడు సజావుగా పరీక్షగదిలో సరఫరా చేస్తుంది. అందుకే స్వామి వివేకానంద అంటారు 'భయమే మరణం... నిర్భయమే జీవితం...'. కాబట్టి ముందు ధైర్యంగా ఉందాం.

## పఠనం...

ముందు పరీక్ష కోసమే పఠనం అన్న భావనను విడనాడాలి. జ్ఞాన సముపార్జనలో పరీక్షలు చిన్న మజిలీయే. పరీక్షాపత్రమే పూర్తి చదువు కాదు కదా. అయితే చదివే విధానం మారాలి. ప్రతీ పాఠాన్ని కంఠోపాఠంలా కాకుండా, విశ్లేషణతో చదవాలి. అంత పెద్ద రామాయణాన్ని కూడా అర్థం చేసుకొని మూడుముక్కల్లో సంక్షిప్తీకరించుకొని అంటే కీనోటింగ్ తయారుచేసుకోవాలి. రామాయణాన్నే తీసుకుంటే దానికి ఇలా కీనోట్ తయారు చేసుకోవచ్చు. 'రాముడు-సీత-లంక-యుద్ధం'. పరీక్ష హాలుకి వెళ్లగానే ఈ కీనోట్‌ని విస్తరించుకొని వివరించగలగాలి.

## మననం...

ఎంత చదివినా అభ్యాసం(ప్రాక్టీస్) ప్రధానం. 'అభ్యాసేన తు కౌంతేయ..' అంటాడు విజయుడితో వేణుమాధవుడు. అభ్యాసంతో ఎంతటి కఠినమైన అంశంపై కూడా ఆధిపత్యాన్ని సంపాదించవచ్చు. మనలో చాలా మంది ఎంత చదివినా పరీక్ష దగ్గరకు వచ్చేసరికి మరచిపోవడానికి కారణం, ఈ

మననం అంటే రివిజన్ లేకపోవటమే. అందుకే మనం తయారు చేసుకున్న కీనోట్స్‌ని తరచూ రిపీట్ చేసుకుంటూ ఉండాలి. అలా చేయాలి అంటే ముందు మన మనసుని శుభ్రంగా ఉంచుకోవాలి. అనవసర విషయాల్ని ఎప్పటికప్పుడు బయటకి పంపాలి. మనసుని విలువైన వస్తువులు పెట్టుకునే ఆభరణాల పేటికలా సిద్ధం చేసుకోవాలి.



## నీకు నీవే...

నిన్ను నీవు తక్కువ చేసుకోవద్దు. నీకు నీవే ఆప్తుడవు, శత్రువు కూడా అని మరచిపోవద్దు. చాలాసార్లు మన దుస్థితికి ఇతరులే కారణమని నిందిస్తూ ఉంటాం. నేను బాగా చదవక పోవటానికి తల్లిదండ్రులో, ఉపాధ్యాయులో, స్నేహితులో... ఇలా ఎవరో ఒకరు కారణమని తప్పించుకుంటూ ఉంటాం. మనల్ని మనం సమర్థించుకుంటాం. కానీ చివరికి ప్రపంచం దృష్టిలో ఓటమి పాలయ్యేది మనమే. ఎన్ని అననుకూల పరిస్థితులు ఎదురైనా, ఎదురొడ్డి గెలిచిన వారే వీరులు, ధీరులు. అందులో మీరూ ఒకరు కావాలి. కృష్ణుడు చెప్పినట్లు మిమ్మల్ని మీరే ఉద్ధరించుకోవాలి.

**- స్వామి రంగనాథానంద**

## లేఖనం...

మనలో చాలా మందికి అన్నీ తెలిసినా ఎలా చెప్పాలో, ఎలా రాయాలో తెలీదు. ఇక్కడే మనకు సృజనాత్మకత కావాలి. ఆధునిక పరీక్షా విధానమంతా దీనిపైనే ఆధారపడి ఉంది. నీకు తెలిసిన అంశాన్ని ఎంత బాగా చెబుతున్నావన్నదే ప్రధానం. స్వామీ వివేకానంద 'చికాగో సర్వమత సమ్మేళనం'లో అందరికీ భిన్నంగా సృజనాత్మకంగా, భారతీయ తత్త్వాన్నంతా ఒకే ఒక్కవాక్యంలో తెలిసేలా ప్రారంభించారు. సోదర... 'సోదరీమణులారా' అన్న సంబోధనకు కొన్ని నిమిషాల పాటు హాలు కరతాళ ధ్వనులతో మారుమోగింది. అప్పటి వరకు 'యువతీ యువకులారా' అన్న సంబోధనకే అలవాటు పడిన పాశ్చాత్యులకు, స్వామి వివేకానంద భారతీయ సంస్కారాన్ని ఒకేఒక్క వాక్యంతో పరిచయం చేశారు. అదే సృజనాత్మకత అంటే.

ఈ అంశాలతో పాటు అన్నింటికీ మించి మనసును కుదురుగా ఉంచుకుంటే జీవితమనే పరీక్షలోనూ విజయం సాధిస్తాం. ధ్యానం వంటి ఆధ్యాత్మిక సాధనలు ముఖ్యంగా మన ఏకాగ్రతకు పదునుపెడతాయి... ఆ తరువాత పరీక్షలే కాదు ఎంతటి అలజడుల్లోనైనా మనం విజయం సాధించగలం. a



## ఆధ్యాత్మికవిద్యే ఆలంబన...

ఈనాటి మన విద్యావిధానంలో ఆధ్యాత్మ విద్యకు చోటులేకపోవటం శోచనీయం. మన దేశం ప్రపంచంలో ఇంత విశిష్టస్థానం సంపాదించటానికి కారణం మన అధ్యాత్మవిద్యే. ప్రస్తుతవిద్యావిధానంలో అది లోపించింది. నేటి విద్యావిధానంలో ఉత్పాదన క్రియ కొరవడింది. ఈ విద్యావిధానం ద్వారా మనం జ్ఞానాన్నీ, కర్మనీ వేరుచేశాం. కాలేజీల్లో చదివి బయటకి వస్తే నిరుద్యోగం... అలాగని చదువుకోకపోతే అజ్ఞానం... ఇవి రెండూ ప్రమాదమే. అందుకే భగవద్గీతలో భగవానుడు అంటాడు...

**కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః**
**లోకసంగ్రహ మే వాపి సంపశ్యన్ కర్తుమర్హసి ...** కనుక కర్మను అంటే విద్యార్థిగా మీ చదువును మీరు వదిలిపెట్టకూడదు. మీ పని మీరు చెయ్యండి. తప్పకుండా తగిన ఫలితం ఉంటుంది.

**- ఆచార్య వినోబా భావే**

## వానప్రస్థ సాధనా శిబిరం తేదీ 22-3-2007 నుండి 31-3-2007

ఉద్యోగ విరమణచేసి, గృహస్థ బాధ్యతల నుండి విముక్తి పొందిన వారు, ఎందరో రకరకాల రుగ్మతలతో అనారోగ్య పీడితులై, తనకు, తన కుటుంబానికి, సమాజానికి, దేశానికి భారమవుతున్నారు. అలాంటి వారిని నిరోగులుగాచేసి జీవితాన్ని అందించి, తన కుటుంబానికే గాక సమాజానికి, దేశానికి ఉపకారులుగా మార్చి, వారి జీవితాలను ఆనందమయము చేయడమే ఆశ్రమధ్యేయం.

అందు నిమిత్తమై తేదీ 22-3-2007 నుంచి 31-3-2007 వరకు పై ఆశ్రమమునందు వాన ప్రస్థ సాధనా శిబిరం నిర్వహింపబడుతున్నది. ఈ శిబిరమునందు మన సాంప్రదాయ జీవన విధానాలైన ధ్యానం, ప్రాణాయామం, యోగాభ్యాస్యం, యౌగిక క్రియలు, ప్రకృతి జీవన విధానాలు, ప్రాకృతిక చికిత్సలు, నీటి సేవన క్రమం, ఆహార నియమాలు బోధిస్తూ, సాధకులు తమ వ్యాధుల నుంచి విముక్తి పొందే మార్గాలు తెలుపుతూ, ఆచరింపచేస్తూ శేష జీవితాన్ని ఆరోగ్య వంతం, ఆనందమయంగా తీర్చుదిద్దుకొనే మార్గాలు వివరిస్తాము.

ఈ కార్యక్రమం నిష్ణాతులైన ప్రకృతి వైద్యులు, ఆయుర్వేద, మరియు యోగా థెరపిస్టుల ద్వారా నిర్వహింపజేస్తాం. శిబిరంలో పాల్గొనదలచినవారు శిబిర రుసుము రూ 1500-00 (రూపాయలు ఒక వేయి ఐదు వందలు ) వసతి, భోజనం , చికిత్సలు మరియు శిక్షణ నిమిత్తమై ముందుగా నగదు రూపేణా గానీ లేక మనీఆర్డరు లేక డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని చెల్లించి తమ స్థానాన్ని రిజర్వు చేసుకోవాలి. తీవ్రమైన అనారోగ్యంగలవారు ముందుగా ఆశ్రమ వైద్యులను సంప్రదించి శిబిర రుసుము చెల్లించాలి.

కార్యదర్శి

**మహర్షి వాల్మీకి వానప్రస్థాశ్రమ్**

బైరాగిగూడ (గ్రా), మంచిరేవుల (పో),రాజేంద్రనగర్ (మం)

హైదరాబాద్ – 500075, ఆం.ప్ర., ఫోన్ : 040-24191989, 69902498



## శ్రీ సాయినాథాయ నమః



**బాబా భక్తులకు శుభవార్త !** **సాయి బంధువులందరికీ నమస్కారం !**

బాబా బంధువులను కలుసుకుంటే మనందరికీ ఎంతో సంతోషం కలుగుతుంది. బాబా లీలలను ముచ్చటించుకోవడంలో మనకు సమయమే తెలియదు. ప్రతి ఒక్కరూ ఏదో ఒక స్వీయ అనుభవం కలిగే ఉంటారు. అందుకే మనందరికీ బాబాతో విడలేని బంధం ఏర్పడింది. మళ్లీ జన్మంటూ ఉంటే అది కేవలం బాబా భక్తులమయి ఆయన ధ్యానంలో తన్మయత్వం చెందాలని కోరుకుంటాం.

భక్తులందరినీ కలుసుకోవాలన్నా, ఆనందాన్ని పంచుకోవాలన్నా బాబా దేవాలయాలే కేంద్రాలు. అయితే ఇప్పటివరకు ఆంధ్రప్రదేశ్‌లో ఎన్ని దేవాలయాలు ఉన్నవో చెప్పేందుకు ఖచ్చితమైన అడ్రస్ పుస్తకంలేదు. ఆ ప్రయత్నమే శిరిడిసాయి యెల్లోపేజెస్ (Shiridi Sai Yello pages) (అడ్రస్ మరియు టెలిఫోన్ డైరెక్టరీ). ఇందుకు గాను మా సాయి బంధువులు చేయవలసిందల్లా మీ ఊరిలో బాబా దేవాలయం, సరియైన పోస్టల్ అడ్రస్సు, ఫోను నెంబరు మరియు ఇ - మెయిల్ అడ్రస్ మాకు తెలియజేస్తే ఆంధ్రప్రదేశ్‌లోని బాబా దేవాలయాల అడ్రస్‌లు అన్నీ ఒక పుస్తక రూపంలో ప్రచురిస్తాం. సాయి బంధువులకు ఇదే మా ఆహ్వానం. మీరు పోస్టల్ కార్డు ద్వారాగానీ, ఫోన్ ద్వారాగానీ, ఇ- మెయిల్ ద్వారాగానీ తెలియజేయ ప్రార్థన. మన అందర్నీ బాబా చల్లగా చూడాలని కోరుతూ...

**ఐ. సాయిబాబా**

**ఇం.నెం. 1-1-193/4/3, 2వ అంతస్తు,**
**అలహాబాద్ బ్యాంక్ ఎదురులేన్, చిక్కడపల్లి,**
**హైదరాబాద్ –500 020. ఫోన్ నెం . 32936465,**
E-mail : nsaibabaca@yahoo . com

... 17వ పేజీ తరువాయి

**7** ఆ మాటల్ని విన్న వెంటనే ఆ యువతి అందానికి మోహితులయినవారు, నగల మీద మోజు పడ్డవారు వెనకడుగు వేశారు. మరికొందరు తమ పవిత్రతపై సంపూర్ణ విశ్వాసం లేక ముందుకు రాలేదు.




పాపమే చెయ్యని మనిషి అంటూ వుంటాడా ? ఎలాంటి విపరీతమైన నిబంధన ఇది! అనుకుంటూ అందరూ వెళ్లిపోసాగారు. విలపిస్తున్న ఆమెను ఓదార్చలేక మిగిలినవారు తల్లడిల్లారు. అప్పుడు ఒక యువకుడు అక్కడికి వచ్చాడు.

**8** సోదరీ ! నీకు సాయపడడానికి నేనున్నాను.




**9** ఆ యువకుడు వెంటనే గంగానదిలో దిగి స్నానం చేసివచ్చాడు.



**10**

అరే! ఈమాత్రం మీకు తెలియదా? నేను గంగానదిలో మునిగిలేచినప్పుడే గంగామాత నా పాపాలన్నిటినీ హరించి నన్ను పవిత్రుని చేసింది.





**11**

అప్పుడు...ఒక్కసారిగా శివపార్వతులు నిజరూపంలో దర్శనమిచ్చారు. గంగాస్నానం చేసిన భక్తులందరూ వారిని దర్శించుకొని కృపాకటాక్ష పాత్రులయ్యారు.





**12**

భక్తి, విశ్వాసాలతో మనస్సు పవిత్ర మౌతుంది. అయితే అది పసిపిల్లల విశ్వాసం వలే సరళమై, నిష్కపటమై ఉండాలి. దానితో సర్వమూ సిద్ధిస్తుంది. కపటులైన వారికి అటువంటి విశ్వాసం లభించటం చాలా కష్టం. ప్రగాఢ విశ్వాసం లేకుండా పదివేలసార్లు గంగలో మునిగినప్పటికీ ఎటువంటి ఫలితం ఉండదు. -శ్రీ రామకృష్ణ పరమహంస



# గ్రంథ పరిచయం

## నామ సుమాంజలి

**(శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రం తెలుగు వ్యాఖ్యాన సహితం)**

**సంకలనం: పసుమర్తి బద్రీనాథ్**



కలికాలంలో భగన్నామ సంకీర్తనం వల్ల సమస్త పాపాలూ నశిస్తాయంటారు. నామ సంకీర్తనం చేసే రచనల్లో 'విష్ణుసహస్ర నామ స్తోత్రం' అగ్ర గణ్యమైనది. భారతంలో భగవద్గీతకు ఉన్నంత ప్రాముఖ్యం ఈ స్తోత్రానికి కూడా ఉంది. ఈ స్తోత్రానికి ప్రాచీన కాలం నుంచి నేటి వరకూ అనేకులు వివరణలు వ్రాశారు. 'నామ సుమాంజలి' అనే ఈ గ్రంథంలో రచయిత విలక్షణంగా వ్యాఖ్యానం చేశారు. వ్యాఖ్యానంతో పాటు సందర్భానుసారంగా ఆళ్వారుల పాశురాలనూ, ఆదిశంకరుల వారి రచనలనూ, శ్రీరామకృష్ణుల వారి పలుకులనూ ఉద్ఘాటించారు అలాగే భగవద్గీత శ్లోకాలనూ, పోతన, అన్నమాచార్య మొదలైన సుప్రసిద్ధ భక్త కవుల రచనలనూ, నారాయణీయం లాంటి అనేక ప్రసిద్ధ గ్రంథాల నుంచి సేకరించి అవగతం చేసుకున్న అంశాలనూ ఉదాహరించారు. చదివిన ప్రతి ఒక్కరికీ సులువుగా అర్థం కావడానికి వీలుగా, వ్యావహారిక భాషలో అతి సులభమైన శైలిలో దీన్ని వ్రాశారు. a

**– శ్రీమతి ఎస్. శేషు**

పేజీలు: 323, వెల: రూ. 200/–

ప్రతులకు : **పసుమర్తి బద్రీనాథ్,** 10, కందస్వామి వీధి, రాజా అణ్ణామలై పురం, చెన్నై–600 028.

## మిస్టరీ ఆఫ్ డెత్

**(మరణ రహస్యం)**

**ఆంగ్లమూలం : స్వామి అభేదానంద**

**అనువాదం : బ్ర.రామకృష్ణచైతన్య**



భగవాన్ శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులైన స్వామి అభేదానందజీ 1906లో అమెరికాలోని విద్యార్థులనూ, శ్రోతలనూ ఉద్దేశించి ప్రసంగించారు. ఆ ఉపన్యాస పాఠాలు 'ది మిస్టరీ ఆఫ్ డెత్' పేరుతో ఆంగ్లంలో గ్రంథరూపంలో వెలువడ్డాయి. కఠోపనిషత్తును ఆధారంగా చేసుకొని, దానిలోని భావాన్ని, తత్త్వాన్ని విశదీకరిస్తూ అభేదానందజీ 19 ప్రసంగాలు చేశారు. సత్యాన్వేషి అయిన బాలుడు నచికేతుడికి, యమధర్మరాజుకూ మధ్య జరిగిన సంభాషణకు రూపమే కఠోపనిషత్తు. భారతీయ వైదిక చింతన క్రమవికాసాన్ని ఇందులో సులభగ్రాహ్యంగా వర్ణించారు స్వామి అభేదానందజీ. మరణమంటే ఏమిటి, దాన్ని ఎలా జయించాలి, అమరత్వం ఉందా? లాంటివెన్నో అంశాలను చర్చించారు. ఆంగ్ల గ్రంథాన్ని బ్రహ్మచారి రామకృష్ణ చైతన్య అందరికీ అర్థమయ్యే రీతిలో సరళమైన తెలుగులోకి అనువదించారు. a

**– శ్రీమతి ఎస్. శేషు**

పేజీలు: 247   వెల: రూ॥ 50/–

ప్రతులకు: **గుద్దేటి బిందుప్రసాదు,** డోర్ నెం. 7/130, మిట్టపాళెం వీధి, గూడూరు – 524 101.

గమనిక : 'గ్రంథ పరిచయం' కోసం పుస్తకాలు పంపేవారు తప్పనిసరిగా ప్రతి పుస్తకం రెండేసి ప్రతులు పంపాలి

# గ్రంథ స్వీకారం

### శ్రీ వేంకటేశ్వర సప్తతి

తెలుగు సేత: ద్విభాష్యం కామరాజు,
వెల:రూ. 10/– పేజీలు:31

ప్రతులకు: ద్విభాష్యం కామరాజు
ఆలమూరు, తూర్పుగోదావరి జిల్లా.

### 1 శ్రీరామ నామమహిమ

వెల: రూ. 15/–, పేజీలు:64+22

### 2 శ్రీరామ సంకీర్తనము

వెల: రూ. 5/–, పేజీలు: 20

### 3 అహల్యా స్తవమ్

వెల: రూ. 3/–, పేజీలు:16

పై 3 ప్రతులకు:పురాణపండ రాధాకృష్ణ మూర్తి, 29–6–13 డి, భాగవత మందిరం, సూర్యా హోటల్ ప్రక్కన, రాజమండ్రి–4.

### అచల రమణుడు

రచన: శ్రీరావినూతల శ్రీరాములు
వెల: రూ. 20/–, పేజీలు: 43

ప్రతులకు: ఆర్. శ్రీరాములు,
రమణస్థాన్, 10–228,
వసంతపురి కాలనీ, మల్కాజ్‌గిరి,
హైదరాబాద్–47.



| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 8 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 85 | $ 15 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 240 | $ 45 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 380 | $ 75 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1200 | $ 350 |

ఎమ్.ఓ./డి.డి.లను పంపవలసిన చిరునామా : **శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్–500029**

# వార్తావాహిని

విజయవాడ రామకృష్ణమిషన్ శాఖ ఆవిర్భవించి ఆరు సంవత్సరాలు నిండాయి. [illegible] 4,5,6 తేదీల్లో వార్షికోత్సవాలు జరిగాయి. ఈ ఉత్సవాలకు పాట్నా రామకృష్ణమిషన్ ఆశ్రమ క[illegible]నందజీ, రాజమండ్రి రామకృష్ణమఠం అధ్యక్షులు స్వామి అక్షరాత్మా నందజీ ముఖ్య అతిథులుగా హాజరయ్యారు.

మొదటిరోజున గాంధీనగర్ లో ఏర్పాటుచేసిన సత్సంగ కార్యక్రమంలో స్వామి అక్షరాత్మానందజీ 'సంఘటితంగా పని చేయాలంటే సహనం అవసరం' అనే అంశంపై ప్రసంగించారు. అనంతరం స్వామి తద్గతానందజీ సుమధుర సంగీతంతో సరళ ఆంగ్లంలో చేసిన 'భాగవత హరికథాగానం' శ్రోతలను అలరించింది. విజయవాడ రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి శశికాంతానందజీ ఈ కేంద్రం నిర్వహించిన ఆధ్యాత్మిక సేవా కార్యక్రమాల నివేదికను అందించారు.

రెండోరోజు సాయంత్రం సీతానగరంలో రామకృష్ణమిషన్ పాఠశాల వార్షికోత్సవం జరిగింది. ఈ కార్యక్రమంలో స్థానిక మండల పరిషత్ అధ్యక్షులు శ్రీ వేమా రెడ్డి, గ్రామ పంచాయతి సర్పంచి శ్రీ చంద్రమోహన్ రెడ్డి అతిథులుగా పాల్గొని విద్యార్థులకు బహుమతి ప్రదానం చేశారు. శ్రీ చంద్రమోహన్ రెడ్డి తన ప్రసంగంలో 'ఇకపై ఈ స్కూలు రోడ్డును రామకృష్ణ మిషన్ రోడ్డుగా' పిలవాల్సిందని విజ్ఞప్తి చేశారు. అతిథి స్వామీజీలు విద్యార్థులకు తమ ఆశీస్సులు అందించారు. చివరి రోజు సీతానగరం ఆశ్రమంలో విశేష పూజ, హోమం, భజనలు, స్వామీజీల ప్రసంగాలు జరిగాయి. భక్తులు, విద్యార్థులు ఉత్సాహంగా పాల్గొని ఈ కార్యక్రమాన్ని జయప్రదం చేశారు.

**– నివేదిక : బ్రహ్మచారి హరీష్**





రామావత్ సాధువు 'జటధారి' ఒకసారి దక్షిణేశ్వరం వచ్చి శ్రీరామకృష్ణుని సన్నిధిలో కొంత కాలం గడిపాడు. ఆయన రాంలాలా (బాల రాముని) విగ్రహాన్ని ఆరాధి స్తూండేవాడు. ఎక్కడికి వెళ్లినా తనతో పాటు ఆ విగ్రహాన్ని తీసుకొని వెళ్లే వాడు. భిక్షద్వారా లభించిన ఆహారాన్ని వండి రాంలాలాకు నైవేద్యంగా అర్పించే వాడు. నిజంగా రాంలాలా ఆరగించటం. పచార్లు చేసి రావాలని కోరటం, అల్లరి చేయటం మొదలైనవన్నీ ఆ సాధువు ప్రత్యక్షంగా దర్శించేవాడు. రాంలాలా అవన్నీ చేయటం శ్రీ రామకృష్ణులు కూడా చూశారు. బాలరాముని లాలనలో శ్రీరామకృష్ణులు ఎలా ఆనంద పరవశులయ్యే వారో ఆయన మాటల్లోనే విందాం...



నేను జటధారి వద్ద కూర్చొని ఉన్నంతసేపూ రాంలాలా ఆడుతూ, పాడుతూ ఆనందంగా అక్కడే ఉండేవాడు. కానీ నేను నా గది నుంచి బయలుదేరగానే నన్ను వెంబడించేవాడు. రావద్దని ఎంత కట్టడి చేసినా వినేవాడు కాదు. మొదట్లో ఇదంతా నా మతిభ్రమ అనుకునే వాణ్ణి. అంతగా తనను ప్రేమిస్తూ, ఎంతో కాలం నుంచి ఆరాధిస్తూ, సేవిస్తూ ఉన్న జటధారి కంటే ఎక్కువగా నన్ను ప్రేమిస్తున్నాడా?అసంభవం! కానీ, నన్ను అనుసరిస్తూ నృత్యం చేస్తూ రావటం గమనించేవాణ్ణి. ఒక్కొక్కప్పుడు చంకన ఎత్తుకొమ్మని మారాం చేసేవాడు. మరొకప్పుడు ఒళ్లో కూర్చోబెట్టుకున్నా, స్థిమితంగా కూర్చునే వాడు కాదు. అక్కడికీ ఇక్కడికీ పరు గెత్తేవాడు, ముళ్ళకంచెల్లోకి పోయి పూలు కోసేవాడు, లేదా గంగానదిలో దూకి ఈదుతూ, నీటిని ఎగజిమ్మేవాడు.

నేను పదేపదే, 'నాయనా! అలా చేయవద్దు, ఎండలో తిరిగితే కాళ్ళు, బొబ్బలెక్కుతాయి. ఎక్కువసేపు నీళ్ళలో నానితే జలుబుచేసి జ్వరం వస్తుంది' అని చెప్పేవాడిని. ఎంత చెప్పినా విని పించుకునేవాడు కాడు. పద్మ పత్రాల వంటి తన అందమైన కళ్ళను విప్పి నా వంకే చూస్తూ ఇకిలించేవాడు నన్ను విసిగించాలని మరింత అల్లరి పనులు చేసేవాడు. మూతిముడుచుకొని నన్ను వెక్కి రించేవాడు. నాకప్పుడు నిజంగా కోపం ముంచుకొచ్చేది.

"ఒక రోజు స్నానం చేయడానికి నేను వెళుతూవుంటే, నాతోపాటు వస్తానని పట్టుపట్టాడు రాంలాలా. కానీ ఎంత సేపటికీ నీళ్లనుంచి బయటకు రాడే ! ఎంత చెప్పినా వినిపించుకోడే. చివరికి నాకు కోపం వచ్చింది. అతణ్ణి నీళ్ళలో ముంచి, 'ఇష్టం వచ్చినంతసేపు నీళ్ల లో ఉండు' అన్నాను. అప్పుడతడు నిజంగానే ఊపిరాడక గిలగిలకొట్టుకోవడం చూసి, నేను చేసిన పనికి పశ్చాత్తాపం చెంది, నీళ్లనుంచి బయటకు తీసి ఎత్తుకున్నాను.

"మరో సందర్భంలో అతడికోసం ఎంత బాధపడి విలపించానో చెప్పలేను. ఆ రోజు ఏదో తినాలని రాంలాలా మొండికేశాడు, పొట్టుతీయని అటుకులు ఇచ్చాను. ఆ అటుకులు తిని రాంలాలా నాలుక గీరుకుపోయింది. అది చూసి నేను పడ్డ బాధ అంతా ఇంతా కాదు. వెంటనే అతణ్ణి నా ఒళ్లోకి తీసుకొని, అతడి చుబుకాన్ని పుచ్చుకొని, 'అయ్యో, ఎంత అనాలోచితంగా, మూర్ఖంగా ప్రవర్తించాను! తల్లి కౌసల్య వెన్నమీగడలను పెట్టిన నీ నోట్లో ఈ మోటు పదార్థాన్ని పెట్టానుగదా తండ్రీ!' అని బిగ్గరగా ఏడుస్తూ చెప్పాను."

ఈ సంఘటనలను శ్రీ రామకృష్ణులు తన శిష్యులతో చెబుతూ భోరున ఏడ్చేవారు. రాంలాలతో ఆయనకున్న అనురాగ బంధం సామాన్యులకు అవగతం కాకపోయినా, విన్న వారు కళ్ళు చెమర్చకుండా మాత్రం ఉండలేరు. a

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.64-3, Sri Ramakrishna Prabha (Telugu Monthly) March 2007, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. H-HD-1071/2007-09. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2007-09.

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) 'వేదచూడామణి'** : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము

యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.

వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య

స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

**(ఆ) 'వేదార్థచూడామణి'** : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము

యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.

వయస్సు : 15 సం॥, ఆ పైన

స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) వేదాధ్యాపకుడు** : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)

కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము

అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవము : 2 సంవత్సరములు

సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

**(ఆ) వేదభాష్యాచార్యుడు** : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)

విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత

అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవార్హత : 5 సం॥

సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు

# సుబోధ

**భక్తుడు :** మహర్షులు కూడా రాముణ్ణి భగవంతుని అవతారంగా గుర్తించలేక పోవడానికి కారణం ఏమిటి?

**శ్రీరామకృష్ణులు :** తమ అభిరుచి, ప్రవృత్తిని బట్టి జనులు భగవంతుణ్ణి ఆరాధిస్తారు. తల్లి వంట చేసేటప్పుడు పిల్లల వయస్సు, వారి జీర్ణశక్తి, అభిరుచులను బట్టి వంటచేసి అందరినీ సంతృప్తి పరుస్తుంది. అలాగే ఋషులు జ్ఞాన మార్గాన్ని అవలంబిస్తే, భక్తులు భక్తి మార్గాన్ని అనుసరిస్తారు. భగవంతుని దర్శించిన వానికి మనసులోని కాలుష్యాలనే చీకటి తొలగిపోయి జ్ఞానం అనే కాంతి ప్రసరిస్తుంది. సూర్యోదయంతో పద్మం వికశించినట్లు బహు కొద్దిమంది ఆంతరంగికులు మాత్రమే భగవంతుని అవతార రహస్యాన్ని గుర్తించగలుగుతారు. కొందరు ఋషులు శ్రీరాముణ్ణి దశరథుని కుమారునిగా మాత్రమే గుర్తించారు. భరద్వాజుడు మొదలైనవారు మాత్రం శ్రీరాముని భగవదవతారంగా గుర్తించి ప్రార్థించారు. జనసామాన్యం భగవదవతార మూర్తి రాకను గుర్తించజాలదు. ఆయన గోప్యంగా వస్తాడు. ఆంతరంగిక శిష్యులు మాత్రమే ఆయన్ను గుర్తిస్తారు. శ్రీరాముడు పరబ్రహ్మమని కేవలం పన్నెండు మంది ఋషులు మాత్రమే గుర్తించారు.

**భక్తుడు :** కలియుగంలో భగవద్భక్తి మాత్రమే తరుణోపాయమని వేదాలలో, పురాణాల్లో చెప్పబడింది కదా!

**శ్రీరామకృష్ణులు :** యాంత్రికంగా భగవన్నామాన్ని జపిస్తే ఫలితం కలగదు. భగవంతుడిపట్ల ప్రేమతో, పరితపించాలి. ఒకపక్క నామజపం చేస్తూ మనసేమో కాంతా కనకాలలో మునిగి తేలుతూ ఉంటే, ఏం ఒరుగుతుంది?

పరిశుద్ధమైన ప్రవర్తన కలిగి సదా భగవంతుని కొరకు పరితపించాలి. భగవంతునిపై ప్రేమ పెరుగుతున్నకొద్దీ కాంతా, కనకాలపై వ్యామోహం తగ్గుతుంది. తద్వారా భగవంతుని పొందవచ్చు.

కామినీ కాంచనాలే మాయ. సాధకులు స్త్రీలకు దూరంగా ఉండి జీవించాలి. అందరూ దాన్లోనే మునిగిపోతారు.

స్త్రీల సాంగత్యంతో సాధకుడు తన ఆదర్శం నుండి దిగజారిపోతాడు. అంతటి సమున్నత ఆదర్శాన్ని ఆచరణలో చూపకుంటే సామాన్యుడు ఎలా ఉద్ధరింపబడతాడు?

శ్రీచైతన్య మహాప్రభు శిష్యుడు చిన్న హరిదాసు ఒక వితంతువుతో మాట్లాడాడు. అందుచేత చైతన్యుడు అతణ్ణి బహిష్కరించాడు. ఎంతటి కఠోర శిక్ష!

శ్రీరామకృష్ణుల ఈ పలుకులు భక్తుల హృదయాలలో ఉరుము ఉరిమినట్లు ప్రతిధ్వనించాయి. a

('శ్రీరామకృష్ణ కథామృతం' నుంచి)

నిర్వాహక సంపాదకులు : **స్వామి జ్ఞానదానంద** సంపాదకులు : **స్వామి పరిజ్ఞేయానంద**



శ్రీ రామకృష్ణ ప్రభ
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029 ఫోన్: 040-2766 7799
E-mail : sriramakrishnaprabha@gmail.com

# సురభి

మాతృదేవిని మొట్ట మొదటి సారిగా జయరాంబాటిలోని ప్రసన్న మామయ్య ఇంటి వసారాలో దర్శించుకున్నాను. ప్రణమిల్లిన వెంటనే, "మళ్లీ రా" అన్నారు. కారుణ్యం ఉట్టిపడే ఆ మాటలను మాత్రమే ఆ రోజు విన్నాను. మరేమీ మాట్లాడడానికి వీలుపడలేదు.

రెండవసారి మాతృదేవిని దర్శించింది కూడా ఆ ఇంట్లోనే. అనేక విషయాలు మాట్లాడిన తర్వాత మాతృదేవి ఇలా అన్నారు:

"ఇదిగో చూడూ, వందేమాతరం అని నినాదిస్తూ ఊరకే ఆర్భాటం చేయవద్దు. రాట్నం తీసుకురా. వస్త్రాలు నేయి. ఒక రాట్నం దొరికితే నూలు తీయాలనుకొంటున్నాను. పని చేయండి, ఊరకే ఆర్భాటం చేయడం మంచిది కాదు. యువకులు ఎటు పయనిస్తున్నారో చూడు!"

తరువాత నాకు ఉద్బోధన్ పత్రిక ఒకటి ఇస్తూ, "ఇందులో నరేంద్రుడు(వివేకానంద) చెప్పిన విషయాలున్నాయి, చదువు. గురుదేవుల పుస్తకాలు చదివావా?" అని అడిగారు. "అవును. కథామృతం లాంటి కొన్ని పుస్తకాలు చదివాను" అన్నాను నేను.

ఆ రోజు మాతృదేవి పలుకులు మాకు మార్గాన్ని నిర్దేశించాయనే చెప్పాలి. సర్వత్రా చీకటి ఆవరించిన మార్గంలో వారి ప్రేమవచనాలు మాకు మార్గదర్శకాలయ్యాయి.

ఒక రోజు మాతృదేవీ, నేనూ కూర్చొని కూర గాయలు తరుగుతున్నాం.

**నేను:** అమ్మా! బ్రహ్మజ్ఞానం ఎలా కలుగుతుంది? ఈ కళ్లతో బాహ్య వస్తువుల నన్నిటినీ చూస్తున్నాను. వీటి నన్నిటినీ బ్రహ్మంగా ఎలా అనుకోగలను? ఈ అనుభూతి ఎలా సిద్ధిస్తుంది? బ్రహ్మజ్ఞానం కలుగకపోతే ముక్తి లేదని స్వామీజీ (వివేకానంద) అంటున్నారు. ఏమీ అర్థ మవడం లేదు.

**మాతృదేవి:** అది చాలా కఠినమైన దారి. అలాంటి సాధనలు అనుష్ఠించి పురోగమించడానికి చాలాకాలం పడుతుంది. నువ్వు శ్రీరామకృష్ణులను ప్రార్థించు. ఆయనను ఆశ్రయించి జీవించు. తగిన తరుణం ఆసన్నమైనప్పుడు ఆయన అన్నిటినీ గ్రహింపచేస్తారు. నువ్వెందుకు ఆందోళన చెందుతావు? గురుదేవుల అనుగ్రహం కలిగితే అంతా సిద్ధిస్తుంది. a

(మాతృమూర్తి శ్రీ శారదాదేవి శిష్యులైన స్వామి పరమేశ్వరానంద స్మృతుల నుంచి).

# చందనోత్సవ ప్రియుడు శ్రీనారసింహుడు...



**ఈ నెల 20న సింహాచల చందనోత్సవం**

- ఎ.ఎస్.మూర్తి

**భా**రతీయ ఆధ్యాత్మిక వారసత్వానికి పట్టుగొమ్మలే మన దేవాలయాలు. సంస్కృతీ సంప్రదాయాలకు ఆలవాలమైన ప్రముఖ ఆలయాల్లో విశాఖపట్నం జిల్లాలోని శ్రీవరాహ లక్ష్మీ నారసింహ స్వామి దేవాలయం ఒకటి. ఈ ఆలయానికి మన పురాణాల్లో ఐతిహాసిక నేపథ్యమూ ఉంది. హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు రాక్షసరాజులుగా జన్మించి భూదేవిని గడగడలాడించిన కథ మనకందరికీ విదితమే. ఆది వరాహ రూపంలో శ్రీహరి అవతరించి, హిరణ్యాక్షుణ్ణి సంహరిస్తాడు. దాంతో అతని సోదరుడు హిరణ్యకశిపుడు హరిద్వేషంతో స్వామి భక్తులను కష్టాలపాలు చేస్తాడు. ఆ సమయం కోసమే వేచి ఉన్న శ్రీహరి తన సేవకుడైన సముఖుడిని హిరణ్యకశిపునికి తనయుడైన ప్రహ్లాదుడిగా ప్రసాదిస్తాడు. గర్భస్థశిశువుగా ఉన్నప్పటి నుంచే హరినామ స్మరణతో ఎదిగి ప్రహ్లాదుడు తండ్రికే కంటకంగా పరిణమిస్తాడు. తనకు బద్ధశత్రువైన హరి నామస్మరణ నుంచి కొడుకును మళ్ళించాలని హిరణ్యకశిపుడు విశ్వప్రయత్నం చేస్తాడు. ఎన్నివిధాలుగా శిక్షించినా మనస్సు మార్చుకోడు ప్రహ్లాదుడు. చివరికి ప్రహ్లాదుణ్ణి సముద్రంలో పడేయమని భటులను ఆదేశిస్తాడు హిరణ్యకశిపుడు. కానీ శ్రీహరి ప్రహ్లాదుణ్ణి కాపాడి, నృసింహావతారంలో హిరణ్యకశిపుని అంతమొందిస్తాడు. ప్రహ్లాదుడు శ్రీహరిని వరాహమూర్తి, నృసింహమూర్తి కలసిన ఏకావతార రూపంలో ప్రత్యక్షం కావాలని ప్రార్థిస్తాడు. ఆ రూపంలోనే సింహాద్రిపై కొలువు తీరిన వరాహ లక్ష్మీ నృసింహస్వామికి ఆలయాన్ని నిర్మించి అర్చిస్తాడు. అదే సింహాచలం.

కృత యుగాంతంలో ఆ దేవాలయం శిథిలమైనందున, స్వామి మళ్ళీ ఆలయ గర్భాన కనుమరుగై ఉంటాడు. కొంతకాలానికి చంద్రవంశ ప్రభువైన పురూరవుడు ఆకాశయానం చేస్తూ సింహాద్రిపై తరచి చూడగా వరాహ లక్ష్మీ నృసింహమూర్తి కనిపిస్తుంది. ఆ విగ్రహాన్ని పైకి తీసి ఆలయంలో పునఃప్రతిష్ఠిస్తాడు. ఆ సమయంలో ఆకాశవాణి పురూరవుని ఉద్దేశిస్తూ ఆ వరాహ లక్ష్మీ నృసింహస్వామి నుంచి బయల్పడే అగ్నికీలలు అక్కడి పర్వతావళిని దహిస్తాయనీ, ఆ ప్రమాదాన్ని నివారించేందుకు మందమైన చల్లని చందన లేపనంతో నిత్యమూ కప్పి ఉంచమనీ, ఆ రూపంలోనే స్వామిని అర్చించమనీ సూచిస్తుంది. సంవత్సరానికి ఒకరోజు వైశాఖ శుద్ధ తదియ నాడు స్వామి నిజరూప అర్చన సమ్మతమని వివరిస్తుంది.

ఆనాటి నుంచి పురూరవ చక్రవర్తి వరాహనరసింహ స్వామిని చందన లేపనంతో అలంకరించి ఆరాధించడం ప్రారంభించాడు. సింహాచలం మీద నెలకొన్న శ్రీ వరాహ లక్ష్మీ నృసింహ స్వామి వారి దేవాలయం జగత్ప్రసిద్ధమై పూజలందుకుంటోంది. పురూరవుడు కొల్చిన సంప్రదాయానుసారం ప్రతీ సంవత్సరం వైశాఖ శుద్ధ తదియ నాడు స్వామి నిజరూప దర్శనం కలుగుతుంది. అనంతరం వైభవంగా చందనోత్సవం నిర్వహిస్తారు. ఆ ఉత్సవాన్ని కళ్ళారా చూసిన వాళ్ళకు సర్వ శుభాలూ కలుగుతాయని భక్తుల ప్రగాఢ విశ్వాసం.

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**



# శ్రీ వేంకటేశ్వర గోసంరక్షణ ట్రస్టు







**శ్రీ వేంకటేశ్వర స్వామి ఇది చేశారు:**

బ్రహ్మదేవుడు గోవుగా, శివుడు దూడగా మారగా, తల్లి శ్రీలక్ష్మి యాదవకన్యగా మారి వేంకటాచలంలో ధ్యానం చేస్తున్న శ్రీనివాసునికి పాలు సమకూర్చాలనే ప్రయత్నంలో ఆ ఆవునూ, దూడనూ చోళరాజుకు అమ్మినట్లు శ్రీవేంకటాచల మాహాత్మ్యంలో చెప్పబడింది. ఆ ఆవును పసులకాపరి బారి నుండి ఆ భగవంతుడు రక్షించినట్లుగా కూడా అందులో చెప్పడం జరిగింది.

**ఆ స్వామి చేసినది మేమూ ఆచరించదలిచాము:** ఆవులను కాపాడడానికీ, ఆర్థిక ప్రాముఖ్యంతో పాటు, ఆవుకున్న ఆధ్యాత్మిక ప్రాముఖ్యాన్ని చాటిచెప్పడానికీ "శ్రీవేంకటేశ్వర గో సంరక్షణ ట్రస్ట్" ఏర్పాటు చేయడం జరిగింది.

తిరుమల తిరుపతి దేవస్థానం వారు గో సంరక్షణ కోసం అన్ని సౌకర్యాలూ ఉన్న ఆధునిక గోశాలను ఏర్పరచాలనుకుంటున్నారు. "మానవజాతికి గోవు గొప్ప వరప్రసాదం. గో సంపద ఉన్న భూములు సస్యశ్యామలంగా ఉంటాయి. గోవులను పూజించే ఇళ్ళు లక్ష్మీ నివాసాలు అవుతాయి. నాగరకత అభివృద్ధి చెందుతుంది." ప్రజలకు సాంకేతికమైన సూచనలిచ్చి గోశాలలో లేని గోవుల జీవన స్థితిగతులను మెరుగుపరచడం కూడా ఈ ట్రస్టు లక్ష్యం.

టి.టి.డి. వారి దేవాలయాలన్నిటిలోనూ జరిగే పూజలకూ, ప్రసాదాలకీ, అభిషేకం మొదలైన వాటికీ; సేవాసంస్థలైన ఎస్.వి. బాలమందిర్ (అనాథ శరణాలయం), ఎస్ ఎస్వీ డంబ్ అండ్ డెఫ్ (మూగ,చెముడు) పాఠశాల, వికలాంగుల శిక్షణ కేంద్రం, ఎస్.వి. పూర్ హోమ్ (లెప్రసీ ఆసుపత్రి), ఎస్.వి. వేదపాఠశాల, ఎస్.వి. ఓరియంటల్ కళాశాల వసతి గృహం(హాస్టల్), తి.తి.దే. వారి ఆసుపత్రులు, తి.తి.దే. వారి అన్నదాన పథకాలు మొదలైన వాటన్నిటికీ తిరుపతిలో ఉన్న తి.తి.దే. వారి ఎస్.వి. డైరీ ఫామ్ పాలు, పెరుగు సరఫరా చేస్తుంది.

**మీరు చెయ్యవలసినది:** విరాళమిచ్చిన భక్తులు గో సంరక్షణలో పాల్గొనే అవకాశం శ్రీవేంకటేశ్వర గో సంరక్షణ ట్రస్ట్ కలిగిస్తోంది. ఒక లక్ష రూపాయలు, లేక అంతకు మించి విరాళమిచ్చే దాతలకు క్రింద తెల్పిన వివిధ పథకాల ద్వారా పలు సౌకర్యాలు కల్పిస్తారు.

## విరాళం వివరాలు

ఈ పథకంలో కనీసం 1,000/- రూ॥ విరాళంగా ఇవ్వాలి. 1,000/- రూ॥కి తక్కువగా ఉన్న విరాళాలను దాతలకు తెలియపరచకుండానే శ్రీవారి హుండీ అకౌంట్‌లో వేస్తాము. అన్ని విరాళాలనూ ఒక జాతీయ బ్యాంకులో డిపాజిట్ చేసి వాటిపై వచ్చే వడ్డీని ఈ పథకానికి ఉపయోగిస్తాము. విరాళాలు **'ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, శ్రీ వేంకటేశ్వర గో సంరక్షణ ట్రస్ట్, తి.తి.దే. తిరుపతి'** పేరిట చెక్కు కానీ, డి.డి. కానీ తీసి 'డైరెక్టర్, ఎస్.వి. డైరీ ఫామ్ (ఎస్.వి. గోసంరక్షణశాల), చంద్రగిరి రోడ్డు, టి.టి.డి, తిరుపతి - 517 501; ఫోన్ - 0877 - 2248140' కు పంపగలరు. వ్యక్తుల పేరిట కానీ, కంపెనీలు లేక సంస్థల పేరిట కానీ విరాళాలు పంపవచ్చు. విరాళాలకు సెక్షన్ 80 జి క్రింద ఆదాయపు పన్ను మినహాయింపు కలదు.

**కామధేనువు విరాళం:** రూ॥ ఐదు లక్షలు, అంతకు పైన

**సౌకర్యాలు**

రూ॥ 5 లక్షలు లేక అంతకు పైన విరాళమిచ్చే దాతలకి క్రింద తెలిపిన సౌకర్యాలు కల్పిస్తాము.

K దాతకూ, అతని కుటుంబానికీ సంవత్సరానికి మూడురోజులు (వరుసగా కానీ, మూడు వేర్వేరు రోజుల్లో కానీ) వీలును బట్టి ఏ.ఆర్.పి కౌంటర్‌లో ఉచిత బస వసతి, లేక డబ్బు చెల్లించే పద్ధతిలో వి.ఐ.పి వసతి కల్పించడం జరుగుతుంది.

K దాతకూ,అతని కుటుంబానికీ (అయిదుగురికి మించకుండా) సంవత్సరానికి మూడు రోజులు (వరుసగా కానీ, వేర్వేరు రోజుల్లో కానీ) వైకుంఠం క్యూ కాంప్లెక్స్ ద్వారా సెల్లార్ దర్శనం కల్పిస్తాము.

K దాత దర్శనానికి వచ్చినప్పుడు ఏడాదికి ఒకమారు 10 చిన్న లడ్లు ప్రసాదంగా ఇస్తాము.

K దాత దర్శనానికి వచ్చినప్పుడు ఏడాదికి ఒకమారు బహుమానంగా ఒక శాలువా ఇస్తాము.

K దాత మొదటిమారు దర్శనానికి వచ్చినప్పుడు శ్రీవారు, పద్మావతీ అమ్మవార్ల చిత్రాలున్న బంగారు పూత పూయబడిన వెండి పతకం ఒకటి బహూకరిస్తాము.

K ఈ సౌకర్యాలు వ్యక్తులకు జీవితాంతం, కంపెనీలకు 20 ఏళ్ళ పాటు లభిస్తాయి.

**ప్రత్యేకమైన సౌకర్యాలు**

K ఏడాదికి ఒకమారు దాతకు శ్రీవారి మహాప్రసాదం 10 ప్యాకెట్లు ఇస్తాము

K దాత పేరిట ఒక శుక్రవారం (దాత తెలిపిన రోజున) స్వామి వారి క్షీరాభిషేకానికి 5 లీటర్ల పాలు సరఫరా చేస్తాము.

K తిరుపతిలో తి.తి.దే వారి గో సంరక్షణ శాలలో దాత పేరు ప్రకటిస్తాము.

K ఒక గోకులాష్టమి నాడు ఎస్.వి. డెయిరీ ఫామ్‌లో జరిగే గో పూజ ఉత్సవాలకు దాతను ముందుగా ఆహ్వానించి, ఒక శాలువా, ఒక జాకెట్టు గుడ్డ ఇచ్చి సత్కరిస్తాము. దాతలను ప్రతి గోకులాష్టమికీ గో పూజకు ఆహ్వానిస్తాము.

**క్షీరసాగరం విరాళం:** ఒక లక్ష రూపాయల నుండి ఐదు లక్షల లోపు

**సౌకర్యాలు**

K దాతకూ, అతని కుటుంబానికీ (ఐదుగురికి మించకుండా) ఏడాదికి ఒక రోజు వైకుంఠం క్యూ కాంప్లెక్సు గుండా సెల్లార్ దర్శనం కల్పిస్తాము.

K ఏడాదికి ఒకమారు దాతకు శ్రీవారి మహాప్రసాదం 10 ప్యాకెట్లు ఇస్తాము.

K దాత తెలిపిన రోజున దాత పేరిట ఒక శుక్రవారం స్వామి వారి క్షీరాభిషేకం కోసం ఒక లీటరు పాలు సరఫరా చేస్తాము.

K తిరుపతిలో తి.తి.దే. వారి శ్రీవేంకటేశ్వర గో సంరక్షణ శాలలో దాత పేరు ప్రదర్శిస్తాము.

K ఒక గోకులాష్టమి నాడు ఎస్.వి. డెయిరీఫామ్‌లో జరిగే గో పూజ ఉత్సవాలలో దాతకు (ముందుగా తెలియజేస్తాము) ఒక శాలువా, ఒక జాకెట్టు గుడ్డ ఇచ్చి సత్కరిస్తాము. దాతను ప్రతి గోకులాష్టమికీ గోపూజకు ఆహ్వానిస్తాము.

K ఈ సౌకర్యాలు వ్యక్తులకు జీవితాంతం, కంపెనీలకు 20 ఏళ్ళు లభిస్తాయి.

**బృందావని విరాళం:** రూ. 10,000/- లకు పైన, లక్ష రూపాయల లోపు

K దాత తెలిపిన రోజున శుక్రవారంనాడు జరిగే స్వామివారి క్షీరాభిషేకానికి దాత పేరిట ఒక లీటరు పాలు సరఫరా చేస్తాము.

K ఒకమారు శ్రీవారి మహాప్రసాదం రెండు ప్యాకెట్లు దాతకు ఇస్తాము.

**గోపాల విరాళం:** వెయ్యి రూపాయలకు పైగా పదివేల రూపాయల లోపున

#ఒకమారు శ్రీవారి మహాప్రసాదం ప్యాకెట్టు ఒకటి దాతకు ఇస్తాము.



R.O.C.NO: PR4/13721/PRO/03



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**......రూ. 10,000/- అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............రూ. 5,000/- అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**...................రూ. 1,000/- అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| పేరు | చిరునామా | రూ. |
|---|---|---|
| | ఇప్పటి వరకు వసూలైన మొత్తం ..... | 9,43,589 |
| పోషకులు : శ్రీ ఒ. వీరకేశవులు | మంగళగిరి, గుంటూరు జిల్లా - 522 503 | 1,116 |
| శ్రీ వై.వి.ఎస్. కృష్ణమూర్తి | యడవల్లి ఫౌండేషన్, అశోక్‌నగర్, హైదరాబాద్ | 1,000 |
| శ్రీ ఎమ్. రఘురామి రెడ్డి | నిధానపురం, ఖమ్మం జిల్లా - 507 203 | 1,001 |
| | మొత్తం ... | 9,46,706 |

# శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి మీ పేరు మీద పది మందీ మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥ 600/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ళ పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు) ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. కనీసం రెండు గ్రంథాలయాలకు తక్కువ కాకుండా చందా కట్టిన దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ'లో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| 1253 | శ్రీ టి.వి.రఘునాథ రెడ్డి, హోటల్ సరోవర్, తిరుపతి-517001 | చీమకుర్తి లైబ్రరీ, ప్రకాశం జిల్లా - 523 226. |
| 1254 | " | కారంచేడు లైబ్రరీ, ప్రకాశం జిల్లా - 523 168. |
| 1255 | " | సింగరాయకొండ లైబ్రరీ, ప్రకాశం జిల్లా - 523 001. |
| 1256 | " | మార్కాపురం లైబ్రరీ, ప్రకాశం జిల్లా - 523 316. |
| 1257 | " | కంభం లైబ్రరీ, ప్రకాశం జిల్లా - 523 001. |
| 1258 | " | చోడవరం లైబ్రరీ, విశాఖపట్నం జిల్లా - 531 036. |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



గమనిక: చెక్కు, డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా:
Sri Ramakrishna Prabha, Ramakrishna Math, **Domalguda, Hyderabad- 500 029.**

ఆధ్యాత్మిక-అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 64 సంచిక: 4 ఏప్రిల్ 2007


"ప్రతి జీవిలోనూ దివ్యత్వం గర్భితంగా ఉంది. అంతర్గతంగా ఉన్న ఆ దివ్యత్వాన్ని వ్యక్తం చేయడమే జీవిత పరమావధి." - స్వామి వివేకానంద

## ప్రార్థన



శ్రీమత్పయోనిధినికేతన చక్రపాణే
భోగీన్ద్ర భోగమణి రంజిత పుణ్యమూర్తే
యోగీశ శాశ్వత శరణ్య భవాబ్ధిపోత
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబం

– ఆది శంకరాచార్య విరచిత
'శ్రీలక్ష్మీ నృసింహ కరావలంబ స్తోత్రం' నుంచి.

**భావం:** సకల సంపదలతో కూడిన పాల సముద్రాన్ని నివాస స్థానంగా కలవాడూ, లక్ష్మీ దేవి చెంత నుండగా చేతిలో సుదర్శన చక్రంతో లోక రక్షణ చేసేవాడూ, తనకు పానుపుగా ఉన్న శేషుని తలపై ఉన్న మణుల కాంతులతో విరాజిల్లే పుణ్యమూర్తీ, యోగీశుడూ, శాశ్వతుడూ, శరణ్యుడూ, జన్మపరంపర అనే సముద్రాన్ని దాటించే నావ అయిన నారాయణావతార మూర్తి నరసింహుడు. లక్ష్మీదేవితో కూడి ప్రసన్న, శాంత, కరుణాయుతుడైన ఆ స్వామి చేయూత నిచ్చి రక్షించు గాక!

## ఈ సంచికలో...





**ముఖచిత్రం:** అభయ, వరద ముద్రలతో అక్షయ ఐశ్వర్య ప్రదాయిని శ్రీ మహాలక్ష్మి




VUL# UDPNULVKQD# SUDEKD/# UDPNULVKQD# EDWK
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

ప్రస్తుత సమాజంలో 'వ్యక్తిత్వ వికాసం' పై చాలా మోజు పెరిగింది. అందరి నోటా వినిపించేది, ముఖ్యంగా యువతలో ఉత్సుకతను పెంచేది ఈ పదం. వీథివీథికీ ఒక వ్యక్తిత్వ వికాస కేంద్రం వెలుస్తోందంటే నేడు వీటి అవసరం ఎంతవుందో మనకు అర్థమవుతోంది. అసలు ఈ వికాసానికి వేదిక ఎక్కడ? ఈ పాఠాలకు పీఠిక ఏమిటి? పెద్దలకే ఇవి ప్రశ్నార్థకంగా మారాయి.

సత్యానికే ప్రతిరూపం సత్యహరిశ్చంద్రుడు, ధర్మమే రూపుదాల్చిన శ్రీరాముడు, త్యాగానికే త్యాగం నేర్పిన శ్రీరామకృష్ణ పరమహంస, అనంతశక్తి మీలోనే ఉందని ఆత్మవిశ్వాసాన్ని నేర్పిన స్వామి వివేకానంద, అహింసే పరమ ధర్మం అన్న గాంధీజీ – ఇలా ఎందరో మహాత్ములు, మాన నీయులు మన దేశ చరిత్రలో చిరస్థాయిగా చెరగని ముద్ర వేశారు. అయితే ఈ మహాత్ములంతా ఏ వ్యక్తిత్వ వికాస కేంద్రాల్లో శిక్షణ పొందారు? వ్యక్తిత్వ వికాసంలో వీరికి ఎవరు తర్ఫీదు ఇచ్చారు?.

ఒక విత్తనం మొక్కై, చెట్టై, మహావృక్షంగా మారి ఫల వంతం కావాలంటే మొట్టమొదట కావలసింది గాలి, నీరు, ఎండ, ఎరువు కాదు. కావలసింది సారవంతమైన 'భూమి'. ఆ తరువాతే మిగిలినవన్నీ. అలాగే ఒక పిల్లవాడు బుద్ధి మంతుడు, విద్యావంతుడు, విజ్ఞానవంతుడు కావాలంటే 'ఇల్లే' వ్యక్తిత్వ వికాస పాఠాలు నేర్పే వేదిక కావాలి. తల్లి తండ్రులే అందుకు ఉత్తమ గురువులుగా మారాలి.

కానీ, నేడు తూరుపు తెల తెల వారకముందే బండెడు బరువైన పుస్తకాలను భుజాలపై వేసుకొని పాఠశాలలకు పయనమయ్యే పిల్లలు, అలసి సొలసి సాయంత్రం ఇంటికి చేరేసరికి ట్యూషన్లు అంటూ మళ్ళీ తరిమివేసే తల్లితండ్రులు కనిపిస్తున్నారు. పుస్తక జ్ఞానానికే సమయాన్నంతా వెచ్చించే ఈ కాలం పిల్లల్లో చదువుతో పాటూ సంస్కారం కూడా అలవడేలా తల్లితండ్రులు శ్రద్ధ వహించాలి. అప్పుడే నిజమైన వ్యక్తిత్వ వికాసం సాధ్యమవుతుంది.

మనిషిలో సంస్కారాన్ని పెంపొందించని విద్య విద్యే కాదు. అందుకే సమాజంలో శీలం లేని విద్యా వంతుల్ని, ధనవంతుల్ని ఉద్దేశించి స్వామి వివేకానంద ఇలా అంటారు:

Eulqj#oljkw#wr#wkh#ljqrudqw/#dqg
pruh# oljkw# wr# wkh# hgxfdwhg1
Eulqj# oljkw# wr# wkh# srru/# dqg
Eulqj# pruh# oljkw# wr# wkh# ulfk1

మన చరిత్రలో ఏ మహాత్ముని జీవితాన్ని పరిశీలించి చూసినా వారంతా ఆదర్శవంతులుగా మలచబడ్డారంటే ఆ ఘనత తల్లితండ్రులదే. నిస్వార్థ పరులై, త్యాగజీవులై, సద్వర్తనులైన తల్లితండ్రులు ప్రపంచా నికి చరితార్థులను ప్రసాదించగలిగారు. శ్రీరామకృష్ణుల జీవితంలో జరిగిన ఓ సంఘటన ఇందుకు నిదర్శనం. మధురనాథ్‌తో కలసి శ్రీరామకృష్ణులు కాశీ తీర్థయాత్రలకు వెళ్ళారు. అక్కడ దారిద్ర్యంతో బాధపడుతున్న వారికితగిన సహాయం చేయాల్సిందిగా శ్రీరామకృష్ణులు మధురనాథ్‌కు

చెప్పారు. శ్రీరామకృష్ణుల ఆజ్ఞానుసారం మథుర్‌బాబు అక్కడ పేదవారికి ధన, వస్తురూపేణా సహాయాన్ని అందించాడు. అనంతరం మధురబాబు శ్రీరామకృష్ణుల వద్దకు వచ్చి "మీరు కూడా ఏదైనా స్వీకరించండి" అని బ్రతిమలాడాడు. "నాకేమీ వద్దు" అని మధురబాబు విన్నపాన్ని తిరస్కరించారు శ్రీరామకృష్ణులు. కానీ మధుర బాబు పట్టుబట్టడంతో "సరే! నాకొక కమండలం ఇవ్వు" అన్నారు శ్రీరామకృష్ణులు. అది విని మధురబాబు శ్రీరామకృష్ణుల త్యాగ గుణానికీ, నిరాడంబరతకూ చలించి పోయి కన్నీళ్ళు కార్చాడు. శ్రీరామకృష్ణులు అంతటి ఉత్కృష్ట స్థితిని చేరారంటే, ఆయనకు జన్మనిచ్చిన మాతృమూర్తి మరెంతటి త్యాగమూర్తి అయ్యుండాలో మనం ఊహించవచ్చు.

మధురబాబు ఒకసారి శ్రీరామకృష్ణుని తల్లి చంద్రమణీ దేవి వద్దకు వెళ్ళి "అమ్మా! మీకు ఏమి కావాలో చెప్పండి, అది మీకు ఇస్తాను" అని అన్నారు. "నాయనా! నా అవసరాలన్నీ నువ్వు తీరుస్తున్నావు. ఇంకా నాకేం కావాలి? ఏమీ అవసరం లేదు" అని చంద్రమణీ దేవి బదులుచెప్పారు. మధుర బాబు తన వద్ద నుండి ఏదైనా తీసుకోవాల్సిందిగా చంద్రమణీదేవిని బ్రతిమాలాడు. ఆయన మాట కాదన లేక "ఓ అణా ఖరీదుచేసే పొగాకు ఇవ్వు" అన్నారు చంద్ర మణీ దేవి. అది విన్న మధురబాబు కన్నీళ్ళు కారుస్తూ ఆమె పాదాలకు ప్రణమిల్లి "అమ్మా! శ్రీరామకృష్ణులకు మీ లాంటి త్యాగమూర్తి కాక మరెవ్వరు జన్మనివ్వగలరు" అంటారు.

శ్రీరామకృష్ణుల తల్లి చంద్రమణీ దేవి అంతటి నిస్వార్థ మూర్తి కాబట్టే శ్రీరామకృష్ణులు కూడా అలాంటి మహోన్నత సుగుణాన్ని అలవరచుకోగలిగారు.

తల్లితండ్రులు తమ పిల్లలకు ధర్మాన్నీ, త్యాగాన్నీ, సేవా భావాన్నీ ఆచరించి చూపిన నాడే పిల్లలు ఆ సుగుణాల్ని ఇనుమడింపజేసుకోగలరు.

ఒకసారి ఓ ఇల్లాలు అందరికీ పింగాణి పళ్ళెంలో అన్నం వడ్డిస్తోంది. వృద్ధుడైన మామగారు, భర్త, పిల్లలకు అన్నం వడ్డించి తాను తినబోతుండగా, హఠాత్తుగా వృద్ధుని చేతిలోని పళ్ళెం జారిపడి పగిలి పోయింది. ముక్కలైన పళ్ళెం, చిందరవందరైన భోజనం చూసి కొడుకు కోపంతో తండ్రిపై విరుచుకుపడ్డాడు. మరుసటి రోజు నుంచి తమకు దూరంగా కూర్చొని తినాల్సిందిగా హెచ్చరిస్తూ, ఒక చెక్క కంచం తయారుచేయించి ఇచ్చాడు. అప్పటి నుంచి ఆ ఇంట్లో వృద్ధుడు చెక్కకంచంలో ఓ మూల కూర్చొని భోజనం చేస్తూ వచ్చాడు. ఒక రోజు ఆ వృద్ధుడి మనుమడు వరండాలో ఓ చెక్కముక్కను తెచ్చుకొని చెక్కుతూ ఏదో తయారు చేస్తున్నాడు. ఇంతలో తండ్రి బయట నుంచి వచ్చాడు. కొడుకు చేస్తున్న పనిని గమనించి దగ్గరకు వచ్చి ''ఏం చేస్తున్నావు బాబూ'' అంటూ దగ్గరకు తీసుకున్నాడు. అప్పుడు ఆ అబ్బాయి "నీకే నాన్నా! చెక్క కంచం! నువ్వు తాతయ్యలా పెద్దయ్యాక నీకూ కావాలిగా..!" అంటూ తిరిగి పనిలో నిమగ్నమయ్యాడు. ఒక్క సారిగా ఆ తండ్రికి కనువిప్పు కలిగింది. ఆ రోజు నుంచి తాను చేసిన తప్పును సరిదిద్దుకొని తండ్రిని ప్రేమగా చూసుకున్నాడు.

బాల్యం నుండీ పిల్లల్ని సన్మార్గంలో నడిపించే బాధ్యత తల్లితండ్రులదే. పిల్లల్ని సరైన రీతిలో పెంచకపోతే వారు చేసే తప్పులకు తల్లితండ్రులే బాధ్యులవుతారు. కాబట్టి తల్లితండ్రులు నీతివర్తనులై, ఆదర్శవంతమైన జీవితాన్ని గడిపిననాడే పిల్లలు సద్గుణవంతులు కాగలరు.

**మాతా శత్రుః పితా వైరీ యేన బాలో న పాఠితః**
**సభామధ్యే న శోభంతే హంస మధ్యే బకో యథాః**

"పిల్లల్ని సరైన మార్గంలో పెంచని తల్లితండ్రులు తమ బిడ్డలకు శత్రుసమానులు. సన్మార్గంలో వర్తించని పిల్లలు హంసల మధ్య కొంగలా శోభ లేకుండా నిస్తేజులై ఉండాల్సి వస్తుంది" అని సుభాషిత రత్నావళి చెబుతోంది.

కన్నవారు ఏం చేస్తే పిల్లలూ దాన్నే అనుసరిస్తారు. కాబట్టి పిల్లల మనోక్షేత్రంలో సత్ప్రవర్తనా బీజాలను నాటాల్సిన బాధ్యత తల్లితండ్రులదే! పిల్లలకు వారే తొలి గురువులు. ఆ సంగతి ఈ తరం తల్లితండ్రులు గ్రహించుకుంటే నేటి బాలలే రేపటి ఆదర్శ పౌరులవుతారు. e

# గోరుముద్ద

- స్వామి సుప్రియానంద

## పొగడ్తల్లో పొంచివున్న పతనం

పొగడ్తలకు పొంగిపోవడం మానవ నైజం. పొగిడేవారుంటే, పొగిడించుకొనే వాళ్ళు సర్వదా లభ్యం. చాలాసార్లు అర్థం పర్థంలేని పొగడ్తలు కూడా మనిషి అల్పానందానికి ఆలంబనగా నిలుస్తాయి. తరువాత ఆ పొగడ్తలే అతని అహంకారాన్ని రెచ్చగొట్టి 'అవివేకి'ని చేస్తాయి.

'లేనిది' ఉన్నట్లుగా చెప్పేచాతుర్యం కొంతమందికి ఉగ్గుపాలతోనే అబ్బుతుంది. 'మసి పూసి మారేడు కాయ చేయడం' వీరు నేర్చిన 'విద్య'. దానిలో ఎనలేని తృప్తి పొందుతుంటారు.

పొగడడమే 'వృత్తి'గా చేపట్టి 'భుక్తి' గడించిన వారు 'భట్రాజులు'. అలనాటి రాజసభల్లో రాజుగారిని పొగడడానికి వీరిని వినియోగించేవారు.

ఒకసారి పొగడ్తలకు అలవాటు పడిన వారు, తమను పొగిడిన వారినే దరికి రానిస్తారు. 'పొగడ్తలు' వినకపోతే వారికి పొద్దు పోదు. పొగడ్తల సందడిలో జీవిత పరమావధినే మరిచిపోతారు. 'అంధకార' బంధురమైన ఆ జీవితంలో 'అహంకారం' విలయతాండవం చేస్తుంది.

అందువల్లే శ్రీరామకృష్ణుల వారు 'భక్తుల'ను 'భట్రాజుల' నుండి జాగ్రత్తగా ఉండమని హెచ్చరిస్తారు.

**శ్రీరామకృష్ణులు** (ఈశాన్‌తో): "ముఖస్తుతి చేసేవారి మాటలకు మైమరచిపోకు. పశువు చచ్చిపడి ఉంటే రాబందులు గుమిగూడినట్లు, వాళ్ళు విషయాసక్తులను చుట్టుకొంటారు. లౌకికులలో సారం లేదు. వారు కేవలం పేడకుప్పల లాంటి వారు! ముఖస్తుతిపరులు వీళ్ళ వద్దకు వచ్చి, 'మీరు దానశీలురు, జ్ఞానులు, ధ్యానశీలురు', అంటూ పొగుడుతారు. అవి వట్టి మాటలు కావు, బాణాలు! ఐహికులైన బ్రాహ్మణ పండితుల మధ్య రేయింబవళ్ళు ఉంటూ, వాళ్ళ పొగడ్తలు వినడం ఏం తలరాత !"

**శ్రీరామకృష్ణులు** (యదుమల్లిక్ నుద్దేశించి): "ఇంతకు ముందు భగవంతుని గురించిన విషయాలు కొంచెం వినేవాడు. ఇప్పుడు యదును ఎక్కువగా చూడ లేక పోతున్నాను. కొందరు భట్రాజులు ఎప్పుడూ అతణ్ణి అంటిపెట్టుకొని ఉంటారు. వాళ్ళు ఇతణ్ణి పూర్తిగా పాడుచేశారు". (కథామృతం 2.230)

**శ్రీరామకృష్ణులు :** ఒకరోజు నేను కేశవ్ సేన్ ఇంటికి 'నిమాయ్ సన్న్యాస' నాటక ప్రదర్శన తిలకించడానికి వెళ్ళాను. కేశవుని శిష్యభట్రాజులు కొందరు కలసి మొత్తం ప్రదర్శనను పాడుచేశారు. వారిలో ఒకడు కేశవ్‌తో 'మీరు కలియుగ చైతన్యులు' అంటూ పొగిడాడు. కేశవ్ నన్ను చూపుతూ, 'మరి ఈయన ఎవరు?' అని నవ్వుతూ అడిగాడు. అందుకు నేను ఇలా జవాబిచ్చాను: 'నేను మీ దాసానుదాసుడను. మీ పాదధూళిలో ఒక రేణువును'. (కథామృతం 1.195)

పొగడ్తలను ఎదుర్కొని భట్రాజుల నుండి మనల్ని మనం రక్షించుకోడానికి ఉపయోగించాల్సిన అస్త్రమే 'వినయం' అని సూచిస్తున్నారు శ్రీరామకృష్ణులు. వినయ శీలురు పొగడ్తలకు పొంగిపోక మరింత బాధ్యతాపరులై ఆధ్యాత్మిక చింతనతో తమ వ్యక్తిత్వానికే వన్నెతెచ్చుకొని పూజనీయులవుతారు. వారే నిజంగా శ్లాఘనీయులు. ●

### పండుగలు - పర్వదినాలు



**ఏప్రిల్ - 2007**

| | |
|---|---|
| 13 శుక్రవారం | : ఏకాదశి |
| 20 శుక్రవారం | : అక్షయ తృతీయ, సింహాచల చందనోత్సవం |
| 22 ఆదివారం | : శ్రీ శంకరాచార్య జయంతి |
| 27 శుక్రవారం | : ఏకాదశి, శ్రీ సత్యనారాయణ స్వామి కల్యాణోత్సవం |
| 30 సోమవారం | : శ్రీ నృసింహ జయంతి |

# అర్చకుని రూపంలో ఆదినారాయణుడు

- స్వామి ప్రభవానంద



స్వామి అతులానంద

గురుదాస్ మహరాజ్ (స్వామి అతులానంద), సీతాపతి మహరాజ్, నేను (స్వామి ప్రభవానంద), మరొక బ్రహ్మచారితో కలసి బద్రీనారాయణ వెళ్ళాం. మేము బద్రీనారాయణ చేరే సమయానికి యాత్రికులంతా గుడి తలుపులు ఎప్పుడు తెరుస్తారా అని ఎదురుచూస్తూ కూర్చున్నారు. మేం కూడా ఒక పక్కగా కూర్చున్నాం. ముఖంలో దివ్య తేజస్సు ఉట్టిపడుతున్న 20 – 25 సం॥ వయస్సున్న యువ అర్చకుడు సైగచేసి నన్ను పిలిచి "మీ స్నేహితులను కూడా తీసుకుని నాతో రండి" అన్నాడు. అతను మమ్మల్ని ఆలయ పక్క ద్వారం వైపు తీసుకువెళ్ళాడు. అక్కడ జనం ఎక్కువగా లేరు. ఆ యువ అర్చకుడు ఆలయద్వారం తెరవగానే అక్కడ ఉన్న యాత్రికులు కూడా లోనికి వెళ్ళబోయారు. కానీ అతను "ఇది మీ కోసం కాదు" అన్నాడు. మేము నలుగురం అతనితో పాటు లోనికి వెళ్ళాం, మా వెనక తలుపు అతను మూసి వేశాడు.



అప్పుడు అక్కడ జరిగిన సంఘటన అరుదైనది. సాధారణంగా గుడిలో అర్చకుడు దైవం వైపు తిరిగి ఒక ప్రక్కగా కానీ, ఎదురుగా కానీ నిలబడతాడు. కానీ ఈ అర్చకుడు దైవానికి ముందు మా వైపు తిరిగి నిలబడ్డాడు, ఇలా ఎక్కడా జరగదు. మేము అక్కడ కొద్ది సేపు ఉండి, దర్శనం చేసుకున్నాం. కొన్ని నిముషాల తరువాత ఆ యువ అర్చకుడు "మీకు సంతృప్తికరంగా దైవ దర్శనం అయిందా?" అని అడిగాడు. మేము ఆలయంలో నుంచి బయటకి వచ్చాం కానీ ఆ అర్చకుడు ఆలయంలోనే ఉండిపోయాడు. మేము బయటకు రాగానే మా వెనుక తలుపులు మూసుకున్నాయి.

మేము మళ్ళీ యాత్రికులతో పాటు కూర్చున్నాం. మరొక వ్యక్తి సైగచేసి నన్ను పిలిచి "మీ స్నేహితులను కూడా తీసుకుని నాతో రండి; ప్రధాన అర్చకుడు మిమ్మల్ని కలుసుకోవాలనుకుంటున్నారు" అన్నాడు. మేము లోపలికి వెళ్ళాం. ప్రధాన అర్చకుడు మమ్మల్ని ఎంతో మర్యాదగా ఆహ్వానించి తన పక్కనే కూర్చోమన్నారు. ఆయన గురుదాస్ మహరాజ్‌ను ఉద్దేశించి ఇలా ప్రశ్నించారు: "ఈయన ఏ జాతికి చెందిన వారు?" అని హిందీలో ప్రశ్నించారు. నాకు కాస్త హిందీ వచ్చు. నేను "ఒక సాధువును అతని జాతి, కులాల గురించి అడగకూడదు" అన్నాను. దానికి ప్రధాన అర్చకుడు "నాకు తెలుసు. ఆయన అమెరికా నుంచి వచ్చిన వ్యక్తి. కానీ గురుదాస్ మహరాజ్ శ్వేత జాతీయుడు కనుక మిగతా వాళ్ళు ఊరకోరు. వాళ్ళు గనక ఆయన గుడిలోకి రావడం చూస్తే, గుడిని శుద్ధి చేయించడానికి ఆయన పెద్దమొత్తం ఇచ్చుకోవాల్సి వచ్చేది" అన్నారు ప్రధాన అర్చకుడు. మేము ముగ్గురం గురుదాస్ మహరాజ్‌తో కలసి భుజించాం కనుక మా ముగ్గుర్నీ కూడా ఆలయంలోనికి రావద్దని చెప్పారు. ఆయన భగవంతునికి గంట గంటకూ హారతి ఇస్తారు. ఆ సమయంలో యాత్రికుల్ని లోపలికి అనుమతించరు.

అప్పటికే మేము గుడిలోకి వెళ్ళినట్లు ఆయనకు కానీ, వేరేవాళ్ళకు కానీ చెప్పలేదు.

బద్రీనారాయణలో ఏడెనిమిది మంది అర్చకులున్నారు. మేము వాళ్ళందర్నీ కలిశాం. అయితే మేము అక్కడకి చేరగానే మమ్మల్ని లోపలకి తీసుకుని వెళ్ళిన ఆ యువ అర్చకుడు మాత్రం మాకు ఎక్కడా కనిపించలేదు.

బద్రీనారాయణ నుంచి నేను, సీతాపతి మహరాజ్, గురుదాస్ మహరాజ్ రామకృష్ణకుటీర్‌లో ఉన్న స్వామి తురీయానందను కలవడానికి అల్మోరా వెళ్ళాం. మేము అక్కడ వారితో మూడు రోజులు గడిపాం. వారితో మా యాత్ర గురించి చెప్పాం. బద్రీనారాయణలో యువ అర్చకుడు మమ్మల్ని గుడిలోకి తీసుకుని వెళ్ళిన సంఘటన, దైవదర్శనం చేయించిన వైనం వినగానే మహరాజ్ ఉత్తేజితులై "స్వయంగా ఆ నారాయణుడే ఆ యువ అర్చకుని రూపంలో వచ్చి మిమ్మల్ని లోపలకు తీసుకువెళ్ళారని మీరు గ్రహించలేక పోయారా!" అని అడిగారు. ●



# దైవగుణ గానంతో జీవన్ముక్తి

భక్తి సంప్రదాయానికి సంబంధించిన అగ్రశ్రేణి వ్యక్తుల్లో మీరాబాయి ఒకరు. ఆమె 15వ శతాబ్దానికి చెందిన ప్రసిద్ధ కృష్ణ భక్తురాలు. శ్రీకృష్ణుణ్ణి కీర్తిస్తూ ఆమె రచించి, గానం చేసిన భజనలు ఎందరికో స్ఫూర్తి నిచ్చాయి. రాజస్థానీ కలిసిన వ్రజభాషలో ఆమె శ్రీకృష్ణుని గుణగణాలను కీర్తించారు.

రాజస్థాన్‌లోని ఓ రాజ కుటుంబంలో మీరా జన్మించింది. ఆమె బాల్యంలో ఉన్నప్పుడు రాయ్‌దాస్ అనే యోగి వారి ఇంటికి వచ్చాడు. చిన్నపిల్ల అయిన మీరాకు ఆయన ఓ శ్రీకృష్ణ విగ్రహం కానుకగా ఇచ్చాడు. అప్పటి నుంచి ఆమెకు ఆ విగ్రహమంటే పంచప్రాణాలు. మీరా ఆ విగ్రహాన్ని అలంకరించేది. పూజించేది. ఆ విగ్రహంతో ఆడుకునేది. ఒక్క ముక్కలో చెప్పాలంటే, ఆ శ్రీకృష్ణ విగ్రహమే తోడుగా జీవితం గడిపేది. ఆమె దాన్ని కేవలం ఓ ప్రాణం లేని బొమ్మ అనుకోలేదు. సాక్షాత్తూ శ్రీకృష్ణుడే సజీవంగా ఆ విగ్రహం రూపంలో ఉన్నాడని భావించేది.

కొన్నాళ్ళకు మీరాకు యుక్తవయస్సు వచ్చింది. ఆమెను చిత్తోర్ యువరాజైన భోజరాజుకు ఇచ్చి పెళ్ళిచేశారు. భోజ రాజు కుటుంబం శక్తి ఆరాధకులు. దుర్గ, కాళి, చాముండి, పార్వతి మొదలైన రూపాల్లోని అమ్మవారిని వారు ఆరాధించే వారు. దాంతో, శ్రీకృష్ణుడి పట్ల మీరా భక్తి ఆమె భర్త కుటుంబంలోని వారికి మింగుడు పడలేదు. శ్రీకృష్ణుడి పట్ల ఆమెకున్న తీవ్రమైన భక్తిని అర్థంలేని ఆరాటంగా భావించారు.

ఇది ఇలా ఉండగా, రోజురోజుకూ మీరాలో భక్తి ఎక్కువ కాసాగింది. అంతకంతకూ సాధు సన్న్యాసులు, మహాత్ముల సన్నిధిలో ఆమె ఎక్కువ సేపు గడపడం మొదలుపెట్టింది. భోజరాజు తమ రాజమందిరానికి దగ్గరలో ఆమె కోసం ప్రత్యేకంగా ఓ ఆలయాన్ని నిర్మింప జేశాడు. దాంతో, శ్రీకృష్ణుణ్ణి పూజించడానికీ, ప్రార్థించడానికీ కావలసినంత స్వేచ్ఛ మీరాకు లభించింది. గుడిలో భగవంతుని గుణగాన సంకీర్తన చేస్తూ, భక్తి పారవశ్యంలో నర్తిస్తూ, సాధువులు, మహాత్ముల సన్నిధిలోనే ఆమె రోజంతా గడిపేది. ఇది చూసిన బంధువులు ఆమెకు పిచ్చి పట్టిందనే తీర్మానానికి వచ్చారు. అయితే, సాధుసన్న్యాసులు, మహాత్ములు మాత్రం భక్తి సంప్రదాయంలో ఆమె గొప్ప యోగిని అని గుర్తించి, గౌరవిస్తూ వచ్చారు. చివరకు అక్బర్ చక్రవర్తి తన ఆస్థానంలోని ప్రముఖ సంగీత విద్వాంసుడు తాన్‌సేన్‌తో కలసి మీరాబాయిని సందర్శించినటుచెబుతారు.

ఇది ఇలా ఉండగా, సన్న్యాసులతో కలసి మీరా పాటలు పాడుతూ, నృత్యం చేస్తుండడం వల్ల తమ పరువు ప్రతిష్ఠలు మంట గలుస్తున్నాయని రాజ కుటుంబం భావించింది. ఇంతలో మీరాబాయి భర్త భోజరాజు మరణించాడు. దాంతో, భోజరాజు తమ్ముడు రాజు అయ్యాడు. అతను మీరాను వేధించడం మొదలుపెట్టాడు. ఆఖరికి ఆమె మీద విషప్రయోగం చేశాడు. కృష్ణ భక్తురాలైన మీరా మాత్రం భగవత్ ప్రసాదంగా భావిస్తూ, అన్నిటినీ అంగీకరించింది. దేనినీ నిరసించలేదు. శ్రీకృష్ణుడి కరుణతో అన్ని అపాయాల నుంచీ ఆమె క్షేమంగా బయటపడింది.

చిట్టచివరికి మీరా తన స్వామి నడయాడిన బృందావనానికి వెళ్ళింది. ఆనంద పారవశ్యం మిన్ను ముట్టగా, శ్రీకృష్ణుడి ఎదుట ఆడి పాడింది. కాగా, జీవ గోస్వామి అనే ఓ వయసు మీద పడిన వైష్ణవ సాధువు అక్కడ ఉండేవాడు. ఆయన మీరా ముఖం చూడడానికి నిరాక రించాడు. తాను ఓ సన్న్యాసిననీ, కాబట్టి స్త్రీ ముఖం దర్శించననీ పేర్కొన్నాడు. ఆ సంగతి విని మీరాకు నవ్వొచ్చింది. బృందావనంలో శ్రీకృష్ణ పరమాత్ముడు ఒక్కడే పురుషుడనీ, మిగిలినవారందరూ గోపికలేననీ ఆమె బదులిచ్చింది. ఆమె మాటలు ఆ సాధువుకు ఆశ్చర్యం కలిగించాయి. అప్పటి దాకా ఆ సన్న్యాసిని కమ్ముకొని ఉన్న మాయ కాస్తా పటాపంచలైంది.

మీరా తన జీవితకాలంలో **(మిగతా పక్క పేజీలో...)**



# శ్రీ సత్యనారాయణుని అన్న 'వరం'

- ఎ.ఎస్. మూర్తి

**ఆ**రాధనకు, అర్చనకు భారతీయ భక్తితత్త్వంలో ఎంతో ప్రాధాన్యముంది. ఇందులో భాగంగా సత్యనారాయణ స్వామి వ్రతాన్ని ప్రతి శుభకార్యాల నిర్వహణలోను ఆచరిస్తుంటారు. శ్రీసత్యనారాయణస్వామి అన్నవరంలో వెలసి పూజలందు కుంటున్నారు. తూర్పు గోదావరి జిల్లాలోని రత్నగిరిపై వెలసిన శ్రీ వీరవెంకట సత్యనారాయణ స్వామి దేవాలయం దేశంలోనే ప్రసిద్ధి చెందినది. పరమ భాగవతోత్తముడైన నారదుడు ఒకసారి భూలోక సంచారం చేస్తూ భరత ఖండంలోని కరువుకాటకాలకు, మతవిద్వేషాలకు ఖిన్నుడై నారాయణుని వేడుకున్నాడట. పూర్వస్థితి మాదిరి భరత ఖండం పాడి ఆవులా విలసిల్లాలని ప్రార్థించాడట. నారదుని ప్రార్థనను మన్నించి శ్రీహరి త్రిమూర్తిరూపంలో ప్రత్యక్షమై అక్కడే నెలకొని ఆ ప్రాంతాన్ని సుభిక్షం చేస్తానని వర మిచ్చాడట. అదే అన్నవరం. ఆ వరానికి అనుగుణంగా శ్రీమన్నారాయణుడు రమణీయ ప్రకృతిశోభతో విరాజిల్లే తూర్పుకనుమల మధ్య, పంపానదీ తీరంలో రత్నగిరిపై శ్రావణశుద్ధ విదియనాడు లక్ష్మీసత్యవతి సమేతంగా వెలిశాడు. పరాయణి అనే భక్తునికి స్వప్నంలో దర్శనమిచ్చి ఆ కొండపై ఒక అంకుడుచెట్టు మూలంలో వెలసిన తమను వెలికి తీసి మహామంత్రంతో పాటు ప్రతిష్ఠించి అర్చిం చాల్సిందిగా ఆదేశించాడు. స్వామివారి ఆదేశం మేరకు ఆ భక్తుడు అనంతలక్ష్మీ సత్యవతీ సమేత శ్రీసత్యనారాయణ స్వామి వారిని దేవాలయంలో ప్రతిష్ఠించి ఆరాధించ సాగాడు. స్వామివారి మహిమ నలువైపులా వ్యాపించి సత్యనారాయణుని ఆశీస్సులకు, అనుగ్రహానికి విశ్వవ్యాప్తి కలిగింది. శ్రీసత్యనారాయణ స్వామి అనంతలక్ష్మీ సత్య వతీదేవిని పరిణయమాడిన వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు ప్రతి సంవత్సరం స్వామివారి కల్యాణోత్సవం వైభవో పేతంగా నిర్వహించడం ఆనవాయితీగా వస్తోంది. అనంత ప్రతిభాసమన్వితుడైన స్వామి వద్ద ప్రతిష్ఠితమైన మహాయంత్రంలో స్వామి వారి చుట్టూ మహేశ్వరుడు, బాలా త్రిపురసుందరి, గణపతి, సూర్యుడు ప్రతిబింబిస్తూ సుసంపన్నం చేస్తున్నారు. అందుకే అన్నవరం సత్యనారాయణ స్వామి వ్రతం చేయని గృహం ఉండదు. ఆ స్వామి కల్యాణోత్సవంలో పాల్గొని తరించని భక్తుడు ఉండడు అంటే అతిశయోక్తి కాదు. చైత్రమాసంలో తెలుగువారు జరుపుకునే ఉగాది, శ్రీరామనవమి పండుగల అనంతరం వైశాఖమాసంలో శుద్ధ ఏకాదశి నాడు స్వామివారి కల్యాణం వైభవంగా నిర్వహిస్తారు. e

**(...8వ పేజీ తరువాయి)** ఎందరో మహాత్ములనూ, కవులనూ కలుసుకొంది. కాగా, ఆమె స్వస్థానమైన రాజస్థాన్‌లో కాలక్రమంలో రాజకీయపరమైన మార్పులు సంభవించాయి. ఉదయ సిన్హా అనే వ్యక్తి రాజ్యాధికారం చేపట్టాడు. రాచనగరుకు తిరిగి రావాల్సిందిగా మీరాను అభ్యర్థిస్తూ, ఆయన దూతలను పంపాడు. అయితే, శ్రీకృష్ణ భగవానుణ్ణి విడిచిపెట్టి వెనక్కు వెళ్ళడం ఆమెకు ఇష్టం లేకపోయింది. దూతలను ఆలయం దగ్గరే వేచి ఉండాల్సిందిగా చెప్పిన మీరా తాను ఆలయం లోపల ప్రవేశించింది. అయితే, మరునాడు ఉదయం వెతికితే, మీరా ఎక్కడా కనిపించలేదు. ఆ శ్రీకృష్ణ పరమాత్మలోనే ఆమె లీనమైపోయి ఉంటుందని భక్తులు నిర్ధారించుకున్నారు.

మీరా రచించి, పాడిన భజనలు దాదాపు 400 దాకా ఉన్నాయి. ఆరాధ్యదైవమైన శ్రీకృష్ణుణ్ణి కీర్తిస్తూ మనసును కదిలించేలా ఆమె రాసిన ఆ పాటలు ఎంతోమంది హృదయాలను గెలుచుకున్నాయి. అందుకే, ఈ రోజుకూ భక్తుల మనసుల్లో, మాటల్లో మీరా చిరస్థాయిగా నిలిచిపోయింది. e

ఆంగ్లమూలం : డాక్టర్ ఎస్. రమణి     అనువక్త : రెంటాల జయదేవ

# శివమహిమ్నః స్తోత్రం

వ్యాఖ్యాత : సామవేదం షణ్ముఖ శర్మ     విలేఖనం : శ్రీమతి ఎన్.శేషు

(గత సంచిక తరువాయి)

**భవః శర్వో రుద్రః పశుపతిరథోగ్రః సహమహాం -**
**స్తథా భీమేశానావితి యదభిధానాష్టకమిదమ్।**
**అముష్మిన్ ప్రత్యేకం ప్రవిచరతి దేవ శ్రుతిరపి**
**ప్రియాయాస్మై ధామ్నే ప్రణిహిత నమస్యో - స్మి భవతే ॥28॥**

ఇంతవరకూ పరమేశ్వరుని స్వరూపం చెప్పి ఇంక పరమేశ్వరునికి నమస్కారాలు ప్రారంభిస్తున్నారు. ఇక్కడ నుండి రుద్ర నమకం ప్రారంభమవుతుంది. వేదంలో రుద్రనమకం అని మంత్రాలున్నాయి, అందులో విడివిడిగా నమస్కారాలు చెప్పి చివరకి మొత్తంగా ఉన్న రుద్రునికి నమస్కారం అన్నారు. అదే **సమస్తవ్యస్తం** అన్నది. రుద్ర నమకమంతా **ప్రణవ** స్వరూపాన్ని తెలియజేస్తుంది. ఇక్కడ నుంచి నమకం ప్రారంభిస్తూ **నమస్యో - స్మి భవతే** - స్వామీ! నీకు నమస్కారం అన్నారు.

**భవః శర్వో రుద్రః పశుపతి రథోగ్రః సహ మహాం స్తథా భీమేశానా** భవ, శర్వ, రుద్ర, పశుపతి, ఉగ్ర, మహాదేవ, భీమ, ఈశాన అనే ఎనిమిది పేర్లతో (ప్రధానంగా) ఉన్న నీకు నమస్కారం. **యదభిధానాష్టకమిదం** = ఆ పరతత్త్వం యొక్క 8 పేర్లు ఇవి (అభిధానం = పేర్లు); **అముష్మిన్ ప్రత్యేకం ప్రవిచరతి దేవ**= ఓ దేవా! ఒక్కొక్కదాన్నీ ప్రత్యేకంగా పేర్కొన్నది; (ఎవరు పేర్కొన్నారు అంటే) **శ్రుతిరపి** = వేదం కూడా ---- ఈ పేర్లను వేదం కూడా ఓ దేవా! అని ప్రత్యేకంగా సంబోధించి చెప్పింది.

పైన చెప్పిన ఎనిమిది పేర్లూ అష్ట మూర్తుల పేర్లు. భవ అంటే జలస్వరూపుడైన రుద్రుడు. భవ అంటే కలుగుట, కలిగించుట. జలం నుండే సమస్తం వచ్చింది కదా! *భవాయ జలమూర్తయే నమః; శర్వాయ క్షితి మూర్తయే నమః* (శర్వ = భూమి); *రుద్రాయ అగ్ని మూర్తయే నమః; ఉగ్రాయ వాయుమూర్తయే నమః; భీమాయ ఆకాశమూర్తయే నమః; ఈశాన సూర్యమూర్తయే నమః; మహాదేవాయ చంద్ర మూర్తయే నమః; పశుపతయే యజమాన మూర్తయే నమః* ...... ఆయన పశుపతి. ఇదంతా ఆయన కాదనుకోవడం పశుత్వం; ఇదంతా ఈశ్వరుడే అని తెలుసుకోవడం పశుపతి జ్ఞానం. ఆత్మజ్ఞానమే పాశుపతం. ఆత్మగా మనలో ఉండేవాడు ఆయనే. మన ఇంద్రియాలన్నిటినీ ఒక్క తాటితో కట్టి నడిపే వాడు పశుపతి. అష్టమూర్తి ఉపాసనకీ, ప్రణవోపాసనకీ ఈ నామాలతో సంబంధం ఉంది. (వీటికి) ప్రత్యేకం దేవ = ప్రతి దానికీ దేవ (శబ్దం) కలుపు. ఒక్కొక్క దానికీ దేవ కలిపి పూజచేసే విధానం ఉంది. అది - భవాయ దేవాయ నమః, శర్వాయ దేవాయ నమః, ఈశానాయ దేవాయ నమః, పశుపతయే దేవాయ నమః, రుద్రాయ దేవాయ నమః, ఉగ్రాయ దేవాయ నమః, భీమాయ దేవాయ నమః, మహతే దేవాయ నమః (మహాదేవాయ నమః) - ఇలా ఎనిమిది నామాలతో శివుణ్ణి పూజిస్తే ఆయన ఎనిమిది స్వరూపాలతో అనుకూలిస్తాడు. ఈ ఎనిమిదిలో శివ నామం లేదు; అయితే ఈ ఎనిమిదీ ఎవరో ఆయనే శివుడు కనుక అన్నీ అయ్యాక శివాయ నమః నమః శివాయ అని ముగించాలి.

**ప్రియాయాస్మై ధామ్నేప్రణిహిత నమస్యో - స్మి భవతే** - భవతే = నీకు; ప్రియాయ = ప్రియమైన నీకు నమస్కారం అన్నారు. అంటే భగవంతుణ్ణి ప్రియమైన వాడా (నాకిష్టమైనవాడా) అని నమస్కరించాలి. అందుకే వేదం -"బ్రహ్మేష్టం శరణ ముపగమ్య = ఇష్టమైన బ్రహ్మమును శరణువేడు" అంది. వేదం "ప్రియాణాంత్వా ప్రియపతీహం హవామహే - ప్రియముగా ఉన్నవాడు, ప్రియమైనవాడు - ఆయనకి నమస్కారం" అంది. ప్రియము అంటే ఇష్టం, ఏదయితే ఆనందం కలిగిస్తుందో అది ఇష్టం. ఏది ఉండడం వలన ఈ విశ్వమంతా చైతన్యవంతమవుతోందో ఆ పరబ్రహ్మమే ఇష్టం. దానిమీద ఇష్టం పట్టనివ్వకుండా చేసేది తామసవృత్తి. తామసవృత్తి వదిలితే దానిమీద ఇష్టం కలుగుతుంది; దాని మీద ఇష్టం కలిగితే కానీ తామసబుద్ధి పోదు! భగవంతుడి మీద భక్తి కలిగితే కానీ తమస్సుపోదు, తమస్సుపోతే గానీ భక్తి కలగదు అందుకు "నువ్వు ఎలాగో ఒకలాగ ఇష్టం తెచ్చుకో, అప్పుడు అది ఇంకా లభిస్తుంది. నీ ఇష్టం పెరుగు తున్న కొద్దీ అది పెరిగి పెరిగి అదే ఇష్టమనే స్థితికి వస్తావు. అందుకు పరమేశ్వరుణ్ణి ఇష్టంగా, ప్రియంగా శరణు వేడాలి అని చెబుతున్నారు. మనకి పరమేశ్వరుని కన్నా ప్రియమైనదేదీ లేదు; ఆ పరబ్రహ్మతత్త్వమే సత్యం. ఆ సత్యమైన వస్తువే ధామం. ధామం అంటే కాంతి మయం.

**నమో నేదిష్ఠాయ ప్రియదవ దవిష్ఠాయ చ నమో**
**నమః క్షోదిష్ఠాయ స్మరహర మహిష్ఠాయ చ నమః ।**
**నమో వర్షిష్ఠాయ త్రినయన యవిష్ఠాయ చ నమో**
**నమః సర్వస్మై తే తదిదమతిసర్వాయ చ నమః ॥29॥**

ఈ శ్లోకంలో ఎనిమిది స్వరూపాలతో విశ్వమంతా

వ్యాపించి ఉన్న ఈశ్వరుడికి నమస్కారం చూపిస్తున్నారు.

**నేదిష్ఠ** = దగ్గరవాడు, అతి దగ్గర వాడవైన నీకు నమస్కారం; **దవిష్ఠాయ** = దూరంగా ఉన్న నీకు నమస్కారం. గ్రహించ లేక పోయిన వాడికి భగవంతుడు దూరం వాడు. గ్రహించే వాడికి దగ్గరవాడు. దగ్గరైనా దూరమైనా ఆయన మాత్రం ఒక్కడే. **ప్రియదవ** – ప్రియంగా ఉన్న వాడు అని ఒక అర్థం. అడవిని ప్రేమగా చూసుకునే వాడా అని మరొక అర్థం.ఏ ఒక్కటీ అంటకుండా, ప్రపంచంతో పనిలేనివాడు అడవుల్లో ఉంటాడు, ఋషుల లాగ; అందుకు అతి దగ్గరగా, అతి దూరంగా ఉన్నవాడు ఎక్కడున్నాడంటే..... ప్రియదవ – నీ హృదయమనే గుహలో ప్రియంగా ఉన్నాడు. ఏ అలజడులూ, అల్లకల్లోలాలూ లేని చోట. లోపల ఉన్న వాడిని అలజడులూ, అల్ల కల్లోలాలూ ఉన్నందు వలన మనం తెలుసు కోలేక పోతున్నాము. మనం అలజడులూ అల్లకల్లోలాలూ ఆపితే లోపల ఉన్నవాడిని తెలుసు కోగలం. నమోనేదిష్ఠాయ ప్రియదవ దవిష్ఠాయ చ నమః అంటే దూరంగా ఉన్నవాడవు, దగ్గరగా ఉండే వాడివీ కూడా నువ్వే కనుక దగ్గరుండి రక్షించ గల వాడవు నువ్వే, దూరంగా ఉండి రక్షించగలిగే వాడవూ నువ్వే అంటే దగ్గరగా వచ్చిన కర్మ ఫలాన్ని, కర్మ బంధాన్ని ఆయనే నాశనం చేస్తాడు; మనం అనుభవించ వలసిన కర్మ బంధాన్ని కూడా ఆయనే నాశనం చేస్తాడు. **నమః క్షోదిష్ఠాయ స్మరహర మహిష్ఠాయ చ నమః** – నమః క్షోదిష్ఠాయ = అత్యంత సూక్ష్మమైన నీకు నమస్కారం, మహిష్ఠాయ చ నమః = మహా స్వరూపుడవైన నీకు నమస్కారం. వేదం శివుడు ఎలా ఉన్నాడని చెబుతోందంటే.. *"నమః కిగుం శిలాయ చ క్షయణాయ చ, నమః పాగం సవ్యాయ చ రజస్యాయ చ"* పాగంసవ్యాయ (పాంసవ్యాయ) = పరమాణువు, రజస్యాయ =దుమ్ము ధూళి–పరమాణువులో ఉండే రుద్రునికి నమస్కారం, దుమ్ము ధూళిలో ఉండే రుద్రునికి నమస్కారం. శివుడికి మనిషి, దుమ్ములో ఉండే అతి సూక్ష్మమైన పురుగు కూడా అంతే. ఏ జీవుడికి ఏ గతి ఇవ్వాలో వాటికి తగ్గ వాతావరణం సృష్టించే పని ఆయనది. నమః కిగుం శిలాయ చ క్షయణాయ చ – చిన్న చిన్న రాళ్ళలో ఉండేవాడు. ప్రతి అణువులో ఉండే శివునికీ నమస్కారం చేస్తే ఏ అణువు నుంచీ ప్రమాదం రాదు. ప్రతి అణువులోనూ శివుడు ఉన్నాడనే వాడిని ప్రతీ అణువులో నుండీ శివుడు రక్షిస్తాడు అని రుద్రం చెబుతోంది. **నమో వర్షిష్ఠాయ** =అతి పెద్ద వాడవైన నీకు నమస్కారం. శివుడి పేరులోనే పితా మహాయ నమః అన్నారు. **య వి ష్ఠాయ చ నమః** = అతి చిన్నవాడవైన నీకు నమస్కారం పెద్ద వాడూ ఆయనే చిన్న వాడూ ఆయనే. ఏ అవస్థలో ఆ అవస్థారూప చైతన్యం ఉండాలి. అందుకే వేదం "నమో జ్యేష్ఠాయ చ కనిష్ఠాయ చ నమః పూర్వ జాయచ" అని చెప్పింది. మొదట ఉండే వాడాయన. అతి పెద్ద వాడు, బాలుడు కూడా ఆయనే. వేదం "నమో వృద్ధాయ చ సంరుధ్వనేచ బృహతేచ వర్షీయ సేచ" అంది. బృహతేచ – పెద్దగా ఉండేవాడు, వర్షీయసేచ = ఎప్పటివాడో, అతి నూతనుడూ ఆయనే, అతి పురాతనుడూ ఆయనే. అన్నీ ఆయనే. ఆయన లేని కాలం లేదు, ఆయనలేని అవస్థలేదు. విశ్వానికి ముందున్న వాడూ ఆయనే, విశ్వానికి వెనుక ఉన్నవాడూ ఆయనే; ఆది ఆయనే, అంతం ఆయనే. **నమః సర్వస్మైతే** =అన్నీ అయిన వాడయిన నీకు నమస్కారం; **తదిదమితి సర్వాయ చనమః** = అంతా అయిన వాడికి నమస్కారం. అంటే విడి విడిగా ఉన్న నీకు నమస్కారం, ఏకమై ఉన్న నీకు నమస్కారం. **తదిదమతి – తత్** = (బ్రహ్మము) అది; ఇదం = ఇది (దృశ్యప్రపంచం) ఇతి = శివుడే – బ్రహ్మము, జగత్తు–ఈ రెండూ కూడా ఇతి (అంటే శివుడే) తదిదమతి సర్వాయచ = తత్ – బ్రహ్మము, ఇదం – విశ్వం, ఇతి – మాయ – ఈ మూడుగా ఉన్న సర్వాయచ నమః. = అంతా అయిన ఆ శివునకు నమస్కారం.



***(తరువాతి శ్లోకం వివరణ వచ్చే సంచికలో...)***



# బగళాముఖి రూపంలో బండ్లమ్మ

- భండారు పర్వతాలరావు

చందవోలు ప్రాంతాన్ని పాలించిన చోళరాజులలో ఒకరు శివాలయాన్ని నిర్మించాలని సంకల్పించి బండ్ల నిండుగా రాళ్ళు తెప్పించాడు. అయితే ఆ బండ్లు ఊరి బయటనే నిలచిపోయాయి. ఎంత ప్రయత్నించినా ఎడ్లు ముందుకు కదల లేదు. కొందరు దైవజ్ఞులు ఆ రాజుతో గ్రామానికి రక్షగా ఉన్న అద్భుత శక్తి మాహాత్మ్యమిదని చెప్పారు. అప్పుడు అక్కడ తవ్వించగా జగన్మాత విగ్రహం బయటపడింది. ముందు అమ్మవారిగుడి కట్టించి, ఆ పైనే రాజు శివాలయం నిర్మించాడు. అమ్మ వారి విగ్రహాన్ని వెలికి తీసేందుకు తవ్విన కందకంలో నీరు ఊరింది. రాజు దానినొక బావిగా వెడల్పు చేసి, కట్ట కట్టించాడు. బండ్లు నిలచిపోగా దొరకిన అమ్మవారు కనుక 'బండ్లమ్మ' అని అమ్మవారిని పిలుస్తున్నారు. ఆ బావిని కూడా 'బండ్లమ్మ బావి' అంటున్నారు.

ఈ విధంగా బయటపడి పూజలందుకొనే బండ్లమ్మ విగ్రహం దశమహావిద్యలలో ఒకటైన 'బగళాముఖి' అని అంటారు. బగళాముఖి ఆలయాలు తెలుగునాట అరుదు. ఈ విగ్రహం విశిష్టత ఏమిటంటే, అమ్మవారు తన ఎడమ భుజంపై శివలింగాన్ని ధరించి ఉండడం. ఇలా అమ్మవారి విగ్రహగతంగా శివలింగం ఉండడం ఎంతో అరుదు.

శ్రీవిద్యోపాసకులైన శ్రీ చందవోలు రాఘవ నారాయణ శాస్త్రిగారికి బండ్లమ్మ కలలో కనిపించి, తన దేవళానికి ప్రాకారం కట్టించమని కోరిందట. ఆయన పూనికపై భక్తులంతా కలిసి ప్రాకారాదులను నిర్మించారు.

శాస్త్రిగారు తమ భౌతిక కాయాన్ని విడిచి నప్పుడు దహనసమయంలో ఒక విలేఖరి ఫోటో తీయగా చితా ధూమంలో పంచ రంగుల్లో సర్వాభరణ భూషిత అయిన అమ్మవారు సాక్షాత్కరించడం కనిపించింది. ఆ ఛాయా చిత్రాన్ని ఆంధ్రప్రభ దినపత్రిక అప్పట్లో ప్రచురించింది. అది సంచలనం రేపింది.

2002 నవంబర్ 11న ముఖ మండప నిర్మాణానికి పునాదులు తవ్వుతుండగా ఏనాడో ఏ మహారాజులో అమ్మవారి కోసం చేయించిన అమూల్య ప్రాచీన సువర్ణాభరణాలు దొరికాయి. వాటిని అమ్మవారి విగ్రహానికి అలంకరించగా అవి సరిగ్గా సరిపోవడం ఒక అద్భుతం.

ఈ ఆలయం బాపట్ల – రేపల్లె రహదారిలో బాపట్లకు 17 కి.మీ దూరంలో ఉంది. e




వ్యక్తి స్వభావం మారేవరకూ దుఃఖాలు సదా కలుగుతూనే ఉంటాయి. ఎలాంటి భౌతిక సహాయమైనా దానిని పూర్తిగా తొలగించలేదు. మానవుణ్ణి పవిత్రుణ్ణి చేయడం ఒక్కటే ఈ సమస్యాపరిష్కారానికి మార్గం. లోకంలో కనిపించే చెడు అంతా అజ్ఞాన ప్రభావమే. మానవుడు జ్ఞానిగా, విశుద్ధునిగా, బలాఢ్యునిగా, విద్యావంతునిగా అయిన తరువాతే లోకంలోని దుఃఖం నివర్తిల్లుతుంది. ప్రతి ఇంటినీ మనం ధర్మసత్రంగా మార్చినా, దేశాన్నంతా చికిత్సాలయాలతో నింపినా, మానవుడి శీలం మార్పు చెందే వరకూ అతడి దుఃఖం ఉంటుంది.



ప్రతిపనిలోనూ మంచీ చెడుల కలయిక ఉండక తప్పదు. సత్కర్మ వలన సత్ఫలం, దుష్కర్మవలన దుష్ఫలం కలుగుతాయి. కానీ మంచి చెడులు రెండూ ఆత్మకు బంధాలే. కర్మచేస్తూ కర్మ ఫలాలలో మనం ఆసక్తులం కాని యెడల కర్మలు మనల్ని బంధింపలేవనేదే భగవద్గీతలో తెలుపబడిన తరణోపాయం. నిష్కామకర్మాచరణ అంటే ఏమిటో గ్రహించడానికి ప్రయత్నిద్దాం.

“తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర”. నిరంతరం కర్మలు ఆచరించు. కానీ వాటిలో ఆసక్తుడవు కావద్దు అనేదే భగవద్గీతలోని ముఖ్యాంశం. సంస్కారం అంటే అంతరప్రవృత్తి అని చెప్పవచ్చు. చిత్తాన్ని సరోవరంతో పోలిస్తే అందులో ఉదయించిన ప్రవృత్తి వీచిక ఒక రకమైన జాడను కలుగజేస్తుంది. అలాంటి జాడే ‘సంస్కారం’ అంటాం. మనం చేసే ప్రతి కార్యమూ, శరీరంలోని ప్రతి చలనమూ, మనం చేసే ప్రతి ఆలోచనా మనసులో ఇలాంటి సంస్కారాన్ని కలిగిస్తుంది. ఈ సంస్కారాలు మనకు పైకి కనబడకపోయినా అంతర్గతంగా ఉంటాయి. ఇప్పుడీ క్షణంలో నా స్థితి, ఇంతకు క్రితం నా జీవితంలో ఏర్పడివున్న సంస్కారాల సాముదాయక ఫలితం. నిజంగా శీలమంటే ఇదే. ప్రతి మానవుడి శీలాన్నీ ఈ సంస్కారాలే నిర్ణయిస్తాయి. మంచిసంస్కారాలు ప్రబలంగా ఉంటే శీలం మంచి దవుతుంది. చెడు సంస్కారాలు ప్రబలంగా ఉంటే స్వభావం చెడ్డదవుతుంది. ఒక వ్యక్తి సదా చెడు మాటలు వింటూ, చెడు ఆలోచనలు చేస్తూ, చెడు పనులను చేస్తూ ఉంటే దుష్ట సంస్కారాల చేతుల్లో అతడొక యంత్రంగా మారి పాపం చేయడానికి అవి అతడిని పురిగొల్పుతాయి. అలాగే మంచి పనులు చేస్తున్నప్పుడు వాటివలన కలిగే సంస్కారం మొత్తం మంచిదవడంతో అతడు సంకల్పించుకున్నా సత్కార్యాలను చేసి తీరుతాడు. ఒక వేళ చెడు చేయాలని అతడు కోరినా, మంచి సంస్కారాల ఫలితంగా అతడి మనస్సు అలా చేయనివ్వదు. మంచి సంస్కారాలు అతడి బుద్ధిని మరలుస్తాయి. అలాంటి వ్యక్తిలో సచ్ఛీలం సుప్రతిష్ఠితమై ఉన్నదని చెప్పవచ్చు.

**(స్వామి వివేకానంద సాహిత్య సర్వస్వం ‘లేవండి! మేల్కొనండి’ నుంచి)**



సమత్త్వమే
# యోగం

- ప్రవ్రాజిక బోధమయ ప్రాణ

**(2006 డిసెంబర్‌లో అనంతపురంలో జరిగిన 'భక్తసమ్మేళనం'లో చేసిన ప్రసంగం ఇది)**

**(గత సంచిక తరువాయి)**

సర్వకాల సర్వావస్థల్లోనూ మనస్సు నిశ్చలంగా, ప్రశాంతంగా ఉండడమే సమచిత్తత్వం. అప్పుడు బాహ్య వాతావరణంలో, పరిస్థితులలో మార్పు ఏ విధంగా ఉన్నా ఆ మార్పు మన మనస్సును ప్రభావితం చేయలేదు.

ఈ సమచిత్తం గురించి గీతలో ఇలా చెప్పారు:

**దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగత స్పృహః।**
**వీతరాగ భయ క్రోధః స్థితధీర్ముని రుచ్యతే ॥**

దుఃఖాలకు క్రుంగిపోక, సుఖాలకు పొంగిపోక ఆసక్తి, భయక్రోధాదులు వీడడమే సమచిత్తత్వం. అటువంటి వాడి మనస్సు నిశ్చలంగా ఉంటుంది.

ప్రియాప్రియాలలోను, నిందాస్తుతులలోను, మానావమానాల్లోను, మిత్రులయందు, శత్రువులయందు సమభావంతో ప్రవర్తించడమే సమచిత్తత్వం.

సుఖదుఃఖాలు, నిందాస్తుతులు, జయాపజయాలు ఇటువంటివి ప్రాపంచిక ద్వంద్వాలు. 'ఆగమాపాయినో నిత్యా' ఎప్పుడూ వచ్చిపోతుంటాయి. మామూలు మనిషి ఈ ద్వంద్వాలకు పొంగుతూ క్రుంగుతూ అస్థిర మనస్కుడై ఉంటాడు. యోగి మనస్సు విభిన్న పరిస్థితుల్లోను, అనుభవాలలోను చలించకుండా స్థిరంగా ఉంటుంది. పరిస్థితులు మారవు. మనమే మారాలి.

శారదమ్మ జీవితాన్ని తీసుకున్నట్లయితే ఆమె తన జీవితంలో ఎదురైన ప్రతి సంఘటననూ, పరిస్థితినీ తనకు అనుగుణంగా ఉండేటట్లు జీవిత లక్ష్యాన్ని సాధించేందుకు సహాయపడేటట్లు మలచుకోవడం చూస్తాం.

ఆమెదొక విచిత్ర సంసారం. జయరాంబాటీలో కానీ, కలకత్తాలో కానీ నివసించిన రోజుల్లో చీటికీ మాటికీ తగవులు పెట్టుకొనే తమ్ముళ్ళు, మరదళ్ళు, మేనకోడళ్ళ మధ్య ఆమె కాపురం సాగేది. దానికి తోడు విభిన్న మనస్తత్త్వాలు కలిగిన భక్తులు, సన్న్యాసులు, బ్రహ్మచారులు ఆమె వద్దకు వచ్చి పోతుండేవారు. ఆమెను దేవతగా భావించి పూజించే భక్త బృందం ఒక వైపయితే, ఆమెతో కయ్యానికి కాలుదువ్వే బంధు వర్గం మరోవైపు ఉండేది. ఇటువంటి కురుక్షేత్ర పద్మ వ్యూహంలో నివసిస్తున్నా ఆమె మనస్సు ఎప్పుడూ ప్రశాంతంగా, ఆనందంగా ఉండేది. ఇతరులకు ఆనందాన్ని అందించగలిగేది. భక్తుల వద్ద పూజలందుకున్నంత సహజంగానే ఈ దేవత తన మరదలు, మేనకోడళ్ళ ఆగడాలను సహించేవారు.

మనస్సును అదుపులో పెట్టుకోవడం ద్వారానే సమచిత్తత్వం సాధ్యమవుతుంది. మనం బయటి యంత్రాలను అదుపులో పెట్టడం నేర్చుకున్నామే గానీ, మనకు అతి సమీపంలో ఉన్న అతి సున్నితమైన దేహ యంత్రం మొద్దుబారిపోతున్నా పట్టించుకోవడంలేదు. దీన్ని కొద్దిగానైనా అలవరచుకున్నప్పుడే మనం ప్రశాంతంగా ఉండగలుగుతాం. మనచుట్టూ ఉన్న వారికి కూడా శాంతి కలుగుతుంది. అలాగే మనస్సును నియంత్రించడం ద్వారా అది శుద్ధమై భగవదున్ముఖ మవుతుంది. భగవదున్ముఖమైన మనస్సు ఎప్పుడూ ప్రశాంతంగా ఉంటుంది. అదే అమ్మ జీవితం మనకు నేర్పే పాఠం.

ఈ విధంగా ప్రశాంతమైన, నిశ్చలమైన మనస్సున్న వ్యక్తి స్థిరంగా ఏ పనైనా చేస్తాడు. ఉద్రేకం, ఆర్భాటం వల్ల అశాంతే గానీ పని జరగదు. మామూలుగా మనకు కొంచెం పనిచేసే టప్పటికే అలసట కలుగుతుంది. పని ఇంకొంచెం ఎక్కువైతే ఒత్తిడి, ఘర్షణ, విసుగు కలిగి, పని నిబద్ధత తగ్గిపోతుంది. అయితే ఏ విధమైన ఘర్షణ లేకుండా మృదువుగా, సమర్థంగా కార్యాన్ని నిర్వహించడమే యోగం. అందుకే గీతలో యోగానికి ఇచ్చిన మరొక అద్భుత నిర్వచనం –"యోగః కర్మసు కౌశలం". కర్మాచరణలో సమర్థతే యోగం.

అందుకే అమ్మ జీవితాన్ని చూసినట్లయితే, ఆమె ఉదయం నుండీ రాత్రి వరకూ ద్వంద్వాలతో కూడిన సంసారంలోనే ఉండేవారు. కానీ ఆమె మనస్సులో ఒక భాగం ఎప్పుడూ భగవత్ చింతనలోనే ఉండేది. కాబట్టి ఆమె మనసు సదా ప్రశాంతంగా, ఆనందంగా ఉండేది. దక్షిణేశ్వరంలో ఉన్న సమయంలో కూడా ఆమె రేయింబవళ్ళు శ్రీరామకృష్ణుల

భక్తుల సేవలోనే గడిపేవారు. 'ఆనందంతో నిండిన పూర్ణ కలశం నా హృదయంలో ఉన్నట్లుండేది' అనేవారు. ఆ కాలంలోనే ఆమె ఒక లక్ష నామజపం చేసేవారు. ఈనాడు మనం గురువు నిర్దేశించిన 108సార్లు జపం చేసుకోవడానికి కూడా సమయం చాలక పాట్లు పడుతున్నాం. శ్రీరామకృష్ణుల వారు చెప్పినట్లు ఒక చేత్తో భగవంతుని పాదాలు పట్టుకొని మరొక చేత్తో పనిచేయడం ఎలాగో అమ్మ మనకు నేర్పిస్తారు. ఇలా చేయడం ద్వారా పనిలో విసుగు, అలసట కలగవు. భగవంతుని స్మరించడం ద్వారా ఆనందం కలుగుతుంది. అలాచేసిన ప్రతి పనీ కూడా సమర్థతతో కూడి ఉంటుంది.

అమ్మ అతి చిన్నపనినైనా, అతిపెద్ద బాధ్యతనైనా ఎంతో



అవలీలగా, నేర్పుగా నిర్వహించేవారు. తన జీవితంలో ప్రతి ఒక్క పాత్రనూ ఎంతో సమర్థంగా పోషించి ఆదర్శమూర్తిగా నిలిచారు. గృహిణిగా, శ్రీరామకృష్ణుల వారికి వండిపెట్టడంలోను, భక్తుల సేవలోను, శ్రీరామకృష్ణుల శిష్యుల బాధ్యతను గ్రహించడంలోను, గురువుగా అసంఖ్యాక భక్త జనాన్ని మంత్రదీక్ష ద్వారా అనుగ్రహించడంలోను ఉత్తమ పాత్ర నిర్వహించారు. అన్నింటికన్నా మిన్నగా, సంఘజననిగా రామకృష్ణ భావోద్యమానికి కేంద్ర బిందువై సమర్థంగా సారథ్యం వహించడంలోను- విభిన్న పాత్రలను ఎంతో నైపుణ్యంగా పరిపోషించి "యోగః కర్మసు కౌశలం" అనే నిర్వచనానికి ఉత్తమ దృష్టాంతంగా నిలిచారు.

గీతలో యోగానికిచ్చిన మరొక గొప్ప నిర్వచనం...

**తం విద్యాత్ దుఃఖ సంయోగ వియోగం యోగ సంజ్ఞితమ్**

దుఃఖంతో ఏకమవక దాని నుంచి వేరవడాన్ని యోగం అంటారు.

సమస్యలు, కష్టాలు ఎదురైనప్పుడు ముసుగువేసుకొని దుఃఖించడం బలహీనత. ఆ విధంగా శక్తిని వృథా చేసుకోకుండా దాని నుంచి వేరు పడడమే యోగం. అమ్మ జీవితంలో దీనికి ఎన్నో దృష్టాంతాలు కనబడతాయి. పిచ్చివాడి భార్య అని ఊళ్ళోని అమ్మలక్కల ఎత్తి పొడుపు మాటలకు ఆమె క్రుంగిపోలేదు. నిజం తెలుసుకొని, అవసరమైతే భర్తకు సహాయం చేయడానికి దక్షిణేశ్వరం పయనమైంది. అలాగే కామార్పుకూరులో కడు దారిద్ర్యాన్ని అనుభవించినప్పుడు కానీ, బంధువుల నిందలను, శాపాలను ఎదుర్కోవలసి వచ్చినప్పుడు కానీ దుఃఖం ఆమెను స్పృశించ లేక పోయింది. దుఃఖం మనసును స్పృశించనప్పుడు మనకు మిగిలేది సంతోషం, అంటే సర్వదా ఆనందంగా ఉండడమే యోగం అని చెప్పుకోవచ్చు. ఎందుకంటే...

**"ప్రసాదే సర్వ దుఃఖానాం హాని రస్యోప జాయతే**
**ప్రసన్న చేతసోహ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే "**

మనం ప్రసన్నతను పొందినప్పుడు దుఃఖాలన్నీ నశిస్తాయి. బుద్ధి పరమాత్మయందే నిలుస్తుంది అంటాడు శ్రీకృష్ణుడు.

అమ్మ ఆనందస్వరూపిణి కాబట్టి బాహ్యమైన ఒడుదొడుకులేవీ ఆమె ఆనందాన్ని హరించలేదు. అలాగే ఇతరులకు శాంతిని అందించడంలోనూ అంతరాయం కలిగించలేదు. అమ్మ ఆనందం వెనుక గల రహస్యం సంతృప్తిలోనే ఉంది. ఉన్నదానితో సంతృప్తి పొందడంలోనే నిజమైన ఆనందం ఉంటుంది. అందుకే అమ్మ అంటారు-

"సహనానికి మించిన గుణం, సంతృప్తిని మించిన సంపద మరొకటి లేదు"అని. ఇదే అమ్మ జీవితం మనకు నేర్పే మరొక గొప్ప పాఠం.

గీత నేర్పిన ఈ యోగాన్ని, అమ్మ ఆచరించిచూపిన ఈ గుణాలను మనం క్లుప్తంగా సమత్వం, సమర్థత, సహనం అని గుర్తుపెట్టుకోవచ్చు. ఈ యోగాన్ని కించిత్తు ఆచరించినా కూడా మనకెంతో మేలు కలుగుతుంది. e



# కమలాలయంలో కొలువుతీరిన వినాయకుడు

కథ : సంతాన రామన్ చిత్రాలు : శంకర్ తెలుగు సేత : స్వామి జ్ఞానదానంద

**1** తిరువారూరులోని సుందరమూర్తి నాయనారుకు పరమేశ్వరుడు స్నేహితుడు. అందువల్ల అతడు పరమేశ్వరునితో ఎల్లప్పుడూ సంభాషించే అదృష్టం పొందాడు . ఒకసారి వృద్ధాచలం సమీపంలో సుందరస్వామిని ఆహ్వానించడానికి భక్తులు గుంపులు గుంపులుగా వేచివున్నారు.



**2** మణిముత్తానదీతీరంలో వెలసిన ఏళుమలైనాథుని ఆలయం చాలా చక్కగా ఉంది. ఇక్కడి ప్రజలందరూ చాలా అదృష్టవంతులు



సుందరస్వామీ! తమ రాకతో మేము ఎంతో ధన్యులమయ్యాం.

**3** ఏళుమలైనాథుని ఆలయంలో సుందరస్వామి పరమేశ్వరుణ్ణి కీర్తించి ఆరాధించాడు.



**4**



ఇంక కొన్ని రోజుల్లో తిరువారూరులో పంగుణి ఉత్తరం పండుగ ప్రారంభమవుతుంది. పరవై నాచ్చియారు భక్తులకు ప్రసాదాలు పంచిపెట్టడానికి ఏర్పాట్లుచేస్తూ ఉంటుంది. ఆ ఖర్చుల కోసం ఏళుమలై నాథుణ్ణి అడిగి బంగారు నాణాలు తీసుకోవాలి.

**5** అప్పుడు ఏళుమలైనాథుడు సుందరస్వామితో మాట్లాడాడు

సుందరా! నీలో నువ్వు ఏదో మాట్లాడుకుంటున్నావు?



పరమేశ్వరా! నీకు తెలియనిదేముంది! నాకిప్పుడు పన్నెండు వేల బంగారు నాణాలు కావాలి!?


6
అంతేనా! ఇవిగో!


7
పరమేశ్వరా! చిన్న విన్నపం, మిమ్ము కీర్తిస్తూ ప్రతి ఊరూ తిరిగే నాకు ఇవి తీసుకువెళ్ళడం సాధ్యమా? అందువల్ల వీటిని ఇక్కడే మణిముత్తానదిలో వదలివేసి తిరువారూరు కమలాలయం కొలను నుంచి తీసుకుంటాను. అందుకు తమ అనుగ్రహం కావాలి!
సరే! నీ ఇచ్ఛానుసారమే చేయి!


8
పరమేశ్వరుడు తన స్నేహితుడే కదా అని ఆయనతో తమాషాగా సుందరస్వామి .......
మాయలో ఆరితేరిన మిమ్ము ఎలా విశ్వసించడం? తమరు తిరువారూరులో నాకు బంగారు కాసులను ఇచ్చేటప్పుడు నాణ్యత తగ్గిన కాసులను ఇచ్చినా ఆశ్చర్యపోనక్కర్లేదు.
అందుకు ఏం చేద్దామంటావు? నేను ఏమి చేయాలి?


9
పరమేశ్వరా! మీరిచ్చిన బంగారు కాసులలో కొన్నింటిని నేను నా నడుముకు ముడివేసుకుంటాను. కమలాలయం కొలనులో కాసులు దొరికినప్పుడు వాటిని ఈ కాసులతో సరిపోల్చుకుంటాను.
(చిరునవ్వుతో...) మిత్రమా! అలానే చేయి!

మిగతా 36 వ పేజీలో...

# పరిప్రశ్న

- స్వామి సుకృతానంద

– వేదుల వెంకట్రాయుడు, హైదరాబాద్

?ః **పుణ్యకార్యాల్లో సంకల్పం చెప్పుకునేటప్పుడు రెండు పర్యాయాలు చెబుతారు ఎందువల్ల ?**

✍: సంకల్పం శుభ సమయాల్లో ఒకసారి చాలు. సంకల్పం చెప్పే యజమానులు అందరూ సూక్ష్మ గ్రాహులు, విజ్ఞులు కాకపోవచ్చు. అజాగ్రత్త లేకుండా ఉండడానికి రెండోసారి చెప్పిస్తారు పురోహితులు. ఇందులో పునరుక్తి దోషం లేదు. దేవాలయాల్లో గోత్ర నామాలు చెప్పినట్లే అవివాహిత స్త్రీ, పురుషులు కూడా సంకల్పాన్ని చెప్పవచ్చు. కేవలం దంపతులు చేసే పూజల్ని అవివాహితులు నిర్వహించరు అంతే !

– హెచ్ శ్రీనివాసులు, కోలార్

?ః **బ్రహ్మ విద్య అన్ని విద్యల కన్నా గొప్పదెలా అవుతుంది ?**

✍: మిగతా లౌకిక విద్యలన్నీ ఇహలోక సుఖాలనిస్తాయి. బ్రహ్మ విద్యే (అక్షయ) శాశ్వత ఆనందాన్ని ఇస్తుంది. అందుచేత దీన్ని పరావిద్య అన్నారు. మిగతావన్నీ అపరావిద్యలే. అందులో ఋగ్, యజు,సామ, సర్వవిద్యా సంగీత కళలన్నీ వస్తాయి. ఇదే ఆశ్చర్యం. బ్రహ్మ విద్య మాత్రమే మనకు శాశ్వత ఆనందాన్నిస్తుంది. శ్లోకాన్ని బ్రహ్మవేత్త తరిమికొడతాడు. "బ్రహ్మవిదాప్నోతి పరమ్"– బ్రహ్మ జ్ఞాని పరమానందాన్ని పొందుతాడు. (తైత్తరీయోపనిషత్తు) "తరతి శోకమాత్మావిత్" – ఆత్మజ్ఞాని శోకమోహాల కడలికి ఆవలి ఒడ్డుకు చేరుకుంటాడు (ఛాందోగ్యోపనిషత్తు).



– జి. పార్వతీశం, నౌపడా

?ః **వినాయకునికి తులసీదళాలతో పూజ చేయకూడదంటారు ఎందువల్ల? మారేడు దళాలు పూజకు పనికొస్తాయంటారు. వివరించ ప్రార్థన.**

✍: తులసీ దళాలు విష్ణువుకు, త్రైలోక్య కుటుంబిని శ్రీమాత పూజకు శ్రేష్ఠం. మహా విష్ణువు, శ్రీకృష్ణ పరమాత్మకు తులసీ దళాలతో పూజించాలి. అలాగే మహేశ్వరుడు, శ్రీ దుర్గామాత, వినాయకునికి మారేడు దళాలతో పూజించాలి. మారేడు వృక్షాన్ని శ్రీ వృక్షం అంటారు. ముక్కంటికి మూడు దళాలున్న మారేడు ప్రీతికరం. కొంచెం జలంతో అభిషేకించి, నాలుగు మారేడు దళాలతో అర్చించి, అరటి పండో, పటికబెల్లమో నైవేద్యం పెడితే ఆశుతోషుడు ఆనందిస్తాడు. భక్తుల అభీష్టాన్ని తీరుస్తాడు. ఇది అనూచానంగా వస్తున్న నియమం. బిల్వాష్టక స్తోత్రం కూడా ఉంది.

– ఎస్. రామారావు, జయపూర్

?ః **గోవర్ధనం అంటే కొండ. గోమేదికం అంటే ఒక రత్నం. గోరోజనం అంటే ఏమిటి ?**

✍: గోరోజనం అంటే ఆవు జీర్ణకోశం నందు కాలేయంలోని రసం (చిన్న ప్రేగులో చేరేది). దాన్నే గోరోజనం అంటారు. దీని సంస్కృత నామం 'గోరోచనా'.

– పేరి సుభద్ర, హైదరాబాద్

?ః **మన తలరాత ఎలా ఉంటే అలా జరుగుతుందంటారు కొందరు. మరికొందరు దేవుణ్ణి మొక్కితే పని అవుతుందంటారు. ఏది నిజం?**

✍: మన తలరాత ఎలా ఉంటే అలా జరుగుతుందనే వాళ్ళు సోమరులు, అధములు. దేవుణ్ణి మొక్కితే మన కోరికలు నెరవేరుతాయని విశ్వసించేవారు మధ్యములు. వీరు నిజంగానే నమ్మితే భగవంతుడు దయ తలచవచ్చు. ఇక ఆత్మ విశ్వాసం ఉన్నవారు ఉత్తములు. వాళ్ళు ఏ పనినైనా బాగా చెయ్యగలుగుతారు. ఎంచుకొన్న లక్ష్యాన్ని సాధిస్తారు. మొదట మనపై మనకు విశ్వాసం ఉండాలి. మొదటి తరగతి వ్యక్తులు విధిని నమ్మేవారు. వారు దేన్నీ సాధించలేరు. అనామకులుగా జీవిస్తారు. అందుచేత మొదట ఆత్మ విశ్వాసంతో, భగవదిచ్ఛతో కార్యసిద్ధి లభిస్తుంది. e

# ఆధ్యాత్మిక అన్వేషణ

- స్వామి తపస్యానంద



**ప్రశ్న : నిజమైన భక్తుడంటే ఎవరు?**

**జవాబు :** నిజమైన భక్తుని గురించి శాస్త్రాలలో అనేకచోట్ల వర్ణితమై ఉంది. భాగవతంలో చక్కటి వర్ణనలు ఇచ్చారు. భగవద్గీతలోని 12వ అధ్యాయంలో కూడా భక్తుని లక్షణాల గురించి ఉంది. భగవంతుడు మాత్రమే తన సొంతమని భావిస్తూ, ఇతర విషయాలపై కేవలం తన భక్తిభావానికి సహకరించినంత వరకు మాత్రమే శ్రద్ధ చూపించేవాడే నిజమైన భక్తుడని శ్రీరామ కృష్ణుల వారి బోధనలు మనకు అభివ్యక్తపరుస్తున్నాయి.

భక్తి – భక్తుడు రెండు రకాలని భక్తిశాస్త్రాలు వల్లిస్తున్నాయి. వైధీభక్తి లేదా పరిచయాత్మక భక్తిని అనుసరించే వారిని కూడా భక్తుడనే అంటారు. కానీ పైన చెప్పబడిన విధంగా 'భక్తుడు' అనే పదానికి అసలైన భావాన్ని కనుక మనం తీసుకుంటే, వైధీభక్తిని అనుసరించే ఇతడు కేవలం భక్తునిగా మలచబడుతున్నాడే కానీ ఇంకా భక్తుడు కాలేదు. నియమాలు, చుట్టుప్రక్కల వాతావరణం, పరస్పర సంబంధం వంటి బాహ్య ప్రేరణల ద్వారా మనసులో జనించే భక్తి భావననే వైధీభక్తి అంటారు. తగిన సందర్భాలలో ఈ వైధీభక్తి ఉదయిస్తుంది. అయితే పరిస్థితులతోపాటు అది కూడా మారుతూ ఉంటుంది.

భాగవత పురాణం భక్తి తొమ్మిది విధాలని చెబుతోంది. శ్రవణం (భగవంతుని గురించి భక్తులద్వారా వినడం), కీర్తనం (భగవంతుని ప్రాభవాన్ని కీర్తించడం), స్మరణం (భగవన్నామాన్ని స్మరించడం), పాదసేవనం (భగవంతుడు అన్ని జీవులలోనూ భాసిస్తున్నాడని తలుస్తూ వారిని సేవించడం), అర్చనం (విగ్రహాలలోనూ, పుణ్య క్షేత్రాలలోనూ భగవంతుని పూజించడం), వందనం (పుణ్య మూర్తులు, వ్యక్తులు, ప్రదేశాలు మొదలగువాటిపై తగిన గౌరవమర్యాదలు చూపడం), దాస్యం (తనని తాను భగవంతుని దాసానుదాసునిగా తలచడం), సఖ్యం (ప్రాణ స్నేహితుడు లేదా బంధువులా భగవంతుడు సదా తనకు మేలు చేసేవాడని తలచడం), ఆత్మనివేదనం (తనని తాను భగవంతునికి సమర్పించడం), తరువాత వచ్చిన ఆచార్యులు వీటిని 63 నియమాలుగా విపులీక రించారు. వీటిలో మొదట చెప్పబడిన నియమాలు ముఖ్యంగా బాహ్య వస్తువులపై, ప్రేరణలపై ఆధారపడి ఉంటాయి. కానీ చివరి మూడు నియమాలు మాత్రం కేవలం ఆంతరంగికమైనవి. ఆ మూడూ మనసు యొక్క వివిధ రీతులు. బయటి పరిస్థితులన్నిటికీ అతీతంగా మనసులో ఉదయించే ఒక నిరంతర ప్రక్రియే నిజమైన భక్తి అని అవి తెలియజేస్తాయి. అటువంటి ఉత్కృష్టభక్తినే పరాభక్తి అంటారు. భాగవత పురాణంలో భక్తి గురించి చక్కగా వివరించారు.

"సాధారణంగా బాహ్య వస్తువులపై లయించే మానవుని మనసుకూ, ఇంద్రియాలకూ ఉండే శక్తులన్నీ, ఏ విధమైన స్వార్థపూరితమైన తలంపు లేకుండా, మరే ఇతర ఆటంకం వలన చలింపనలవికాని పట్టుదలతో, కేవలం భగవంతునిపై అవి సహజంగా లగ్నమైనప్పుడు మాత్రమే అది ఉత్తమమైన భక్తి. ముక్తి కన్నా కూడా అటువంటి భక్తి ఉన్నతమైనది. అగ్నిలో పడిన ప్రతి వస్తువూ దహించబడినట్లే ఆ వ్యక్తిలోని అజ్ఞానపు పొరను అది దహించివేస్తుంది".

ఇటువంటి ఉన్నతమైన భక్తి కలగడం అరుదు. అయితే భక్తిమయ జీవితానికి ఇదే పరమావధి. అనేక జన్మలపాటు కఠోర సాధన చేయడం వల్ల మనిషిలో ఇటువంటి భక్తి జనిస్తుంది. ఇది కేవలం భగవదనుగ్రహం వల్లనే సాధ్యమని కొందరి అభిప్రాయం. e



ప్రకాశన్ భవనాన్ని ప్రారంభిస్తున్న స్వామి స్మరణానందజీ




ప్రకాశన్ భవన్



శిలాఫలక ఆవిష్కరణ సందర్భంగా స్వామి తత్త్వ బోధానందజీ, స్వామి జ్ఞానదానందజీ, స్వామి స్మరణానందజీ, స్వామి ప్రమేయానందజీ



ప్రారంభోత్సవ సభలో ప్రసంగిస్తున్న స్వామి స్మరణానందజీ



ప్రకాశన్ భవన్ ప్రారంభోత్సవ సభలో స్వామీజీలు, భక్తులు

## తెలుగు ప్రచురణలు ఇక హైదరాబాద్ నుంచే!

రామకృష్ణ మఠం తెలుగు ప్రచురణల విభాగం హైదరాబాద్‌కు తరలివచ్చింది. ఈ ఏప్రిల్ 1వ తేదీ నుంచి రామకృష్ణ మఠ తెలుగు ప్రచురణలన్నీ హైదరాబాద్ రామకృష్ణ మఠంలోనే లభిస్తాయి. సదరు ప్రచురణల కొనుగోలు కోసం ఇకపై నేరుగా హైదరాబాద్ మఠానికి పుస్తకాల 'ఇండెంట్' పెట్టగలరు. మన రాష్ట్ర రాజధాని నుంచే ఇక ఈ తెలుగు గ్రంథాల సరఫరా సాగుతుంది.

- స్వామి జ్ఞానదానంద



సాంస్కృతిక సమాహారం: గయోపాఖ్యానంలో యుద్ధ ఘట్టం, కళాకృష్ణ బృందంచే రామకృష్ణ లీలాగీతి, అన్నపూర్ణ గారి భజనలు, గంగాధర్

# ...' వించిన ప్రకాశన్ భవన్



నూతన భవనంలో మూర్తి త్రయానికి హారతినిస్తూ స్వామి స్మరణానందజీ

## శ్రీ రామకృష్ణ ప్రభ
### ఇంటింటా జ్ఞానదీప పథకం

తెలుగుగడ్డ మీదకు తరలివచ్చిన సందర్భంగా 'శ్రీరామకృష్ణ ప్రభ' మీకు ఓ అరుదైన అవకాశం అందిస్తోంది. ఇప్పటికే చందాదారులైన మీరు మీ లాంటి మరో భక్తుణ్ణి 'శ్రీరామకృష్ణ ప్రభ'కు కొత్త చందాదారుగా పరిచయం చేయండి.

y#ఓ కొత్త చందాదారుణ్ణి పరిచయం చేసినవారికి యుగపురుషులైన స్వామి వివేకానంద స్ఫూర్తిదాయక చిత్ర పటాన్ని ప్రేమపూర్వక కానుకగా పంపుతాం.

y#ముగ్గురు కొత్త చందాదారుల్ని పరిచయం చేసినట్లయితే, అలా పరిచయం చేసిన వారికే నేరుగా కానీ, వారు సూచించిన మరెవరికైనా కానీ ఏడాది పాటు 'శ్రీరామకృష్ణ ప్రభ'ను ఉచితంగా పంపిస్తాం.

y#ఈ అరుదైన అవకాశం 2007 జూన్ 15 వ తేదీ వరకే!

**ఈ ఉద్యమంలో పాల్గొనండి !**
**ఇంటింటా జ్ఞానదీపం వెలిగించండి !!**

తెలుగు నాట సనాతన ధర్మవ్యాప్తికి కృషి చేస్తున్న 'రామకృష్ణ మఠ' తెలుగు ప్రచురణ విభాగం చెన్నై నుంచి హైదరాబాదుకు తరలి వచ్చింది. ఆధ్యాత్మిక ప్రవాహానికి ఆలంబన కానున్న 'ప్రచురణల భవనం' (ప్రకాశన్ భవన్) సర్వాంగ సుందరంగా ముస్తాబైంది. 2007 మార్చి 11వ తేదీ ఆదివారం ఉదయం 9.15 గంటలకు అత్యంత వైభవంగా భవన ప్రారంభోత్సవం జరిగింది. వేద పఠనం నడుమ రామకృష్ణ సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీమత్ స్వామి స్మరణానందజీ మహరాజ్ 'ప్రకాశన్ భవన్'ను ప్రారంభించారు. స్వామి తత్త్వబోధానందజీ (కాశీపూర్), స్వామి ప్రమేయానందజీ (బేలూరు మఠం), స్వామి దివ్యానందజీ (మాల్దా), స్వామి బ్రహ్మస్థానందజీ (నాగపూర్), స్వామి శశికాంతానందజీ (విజయవాడ), స్వామి అక్షరాత్మానందజీ (రాజమండ్రి) తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

ప్రారంభోత్సవ కార్యక్రమానికి ముందు ఆ రోజు ఉదయం 7 నుంచి 9 గంటల వరకు భవన ప్రాంగణంలో భగవాన్ శ్రీరామకృష్ణులకు విశేష పూజ, హోమం జరిగాయి. ప్రారంభోత్సవం అనంతరం భవనంలో జరిగిన సభలో స్వామి స్మరణానందజీ ప్రసంగిస్తూ, "శ్రీరామకృష్ణ, శారదామాత, స్వామి వివేకానందుల దివ్యసందేశం రాష్ట్రంలోని మారుమూల గ్రామాలకు సైతం చేరవేయాల"ని ఉద్ఘాటించారు. హైదరాబాద్ మఠం అధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ సభకు స్వాగతం పలుకుతూ, "ప్రచురణ విభాగం ద్వారా శ్రీరామకృష్ణ సందేశవ్యాప్తి చేసే భాగ్యం కలిగినందుకు ఎంతో సంతోషంగా ఉంద"ని అన్నారు. శ్రీరామకృష్ణ సేవాసమితుల ప్రతినిధులు, భక్తులు, శ్రేయోభిలాషులు రాష్ట్రం నలుమూలల నుంచి విచ్చేసి, ఈ కార్యక్రమాన్ని జయప్రదం చేశారు. మార్చి 10, 11 తేదీల్లో మఠ ప్రాంగణంలో జరిగిన వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు ఆహూతులను అలరించాయి. b



...ధర్ గీతాలాపన, మోహన్‌రాజ్ - లక్ష్మి బృందంచే రామదాసు ఆత్మనివేదన, ఎ.ఎస్. మూర్తి వ్యాఖ్యానం, ఆదిలక్ష్మి హరికథాగానం



# రామకృష్ణ మఠం, ఇచ్ఛాపూర్

(బేలూరు మఠ శాఖాకేంద్రం)

పి.ఒ. మాయల్ - బందిపూర్, హుగ్లీ -712617, పశ్చిమ బెంగాల్





## విరాళాలకై విన్నపం

**శ**శి మహారాజ్‌ను ఉద్దేశించి "మఠానికి శశి మూలస్తంభం లాంటివాడు. అతడు లేని మఠజీవితం ఊహించడమే అసాధ్యం" అన్నారు స్వామి వివేకానంద. శశి మహారాజ్ (స్వామి రామకృష్ణానంద) శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులు. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న రామకృష్ణమఠం, రామకృష్ణ మిషన్‌లను స్థాపించడంలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. శ్రీరామకృష్ణులు అనారోగ్యంతో ఉన్నపుడు శశి మహారాజ్ వారికి భక్తిశ్రద్ధలతో సపర్యలు చేశారు. శ్రీరామకృష్ణులు మహాసమాధి చెందాక కూడా వారి స్మృతి చిహ్నాల్ని శశి మహారాజ్ అంతే శ్రద్ధాభక్తులతో పూజించారు. అసమానమైన భక్తి ప్రపత్తులతో శశి మహారాజ్ ఆచరించిన పూజా విధానాన్నే నేడు రామకృష్ణ మఠ కేంద్రాలన్నిటిలో అనుసరిస్తున్నారు.

కలకత్తాకు 100 కి.మీ. దూరాన ఉన్న "ఇచ్ఛాపూర్" (హుగ్లీ జిల్లా) గ్రామంలో శశి మహారాజ్ జన్మించారు. స్థానిక భక్తులు కొన్ని సంవత్సరాల క్రితం శశిమహారాజ్ జన్మస్థలంలో ఒక రేకుల షెడ్‌లో తాత్కాలిక ప్రార్థనాలయాన్ని ప్రారంభించారు. అసంఖ్యాకమైన భక్తుల కోరికపై ఇక్కడ 21-08-1994న రామకృష్ణమఠ శాఖను ప్రారంభించారు.

12 లక్షల రూపాయల ఖర్చుతో శశిమహారాజ్ బంధువులకి పునరావాసం కల్పిస్తున్నాం. పేదలకు ఉచిత శిక్షణ తరగతులు నిర్వహిస్తున్నాం. ఉచిత సంచార వైద్యశాలను ప్రారంభించి, నిపుణులచే ఉచిత వైద్యసేవలు అందిస్తున్నాం. భక్తుల సౌకర్యార్థం శ్రీరామకృష్ణ విశ్వజనీన దేవాలయ నిర్మాణం చేపట్టాం. ఈ దేవాలయ నిర్మాణానికి సుమారు రూ. 93 లక్షలు వ్యయం కాగలదని అంచనా.

| | | |
|---|---|---|
| ఆలయం ఎత్తు | - | 65' |
| గర్భగుడి | - | 20' × 24' |
| ఆలయం చుట్టుకొలత | - | 80' × 56' |

300 మంది భక్తులు కూర్చునేందుకు హాలు.

భగవాన్ శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష సన్న్యాస శిష్యులు స్వామి తురీయానందజీ మహారాజ్ జన్మదినం-2003, జనవరి 17వ తేదీన రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు పూజ్య శ్రీస్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ వారిచే ఈ దేవాలయానికి శంకుస్థాపన జరిగింది.



నిర్మాణంలోవున్న ఆలయం

సార్వజనీన దేవాలయ నిర్మాణానికి ఉదారులైన భక్తులు, శ్రేయోభిలాషులు, స్నేహితుల నుండి విరాళాల్ని కోరుతున్నాం. విరాళాలను **Ramakrishna Math, Ichapur** పేరున చెక్కు లేదా డి.డి. తీసి **Ramakrishna Math, P.O. Mayal - Bandipur, Hooghly - 712617**కు పంపవలసిందిగా మనవి. అన్ని విరాళాలనూ కృతజ్ఞతతో స్వీకరిస్తాం.

మీరిచ్చే విరాళాలన్నింటికీ ఆదాయపుపన్ను చట్టంలోని సెక్షన్ 80G (vide memo No.DIT(E)/576/8E/40 69-70dt.08-08-2001) కింద పన్ను మినహాయింపు ఉంటుంది.

శ్రీరామకృష్ణులు, దివ్యజనని శ్రీ శారదామాత, స్వామి వివేకానంద, శశి మహారాజ్‌లు మిమ్మల్ని అనుగ్రహించాలని హృదయపూర్వకంగా ప్రార్థిస్తున్నాం.

భగవత్సేవలో

**స్వామి నిర్లిప్తానంద**

అధ్యక్షులు

# ఆరోగ్యానికి అర్ఘ్యం

- రెంటాల జయదేవ

ఆదిత్యుడు ప్రత్యక్ష దైవం. ఆయన ఐశ్వర్య దాత, ఆరోగ్య ప్రదాత. సూర్యోదయ, సూర్యాస్తమయాలు లేనిదే ప్రకృతిలోని జీవజాలానికి మనుగడే లేదు. ఆదిత్యుడి ప్రాధాన్యం అంతటిది. రోజూ కళ్ళెదుట కనిపించే అలాంటి సూర్య భగవానుడి ఆరాధన భారతీయ సంస్కృతీ సంప్రదాయాల్లో అంతర్భాగం.

సూర్యుడు సహస్ర కిరణ తేజో విరాజితుడు. సూర్యకిరణాల్లో గంధర్వులు, మునిపుంగవులు వసిస్తారని 'సూర్యోపనిషత్తు' పేర్కొంటోంది. అందుకే, ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అని ఆర్యోక్తి. అంటే, మనందరి ఆరోగ్యం భాస్కరుడి వర ప్రసాదమన్నమాట. ఎంతటి వారైనా సరే ఆదిత్యుని కరుణా కటాక్షం లేనిదే ఏదీ సాధించలేరు. అందుకే, ప్రతిరోజూ సూర్యుడికి అర్ఘ్యం సమర్పించడం మన భారతీయుల ఆచారం.

**అర్ఘ్యం అంటే?**

నిజానికి 'అర్ఘ్యం' అంటే పూజించడమని అర్థం. ఆ పూజకు దేనిని ఉపయోగిస్తామో, దేనితోనైతే పూజిస్తామో అది 'అర్ఘ్యం' అన్న మాట. ఒక్కమాటలో చెప్పాలంటే, 'అర్ఘ్యం' అంటే పూజకు తగినది, పూజకు ఉద్దేశించిన జలం మొదలైన ద్రవ్యాలని అర్థం. మహర్షులు, మహాత్ములు వచ్చినప్పుడు రాజు వారికి ఎదురేగి, అర్ఘ్య పాద్యాదులు సమర్పించాడంటూ మనం పురాణాల్లో, కథల్లో చదువుతుంటాం. ఆ అర్ఘ్యం ఇదే!

స్థూలంగా చూస్తే, అర్ఘ్యమివ్వడమంటే- 'సర్వ సమర్పణా' భావంతో నమస్కరించడం, జలాలను అర్పించడం! ప్రత్యక్ష దైవమైన సూర్య భగవానుడికి అర్ఘ్యమివ్వడంలో కూడా అర్థం ఇదే!!

**అర్ఘ్యమివ్వడమెందుకు?**

మానవుడి మనసులో ఏవేవో పాపపు ఆలోచనలు రావడం సహజం. 'పాప చింతన'లనే ఆ రాక్షసులు మన అంతఃకరణాలలోకి జ్ఞాన కిరణాలు సోకనివ్వకుండా రోజూ అవరోధం కలిగిస్తుంటారు. ఆ రాక్షసుల్ని రూపుమాపి, ఎలాంటి అవరోధాలూ లేకుండా, జ్ఞానజ్యోతి మన అంతఃకరణాల్లోకి ప్రవేశించేటట్లు చేయాలి. అందుకోసం ప్రత్యక్ష దైవమైన ఆ సూర్యభగవానుడికి సర్వ సమర్పణా బుద్ధితో 'అర్ఘ్యం' ఇవ్వాలి.

అర్ఘ్య ప్రదానం చేయడం వల్ల మన మనసులోని మాలిన్యం, అహంకారం నశిస్తాయి. మనోధైర్యం, బుద్ధిబలం, ఆత్మ విశ్వాసం లాంటి మంచి లక్షణాలు కలుగుతాయి. *('అష్ట అర్ఘ్య ద్రవ్యాల వివరాలు, సమయాన్ని బట్టి అర్ఘ్యమివ్వాల్సిన తీరుతెన్నులు' వచ్చే సంచికలో)*

# యువతా... మన పయనమెటు?

- బి. సైదులు

బడి గడప తాకిన అందరమూ 'భారతదేశము నా మాతృభూమి....' అని ప్రతిజ్ఞ చేశాకే క్లాసులో కాలుమోపేవాళ్ళం. ఆ ప్రతిజ్ఞ అనగానే అందులోని సుసంపన్నమైన వారసత్వం అన్న వాక్యమూ గుర్తొస్తుంది. అలా స్కూల్లో దాదాపు పన్నెండేళ్ళ పాటు రోజూ అలాంటి ప్రతిన వల్లెవేస్తూనే ఉండేవాళ్ళం. కానీ మనలో ఎంతమంది ఆ ప్రతిజ్ఞను ఆచరణలో పెడుతున్నారన్నదే ప్రశ్న. ఈ రోజు మనం ఇంత సౌకర్యవంతమైన, స్వేచ్ఛాపూరితమైన జీవనాన్ని గడపటానికి ఎందరో త్యాగధనులు– రేయింబవళ్ళు తమ కాలాన్ని కర్పూరంలా కరిగించారు. ఘనమైన వారసత్వపు వీధుల్లో కరదీపికల్లా చరిత్రనే కదిలించారు. స్వాతంత్ర్య ఉద్యమంలో కావొచ్చు, సాహిత్య ఉషోదయంలో కావొచ్చు... ఇలా ప్రగతి పథం ప్రతీ మలుపులో ముందు తరాలకు మైలురాళ్ళను, మార్గదర్శకాలను పటిష్ఠం చేశారు. ప్రతికూల పవనాలు ఎన్ని వీచినా సమూహ సంక్షేమానికే ప్రాధాన్యమిచ్చి తమను తాము సమిధల్లా అర్పించుకున్నారు. మరి... నేడు అద్దాల మేడలు, ఆడంబర జీవితాలే నాగరకత అన్న భ్రమలో 'మనం' అనే భావన కన్నా 'నేను' అన్న స్వార్థానికే ప్రాముఖ్యం ఇస్తున్నాం. ఆ రెండక్షరాల చుట్టే చట్రాన్ని నిర్మించుకుంటున్నాం. అంది పుచ్చుకున్న ఘనమైన వారసత్వానికి ప్రతిఫలంగా, మనమూ భవిష్యత్ తరాలకు సుసంపన్నమైన వారసత్వాన్ని అందించాలన్న కనీస కర్తవ్యాన్ని విస్మరిస్తున్నాం. అందుకే రాబోయే తరాలు గతాన్ని గుర్తు చేసుకోవాలంటే ఓ సినిమాతారో, స్టార్‌క్రికెటరో స్ఫురిస్తారు. కానీ ఉప్పెనలా ఎగిసిన విశ్వమూర్తి వివేకానంద లాంటి వారో, ఉప్పుతోనూ ఉద్యమం తెచ్చిన మహాత్మా గాంధీ లాంటి వారో గుర్తుకురారు. కారణం అలాంటి మార్గదర్శకులుగా మనల్ని మనం మలచుకోవడం లేదు. ఆశల అలజడిలో ఆశయాల ఆణిముత్యాలను అగాధంలోనే సమాధి చేస్తున్నాం. ఏదో పొందాలన్న తపనతో ఏం పోగొట్టుకుంటు న్నామో పసిగట్ట లేకపోతున్నాం.

## సొంతమూ సొంతలాభమే ...

సొంతలాభం కొంతమానుకోవడం కాదు... సొంతమూ సొంతలాభమే అన్న ధోరణి నానాటికీ పెరిగిపోతోంది. ఇంటి నుంచే అలాంటి భావజాలానికి బీజం పడుతోంది. ఏ పనిచేసినా, 'మనకేంటి లాభం' అన్న ప్రశ్నే పొడసూపుతోంది. తనకు మాలిన ధర్మం చేయమని కాదు కానీ తనకు సరిపద్దాకయినా ఇతరులకు ఇవ్వాలన్న విశాల హృదయమే కరవయింది. అందుకే మనలో చాలామందికి ఊరు నలుమూలలా స్థలాలుంటాయి. కానీ ఎదుటి వాడి మనసులో మాత్రం రవ్వంతయినా చోటుండదు. అంటే మనం ఎంత స్వార్థపరులుగా మారుతున్నామో తెలిసిపోతోంది. నిలబడి నీళ్ళు తాగే కన్నా, పరుగెత్తయినా పాలే తాగుదామనుకుంటున్న ఆధునిక ప్రపంచంలో పోటీతప్పదు. కొంత స్వార్థం చూసుకోకా తప్పదు. కానీ ఆ 'కొంత' ఎంత అన్నదే మన మంచి మనసు నిర్ణయించాలి. పంచుకోవడంలో ఉన్న ఆనందం, మన మొక్కరమే ఉంచుకోవడంలో లేదని ఎందరో మహానుభావులు నిరూపించారు. కానీ మనం నేడు ఆ సత్యాన్ని విస్మరిస్తున్నాం.

## శాశ్వతత్త్వపు ఊసే లేదు...

ఈ రోజు ఒక మధురకీర్తన పాడుకోవాలంటే ఓ అన్నమయ్యో, ఓ త్యాగయ్యో గుర్తొస్తారు. పిల్లలకు గొప్పగా చెప్పాలంటే మహాత్ముడో, మదర్‌థెరెసానో స్ఫురిస్తారు. కారణం వాళ్లంత తమ జీవితంలో భౌతికస్థాయిని మించిన, శాశ్వతత్త్వం కోసం తపించారు. ఎక్కడో తాళ్ళపాకలో అయిదువందల ఏళ్ళ క్రితం జీవించిన అన్నమయ్యపై ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో పరిశోధనలు జరుగుతున్నాయంటే ఆలోచించండి. ఆయన

రాగసాధనలో ఎంత శాశ్వతత్త్వం దాగిఉందో! ఎక్కడ తనను అవమానపరిచారో, రైలుబోగీలో నుంచి నెట్టివేశారో అక్కడే తన విగ్రహం పెట్టి పూజించేలా చేసుకున్నారంటే గాంధీ మహాత్ముడి చరిత్రలో ఎంత మూర్తిమత్వం దాగిఉందో! ఈ దీక్షే నేటితరానికి సుదూరమవుతోంది. తాత్కాలిక సుఖలాలసలో శాశ్వతమైన చరిత్ర కోసం పరిశ్రమించే పట్టుదలే లోపిస్తోంది.

**బలహీనతల్లో బందీ...**

కబీర్‌దాస్ అంటాడు... 'మృగయా పాస్ కస్తూరీ భాస్... క్యూం ఖోజౌ, ఖోజౌ ఘాస్...' కస్తూరీ మృగం చర్మమే సుగంధ భరితం. కానీ ఆ పరిమళం తనలోనే దాగి ఉందని తెలీయక అది పచ్చికంతా వెతుకుతుంది. మనమూ కస్తూరీ మృగాల వంటి వాళ్ళమే. ఆనందం ఎక్కడో బాహ్య ప్రపంచంలో ఉంటుందనుకుంటున్న మత్తులో, మరీచికల వెంట పరుగెడుతున్నాం. తేనెతో దాహం తీరుతుందన్న భ్రమతో తేనెతుట్టెల్ని తట్టిలేపుతున్నాం. మనం కలలు కని, కల్పించుకుంటున్న సౌకర్యాలన్నీ సుఖాలే కానీ సంతోషాలు కాదు. వీటి కోసం మనం చెల్లిస్తున్న మూల్యం మహత్తరమైన మానవజీవితం. నోరులేని జీవాల ఆశలన్నీ వాటి శరీరాల చుట్టే తిరుగుతాయి. మరి మహోన్నతమైన మానవ జన్మనెత్తిన మన ఆశలు కూడా వాటిమాదిరే శరీరాలకే పరిమితమైతే ఇక ఏం లాభం?. మన ఆశలు, ఆశయాలు, ఆదర్శాలు ఆఖరికి మన ఆనందాలు కూడా ఈ పాంచభౌతికస్థాయిని మించి ఎదగాలి. మన ఆధ్యాత్మిక సంస్కారం సూచించిన ఆత్మతో అనుసంధానమైన నాడే మన బలహీనతల్ని తృణ ప్రాయంగా త్యజించగలం. అప్పుడు మన ఆలోచనాపరిధి విస్తరిస్తుంది. లక్ష్యాలన్నింటినీ లక్షలాది జనుల సంక్షేమంవైపే పరుగెత్తిస్తుంది.

**ఇకనైనా మేల్కొందాం...**

ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు. మనదంటూ, మనకంటూ ఓ చరిత్రను తిరగరాసుకొని ముందు తరాలకు సమర్పించే కఠోరక్రతువుకు శ్రీకారం చుడదాం. మన శక్తి సామర్థ్యాల్ని స్వల్పలక్ష్యాల కోసం వినియోగించడం మాని వేద్దాం. ప్రాపంచిక సుఖాల కోసం బ్రహ్మాస్త్రం లాంటి మానవ జీవితాన్ని వృథా చేయడం మానేద్దాం. మణుల కోసం వెళుతూ మిణుగురులను పట్టుకునే అల్పసంతోషాలను వదిలిపెడదాం. స్వామి వివేకానంద అన్నట్లు మనం అమృత పుత్రులం. అలాంటప్పుడు అల్పబుద్ధులెందుకు? రానున్న తరా లకు మనమూ ఓ వారసత్వ వారధిని నిర్మిద్దాం. ఆ సత్తా ఏ ఒక్కరి సొత్తో కాదు. సత్యాగ్రహంతో స్వాతంత్ర్యం తెచ్చి ఒకరు... రామేశ్వరం నుంచి రాష్ట్రపతి అయి మరొకరు ఇలా ఎందరో నిరూపించారు... ఆ జాబితాలో మనమూ చేరుదాం... ఆగామి తరాలకు ఆదర్శమవుదాం! e

(ఈ నెల 18న వారసత్వ దినోత్సవం)

## ఇదీ మన వారసత్వం... గుర్తుచేసుకొని గర్విద్దాం...

- గత వెయ్యేళ్ళ చరిత్రలో మనదేశం తనంత తానుగా ఏ ఒక్క దేశంపైనా దండెత్తలేదు.
- సున్నా(0)ను కనుగొన్నది మన ఆర్యభట్టు.
- ప్రపంచంలో ప్రాచీన విశ్వవిద్యాలయం మనదే. క్రీపూ. 700లోని నలంద విశ్వవిద్యాలయం. పదివేల అయిదు వందలకు మించిన విద్యార్థులు అందులో చదువుకునేవారు. ప్రపంచం నలుమూలల నుంచి వచ్చి 60 విభాగాల్లో పట్టాలు పుచ్చుకున్నారు.
- కంప్యూటర్ సాఫ్ట్‌వేర్‌కి అత్యంత అనువైన భాష ఏదో తెలుసా?.... మన సంస్కృతమే!
- మనిషికి తెలిసిన అత్యంత ప్రాచీన వైద్య విద్య ఆయుర్వేదం... అది పుట్టింది మనదేశంలోనే.
- నౌకాయానం ఆరంభమైనది మన నేలపైనే. వందల ఏళ్ళ క్రితం సింధునది నుంచి శ్రీకారం చుట్టింది. 'నావిగేషన్' అన్న పదం...మన సంస్కృతంలోని 'నవగతి' నుంచి పుట్టిందే.
- 1896 వరకు మనదేశంలో మినహా మరెక్కడా వజ్రాలు లభించేవి కావు.
- చదరంగం కనుగొన్నది మనవారే.
- శస్త్రచికిత్సకు అంటే సర్జరీకి మూలపురుషుడు మన వాడే. అతను సుశ్రుతుడు. 2600 సంవత్సరాల ముందే అతను ఆపరేషన్ చేశాడు.
- ప్రపంచానికి నాగరకత నేర్పింది మనమే. 5000 సంవత్సరాలకు ముందే సింధునదీ తీరంలో మన హరప్పాలో నాగరకత జాడలు కనిపిస్తాయి.

ఇంకా ఎన్నో... ఎన్నెన్నో
అందుకే హమారా భారత్ మహాన్!

# విజయవంతంగా జీవించడం ఎలా?

- స్వామి జగదాత్మానంద

(గత సంచిక తరువాయి)

**భా**రత జీవిత బీమా సంస్థలో పనిచేసిన ఒక ఉన్నతాధికారి తాను సేవ చేసిన కాలంలో తన క్రింది ఉద్యోగులను ప్రేమ విశ్వాసాలతో ఎలా నియంత్రించగలిగాడో వివరించాడు:

"అన్ని కార్యాలయాలలో లాగా ఇక్కడ కూడా మూడు రకాల ఉద్యోగులు ఉండేవారు. వారిలో ఇద్దరో, ముగ్గురో చాలా సమర్థులు, మంచివారు, విధేయులు. ఒకరిద్దరు క్రమశిక్షణ లేకుండా, అల్లరిగా, సోమరితనంతో, వినాశ కరమైన మనస్తత్త్వం కలిగి ఉండేవారు. ఈ మిగిలిన వాళ్ళు ఈ రెండు రకాల వారికీ మధ్యరకం. వారిది అటూ ఇటూ ఊగిసలాడే స్వభావం. ఈ ఊగిసలాడే స్వభావం గల ఉద్యోగులు చెయ్యదలుచుకుంటే చక్కగా పనిచెయ్యగలరు. అందరితో ఒకే విధంగా ప్రవర్తించడం సాధ్యం కాదు. ఒక్కొక్కరికీ ఒక్కొక్క విధమైన స్వభావం ఉంటుంది. ప్రతీ ఉద్యోగి గురించీ బాగా తెలిస్తేగానీ అతడి ప్రవర్తన అర్థం చేసుకోవడం సాధ్యం కాదు. ఇంటి సమస్యలు, ఇంతకు ముందున్న అధికారితో తగాదాలు, తాను కోరుకున్న చోటికి బదలీ కాకపోవడం వల్ల కలిగే నిస్పృహ, నాయకుడు కావాలన్న కోరిక, స్వతహాగా ఉన్న సోమరితనం, ఎదుటి వారికి చీకాకు కలిగించే స్వభావం మొదలైనవి వారి అసంతృప్తికీ, క్రమశిక్షణా రాహిత్యానికీ కొన్ని కారణాలు కావచ్చు. ఈ సమస్యలకు పరిష్కారం చూపడం నా వల్ల అయ్యే పని కాదు. నేను చెయ్యగలిగింది వీటివల్ల కలిగే చెడుప్రభావాన్ని వీలైనంత తగ్గించి, పని మరింత సమర్థంగా జరిగేలా చూడడమే".



"వారిలో నిజాయతీగా పనిచేసే వారి విషయంలో నేను చెయ్యవలసినదేమీ లేదు. వారు చేసే పని సక్రమంగా ఉందని,అప్పుడప్పుడు నేను వారి పట్ల ప్రేమ, గౌరవం, నమ్మకం వ్యక్తం చేసేవాణ్ణి. అయితే ఇది ప్రకటితమవకుండా నేను జాగ్రత్త పడేవాణ్ణి. ఒక కార్యాలయంలోని వాతావరణం ఎప్పుడూ చాలా సున్నితంగా ఉంటుంది. బాధ్యతగా పనిచేసే ఉద్యోగిని పొగిడితే, మిగిలినవారు అసూయ పెంచుకుని, పనిచెయ్యడం మానివేసి, సోమరిపోతులుగా తయారయ్యే ప్రమాదం ఉంది. అందువల్ల నేను చాలా జాగ్రత్తగా వ్యవహరించేవాణ్ణి. చాలాసార్లు అందరిలో కాకుండా కేవలం మేమే ఉన్నప్పుడు వాళ్ళను మెచ్చుకునేవాణ్ణి. నా మెప్పు సహజమైనదని చూపడానికి తగినంత ఋజువును కూడా చూపేవాణ్ణి".

"ఇక రెండో రకపు ఉద్యోగులు ఎటువంటి వ్యూహానికీ లొంగేరకం కాదు. వాళ్ళు ఉన్నతాధికారులందరూ తమకు శత్రువులేనన్న అపోహను పెంచుకున్న కార్మిక సంఘ నాయకులు. వాళ్ళు తెలివైనవాళ్ళు, అర్థం చేసుకోగలిగిన

## నడిపించేవాడే



మనస్తత్త్వం గలవారు. అయినా, అప్పటి వరకూ సంస్థలో తాము సాధించిన "పేరు"కు వారు అమ్ముడుపోయినవారు. వాళ్ళకు ఆ పేరు పోగొట్టుకోవడం ఇష్టం ఉండదు. కొన్నిసార్లు వాళ్ళకు పనిచెయ్యాలనే ఉన్నా, ముందు నుంచీ ప్రతికూలస్వభావులుగా పేరుపడ్డారు కాబట్టి దాన్ని పోగొట్టుకోకుండా ఉండడం కోసం తమ మంచితనాన్ని కప్పిపెట్టడానికి ప్రయత్నిస్తూ ఉంటారని నేను కనిపెట్టాను. కార్మిక సంఘనాయకుల సమస్య నాకు తెలుసు కనుక నేను వారిని మానవతా దృష్టితోనూ, దయతోనూ, సహృదయంతోనూ, స్నేహభావంతోనూ చూసేవాణ్ణి. ఇది నాకు స్వాభావికం. ప్రతి వ్యక్తికీ తనదైన ఒక శక్తి, కొన్ని హద్దులు (పరిమితులు) ఉంటాయి. ఇదే అన్నిటికన్నా ముఖ్యమైంది. ప్రతివాడూ తన స్వభావానికి తగినట్లుగా తన జీవితవిధానానికి ఒక మార్గాన్ని నిర్దేశించుకోవాలి. ఇతరుల పద్ధతులను అనుకరించకూడదు. నిజాయతీ, కరుణ నా పద్ధతులు. దీనివల్ల ఫలితాలను సాధించడానికి కొంత సమయం పట్టవచ్చు, కానీ అవి శాశ్వతమైనవి. నా దగ్గర

ఎలాంటి యుక్తులూ లేవు. తాత్కాలికమైన అద్భుతాలను నేను నమ్మను. కొద్దిగంటలపాటు కొందరిని మోసం చేసి పనిచేయించుకోవడం నాకు నచ్చదు. నా క్రింది ఉద్యోగులు నాతో కలిసి కనీసం మూడు, నాలుగు సంవత్సరాలు పనిచేస్తారు. ఇదొక దీర్ఘకాలిక సంబంధం. సమస్యలకు నాదైన రీతిలో పరిష్కారాన్ని కనుక్కోవలసి వచ్చేది. మా సంస్థలో ఉన్నతాధికారులకు చాలా అధికారాలు ఉన్నాయి. కానీ అవన్నీ కాగితాల వరకే పరిమితం. వాటిని ఉద్యోగుల మీద ఉపయోగించడం అసాధ్యం. ఈ అధికారాలను వినియో

# నిజమైన నాయకుడు





గించడం సంఘాలతో విరోధం తెచ్చుకోవడమే అవుతుంది. చట్టపరమైన పద్ధతులను వాడడం ద్వారా సరైన పరిష్కారాలు లభించవని అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను.

ఈ కారణాల వల్ల నిజాయతీ, నిష్కాపట్యం, సత్ప్రవర్తనతో సమస్యలను పరిష్కరించడం సరైన పద్ధతిగా నాకు తోచింది."

"మొదట కొద్దినెలల్లో నేను వాళ్ళను మోసం చెయ్యడానికి ప్రయత్నిస్తున్నానేమోనని నా క్రింది ఉద్యోగులకు అనుమానం, సందేహం ఉండేవి. మనసును నొప్పించేలా ఉన్నవారి ప్రవర్తనను నేను ఓర్పుతో భరించాను. చెప్పక తప్పని పరిస్థితిలో నేను సరైన రీతిలో వారికి సమాధానమిచ్చేవాణ్ణి. నేనే చూడక ఏదైనా పొరపాటుచేస్తే వెంటనే నిజాయతీతో నా తప్పు ఒప్పుకుని దాన్ని సరిచేసుకునేవాణ్ణి. నా పని మీద ఏకాగ్రత చూపాను. అప్పట్లో రోజూ ఉదయం 9.30 నుండి రాత్రి 9.00 గంటలవరకూ పనిచేసేవాణ్ణి. నిజానికి చెయ్యవలసిన పని చాలానే ఉండేది. పైగా నా క్రింది ఉద్యోగులకు నా పట్ల నమ్మకం కలగాలి. క్రమంగా నేను తగినంత అనుభవం, జ్ఞానం సంపాదించాను. మంచి ఆత్మవిశ్వాసం, నైతిక స్థైర్యం అలవడ్డాయి. నేను ఇతరులకన్నా ఎక్కువసేపు ఆఫీసులో ఉండి ఎక్కువ పని చెయ్యడం వల్ల ఒక రకమైన ఆధిక్యాన్ని సంపాదించాను. ఇతరులను పనిచేయాలని చెప్పగలిగే నైతికబలం నాకు వచ్చింది. గొప్ప ఓరిమి కూడా అలవడింది. విసుగునూ, కోపాన్నీ జయించడం నాకు గొప్ప సవాలుగా నిలిచింది. ఉద్రేకాలకు లోనైతే ఏ చిన్న సమస్య అయినా ఎంత తీవ్రమవుతుందో నేను అనుభవం మీద తెలుసుకున్నాను. ఆ తర్వాత నేను నిరంతరం అభ్యాసం చేసి ఆత్మనిగ్రహం అలవరచుకోవాలని నిర్ణయించుకున్నాను. ఇది ఆరంభంలో చాలా మానసిక ఒత్తిడిని కలిగించింది. కానీ అదుపు లేకుండా మాట్లాడడం వల్ల పనులు ఎలా చెడిపోతాయో చక్కగా తెలుసుకుని, క్రమంగా నేను ఆత్మనిగ్రహాన్ని అలవరచుకున్నాను."

"బీమా వ్యాపారానికి బీమా ఏజంట్లను వెన్నెముకగా అభివర్ణిస్తారు. కొందరు ఏజంట్లు కలహ ప్రియులుగా ఉంటారు. తమ పనులు వెంటనే జరగాలని కోరతారు. అలా కాకపోతే వాళ్ళు అరుపులూ, కేకలకు దిగడమేకాక పై అధికారులకు ఆకాశరామన్న ఉత్తరాలు కూడా వ్రాస్తారు. ఒకసారి అలాంటి ఏజంటు ఒకడు అంగీకారయోగ్యం కాని ఏదో ఒక అదనపు సౌకర్యం కావాలని కోరాడు. సంబంధిత అధికారి అందుకు అనుమతించలేదు. దానితో ఆ ఏజంటు కోపం పట్టలేక "మీ ఏజంట్లు మీ సంస్థకు వెన్నెముక అని ఎందుకు అంటారు?" అంటూ అరిచాడు. నా క్రింది ఉద్యోగుల్ని రక్షించే బాధ్యత నాది కనుక, ఆ ఏజంట్‌తో, "వెన్నెముక వెనుక ఉండాలి కానీ ముందు ఉండకూడదు!" అన్నాను. ఆ మాటతో కార్యాలయం నవ్వులతో నిండిపోయింది. ఆ ఏజంట్ అవమానంతో వెళ్ళిపోయాడు. నా క్రింది ఉద్యోగులు సంతోషించారు. కానీ తర్వాత ఆ ఏజంట్ నా ఉన్నతాధికారులకు నా మీద ఫిర్యాదు చేశాడని తెలిసింది. కానీ వారికి నా నిజాయతీ గురించి తెలుసు కనుక వాళ్ళు నన్ను తప్పుగా అర్థం చేసుకోలేదు. ఆ ఫిర్యాదును పట్టించు కోలేదు. ఇటువంటి సంఘటనలు చాలా జరిగాయి."

ప్రేమకు జాతి, కుల, మతాలు ఉండవు. పవిత్రప్రేమ క్రిందివారి హృదయాలను గెలుచుకోగలదు. ఇదే ప్రేమలోని ఇంద్రజాలం! e *(సశేషం)*

అనువాదం: **అమిరపు నటరాజన్**



- స్వామి పరిజ్ఞేయానంద

## సమస్యల పరిష్కారానికి సరికొత్త శీర్షిక

**స్వామి వివేకానంద ఆశలన్నీ యువతరంపైనే. ఈ తరం యువతీయువకుల మానసిక, విద్యావిషయిక, కుటుంబ సమస్యలకు 'యువవాణి' శీర్షికలో పరిష్కారాలు కనిపిస్తాయి. ఎంపికచేసిన ప్రశ్నల్ని, సమాధానాల్ని 'శ్రీరామకృష్ణప్రభ' 'యువవాణి' శీర్షికలో ప్రచురిస్తాం. మీ సమస్యలను ఉత్తరాలు, ఈ- మెయిల్ ద్వారా పంపవచ్చు.**

మీ సమస్యలు పంపాల్సిన చిరునామా:

**యువవాణి,**
**శ్రీరామకృష్ణప్రభ,**
**రామకృష్ణమఠం, దోమల్‌గూడ,**
**హైదరాబాద్-500 029**

H0# polo# =# unsudekolxydybj1Cjpolo1frp

---

సాయికుమార్, హైదరాబాద్

**ప్రశ్న : ఎప్పుడూ ప్రథమశ్రేణిలో పాసవ్వాలన్నది నా లక్ష్యం. పరీక్షల ముందు ఆందోళన ఎక్కువవుతోంది. ప్రశాంతంగా పరీక్షలకు సిద్ధమవ్వాలంటే ఏం చేయాలి?**

**జవాబు :** ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణమవాలని అనుకోవడం మంచిదే! కానీ అందుకు తగిన పరిశ్రమ అవసరం. అంతమాత్రాన మానసికంగా ఒత్తిడికి గురికావద్దు. ఫలితాలను ఆలోచించడం మొదలుపెడితే, మీకు ఆందోళన పెరుగుతుంది. పరీక్షల ముందు తగిన ఆహారం,వీలైనంత విశ్రాంతి తీసుకోవడం అవసరం! Eh# qpw# diudlg# ri# dqjwklqj1# # Wkh# prphqw# |rx# ihho/# |rx# dlh qhegj1 ఇలా మనోధైర్యాన్ని పెంచే స్వామి వివేకానంద సూత్రాన్ని గుర్తుంచుకోండి. ప్రశాంతమైన మనసుతో దేనినైనా సాధించవచ్చు. ప్రయత్నించండి!

విజయ్, సికింద్రాబాద్

**ప్రశ్న : నేను చదువుకోవాలని కూర్చోగానే స్నేహితులు ఏదో విధంగా ఆటంకపరుస్తున్నారు. పరీక్షలకు సరిగ్గా సిద్ధం కాకపోవడానికి వాళ్ళే కారణమనిపిస్తోంది. కాదంటారా?**

**జవాబు :** మీరు మీ ఓటమిని వేరొకరిపై నెట్టే ప్రయత్నం చేస్తున్నారు. అది తప్పు. స్వామి వివేకానంద *Z## dlh# w# wdlh# folh# ri# rxuvhoyhv# 0# wkdw# pdfk# z## fdq# g# 0 dog# jlyh# xs# dwwhpsjlqj# wr# wkhu# iru# d# wlph1 అన్నారు. స్నేహితులకు నిక్కచ్చిగా మీ ఇబ్బందిని తెలపండి. మీ సమస్యకు కారణాల్ని వేరొకరికి అంటగట్టినంత కాలం మీలో ఎదుగుదల ఉండదు. పూర్తి బాధ్యతను మీ పైనే వేసుకోండి. నేనున్న స్థితికి నేనే కారణం అని ధైర్యంగా అంగీకరించండి. అప్పుడే మీరు అభివృద్ధి దిశగా మొదటి అడుగు వేయగలరు. మీ భవిష్యత్తుకు మీరే సృష్టి కర్తలని తెలుసుకుని, ఆ దిశగా ప్రయత్నం చేయండి.

రాంచంద్ర, హైదరాబాద్

**ప్రశ్న : నేను గతంలో ఎన్నో తప్పులు చేశాను. అవి గుర్తుకు వచ్చినప్పుడల్లా కుమిలిపోతున్నాను. దీనికి పరిష్కారమేమిటి?**

**జవాబు :** తప్పుచేయడం మానవ సహజం, దాన్ని సరిదిద్దుకొని ముందుకు సాగిపోవడం ధీరగుణం. 'గోడ తప్పు చేయదు. ఎందుకు? అది మనిషి కాదు కాబట్టి' అన్నారు స్వామి వివేకానంద. తప్పులు చేయకుండా ఉన్నవాడి కంటే తప్పులు చేసి సరిదిద్దుకోగలిగినవాడే నిజమైన వీరుడు, ధీరుడు. చేసిన తప్పుల్ని తలచుకుంటూ మధన పడకండి. మళ్ళీ ఆ తప్పులు చేయకుండా జాగ్రత్తపడండి. చేసిన తప్పుల్ని విజయానికి సోపానాలుగా మలుచుకోండి.

*Ohw# wkh# ghdg# sdvw# exu|# lwv# ghdg1*
Wkh# lqilqlwh# ixwxuh# lv# ehiruh# |rx1

అని స్వామి వివేకానంద అంటారు. కాబట్టి మీరు గతాన్ని మరిచి గమ్యం చేరడానికి ప్రయత్నించండి. e



# రామకృష్ణ మిషన్




**5/475, ట్రంకు రోడ్డు, కడప – 516 001 (ఆంధ్ర ప్రదేశ్)**

ఫోను: 08562 – 241633, *E - mail: kadapa math@ yahoo.com; website: www.rkm-kadapa.org*


## విజ్ఞప్తి

**రా**యలసీమ ప్రాంతానికి చెందిన కడప పట్టణంలో రామకృష్ణ మిషన్ శాఖ 2005లో ప్రారంభమైంది. ఆధ్యాత్మిక, సాంఘిక, సేవా రంగాలలో సేవలందించడానికి కడప శివార్లలో శాటిలైట్ – టౌన్‌షిప్‌గా రూపుదిద్దుకుంటున్న సుందరమైన ప్రాంతంలో రాష్ట్ర ప్రభుత్వం రామకృష్ణ మిషన్‌కు పది ఎకరాల భూమిని కేటాయించింది. ఈ స్థలంలో క్రింద తెలిపిన కార్యక్రమాలతో ఆధ్యాత్మిక సేవా కేంద్రం అభివృద్ధికి రామకృష్ణ మిషన్ ఒక బృహత్తర ప్రణాళికను రూపొందించింది.




**1. శ్రీరామకృష్ణుల విశ్వజనీన మందిరం**

**2. సాధు నివాస భవనం**

**3. కార్యాలయం, గ్రంథాలయం, పుస్తక విక్రయశాల**

**4. పాఠశాల భవనం –** పేద విద్యార్థులకు ఉత్తమ ప్రమాణాలతో విద్య నేర్పడానికీ, ఉన్నత పాఠశాలల విద్యార్థులకు ఉచితంగా ప్రత్యేక శిక్షణా తరగతులు నిర్వహించడానికీ ఈ పాఠశాల భవనం.

**5. ఉచిత హాస్టల్ భవనం:** ఉన్నత పాఠశాలలకు చెందిన పేద విద్యార్థుల బస కోసం ఈ ఉచిత హాస్టలు.

**6. ఆరోగ్య కేంద్రం:** హోమియో, ఆయుర్వేదం, ఫిజియోథెరపీ విభాగాలతో ఉచిత వైద్య సేవలందిస్తుంది.

**7. సభా ప్రాంగణం:** విద్యా సాంస్కృతిక కార్యకలాపాలు, ఉచిత మధ్యాహ్న భోజన వసతి నిర్వహించడానికి వీలుగా విశాలమైన భవనం.

**8. మానవ వనరుల అభివృద్ధి (హెచ్.ఆర్.డి) సంస్థ:** స్పోకెన్ ఇంగ్లీషు, కంప్యూటరు శిక్షణ, యోగా, విలువల ఆధారిత విద్యల శిక్షణ తరగతులను ఈ సంస్థ నిర్వహిస్తుంది.

**9. హెచ్.ఆర్.డి సంస్థ అతిథి బోధకులకు వసతి గృహం:** మానవ వనరుల అభివృద్ధి సంస్థ రెసిడెన్షియల్ కోర్సులో శిక్షణ పొందే విద్యార్థులకూ, అతిథి బోధకులకూ బస కోసం వసతి గృహం.

**10. గ్రామీణాభివృద్ధి సంస్థ:** గ్రామీణ యువకులకు తోటల పెంపకం, సాగునీటి యాజమాన్యం, గ్రామీణ ఆర్థికవ్యవస్థ, తేనెటీగల పెంపకం, పుట్టగొడుగుల పెంపకం, నీటి పంపుల మరమ్మత్తుల లాంటి అంశాల్లో శిక్షణ కోసం భవనం.

సహజ సుందరంగా శోభిల్లుతున్న ఆ పది ఎకరాల స్థలంలో ఇప్పటికే ఈ పని ప్రారంభమైందని హితులకూ, శ్రేయోభిలాషులకూ సంతోషంగా తెలియజేస్తున్నాం. దాదాపు 550 లక్షల రూపాయల అంచనాలతో ప్రారంభమైన ఈ ప్రజోపయోగమైన పనులకు ప్రతి ఒక్కరి నుంచీ ధన, వస్తు సహాయ, సహకారాలు అర్థిస్తున్నాం. విరాళాలను కృతజ్ఞతతో స్వీకరిస్తాం.

**'రామకృష్ణ మిషన్, కడప'** పేరిట చెక్కులు, డ్రాఫ్టుల రూపంలో విరాళాలను **'సెక్రటరీ, రామకృష్ణ మిషన్, 5/475, ట్రంకు రోడ్డు, కడప – 516 001'** అనే చిరునామాకు పంపవలసిందిగా కోరుతున్నాం. మీరిచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం మినహాయింపు ఉంది. పెద్ద మొత్తాలిచ్చే దాతల పేర్లు పాలరాతి మీద, ప్రత్యేక శిలా ఫలకాల మీద వ్రాయిస్తాం.

భగవత్సేవలో

**స్వామి ఆత్మవిదానంద**

కార్యదర్శి

యువవాహిని

- శ్రీరామ్

కొంత మంది బెస్త జాతి స్త్రీలు తీవ్రమైన తుపానులో చిక్కుకొని ఒక ధనవంతుని ఉద్యానంలో ఆశ్రయం పొందారు. ఆ ఉద్యానంలో సుగంధ పరిమళాలు వెదజల్లే పూల చెట్లు ఎన్నో ఉన్నాయి. వారు ఆ సువాసనా భరితమైన ప్రదేశంలో నిద్రించేందుకు ఎంతో ప్రయత్నించారు. కానీ వాళ్ళకు ఓ పట్టాన నిద్ర రాలేదు. ఇంతలో ఒక స్త్రీ వారు తమ చేపల బుట్టలను ఉంచిన స్థలానికి వెళ్ళి, వాటిని వారున్న ప్రదేశానికి తీసుకువచ్చింది. దాంతో, అలవాటైన ఆ చేపల వాసనతో వారంతా సుఖంగా నిద్రించారు. మనం కూడా ఒక ఉన్నత విషయాన్ని సాధించాలని అనుకుంటాం కానీ తరచుగా మన పాత అలవాట్లకే వశమైపోతూ ఉంటాం. మనలో చాలా మంది సమస్య ఇదే!

**మనసును నియంత్రించడం అంటే...?**

ప్రతి ఒక్కరికీ మానసిక శక్తి సమానంగా ఉంది. అయితే దానిని ఎవరూ పూర్తిగా వినియోగించుకోరు. ఎందుకంటే మన అదుపులో ఉండి, మనకు ఉపయోగపడడానికి సిద్ధంగా ఉన్న మనశ్శక్తి చాలా తక్కువ. నియంత్రణ లేక ఎంతో శక్తి నిరుపయోగమై పోతుంది. ఈ మనసే మనల్ని వెనక్కి లాగుతూ ఉంటుంది. మన లక్ష్యమంతా వృథా అవుతున్న ఈ మనసును ఉపయోగించడం ఎలా అనే! అదుపుచేయబడిన మనసు ఒక పరుసవేది. అది విలువ లేని ఇనుమును సైతం విలువైన బంగారంగా మారుస్తుందని స్వామి వివేకానంద చెప్పేవారు.



వ్యక్తుల మధ్య వ్యత్యాసానికి కారణం వారి ఏకాగ్రతలోని భేదమే అని స్వామి వివేకానంద అనేవారు. నిరుపయోగంగా ఉన్న ఎంతో మానసిక శక్తిలో కొంతైనా ఉపయోగించుకొని మనం కూడా మెరుగైన ఫలితాలను పొందవచ్చు. విజయపథంలో పయనిస్తున్న వారి రహస్యం ఇదే! లక్ష్యసాధనలో మనసు మిత్రుడిగా మారి సహకరించడం వల్లే వారీ స్థితికి చేరుకోగలిగారు. మరి మనకేమో మనసే మొదటి శత్రువు! మనం ఒకడుగు ముందుకేస్తే అది మనల్ని పదడుగులు వెనక్కి లాగుతుంది. భగవద్గీతలో చెప్పినట్లు -

**బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః।**
**అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥**

మనసును జయిస్తే అది మనకు స్నేహితుడు, లేకపోతే అదే మనసు మనకు శత్రువు.

**విద్య అంటే...?**

విద్య పరమలక్ష్యం మనో నియంత్రణే కానీ విషయసేకరణ కాదని స్వామి వివేకానందుల అభిప్రాయం. నియంత్రితమైన మనసుతో ఎన్ని విషయాలైనా అత్యంత తక్కువ కాలంలో సేకరించవచ్చునని ఆయన చెప్పేవారు. స్వయంగా ఆయనే విజ్ఞాన సర్వస్వాలను తక్కువ కాలంలో జ్ఞాపకముంచుకొన్న సంగతి మనందరికీ తెలిసిందే!

***కొత్తగా కొన్న విజ్ఞానసర్వస్వ సంపుటాలను చూసిన ఒకరు, 'ఒక జీవిత కాలంలో వీటిని చదవడం అసాధ్యం' అని వ్యాఖ్యానించారు. కానీ అప్పటికే స్వామీజీ పది సంపుటాలు పూర్తి చేసి పదకొండో సంపుటాన్ని చదవడం మొదలుపెట్టారని అతనికి తెలియదు. అప్పుడు స్వామిజీ మొదటి పది సంపుటాల్లో ఏదైనా విషయంపై ప్రశ్నించమని అతనికి చెప్పారు. ఆ వ్యక్తి స్వామీజీని ఆ యా పుస్తకాలలో ఉన్న విషయాలపై ప్రశ్నలడిగాడు. పుస్తకాలలో ఉన్న పదాలతోనే ఆ ప్రశ్నలకు ఎంతో వివరంగా స్వామిజీ జవాబు లిచ్చారు. ఆశ్చర్యపోవడం అతని వంతయింది.***

కాబట్టే విద్య మనసుకు పదును పెట్టి, శక్తిమంతంగా మార్చేదిగా ఉండాలి కానీ దాన్ని నిర్వీర్యం చేసేదిగా ఉండకూడదు.

పరిస్థితుల ప్రాబల్యం వల్ల ఇద్దరు వ్యక్తులు చెట్లు నరకడాన్ని తమ వృత్తిగా చేసుకున్నారు. ఒకడు ఎంతకాలం పని చేసినా ఎదుగూ బొదుగూ లేకుండా ఏ రోజు తిండి కోసం ఆ రోజే పనిచేసేవాడు. కానీ మరొకడు ఎంతో త్వరగా ఎదిగిపోయి ధనవంతుడయ్యాడు. ఎందుకిలా జరిగిందంటే, ధనవంతుడిగా ఎదిగిన వ్యక్తి ఏం చెప్పాడో తెలుసా! గొడ్డలిని ఎప్పుడూ పదునుగా ఉంచుకోవడమే తన విజయరహస్యమన్నాడు.

మనసును ఎన్నో విషయాలతో నింపి మనం దాన్ని మొద్దుబారుస్తూ ఉంటాం. కొంత సమయాన్ని మనసును పదును పెట్టడానికి కేటాయిస్తే తక్కువ శ్రమతో ఏ పనినైనా మరింత బాగా చేయగలం. మానసిక ఒత్తిడిని తగ్గించు కోగలం. ప్రతికూల పరిస్థితులలో సైతం మనల్ని మనం అదుపులో ఉంచుకొని, ఇతరులు ఆశ్చర్యపోయేలా ఫలితాలు సాధించగలం.

**నియంత్రణ ఎవరికి అవసరం?**

ఏదైనా లక్ష్యాన్ని సాధించాలని అనుకుంటే, జీవితంలో పరిపూర్ణ సుఖ శాంతులను పొందాలనుకుంటే మనల్ని మనం అదుపులో ఉంచుకోవడం అభ్యాసం చేయాలి. నిజానికి మనసు బలంగా ఉన్నప్పుడు అంటే విద్యార్థి దశలో, లేదా యౌవనంలో మనసును నియంత్రించడం ప్రారంభించాలి. ఎందుకంటే మెత్తని మట్టిని రకరకాల ఆకారాల్లోకి మార్చవచ్చు. కానీ గట్టిపడిన తరువాత అది ఏ మార్పుకూ స్పందించదు. బలంగా ఉన్న పొగరు బోతు గుఱ్ఱాన్ని కష్టపడి లొంగదీస్తే దానిపై విజయ వంతంగా స్వారీ చేయవచ్చు. కానీ ముసలిదై, బలహీనమైన గుఱ్ఱాన్ని లొంగదీయవలసిన పనే లేదు కదా!

మనసును అదుపు చేయడం కొద్దిగా కష్టమైన పనే! అయితే, వచ్చేలాభంతో పోలిస్తే పడే కష్టం ఎంతో తక్కువ. ఒక స్థాయి దాటిన తరువాత మనోనియంత్రణ అనేది ఒక ఆటగా మారుతుంది. అప్పటివరకు ఎవరైనా సరే కొద్దిగా శ్రమించక తప్పదు. ఒక సుభాషితం దీన్ని చక్కగా వివరిస్తుంది.

***చీమ ఎంత చిన్నదైనా అడుగు తరువాత అడుగు వేస్తూ ఎంతో దూరం ప్రయాణిస్తుంది. గండభేరుండ పక్షి ఎంత పెద్దదయినా, దానికి ఎంత పెద్ద రెక్కలున్నా ఒక చోట కూర్చుంటే అంగుళం కూడా ముందుకు కదలదు.*** వేయి మైళ్ళ ప్రయాణాన్ని కూడా ఒక్క అడుగుతోనే మొదలు పెట్టాలి. ఆ వైపుగా ముందడుగు వేసే రోజు ఈ రోజే కావాలి.

*ఏకాగ్రతే విద్యాభ్యాసంలోని రహస్యం. తొంభై శాతం ఆలోచనాశక్తిని సాధారణ వ్యక్తి వ్యర్థం చేస్తాడు. అందువల్ల అతడు ఎక్కువ తప్పులు చేసే అవకాశం ఉంది. మనసుకు శిక్షణనిస్తే ఇక ఆ మనిషి ఎన్నడూ పొరపాట్లు చేయడు.*

*- స్వామి వివేకానంద*

## మంచి చేసే ఆలోచన

హనుమాన్ సింగ్ తన టిబెట్ సహచరునితో కలిసి అతి తీవ్రమైన చలిలో ప్రయాణం చేస్తున్నాడు. మంచు విపరీతంగా కురుస్తోంది. ఎముకలు కొరికే చలిలో వారు ముందుకు వెళ్ళలేక దాదాపు మొద్దుబారి పోయారు. ఆ సమయంలోనే స్పృహ లేకుండా ఆ మంచులో పడి ఉన్న ఒక వ్యక్తిని వారు చూశారు. "అతణ్ణి మనం రక్షిద్దామా?" అని హనుమాన్ సింగ్ తన సహచరుణ్ణి అడిగాడు. తమను తాము రక్షించుకోవడమే తెలివైన పని అని చెబుతూ టిబెటీయుడు ముందుకు సాగిపోయాడు.

హనుమాన్ సింగ్ చావుబ్రతుకుల్లో ఉన్న ఆ మనిషిని కష్టపడి ఎత్తగలిగాడు. తన భుజంపైన అతణ్ణి మోస్తూ ఎంతో ప్రయాసపడుతూ ప్రయాణం కొనసాగించాడు. అలా ఎక్కువ కాలం గడవకుండానే తన సహచరుడు మధ్య దారిలో చనిపోయి ఉండడం చూశాడు. తీవ్రమైన చలికి తట్టుకోలేక కొద్దిసేపటి క్రితమే అతడు చనిపోయి ఉంటాడని హనుమాన్ సింగ్ భావించాడు.

ఎంతో బరువును మోస్తూ చాలా దూరం ప్రయాణం చేయడం వల్ల హనుమాన్ సింగ్ శరీరంలో విపరీతమైన వేడి పుట్టింది. అందువల్ల భయంకరమైన చలి కూడా అతణ్ణి బాధించలేక పోయింది. అతని భుజాల పైనున్న ఆ అభాగ్యుడు కూడా అతని ద్వారా వేడిని గ్రహించి మెల్లగా కోలుకోవడం ప్రారంభించాడు. చిట్ట చివరకు వారు క్షేమంగా ఒక గ్రామం చేరుకున్నారు.

ఇతరులకు మేలు చేయడం నిజంగా మన మేలు కోసమే. పరులకు మంచి చేయడం వల్ల మనస్సులోని వంకరలన్నీ సరి అవుతాయి. ఇతరులకై మంచిని తలచినా సరే అది మనసుకు కొండంత బలాన్నిస్తుంది. e

*మనసును నిర్మలపరచడమంటే 'నేను, నాది' అని ఆలోచించకుండా ఉండడం, స్వార్థ చింతనను విడిచి పెట్టడమే ఉత్తమమైన మార్గం. ఈ విధంగా మనసు విశాలమైతే మనకు ప్రాపంచిక లాభాలెన్నో చేకూరు తాయి. మానసిక వికాసంతో పాటు మనో నియంత్రణ కూడా సులభమవుతుంది.*

*- స్వామి అభేదానంద*

యువవాహిని

# మహనీయుల జీవితాల్లో మధుర ఘట్టాలు

- శ్రీధర్



## గురువును గెలిచిన శిష్యుడు

ఒక ప్రొఫెసర్ తన విద్యార్థులతో, "భగవంతుడు అన్నింటినీ సృష్టించాడా?" అని అడిగారు. "అవును, ఆయనే సృష్టించాడు" అని ఒక విద్యార్థి సమాధానమిచ్చాడు.

"భగవంతుడు అన్నింటినీ సృష్టించాడు, అలాగే చెడును కూడా సృష్టించాడు. కాబట్టి భగవంతుడు చెడ్డవాడు" అని ప్రొఫెసర్ తీర్మానిస్తూ, "భగవంతునిపై నమ్మకం" అనేది భ్రమ అని వాదించాడు.

"సార్! నేనో ప్రశ్న అడగవచ్చా?" అంటూ ఓ విద్యార్థి లేచాడు.

అడగమన్నాడు ప్రొఫెసర్.

"సార్! చల్లదనం ఉందాండీ" అని అడిగాడు విద్యార్థి. "అదేం ప్రశ్న! చల్లదనం ఉంటుంది కదా! నీకెప్పుడూ అది అనుభవంలోకి రాలేదా?" అన్నాడు ప్రొఫెసర్.

అప్పుడు ఆ విద్యార్థి "భౌతికశాస్త్రం ప్రకారం చల్లదనం అనేది ప్రత్యేకంగా లేదు కద సార్! ఉష్ణోగ్రత లేకపోవడాన్నే చల్లదనమని అనుకుంటున్నాం. వస్తువులో ఉష్ణోగ్రత లేదు గనుక, వేడిగా లేదని చెప్పడానికే మనం చల్లదనం అనే పదాన్ని ఉపయోగిస్తాం" అన్నాడు.

"చీకటి ఉందా?" అని మరోసారి ప్రశ్నించాడు ఆ విద్యార్థి. "అవును, ఉంది కదా" అన్నాడు ప్రొఫెసర్.

"మళ్ళీ మీరు పొరబడ్డారు!" అంటూ ఆ విద్యార్థి ఇలా చెప్పాడు: "సార్, చీకటి అనేదే లేదు. వెలుతురు లేకపోవడాన్నే మనం చీకటి అంటున్నాం. వెలుతురును అధ్యయనం చేయగలం గానీ, చీకటిని అధ్యయనం చేయలేం."

"మరి చెడు ఉందాండీ?" అని చివరి ప్రశ్న సంధించాడా విద్యార్థి. "అవును ఉంది. నేను మొదటే చెప్పానుగా, ఈ లోకంలో ఘోరాలు, హత్యలు అన్నీ చెడే కదా" అన్నాడు ఆవేశంగా ప్రొఫెసర్. దానికి ఆ విద్యార్థి "సార్, చెడు అనేదే లేదు, మంచి లేకపోవడమే చెడు అనుకుంటున్నాం. అంటే మనిషి హృదయంలో భగవంతుడు లేకపోవడాన్నే పాపం అనే పదంతో నిర్వచిస్తున్నాం" అని జవాబిచ్చాడు.

ఆ తర్వానికి కంగుతిన్నాడు ప్రొఫెసర్. తాను ఓడిపోయానని అంగీకరిస్తూ ఏమీ వాదించలేక తల దించుకున్నాడు. అంతటి ప్రొఫెసర్‌ని కూడా తర్కంతో భగవంతుడు ఉన్నాడని ఒప్పించిన ఆ విద్యార్థి ఎవరో తెలుసా? ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్త ఆల్బర్ట్ ఐన్‌స్టీన్.

## ప్రధాన మంత్రినే కదిలించిన కర్మయోగి



అది 1961 సెప్టెంబర్ 15... బెంగుళూరులోని లాల్‌బాగ్ భవనమది. 'భారతరత్న' మోక్షగుండం విశ్వేశ్వరయ్య శతజయంతి వేడుక. స్వయంగా ఆయనా వేదికపై ఆసీనులై ఉన్నారు. ప్రధాన మంత్రి జవహర్‌లాల్ నెహ్రూ ముఖ్య అతిథిగా రావలసి ఉంది. కానీ ఆయన అల్లుడు ఫిరోజ్‌గాంధీ పరమపదించి నాలుగురోజులే కావడంతో, నెహ్రూ రారని అందరూ భావించారు. కానీ హఠాత్తుగా నెహ్రూ వేదికపైకి వచ్చారు. "మీ లాంటి జాతిరత్నం శతవసంతాలు జరుపుకోవడం మాకందరికీ గర్వకారణం. మీ జీవితకాలంలో మీ కలల్ని ప్రయోగాత్మకంగా నిరూపించారు. నిరంతరం దేశాభివృద్ధినే కాంక్షిస్తూ మాకు ఆదర్శపురుషులయ్యారు. మీరు కర్మయోగి... ఈ శుభఘడియల్లో మేమూ పాలుపంచుకోవడం మా జీవితంలో మరపురాని విషయం" అంటూ విశ్వేశ్వరయ్యకు శుభాభినందనలు తెలియజేశారు. ఆ భారతరత్నానికి అంతటి విలువ. ప్రఖ్యాత ఇంజనీర్‌గా మోక్షగుండం విశ్వేశ్వరయ్యకు ఎనిమిది విశ్వవిద్యాలయాలు గౌరవ డాక్టరేట్‌లు ప్రదానం చేశాయి. అనన్యమైన కీర్తికిరీటాలతో 1962 ఏప్రిల్ 14న ఆయన ఈ ప్రపంచం నుండి నిష్క్రమించారు.

## ఆత్మజ్ఞాన వశంకరులు

# ఆదిశంకరులు

**భా**రతీయ వైదిక ధర్మం భ్రష్టుపట్టనారంభించింది. వేదాలకు పెడర్థాలు తీసేవారు కొందరు, తమకు అనుకూలంగా ప్రతిపదార్థాలు చెప్పేవారు మరికొందరు బయలుదేరారు. ఈ సమయంలో ఆధ్యాత్మికతకు ఉన్నతినివ్వడానికీ, కువిమర్శకుల కొమ్ములు విరవడానికీ, సనాతన ధర్మసంరక్షణకూ అవతరించాడు ఆది శంకరుడు.

**రాజైనా సాధువుకు సామంతే...** విద్యాభ్యాసం ముగించి సకల శాస్త్రపారంగతుడై, సద్గుణ సంపన్నుడై, తల్లికి ముద్దుల తనయుడై బాల శంకరుడు తన ఏడో ఏట ఇంటికి తిరిగి వచ్చాడు. కఠోర తపస్సుతో క్షీణించిన ఆ మాతృమూర్తి ఒక రోజున మండే ఎండలో బహు దూరంలో ఉన్న పూర్ణానదికి స్నానానికి వెళ్ళి, దారిలో మూర్ఛపోయింది. కన్నతల్లి కష్టాన్ని పోగొట్టడానికై అతడు నదీమతల్లిని దిశను మార్చు కొమ్మని ప్రార్థించి, తమ కుటీరం పక్క నుంచి ప్రవహించేలా చేశాడు.



దశదిశలా వ్యాపించిన పిల్లవాని కీర్తి విని కేరళరాజు ఎన్నో కానుకలతో, పరివారసమేతంగా బాల బ్రహ్మచారిని దర్శించి పలుమార్లు పాదాభివందనం చేసి, వినయంతో తాను రచిం చిన కొన్ని నాటకాలు చదివి వినిపించాడు. అతడి భయ భక్తులకు ముగ్ధుడైన బాల శంకరుడు ఏదైనా వరం కోరుకోమంటే, మీతో సమానుడైన పుత్రుణ్ణి ప్రసాదించమని రాజు అర్థించాడు. పుత్రకామేష్ఠి చేయమని పురమాయించి, తెచ్చిన పసిడి కానుకలను పేద వారికి పంచివేయమని రాజును పంపించాడా పసివాడు.

**కారుణ్య 'వరదా'...** మేఘావృతమైన ఆకాశంతో, ఉరుములు, మెరుపులతో ఐదు రోజులపాటు కుండపోతగా కురిసిన వర్షంతో రేవా నది ఉప్పొంగి జనా వాసాలను జలమయం చేసింది. బాహ్య ప్రపంచాన్ని మరచి గాఢ సమాధిలో మునిగిన శంకరుడికి బాధితుల ఆక్రందనలు ఆందోళన కలి గించాయి. ఒక్క క్షణం కళ్ళు తెరిచి పరిసరాలను పరికించి, అగస్త్యుడు అరచేతితో సముద్రాన్నంతా ఆపోశన పట్టినట్లు, తన కమండలంలో వరదనీటినంతా బంధించాడు. ఈ ఘనకార్యం విన్న గురువు గోవింద పాదుడు త్వరగా యోగసిద్ధి పొందావని ప్రశంసించి, బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాయడానికి వారణాసి వెళ్ళమంటూ ఆది శంకరుని ప్రోత్సహించారు.

**పంచముడి నుండి పాఠం..** ఒకసారి ఆదిశంకరుడు కాశీలో శిష్యసమేతంగా తన మధ్యాహ్నకర్మలు నిర్వర్తించడానికి గంగా నదికి వెళుతున్నాడు. దారిలో ఎదురుగా నాలుగు శునకాలతో ఒక శూద్రుడు రావడం చూసి అహంకారంతో, "చండాలుడా వైదొలగ"మంటూ అరిచాడు ఆచార్యుడు. "తొలగమన్నది శరీరాన్నా? ఆత్మనా? విశ్వమంతా వ్యాపించిన ఆత్మకు కుల, మత, జాతి భేదాలున్నాయా స్వామీ" అంటూ ప్రశ్నించాడా పంచముడు. సాక్షాత్తూ శివుడే ఆ రూపంలో వచ్చాడని గ్రహించిన ఆది శంకరుడు ఆతని పాదాలకు ప్రణమిల్లాడు. నీవే గురువంటూ కీర్తించాడు. తప్పించుకోవాలని అనుకోకుండా తప్పొప్పుకునే ఆయన ధైర్యం మనందరికీ శిరోధార్యం.

**మాతృమూర్తికి మోక్షం...** తల్లి మరణశయ్యపై ఉన్నప్పుడు తన యోగశక్తితో ఆమెవద్దకుచేరి అనునయ వచనాలు పలికి ఏం కావాలో కోరుకోమన్నాడు. "రసవంతుడైన, సగుణుడైన భగవంతునిపై నాకు భక్తిని ప్రసాదించ"మని వేడుకున్న తల్లికి, తక్షణమే ప్రార్థన ద్వారా ప్రమథ గణాలతో కూడిన పరమేశ్వర దర్శనం చేయించాడు. భూత గణాలను చూసి భీతినొందిన ఆమెకు ఆ మరుక్షణమే సకల తేజో విరాజితుడైన విష్ణుమూర్తి దర్శనం కలిగించాడు. మహదానందంతో ఆ మాతృమూర్తి విష్ణువులో ఐక్యమైంది. తీవ్ర కర్మిష్ఠి అయిన మండన మిశ్రుణ్ణి వాదనలో ఓడించి, కర్మకాండలే కర్తవ్యం కాదని ఖండించి, ఆత్మజ్ఞానమే అందరికీ ఆవశ్యకమనే అద్వైత సిద్ధాంతాన్ని స్థాపించాడు ఆది శంకరుడు. e

యువవాహిని

# ప్రేరణాశక్తికి పంచ సూత్రాలు

O 0 Ohduq

H 0 Hyhu|wklqj

D 0 Dqg

G 0 Gluhfw2# Glwulexwh

ఇలా లీడ్ చేసేవాడే నిజమైన నాయకుడు. నాయకత్వం అనగానే అందరికీ ఆధిపత్యం గుర్తొస్తుంది. కానీ మార్గదర్శి కాని వాడు నాయకుడు కాలేడు. అంటే ముందు నడిచేవాడికి 'విజన్' ఉండాలి. అలాంటి దార్శనికతే మహాత్ముడిది. అందుకే ఉప్పుతో కూడా ఉద్యమం తెచ్చాడు గాంధీజీ. అలా తనపై నమ్మకం ఉండేలా నాయకుడు నడుచుకోవాలి. అంతమాత్రాన ఆధిపత్యం చలాయిస్తే ఏ అనుచరుడూ అంగీకరించడు.



ఇక్కడే సమూహనాయకుడికి +Lrs Ohdghu, సంఘటితనాయకుడికి -Whdp Ohdghu, తేడా. బహుళజాతి కంపెనీలు -PQF లు విరివిగా దేశంలోకి వచ్చాక ఉద్యోగనిర్వహణలో, నాయకత్వభావనలో ఎంతో తేడా వచ్చింది. ఈ రోజు ఏ కంపెనీలో చూసినా ఉన్నతాధికారులంతా యువకులే. అందుకే ఎంత త్వరగా నాయకత్వ లక్షణాలు అలవరచుకుంటే, అంత త్వరగా విజయానికి చేరువవుతారు. అందుకే ముఖ్యంగా ఈ యువ నేతలు గుర్తుంచుకోవాల్సిన అంశాలు:

4. Sxqfwxdolw| 0 ***సమయ నిబద్ధత***
5. Glvflsolqh 0 ***క్రమశిక్షణ***
6. Olvwhqlq# Vnloov 0 ***వినదగునెవ్వరు చెప్పిన...***
7. Dgdswdelolw| 0 ***ఇమిడిపోయే తత్త్వం***
8. Prwlydwlrq 0 ***ప్రేరణశక్తి***

ఈ అయిదు అంశాలూ అంతర్లీనంగా అనుసంధానమయ్యే ఉంటాయి.

**1. సమయ నిబద్ధత:** అందరూ అనుకున్నట్లు సమయానికి రావటమే నిబద్ధత కాదు. అనుకున్న సమయంలో లక్ష్యం పూర్తి చేసుకొని రావడమే నిజమైన కాలనిబద్ధత. ఎప్పుడైతే ఇలాంటి నిబద్ధత మనకు అలవడుతుందో అది క్రమశిక్షణ వైపు మొగ్గు చూపుతుంది.

**2. క్రమశిక్షణ:** దార్శనికతతో లక్ష్యాలు ఏర్పరచుకొని, సమయ నిబద్ధత పాటిస్తూనే మనం అవలంబించే పద్ధతి క్రమశిక్షణ. ప్రతి సంస్థకూ ఒక పరిధి, విధివిధానాలు ఉంటాయి. వాటికి అనుగుణంగా మనం నడుచుకోవడమే క్రమశిక్షణ. ఈ లక్షణం ఎంత త్వరగా అలవడితే అంత ముందుకు పోగలం. అయితే ఈ ప్రయాణంలో మనం అవతలవాళ్ళు చెప్పేది వినే సహనం కూడా పెంచుకోవాలి.

**3. వినదగునెవ్వరు చెప్పిన** -Olvwhqlq#Vnloov; విప్రో ప్రేమ్‌జీని ఒకసారి వేదికపైకి వచ్చి స్ఫూర్తిదాయకమైన నాలుగు మాటలు చెప్పమని ఆహ్వానించారట. ఆయన ఒక్క క్షణం వేదికపైకి వచ్చి మైకులో "నాకు చెప్పడం కన్నా వినడమే ఇష్టం" అనగానే హాలు చప్పట్లతో మారుమోగిపోయింది. కాబట్టి ఎక్కువ వినేవాడు విజయం సాధిస్తాడు. వేగంగా లక్ష్యాలు చేరుకునే నాయకుడికి వినే శక్తి ఎక్కువ ఉండాలి.

**4. ఇమిడిపోవడం** -Dgdswdelolw|; సమయనిబద్ధత, క్రమశిక్షణ, మంచి శ్రోతగా ఉండడం – ఇవన్నీ విజయం వైపు పయనించేలా చేస్తాయి.

అయితే వీటన్నింటి తరువాత చివరిది, ముఖ్యమైనది సంస్థలో ఇమిడిపోవడం. మనలో చాలామందికి ఇది కష్టంగా ఉంటుంది. అది మన అస్తిత్వాని -Lghqwlw| ,# ప్రమాదమనుకుంటాం. అదే పొరపాటు. ఎంత పెద్ద యంత్రంలో బోల్టు చిన్నదై ఇమిడిపోయినా దాని ప్రాధాన్యం దానిదే. కాబట్టి సంస్థ విధివిధానాల్లో మనమూ ఒకరిగా, దాని ప్రగతిలో చేయి కలిపితేనే నిజమైన నాయకులం అనిపించుకుంటాం.

***నాయకుడిగా ఎదగాలనుకునేవాడు ముందు మంచి సేవకుడై ఉండాలి. అవసరమైన త్యాగానికి సిద్ధపడకుండానే మనలో చాలామంది నాయకులమవ్వాలని కాంక్షిస్తాం. అందుకే సేనాని ఎప్పుడూ సైన్యానికి ఆదర్శంగా ఉండాలి. సైన్యంలో ప్రతి ఒక్కరినీ సేనానిగా తీర్చిదిద్దగలిగే దార్శనికతను పెంచుకోవాలి.***

**- స్వామి వివేకానంద**

**5. ప్రేరణశక్తి** (Prwlydwlrq): పై నాలుగు అంశాల్ని సమర్థంగా ఆచరించిన నాయకుడికి ఈ ప్రేరణశక్తి దానంతట అదే వస్తుంది. లక్ష్యానికి చేరుకోగానే అనుచరులు ముందు నాయకుడి నుంచి పొందేది ఈ శక్తే. అలాంటి ప్రేరణశక్తి అందివ్వగలిగిన నాడు, తన అనుచరులు కూడా భవిష్యత్తులో నాయకులుగా ఎదగగలుగుతారు. అందుకే తన బంటును కూడా భగవంతుణ్ణి చేసి శ్రీరాముడు ఈ జగత్తుకే నిజమైన నాయకుడయ్యాడు. ##

**- హర్షవర్ధన్**

... 17వ పేజీ తరువాయి


**10** అనేక క్షేత్రాలు దర్శించుకొని సుందరస్వామి తిరువారూరు చేరుకున్నాడు.




**11** సుందరస్వామి కమలాలయం కొలనులో దిగి వెతికాడు.




వెంటనే పరమేశ్వరుణ్ణి స్తుతిస్తూ ఒక కీర్తన పాడాడు. బంగారు కాసుల మూటలు గోచరించాయి. ఒక్కొక్క మూటా తీసి కొలను మెట్ల మీద ఉంచాడు.

**12** బంగారం నాణ్యతను పరీక్షించాలని అనుకున్న సుందరస్వామికి పరమేశ్వరుని ఆనతి ప్రకారం వినాయకుడు ఒక స్వర్ణకారుడైన భక్తుని రూపంలో కనబడ్డాడు. ఆ కాసులను పరీక్షించాల్సిందిగా ఆ భక్తుణ్ణి కోరాడు సుందరుడు.



13

బాధతో సుందరస్వామి మరొక కీర్తనతో పరమేశ్వరుని స్తుతించాడు. తన మిత్రుని కీర్తన వినాలనే నెపం తోనే పరమేశ్వరుడు అలా చేశాడు. ఆ తర్వాత నాణ్యమైన బంగారు కాసులను ప్రసాదించాడు. వాటిని వరీక్షించాల్సిందిగా చెప్పాడు సుందరస్వామి.




నీ సహాయానికి ధన్యవాదాలు! పరవై! ఈ బంగారు కాసులను తీసుకెళ్ళి పంగుణి ఉత్తరం పండుగ ఖర్చులకు వినియోగించుకో!

14



స్వర్ణకారుడికి ఇవ్వవలసిన కూలీ ఇవ్వాలని అతని కోసం చూశాడు సుందర స్వామి! అతను కనబడలేదు! అతని స్థానంలో వినాయకుడు దర్శనమిచ్చాడు! వెంటనే సుందరస్వామి వినాయకునికి ప్రణమిల్లాడు

15






భగవంతుణ్ణి సదా స్మరిస్తూ, భక్తులను సేవించే వారు ధన్యులు. వారికి భగవంతుడు కొంగు బంగారమే! భగవంతుడే స్వయంగా బాధ్యత వహించి వారి అవసరాలను అడిగిన వెంటనే తీరుస్తాడు. - శ్రీరామకృష్ణ




## శ్రీమహాభాగవతము

(మూడు భాగాల సెట్)

**రచన: యామిజాల పద్మనాభ స్వామి, వెల: రూ. 600 (మూడు భాగాలూ కలిపి) ప్రతులకు: నవరత్న బుక్‌హౌస్, 28-22-20, రహమాన్ వీధి, అరండల్ పేట, విజయవాడ-2.**

**తె**లుగు వారికి అత్యంత ప్రీతిపాత్రమైన గ్రంథం బమ్మెర పోతనామాత్యుడి భాగవతం. సామాన్యులకు కూడా కంఠోపాఠమైన పద్యాలున్న ఇంటింటి గ్రంథమిది. నిజానికి, ఉత్కృష్టమైన 'మహాభారత' రచన చేసిన వ్యాస మునీంద్రుడు మనశ్శాంతి దొరకక సరస్వతీ నదీ తీరంలో దిక్కుతోచకుండా కూర్చొని ఉన్నప్పుడు నారద మహర్షి వచ్చి భగవానుని దివ్య లీలలే విషయంగా రచన చేయడం చిత్తశాంతినిస్తుందని కర్తవ్య బోధ చేశాడు. ఫలితంగా వ్యాస మునీంద్రుడు సంస్కృతంలో చేసిన రచన 'శ్రీమద్భాగవతం'. పోతన దాన్ని తెలుగులో పద్యరూపంలో సరళంగా అనువదించాడు. భక్తుల కథలనూ, భగవంతుని లీలలనూ తెలిపే రచన ఇది. ఈ విధంగా పోతన తెలుగు జాతిలో సుస్థిరస్థానం సంపాదించాడు. 'కవి సమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణ వారి మాటల్లో చెప్పాలంటే "పోతన తెలుగు వారి పుణ్యఫలము."

పోతన పద్య రచనను ఆధారంగా తీసుకొని, ఆధునిక కాలానికి తగ్గట్లు దాన్ని వచన రూపంలో పలువురు అందించారు. సామాన్యులకు మరింత సన్నిహితం చేశారు. ప్రస్తుత గ్రంథం మహాభాగవతము సుప్రసిద్ధ పండితులు, స్వర్గీయ యామిజాల పద్మనాభస్వామి రచన. శ్రీకాకుళం జిల్లా శివరామపురంలో 1915 జూన్ 12న జన్మించిన యామిజాల దీర్ఘకాలం మద్రాసులో నివసించి, తమ సాహిత్య కృషి సాగించారు. పలు పద్య, గద్య రచనలు చేసిన ఈ 'కవిరత్న' బిరుదాంకితులు పోతన గ్రంథాన్ని ముందుంచుకొని, సంస్కృతంలోని వ్యాస కృతిని కూడా చూస్తూ ఈ ప్రస్తుత వచన రచన చేశారు. వాడుక భాషలో సాగిన ఈ వచన కృతి అప్పట్లో 'ఆంధ్ర ప్రభ'లో మూడేళ్ళపాటు నిరాఘాటంగా ప్రచురితమైంది. తరువాత మచిలీపట్నం 'త్రివేణీ పబ్లిషింగ్ హౌస్' వారు పుస్తక రూపంలోకి తెచ్చారు. దీర్ఘకాల విరామం తరువాత మళ్ళీ ఇప్పుడీ రచనను మూడు భాగాల సెట్టుగా 'నవరత్న బుక్‌హౌస్' వారు ప్రచురించారు. మానవ ధర్మానికి ముఖ్యమైన మూడంశాలు ఉన్నాయి. అవి: ధర్మస్వరూప నిరూపణం, కర్తవ్య నిర్వహణం, భవబంధ విమోచనం. వీటిలో మొదటిదానికి మహాభారతం, రెండోదానికి రామాయణం, మూడోదానికి భాగవతం దర్పణాలు. భక్తి తత్త్వాన్ని బోధించే భాగవతంలోని కథలు, గాథలు యామిజాల వారి కలంలో మనల్ని మరింత ఆకర్షిస్తాయి. మొదలుపెడితే ఆగకుండా చదివించగలిగిన గుణం ఈ రచనలోని మరో కీలకాంశం. సంస్కృతంలోనో, తెలుగు పద్య రూపంలోనో చదివి భాగవతాన్ని అర్థం చేసుకోలేనివారికి ఈ రచన ఎంతో ఉపయుక్తం. ప్రతి ఒక్కరూ కొని, దాచుకొని పదే పదే చదువుకొనడమే ఇక తరువాయి!

**- రెంటాల జయదేవ**




## తవ చరణం మమ శరణం

**రచయిత్రి: శ్రీమతి చెవుటూరి కుసుమ కుమారి, పేజీలు: 176, వెల: రూ. 85, ప్రతులకు: అలకనంద ప్రచురణలు, మేరీస్ స్టెల్లా కాలేజ్ ఎదురుగా, విజయవాడ- 520 008.**

**ఆ**త్మాశ్రయ కవిత్వానికి ఆలవాలమైన వచన ఖండికలు ముప్ఫై తొమ్మిదింటిని కూర్చిన ముచ్చటైన రచన ఇది. నవదుర్గా వైశిష్ట్యం మొదలు ఉడుత మీద శ్రీరాముడు చూపిన కరుణ సుధ వరకూ రచయిత్రి తన ఆధ్యాత్మిక భావనా స్రవంతిలో పాఠకులను ఓలలాడించారు. చక్కని భావుకత, సర్వభూతదయ, సాధన తత్త్వము, రాముని, కృష్ణుని లీలల విశిష్టత మొదలైన విషయాలు ఇందులో ప్రతిఫలిస్తాయి. "పులుగుల తలపుల్లో పరమేశ్వర భావన" అనే ఖండికలో పక్షిని జీవునిగా భావించి చక్కని రచన చేశారు. చివరలో "పిట్ట మనసులో ఏముందీ?" అన్న ప్రశ్నకు "పరమేశ్వర తత్త్వం" అన్న సమాధానంతో ఇచ్చిన ముక్తాయింపు పాఠకుల మనస్సుల్లో చెరగని ముద్ర వేస్తుంది. భావుకత ప్రధానంగా గల సాహిత్యాన్నీ, దాని పరమార్థమయిన ఆధ్యాత్మిక భావనలనూ జోడించి తేలికైన వచనంలో అందించిన రచయిత్రి ధన్యురాలు. అందరూ చదివి సంతోషించ దగిన గ్రంథం ఇది. #

**- రామకృష్ణమూర్తి**

**గమనిక: 'గ్రంథ పరిచయం' కోసం పుస్తకాలు పంపేవారు తప్పనిసరిగా ప్రతి పుస్తకం రెండేసి ప్రతులు పంపాలి.**

# వార్తావాహిని

## ప్రతిభ చూపిన పాఠశాల విద్యార్థులు

**హైదరాబాద్:** స్వామి వివేకానంద జన్మదినాన్ని (జనవరి 12) పురస్కరించుకొని 'జాతీయ యువజన దినోత్సవం' సందర్భంగా విద్యార్థులకు హైదరాబాద్‌లోని రామకృష్ణ మఠం పోటీలు నిర్వహించింది. స్వామీజీ జీవితానికి సంబంధించిన అంశాలపై రాష్ట్రస్థాయిలో పాఠశాల విద్యార్థినీ విద్యార్థులు తమ ప్రతిభా పాటవాలు ప్రదర్శించారు. ఏడో తరగతి నుంచి పదవ తరగతి వరకు చదువుతున్న విద్యార్థులకు ఆయా తరగతులను బట్టి వేర్వేరుగా ఈ పోటీలు నిర్వహించారు. రాష్ట్రస్థాయిలో 11 జిల్లాల్లోని 136 పాఠశాలలకు చెందిన మొత్తం 9036 మంది విద్యార్థులు ఈ పోటీలో పాల్గొన్నారు. ప్రతి తరగతి నుంచి ముగ్గురేసి విద్యార్థుల్ని ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులకు ఎంపిక చేశారు. అలా మొత్తం 12 మంది విద్యార్థులకు గురుదేవులు శ్రీరామకృష్ణ పరమహంస జయంతి (ఫిబ్రవరి 19) నాడు హైదరాబాద్‌లోని రామకృష్ణ మఠంలో బహుమతులు ప్రదానం చేశారు.

ఏడో తరగతి విద్యార్థుల్లో ఎస్.ఎస్. భ్రమరాంబ (శారదా కాన్వెంట్, అమలాపురం), టి. జ్యోతి (ఎం.పి. అప్పర్ ప్రైమరీ స్కూల్, చిలకలపూడి), డి. లీలారాణి (ఆదర్శ హైస్కూల్, అంకిరెడ్డి పల్లి, కర్నూలు) వరుసగా ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులు గెలుచుకున్నారు. ఎనిమిదో తరగతి నుంచి పోటీలో పాల్గొనవారిలో వై. ప్రవీణ్ (జిల్లా పరిషత్ హైస్కూల్, తగ్గుపర్తి, అనంతపురం) ప్రథమ బహుమతి గెలుచుకోగా, అదే పాఠశాలలో అతని సహచర విద్యార్థి అయిన ఎస్.కె. ప్రకాశ్ ద్వితీయ బహుమతి సాధించాడు. డి. దేవేందర్ రాహుల్ రెడ్డి (బి.జి.కె. జిల్లాపరిషత్ స్కూల్, పెడన, మచిలీపట్నం) తృతీయ బహుమతి అందుకున్నాడు. తొమ్మిదో తరగతి విద్యార్థుల్లో వి. ఇందిర (జిల్లాపరిషత్ హైస్కూల్, తాళ్ళపాలెం, మచిలీపట్నం), జె. చందన (బాలికల ప్రభుత్వ ఉన్నత పాఠశాల, కర్నూలు), ఆర్. స్వాతి (శ్రీబాలాజీ విద్యాలయం, మచిలీపట్నం) వరుసగా ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులు సాధించారు. పదోతరగతి విద్యార్థుల్లో ఎన్. నాగస్పందన (ప్రశాంతి విద్యా నికేతన్, తిరువూరు, కృష్ణాజిల్లా) ప్రథమ బహుమతి, ఎన్. నరేందర్ కుమార్ (జిల్లా పరిషత్ హైస్కూల్, పోలిశెట్టిపాడు, కృష్ణాజిల్లా) ద్వితీయ బహుమతి, పి. లక్ష్మి శరణ్య (శారదా రామకృష్ణ విద్యాలయం, విజయవాడ) తృతీయ బహుమతి గెలుచుకున్నారు. వీరితో పాటు మరో 375 మంది విద్యార్థులకు ప్రోత్సాహక బహుమతులు అందజేశారు. y

## ఉత్తరాంధ్రలో ఆధ్యాత్మిక సాధనా కార్యక్రమాలు

**శ్రీకాకుళం:** ఈ ఫిబ్రవరి 24, 25 తేదీల్లో శ్రీకాకుళం జిల్లా కాపు గోదాయివలస, బావనపాడు గ్రామాల్లో ఆధ్యాత్మిక సాధనా కార్యక్రమాలు జరిగాయి. కాపు గోదాయివలస గ్రామంలో 24న, బావనపాడులో 25న జరిగిన ఈ కార్యక్రమాలకు ముఖ్య అతిథిగా విజయవాడ రామకృష్ణమిషన్ కార్యదర్శి స్వామి శశికాంతానందజీ విచ్చేశారు. సాధనా కార్యక్రమంలో పాల్గొన్న వందలాది భక్తులకు సాధనలో శ్రీరామకృష్ణ బోధనల ప్రాముఖ్యాన్ని వివరిస్తూ, నేటి కాలానికి అవతార వరిష్ఠులైన శ్రీరామకృష్ణుల బోధనలు శిరోధార్యమని స్వామిజీ సూచించారు. బావనపాడులోని కార్యక్రమంలో పేదలకు యువజన సంఘాలు వస్త్రదానం చేశాయి. అటుపై అన్నదానం నిర్వహించారు.

**– నివేదిక:అట్టాడ నరసింహమూర్తి**

## ఏప్రిల్ 1న విజయవాడలో సాధనా కార్యక్రమం

పవిత్ర కృష్ణానదీ తీరాన ఉన్న విజయవాడ సమీపంలోని సీతానగరంలో నెలకొన్న రామకృష్ణ మిషన్ శాఖ ఈ **ఏప్రిల్ 1వ తేదీ ఆదివారం** నాడు భక్తులకు 'ఆధ్యాత్మిక సాధనా కార్యక్రమం' నిర్వహిస్తోంది. ఉదయం 8 గంటల నుంచి మధ్యాహ్నం ఒంటి గంట వరకు ఈ కార్యక్రమం జరుగుతుంది. y

# సుబోధ

**భక్తుడు :** భగవంతుని యందు ప్రేమవున్నట్లు తెలుసుకోవడం ఎలా?

**శ్రీరామకృష్ణులు :** ప్రేమకు రెండు లక్షణాలున్నాయి. చైతన్యుల వంటివారు మొదటి తరగతికి చెందుతారు. వారు బాహ్య ప్రపంచాన్ని మరచి భగవంతుని ప్రేమలో మునిగి ఉంటారు. చైతన్యదేవులు వనాన్ని చూసి బృందావనమనీ, సముద్రాన్ని చూసి యమునా నది అనీ భావించేవారు.

రెండవది, దేహభావం పూర్తిగా నశిస్తుంది. భగవంతుని లీలలు కీర్తిస్తూ సాధుసాంగత్యం చేస్తారు. సమస్త జీవుల యందు దయ, కరుణ కలిగి శాంత స్వభావులుగా ఉంటారు. వీరు అతి త్వరలో భగవంతుని దర్శించ గలుగుతారని గ్రహించవచ్చు. పై అధికారి తనిఖీకి వచ్చేముందు ఆఫీసు అంతా బూజు దులిపి శుభ్రంచేస్తారు. చుట్టుప్రక్కల ఉన్న పిచ్చి మొక్కలు పీకేసి మంచి పూల మొక్కలు నాటుతారు. వీటిని బట్టి యజమాని త్వరలో రాబోతున్నాడని గ్రహించవచ్చు.

**భక్తుడు :** భగవంతుణ్ణి ప్రేమించడం ఎలా ?

**శ్రీరామకృష్ణులు :** ప్రప్రథమంగా భగవన్నామం ఉచ్చరిస్తూ ఉండాలి. తద్వారా కామ క్రోధాలపైన, సుఖాలపైన ఆసక్తి తగ్గుతుంది. భక్తి వృద్ధి పొందుతుంది.

**భక్తుడు:** భగవన్నామంలో రుచి ఏర్పడాలంటే ఏం చేయాలి?

**శ్రీరామకృష్ణులు :** భగవంతుని నామం పట్ల రుచి జనించాలని హృదయపూర్వకంగా ప్రార్థించండి. తప్పకుండా ఆయన అనుగ్రహం కలుగుతుంది. ఆయన అనుగ్రహం లేకుండా భగవన్నామం కూడా జపించలేరు. జ్వరం తీవ్రత ఉన్నపుడు నోటికి ఏమీ రుచించదు. అందుచేత నిరాశ చెందరాదు. ఏ కొంచెమైనా ఆహారం తీసుకోవాలి. జ్వరం తీవ్రత తగ్గిన తర్వాత ఆహారం మామూలుగా తీసుకోగలుగుతాం. ఆ విధంగా మీకు నచ్చిన ఏ రూపమైనా, ఏ నామమైనా భగవంతుని యందు 'రుచి'ని వృద్ధిచెందేటట్లు చేస్తుంది. భగవత్ కృపకు పాత్రులవుతారు. భావానికి తగ్గట్టుగా ఫలితం ఉంటుంది. భగవంతుని యందు ఎంత ప్రేమ కలిగి ఉంటామో అంత ప్రయోజనం కలుగుతుంది. ఇద్దరు స్నేహితులు కలిసి వెళుతున్నారు. దారిలో భాగవత కాలక్షేపం జరుగుతోంది. ఇద్దరు స్నేహితుల్లో ఒకడు కథా శ్రవణానికి పోయి కూర్చున్నాడు. రెండవవాడు మధ్యలో లేచి ఒక వేశ్య ఇంటికి వెళ్లాడు. వేశ్య ఇంటికి వెళ్ళినా మనస్సు మాత్రం భాగవత కాలక్షేపం గురించి ఆలోచించసాగింది. అక్కడ భాగవతం వినడానికి వెళ్లిన స్నేహితుడు మనసులో వేశ్య వద్ద పొందే ఆనందం గురించి ఆలోచించసాగాడు. కొంతకాలమయ్యాక ఇద్దరూ మరణించారు. భాగవత కాలక్షేపానికి పోయిన మొదటివాడు నరకానికి వెళ్లాడు. వేశ్య ఇంటికి పోయిన రెండవవాడు స్వర్గానికి పోయాడు. భగవంతుడు, మనసులోని భక్తిని, ప్రేమను మాత్రమే కోరుకుంటాడు గాని, అతడు ఉండే పరిసరాల అపవిత్రతను పరిగణలోకి తీసుకోడు. లంకను చేరేముందు హనుమంతుడు మనసులో ఈ విధంగా తలచాడు. "నేను శ్రీరాముని సేవకుడను. నేను రాముని పనికోసం బయలుదేరాను. రామనామం జపించాను. ఇక ఏ శక్తీ నాకు అడ్డుగా నిలువలేదు" హనుమంతుని విశ్వాసం అంత దృఢమైనది e

**('శ్రీరామకృష్ణ కథామృతం' నుంచి)**

నిర్వాహక సంపాదకులు : **స్వామి జ్ఞానదానంద** సంపాదకులు : **స్వామి పరిజ్ఞేయానంద**



**శ్రీ రామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029 ఫోన్: 040-2766 7799
E-mail : sriramakrishnaprabha@gmail.com

# సురభి

మాతృదేవి దర్శనార్థం దేశం నలుమూలల నుంచీ భక్తులు వచ్చేవారు. పాటలూ, భజనలూ సాగుతుండేవి. ఎల్లప్పుడూ ఆనంద ప్రవాహం కట్టలు తెంచుకొని ప్రవహిస్తూ ఉండేది. ఇలా ఏదైనా జరుగుతున్నప్పుడు సాధువు ఒకాయన, తాను ఏ పని చేస్తున్నాసరే అది వదిలిపెట్టి ఈ వేడుకలలో పాల్గొనేవాడు. దానిని చూసిన మాతృదేవి ఒక రోజు ఇలా అన్నారు.

"గురుదేవులు వెంచేశారు. అందువల్లనే ఇవన్నీ జరుగుతున్నాయి. ఇంకా ఎంతో జరగబోతోంది. కొత్తకొత్తగా ఇంకా ఎన్నెన్నో చూడబోతారు. అందుకని ఆయన సేవలను వదలుకొని ఇలా పరిగెత్తుకుంటూ రావాలా ? ఇంద్రజాలం చేసేవాడు తన విద్యను చూపుతున్నాడు. చూసేవారు భ్రమించిపోతున్నారు. కానీ అతని ఇంటి స్త్రీలు వాటిని అసలు పట్టించుకోకుండా తమ పనులు చేసుకుంటూ పోతారే కానీ ఇంద్రజాలంతో భ్రమించిపోరు. నువ్వుమాత్రం ఎందుకు పరిగెత్తాలి ? నిశ్చలమైన మనస్సుతో పనిచేయి.

మాతృదేవి ఆరోగ్యం బాగా దెబ్బతింది. అయినప్పటికీ వచ్చేవారితో మాట్లాడడం, దైనందిన కార్యాలలో ఎలాంటి మార్పులేకుండా సాగిపోతూ వచ్చింది. మాతృదేవి మానసిక స్థితిలో ఒక మార్పు స్పష్టంగా కనబడింది. అందరిలోనూ గురుదేవులను చూసి వారిని తమ తనయులుగా భావించి మెలగసాగారు.

ఒక రోజు మఠంలో సన్న్యాసులు కొందరు తపోమయ జీవితం కోసం ఎక్కడికో వెళుతున్నారని విన్నాను. వెంటనే నేను మాతృదేవితో " అమ్మా ! ఇలా ఎల్లప్పుడూ పని చేసుకుంటూ ఉండడం అంత సబబుగా కనబడడంలేదు. నేనూ తపస్సు చేయాలని అనుకుంటున్నాను. మీరు అనుమతి నివ్వాలి" అన్నాను. అప్పుడు మాతృదేవి ఇలా అన్నారు. "ఇదేం మాటలు నాయనా! నువ్వు గురుదేవుల సేవ చేస్తున్నావు. ఇది తపస్సుకంటే తక్కువా? ఇప్పుడు వెళ్ళడంలో ఎలాంటి ప్రయోజనమూ లేదు. పోవాలని మరీ అనిపించినప్పుడు ఒకటి రెండు నెలలు ఎక్కడికైనా వెళ్ళిరా!"

జయరాంబాటి మలేరియా ప్రాంతం. మాతృదేవికి కూడా మలేరియా సోకి ఎంతో కష్ట పడ్డారు. అందువలన ఒకసారి భక్తులు మాతృదేవిని దర్శించడాన్ని శరత్ మహరాజ్ నిషేధించారు. ఆ సమయంలో ఒక భక్తుడు మాతృదేవి దర్శనానికి ఎంతో ఆతురతతో వచ్చాడు. నేను అతన్ని లోపలికి వెళ్ళనివ్వలేదు. ఈ సంగతి తెలసిన మాతృదేవి "అతణ్ణి ఎందుకు లోపలికి పంపడంలేదు?" అని నన్ను అడిగారు. అందుకు నేను, "అమ్మా ! ఎవరినీ లోపలికి వెళ్ల నివ్వరాదని శరత్ మహరాజ్ ఆదేశించారు. ఆరోగ్యం బాగాలేని స్థితిలో మీరు మంత్రదీక్ష ఇవ్వడం జరిగితే, ఆరోగ్యం ఇంకా క్షీణిస్తుంది" అన్నాను. మాతృదేవి "నేను ఇందుకోసమే జన్మించాను. నేను ఇతనికి మంత్రదీక్ష ప్రసాదిస్తాను" అన్నారు. e

(మాతృమూర్తి శ్రీశారదాదేవి శిష్యులైన స్వామి పరమేశ్వరానంద స్మృతుల నుంచి)

Free Soft Copy Ramakrishna Math Hyderabad www.rkmath.org
Vol.64-4, Sri Ramakrishna Prabha (Telugu Monthly) April 2007, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. H-HD-1071/2007-09. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2007-09.




**భక్తుడు :** భగవంతుని యందు ప్రేమ ముఖ్యమా? లేక ప్రార్థనలు, పూజలు ముఖ్యమా?

**శ్రీరామకృష్ణులు :** ముందు భగవంతుని యందు ప్రేమ కలగాలి. తర్వాత ప్రార్థనలు చేయాలి. ప్రతిరోజూ ఆయనను కీర్తించటంలో గడపాలి. మనం వాడుకునే పాత్రలు ఎప్పుడో ఒక రోజు శుభ్రంచేస్తే సరిపోదు, ప్రతిరోజూ శుభ్రం చేయాలి. సంసారం ఎడల వైరాగ్యం, దైవాన్ని గూర్చిన విచక్షణ అనే ఈ పాత్రలను రోజూ శుభ్రం చేయాలి.

**భక్తుడు :** కాంతాకనకాలపట్ల విరక్తి చెందడం ఎలా?

**శ్రీరామకృష్ణులు :** సంసార సుఖాలంటే కాంతా-కనకాలకు సంబంధించిన భోగాలు. పేరు, ప్రతిష్ఠ, సంపద, శారీరకవాంఛలు మొదలైనవి. వాటి అనుభవం అయిన తర్వాతగాని ఎంతో కొంత విరక్తిభావన కలుగదు. పిమ్మట భగవంతుని కోసం వ్యాకులత జనిస్తుంది.

**భక్తుడు :** భగవంతుడు అవిద్యను ఎందుకు సృష్టించాడు?

**శ్రీరామకృష్ణులు :** అది ఆయన లీల. చీకటి లేనిదే వెలుగు విలువ గుర్తించలేం. దుఃఖం యొక్క అనుభూతి తెలియనిచో సంతోషం యొక్క అనుభూతిని పొందలేం. విద్య, అవిద్య రెండూ మాయ యొక్క పరిధిలోనివే. విద్య యొక్క ప్రభావంవల్ల సాధుసాంగత్యం, జ్ఞానసముపార్జన, భక్తి, ప్రేమ వైరాగ్యం వంటి లక్షణాలు సమకూరుతాయి. అవిద్యా మాయవలన రూపం, రసం, గంధం, స్పర్శ, శబ్దం అనే అయిదు గుణాలకు బానిసలై భగవంతుని ఉనికిని మరచి ప్రవర్తిస్తారు.

మామిడికాయ తోలు అడుగు భాగం ముందు వగరుగాను, పులుపుగాను ఉంటుంది. క్రమక్రమంగా వృద్ధి చెంది పండుగా మారుతుంది. పై తోలు పారవేసి పండుతింటాం. అట్లాగే మానవుడు మాయ సహాయంతోనే క్రమేణా పరబ్రహ్మను తెలుసుకో గలుగుతాడు. కాబట్టి విద్య - అవిద్య రెండూ అవసరమే.

**('శ్రీరామకృష్ణ కథామృతం' నుంచి)**




రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029
ఫోన్: 040-2766 7799
E-mail : sriramakrishnaprabha@gmail.com



నిర్వాహక సంపాదకులు : స్వామి జ్ఞానదానంద
సంపాదకులు : స్వామి పరిజ్ఞేయానంద



# శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం







**ఒక విన్నపం :** ఎవరైతే ఒక మొక్కను నాటుతాడో అతడు భగవత్ సేవకుడు. తరతరాలుగా అతను దయాసాగరునిగా కీర్తింపబడతాడు. అపరిచిత వ్యక్తుల ప్రశంసలకు గురవుతాడు.

**విహంగవీక్షణం :** పవిత్ర తిరుమలలోని అడవులు శ్రీవేంకటేశ్వరుడు మానవాళికి ప్రసాదించిన అమూల్య వరం. ఆ అడవులలో వాతావరణ సమతౌల్యాన్ని సాధించాలన్న లక్ష్యంతో తిరుమల తిరుపతి దేవస్థానం శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం పేరుతో పలు పథకాలను ప్రవేశపెడుతున్నది. దాదాపు రూ. 15 కోట్ల వ్యయంతో తిరుమల తిరుపతి దేవస్థానం అటవీశాఖ అమలు చేస్తున్న సమగ్ర హరిత ప్రాజెక్టు క్రింద ఈ పథకాలలో ప్రజలు భాగస్వామ్యం పొందే అరుదైన అవకాశం ఉంది. శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకంలోని ముఖ్యాంశాలు:

**విరాళం వివరాలు :** ఈ పథకం క్రింద కనీసం రూ.1,000 విరాళంగా ఇవ్వాలి. రూ.1,000 కంటే తక్కువగా పంపిన విరాళాలను దాతలకు తెలుపకనే శ్రీవారి హుండీ ఖాతాలో జమ చేస్తాము. విరాళాలన్నింటినీ ఒక జాతీయబ్యాంకులో డిపాజిట్‌చేసి, వాటిపై వచ్చే వడ్డీని ఈ పథకానికి ఉపయోగిస్తాము. విరాళాలను **'ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, శ్రీ వేంకటేశ్వర వనాభివృద్ధి పథకం, టి.టి.డి., తిరుపతి'** పేరుతో చెక్కు లేదా డి.డి. తీసి 'కన్జర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్స్, టిటిడి, తిరుపతి – 517501; ఫోన్ : 0877 – 2230138' కు పంపగలరు. వ్యక్తుల పేరిట కానీ, కంపెనీలు లేక సంస్థల పేరిట కానీ విరాళాలు పంపవచ్చు. వీరు నిర్ణీత సౌకర్యాలు పొందటానికి అర్హులు. ఈ పథకం క్రింద ఆదాయపు పన్ను మినహాయింపు లేదు.

**వృక్ష సౌభాగ్య – విరాళం :** రూ. 10 లక్షలు, అంతకు పైన

**సౌకర్యాలు**

ఈ పథకానికి రూ.10 లక్షలు, అంతకుపైన విరాళమిచ్చే దాతలకు ఈ దిగువ పేర్కొన్న సౌకర్యాలు కల్పిస్తారు.

H దాతకీ అతని కుటుంబానికీ సంవత్సరానికి మూడు రోజులు ఎ.ఆర్.పి కౌంటర్‌లో ఉచిత బస వసతి, లేక వీలును బట్టి డబ్బు చెల్లించే పద్ధతిలో వి.ఐ.పి బస వసతి కల్పిస్తారు. దాతలు ఈ సౌకర్యాన్ని వరుసగా మూడు రోజుల పాటు కానీ, లేక వేర్వేరు దినాలలో కానీ పొందవచ్చు.

H దాత, అతని కుటుంబాన్ని ( 5 గురికి మించకుండా) సంవత్సరానికి మూడు రోజుల పాటు వైకుంఠం క్యూ కాంప్లెక్స్ లోని సెల్లార్ ద్వారా స్వామి వారి దర్శనానికి అనుమతిస్తారు. దాతలు ఈ సౌకర్యాన్ని వరుసగా మూడు రోజుల పాటు కానీ, లేక వేర్వేరు దినాలలో కానీ పొందవచ్చు.

H ఏడాదిలో ఒక మారు దాత దర్శనానికి వచ్చినప్పుడు ప్రసాదంగా 10 చిన్న లడ్లు ఇస్తారు.



H దాత దర్శనానికి వచ్చినప్పుడు ఏడాదిలో ఒకసారి ఉత్తరీయాన్ని బహుమానంగా ఇస్తారు.

H దాత మొదటిసారి దర్శనానికి వచ్చినప్పుడు శ్రీవారు, పద్మావతీ అమ్మవార్ల చిత్రాలున్న బంగారు పూత పూసిన వెండి పతకాన్ని ఇస్తారు.

H ఈ సౌకర్యాలు వ్యక్తులకు జీవిత పర్యంతమూ, కంపెనీలకు 20 ఏళ్ళ పాటు లభిస్తాయి.

**ప్రత్యేక సౌకర్యాలు**

H పవిత్ర తిరుమల కొండల్లో 4000 మొక్కలు నాటుతారు.

H ఆ వృక్షసంపదకు దాత పేరు లేదా దాత సూచించిన వారి పేరు పెడతారు. ఆ మొక్కలను 5 సంవత్సరాల పాటు అభివృద్ధి చేస్తారు.

H తిరుమలలోని ముఖ్య ప్రదేశాల్లో దాత పేరును ప్రదర్శిస్తారు.

**వృక్ష సంవర్ధని – విరాళం:** రూ. 5 లక్షలు, అంతకు పైన

**సౌకర్యాలు**

ఈ పథకం కింద రూ. 5 లక్షలు, ఆ పైన విరాళమిచ్చే దాతలకు ఈ దిగువ పేర్కొన్న సౌకర్యాలను కల్పిస్తారు.

H దాతకూ, అతని కుటుంబానికీ ఏడాదికి మూడు రోజులు ఎ.ఆర్.పి కౌంటర్‌లో ఉచిత బస వసతి, లేక వీలును బట్టి డబ్బు చెల్లించే పద్ధతిలో వి.ఐ.పి బస వసతి కల్పిస్తారు. దాతలు ఈ సౌకర్యాన్ని ఏడాదిలో వరుసగా మూడు రోజుల పాటు కానీ, లేక వేర్వేరు దినాలలో కానీ పొందవచ్చు.

H దాతనూ, అతని కుటుంబాన్ని (5గురికి మించకుండా) ఏడాదికి మూడు రోజులు వైకుంఠం క్యూ కాంప్లెక్స్ లోని సెల్లార్ ద్వారా దర్శనానికి అనుమతిస్తారు. దాతలు ఈ సౌకర్యాన్ని వరుసగా మూడు రోజుల పాటు, లేదా వేర్వేరు దినాలలో గాని పొందవచ్చు.

H ఏడాదిలో ఒకసారి దాత దర్శనానికి వచ్చినప్పుడు ప్రసాదంగా 10 చిన్న లడ్లు ఇస్తారు.

H ఏడాదిలో ఒకసారి దాత దర్శనానికి వచ్చినప్పుడు ఒక ఉత్తరీయాన్ని బహుమానంగా ఇస్తారు.

H దాత మొదటిసారి దర్శనానికి వచ్చినప్పుడు శ్రీవారు, పద్మావతీ అమ్మవార్ల చిత్రాలున్న బంగారు పూత పూసిన వెండి పతకాన్ని ఇస్తారు.

H ఈ సౌకర్యాలు వ్యక్తులకు జీవిత పర్యంతమూ, కంపెనీలకు 20 ఏళ్ళ పాటు లభిస్తాయి.

**ప్రత్యేక సౌకర్యాలు**

H తిరుమల కొండల్లో 2000 మొక్కలు నాటు తారు. ఆ వృక్ష సంపదకు దాతపేరు లేదా దాత సూచించిన వారి పేరు పెడతారు. ఆ మొక్కల్ని 5 ఏళ్ళు అభివృద్ధి చేస్తారు.

H తిరుమలలోని ముఖ్యప్రదేశాల్లో దాత పేరును ప్రదర్శిస్తారు.

**వృక్ష ప్రవర్ధిని – విరాళం:** రూ॥ 1 లక్ష అంతకుపైన రూ॥ 5 లక్షల వరకు

**సౌకర్యాలు**

H పవిత్ర తిరుమల కొండల్లో 1000 మొక్కలు నాటుతారు.

H ఆ వృక్షసంపదకు దాత పేరు లేదా దాత సూచించిన వారి పేరు పెడతారు.

H ఆ మొక్కలను 5 ఏళ్ళ పాటు అభివృద్ధి చేస్తారు.

H ఏడాదిలో ఒకసారి చొప్పున అయిదేళ్ల వరకు అయిదుగురికి వైకుంఠం క్యూ కాంప్లెక్స్ సెల్లార్ ద్వారా ఉచిత దర్శనం కల్పిస్తారు.

**వృక్ష సంవర్ధనం – విరాళం :** రూ॥ 25,000/-

**సౌకర్యాలు**

H పవిత్ర తిరుమల కొండల్లో 500 మొక్కలు నాటుతారు.

H ఆ వృక్షసంపదకు దాత పేరు లేదా దాత సూచించిన వారి పేరు పెడతారు.

H ఆ వృక్ష సంపదను 5 ఏళ్ళ పాటు అభివృద్ధి చేస్తారు.

**వృక్ష ప్రసాదం – విరాళం :** రూ.॥ 15,000/-

**సౌకర్యాలు**

H పవిత్ర తిరుమల కొండల్లో ప్రతి ఏటా 100 ఫల, పుష్ప మొక్కలు నాటుతారు.

H దాత పేరుతో ప్రతి ఏటా దాత సూచించిన దినాన 100 ఫల, పుష్ప మొక్కల పంపిణీ చేస్తారు.

H 10 ఏళ్ళ పాటు ఇలా మొక్కల వితరణ జరుగుతుంది.

**స్మారక వనాలు – విరాళం :** రూ. 5,000/-

**సౌకర్యాలు**

H తిరుమల కొండల్లో ఎంపిక చేసిన రకాలకు చెందిన 10 మొక్కలను నాటి, 5 ఏళ్ళు వాటిని సంరక్షిస్తారు.

H ఆ వనానికి దాత పేరు పెడతారు.

H ఆ చెట్లను అయిదేళ్ళ పాటు సంరక్షిస్తారు.

**వన సంరక్షణ భాగస్వామ్యం – విరాళం:** రూ. 2,000/-

**సౌకర్యాలు**

H ఈ విరాళాన్ని తిరుమల కొండల్లో సహజారణ్యాలను దాతపేరుతో సంరక్షణ, అభివృద్ధికై ఉపయోగిస్తారు.

H దాత పేరును ప్రదర్శిస్తారు.

R.O.C.NO: PR4/13721/PRO/03



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/- అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**........... రూ. 5,000/- అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/- అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| పేరు | చిరునామా | రూ. |
|---|---|---|
| | ఇప్పటి వరకు వసూలైన మొత్తం ..... | 9,46,706 |
| మహారాజ పోషకులు : | శ్రీ కె. శ్రీధర్, కొవ్వూరు, నెల్లూరు జిల్లా - 524 137 | 10,116 |
| మహారాజ పోషకులు : | శ్రీ కె. సుబ్రహ్మణ్యం, గాంధీ నగర్, కర్నూలు | 10,000 |
| పోషకులు : | పి. హిమజ, ఎ.కె. నగర్, నెల్లూరు - 4 | 1,200 |
| పోషకులు : | శ్రీ టి. మల్లిఖార్జున శెట్టి, ఏతూరు, కడప జిల్లా -516425 | 1,020 |
| పోషకులు : | శ్రీ పి.వి. రత్నం, బేగంపేట్, హైదరాబాదు -500 016 | 1,000 |
| | మొత్తం ... | 9,70,042 |

# శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి మీ పేరు మీద పది మందీ మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥ 600/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ళ పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు) ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. కనీసం రెండు గ్రంథాలయాలకు తక్కువ కాకుండా చందా కట్టిన దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ'లో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| 1259 | శ్రీ టి.వి.రఘునాథ రెడ్డి, హోటల్ సరోవర్, తిరుపతి-517001 | అచ్చంపేట్ లైబ్రరీ, నిజామాబాద్ జిల్లా - 503 302. |
| 1260 | " | ధర్మవరం లైబ్రరీ, నిజామాబాద్ జిల్లా - 503 230. |
| 1261 | " | ఇల్లందు లైబ్రరీ, ఖమ్మం జిల్లా - 507 123. |
| 1262 | " | వైరా లైబ్రరీ, ఖమ్మం జిల్లా - 507 201. |
| 1263 | శ్రీ హనుమంతరావు, నూజివీడు- 521 201 | ఎస్.ఎస్.ఐ.ఇ.టి. లైబ్రరీ, గాంధీనగర్, నూజివీడు. |
| 1264 | శ్రీమతి ఎన్. వరలక్ష్మి, ఆసిఫ్‌నగర్, హైదరాబాద్-28 | సి.ఆర్.సి. లైబ్రరీ, రావులపాలెం, తూర్పు గోదావరి జిల్లా. |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



గమనిక: చెక్కు, డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా: Sri Ramakrishna Prabha, Ramakrishna Math, **Domalguda, Hyderabad- 500 029.**

ఆధ్యాత్మిక-అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 64 సంచిక: 5 మే 2007

"ప్రతి జీవిలోనూ దివ్యత్వం గర్భితంగా ఉంది. అంతర్గతంగా ఉన్న ఆ దివ్యత్వాన్ని వ్యక్తం చేయడమే జీవిత పరమావధి." - స్వామి వివేకానంద

## ప్రార్థన

దుర్గమ కాజ జగత కే జేతే
సుగమ అనుగ్రహ తుమ్హరే తేతే ॥

సబ్ సుఖ లహై తుమ్హారీ శరనా
తుమ రక్షక కాహూకో డరనా ॥

భూత పిశాచ నికట నహి ఆవై
తీనోం లోక హాంక తే కాంపై ॥



ఈ ప్రపంచంలో ఏ కార్యం దుర్గమమో అది నీ కృపచేత అత్యంత సుగమమవుతుంది.

నిన్ను శరణుజొచ్చిన వారు సమస్త సుఖములను అనుభవిస్తారు. నీవే రక్షకుడవైతే ఇక భయమెలా కలుగుతుంది?

ఓ మహావీరుడా! నీ నామము చెవిని పడితే భూతప్రేత పిశాచాలేవీ దగ్గరకు చేరవు.

(తులసీదాసకృత హనుమాన్ చాలీసా)

## ఈ సంచికలో...







**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com




# అలజడుల నుంచి ఆనందతీరానికి...

ప్రతి మనిషీ తన జీవితం సుఖసంతోషాలతో ఆనందంగా సాగిపోవాలని ఆశిస్తాడు, ప్రశాంతమైన జీవితాన్ని ఆకాంక్షిస్తాడు. అలా ఆనందమయ జీవితాన్ని ఆశించడం, ఆకాంక్షించడం మానవ సహజం. 'శాంతోయం ఆత్మా' అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. ప్రతి జీవిలోనూ అంతర్గతమైవున్న 'ఆత్మ' స్వరూపం 'ఆనందం' కాబట్టి ఆ ఆత్మానందాన్ని పొందడమే మానవ జీవిత లక్ష్యం. ప్రవహించే ప్రతి నదీ అనంతసాగరాన్ని చేరుకోవడానికి ప్రయత్నించినట్లే, జన్మించిన ప్రతి మనిషీ ఆనందమయ సాగరంలో లయమవడానికి ప్రయత్నిస్తాడు. అదే మానవుని జీవిత పరమావధి. ఆ జీవిత పరమావధి చేరుకోవడానికీ, పరమశాంతిని పొందటానికీ ముఖ్యంగా మనం మూడు అవరోధాలను దాటాలి. అవి

1. శారీరక అవరోధం – Physical obstruction
2. మానసిక అవరోధం – Mental obstruction
3. ఆధ్యాత్మిక అవరోధం – Spiritual obstruction

**శారీరక అవరోధం :** జీవితంలో ఏమి సాధించాలన్నా మనం మొట్టమొదట శారీరక సోమరితనాన్ని వదలిపెట్టాలి. దీనినే వేదాంత పరిభాషలో 'తమోగుణం' అంటారు. జీవితమంతా తిండి, నిద్రలకే పరిమితమై సుఖభోగాలే జీవిత లక్ష్యమనుకుంటే మనిషి పశుత్వం నుండి ఎన్నటికీ బయట పడలేడు. జీవిత లక్ష్య సాధనలో ముందడుగు వేయాలంటే శారీరక సుఖాలే సర్వస్వమనే భ్రాంతిని వీడి మనలోని పశుస్వభావానికి స్వస్తి చెప్పాలి.

**మానసిక అవరోధం:** సుఖదుఃఖాల్లోనూ, జయాపజయాల్లోనూ, నిందాస్తుతుల్లోనూ చలించని మనసు కలవాడే నిజమైన శాంతిని పొందగలడు. కామ, క్రోధ, లోభం మొదలైన శత్రువుల బారి నుండి నిశ్చల మనసు కోటలా రక్షిస్తుంది. కాబట్టి కోటలాంటి దృఢమైన మనసును నిర్మించుకొని దుష్టచింతనల్ని మనసులోనికి చొర నీయకుండా సదా మనసుని అప్రమత్తంగా ఉంచుకోవాలి. 'కట్టులేని మనస్సు కట్టతెగిన సరస్సు' లాంటిది. అది మనిషిని అశాంతి పాలుచేస్తుంది.

**ఇంద్రియాణాం హి చరతాం యన్మనో అనువిధీయతే ।**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి ॥**

*(గీత– 2.67)*

ఇంద్రియాలవెంట పరుగులుతీసే మనస్సు విచక్షణా జ్ఞానం కోల్పోతుంది. అటువంటి మనసు సముద్రంలో చుక్కాని లేని నావలా గమ్యం తెలియక ప్రమాదానికి గురి అవుతుంది. ఇంద్రియాలపై ఆధిపత్యం సంపాదించుకోవటానికీ, మనోద్వేగాలను అదుపు చేసుకోవటానికీ క్రమశిక్షణతో కూడిన ప్రయత్నం అవసరం. మనోవికారం కలిగించే ఏ విషయమైనా దానిని మొదట్లోనే త్రుంచివేయాలని శ్రీరామకృష్ణుల సన్న్యాస శిష్యులైన స్వామి అద్భుతానంద జీవితంలోని ఓ సంఘటన ద్వారా గ్రహించవచ్చు.

కలకత్తా నుండి దక్షిణేశ్వరం వెళ్ళే దారిలో ఒక సారాయి దుకాణం ఉండేది. ఒకసారి లాటు (స్వామి అద్భుతానంద) ఆ సారాయి దుకాణం ముందు నడిచి వెళుతుండగా తన

మనసు ఏదో తెలియని వికారానికి లోనైంది. ఈ విషయాన్ని లాటు శ్రీరామకృష్ణులకు చెప్పిన వెంటనే 'ఇకమీదట నువ్వు ఆ త్రోవలో వెళ్ళవద్దు' అని శ్రీరామకృష్ణులు లాటూకి సూచించారు. అప్పటినుంచీ ఆ త్రోవను వదిలి ఎనిమిది మైళ్ళ దూరం ఎక్కువైనా సరే వేరొక త్రోవ గుండా లాటు దక్షిణేశ్వరం వెళ్ళేవాడు.

బెంగాలీ భాషలో 'మానుష్' అంటే 'మనిషి' అని అర్థం. ఎవరు నిజమైన మానుష్? ఎవరి మన్ (మనసు) హుష్ (సంతోషం) గా ఉంటుందో వారే మానుష్ (మనిషి) అని శ్రీరామకృష్ణులు అనేవారు. ఆత్మవశ్యైఃవిధేయాత్మా - ఎవరు తన మనసును వశం చేసుకుంటారో వారే శాంతికి ప్రతిరూపాలు.

మనిషి సమాజంతోనూ, ప్రకృతితోనూ, తన మనసుతోనూ సమన్వయం చేసుకోగలిగిననాడే శాంతిని పొందుతాడని బర్ట్రాండ్ రస్సెల్ "The Kingdom of Happiness" అనే పుస్తకంలో వ్రాసాడు. మనసు ఆధీనంలో ఉంటే జీవితంలో ఎన్ని కష్టనష్టాలు ఎదురైనా స్థిరంగా, ప్రశాంతంగా ఉండగలం. అటువంటి నిశ్చల మనసుతోనే జీవన్ముక్తి సాధ్యమవుతుందని శ్రీశంకరాచార్యులు 'భజగోవింద స్తోత్రం' లో "నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః" అని ప్రబోధించారు.

**ఆధ్యాత్మిక అవరోధం:** శారీరక, మానసిక స్థాయిల్లో మనం పొందే ఆనందం ఉద్వేగభరితమైనదే కానీ నిజమైన ఆనందం కాదు. నిజమైన ఆనందం అంతరాత్మ నుంచే లభిస్తుంది. ఈ జన్మలోనే ఆ అనంత ఆత్మానందాన్ని పొందాలి అని నచికేతునిలా దృఢసంకల్పం ఉంటే ఈ భౌతిక సుఖాలు మనస్సుని జీవిత లక్ష్యం నుంచి మరల్చలేవు. సముద్రం లోనికి ఎన్ని నదులు వచ్చిచేరినా సముద్రం మాత్రం ఎటువంటి అలజడికి లోనుకాదు. అలాగే దృఢచిత్తం కలవాడిలో ఎన్ని కోర్కెలు ఉదయించినా అవి అతణ్ణి చలింపజేయలేవు. పరమ ప్రశాంత చిత్తంతోవున్న అవధూతను చూసి యదు మహారాజు

**జనేషు దహ్యమానేషు కామలోభ దవాగ్నినా ।**
**న తప్యసే అగ్నినా ముక్తో గంగాంభః స్థ ఇవ ద్విపః ॥**

భాగవతం 11.7.29

మానవులు కామలోభాలనే దావాగ్నిలో తపించి పోతుంటే, గంగానదిలో ఏనుగువలే నిశ్చలంగా, ప్రశాంతంగా ఎలావున్నావని అవధూతను ప్రశ్నిస్తాడు.

అశాంతికి కారణం మమకారమే అంటూ శ్రీరామకృష్ణులు ఒక ఉదాహరణ చెప్పేవారు.

ఓ వీధిలో యువతి వాకిలి శుభ్రం చేస్తూ ఉంటుంది. అటుగా వెళుతున్న ఒకతను 'ఎవరో బాలుడు చనిపోయాడట' అని చెప్పి వెళ్లిపోతాడు. 'పాపం, కాలం తీరిపోయింది... అనుకుంటూ యథావిధిగా తన పనిలో తాను నిమగ్నమవుతుంది ఆ యువతి. కొద్దిసేపట్లో చనిపోయిన బాలుడు తన కొడుకేనని తెలిసేసరికి ఆమె గుండెపగిలేలా రోదిస్తూ మూర్ఛపోతుంది. ఇదే మమకార బంధమంటే. అప్పటి వరకు బాలుడి మరణాన్ని సహజంగా తీసుకున్న యువతి, 'తన' అని తెలిసేసరికి బాధ కట్టలు తెంచుకుంది. అలాంటి భవబంధాల నుంచే బయటపడాలి.

***అయంతు పరమోధర్మో యత్ యోగేన ఆత్మదర్శనం***

ఆత్మానుభవం పొందడమే జీవిత పరమ ధర్మం అని మన శాస్త్రాలు చెబుతున్నాయి. ఆ ఆత్మానందం పొందటానికి 'సమచిత్తం' అవసరం. సమచిత్తం బంధరాహిత్యం వలనే సాధ్యం. ఆ ప్రయత్నంలో మనం ఒక్క అడుగైనా ముందుకు వేస్తే, భగవంతుడు పది అడుగులు ముందుకు వచ్చి మనకు చేయూతనిస్తాడు అని శ్రీరామకృష్ణులు అనేవారు.

మానసిక ఒత్తిళ్ళనూ, అలజడులనూ దాటి ఆనంద తీరాన్ని చేరడానికి కనీసం ఒక్క అడుగైనా ముందుకు వేద్దాం. మన వంతు ప్రయత్నం చేద్దాం. b

# గోరుముద్ద

- స్వామి సుప్రియానంద

## బోర్‌డమ్

**పి**ల్లలకు వేసవి శెలవలిచ్చారు. బోలెడంత తీరిక సమయం. చదువుల ఒత్తిడి లేదు. హాయిగా ఉండొచ్చు. కానీ అలా ఉండటం లేదు. 'అమ్మా! నాకు 'బోర్' కొడుతోంది'. అంటూ పిల్లలు 'అష్టావధాని అమ్మ'కు 'బోర్' అనే 'సమస్యాపూరణం' ఇస్తున్నారు.

అసలు ఈ 'బోర్' ఎక్కడ నుంచి వచ్చింది? 18వ శతాబ్దానికి పూర్వం ఆంగ్ల నిఘంటువులో 'బోర్' అనే పదమే లేదట ! అంటే ఇది 'నవ నాగరకత'కు మనం చెల్లిస్తున్న 'శుల్కం' అన్నమాట.



ఇక 'బోర్'కు అతి దగ్గర తెలుగు అనువాదం 'ఏమీ తోచడం లేదు' అని చెప్పొచ్చు. మనం ఏ ఆలోచనా లేకుండా ఒక్క క్షణం ఉండలేం కదా! అలాంటప్పుడు ఈ పరిస్థితి ఎలా కలుగుతోంది? దీని నుంచి ఎలా బయట పడాలి?

'ఏమీ తోచడం లేదు' అనే వారిలో ' ఊరకనే ఉన్నాను' అన్న భావన కలుగుతుంది. అప్పుడు సమయాన్ని ఏదో విధంగా గడపాలి అన్న కోరికతో 'కాలక్షేపం' చేస్తారు. ఆ 'కాలక్షేపం' కాలం వృధాచేయడం అన్న సంగతి వారికి తెలియదు. ఈ పరిస్థితి మితిమీరితే 'బోర్‌డమ్'గా మారుతుంది.

'బోర్‌డమ్' వలన శారీరకంగాను, మానసికంగాను అలసట కలుగుతుంది. ఒక పిల్లవాడు అదే పనిగా రోజంతా టీ.వీ.లో క్రికెట్ మ్యాచ్ చూసినపుడు ఆ మ్యాచ్‌లో పాల్గొన్న ఆటగాళ్ళకంటే ఎక్కువగా అలసిపోతాడు. కారణం ప్రతి ఆటగాడు పొందిన 'అలసట'ను వీక్షించిన ఈ పిల్లవాడు తన కాలు-చెయ్యి కదపకుండానే అందరి ఆటగాళ్ల 'అలసట'ను అనుభవిస్తాడు. ఆ మ్యాచ్‌లోని 'జయా పజయాలు' అతని మనసును ఉద్వేగపరుస్తాయి.

పనినుంచి విశ్రాంతి పొందడానికి 'తీరిక' కావాలనుకుంటాం. ఆ 'తీరిక' దొరికినపుడు ఏమి చేయాలో తోచదు. ఒకటే 'గజిబిజి'. ఆధునిక కాలంలో మానవుడు తాను చాలా 'బిజీ' అనుకున్నప్పటికీ నిజానికి అది 'గజిబిజి' అని తెలుస్తోంది. ఈ పరిస్థితి (దుఃస్థితి) మారాలి. మనకు దొరికిన తీరికను కేవలం కాలక్షేపంగా కాక దానిని సద్వినియోగం చేయడం నేర్చుకోవాలి.

మనం చేసే 'పనిలో తృప్తి' (Job satisfaction) పొందకపోతే ఆపని 'వెట్టి చాకిరీ' అవుతుంది. ఆ పనిలో ఆనందం ఉండదు. దాని వలన 'అలసట' కలుగుతుంది. అప్పుడు మనం తీరిక(శెలవుదినాలు) కోసం ఎదురు చూస్తాం.

మనకు దొరికిన 'తీరిక'ను బాగా ఉపయోగించడానికి ప్రయత్నిస్తున్న కొన్ని సందర్భాల్లో మన 'తీరిక' మీద ఇతర వ్యక్తుల 'ఆక్రమణ' జరుగుతుంది. అప్పుడు వారితో మనం గడిపిన సమయం వృధా అయినట్లు అనుభూతిచెంది వారిని 'పెద్ద బోర్' గా వర్ణిస్తాం.

'బోర్‌డమ్' మీద ఎందరో మనో వైజ్ఞానిక శాస్త్రవేత్తలు పరిశోధనలు చేస్తున్నారు. ఆ పరిశోధనలలో కొన్ని విషయాలు వెల్లడయ్యాయి. 'బోర్‌డమ్' మానసిక ఆందోళన, రుగ్మతలకు దారి తీస్తుందట. మనిషిలో సృజనాత్మక శక్తి లోపించడమే 'బోర్‌డమ్' ఒక ముఖ్య కారణమట.

కాబట్టి పిల్లలు, పెద్దలు వారిలోని సృజనాత్మక శక్తిని పెంచుకొని బుద్ధికుశలతతో, 'బోర్' వాళ్లను కొట్టకముందే వాళ్లే 'బోర్' ను దగ్గరకు రానీయకుండా **'ధాం ! ధాం! బోర్‌డమ్'** అని తరిమేయాలి. b

ఆంధ్రయోగులు : చింతపల్లి ఇద్దాసు

# చరితార్థుడైన చర్మకారుడు

డా॥ బిరుదురాజు రామరాజు

**ఆ**ధ్యాత్మిక ఉన్నతికి కులమతాలు, జాతి లింగభేదాలు అడ్డుకావని నిరూపిస్తూ నిమ్న కులస్థుల నుండి సైతం ఎంతో మంది ఆధ్యాత్మిక మహాపురుషులు ఆవిర్భవించారు. ఆంధ్రదేశస్థులైన నందనార్ స్వామి, వీరబ్రహ్మంగారి శిష్యులు కక్కయ్య, ఆదోని లక్ష్మమ్మ, చింతపల్లి ఇద్దాసులు తమ కులం తక్కువదైనా గుణం గొప్పదేనని చాటి చెప్పారు.

**భక్తికి బీజం:** నల్లగొండ జిల్లా పెద్దవూర మండలం, చింతపల్లిలో దున్న రామయ్య ఎల్లమ్మ దంపతులకు ఇద్దాసు జన్మించాడు. చిన్నతనంలోనే రైతుల వద్ద జీతగాడిగా కుదిరి మోట కొట్టడం, ఏతామెత్తడం, నాగలి దున్నడం వంటి పనులు చేసేవాడు. ఒక రోజు ఉదయం మోట కొడు తుంటే బావి వద్ద నుండి ముగ్గురు సాధువులు వెళ్ళటం గమనించాడు. వారిని చాటుగా వెంబడించి అక్కడి శివాలయానికి వెళ్ళి వారు సంకీర్తన చేయుటంచూసి పరవశించి పోయాడు. ఆనాటి నుండి సాధువులతో శివాలయానికి వెళ్ళటం అతని దిన చర్యలో భాగంగా మారింది. ఇద్దాసు భక్తికి మెచ్చి ఒకనాడు సాధువులు అతని నాలుకపై విభూది రాశారు. అతనిలో భక్తి పొంగి పొర్లింది. ఆశువుగా తత్త్వగీతాలను పాడసాగాడు.



**సంసారంలోనూ సాధన:** ఒకనాడు ఆ ప్రాంతపు ప్రసిద్ధ జంగమదేవర పూదోట బసవయ్య అతని పక్వతను గుర్తించి పంచాక్షరి మంత్రోపదేశం చేశాడు. ఇద్దాసు ఆనాటి నుండి జపం చేస్తూ, యోగ మార్గాన్ని సైతం అనుసరించి ఆరు నెలలు కఠోర సాధన చేశాడు. పెళ్ళి చేస్తే పిచ్చి కుదురుతుందని ఇంట్లో వాళ్ళు భావించి శివమ్మ అనే కన్యతో వివాహం జరిపించారు. సంసారం, కులవృత్తి చేస్తూనే ఇద్దాసు అప్పుడప్పుడు ఏకాంత ప్రదేశాలకు వెళ్ళి సాధన చేసేవాడు. కొంత కాలానికి మనసు పక్వమై అతనికి సిద్ధికలిగింది. భవబంధాలు పటాపంచలయ్యాయి.

**శుభ్రత శరీరానికేనా..?:** రైతు వద్ద ఇద్దాసు మోటతోలే సమయంలో కొంతమంది బ్రాహ్మణులు అటుగా వెళుతూ బావిలోకి దిగి స్నానం చేయదలచి మోటను ఆపించారు. తోలు బొక్కెనను తాకటం వారి ఆచారానికి విరుద్ధం. బావిలో స్నానం ముగించి పైకి వచ్చి మోట తోలుకోమన్నారు. వారిని చూస్తూ ఇద్దాసు "మీకు శరీరం శుభ్రం అయింది కానీ, మనసులోని మలినం పోలేదు" అన్నాడు. బ్రాహ్మణులకు కోపంవచ్చింది. ఇద్దాసు వారిని శాంత పరిచి తోలు బొక్కెనకు నోటిని ఆనించి నీరు మొత్తం తాగి, ఆసనం గుండా విసర్జించాడు. స్నానంచేసి సూర్యునికి నమస్కరిస్తున్న ఇద్దాసు హృదయ స్థానంలో బ్రాహ్మణులకు భువనేశ్వర శివాలయం, అందులోని శివలింగం కనిపించాయి. తమ తప్పు తెలుసుకొని వారు ఇద్దాసుకు నమస్కరించారు.

**దేవికి దాసు నివేదన:** చింతపల్లిలో నివసించే ఒక బ్రాహ్మణుడు కాశీకి ప్రయాణమవుతూ ఇద్దాసు ఇంటికి వెళ్ళాడు. అతనికి రెండు పైసలిచ్చి తన పేరుతో గంగకు అర్పించమని ఇద్దాసు అతనికి చెప్పాడు. కాశీలో బ్రాహ్మణుడు గంగలో స్నానంచేస్తూ ఆ రెండు పైసల్ని "ఇవి మా ఇద్దాసు ఇచ్చిన పైసలు" అంటూ గంగలో జారవిడిచాడు. గంగలో నుండి ఒక స్త్రీ చెయ్యి పైకి వచ్చి పైసలందుకుంది. ఎంతో మంది స్త్రీలు అక్కడ స్నానం చేస్తుండటంతో, ఎవరో స్త్రీ పైసలు తీసుకుందని బ్రాహ్మణుడు భావించాడు. తిరిగి వచ్చి ఇద్దాసుతో అదే విషయం చెప్పాడు. ఇద్దాసు "ఆ స్త్రీ ఈమేనా?" అంటూ తన ఇంటి ముందున్న దేవతా విగ్రహాన్ని చూపించాడు. దేవత చేతి కంకణాలు, గాజులు గుర్తించిన బ్రాహ్మణుడు గంగమ్మతల్లే పైసలందుకుందని తెలుసుకుని ఇద్దాసు పరమ భక్తుడని గుర్తించాడు.

**దాసుని దేహత్యాగం:** వీరబ్రహ్మంగారి వలె పామరులకు అర్థమయ్యే విధంగా తెలంగాణా వ్యావహారిక భాషలో మార్మిక తత్త్వాలు, వేదాంత కీర్తనలను ఇద్దాసు రచించాడు. ఇద్దాసు మహాయోగియై 108 యేళ్ళు జీవించి, 1919 సంవత్సరంలో మహాసమాధి చెందాడు. దేహం చాలించే ముందు తన మెడలోని లింగం నుంచి పాలు కారితే విధి విధానాలతో సమాధి చేయండనీ, రక్తం కారితే గొయ్యితీసి పాతి పెట్టండనీ చెప్పి కన్నుమూశాడు. శిష్యులు ఆయన మెడలోని లింగం నుండి పాలు కారడం గమనించి, భక్తులందరి సమక్షంలో శాస్త్రోక్తంగా సమాధి చేశారు. కాలక్రమంలో భక్తులు ఆయన అస్థికలను కృష్ణా జలంతో శుద్ధిచేసి సమాధి మందిరాన్ని నిర్మించి, ఆరాధనోత్సవాలను జరుపుతున్నారు. b

భారతీయ మహిళా మణిదీపాలు : మైత్రేయి

# బ్రహ్మవిద్యే కావాలన్న భార్యామణి

ఆంగ్లమూలం : డాక్టర్ ఎస్. రమణి
అనువక్త : రెంటాల జయదేవ

ఆధ్యాత్మిక జిజ్ఞాసువుగా వేదాల్లో మైత్రేయి పాత్ర అద్వితీయం. అంతిమ సత్యాన్ని కనుగొనడం కోసం ఐహిక భోగాలనన్నింటినీ త్యజించిన పరమ పావని ఆమె.

శిష్య వత్సలుడైన గురువు యాజ్ఞవల్క్య మహర్షికి ఇద్దరు భార్యలు. ఆ ఇద్దరిలో మైత్రేయి ఒకరు. గృహస్థాశ్రమ జీవితంలో తగినంత అనుభవం గడించిన తరువాత, పరమాత్మను చేరుకోవడం కోసం అడవులకు వెళ్ళి వానప్రస్థ జీవితం గడపడం ఆ రోజుల్లోని సంప్రదాయం. యాజ్ఞవల్క్య మహర్షి సైతం తన ప్రాపంచిక వస్తు సామగ్రినంతటినీ ఇద్దరు భార్యలకూ పంచిఇచ్చి, ఈ ప్రాపంచిక జీవితం నుంచి పక్కకు తప్పుకోవాలని భావించాడు. ఆయన భార్యల్లో ఒకరైన కాత్యాయని తనకు భర్త నుంచి వారసత్వంగా సంక్రమించిన భౌతిక సుఖ సంపదలతో సంతృప్తిపడింది.

అయితే, రెండో భార్య అయిన మైత్రేయి మాత్రం అలా కాదు. ఆమె తన భర్త యాజ్ఞవల్క్యుడి వద్దకు వెళ్ళి, "స్వామీ! సమస్త సంపదలకూ నెలవైన ఈ ప్రపంచం మొత్తం నాదైతే, అప్పుడు నేను అమృతతుల్యురాలిని అవుతానా?" అని ప్రశ్నించింది.

"అదేమీ లేదు. దాని వల్ల నీ జీవితం కూడా మిగిలిన ధనికులందరి లాంటి జీవితంగా మారుతుందే తప్ప, అమృతత్వం సిద్ధించదు. భోగభాగ్యాల ద్వారా అమరత్వం సిద్ధించదు" అని యాజ్ఞవల్క్యుడు సమాధానమిచ్చాడు.

అప్పుడు మైత్రేయి తన భర్తతో, "స్వామీ! నాకు అమృతత్వాన్ని ప్రసాదించనటువంటి ఆ ఐహిక సంపదల్ని నేనేం చేసుకుంటాను! కాబట్టి, అమృతత్వం గురించి మీకు తెలిసినదంతా దయచేసి నాకు చెప్పండి" అని ప్రార్థించింది.

ఈ విధంగా మైత్రేయి తనకు విషయ సుఖాల పట్ల ఆసక్తి లేదని తన భర్తకు స్పష్టం చేసింది.

భార్య చెప్పిన మాటలు, ఆమె అభిప్రాయాలూ విని యాజ్ఞవల్క్యమహర్షి పరమానంద భరితుడయ్యాడు. అప్పుడిక ఆయనే స్వయంగా భార్యకు కూడా గురువు అవతారమెత్తాడు. అమృతత్వాన్ని సంపాదించడానికి అవసరమైన బ్రహ్మజ్ఞానాన్ని ఆమెకు బోధించాడు. మైత్రేయికి యాజ్ఞవల్క్యుడు చెప్పిన ఆ బోధ బృహదారణ్యక ఉపనిషత్తులో భాగంగా కనిపిస్తుంది. తపస్సు కోసమని వెళ్ళబోతున్న భర్త నుంచి శాశ్వత ఆనందాన్నిచ్చే ఆధ్యాత్మిక విషయాలను నేర్చుకున్న మైత్రేయి మన మహిళా లోకంలో ఆదర్శమూర్తిగా నిలిచింది. b



**మే - 2007**

| | |
|---|---|
| 02 బుధవారం | : బుద్ధ పూర్ణిమ |
| 12 శనివారం | : హనుమజ్జయంతి |
| 13 ఆదివారం | : ఏకాదశి |
| 16 బుధవారం | : ఫలహారిణి కాళీ పూజ |
| 27 ఆదివారం | : ఏకాదశి |

# ఏది శాంతికి ప్రతిరూపం?



- జి. సతీష్

ఒక మహారాజుకు శాంతిని నిర్వచించే ఓ అద్భుత చిత్రాన్ని తన ప్రాసాదంలో ప్రదర్శించాలనిపించింది. అనుకున్నదే ఆలస్యం ఆస్థాన చిత్రకారులందరినీ ఆసీనులనుచేసి మనసులోని మాట చెప్పాడు. ఎందరో ఔత్సాహిక చిత్రకారులు ముందుకొచ్చారు. తమ తమ చిత్రకళా ప్రతిభతో మహారాజును మెప్పించాలని అహర్నిశలూ శ్రమించి గీసిన ఎన్నో చిత్తరువులను రాజు ముందుంచారు. చివరకు ఆ రాజు రెండు చిత్రాలను ఎంపిక చేసుకున్నాడు.

అందులో ఒక చిత్రం ఎంతో అద్భుతంగా రూపు దిద్దుకుంది. అందమైన సెలయేరు... ఆహ్లాదాన్ని కలిగించే పూలతేరు... అంతకు మించి నీలవర్ణపు అంబరం... దూదిపింజల్లా తేలిపోతున్న మబ్బుల గుంపు... చూడగానే ప్రశాంతభావన పొడచూపుతోంది. సభాసదులంతా ఆ చిత్రాన్ని చూసి మైమరచిపోయారు. రాజు ఆ చిత్రాన్నే ఎంపిక చేసుకుంటాడని అనుకున్నారందరూ.

ఇక రెండో చిత్రంలో ప్రళయం విలయ తాండవమాడుతోంది. ఎగుడుదిగుడు కొండలు... ఆగ్రహపు ఛాయలతో కారుమబ్బుల ఆకాశం...కుండపోతగా వర్షం... ఉధృతంగా జారిపడుతున్న జలధారలు... ఇలా ఎక్కడ చూసినా ప్రళయమే కనిపిస్తోంది. సభికులంతా ఒక్కసారిగా చిత్రకారుడి వైపు జాలిగా చూశారు. ఇదా ప్రశాంతత అంటే అన్న భావనతో! కానీ ఆ చిత్రం మహారాజు మనసును దోచుకుంది. సభాసదులంతా ఆ చిత్రంలోని ప్రళయ ప్రతిబింబాల్నే చూశారు. కానీ రాజు ఆ చిత్రంలో జలధారల హోరు పక్కన చిత్రకారుడు ఎంతో ఒద్దికగా గీసిన పక్షిగూటిని చూశాడు. అంతటి ప్రకృతి భీకరత్వం నడుమ కూడా, పచ్చనిపొదలో వెచ్చని గూటిలో తల్లిపక్షి బిడ్డపక్షితో ఒదిగి ప్రశాంతంగా కూర్చుంది. “శాంతి అంటే ఏ అలజడీ, ఆటు పోటూ లేని సమయంలో ఉన్న మానసికస్థితి మాత్రమే కాదు, నలువైపులా అలజడి అలముకున్నా, నిలకడగా నిలిచే మనసుదే నిజమైన శాంతి” అన్నాడు ఆ మహారాజు. అందుకే ఆ చిత్రానికే బహుమతి ప్రకటించాడు. b

కష్టాలు మనల్ని కడతేర్చడానికి కాదు, తీర్చిదిద్దడానికే! నొప్పించినప్పటికీ మరచిపోలేని పాఠాలను నేర్పించి, మనసుకు స్థిరత్వాన్ని ఇచ్చేవి కష్టాలే. కల్లోలాలు లేని ఉల్లాసభరిత జీవితాన్నీ, దుఃఖం దరిచేరని సుఖాన్నీ కోరేవారి అశాంతికి అంతమే ఉండదు. మనల్ని స్థితప్రజ్ఞులుగా మార్చడంలో సుఖాలతో సమానంగా కష్టాలకూ ప్రాధాన్యత ఉంది. కష్టం వస్తే కుంగిపోకుండా, సుఖం వస్తే పొంగిపోకుండా సంతోష విషాదాలను సమానంగా స్వీకరించాలి. అప్పుడే మన వ్యక్తిత్వం వికసించి, కథలోని పక్షిలా పరమోన్నత మనఃస్థితికి చేరగలం.

## శ్రీరామకృష్ణ ప్రభ వార్షిక చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా! దిగువ పేర్కొన్న నెంబర్ల నడుమ ఉన్న సంవత్సర చందాదారుల చందా గడువు తీరిపోనుంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీ రామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.*

60001 - 63106 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2007 మే తో** తీరిపోనుంది!

70001 - 71546 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2007 జూన్ తో** తీరిపోనుంది!

**శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్**

**గమనిక:**

1. **మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.**
2. **మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.**
3. **మీకు పత్రిక ప్రతి నెలా 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.**

# జీవన్ముక్తికి సత్సాంగత్యం

-స్వామి జ్ఞానదానంద

**(2006 డిసెంబర్‌లో అనంతపురంలో జరిగిన 'భక్తసమ్మేళనం'లో స్వామి జ్ఞానదానంద చేసిన ప్రసంగం ఇది)**

**చా**లా మంది భక్తులు ఒకచోట కూర్చుని భక్తిభావంతో నామస్మరణ చేస్తున్నారు. భక్తులందరూ నామ సంకీర్తనలో తన్మయులైపోయారు.

భగవంతుడు "నాహం తిష్ఠామి వైకుంఠే యోగినాం హృదయ మేవచ మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారదా" అన్నాడు. అంటే నేను వైకుంఠంలో ఉండను. యోగుల హృదయాలలో కూడా ఉండను. మరి భగవంతుడు ఎక్కడ ఉంటాడు?



మద్భక్తా ః యత్ర గాయంతి – భక్తు లందరూ ఎక్కడ నామసంకీర్తనం చేస్తారో, తత్ర తిష్ఠామి నారదా "నేను అక్కడ ఉంటాను నారదా" అన్నాడట.

రామనామ జపం ఎక్కడ జరిగినా అక్కడ ఆంజనేయస్వామి ఉంటారు.

**యత్ర యత్ర రఘునాథ కీర్తనం తత్ర తత్ర కృత మస్తకాంజలిం భాష్పవారి పరిపూర్ణ లోచనం మారుతిం నమత రాక్షసాన్తకం.**

అలా భక్తి పారవశ్యంతో గానం చేస్తున్న భక్తులను చూసి ఆంజనేయస్వామి రాములవారితో "స్వామీ! ఇంతమంది భక్తులు మీ కోసం ఇంతగా నామసంకీర్తన చేస్తున్నారు. మీరు వారికి దర్శనం ఇవ్వండి" అన్నారట.

అప్పుడు రాముల వారు "నాయనా నీకు తెలియదు. వారికి కావల్సింది భగవంతుడు కాదు" అన్నారట.

"ఏమిటి స్వామీ అలా అంటారు. ఇంతమంది భక్తులు కూర్చుని తదేకంగా మీ గురించే ధ్యానం చేస్తున్నారు, మిమ్మల్ని స్మరిస్తున్నారు, ప్రార్థిస్తున్నారు, మీ నామ సంకీర్తన చేస్తున్నారు. మీరు అలా అంటారేమిటి!" అంటూ ఆంజనేయస్వామి ఆఖరికి రాములవారిని ఒప్పించి భక్తులకు రాముని దర్శనం ఇప్పించారట.

అలా నిలబడిన రాములవారిని చూసి ఒక వృద్ధుడు "మీరెవరండీ" అని ప్రశ్నించాడట.

దీనికి రాముల వారు " ఇంతసేపూ మీరు నా నామసంకీర్తన చేస్తున్నారు. ఇప్పుడు నేను ఇక్కడికి వస్తే ఇలా అడుగుతారేమిటి? నేను సాక్షాత్తూ భగవంతుణ్ణి" అన్నారట. దీనితో అక్కడున్న భక్తులకు నమ్మకం కుదరక "మీకు ఒక పరీక్ష పెడతాం. ఆ పరీక్షలో మీరు నెగ్గితేనే మీరు భగవంతుడు అని అంగీకరిస్తాం" అన్నారట. 'రాముల వారు సరే మీరు పరీక్ష పెట్టండి' అన్నారు.

ఆ వృద్ధుడు ఒక చిన్నరాయిని తెచ్చి "దీన్ని బంగారంగా మారిస్తే మీరు భగవంతుడు అని ఒప్పుకుంటాం" అన్నాడట. రాములవారి దివ్యస్పర్శతో ఆ చిన్నరాయి బంగారంగా మారిపోయింది. అప్పుడు అక్కడ కూర్చున్న వారంతా లేచి బయటకు పరుగెత్తనారంభించారట. వారంతా అలా ఎందుకు పరుగుపెడుతున్నారో రాములవారికి అర్థం కాలేదు. అందరూ పందెం వేసుకున్నట్లు పరుగులు పెడుతున్నారు. మళ్లీ అందరూ తిరిగి వస్తున్నారు. ప్రతి ఒక్కరూ ఒక్కోరాయి తీసుకువచ్చి వారంతా ఆ రాళ్లని బంగారంగా మార్చమని అడిగారట. దీనితో రాములవారు హనుమంతునితో "నేను నీకు చెప్పానుకదా! వారికి కావల్సింది బంగారం కానీ భగవంతుడు

కాదు" అంటూ శ్రీరాముడు అదృశ్యమయ్యాడట.

శ్రీరామకృష్ణ పరమహంస "ఈ లోకమంటే కామినీ కాంచనాలు. ఇదొక్కటే ప్రపంచమంతా" అన్నారు. ఒక భక్తుడు రామకృష్ణులవారితో వారితో "మీకు పదివేల రూపాయలిస్తాను" అన్నాడట. మరొకరైతే ఆ పైకం తీసుకునేవారు కానీ రామకృష్ణులవారు ఆ భక్తుడిని "నువ్వు చేసిన పనేమిటి? నువ్వు నన్ను సంసారిని చేస్తావా?" అని కోప్పడి పంపించారు. అదే విధంగా త్యాగరాజస్వామివారి జీవితంలో ఒకసారి మహారాజు చాలా ధనం తీసుకువచ్చి వారి ఇంటి ముందు పెట్టి "ఇదంతా మీరు తీసుకోండి" అన్నారట. అప్పుడు త్యాగరాజస్వామి " నిధి చాలా సుఖమా రాముని సన్నిధి,సేవ చాలా సుఖమా నిజముగా పలుకుమనసా" అన్నారట. ప్రతి ఒక్కరూ కూడా సుఖంగా జీవించాలనే ఆశిస్తారు. కానీ నిజమైన సుఖం నిధిలో ఉందా? భగవంతుని సన్నిధిలో ఉందా? భజగోవిందం స్తోత్రంలో శంకరభగవత్పాదులవారు "క్షణమపి సజ్జన సంగతిరేకా భవతి భవార్ణవ తరణే నౌకా..." అన్నారు. ఒక్క క్షణమైనా మనం సజ్జన సాంగత్యం చేస్తే సంసార సముద్రం దాటడానికి అది నావలాగ ఉపయోగపడుతుంది.

రామకృష్ణులవారు ఇలాంటి సత్సాంగత్యం వలన వ్యక్తిలో భగవంతుని పట్ల వ్యాకులత కలుగుతుందంటూ ఒక ఉదాహరణ చెప్పారు. "ఒక వ్యక్తి ఉద్యోగం ఊడిపోతే మళ్లీ అతనికి ఉద్యోగం వచ్చేవరకూ ఆ వ్యాకులత అతడిని నిద్ర పోనివ్వదు. ప్రతి కార్యాలయానికీ వెళ్లి "అయ్యా ఏదైనా ఉద్యోగం ఖాళీగా ఉందా" అని అడుగుతాడు. మరొక ఉద్యోగం దొరికే వరకూ అతనికి పిచ్చి పట్టినట్లుగా ఉంటుంది. మనకి సత్సాంగత్యం వలన భగవంతుడి పట్ల అలాంటి వ్యాకులత కలుగుతుంది.

శ్రీ రామకృష్ణులవారు "సత్సాంగత్యం చెయ్యి, ఆ సత్సాంగత్యం వలన నీకు అన్నీ సమకూరుతాయి. భగవంతుని పట్ల నీకు వ్యాకులత సమకూరుతుంది. నిత్యానిత్య వస్తు వివేచన కలుగుతుంది. వీటివలన నీ జీవిత లక్ష్యమైన భగవంతుడిని నువ్వు చేరుకోగలుగుతావు" అని చెప్పేవారు. ఇవన్నీ మనం పాటించి, ఈ సత్సాంగత్యం వలన మనందరం జీవిత గమ్యాన్ని చేరుకోవాలని భగవంతుడిని ప్రార్థిద్దాం. b

## భక్తుడి బాధ్యత భగవంతుడిదే!

రావణుడు సీతమ్మను అపహరించిన పిదప రామలక్ష్మణులు సీతను వెదుకుతూ ఋష్యశృంగ పర్వతము వద్దకు వచ్చారు. సుగ్రీవుడి దూతగా సంన్యాసి వేషంలో హనుమంతుడు వారిని సమీపించాడు. "ఆయుధాలు ధరించినప్పటికీ తాపసుల్లా కనిపిస్తున్న మీరు ఎవరు" అని వారిని ప్రశ్నించారు.

"లక్ష్మణా! శుభకరమై, మనోహరాలైన ఇతని పలుకులు ఎవరికైనా సంతోషాన్ని కలిగిస్తాయి. కత్తి ఎత్తిన శత్రువు కూడా ఇతని మాటలకు మెత్తబడి పోతాడు. ఇలాంటి దూతలు ప్రభువుకు ఏ కార్యాన్నైనా సాధిస్తారు" అన్నాడు రాముడు. లక్ష్మణుడు తమ కష్టాన్ని హనుమంతుడికి వివరించి సుగ్రీవుడి మైత్రిని కోరి వచ్చామని చెప్పాడు.

సుగ్రీవుడికి సైతం రాముడి స్నేహం ఎంతో అవసరమని చెబుతూ హనుమంతుడు సంన్యాసి రూపాన్ని త్యజించాడు. వానరరూపాన్ని గ్రహించాడు. రామలక్ష్మణులను తన భుజాలపై ఎక్కించుకున్నాడు.

భక్తుని మనసు సదా భగవంతుని మోసేదై ఉండాలి. రామలక్ష్మణుల్ని భుజాలపై మోస్తూ హనుమంతుడు దివ్యానందాన్ని అనుభవించాడు.

"రామా! నీవు నా హృదయంలో ఉన్నావు. ఇప్పుడు వీపుమీద కూడా ఉన్నావు. కౌసల్యాదశరథులు నిన్ను ఒడిలో కూర్చోబెట్టుకున్నారు. వారెంతో భాగ్యవంతులు. ఆ భాగ్యం ఇప్పుడు నన్ను వరించినందుకు నాకెంతో సంతోషంగా ఉంది.

"రామభద్రా! నిన్ను ఒడిలో ఉంచుకొన్న కౌసల్యా దశరథులు నీవు కింద పడకుండా జాగ్రత్త వహించారు. కానీ నాకాభయం లేదు. నేను నిన్ను మోస్తున్నాను. నేను పడితే నా మీదున్న నీవు కూడా పడతావు కదా! కాబట్టి నేను పడకుండా నీవే జాగ్రత్త వహించాలి" అని హనుమంతుడు రాముడితో చెబుతూ సుగ్రీవుడి వద్దకు చేరాడు.

భగవంతుణ్ణి మోసే మనసులు పతనం కావు. పరమాత్మను నమ్మిన బతుకులు వమ్ముకావని హనుమంతుని సందేశం. b

**ఈ నెల 12 న హనుమజ్జయంతి**

# మధుర స్మృతులు

– స్వామి ప్రభానంద

**(దివ్యజనని శ్రీ శారదాదేవి శిష్యులలో ఒకరైన స్వామి శాంతానందజీ గురించి తెలియజేసే సంఘటన ఇది.)**

**నేను** బ్రహ్మచారిగా ఉన్నప్పుడు, 1959వ సంవత్సరం శీతాకాలంలో రాంచీలో ఉన్న రామకృష్ణ మిషన్ టి.బి. శానిటోరియానికి వెళ్ళాను. అక్కడ సాధునివాసం ప్రాంగణంలో ఒక సీనియర్ స్వామీజీ ఒంటరిగా కూర్చొని ఉండడం చూశాను. వారి పాదాలకు నేను ప్రణామం చెయ్యగానే ఆయన నావంక చూసి "నువ్వు అనాహత ధ్వని విన్నావా?" అని అడిగారు. ఆశ్చర్యకరమైన ఆ ప్రశ్నవిని నేను "ఏమిటి" అని అడిగాను. ఆయన ప్రశాంతంగా "నువ్వు ఓంకారం వినలేదా?" అని అడిగారు. లేదని అన్నాను నేను. "నేను ఓంకారాన్ని నిరంతరం వింటూనే ఉన్నాను" అన్నారు. వెంటనే వారు నిటారుగా కూర్చొని కనులు మూసుకుని అంతర్ముఖులయ్యారు. వారి వదనం పైన చిరునగవు వ్యాపించింది. నాలుగైదు నిముషాలు గడిచాయి. అప్పుడు వారు మృదువుగా, "నిటారుగా కూర్చొన్నప్పుడు ఆ ధ్వని స్పష్టంగా వినబడుతుంది" అన్నారు. ఈ ధ్వని బయటినుండి వస్తున్నది కాదు. ఇది హృదయాంతరాళం నుండి బయలుదేరి మళ్ళీ దానిలోనే కలిసిపోతుంది. జపం ద్వారా దానిని పొందవచ్చు.



స్వామి శాంతానంద

స్వామి శాంతానందజీ ఒకమారు తమ స్వీయ డైరీ నాకిచ్చి, నన్ను చదవమన్నారు. దాన్లో వారి ఆధ్యాత్మిక అనుభవాలు కొన్ని ఉన్నాయి. తరువాత కూడా వారు అనాహత ధ్వని నా అనుభవంలోకి వచ్చిందా అని నన్ను చాలాసార్లు అడిగారు. లేదన్నాను. అయినా తీవ్రంగా జపంచేయమని సూచించారు. నేను తపస్సాధనలు చేయడానికి ఆరు నెలలు హిమాలయాలకు వెళ్తుండగా వారు ఈ అనుభవంకోసం గట్టిగా ప్రయత్నించమని ప్రోత్సహించారు. b

---

**అది** 1963వ సంవత్సరం. వేసవి రోజుల్లో ఒక మధ్యాహ్నం నేను బస్సులో బేలూరు మఠానికి వెళ్ళాను. స్వామి లోకేశ్వరానందజీ దగ్గర్నుండి ఒక కవరు తీసుకుని ప్రధాన కార్యదర్శి స్వామి వీరేశ్వరానంద మహరాజ్‌కి (1892-1985) అందజేయడానికి వెళ్ళాను. నేను ప్రధాన కార్యదర్శి కార్యాలయం చేరేసరికి మధ్యాహ్నం 2.30. గంటలు అయ్యింది. నేను చెమటతో తడిసిపోయాను. అప్పుడు స్వామి వీరేశ్వరానంద మహరాజ్ టపా చూస్తున్నారు. నన్ను కుర్చీలో కూర్చోమన్నారు. తరువాత వారు ఒక గూటిదగ్గరకు వెళ్ళి ఒక గ్లాసులో చల్లని పానీయం (షర్బత్) కలపసాగారు. వారు తనకోసం చేసుకుంటున్నారనుకుని, వెంటనే సహాయం చేయబోయాను. కానీ వారు నన్ను కూర్చోమని ఆదేశించారు. కార్యాలయంలో ఒక ఉద్యోగిని పిలిచి స్వామీజీ అతడికి పైకమిచ్చి కొన్ని ఐసుముక్కలు తెమ్మని బేలూరు బజారుకు పంపించారు. ఆయన తిరిగి టపా చూడనారంభించారు. ఆ అబ్బాయి కాస్సేపటికి ఐస్ తీసుకొనివచ్చాడు. స్వామీజీ ఆ ఐసుముక్కల్ని గ్లాసులోవేసి ఆ పానీయాన్ని నాకిచ్చారు. ఇదంతా నాకోసమే అని తెలిసి నా కళ్ళు చెమ్మగిల్లాయి. స్వామీజీ ప్రేమ మనసులో పదిలపరిచి చిరకాలం స్మరించుకోదగ్గ మధురస్మృతిగా మిగిలింది. b



స్వామి వీరేశ్వరానంద

# ధీరవాణి



# బలమే జీవితం

కర్మ చేసేటప్పుడు లక్ష్యంపట్ల ఎంత శ్రద్ధ వహించాలో సాధన పట్లకూడా అంతే శ్రద్ధ వహించాలి. విజయాన్ని సాధించగల రహస్యమంతా దానిలోనే ఉంది. సాధన సరిగా ఉంటే మంచి ఫలితం కలిగి తీరుతుంది.

**కర్మ బంధనం కారాదు...**

యావచ్ఛక్తితో కర్మను చెయ్యాలని, మనం చేసేపని ఏదైనా మన మనసంతా దానిలో సంలగ్నం చెయ్యాలన్నదే గీతా సందేశం. కర్మను చేస్తున్నంతసేపూ మనం నిస్సంగులమై ఉండాలి. అంటే,మనం కర్మలు చేస్తుండాలి. అలాగే మనం సంకల్పించినప్పుడు కర్మను విడిచి పెట్టగలగాలి.

మన దుఃఖాలన్నిటికీ కారణం కర్మయందు ఉన్న సంగమమే. ఒక పనికి పూనుకొని దానిలో మన సర్వశక్తిని వినియోగిస్తాం అయినా ఆ పని కాకపోవచ్చు. కానీ దానిని విడువలేం అది మనకు బాధ కలిగిస్తుందని, దానినింకా అంటిపెట్టుకొని ఉండటం వలన మరింత దుఃఖమే కలుగుతుందని మనకు తెలుసు. అయినా దానితో తెగతెంపులు చేసుకోలేం. తేనెటీగ తేనె తాగడానికి వచ్చింది. దాని కాళ్ళు తేనెకు అంటుకు పోయాయి. అది వెళ్ళిపోలేకపోతోంది. మనం మాటిమాటికి అదే స్థితిలోకి వస్తున్నాం. సృష్టి రహస్యమంతా ఇదే. మనం ఇక్కడ ఎందుకున్నాం? తేనె తాగడానికి మనం ఇక్కడకు వచ్చాం. కానీ మన చేతులు, కాళ్ళు దానిలో అంటుకొన్నాయి. మనం వచ్చింది పట్టుకోవడానికి. కానీ మనమే పట్టుబడ్డాం. భోక్తల మవడానికి వచ్చి మనమే భుక్తులుగా మారాం. ఏలడానికి వచ్చాం కానీ ఏలుబడికి లోనయ్యాం. జీవిత సౌఖ్యాలను అనుభవించాలని మనం కోరుకుంటాం అవి మన ఆయువుపట్లనే తినేస్తున్నాయి. ప్రకృతి నుండి సర్వం రాబట్టుకోవాలని కోరుకుంటాం. కానీ ప్రకృతే మన నుండి సర్వాన్ని గుంజుకొంటుందని, మనలను పీల్చి పిప్పిచేసి పారేస్తుందని మనం చివరికి గ్రహిస్తాం.

అలా కాకపోతే జీవిత మంతా ఆనందోజ్జ్వలంగా వుండేది. మనం కర్మబద్ధులం కాకపోతే సుఖదుఃఖాలన్నీ ఉన్నా, జయాపజయాలన్నీ ఉన్నా జీవితం ఆనంద మయంగా సాగిపోతుంది.

**నిస్సంగమే నిజమైన బలం...**

నిరంతరం కర్మను చెయ్యి, కానీ దానిలో పట్టుబడవద్దు. వస్తువు ఎంత ప్రియమైనదైనా కావచ్చును. దానికోసం మన హృదయం ఎంతగా ఆత్రపడినా పడచ్చును. దానిని విడువ బోయేటప్పుడు కలిగే దుఃఖం ఎంతటిదైనా కావచ్చును. మీరు ఇష్టమైనప్పుడు దానిని విడిచివేసే శక్తిని కలిగి ఉండండి. ఈ జన్మలోగాని, పరజన్మలోగాని ఇక్కడ దుర్బలులకు స్థానం లేదు. దౌర్బల్యం బానిసతనానికే దారి తీస్తుంది. దౌర్బల్యం శారీరకంగాను, మానసికంగాను అన్ని రకాల దుఃఖాలకు దారి తీస్తుంది. దౌర్బల్యం మృత్యువు. మనలను అనేక లక్షల సూక్ష్మజీవులు చుట్టిముట్టి ఉన్నాయి. కానీ మనం దుర్బలులం కాకుండా ఉండగలిగితే, అవి మనకు కీడు చెయ్యలేవు. మనస్సు దృఢంగా ఉన్నంతవరకు మనలను వశపరచుకొనే శక్తి ఈ ప్రపంచంలో దేనికీ లేదు. ఇదొక గొప్ప సత్యం బలమే జీవితం, దౌర్బల్యమే మృత్యువు.

**(స్వామి వివేకానంద సాహిత్య సర్వస్వం 'లేవండి! మేల్కొనండి' నుంచి)**

# శివమహిమ్నః స్తోత్రం

(గత సంచిక తరువాయి...)

**బహుళరజసే విశ్వోత్పత్తౌ భవాయ నమో నమః**
**ప్రబలతమసే తత్సంహారే హరాయ నమో నమః।**
**జనసుఖకృతే సత్త్వోద్రిక్తౌ మృడాయ నమో నమః**
**ప్రమహసి పదే నిస్త్రైగుణ్యే శివాయ నమో నమః ॥30॥**

ఈ శ్లోకంలో పరమేశ్వరుడే సృష్టి కర్తగా సృష్టి భర్తగా, సృష్టి హర్తగా ఏ విధంగా పనిచేస్తున్నాడో; సృష్టికర్తగా ఉన్నప్పుడు ఆయన పేరేమిటి, సృష్టిభర్తగా పేరేమిటి, సృష్టిహర్తగా ఉన్నప్పుడు ఆయన పేరేమిటో దీనిలోని నామాల్లో చెప్తూ ఈ మూడింటికీ అతీతంగా ఉన్నప్పుడు ఆయనపేరేమిటో చెప్తున్నారు. ఈ నాలుగు నామాలతో మహిమ్నః స్తుతిని పూర్తిచేస్తున్నారు.

**బహుళ రజసే** = సమిష్టి అయిన రజోగుణంతో; **విశ్వోత్పత్తౌ** = విశ్వాన్ని ఉత్పత్తి చేసేటప్పుడు ఆయన పేరు భవ. సృష్టి కారక తత్త్వాన్ని భవ అన్నారు. **భవాయ నమోనమః** = (సృష్టికర్తగా రజోగుణంతో విశ్వాన్ని ఉత్పత్తి చేసే) భవునికి నమస్కారం. ఇక్కడ సమిష్టిభావాన్ని చెప్పడానికి "బహుళ" అనే శబ్దం వాడారు. తరువాత ఉద్రిక్త అనే పదం వాడారు. ఉద్రిక్త అంటే తీవ్రమైన; ఇది కూడా సమిష్టి తత్త్వాన్ని తెలియజేస్తుంది. **జనసుఖకృతే** = జనుల్ని సుఖంగా ఉంచేవాడు స్థితికర్త. స్థితికర్తగా ఉన్నప్పుడు ఆయనపేరు మృడ. మృడ అంటే ఆనంద కారకుడు. స్థితి బాహ్యానికి ఆనందంగానే కనిపిస్తుంది. బాహ్యానందం స్థితికారకత్వాన్ని తెలియజేస్తుంది. అంటే విష్ణురూపంగా ఉన్న శివునికి మృడ అని పేరు. బ్రహ్మ రూపంగా ఉన్న శివుని పేరు భవ. రుద్ర రూపంగా ఉన్న శివునికి హర అనిపేరు.

**ప్రబల తమసే తత్సంహారే హరాయ నమోనమః** ఈ మూడూ అయి మూడింటికీ అందకుండా ఎవరు ఉన్నారో ఆ చోటుకి వెళ్తే **ప్రమహసి.** మహసి = తేజస్సు; ప్రమహసి = ప్రకృష్టమైన తేజస్సు – అదే తురీయధామం. అ ఉ మ మూడు అయితే ఆ పైన ఉన్న తురీయ ధామమే ప్రమహస్సు.

'యద్గత్వాననివర్తంతే తద్ధామ పరమం మమ'– పరమమైన తేజోమయ జ్యోతిర్మయ ధామం ఏదుందో అదే; నిస్త్రైగుణ్యే= త్రిగుణాలకూ అతీతమైనది. కనుక త్రిగుణాతీత స్థితిలో ఉన్న శుద్ధమైన, నిరంజనమైన, నిర్వికల్పమైన, ప్రశాంతమైన అద్వైతస్థితిలో ఉన్న పరమేశ్వర చైతన్యానికి శివము అని పేరు. శివాయ నమోనమః అంటున్నారు. శివుడంటే త్రిగుణాతీతుడు. త్రిగుణాతీత స్థితికి చేరవలసిన ప్రతివారూ కూడా శివోపాసన చేయాలి. శివోపాసన చేసేవాడికి త్రిగుణాత్మకమైన జగత్తులో అంతా శివమే లభిస్తుంది. అందుకే చివరినామం శివాయ నమోనమః దీనిలో "నమోనమః" అనేవి లెక్కపెడితే ఎనిమిది వస్తాయి. ఇవి భిన్న ప్రకృతిః అష్టధా – ఎనిమిది విధాలైన ప్రకృతిలో వ్యాపించిన ఎనిమిదింటి స్వరూపుడైన శివుడికి నమస్కారాలతో పూర్తిచేశారు.

**కృశపరిణతి చేతః క్లేశవశ్యం క్వ చేదం**
**క్వ చ తవ గుణసీమోల్లంఘినీ శశ్వదృద్ధిః ।**
**ఇతి చకితమమందీకృత్య మాం భక్తిరాధాద్**
**వరద చరణయోస్తే వాక్యపుష్పోపహారమ్ ॥31॥**

చివరన చాలా అద్భుతమైన శ్లోకం చెప్తున్నారు. **వరద** = వరములిచ్చువాడా; **చరణయోః తే** = నీ చరణములకు **వాక్య పుష్పోపహారం** = (ఉపహారం అంటే కానుక, పూజ) నేను ఇచ్చిన వాక్యపుష్పమాల ఇది – ఇప్పుడు చెప్పిన 31 శ్లోకాలూ కూడా నేను సమకూర్చిన వాక్యముల పుష్పమాల. దీనిని రచించిన పుష్పదంతుడు. శివుని గంధర్వగణాలకు చెందిన పుష్పదంతుడనేవాడు ఒక చిన్న పొరపాటు వలన అమ్మ శాపం చేత తాను భ్రష్టుడై, మలినమైన ఈ భూమి మీద పడ్డాడు; ఈ మాలిన్యం నుండి బయటికి వెళ్ళిపోవడానికి వ్యాకరణం అధ్యయనంచేసి, శుద్ధం చేసుకున్న వాక్కుతో ఈ మహిమ్నః స్తుతిచేసి మలినమైన లోకాన్ని దాటి మళ్ళీ నిర్మలమైన శివధామాన్ని చేరుకుంటున్నానని గ్రహించాడు. పూర్వజన్మ స్మృతి వలన ఆ విషయం చెప్పగలిగాడు. పుష్పదంతుడనే నామముద్రని అనేక చోట్ల చూపించాడు. అలాగే చాలా చోట్ల వరద అని కూడా ప్రయోగించాడు. వరద అంటూ తన పేరును ధ్వనింపచేశాడు. రదము అంటే దంతము అని ఒక అర్థం. వ అనేది వికాసవంతమైన పుష్పానికి

సంకేతం. పుష్పవాచకం, రద అంటే దంతం – వరద అంటే పుష్పదంతా; వాక్యపుష్పోపహారం అన్నప్పుడు వాక్యరూపంలో కూర్చబడిన పుష్పములతో ఇచ్చిన ఉపహారం అనే కాకుండా వాక్యకారుడైన పుష్పదంతుడిచ్చిన ఉపహారం అని కూడా అర్థం. మహా వ్యాకరుణుడైన వరరుచి ఇచ్చినది. అందుకే వరద అనే దానిలో వర అనే శబ్దంతో వరరుచి అనికూడా తెలియచేస్తున్నారు. ఇంకా ఆలోచిస్తే పుష్పదంత అంటే తుమ్మెద అని కూడా చెప్పవచ్చు. తుమ్మెదకు భ్రమరం, ద్విరేఫము అని పేరుంది. నోటిలో ఉండి పొడిచే సాధనం దంతం. మకరం దాన్ని ఆస్వాదించ గలిగే లక్షణం కలిగిన దంతం వంటి సాధనం తుమ్మెదకి ఉంది. పుష్పంలో తన దంతాన్ని పొడిచి ఆస్వాదించే తుమ్మెద కనుక పుష్పదంత అని అర్థం. రెండు రకారాలున్నది (ద్విరేఫ) భ్రమరము, పుష్పదంతమయింది. అలాగే రెండు రకారాలుగావున్నవాడు పుష్పదంతుడయ్యాడు – వరరుచి. వరరుచే పుష్పదంతుడనడంలో ఇది రహస్యం. అందుకే "వరద చరణయోః తే వాక్య పుష్పోపహరం – ఇలా ఇస్తున్నానంటూ" "స్వామీ, నువ్వు అందని వాడవు. నేను అందుకోలేని వాడను అని ఎలా ఊరుకుంటాను" అన్నాడు **కృశపరిణతి చేతః క్లేశవశ్యం క్వచేదం** – చేతః = బుద్ధికి, కృశపరిణతి = పక్వత అనేది లేక కృశించిపోయింది. సమగ్రంగా ఆలోచించ గలిగితే పుష్టికలిగిన బుద్ధి, అసంపూర్ణ ఆలోచనలు, ఆలోచించలేకపోవడాలు – ఇవన్నీ కృశపరిణతి – పరిపక్వత లేని బుద్ధికి చెందినవి. పరిపక్వత ఎందుకు రాలేదంటే... క్లేశవశ్యం = కష్టాల చేత, క్లేశముల చేత ప్రతివాడి బుద్ధినీ పట్టేవి పంచక్లేశములని శాస్త్రం చెప్తోంది – అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము – ఈ ఐదూ మన బుద్ధిని పట్టి పీడించే జబ్బులు. అవిద్య అంటే – దేహమే నేననుకోవడం, నాది కానిది నాదనుకుని ఆ మోహంలో పడిపోవడం. అస్మిత అంటే తాను కాని దానితో తన చైతన్యం కలిసి నేనున్నాననుకోవడం అస్మి... అస్మి... అనేది అస్మితా భావం. తరువాతది ఒకదాని మీద రాగం – ఇది నాది అనే అనురాగం ఏర్పరచుకోవడం. ప్రతికూలమైన దానిమీద ద్వేషం ఏర్పరచుకోవడం. ఈ రాగం ద్వేషం తీవ్రమైతే అభినివేశం. ఈ ఐదు క్లేశాల చేత నా బుద్ధి కృశించి పోయింది. **క్వ చ తవ గుణసీమో ల్లంఘినీ శశ్వదృద్ధిః** = హద్దుల్లేని అనంత కల్యాణ గుణ సంపన్నుడివి నువ్వు కనుక నువ్వెక్కడ? నేనెక్కడ? అనుకుని వదిలేస్తే నేను సోమరి నవుతాను. పరమేశ్వరుడు అందడని చెప్పి స్తోత్రం చెయ్యడం మానేస్తే, మందీకృతః = మందమైపోతుంది; అంటే అసలు పని చెయ్యకుండా పోతుంది. **ఇతి చకితమమందీ కృత్య** = అందుకు నేను మందీని కాకుండా ఉండడానికి స్తోత్రం చేశాను. **భక్తిరాధాత్** = భక్తితో స్తోత్రం చేశాను; భక్తితో అంటే ప్రేమతో ఆశ్రయించడం; **వరద చరణయోః తే వాక్య పుష్పోపహారం** = ఓవరదా! వరదుడనైన నేను ఈ వాక్య పుష్పోపహారం నీకు సమర్పించుకుంటున్నాను. అన్ని మాటలూ ఓంకార స్వరూపుడైన శబ్దబ్రహ్మ పరమేశ్వరునికి సమర్పణ చేస్తున్నాను అంటూ సర్వం శివార్పణ చేశాడు. b

(తరువాతి శ్లోక వివరణ వచ్చే సంచికలో...)

**వ్యాఖ్యాత : సామవేదం షణ్ముఖ శర్మ**

**విలేఖనం : శ్రీమతి ఎన్. శేషు**

చేరమాన్ పెరుమాళ్ గొప్ప శివ భక్తుడు. కొడుంగోళూరు మహారాజు సంతతి లేకుండా మరణించాడు. అతని మేన అల్లుడయిన చేరమాన్ మహారాజుగా బాధ్యతలు చేపట్టాలని అందరూ ఆశించారు.












అప్పుడు ఒక చాకలివాడు శరీరమంతా తెల్లటి మట్టితో రాజబాటలో వస్తున్నాడు. వెంటనే మహారాజు ఏనుగు నుండి క్రిందికి దిగి చాకలివానికి నమస్కరించాడు.



మహారాజా! ఎంత అపరాధం! మీరు ఈ దరిద్రునికి నమస్కరించడమా !




ఆహా ! మన మహారాజు చాలా భక్తి కలవాడు !

ప్రతిరోజూ భక్తితో మహారాజు చేసే పూజను పరమేశ్వరుడు స్వీకరించేవాడు, దానిని నటరాజస్వామి తన పాద కంకణ సవ్వడితో తెలియజేసేవాడు.



పరమేశ్వరా ! పూజానంతరం మీ పాద కంకణ సవ్వడిని వినే భాగ్యం నాకు కలుగజేశారు. ఈ దీనుని పట్ల మీకు గల ప్రేమకు ధన్యుడను !

# పరిప్రశ్న

- స్వామి సుకృతానంద

-ఎం.ఎల్.ఎన్.రావు, హైదరాబాద్

?: **శ్రీ శారదామాత ప్రాతః కాలంలో లేచి గంగాస్నానానంతరం... లక్ష సార్లు జపం చేసినట్లు తెలుస్తుంది. శ్రీరామకృష్ణ భగవానులు శ్రీమాతకు ఏ దేవీ దేవతల మంత్రదీక్ష ఇచ్చారు?**

✍: గురుదేవులిచ్చిన మంత్రాన్ని ఎవరికీ చెప్పకూడదు. దాన్ని రహస్యంగానే ఉంచాలి. మంత్రంలో సందేహాన్ని గురువువద్దే తెలుసుకోవాలి. ఇదే నియమం. శ్రీ శారదామాత, శ్రీరామకృష్ణులిచ్చిన మంత్రాన్ని అసంఖ్యాకంగా జపించి సిద్ధమంత్రం చేశారు. సర్వదేవదేవీ స్వరూపిణి అయ్యారు. ఇంకా అనేక దేవీ దేవతల మంత్రాలను శ్రీ రామకృష్ణులు అమ్మకు ఇచ్చారు. ఆమె తన శిష్యులకు అవే మంత్రాల్ని ప్రసాదించేవారు. శ్రీ రామకృష్ణుల పరంపరలో ఆ మంత్రాల్నే సంఘ గురువులు ఉపదేశిస్తున్నారు. b

- ఈదుల వెంకటరెడ్డి, గిద్దలూరు.

?: **శ్రీ రామకృష్ణ భగవానులు, శ్రీ జగజ్జనని శారదామాతను పూజించుకోవాలంటే తప్పనిసరిగా మంత్రదీక్ష తీసుకోవాలా? వారిపై విశ్వాసం, భక్తి ఉంటే సరిపోతుందా? వివరించండి.**

✍: భగవాన్ శ్రీరామకృష్ణులపై భక్తి, విశ్వాసం, శ్రద్ధ ఉన్నవారెవరైనా ఆయన్ను పూజించుకోవచ్చును. అలా భక్తి ప్రపత్తులున్నవారు అవకాశం లభిస్తే సంఘ గురువుల వద్ద మంత్రదీక్ష తీసుకుంటే వారి సాధనలో పురోభివృద్ధి ఉంటుంది. శ్రీ రామకృష్ణ దేవాలయాల్లో పూజచేసేవారు మంత్రదీక్ష తీసుకుంటే మంచిది. సంప్రదాయం ప్రకారం ఉపనయనమయిన తర్వాతే దేవతారాధనకు అర్హత ఉంటుంది. ఎవరైనా దేవుని విగ్రహం ముందు పూలు అర్పించి, దీపారాధన చేయవచ్చు. అది వేరే విషయం. నియమ నిష్ఠలతో దేవాలయాల్లో భగవాన్ శ్రీ రామకృష్ణులను పూజించాలంటే మంత్ర దీక్ష తప్పనిసరిగా తీసుకోవాలి. b

- సిహెచ్. యర్రారెడ్డి, పొదలకుంటపల్లె

?: **అరవై నాలుగు కళలు, 84 లక్షల జీవరాశుల పట్టిక లభిస్తుందా ?**

✍: ఇతిహాసము, ఆగమము, కావ్యాలంకార నాటకములు, గాయకత్వం,కవిత్వము, వాచకము, అవధానము ఇలా అరవై నాలుగు కళలున్నాయి. ఈ కళల పట్టిక ఇక్కడ ఇవ్వడం సాధ్యం కాదు. అలాగే 84 లక్షల జీవరాశులు ఉన్నాయి. మామిడి తోటకివెళ్ళి, తోటలో ఎన్ని చెట్లున్నాయి, కొమ్మలెన్ని, ఆకులెన్ని ఇలా లెక్కలేసుకుంటే ఏ విధమైన ప్రయోజనం ఉండదు. మామిడి పండ్లు తినాలి అంటారు శ్రీ రామకృష్ణులు. విషయ పరిజ్ఞానం , జనరల్ నాలెడ్జ్ ఉండడం మంచిదే . ఇన్ని లక్షల జీవరాసుల్లో అరుదైన మానవజన్మ పొంది, ఈ చరాచర సృష్టికర్త అయిన పరమేశ్వరుని దర్శనం పొందితే జన్మ సార్థకమవుతుంది. b

- డి. సూర్యకుమారి, చెన్నై

?: **శ్రీ కృష్ణుని సోదరి సుభద్ర జన్మ వృత్తాంతం వివరించమనవి.**

✍: సుభద్ర దేవకీవసుదేవులకు జన్మించింది. బలరాముడు రోహిణికి జన్మించాడు. సుభద్ర వసుదేవుని గారాల పట్టి. మహాభారతంలో ఈమె గురించి వివరణ ఉంది. ధనుంజయునికిచ్చి వివాహం జరిపించాడు కన్నయ్య. b

# ఆధ్యాత్మిక అన్వేషణ

**ప్రశ్న: సాంసారిక కార్యకలాపాలలో నిమగ్నమైయున్నప్పటికీ ఆధ్యాత్మిక జీవితాన్ని తీవ్రతరం చేయడమెలా?**

**జవాబు:** ఆధ్యాత్మిక జీవితాన్ని తీవ్రతరం చేయడానికి మనం ఏదైనా పనిలో నిమగ్నమై ఉన్నామా లేదా అనేది ముఖ్యం కాదు. కేవలం ఆధ్యాత్మిక జీవితపు చరమ దశలోనే దానికి ప్రాముఖ్యం ఉంటుంది. అసలు మనకు ఆధ్యాత్మిక జీవితం గడపాలన్న కాంక్ష ఉందా లేదా, ఉంటే అది ఎంత తీవ్రంగా ఉంది అనేదే అతి ముఖ్యమైన అంశం. భగవంతునికై ప్రాకులాడని జీవితం నిరర్థకమని మనం ఎంత వరకు భావించ గలుగుతున్నామనేదే మన ఆధ్యాత్మిక జీవితపు తీవ్రతను నిర్ధారిస్తుంది, మనం ఆశలు, ఐహిక సుఖాలతో తృప్తిపడుతున్నంతకాలం ఆధ్యాత్మికాపేక్షకు బలం చేకూరదు. జీవితంలో ఈ సాంసారిక విషయాలకు ప్రాముఖ్యాన్నిస్తున్నంత వరకు మన ఆధ్యాత్మిక జీవనం కేవలం సాంప్రదాయక రీతిలోనే ఉండిపోతుంది. ఈ మానసిక స్థాయినుంచి బయటపడినప్పుడే మనలో శ్రద్ధ ఉదయిస్తుంది. అప్పుడు భగవంతుడు, ఆధ్యాత్మిక జీవితంవంటివి మన జీవితంలో అతి ముఖ్యమైన అంశాలుగా రూపుదిద్దుకుంటాయి.



స్వామి తపస్యానంద

భగవంతుడు, ఆత్మ, పరలోకం వంటి విషయాలపట్ల అవగాహన కేవలం సాంప్రదాయక రీతిలోనే ఉన్న వ్యక్తి 'శ్రద్ధ' వంటి అంశాలకు తగిన ప్రాధాన్యాన్నివ్వడు. దానికి బదులుగా అతడు తన ఆస్తిపాస్తులు, బంధుమిత్రులు ఇతర ఐహిక ప్రాకులాటలపట్ల మోజు చూపుతాడు. ఫలితంగా ఆధ్యాత్మిక జీవితంపై అతడు శ్రద్ధ కనబరచడు. కానీ ఎవరిలో శ్రద్ధ ఉదయిస్తుందో, అతని వైఖరి మార్పుచెంది ప్రస్తుత పరిస్థితికి పూర్తి విరుద్ధంగా తయారవుతుంది. తాను కోరిన ఆధ్యాత్మిక విలువల కొరకై అతడు తన సమయాన్ని, కృషిని, వనరులను వెచ్చించడానికి సిద్ధంగా ఉంటాడు. మనలోని శ్రద్ధ ఎంత ప్రగాఢంగా ఉందన్న దానిపై మన ఆధ్యాత్మిక జీవితపు తీవ్రత ఆధారపడి ఉంటుంది. మన ఆధ్యాత్మిక సాధనలు, వాటిలో మనం కృతకృత్యులమవడమనేది కూడా దానిపైనే ఆధారపడి ఉంటుంది. ఆత్మపరిశీలన, వివేకం, జీవితంలో అనుభవాలు నేర్పిన పాఠాల ద్వారా సాధుజీవనాన్ని గడుపుతున్న పుణ్యపురుషుల సాంగత్యం వలన మనలోని శ్రద్ధ స్థిరపడుతుంది. అన్నిటికంటే కూడా, భగవంతుడే జీవిత పరమాశ్రయమని భావించి జీవనాన్ని సాగించే పుణ్య పురుషుల సాంగత్యమే ఆధ్యాత్మిక కాంక్షను రగిల్చే మూలాధారం.

తన బాధ్యతలలో భాగంగా పనులను నిర్వర్తించే ఆధ్యాత్మిక సాధకుడు సదా ఆ పరమాత్మని తన మదిలో ఉంచుకొని, అంతా ఆయన కార్యప్రణాళికగా భావిస్తూ వాటిని చేపట్టాలి. అప్పుడు మాత్రమే పని ఆధ్యాత్మిక జీవితాల మధ్య ఉండే అంతరం తొలగి ఒక సమగ్ర ఆధ్యాత్మిక జీవితం నెలకొంటుంది.

సంసారంలో అనేక కార్యకలాపాలతో సతమతమయ్యే సాధకులకు అప్పుడప్పుడు వాటినుంచి ఒకటి రెండు రోజుల విరామం తీసుకొని ఏకాంత ప్రదేశానికి వెళ్ళి సాధన చేయమని శ్రీరామకృష్ణులు ఉపదేశించారు. అటువంటి ప్రదేశాలు మన రోజువారీ వాతావరణానికి భిన్నంగా ఆధ్యాత్మిక సాధనలకు చాలా అనుకూలంగా ఉండడం వలన అక్కడ పూర్తిగా సాధనలతోనే సమయాన్ని గడపవచ్చును. ఇది మనలోని ఉత్సాహాన్ని పునరుజ్జీవింపజేసి, మనలో నిష్కామ భావన నెలకొనేందుకు సహకరిస్తుంది.

పనిలో నిమగ్నమై ఉన్నప్పుడు కూడా సదా భగవన్నామాన్ని మనసులోనే జపిస్తూ, ఆయనను స్మరించేందుకు ప్రయత్నించాలి. నిరంతరం అలా సాధనచేయడంవల్ల నామస్మరణ అప్రయత్నంగానే చెయ్యగలం. ఈ సాంసారిక విషయాలు అనిత్యమూ, తుచ్ఛమూ అనే విషయాన్ని వివేకంతో గ్రహించడం ద్వారా కూడా నిష్కామభావం పెంపొందించుకోవచ్చు. b



# పరమాత్మునే వె
# పదకవితా పితా

***నా** వలన నీకు కీర్తి... నీ వలన నాకు పుణ్యము... అని ఆ ఏడుకొండలవాడిని సాధికారికంగా సేవించి సంబోధించగలిగిన పదకవితాపితామహుడు... వెన్నతో కలిగే నాకు వేంకటేశు మంత్రము... అంటూ ఆ మంత్రాన్ని పంచామృతంలా తన పాటలతో పంచిన పరమభాగవతోత్తముడు అన్నమాచార్య. జగతిలోని భావకాలుష్య ప్రక్షాళనకు ఆ భగవానుడే తన కరవాలాన్ని ఈ వాగ్గేయకారుడిగా ప్రయోగించి పావనం చేశాడు. ఆ కోనేటిరాయుని కొలిచి కీర్తించిన ఎన్నో పదాలలో ఆధ్యాత్మిక, ఆత్మాశ్రయ భావాలతో పాటు సమాజసంస్కరణను ప్రతిఫలింపచేశారు అన్నమయ్య. యుగాంతం వరకూ మానవజీవన మార్మికతను, నడవడికను ముందే ఊహించి తన సాహితీప్రక్రియల్లో ప్రస్తావించిన దార్శనికుడాయన.*

### తరించిన తాళ్లపాక...

కారణజన్ముడైన అన్నమయ్యకు జన్మనిచ్చి కడప జిల్లా తాళ్లపాక గ్రామం తరించింది. బుద్ధభగవానుని జన్మదినమైన వైశాఖ పూర్ణిమ నాడే క్రీ.శ. 1408లో జన్మించిన అన్నమయ్య తొలి తెలుగువాగ్గేయకారుడై వెలిగారు. ఆ ఇంటి ఇలవేలుపైన వేంకటేశుని నామమే పసినాట నుంచి అన్నమయ్యకు తొలి వేదమంత్రమయింది. ఆయన సంగీతసేద్యానికి తాళ్లపాకలోని చెన్నకేశవుని ఆలయం సుక్షేత్రమైంది. పదహారు ప్రాయాన కూడా ఆయన ప్రాపంచిక స్పృహలో లేకపోవటం కన్నవారిని కొంత కలవరపరచింది. ఎలాగైనా అన్నమయ్యకి లౌకికబంధాలు అల్లాలన్న ఆశతో తండ్రి నారాయణసూరి పసుగ్రాసం తెమ్మని అడవికి పంపుతాడు.

### గాయం... గోవిందనామస్మరణం...

కొడవలితో పసుగ్రాసం కోస్తున్న అన్నమయ్యకి ఒక్కసారిగా చేతివేలికి గాటుపడింది. ఈ దేహధారణే భవబంధాలన్నిటికీ కారణమని స్ఫురించింది. భవబంధాలన్నీ బాధలేననిపించింది. ఇంతలో తిరుమల చేరుకుంటున్న భక్తుల గోవింద నామస్మరణం వినిపించి, అన్నమయ్యని కదిలించింది. ఆ భక్తసమూహంలో తానూ ఒకడవుతాడు. అప్పటి నుంచి ఆ ఏడుకొండలపై కోనేటిరాయుని అర్చన, ఆరాధన, ఆలాపనే అన్నమయ్య లోకమయింది.

### సంకీర్తనల ఉద్యమానికి శ్రీకారం...

ఆ దివ్యమంగళస్వరూపుని కోరికొలిచే సౌలభ్యం ... ఆలపించి ఆరాధించే సద్భాగ్యం... సర్వజనమయం, శాశ్వతం కావాలన్న కాంక్షతో సంకీర్తన ఉద్యమానికి శ్రీకారం చుట్టారు అన్నమయ్య. బ్రహ్మకడిగిన ఆ పరమపాదాన్ని ప్రస్తుతించాలన్నా, విన్నపాలు వినవలెనని ఆ వేంకటేశుని వేడుకోవాలన్నా, అదివోఅల్లదివో అని ఆ ఏడుకొండలపైనున్న మంగళాకారుని వైపునకు దారిచూపాలన్నా... చందమామా రావే, జాబిల్లి రావే అని కొండపైనుంచి గోగుపూలు తెమ్మని కోరుకోవాలన్నా... ఏ మొకో చిగురుటదరమున కస్తూరి నిండెనని ఆ అలమేలు మంగమ్మను ఆత్మీయంగా అల్లరి పెట్టాలన్నా ... ఆ అర్హత అన్నమయ్య పదాలకే దక్కింది.



వేంకటేశుని సన్నిధిలో అన్నమయ్యకీర్తనల భాండాగారం

### సమాజప్రక్షాళనకూ సారధ్యం...

ఎంత పరమభక్తాగ్రేసరుడైనా అన్నమయ్య సంఘాన్ని మరచిపోలేదు. ఆనాటి కాలంలోని ఎన్నో సమాజరుగ్మతలను ఎదిరించారు. కుల, మతభేదాలు కూడదన్నారు. ఏ కులజుడేమి? ఎవ్వడైననేమి? హరినెరిగినవాడే ఉన్నతకులజుడు! అని సుస్పష్టం చేశారు. బ్రహ్మతత్త్వం అణువు మొదలుకొని అఖండం వరకు వ్యాపించిందని, దీనికి జాతి, కుల, వర్గాలతో నిమిత్తం లేదన్నారు. సమకాలీన పండితులనుకునే వారంతా ఆయనను విరోధించినా లెక్కచేయని సంస్కర్త అన్నమయ్య.

### నరుని కీర్తించని నోరు...

కామకాంచనాలకు... పూటగడిచేందుకు నరుని కీర్తించటం కూడదన్నారు అన్నమయ్య.



మనుషులమై పుట్టి సాటి మనిషిని ఆరాధించటమేమిటని, వ్యక్తి ఆరాధనను ఖండించారు. అందుకే తనను ఆస్థానవాగ్గేయకారుడిగా గౌరవించినా, సకలసంపదలు ఇవ్వచూపినా సాళువ నరసింగరాయలపై ఒక్క కవితనూ రచించలేదు...వచించలేదు. ముచ్చటపడి అర్థించినా, మహారాజునన్న గర్వంతో చెరసాలలో పెట్టి హింసించినా 'నా జిహ్వ నారాయణునే తప్ప నరుని స్తుతించలేద'ని ఆ భక్తపరిపాలకుణ్ణే నమ్ముకున్నారు. చివరకు ఆ నరసింగరాయుని గర్వమణచి ఆ శ్రీనివాసుడే అన్నమయ్యను చెరవిడిపించాడు.

**సతినే సాహితీమూర్తిగా మలచి...**

ఆరాధ్యనీయ పరమభక్తాగ్రేసరుడే కాదు... అర్థాంగికి ఆదర్శనీయ జీవిత భాగస్వామి కూడా. తన భార్య తాళ్లపాక తిమ్మక్క లోని సాహితీతృష్ణను ప్రోత్సహించారు. 'సుభద్రా కల్యాణం' రాసిన తొలి తెలుగు కవయిత్రిగా ఆమెకు చరిత్రలో చిరకీర్తిని కల్పించారు. తన ఆధ్యాత్మిక, సారస్వత సాధనలో ఆమెనూ భాగస్వామిని చేసుకున్నారు.



**- బి. సైదులు**

దాంపత్యంలోని పారలౌకిక కోణానికి కొత్తభాష్యం చెప్పారు.

**పదాలమయమై... పరమాత్మలో లయమై...**

ఆ పూర్ణపురుషుని 'పద'సేవ పరంపరలో రోజుకొక్క కీర్తన సృజించి సేవించి తరించారు అన్నమయ్య. తెలుగు,సంస్కృత, తమిళ, కన్నడ భాషల్లోని మధురపదాలన్నీ ఆయన కీర్తనల్లో మరింత మాధుర్యాన్ని సంతరించుకున్నాయి. అన్నమయ్య రచించిన ముప్పైరెండువేల కీర్తనల్లో పన్నెండువేలే మిగిలి, మిగతా పదాలన్నీ కాలగర్భంలో కలిసిపోవటం మన దురదృష్టం. దాదాపు తొంభైఏళ్ల పాటు తన జీవనసర్వస్వాన్ని ఆ శ్రీనివాసుని సన్నిధినే సేవిస్తూ సార్థకం చేసుకున్నారు. *'దాచుకో! నీ పాదాలకు తగ నే చేసిన పూజలివి, నా నాలిక పైనుంచి నానా సంకీర్తనలు పూని నాచే నిను పొగిడించితివి, కానిమ్మని నాకీ పుణ్యము గట్టితివి, ఈ మాట గర్వము కాదు, నీ మహిమ కొనియాడితిగాని... శ్రీమాధవా! నీ దాసుడ...'* అంటూ ఆ లీలామూర్తిలో క్రీ.శ.1503లో లయమయ్యారు తాళ్లపాక అన్నమాచార్యులు. b

**(ఈ నెల 2న అన్నమయ్య జయంతి)**

# మనుజుడై పుట్టి...

**వా**గ్గేయకారులనగానే ఆధ్యాత్మికతే గుర్తొస్తుంది. కానీ సామాజికాంశాలను, సార్వజనీన సత్యాలనూ వారు తమ దార్శనికతతో మధురకీర్తనల్లో ముందుతరాలకు జ్ఞానపేటికలుగా అందించారు. అలాంటి అద్భుత భావామృతమే అన్నమయ్య రచించిన' మనుజుడై పుట్టి... మనుజుని సేవించి...' కీర్తన. మనిషి ప్రవర్తనను, జానెడు పొట్టకోసం ఆడే నాటకాలను అయిదువందల ఏళ్ల క్రితమే అంచనా వేసి సున్నితంగా చురకలంటించారు. వ్యక్తి ఆరాధనను ఖండించారు. ఆ కోనేటిరాయని మించి మానవులను ఎవ్వరినీ కొలిచి ప్రసన్నం చేసుకోవాల్సిన అవసరం లేదని చెప్పకనే చెప్పారు పదకవితా పితామహులు అన్నమయ్య. ఒక్కమారు ఆ అక్షరాక్షతలను పరికిస్తే...

మనుజుడై పుట్టి... మనుజుని సేవించి
అనుదినమును దుఃఖమందనేలా...
జుట్టెడు కడుపుకై చొరరాని చోట్లచొచ్చి
పట్టెడు కూటికై బతిమాలి
పుట్టిన చోటికే పొరలిమనసువెట్టి
వట్టి లంపటము వదలనేరడుగాన..
అందరిలో పుట్టి అందరిలో చేరి
అందరి రూపములటు తానై
అందమైన శ్రీవేంకటాద్రీశు సేవించి
అందరాని పద మందెనటు గాన....

చూశారా...మనుషులమై ఉండి సాటి మనుషుల దగ్గర ఈ కపటత్వాలు, లేనివినయాలు ఎందుకు? ఎన్ని చేసినా ఈ జానెడు పొట్ట కోసమేగా! లేకపోతే తలదాచుకునేందుకు గూటికోసం. ఆ మాత్రం దానికి ఇన్ని అగచాట్లు అవసరమా అని ప్రశ్నిస్తున్నారు అన్నమయ్య. పుట్టిన చోటికే తిరిగి వెళ్లిపోయే మనకు ఇన్ని లంపటాలు, నాటకాలు అక్కర లేదంటున్నారు. అందరిలో తానే అయి నడిపిస్తున్న ఆ వేంకటేశ్వరుని పదసేవే పరమోన్నతమని, పవిత్రలక్ష్యమని బోధిస్తున్నారు అన్నమాచార్య. b



తాళ్ళపాక గ్రామం

# యోగ ధర్మం

డా ॥ సంధ్యావందనం లక్ష్మీదేవి

**ఓం కృతంమే దక్షిణే హస్తే జయో మే సవ్యఆహితః**
**గోజిద్ భూయాస మశ్వజిద్ ధనంజయో హిరణ్యజిత్**
**(అధర్వవేదం 7-50-8)**

మానవుడు పరాక్రమంతో సంపదలు పొంది సుఖంగా జీవించాలని ఈ మంత్రాభిప్రాయం. అంతేకాదు నా కుడిచేతిలో పురుషార్థ ముంది, ఎడమ చేతిలో విజయ రహస్యముందనే సత్యాన్ని కూడా ఈ మంత్రార్థం తెలియ చేస్తుంది.

**పుణ్యేన పుణ్యం లోకం**
**నయతి పాపేన పాపం**
**ఉభాభ్యాంమనుష్యలోకం**

మంచి ఫలం పుణ్య రూపంలోను, చెడు ఫలం పాపరూపంలో ఉంటుంది. శరీరాన్ని ఆశ్రయించి కుడి ఎడమలున్నట్లే, కార్యాన్నాశ్రయించి ఫలం ఉంటుంది. పుణ్యకార్యం ద్వారా లభించే ఫలంతో మానవునకు లోకంలో రాజ్యాలు, పశు సంపదలు, ధనం, బంగారం వంటి సమస్త ఐశ్వర్యాలు లభిస్తాయి. కొన్ని పనులకు ఫలం వెంటనే లభిస్తుంది. మరికొన్నింటికి ఫలం తరువాత లభిస్తుంది. ఉదాహరణకు రైతు భూమిలో విత్తనం నాటిన రోజే పంట లభించదు. దానికి సమయం పడుతుంది. నిప్పుపైన చేయి పెట్టామంటే వెంటనే కాలుతుంది. దీనికి ఫలం వెంటనే బాధ రూపంలో అనుభవమవుతుంది.

భగవద్గీతలో భగవాన్ శ్రీకృష్ణుడు అర్జునునకు కర్మ చేయడానికే నీకు అధికారముంది. ఫలం మాత్రం పరమాత్ముని అధీనంలో ఉందని బోధిస్తారు. ఆ ఫలం ఈ జన్మలోనైనా అనుభవించవచ్చు. లేక తరువాత జన్మలోనైనా అనుభవించవచ్చు, దీనిని నిర్ణయించేది సృష్టి కర్త - పరమాత్ముడని కృష్ణ భగవానుడు అంటారు.

ఈ వేద మంత్రం మరొక సత్యాన్ని మనకు తెలియచేస్తుంది. నేను కుడిచేతితో పనిచేస్తుంటే, ఎడమ చేతిలోకి వెంటనే ఫలం వస్తుందని అంటుంది.

**"అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభా శుభమ్"**

కర్మలకు అనుకూలంగానే ఫలితాలను పొందుతామని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. మానవులు ధర్మ కర్మలు ఆచరించకపోతే జీవితం సుఖమయం కాదు.

సాధారణ మానవులు సంపూర్ణంగా ఫలాన్ని త్యాగం చేయలేరు. వారు పూర్ణజ్ఞానులు కారు. కేవలం లోకహిత భావనతోనే సత్కర్మలు ఆచరిస్తారు. వారి విషయంలో అదే ఉత్తమమని విద్వాంసుల అభిప్రాయం. కానీ పూర్ణజ్ఞానులు ఆత్మస్వరూపం తెలుసుకొని, భగవత్ సాక్షాత్కారం పొందాలనీ అదే వారి జీవిత ధ్యేయమనీ వేద ఋషులు అంటున్నారు. ఈ వేద మంత్రంలో చెప్పబడిన పురుషార్థమే కర్మ. ఏ కర్మైనా ఫలాపేక్షతో చేస్తే అది ప్రశంసనీయం కాదు. ఫలాపేక్షతో చేసే కర్మ స్వార్థమవుతుంది.

మానవులకు అన్నిటి కంటే మృత్యు భయం ఎక్కువ. దానినుండి తప్పించుకోవడమే మానవ జీవిత లక్ష్యం. అందుకే మానవుడు సాధించాల్సిన చతుర్విధ పురుషార్థాలలో (ధర్మ, అర్థ, కామ, మోక్షాలు) అంతిమ పురుషార్థం మోక్షం. దీనినే మృత్యువు నుండి తప్పించుకోవడమని శాస్త్రాలు వివరిస్తున్నాయి.

మానవుడు భయంకరమైన ఈ మరణ దుఃఖం నుండి తప్పించుకోవాలంటే నిశ్చితమనస్కుడై వుండాలి, భోగాసక్తుడు కాకూడదు. మానవుడు కోరికలను విడిచి సుఖ దుఃఖాలలో ఏకరసుడై స్థితప్రజ్ఞుడు కావాలి. అప్పుడు రాగం, భయం, క్రోధం అతనికి ఉండవు. శుభా శుభాలలో లిప్తుడుకాడు. ఇంద్రియాలను జయిస్తాడు. అసూయ, ద్వేషాలను అధిగమిస్తాడు. స్థితప్రజ్ఞునకు విశేష లక్షణాలుంటాయి. సాధన వలన మనస్సు స్థిరమై ప్రసన్నమవుతుంది. అదే యోగధర్మం. b

# ఆచార వ్యవహారాలు అంతరార్థాలు-15

- రెంటాల జయదేవ

(గత సంచిక తరువాయి)

# సుగుణాలనిచ్చే అర్ఘ్యం



**ఎనిమిది రకాల అర్ఘ్య ద్రవ్యాలు:**

సాధారణంగా అర్ఘ్యానికి వాడేది నీళ్ళే. అయితే, శాస్త్ర ప్రకారం ఎనిమిది రకాల ద్రవ్యాలను అర్ఘ్యానికి ఉపయోగిస్తారు. అవి ఏమిటంటే:

*కుశాక్షత తిలవ్రీహి యవ మాష ప్రియం గవాః।*

*సిద్ధార్థక సమాయుక్తా అర్ఘ్యా - ష్ట ద్రవ్య ముచ్యతే।*

'దర్భలు, అక్షతలు, నువ్వులు, యవలు, మినుములు, కొఱ్ఱలు, తెల్ల ఆవాలు - ఈ ఎనిమిదీ అర్ఘ్యానికి ఉపయోగించే ద్రవ్యాలు.' కాగా, పెరుగు, తేనె, నెయ్యి, అక్షతలు, గరిక, నువ్వులు, దర్భ, పుష్పం - అనేవి అర్ఘ్యానికి వాడే అష్ట ద్రవ్యాలని కొన్ని శాస్త్రాల్లో పేర్కొన్నారు. ఇంకొందరేమో ఉదకం, పాలు, కుశాగ్రాలు, పెరుగు, నెయ్యి, అక్షతలు, యవలు, తెల్ల ఆవాలు అష్ట అర్ఘ్య ద్రవ్యాలని చెప్పారు. మొత్తం మీద, ద్రవ్యం ఏదైనప్పటికీ, భక్తితో వాటిని అర్పించడమే ప్రధానం.

**అర్ఘ్యం ఎలా ఇవ్వాలి?**

మూడుసార్లు గాయత్రీ మంత్రోచ్చారణతో పాటు చేతిలోకి నీళ్ళు తీసుకొని, వదిలిపెట్టడమే అర్ఘ్యమివ్వడం.

అర్ఘ్యం ఇవ్వడానికి ముందు 'ఆసావాదిత్యో బ్రహ్మ' (ఋగ్వేదం) అనే మంత్రాన్ని ఉచ్చరిస్తూ, ప్రదక్షిణ చేయాలి.

ఆ తరువాత సూర్యదేవుడికి మూడుసార్లు అర్ఘ్యం ఇవ్వాలి. దోసిలి నిండా నీళ్ళు తీసుకొని, గాయత్రీ మంత్రంతో అభిమంత్రించి, పైకి ఎత్తి మూడుసార్లు అర్ఘ్యం ఇవ్వాలి. ప్రాయశ్చిత్త అర్ఘ్యం కూడా ఇస్తే నాలుగు సార్లు అవుతుంది. అర్ఘ్యం ఇస్తున్నప్పుడు బొటనవేలు, చూపుడు వేలు విడిచిపెట్టి, తక్కిన రెండు చేతుల వేళ్ళూ కలిపి, నీళ్ళు తీసుకొని వదలాలి.

**ఏ సమయంలో ఎలా?**

త్రిసంధ్యల్లోనూ అర్ఘ్యమివ్వడం ఉత్తమం. అలా మూడు సంధ్యాకాలాల్లో చేయడం సాధ్యం కాకపోతే, కనీసం ఉదయమైనా అర్ఘ్యమివ్వాలి. సంధ్యాకాలంలో తూర్పు ముఖంగా నిలబడి, దోసిలి నిండా నీళ్ళు నింపుకొని, గాయత్రీ మంత్రంతో ఆ నీటిని అభిమంత్రించి, మూరెడు ఎత్తుకు మించకుండా పైకి ఎగరేయాలని ఆరణ్యకాలు చెబుతున్నాయి.

ప్రభాత కాలంలో నిలబడి, కొద్దిగా ముందుకు ఒంగి, దోసిలిలోని నీటిని అభిమంత్రించి, గోశృంగ (ఆవుల కొమ్ము) ప్రమాణమెత్తులో పైకి ఎగరేసి వదలాలి. ఇక, మధ్యాహ్న వేళలో నిటారుగా నిలబడి, సాయం కాలంలో కూర్చొని అర్ఘ్యం వదలాలి. ఉదయ, మధ్యాహ్న కాలాల్లో తూర్పు ముఖంగా ఉండి అర్ఘ్య ప్రదానం చేయాలి. సాయం కాలం పడమటి వైపు తిరిగి నిల్చొని సూర్యుడికి అర్ఘ్యమివ్వాలి.

నదీజలాల్లో నిలబడి అర్ఘ్యమివ్వడం ఉత్తమం. ప్రవాహపు నీటిలోనూ, ఇంటి దగ్గర కూడా అర్ఘ్యం ఇవ్వవచ్చు.

మన శరీరంలో ఉత్పన్నమయ్యే విద్యుత్తును ఈ నీటి మూలంగా వదిలిపెట్టడమే అర్ఘ్యం ఇవ్వడంలోని ముఖ్యోద్దేశమని తార్కికులు చెబుతారు. దేహంలోని విద్యుత్తును ఇలా అర్ఘ్య ప్రదానం ద్వారా స్వాధీనంలోకి తీసుకురాకపోతే, సూర్యుణ్ణి ఆవరించిన జ్వాల ప్రభావంతో మానవుడిలో దుర్మార్గం, రాక్షసత్వం పెరిగే ప్రమాదం ఉంది. అయితే, నిత్యం అర్ఘ్యమివ్వడం ద్వారా ఆ దుర్లక్షణాలు పోయి, వినయం, సౌజన్యం, విధేయత, మృదుత్వం, కనికరం మొదలైన మంచి గుణాలు పెంపొందుతాయి.

(అర్ఘ్యం ఎవరు ఇవ్వాలి, సూర్యారాధనలో అంతరార్థం... వచ్చే సంచికలో)

# చక్కని ఇల్లే చుక్కాని

- బి.సైదులు

నాలుగు గదుల మధ్య... నలుగురు మనుషులు యాంత్రికంగా కలిసున్నంత మాత్రాన అది ఇల్లనిపించుకోదు. మాయని మమతలు మనసుల మధ్య లతల్లా అల్లుకుపోవాలి. సౌహార్దసేతువులు బలోపేతం కావాలి. అందుకే ఆంగ్లకవి ఎమర్సన్ అంటాడు 'The relationship between two members in a family should be like fish and water. It should not be like fish and fisherman'.. కుటుంబంలో ఒకరితో ఒకరికి అనుబంధం చేపకి, నీటికి ఉన్నంత సహజంగా, సౌకర్యంగా ఉండాలే కానీ... చేపకి జాలరికి మాదిరి తప్పించుకోలేని, తప్పనిసరి పరిస్థితిలా సాగిపోకూడదు. ఈ రోజుల్లో ఇళ్లన్నీ ఆధునిక సౌకర్యాలతో శోభిల్లుతున్నాయే కానీ ఆత్మీయతలతో కాదు. తమని తాము పిల్లలకు ఆదర్శంగా మలచుకోలేక, బిడ్డలు మాత్రం తమ చెప్పుచేతల్లో ఉండాలని తల్లిదండ్రులు... తాము ఎలా ఎదగాలో, ఎవరిలా ఉండాలో తేల్చుకోలేక పిల్లలు... అయోమయంతో సతమతమవుతున్నారు. ఫలితం ఎక్కడ చూసినా అంతస్తులు, ఆడంబరాలే తప్పా ఆదర్శాలు, ఆనందాలు తెలీని కుటుంబాలే కనిపిస్తున్నాయి. అన్నింటినీ మించి కుటుంబసభ్యుల్ని మాలలో పూలలా కట్టిపడేసే సాన్నిహిత్య సూత్రమే నానాటికీ సున్నితమవుతోంది.

**కుటుంబమంటే కోదండరాముడిదే...**

శ్రీరాముని చరిత్ర ఈనాటికీ చర్వితచరణమేనంటే, కారణం అది కుటుంబ విలువలకు కుదురుగా నిలిచింది. కలతలు, కల్లోలాలు ఎన్ని పొడచూపినా కుటుంబపెద్దగా కోదండరాముడు కష్టాల్ని తనే ముందు భరించాడు... సుఖాలను అనుంగు సోదరులకు, అనుచరులకు పంచిపెట్టాడు. తన మహోన్నత వ్యక్తిత్వంతో కుటుంబాన్నే ప్రభావితం చేశాడు. అయోధ్యను ఏలాల్సినవాడు రాత్రికి రాత్రే అడవులకు పయనం కావాల్సి వచ్చింది. అందుకు కించిత్తయినా కుంగిపోలేదు. ప్రసన్న వదనంతోనే ప్రయాణమయ్యాడు. ఆయనతో అడవి కూడా అయోధ్యే అనుకొని అర్థాంగి వెంట నడిచింది... అన్నావదినల సేవే భాగ్యమనుకొని తమ్ముడూ తోడు నడిచాడు... చివరికి ఎవరి కోసమైతే తాను రాజ్యం వదులుకున్నాడో ఆ తమ్ముడూ, అన్న పాదుకలకే పట్టాభిషేకం చేశాడు. ఆ శ్రీరాముడు తన ధర్మస్వరూపంతో ఎంత ప్రభావితం చేయకపోతే ఆ పరిగణమంతా అంత త్యాగపూరి తమవుతుంది.! అందుకే తానే కాదు తన శ్రీమతిని, సోదరుల్ని, చివరికి తన సేవకులను కూడా తనతో సమంగా దైవస్వరూపులను చేశాడు. ప్రతీ తండ్రీ ఆ రామచంద్రునిలా ధర్మాన్నే ఆచరిస్తే, ప్రతీ తల్లీ సీతాదేవిలా నారీశిరోమణే అయితే... పుట్టే పిల్లలు లవకుశలు కాక ఇంకేమవుతారు. ఆ ఇల్లు రామాలయం కాక మరేమవుతుంది.!

**కన్నవారే కరదీపికలు..**

తత్త్వవేత్త ఖలీల్ జిబ్రాన్ అంటాడు... Children through you, But not to you.... పిల్లలు మీ ద్వారా ఈ ప్రపంచానికి పరిచయమయ్యారే కానీ, మీ నుంచి కాదు. వారి రాకకు మీరు వారధులు మాత్రమే. ఈ నిజాన్ని భరించాలంటే తల్లితండ్రులకు కఠినంగానే ఉంటుంది. అయితే ఈ సార్వత్రిక సత్యాన్ని విశ్వసిస్తే ఎలాంటి ఆందోళన, ఆవేదన లేకుండా పిల్లల్ని తీర్చిదిద్దగలరు. భగవంతుడు నిర్దేశించిన లక్ష్యానికి మీ పిల్లల్ని బాణాల్లా సంధించే ప్రయత్నంలో మీరు ధనుస్సులు మాత్రమే. ధనుస్సు నిఖార్సుగా ఉంటేనే బాణాన్ని పదునుగా లక్ష్యానికి వినరగలదు. అందుకే మిమ్మల్ని మీరు ఉన్నతంగా, విశాలంగా తీర్చిదిద్దుకోండి. ప్రశాంతంగా, పొదరిల్లుగా ఇంటిని తీర్చిదిద్దాల్సింది తల్లితండ్రులే. ఏడిపించే

**మంచైనా, చెడైనా మీ నుంచే మీ పిల్లలు నేర్చుకు... ఇల్లంటే సాయంత్రం కాగానే పక్షి... చేరుకుంటామా అనిపించాలి**



సీరియళ్లు చూస్తూ తల్లి... ఏ ఇంక్రిమెంట్ల గురించో మాట్లాడుకుంటూ తండ్రి... ఉంటే పిల్లలు అన్నం కోసం తప్పా ఆత్మీయత కోసం ఇంటికిరారు.

**సమత్వమే సాధన...**

అర్థరాత్రి పుట్టిన క్షణం నుంచి అష్టకష్టాలు పడ్డాడు శ్రీకృష్ణుడు... అయినా చెక్కిలిపై చిరునవ్వును చెదరనీయని స్థితప్రజ్ఞుడు. అందుకే భగవద్గీత బోధించిన భగవానుడాయన. ఆ సమత్వభావనే, ఆ ధీరోదాత్తతే ప్రతీ తండ్రీ పుణికిపుచ్చుకోవాలి. తలలు తెల్లపడటమో, ముఖం ముడతలు పడటమో పెద్దరికం కాదు. సుఖదుఃఖాల్ని, లాభాలాభాల్ని, జయాపజయాల్ని సమంగా స్వీకరించడమే ఎదుగుదల. పిల్లల ముందు మీరు ఆనందస్వరూపులుగా కనిపించండి. నిశ్చలతటాకంలా నిలవండి. ఇంట్లో తమ సమస్యల్ని అర్థం చేసుకోటానికి గురువుల్లాంటి స్నేహితులయిన తల్లితండ్రులు పక్కనుండాలని ప్రతీ బిడ్డా కోరుకుంటుంది.

**బడి పాఠాలే కాదు, బ్రతుకు పాఠాలూ ముఖ్యమే...**

ఈనాటి పిల్లలకు బడి పాఠాలకేమీ కొదవలేదు. వచ్చిన కొరతంతా బ్రతుకు పాఠాలకే. కుటుంబంలోనే ఆ పాఠాలు వల్లె వేయించాలి. వినయం లేని విద్య శోభించదని, విలువలు లేని ఎదుగుదలకు విలువే లేదని, ఇచ్చే బాధ్యత తెలియని చేతికి పుచ్చుకునే హక్కూ లేదని, మనం పైకి రావాలంటే పక్కవాడు పడిపోవాల్సిన అవసరం లేదని... ఇలా అన్నీ చెప్పాల్సింది అమ్మానాన్నలే. పిడికెడు అటుకులు పెట్టినందుకే మిత్రుడికి పసిడివరాలు కురిపించిన కృష్ణుడు...పితృవాక్య పరిపాలన కోసం పడరాని కష్టాలు పడ్డ పావనరాముడు...మీ బిడ్డల బ్రతుకు పాఠాల్లో పరిచయమైతే వారు ఆణిముత్యాలై వెలుగుతారు. అందుకే కనీసం రాత్రి భోజనమైనా పిల్లలతో కలసి చేయండి... ఓ మంచి కథని గోరుముద్దలతో కలిపి తినిపించండి. ఆ ఫలితం ఎంత మధురంగా, మహత్తరంగా ఉంటుందో స్వామి వివేకానంద మాతృమూర్తి భువనేశ్వరీ దేవికి తెలుసు, కలామ్ కన్నతల్లి ఆషియమ్మకు తెలుసు.



**మంచైనా, చెడైనా మీ పిల్లలు నేర్చుకుంటారు. స్వతంత్రం కాగానే పక్షుల్లా ఎప్పుడు ఎగిరిపోదామా అనిపించాలి పిల్లలకి.**

***జగమంత కుటుంబం మనది...***

మహనీయులది జగమంత కుటుంబం. ఓ మారు ఓ చిన్నారి మహాత్మాగాంధీని 'తాతా! నువ్వెందుకు ఎప్పుడూ చొక్కా లేకుండా ఉంటావు. మా అమ్మని అడిగి నీకు బోలెడు చొక్కాలు కుట్టిస్తాను' అన్నాడట. అప్పుడు ఆయన 'నా పిల్లలకి కూడా లేవు, వాళ్లకు కూడా కుట్టిస్తావా?' అన్నాడట. 'ఓ... చెప్పండి, ఎంత మందికి?' అని ఉత్సాహంగా ముందుకు వస్తాడు ఆ పసివాడు. 'అయితే నా దేశంలో ఈ మాత్రం కూడా లేని బిడ్డలంతా మా కుటుంబసభ్యులే, వాళ్లందరికీ సరిపడా వస్త్రాలు అందాకే, నేనూ నిండుగా ధరిస్తాను' అన్నాడట ఆ మహనీయుడు. అందుకే ఆయన జాతిపిత అయ్యారు. ఆ వసుధైక కుటుంబపు భావనే మనందరి మననం కావాలి. సర్వజన హితం, సర్వజన సుఖమే... మన లక్ష్యమైనప్పుడు మన కుటుంబాల్ని ఏ శక్తీ విడదీయలేదు. b

(ఈనెల 15న కుటుంబదినోత్సవం)

## తల్లే తొలిగురువు...

ఈలోకంలో శ్రీరాముడులాంటి వారు ఎందరో కనిపించవచ్చు... కానీ సీతమ్మలాంటి వారు అరుదు... అంటారు స్వామి వివేకానంద. సుగుణాల రాశి ఆ శిరోమణి. ఆధునిక నారీమణులు ఆమె నుంచి ఎన్నో పాఠాలు నేర్చుకోవాలి. ఆ మాతృమూర్తి సీతకి అడవిలో వదిలిపెట్టేవరకు తెలీదు తాను ఎక్కడికి వస్తున్నది. అంతటి మహారాణి కానల్లో కాలం గడిపినా కష్టాన్నంతా కడుపులోనే దాచుకుంది. బిడ్డలిద్దరూ ఎదిగాక సకల విద్యలూ నేర్పిందే కానీ, భర్తపై పల్లెత్తు నిందవేయలేదు. పైగా వారి మనసులో తండ్రిని ధర్మస్వరూపునిగానే చిత్రించింది. అప్పుడే పిల్లల్లో తల్లితండ్రుల అపురూప దాంపత్యంపై ఆరాధన పెరుగుతుంది. తాము ధర్మస్వరూపుల వారసులమన్న బాధ్యత స్ఫురిస్తుంది. b





# రామకృష్ణ మఠం

వైటిల పోస్టు, కొచ్చి, ఎర్నాకుళం జిల్లా, కేరళ-682019., ఫోను నెం. 0484-2301860

పరివ్రాజిక రోజుల్లో స్వామి వివేకానందను అతిథిగా ఆదరించిన ఘనత కొచ్చి నగరానికి దక్కింది. స్వామీజీ సందర్శనంతో పావనమైన కొచ్చి- వైటిలాలోని రామకృష్ణ మఠం శాఖ 1999లో బేలూర్ రామకృష్ణ మఠం అనుబంధ సంస్థగా గుర్తింపబడింది. అప్పటినుండి ఈ కేంద్రం విద్యా, వైద్య, ఆధ్యాత్మిక, సాంస్కృతిక రంగాలలో అనేక సేవలు అందిస్తుంది. 1946లో నిర్మించిన రెండు భవనాలు ప్రస్తుతం శిథిలావస్థలో ఉన్నాయి. ఆ భవనాలు నిరుపయోగమైనవని ఇంజనీర్లు ధృవీకరించారు. ఈ కేంద్రం నిర్వహిస్తున్న సేవా కార్యక్రమాలకు కొత్త భవనాల్ని నిర్మించాల్సి ఉంది. ఈ బృహత్ పథకాల నిర్వహణకు ఉదారులైన దాతలనుండి విరాళాలు కోరుతున్నాం.

**ఈ కేంద్రం నిర్వహిస్తున్న సేవా కార్యక్రమాలు :**



**వైద్యసేవలు :** అలోపతి, హోమియోపతి, ఆయుర్వేద విభాగాలలో వారానికి 5 రోజులు 300 మంది రోగులకు సేవలందిస్తున్నాం. సుదూర గ్రామాల నుండి వచ్చే పేదవారికి ఉచితంగా మందులు ఇస్తున్నాము. అయితే ఇక్కడ రోగ నిర్ధారణకు ఆవశ్యకమైన సామగ్రి సమకూర్చాలి. ఈ భవనం శిథిలావస్థలో ఉన్నందువల్ల దీనిని పునర్నిర్మించాలి. వైద్యశాల ప్రారంభించి, మందులు సమకూర్చుకొనడానికి నిధులు అవసరం.

**విద్యా సేవలు :** 5వ తరగతి నుంచి 10వతరగతి వరకూ అర్హులైన పేద విద్యార్థులు 50 మందికి మేము ఉచితశిక్షణా తరగతులు నిర్వహిస్తున్నాం. పేద విద్యార్థులు 200 మందికి విద్యావ్యాసంగానికి ఉపయోగపడే స్టడీ మెటీరియల్ పంపిణి చేయడానికి నిధులు అవసరం.



**వ్యక్తిత్వ వికాస కార్యక్రమం :** 100 మంది విద్యార్థులకు మేము ఆదివారాలు వ్యక్తిత్వ వికాస తరగతులు నిర్వహిస్తున్నాం. వారికి వ్యాసరచన – వక్తృత్వ పోటీలు, చిత్రలేఖనం – సంగీత పోటీలు నిర్వహించి బహుమతులు ఇస్తున్నాం.

**ఆధ్యాత్మిక- సాంస్కృతిక సేవలు :** ప్రతీరోజు సాయంత్రం మందిరంలో పూజ, భజన కార్యక్రమాలతో పాటు ప్రతి ఆదివారం ఆధ్యాత్మిక ప్రసంగాలు నిర్వహిస్తున్నాం. శ్రీ రామకృష్ణులు, శ్రీ శారదాదేవి, స్వామి వివేకానందుల జయంతి ఉత్సవాలను, నవరాత్రి ఉత్సవాలను, ఇతర పర్వదినాల్లో ప్రత్యేక కార్యక్రమాలను నిర్వహిస్తున్నాం.

**నూతన భవనాల నిర్మాణం :**

1. వైద్యశాల భవనం
2. గ్రంథాలయం, పుస్తక విక్రయశాల భవనం
3. సాధు నివాసం, వంట, భోజనశాల, అతిథి గృహం



J మేము చేపట్టిన ఈ సేవా కార్యక్రమాల నిర్వహణకూ, నూతన భవన నిర్మాణాలకూ భక్తులు, శ్రేయోభిలాషులు, స్నేహితుల నుండి వచ్చే విరాళాలపై మాత్రమే ఆధారపడి ఉన్నాం.

J మీరిచ్చే విరాళాలు సమాజంలో మన తోటివారైన నిరుపేదలకు సేవలు అందించడానికి ఎంతగానో తోడ్పడతాయి.

J మీరిచ్చే అన్ని విరాళాలనూ కృతజ్ఞతతో స్వీకరిస్తాం. విరాళాలిచ్చే ప్రముఖ దాతల పేర్లు పాలరాతిపై చెక్కి కొత్తగా నిర్మిస్తున్న భవనంలో ప్రదర్శిస్తాం.

J మీరిచ్చే విరాళాలన్నింటికీ ఆదాయపుపన్ను చట్టంలోని సెక్షన్ 80 G కింద పన్ను మినహాయింపు ఉంటుంది. **Ramakrishna Math, Kochi** పేరిట చెక్కు లేక డి.డి. తీసి, విరాళాలను **Ramakrishna Math, Vyttila P.O., Kochi -682 019** కు పంపవలసిందిగా మనవి. మీ సహాయ సహకారాలకై ఎదురుచూస్తూ,

ధన్యవాదములతో,

*భగవత్సేవలో*

స్వామి ఆత్మస్వరూపానంద

అధ్యక్షులు

యువవాహిని

# మహనీయుల జీవితాల్లో మధుర ఘట్టాలు

- ఎ. కృష్ణ

## పఠనాసక్తి

**(కందుకూరి వీరేశలింగంగారి స్వీయభావనల నుంచి)**

నాకు తెలుగు కావ్యాలను చదవాలనే ఆసక్తి ఎక్కువ. తెలుగు కావ్యాలలో ఉత్తమమైంది వసుచరిత్రమని చాలా మంది చెప్పటంతో దాన్ని ఎలాగయినా చదవాలని నిర్ణయించుకున్నాను. మా ఇంట్లో ఉన్న తాటాకు గ్రంథాలన్నిటినీ విప్పిచూసాను. వాటిలో వసుచరిత్ర కనపడక నిరాశ చెందాను. కావలసిన పుస్తకాన్ని కొనమని అమ్మను అడగటానికి ధైర్యం సరిపోలేదు. ఎన్నో రోజులు ఆలోచించిన తరువాత సాహసం చేసి అమ్మను 'వసుచరిత్ర' కొనిపెట్టమని అడిగాను. "అది పాఠ్యపుస్తకం కాదని" అమ్మ నా కోరికను నిరాకరించింది.



ఎలాగైనా ఆ పుస్తకాన్ని కొని చదవాలనే గట్టి పట్టుదల నాకు కలిగింది. పుస్తకం ధర నాలుగున్నర రూపాయలు. అంత డబ్బు నావద్దలేదు. కాబట్టి నెల నెలా పాఠశాలకు కట్టవలసిన అర్థరూపాయిని పుస్తకం కోసం ఖర్చుపెట్టాలని, వేళకు భోజనంచేసి పాఠశాలకు పోతున్నట్లు నటిస్తూ, ప్రతిరోజూ ఎక్కడైనా కూర్చొని సాయంకాలం ఇంటికి రావాలని నిర్ణయించు కున్నాను. ఇది తప్పని తెలుసు. కానీ పఠనాసక్తి నా పాపభీతిని జయించింది.

పందిరి మహాదేవుడనే పుస్తక విక్రేత దగ్గరకు వెళ్ళి నా కోరికను తెలియజేసాను. నా పఠనాసక్తిని గమనించి, దయతో ఆ వ్యాపారి, పుస్తకం ధరను పూర్తిగా చెల్లించేవరకు దుకాణంలో కూర్చుని చదివేందుకు ఏర్పాటు చేసాడు. నేను పొదుపు చేసి సమకూర్చుకొన్న అర్థరూపాయి, పాఠశాల రుసుముకై ఇచ్చిన మరొక అర్థరూపాయి కలిపి ఒక రూపాయిని అతనికిచ్చి, దుకాణంలోనే పుస్తకం చదవటం ప్రారంభించాను.

నేను పాఠశాలకు వెళ్ళడంలేదని రెండవ నెలలోనే అమ్మకు తెలిసి పోయింది. ఆమె నన్ను మందలించి కారణమడిగింది. ఏం జరిగిందో తెలుసుకుంది. అడిగిన వెంటనే నిజం చెప్పినందుకు, పాఠశాల రుసుమును పుస్తకాలు చదవటానికై ఖర్చు చేసి నందుకు అమ్మ కొంచెం సంతోషించిం దేమో! అందుకే మిగిలిన డబ్బును వ్యాపారికి చెల్లించి అమ్మ నన్ను తిరిగి పాఠశాలకు పంపే ఏర్పాటు చేసింది.

ఈ పనిచేసినందుకు అమ్మ నన్ను మన్నించినప్పటికీ, తప్పుచేసి అమ్మను మోసం చేసినందుకు నేను ఎంతో పశ్చాత్తాపపడ్డాను. b

## ఆదర్శ గృహిణి



**జా**తిపిత మహాత్మాగాంధీ ధర్మపత్ని కస్తూరీబాకు గాంధీజీ స్వయంగా చదువు నేర్పారు. గాంధీజీ అడుగుజాడల్లో నడచిన కస్తూరీబా గొప్ప సంస్కారవతిగా, ఆదర్శగృహిణిగా పతి సేవాపరాయణురాలిగా రూపుదిద్దుకుంది.

మహాత్మాగాంధీ ఒకసారి శ్రీలంకలో జరిగే ఒక బహిరంగ సభలో పాల్గొనడానికి వెళ్ళారు. కస్తూరీబా కూడా గాంధీజీ వెంటవెళ్ళారు. బహిరంగ సభలో ఒక పెద్ద మనిషి కస్తూరీబాను గాంధీగారి తల్లి అని పరిచయం చేసాడు. "ఈమె నా తల్లికాదు. నా సహ ధర్మచారిణి. తల్లి అని పరిచయంచేసి ఆ పెద్ద మనిషి ఒక చిన్న తప్పు చేసాడు. ఒకరకంగా ఆ పెద్ద మనిషి చెప్పింది నిజమే. ఎందుకంటే నలభై సంవత్సరాలకు ముందే నా తల్లి స్వర్గస్థురాలైంది. అప్పటి నుండి కస్తూరిబా నాకు తల్లి అయింది. కేవలం తల్లే కాదు, స్నేహితురాలు, వంటమనిషి, సేవకురాలు అన్నీ తానే అయింది. ప్రజలు చేసే గౌరవాలన్నీ నాకు. చాకిరీ, శ్రమ ఈమెకు" అని గాంధీజీ ఆ సందర్భంలో చెప్పారు. కస్తూరీబా ఎప్పుడూ నగలు ధరించలేదు. తన నిరాడంబరతతో భర్తనే మెప్పించిన ఆదర్శ పత్ని కస్తూరీబా. b



# యువవాణి

- స్వామి పరిజ్ఞేయానంద

## సమస్యల పరిష్కారానికి సరికొత్త శీర్షిక

**స్వామి వివేకానంద ఆశలన్నీ యువతరంపైనే. ఈ తరం యువతీయువకుల మానసిక, విద్యావిషయిక, కుటుంబ సమస్యలకు 'యువవాణి' శీర్షికలో పరిష్కారాలు కనిపిస్తాయి. ఎంపికచేసిన ప్రశ్నల్ని, సమాధానాల్ని 'శ్రీరామకృష్ణప్రభ' 'యువవాణి' శీర్షికలో ప్రచురిస్తాం. మీ సమస్యలను ఉత్తరాలు, ఈ- మెయిల్ ద్వారా పంపవచ్చు.**

మీ సమస్యలు పంపాల్సిన చిరునామా:
**యువవాణి,**
**శ్రీరామకృష్ణప్రభ, రామకృష్ణమఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాద్-500 029**
E- mail : rkprabhayuvavani@gmail.com

హరిత, హైదరాబాద్

ప్రశ్న : **ఎవరైనా చిన్న మాట అంటే పడలేను. ఎంతో బాధపడతాను. దీనివల్ల ఎంతో సమయం వృధా అవుతుంది.**

జవాబు: 1. సున్నిత మనసు 2. నేను చేసింది, చెప్పిందే సరైందనే భావన 3. నాకే అంతా తెలుసు అనే మనస్తత్వం ఈ మూడింట్లో మొదటి లక్షణాన్ని వెంటనే కనిపెట్టవచ్చు. మిగతా రెండు లక్షణాలు మనోంతరాళాల్లో నిగూఢంగా ఉంటాయి. విశాల హృదయంతో ఓర్పుగా పరిశీలిస్తేగాని వీటిని గుర్తించలేం. వీటి నుండి బయట పడటానికి ప్రయత్నించటమే పరిష్కారంగానీ, కూర్చొని బాధపడుతూ సమయాన్ని వృధా చేయడం కాదు. విమర్శలు రెండు రకాలు:

సద్విమర్శ: ఒకరి తప్పులను నిష్పాక్షికంగా బయట పెట్టి వారిని నిజమైన ఉన్నతి వైపుగా ప్రోత్సహించేది. దీనితో మనసులో దాగి ఉన్న శక్తిని బయటకి తేవచ్చు.

దుర్విమర్శ: ఎదిగే వారిని చూసి ఓర్వలేక వారిలోని లోపాలను భూతద్దంలో వెతికి చేసే విమర్శ. అలాంటి వారు అభివృద్ధి చెందరు, మిగతా వాళ్ళను అభివృద్ధి చెందనివ్వరు.

మనోబలం లేనివారు విమర్శలను స్వీకరించలేరు. మనలోని తప్పుల్ని ఎవరైనా ఎత్తిచూపితే ఒప్పుకునే ధైర్యం మనకు ఉండాలి. అప్పుడే జీవితంలో ప్రగతి సాధ్యమవుతుంది. అందుకే మనం 'భగవంతుడా! నన్ను నా మిత్రుల నుండి కాపాడు. శత్రువుల బారి నుండి నన్ను నేను రక్షించుకోగలను' అని ప్రార్థించాలి. మనల్ని ఇంద్రుడు, చంద్రుడని ఆకాశానికెత్తే మిత్రుడి కన్నా మనలోని లోపాలను ఎత్తిచూపే శత్రువులే మిన్న. ఎందుకంటే అలాంటివారు మనలోపాలను పట్టుదలతో సరిచేసుకునేట్లు ప్రేరేపిస్తారు. కాబట్టి ఎదుటివారన్న మాటల్లో మంచిని తీసుకొని జీవితంలో ముందుకు సాగిపోవడానికి ప్రయత్నించాలి గానీ బాధ పడకూడదు. b

రామోజీనాయక్, సికింద్రాబాద్.

ప్రశ్న : **నేను ఒక సంస్థలో సూపర్‌వైజర్‌ని. కింది ఉద్యోగుల తప్పులు దిద్దుతూ సరైన దారిలో వెళ్ళేలా చేయటం నా వృత్తి ధర్మం. పక్కవారి లోపాలు చూసే వారికి మనశ్శాంతి ఉండదంటారు... నేనేం చేయాలి?**

జవాబు : మీరు 'సూపర్' - 'వైజర్' అంటే ఇతరులకన్నా 'చాలా' 'తెలివైన' వారు. అందుకనే కదా మీ యాజమాన్యం మీకా బాధ్యతను అప్పజెప్పింది! మీ కింది ఉద్యోగుల సందేహాల్ని తీరుస్తూ, వారి తప్పులను సరి దిద్దుతూ పనిలో నైపుణ్యాన్ని మెరుగుపరచం మీ విధి. మీ బాధ్యతను మీరు సక్రమంగా నిర్వహిస్తేనే సంతృప్తి, శాంతి కలుగుతుంది. అలా కాకుండా ఉద్యోగస్తుల తప్పుల్ని పట్టుకోవడంవల్ల మనశ్శాంతి ఉండదని అనుకుంటే మీ కర్తవ్యాన్ని విస్మరించేవారు అవుతారు. 'స్వధర్మే నిధనం శ్రేయః' - స్వధర్మాన్ని సవ్యంగా నిర్వహించడమే ఉత్తమమని శ్రీకృష్ణుడు అంటారు.

మనకు సంబంధంలేని విషయాల్లో తలదూరుస్తూ ఎదుటి వ్యక్తి లోపాల్ని పదే పదే తలస్తుంటే 'శాంతి' సుదూరమవుతుంది. ఒక వ్యక్తి కోపిష్టి అనుకోండి, ఆ వ్యక్తిలోని లోపాన్ని గురించి నిరంతరం చింతన చేయడం బదులు మనలో ఉన్న ఆ లోపాన్ని సరిదిద్దుకోడానికి ప్రయత్నించాలి. మన మాటకు విలువిచ్చే వారైతే వారిని మార్చే ప్రయత్నం చేయవచ్చు. అంతేగాని ఎదుటివారి లోపాల్ని మనసులో మననం చేయడం మంచిది కాదు. 'మనశ్శాంతి కావాలంటే ఇతరుల్లోని లోపాల్ని చూడవద్దు' అన్న శ్రీశారదాదేవి మాటల్లోని అంతరార్థం ఇదే. కానీ బాధ్యతల్ని విస్మరించమని కాదు. b

యువవాహిని

# తలరాతను మార్చే తలపులు - శ్రీరామ్

"వేయిమంది ధీరులను వేయి యుద్ధాలలో వేయి సార్లు ఓడించిన వారికన్నా మనసును ఒక్క క్షణమైనా నియంత్రించగలవారే పరాక్రమవంతులు." మనసును అదుపు చేసే మహత్కార్యానికి మనలను ప్రేరేపించే గౌతమ బుద్ధుడి బోధ ఇది. మనసుతో పోరాటాన్ని ఎవరైనా, ఎప్పటికైనా ఎదుర్కోక తప్పదు. అనివార్యమైన ఈ పోరాటాన్ని సులభం చేయాలంటే మనస్సు పనిచేసే తీరును మనం తెలుసుకోవాలి.

**మనఃశక్తి స్థాయిలు :** మనసు మూడు స్థాయిల్లో పనిచేస్తుంది.

1. సూక్ష్మ చైతన్య స్థాయి (**Subconscious state)**
2. చైతన్య స్థాయి (**Conscious state)**
3. మహా చైతన్య స్థాయి (**Superconscious state)**

మన నియంత్రణలో ఉన్న మనఃశక్తి చైతన్య స్థాయిలో ఉంటుంది. మన నియంత్రణలో లేని శక్తి సూక్ష్మచైతన్య స్థాయిలో ఉంటుంది. ఆలోచనలు, ప్రవృత్తులు సూక్ష్మచైతన్య మనసులో నిద్రాణమై, అణిగి ఉంటాయి. ఇవి నేరుగా మన చేత పని చేయించలేవు. అవే ఆలోచనలు చైతన్య స్థాయిలో సంకల్పాల రూపం ధరిస్తాయి. పని రూపంలో వ్యక్తమవడానికి సిద్ధంగా ఉంటాయి. ఈ రెండు స్థాయిలను వేరు వేరుగా వివరించడానికి సాధ్యం కాదు. ఒక దానిపై మరొకటి ఆధారపడి ఈ రెండు రూపాలు పనిచేస్తాయి. రెండింటిని కలిపి అర్థం చేసుకుంటే మనసు ఎలా పనిచేస్తుందో మనకు అర్థం అవుతుంది.

**సూక్ష్మం నుండి స్థూలానికి:** సూక్ష్మ చైతన్య స్థాయిలో అణిగి ఉన్న ఆలోచనలు నిరంతరం చైతన్యస్థాయిలోకి ప్రవేశించే ప్రయత్నం చేస్తుంటాయి. వీటిలో కొన్ని ఆలోచనలు కోరికలుగా మారి చైతన్య స్థాయిలోకి ప్రవేశిస్తాయి. కోరికలలో బలహీనమైనవి ఈ స్థాయిలో అణిగిపోయి, బలమైనవి సంకల్పాలుగా మారుతాయి. మనం వీటికి అనుగుణంగా పని చేస్తాం. ఈ విధంగా సూక్ష్మమైన ఆలోచన ఎన్నో స్థాయిలు దాటి మనం చేసే పనిగా స్థూలరూపం ధరిస్తుంది.

మనం చేసే అన్ని పనులకు మూలం మన సూక్ష్మచైతన్య స్థితిలో ఉందని దీని వల్ల మనకు తెలుస్తుంది. ఈ మనస్థితి ఎక్కడనుండి ఉత్పన్నమైంది? చైతన్యస్థాయిలో మనం చేసే ప్రతి పని ఆలోచనరూపాన్ని ధరించి తిరిగి సూక్ష్మచైతన్య స్థితిలో నిక్షిప్తమౌతుంది. ఆలోచనలకు స్థూలరూపం మనం చేసే పనులు. చేసిన పనులు తిరిగి సూక్ష్మరూపంలో ఆలోచనలుగా నిలువ అవుతాయి.

**బాధకు బాధ్యత:** మనం చేసే పనులకు బాధ్యత మనది కాదని తప్పించుకునే అవకాశం ఇక్కడ ఉంది. నిజమే! పనికి కారణం మనం కాదు!! కాని చేసేపనుల ఫలితాన్ని అనుభవించాల్సింది మనమే!! బాధ మనదీ, బాధ్యత మనసుదీ! దీనినే ఆధ్యాత్మిక పరిభాషలో బంధం అన్నారు. మనసు చేసే ఈ మాయ నుండి తప్పించుకునే ఆశేలేదా!! అంటే ఉందనే స్వామి వివేకానంద సమాధానం.



**సూక్ష్మంలో మోక్షం:** ఆలోచనా సంకల్పంగా, సంకల్పంతో చేసిన పని తిరిగి సంస్కారంగా మారే అంతులేని చక్రాన్ని ఆపటమే దీనికి తరుణోపాయం. ఆలోచన కోరికగా, తరువాత సంకల్పంగా మారకుండా జాగ్రత్తపడాలి. ఆలోచన సంకల్పంగా మారి చైతన్య స్థాయిలో పని మొదలైన తరువాత మనసును నిగ్రహించడం చాలా కష్టం. సూక్ష్మచైతన్య స్థాయిలో ఆలోచనలను నిగ్రహించడం అభ్యాసం చేస్తే చైతన్య స్థాయిలో మనం చేసేపనులు వాటంతట అవే నిగ్రహింపబడుతాయి.

ఇది సాధ్యమేనా!! అని ఆశ్చర్యపోనవసరం లేదు. ఆలోచనను ఆదిలోనే గమనించే అప్రమత్తతను మనం పెంచుకుంటే, వాటిని నిరోధించి నాశనం చేసే నైపుణ్యాన్ని తేలికగానే సాధించవచ్చు. **(మిగతా 35వ పేజీలో...)**

యువవాహిని

# విజయవంతంగా జీవించడం ఎలా ?

**– స్వామి జగదాత్మానంద**

## అంతఃశక్తిదే అసలు పాత్ర

అలౌకిక చర్యలా కనిపించేదే, జాగ్రత్తగా పరిశీలించినప్పుడు నిజమని అంగీకరించబడుతుంది. ఎల్లప్పుడూ సర్వత్రా జరిగే సంఘటనే ఇది. వెలుగుతున్న విద్యుద్దీపాన్నిచూసి ఒక పిల్లవాడు ఆశ్చర్యపోతాడు. పరిగెడుతున్న బస్సును చూసి అబ్బురపడతాడు. విద్యుచ్ఛక్తి వలన ఆ దీపం వెలుగుతోందని, ఆ బస్సు డీజిల్ వలన నడుస్తోందనీ పెద్దవాళ్ళకు తెలుసు. పెద్దవాళ్ళకు అవి అద్భుతాల్లాగా కనిపించవు. అంటే అద్భుతం అనేది చూసేవారి దృష్టిని బట్టి మారిపోతుందన్న మాట. అటువంటి అద్భుతాలు మన జీవితాలలో ఒక భాగం అయిపోయాయి.

శ్రీరామకృష్ణ పరమహంస "ఒక సారి జనం గొర్రెలాగ అరిచేవాడి చుట్టూ గుమికూడారు. వాడి నేర్పును చూసి ఆశ్చర్యపోయారు. ఇది చూసి సూక్ష్మబుద్ధిగల వ్యక్తి ఒక గొర్రెను తోలుకువచ్చి దానిచేత అరిపించాడు. అయినా జనం దాన్ని పట్టించుకోలేదు." అనేవారు. మరుగున ఉన్న వాస్తవంతో జనం సంతోషపడతారు. వాళ్ళు ఆ మరుగు తొలగించి దాని వెనుకనున్న వాస్తవికత తెలుసుకోవాలని ప్రయత్నించరు. ఒక మాంత్రికుడు చేసే మాయలను చూసి ప్రేక్షకుడు ఒళ్ళుమరచిపోతాడు. అయితే మీరు ఆ మాంత్రికుడితో స్నేహం చేస్తే, అతడు తెలివిగా చేస్తున్నది కనికట్టు తప్ప మరొకటి కాదని తెలుసుకుంటారు. ఆ పైన అది అద్భుతంగా కనపడకపోయినా, దానిలోని ఆకర్షణ లేకపోయినా, ఆ మాంత్రికుడి ప్రదర్శన చూడాలన్న కోరిక నశించదు. ఈ మార్పుకు కారణం మాంత్రికుడి ప్రదర్శనలోకాక ప్రేక్షకుడి వైఖరిలో ఉంది.

సముద్రంలో బాగా లోతు వరకూ వెళ్ళిన వారికి ముత్యాలు, రత్నాలు దొరుకుతాయి. జీవన్మరణాల మధ్య కాలంలో అద్భుతాలుగా కనిపించే సంఘటనలను లోతుగా పరిశీలించి చూస్తే వాటి వెనుకనున్న నిజం మనకు తెలిసి, అవి చాలా సాధారణమైన విషయాలుగా కనిపిస్తాయి. అది మనకు మన జీవితం యొక్క భూతభవిష్యత్తుల గురించి కొంత అవగాహనను కలిగిస్తుంది.

### కనిపించే సత్యాలు, కనపడని సత్యాలు

మనిషి అంటే ఎముకలు, రక్తం, మాంసం, కండరాల సంయోగం తప్ప మరేమీ కాదా? వీటన్నిటినీ నియంత్రిస్తూ వీటికన్నా వేరైన ప్రధాన తత్త్వం ఏదైనా మన శరీరంలో ఉందా? ఈ చైతన్య తత్త్వానికి మన శరీరం కేవలం ఒక ఆచ్ఛాదన మాత్రమేనా?

మనం ప్రాణమున్న మనిషికీ, ప్రాణంలేని శవానికీ మధ్యనున్న తేడాను సులభంగానే కనిపెట్టగలిగినా బ్రతకడం జీవించి ఉండడం గురించి మన కున్న అవగాహన లోతైనదీ కాదు, పరిపూర్ణమైనది కూడా కాదు. మనం 'జీవించి ఉంది' అని అనేది కేవలం ఒక భౌతిక పదార్థాల సంయోగం కాదు. జీవించి ఉన్న ఒక జీవి – అది మొక్క అయినా, జంతువైనా, మానవుడైనా, ఏదైనా సరే జీవించి ఉన్నంతకాలం గాలి, పోషకపదార్థాలను పౌష్టికత్వాన్ని పరిసరాలనుంచి గ్రహించి, ఏది అవసరమో దాన్ని తీసుకొని, అవసరం లేనిదాన్ని విసర్జిస్తూ జీవించగలుగుతుంది. అత్యంత క్లిష్టమైన శారీరక చర్యలు ఎంతో సమన్వయంగా, ప్రత్యేకమైన ప్రయోజనంతోనూ జరుగుతాయి. శ్వాసక్రియ, హృదయస్పందన, రక్తప్రసరణ, రస గ్రంథుల చర్యలు, జీర్ణక్రియ, పోషణ, విసర్జన, కొత్త కణజాలాల నిర్మాణం, శరీర ఉష్ణోగ్రతను నిలిపి ఉంచడం ఇవన్నీ ఎంతో క్రమబద్ధంగానూ, అవసరానికి తగినట్టుగానూ కొనసాగుతాయి. ఇంతకు ముందు జీవం ఉండి, ఇప్పుడు చనిపోయిన శరీరంలో కొరవడినది ఆత్మ ప్రకాశం. విద్యుత్తు ఆగినప్పుడు పంకా ఎలా ఆగిపోతుందో అలాంటిదే

ఇది. అటువంటప్పుడు అలా కొరవడిన తత్త్వం యొక్క స్వభావం ఏమిటి? మనలో ఎంతవరకూ ఆ శక్తి పనిచేస్తూ ఉంటుందో, అంతవరకూ శరీరంలోని కోట్లాది కణాలు తమ విధులను చక్కగానూ, సమర్థవంతంగానూ నిర్వర్తిస్తూ ఉంటాయి. ఆ తత్త్వం లేకుండా పోయినప్పుడు, శరీరవిధులు ఆగిపోయి, శరీరం కుళ్ళిపోవడం మొదలవుతుంది. మనిషి జీవించి ఉన్నప్పుడు ఈ విధులన్నీ నిరంతరాయంగా, పరిపూర్ణంగా సాగిపోతాయి. జీవించి ఉన్న మనిషికి నిరంతరం కొనసాగుతున్న ఈ క్రియల గురించి తెలుస్తుంది. పూర్వం జరిగిన సంఘటనల్ని గుర్తు చేసుకోగలడు, తాను కోరినదాన్ని ఎంచుకోగలడు, భవిష్యత్తు కూడా కొంతవరకు స్పష్టాస్పష్టంగా తెలుసుకోగలుగుతాడు. అతడికి తన మరణం గురించి ముందుగానే తెలుస్తుంది. ఆ విధంగా మరణం అనేది చైతన్యవంతమైన తత్త్వం, భౌతికమైన శరీరంలోను మనస్సులోను చైతన్యం కలిగించకపోవడమేనని చెప్పుకోవచ్చు. ఎప్పుడైతే శరీరమూ, మనస్సూ ఈ తత్త్వం వలన ప్రతిస్పందిస్తాయో అప్పుడు మనం ఆ జీవి సజీవంగా ఉన్నట్లు గుర్తిస్తాము. చైతన్యవంతమైన తత్త్వం భౌతికశరీరం కంటే వేరైనదని స్పష్టంగా తెలుస్తున్నా శాస్త్రజ్ఞులు ఇంతవరకూ వేరైన ఆ సజీవమైన తత్త్వం ఏమిటో తెలుసుకోలేకపోయారు.

ఎముకలు, రక్తం, మాంసం, కండరాలతో ఏర్పడిన ఈ భౌతికమైన స్థూల శరీరం కన్నా వేరైన ఒక సూక్ష్మ శరీరం ఉన్నదని మన ప్రాచీన ఋషులు తెలుసుకున్నారు. దీనినే 'లింగశరీరం' అని కూడా అంటారు. భౌతిక శరీరం నశించిన తర్వాత కూడా ఈ సూక్ష్మశరీరం చనిపోదు. ఈ సూక్ష్మశరీరానికి విద్యుచ్ఛక్తివలే అతి సంక్లిష్టమైన క్రియలను అద్భుతమైన సమగ్రతతో నియంత్రించి, నడపగలిగే సామర్థ్యం ఉంది. ప్రాచీన కాలంలోనే యోగులు ఈ రకమైన సూక్ష్మశరీరం ఒకటి ఉందని ధ్యానం ద్వారా గ్రహించారు. అదంతా వారి ఊహాగానం కాదు. అది వ్యక్తిగతమైన అనుభవం ద్వారా, సత్యసాక్షాత్కారం ద్వారా ఏర్పడిన దృఢమైన నమ్మకం. మామూలు మనుష్యులు కూడా సూక్ష్మశరీరం యొక్క ఉనికిని గ్రహించ గలుగుతారు. పూర్వకాలంలోనే కాక ఆధునిక కాలంలోనూ, అన్ని దేశాలలోనూ, దేహాతీతమైన జీవితం, అతీతమైన అనుభూతులు, మరణించిన వ్యక్తి ఆత్మ బ్రతికి ఉన్న వ్యక్తి శరీరంలోకి ప్రవేశించడం, ఒక మనిషి శరీరాన్ని వేరొక ఆత్మ ఆవహించడం మొదలైన విషయాలు ఎన్నో చెప్పబడ్డాయి. అయితే ఇందులో కొన్ని మోస పూరితమైన, ఊహాజనితమైన, మూఢనమ్మకాలయినా కొన్ని యదార్థమైన సంఘటనలు కూడా ఉన్నాయన్న నిజాన్ని త్రోసిపుచ్చలేము. మనం ఈ యదార్థమైన సంఘటనలను పరిశీలించినప్పుడు ఈ స్థూల భౌతిక శరీరం కన్నా వేరైన తత్త్వం ఒకటి ఉందని తెలుసుకోవచ్చు. మానవజీవితం కేవలం ఈ శరీరానికే పరిమితమైనది కాదు. అందులో అనుభవగ్రాహ్యంకాని ఆధ్యాత్మిక స్థితి కూడా ఉన్నది. b

అనువాదం – **అమిరపు నటరాజన్**

**పుట్టుకకు ముందు నేనేమిటో నాకు తెలియదు. చనిపోయిన తర్వాత ఏమవుతుందో కూడా నాకు తెలియదు. కానీ మధ్యలో నేను నాకంతా తెలుసు అని అంటే అది ఎంత అర్థరహితంగా ఉంటుంది?**

**- కనకదాస**

**మనం చేసుకున్న పనుల ఫలితంగా ఈ ప్రపంచంలోకి వచ్చాము. మనం ఇప్పుడు చేసిన పనుల మొత్తాన్ని తీసుకుని మనం ఎలా నిష్క్రమిస్తామో అదే విధంగా పూర్వం చేసుకున్న పనుల మొత్తంతోపాటు మనం ఈ ప్రపంచంలోకి వస్తాము. మనల్ని (ఈ ప్రపంచం నుంచి) ఏది బయటకు తీసుకుపోతుందో అదే మనల్ని ఈ ప్రపంచంలోకి తీసుకువస్తుంది. మనల్ని ప్రపంచంలోకి తెచ్చేది ఏది? మనం పూర్వం చేసిన పనులు. మనల్ని బయటకు తీసుకుపోయేది ఏది? ఇక్కడ మనం చేసిన పనులే. ఆ విధంగా మనం వస్తూ, పోతూ (జన్మపరంపరలలో) ఉంటాము.**



# రామకృష్ణ మఠం, ఇచ్ఛాపూర్

(బేలూరు మఠ శాఖాకేంద్రం)

పి.ఒ. మాయల్ – బందిపూర్, హుగ్లీ –712617, పశ్చిమ బెంగాల్



## విరాళాలకై విన్నపం



**శ**శి మహరాజ్‌ను ఉద్దేశించి "మఠానికి శశి మూలస్తంభం లాంటివాడు. అతడు లేని మఠజీవితం ఊహించడమే అసాధ్యం" అన్నారు స్వామి వివేకానంద. శశి మహరాజ్ (స్వామి రామకృష్ణానంద) శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులు. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న రామకృష్ణమఠం, రామకృష్ణ మిషన్‌లను స్థాపించడంలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. శ్రీరామకృష్ణులు అనారోగ్యంతో ఉన్నపుడు శశి మహరాజ్ వారికి భక్తిశ్రద్ధలతో సపర్యలు చేశారు. శ్రీరామకృష్ణులు మహాసమాధి చెందాక కూడా వారి స్మృతి చిహ్నాల్ని శశి మహరాజ్ అంతే శ్రద్ధాభక్తులతో పూజించారు. అసమానమైన భక్తి ప్రపత్తులతో శశి మహరాజ్ ఆచరించిన పూజా విధానాన్నే నేడు రామకృష్ణ మఠ కేంద్రాలన్నిటిలో అనుసరిస్తున్నారు.

కలకత్తాకు 100 కి.మీ. దూరాన ఉన్న "ఇచ్ఛాపూర్" (హుగ్లీ జిల్లా) గ్రామంలో శశి మహరాజ్ జన్మించారు. స్థానిక భక్తులు కొన్ని సంవత్సరాల క్రితం శశిమహరాజ్ జన్మస్థలంలో ఒక రేకుల షెడ్‌లో తాత్కాలిక ప్రార్థనాలయాన్ని ప్రారంభించారు. అసంఖ్యాకమైన భక్తుల కోరికపై ఇక్కడ 21–08–1994న రామకృష్ణమఠ శాఖను ప్రారంభించారు.

12 లక్షల రూపాయల ఖర్చుతో శశిమహరాజ్ బంధువులకి పునరావాసం కల్పిస్తున్నాం. పేదలకు ఉచిత శిక్షణ తరగతులు నిర్వహిస్తున్నాం. ఉచిత సంచార వైద్యశాలను ప్రారంభించి, నిపుణులచే ఉచిత వైద్యసేవలు అందిస్తున్నాం. భక్తుల సౌకర్యార్థం శ్రీరామకృష్ణ విశ్వజనీన దేవాలయ నిర్మాణం చేపట్టాం. ఈ దేవాలయ నిర్మాణానికి సుమారు రూ. 93 లక్షలు వ్యయం కాగలదని అంచనా.

| | | |
|---|---|---|
| ఆలయం ఎత్తు | – | 65' |
| గర్భగుడి | – | 20' × 24' |
| ఆలయం చుట్టుకొలత | – | 80' × 56' |

300 మంది భక్తులు కూర్చునేందుకు హాలు.

భగవాన్ శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష సన్న్యాస శిష్యులు స్వామి తురీయానందజీ మహరాజ్ జన్మదినం–2003, జనవరి 17వ తేదీన రామకృష్ణ మఠం, రామకృష్ణ



నిర్మాణంలోవున్న ఆలయం

మిషన్‌ల ఉపాధ్యక్షులు పూజ్య శ్రీస్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ వారిచే ఈ దేవాలయానికి శంకుస్థాపన జరిగింది.

సార్వజనీన దేవాలయ నిర్మాణానికి ఉదారులైన భక్తులు, శ్రేయోభిలాషులు, స్నేహితుల నుండి విరాళాల్ని కోరుతున్నాం.

విరాళాలను **Ramakrishna Math, Ichapur** పేరున చెక్కు లేదా డి.డి. తీసి **Ramakrishna Math, P.O. Mayal - Bandipur, Hooghly - 712617**కు పంపవలసిందిగా మనవి. అన్ని విరాళాలనూ కృతజ్ఞతతో స్వీకరిస్తాం.

మీరిచ్చే విరాళాలన్నింటికీ ఆదాయపుపన్ను చట్టంలోని సెక్షన్ 80G (vide memo No.DIT(E)/576/8E/40 69-70dt.08-08-2001) కింద పన్ను మినహాయింపు ఉంటుంది.

శ్రీరామకృష్ణులు, దివ్యజనని శ్రీ శారదామాత, స్వామి వివేకానంద, శశి మహరాజ్‌లు మిమ్మల్ని అనుగ్రహించాలని హృదయపూర్వకంగా ప్రార్థిస్తున్నాం.

భగవత్సేవలో

**స్వామి నిర్లిప్తానంద**

అధ్యక్షులు

# శాంతినిచ్చే శాక్యముని

- శ్రీరామ్

నిందసి యజ్ఞవిధేరహహ శృతిజాతం
సదయహృదయ దర్శిత పశుఘాతం
కేశవ ధృత బుద్ధశరీర...

దయతో నిండిన హృదయంతో జంతుబలులను నిరసించావు. కర్మకాండను ఖండించావు. నీవు ఆదిదేవుని అవతారానివే !

భారతీయులు సాక్షాత్తు భగవంతుడే అంటూ కీర్తించి, పూజించిన బుద్ధుడి బోధనలు దశదిశలా వ్యాపించాయి. దేశాన్నేలే రాజులనుండి దోపిడీ దొంగల వరకు ఎంతో మందిని ప్రభావితం చేసాయి. వీరిలో కొంతమంది కథలు ఎంతో ఆసక్తిని కలిగిస్తాయి.

## క్రూరుడిపై కారుణ్యం

విధి వంచితుడైన అహింసకుడనే బ్రాహ్మణ బాలుడే అంగుళీమాలుడు. దారి దోపిడీ దొంగగా మారి ఎంతో మంది బాట సారులను నిర్దాక్షిణ్యంగా నిర్జించే వాడు. కారుణ్యంతో క్రూరత్వాన్ని జయించి అతణ్ణి భిక్షువుగా మార్చాడు బుద్ధుడు.

**నాటిపాపం.. నేడు పశ్చాత్తాపం :** ఆరామానికి చేరిన అంగుళీ మాలుడు పాత జీవితం గుర్తుకు వచ్చినప్పుడల్లా బాధపడేవాడు. ఎవరెంత అనునయించినా అతడి బాధ ఉపశమించేది కాదు. ఈ సంగతి బుద్ధుడికి తెలిసింది. అంగుళమాలుడి బాధను పోగొట్టి, ఆదర్శ భిక్షువుగా తీర్చిదిద్దాలని సంకల్పించాడు శాక్యముని.

అంగుళీమాలుడు వెంటరాగా బుద్ధుడు వేరొక గ్రామానికి ప్రయాణమయ్యాడు. వారొక అడవి మార్గం గుండా వెళుతూ వృద్ధురాలైన తల్లి ఒడిలో పురిటి నొప్పులతో బాధపడుతున్న స్త్రీని చూశారు. వృద్ధురాలు వారి రాకను గమనించింది. తన కూతురిని కష్టం నుండి కాపాడమని వేడుకుంది. సుఖ ప్రసవం అయ్యేట్టు ఆశీర్వదించమని అర్థించింది.

**ప్రమాణం.. పాప విమోచనం..** అంగుళీ మాలుణ్ణి అనుగ్రహించే సమయం ఆసన్నమైందని బుద్ధుడు భావించాడు. "ఏం చేస్తున్నానో తెలియక ఎంతో మందిని నిర్దాక్షిణ్యంగా చంపాను. ఒళ్ళు తెలియని అజ్ఞానంలో ఎన్నో పాపాలకు పాల్పడ్డాను-అని ప్రమాణం చేసి ఆమెను ఆశీర్వదించు. ప్రమాణం సత్యమే అయితే ఆవిడ బాధ ఉపశమిస్తుంది" అని అంగుళీమాలుణ్ణి అనునయించాడు. "ప్రమాణం ఎలా చేసేది? నేను ఒక మహా పాపిని" అంటూ అంగుళీమాలుడు ఆక్రోశించాడు. మరేమీ ఫరవాలేదని చెబుతూ బుద్ధుడు అతణ్ణి ప్రమాణం చేయమని ప్రోత్సహించాడు.

పరితప్త హృదయంతో, అనుమానిస్తూనే బుద్ధుడు

చెప్పినట్టుగా అంగులీమాలుడు ఆమెను ఆశీర్వదించాడు. అక్కడి నుండి కదిలి కొద్ది దూరమైనా వెళ్ళకముందే వారికి పసివాడి ఏడుపు వినిపించింది. ఆశ్చర్యపోవటం అంగులీమాలుడి వంతయింది. పశ్చాత్తాపం తనను పునీతుణ్ణి చేసిందా!! అని అతడు ఆలోచిస్తున్నంతలోనే వృద్ధస్త్రీ అప్పుడే పుట్టిన పసి పిల్లవాడితో వారి వద్దకు వచ్చింది. ప్రేమతో ఆశీర్వదించమని అర్థించింది.

అంగులీమాలుణ్ణి ఆదరంతో చూస్తూ బుద్ధుడు మందహాసం చేశాడు. పిల్లవాడి తలపై చేతిని ఉంచి ఆశీర్వదించాడు. పాపిని సైతం పవిత్రుణ్ణి చేసే బుద్ధుడి కరుణ అంగులీమాలుడి హృదయాన్ని కరిగించింది. బుద్ధుడి పాదాలపై పడి ప్రేమా శ్రువులతో అంగులీమాలుడు అభిషే కించాడు. "ఇకనైనా నీ పాపాలకు ప్రాయశ్చిత్తం జరిగిందని నమ్ముతావా!" అంటూ బుద్ధుడు అంగులీమాలుణ్ణి పైకెత్తి ఆలింగనం చేసుకున్నాడు. ప్రయాణం కొనసాగించి వారు పక్కనే ఉన్న పల్లెటూరిని చేరుకున్నారు.

**అహింసతో అమరత్వం:** విశ్రాంతి తీసుకున్న తరువాత అంగులీమాలుడు భిక్షకై ఊళ్ళోకి వెళ్ళాడు. ప్రజలు అతణ్ణి గుర్తించి చేతికి దొరికిన ఆయుధంతో బాగా గాయపరిచి వదిలిపెట్టారు. చావు బతుకుల మధ్య అంగులీమాలుడు కరుణామయుడైన బుద్ధుని కడసారి దర్శించు కోవాలను కున్నాడు. అతి కష్టంతో నేలపై పాకుతూ బుద్ధుడి వద్దకు బయలుదేరాడు.

తనను సమీపిస్తున్న అంగులీమాలుణ్ణి చూస్తూనే బుద్ధుడు అతని వద్దకు పరుగెత్తాడు. అతని తలను తన ఒడిలో ఉంచుకుని, శిష్యుల సహాయంతో అతడికి పరిచర్యలు చేశాడు. "ఎలా ఉంది నాయనా?" అంటూ ఎంతో ఆప్యాయంగా అతడిని ప్రశ్నించాడు. "జీవితంలో ముందెన్నడూ లేనంత శాంతిని అనుభవిస్తున్నాను భగవాన్" అని సమాధాన మిస్తున్న అంగులీమాలుణ్ణి కరుణతో చూస్తూ బుద్ధుడు "వారు గాయపరుస్తున్నప్పుడు నీకేమైనా కోపం వచ్చిందా?" అని ప్రశ్నించాడు. " గతంలో ఎంతో మందిని అమానుషంగా చంపుతున్నప్పుడు నేనేం చేస్తున్నానో నాకు తెలియదు. నన్ను బాధిస్తున్నపుడు వారేం చేస్తున్నారో వారికి తెలియదు." అని అంగులీమాలుడు తన ఆఖరి శ్వాసను విడిచాడు.

తప్పుని తెలిసాక ఒప్పుకునే వినమ్రత ఉంటే చేసిన తప్పులు మనల్ని అంతగా బాధించవు సరికదా మనల్ని తీర్చిదిద్దుతాయి. ఇతరుల తప్పులను సైతం క్షమించే హృదయ వైశాల్యాన్ని ప్రసాదిస్తాయి.

### అందం పెంచిన అహంకారం

క్షేమాదేవి బింబిసార భూపాలుని పట్టపురాణి. ఆమెకు తాను సౌందర్యవతినన్న విపరీతమైన అహంకారం. ఆమె అహంకారాన్ని రూపుమాపాలని బింబిసారుడు నిశ్చయించు కున్నాడు. జీవిత పరమార్థాన్ని క్షేమా దేవికి తెలియ జేసేందు కు బుద్ధుడితో ఆమె సమావేశం అయ్యేట్లు ఉపాయం పన్నాడు.

**ముల్లును మరొక ముల్లుతోనే:** వజ్రాన్ని మరొక వజ్రంతోనే కోయాలనుకున్నాడు బుద్ధుడు. తన మహిమతో పదహారేళ్ళ ప్రాయంలో ఉన్న అత్యంత సౌందర్యవతులను క్షేమాదేవి యెదుట సృష్టించాడు. సర్వాలంకార భూషితలై, అందంలో అప్సరసలను తలదన్నే వారి మధ్య క్షేమాదేవి వెల వెల పోయింది. రాజ హంసల ముందు కాకిలా కళ తప్పిన క్షమాదేవి వారి సౌందర్యంలో మైమరచింది. చూస్తుండగానే వారు యవ్వనవతులయ్యారు. వారి సౌందర్యం ఇనుమడించింది. క్షమాదేవి కళ్ళముందే క్రమంగా వారు ప్రౌఢలయ్యారు వ్యార్ధక్యాన్ని పొందారు. కాంతులీనుతున్న వారి శరీరాలు కళా విహీనవైపోయాయి. ఆమె చూస్తుండగానే శుష్కించిన వారి శరీరాలను మృత్యువు కబళించింది. గద్దలు, రాబందులు వారి శరీరాలను భక్షించసాగాయి.

**శాశ్వతమైన సౌందర్యం:** యవ్వనం, ముసలితనం, మరణాలను ప్రత్యక్షంగా చూసిన ఆమెకు జీవిత అశాశ్వతత్వం అర్థమయింది. అందగత్తెననే అహంకారం అణగారింది. మనసులో బుద్ధుడి పట్ల భక్తి వినమ్రతలు చోటు చేసుకున్నాయి. ఆమె బుద్ధుని శిష్యురాలై, భిక్షువులనందరినీ భక్తితో ఆదరించింది.

శరీరంపై శ్రద్ధ వహించేవారు సౌందర్యం ఎంత అశాశ్వతమైందో అర్థం చేసుకోవాలి. మృత్యువును ఎల్లప్పుడూ మరిచి పోకుండా ఉంటే మనల్ని బాధించే ఎన్నో మానసిక రుగ్మతలు దూరమౌతాయి.

ఎంతో మంది మనసుల్ని సమూలంగా మార్చిన శాక్యముని సందేశం మన జీవితాల్లో శాంతి నింపాలని ప్రార్థిద్దాం. b

**(ఈ నెల 2న బుద్ధ జయంతి...)**

( ...29 వ పేజీ తరువాయి)

సాధారణంగా ఆలోచనలు స్థూలరూపం ధరించి మనతో పనిచేయించే వరకు మనం గమనించం. పనుల ఫలితాలను అనుభవించాల్సినప్పుడు మాత్రం ఇలా ఎందుకు చేశామా! అలా చేయకుండా ఉండాల్సింది అంటూ బాధపడతాం. ఆలోచనల గమనించే అప్రమత్తతను అభ్యాసం చేస్తే-నీటి అడుగు భాగం నుండి బుడగలు బయలుదేరినట్లు మనసు అట్టడుగు పొరలనుండి ఆలోచనలు పుట్టడాన్ని గమనించవచ్చు. తలపులకు అందకుండా తప్పించుకొని సూక్ష్మస్థితిలోనే ఆలోచనలను అంతమొందించవచ్చు.

**కార్యం నుండి కారణానికి:** మనం చేసే పనులు ఆలోచనలకు స్థూల రూపాలు. కాబట్టి అంతర్దృష్టిని అభ్యసించదలచుకున్న వారు మొదట తాము చేసే పనులను గమనించడం నేర్చుకోవాలి. ఈ ఆత్మ విమర్శ మనో నిగ్రహానికి మొదటి మెట్టు. స్వయం విమర్శ చేసుకునే వాడే సర్వోత్తముడని ఒక పర్షియన్ సూక్తి చెబుతుంది. చేసే పనుల్ని విశ్లేషించుకుని మనసులో మంచి, చెడు భాగాలను గుర్తించాలి. మన లక్ష్యాలకు మనసులో ఏ సంస్కారాలు వ్యతిరేకంగా పనిచేస్తున్నాయో తెలుసుకోవాలి.

**కారణంతో రణం:** పతంజలి మహర్షి వివరించిన "వ్యతిరేక భావనము" అనే పద్ధతి ఇకనుండి మనకు ఉపయోగపడుతుంది. మనసులోని చెడు సంస్కారాలను తొలగించుకోవడానికి వాటికి వ్యతిరేకమైన ఆలోచనలు చేయటమే దీని సారాంశం. చెడు మనసుకు వ్యతిరేకంగా చేసే ఆలోచనలు స్థూలరూపంలో సైతం ఉండవచ్చు. పుస్తకాలు చదవటం, మంచి వ్యక్తులతో స్నేహంచేయటం, మంచి విషయాలను గురించి మాట్లాడటం లాంటి అన్ని పనులను మనం చేయవచ్చు. ఈ పనులన్ని సూక్ష్మస్థాయిలో చెడు సంస్కారాలకు వ్యతిరేకమయిన ఆలోచనలుగా మారుతాయి. మనం తరచుగా ఈ పనులను చేస్తే మంచి ఆలోచనలు మనసులో బలం పుంజుకుంటాయి. వ్యతిరేక ఆలోచనల తీవ్రత పెరిగేకొద్దీ మనసులోని చెడుఆలోచనలు క్షీణించి క్రమంగా నాశనమౌతాయి.

ఈ పద్ధతిలో మనం విజయం సాధించాలంటే కాయా, వాచా, మనసా- శరీరంతో, వాక్కుతో, మనసుతో చెడు సంస్కారాలను ఎదుర్కోవాలి. దుష్ట సంస్కారాలకు వ్యతిరేకంగా మనసులో మంచిని పెంచే పనులు శరీరంతో చేయాలి, అటువంటి మాటలే మాట్లాడాలి, తగినట్టుగా ఆలోచించాలి. అప్పుడే ఈ 'వ్యతిరేక భావనము' క్రమంగా ఫలితాలనిస్తుంది.

Watch your thoughts
They become actions
Actions create your character
Character determines your destiny

ఇంతటి శక్తిగల తలపులపట్ల తగుజాగ్రత్త వహిద్దామా! b

ఒక రోజు పూజానంతరం నటరాజస్వామి పాదకంకణ సవ్వడి వినబడలేదు. దానితో కృంగిపోయిన రాజు

పరమేశ్వరా! నేను చేసిన తప్పు ఏమిటో తెలియలేదు. మీ పాదకంకణ సవ్వడి ఈ రోజు వినబడలేదు, మీ దయ లేని నేను ఇక జీవించి ప్రయోజనమేమి ?



అప్పుడు వెంటనే నటరాజ స్వామి పాద కంకణ సవ్వడి వినబడింది.

ప్రభూ ! ఇన్ని రోజులకంటే ఈ రోజు ఎక్కువగా కంకణ సవ్వడి వినబడుతూందే! ఈ రోజు ఆలస్యంగా సవ్వడి రావడానికి కారణమేమిటో !




మధురైలో పేదరికంతో బాధపడుతున్న బాణ భద్రుడనే శివభక్తునికి కలలో పరమేశ్వరుడు కనిపించాడు.

బాణా ! చేరమాను మహారాజుకి నా పీఠం మీద ఒక లేఖ ఉంచాను. అది అతనికి అందించి నీ దారిద్ర్యం పోగొట్టుకో!



ఆహా! ఏమి నా భాగ్యము! నా దారిద్ర్యం తొలగించాలని మీరు సంకల్పించారు! మీరు చెప్పినట్లే చేస్తాను!

మహారాజా ! మధురై నుండి బాణభద్రుడనే శివభక్తుడు మీ దర్శనార్థం వచ్చాడు.












భగవంతుణ్ణి ప్రేమిస్తూ అహంకారాన్ని విడిచి, ఆత్మార్పణం చేసుకోవాలి. భగవత్ ప్రేమలో పరవశించే భక్తులను భవబంధాలు బాధించవు.

-శ్రీ రామకృష్ణ పరమహంస



# గ్రంథ పరిచయం

## కులార్ణవ తంత్రము

**అనువాద కర్త: లింగం వీరభద్రకవి**
**పేజీలు: 407; వెల: రూ.200/-**
**ప్రతులకు: టాగూరు పబ్లిషింగ్ హౌస్, షాప్ నెం.20, వైశ్యా హాస్టల్ బిల్డింగ్ కాచిగూడ చౌరాస్తా, హైదరాబాద్- 27**

తెలుగులో తంత్ర గ్రంథాలు లేకపోవడం వలన తెలుగు వారికి తంత్ర విధానాలు, వాటిలోని మర్మాలు, వాటి ప్రభావం, వాటి ఫలితాలు వంటివేవీ వివరంగా తెలియవు. అందువలన కొందరికి వామాచారం పట్ల నిరసన భావం ఉంది. రెండువేలకి




పైగా శ్లోకాలున్న "కులార్ణవ తంత్రము" అనే గ్రంథాన్ని శ్రీలింగం వీరభద్రకవి తెలుగులోకి అనువదించారు. 17 ప్రకరణా లున్న సంపూర్ణ కౌల విధాన గ్రంథం ఇది. వామాచార సిద్ధాంతాల యథార్థ జ్ఞానం, తత్త్వం, ప్రయోగ విధానాలు స్పష్టంగా తెలియజేసారు. దీనిలో అపోహలు ఉన్నవారు ఈ గ్రంథం చదివి, తమ అపోహలను తొలగించుకోవచ్చు. తెలుగు వివరణలతో కూడిన ఈ గ్రంథంలో ఉపాసనాపరులు, కామ్యప్రయోగ సాధకులు, తాంత్రిక విషయాలపై ఆసక్తి ఉన్నవారు తెలుసుకోవలసిన విషయాలు, విధానాలు ఎన్నో ఉన్నాయి. ` **- శ్రీమతి ఎన్. శేషు**

## శ్రీ లక్ష్మీ ఆరాధన

**వ్యాఖ్యాత, సంపాదకులు, సంకలనకర్త :**
**డా॥ ఆదిపూడి వేంకట శివసాయిరామ్ పేజీలు: 258, వెల: రూ. 54/-, ప్రతులకు : మోహన్ పబ్లికేషన్స్, అజంతా హోటల్ ఎదురుగా,కోట గుమ్మం, రాజమండ్రి - 1**

'శ్రీలక్ష్మీ ఆరాధన' గ్రంథంలో అష్టలక్ష్మీ దేవాలయాల గురించి, కొల్హాపూర్ మహాలక్ష్మీ విశిష్టత గురించి, శ్రీపద్మావతీ




బ్రహ్మోత్సవాలు, ఆంధ్రాలోని లక్ష్మీ క్షేత్రాలు... ఇలా ఎన్నో విషయా లున్నాయి. దీనిలో ధనలక్ష్మి నిత్యపూజతో ప్రారంభమై శ్రీసూక్తమ్, శ్రీమహాలక్ష్మీ సూక్తమ్, మహాలక్ష్మీ కవచం, అష్టోత్తరాలు, మూడురకాల లక్ష్మీ సహస్ర నామ స్తోత్రాలున్నాయి. చివరిలో అష్టలక్ష్ముల యంత్రాలు - అష్టోత్తర శత నామావళులు ఉన్నాయి. ప్రతి ఒక్కరి దగ్గరా ఉండవలసిన గ్రంథం ఇది. ` **- శ్రీమతి ఎన్. శేషు**

## అంతర్ముఖుడవై ముక్తిని పొందుము

**ఆంగ్లమూలం: స్వామి సచ్చిదానంద**
**ఆంధ్రానువాదము : డా॥ పన్నాల రాధాకృష్ణ శర్మ**
**పేజీలు : 178 ; వెల : రూ॥ 45/-**
**పోస్టు : ఆనందాశ్రమము, కాంజ్ఞగాడ్, కేరళ - 671 531**

ఆధ్యాత్మిక మార్గంలో ఎన్నో ఆటంకాలు ఎదురవుతాయి. దానికి నిరంతరమైన అభ్యాసం అవసరం. ఈ మార్గంలో విశ్వాసం, ప్రేమ, సేవ, సహనం, స్వార్థం, అహంకారం, క్రోధం వంటి మిత్రులూ ఉంటారు, శత్రువులూ ఉంటారు. "అంతర్ముఖుడవై ముక్తిని పొందుము" అనే ఈ విలక్షణమైన గ్రంథంలో వీటన్నిటి గురించీ అసాధరణ శైలిలో చర్చించారు స్వామి సచ్చిదానంద. గ్రంథం మొదటి నుండి చివరిదాకా సంభాషణ రూపంలో సాగింది. స్వామి ఈ పుస్తకంలో చెప్పినవన్నీ దైనందిన జీవితంలో వాస్తవంగా ప్రతి ఒక్కరూ అనుభవించే సమస్యలే. దీనిలో చర్చించబడిన విషయాలన్నీ ప్రాచ్యులు - పాశ్చాత్యుల్నీ కూడా ప్రభావితం చేస్తాయి. భక్తి మార్గంలో పయనించే వారికి ఈ గ్రంథం అమితంగా ఉపయోగిపడుతుంది. b **- నాగ ప్రసాద్**

# వార్తా వాహిని

## నూతన ప్రాంగణానికి కడప రామకృష్ణ మిషన్

**కడప** ట్రంకురోడ్డులో ఉన్న **రామకృష్ణమిషన్** స్థానిక పుట్లంపల్లిలోని నూతన ప్రాంగణంలోకి అడుగుపెట్టింది. ఇందులో ప్రార్థనామందిరం, సాధునివాసం భవనాలను నిర్మించింది. ఈ భవనాల ప్రారంభోత్సవాన్ని పురస్కరించుకొని మార్చి 14, 15, 16 తేదీల్లో కడప రామకృష్ణ మిషన్ ప్రత్యేక కార్యక్రమాలను నిర్వహించింది. సాధునివాస భవనాన్ని రామకృష్ణ మఠం, మిషన్ల ఉపాధ్యక్షులు శ్రీమత్ స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ మార్చి 14న ప్రారంభించారు. ఈ కార్యక్రమాల్లో భక్తులనుద్దేశించి స్వామీజీలు అభిభాషించారు. పలువురు ఔత్సాహిక కళాకారులచే సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి. ఈ వేడుకలో వివిధ ప్రాంతాల నుంచి 80 మంది స్వామీజీలు,1000 మందికి పైగా భక్తులు పాల్గొన్నారు.


సాధునివాస భవనాన్ని ప్రారంభిస్తున్న స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్

## విస్తృత ప్రచారానికి వివేకవాహిని...

మూర్తిత్రయ భావవ్యాప్తి లక్ష్యంగా **విజయవాడ రామకృష్ణమిషన్** ఆధ్వర్యంలో జనవరి 12(జాతీయ యువజన దినోత్సవం)న ప్రారంభమైన 'వివేకవాహిని' వాహనం విస్తృత ప్రచారానికి సిద్ధమైంది. ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ, శారదామాత, స్వామి వివేకానంద భావాలను, వ్యక్తిత్వవికాస అంశాలను డాక్యుమెంటరీ చిత్రాలు, సాహిత్యం, ఆడియో క్యాసెట్ల రూపంలో ప్రచారం చేయనుంది. ఈ పథకాన్ని సమితులు, స్వచ్ఛంద సంస్థలు, భక్తులు సద్వినియోగం చేసుకోవచ్చు. 'వివేకవాహిని' ని ఆహ్వానించ దలచుకున్న వారు చక్కటి ప్రణాళికను సిద్ధం చేసుకొని అమలు పరచాలి. పగటి పూట విద్యార్థులకు, రాత్రి సమయాల్లో పరిసర నివాస ప్రాంతాల్లో ప్రచారానికి 'వివేకవాహిని' అందుబాటులో ఉంటుంది. 'వివేకవాహిని'ని ఆహ్వానించదలచినవారు పూర్తి వివరాలకోసం **రామకృష్ణమిషన్, సీతానగరం, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా- 522501,**(ఫోన్ 08645-272248) ను సంప్రదించవచ్చు. – నివేదిక: **బ్రహ్మచారి హరీష్**


విస్తృత ప్రచారానికి వివేకవాహిని...

## అల్సూరులో నూతన వైద్యశాల భవన ప్రారంభోత్సవం

**అల్సూరు**(బెంగుళూరు) **రామకృష్ణమఠం** 'వివేకానంద ఉచిత వైద్యశాల' భవనాన్ని నిర్మించింది. ఈ నూతన భవనాన్ని రామకృష్ణ మఠం, మిషన్ల ఉపాధ్యక్షులు శ్రీమత్ స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ ఏప్రిల్ 1న ప్రారంభించారు. నూతన భవనంలో ఆ రోజు ఉదయం ప్రత్యేక పూజ, హోమం జరిగాయి. అధికమవుతున్న అనారోగ్య బాధితుల సౌకర్యార్థం వైద్యశాల విస్తరణ అనివార్యమై కొత్త భవనం నిర్మించబడింది. ఆరువేలకు పైగా రోగులకు సేవలందించేందుకు ఈ వైద్యశాల ఉపయోగపడుతుంది. ప్రారంభోత్సవ కార్యక్రమానికి 45 మంది స్వామీజీలు, 900 మంది భక్తులు విచ్చేసారు. ప్రారంభోత్సవం రోజున రెండు వందల మంది నిరుపేదలకు అన్నదానం చేశారు.


నూతన వైద్యశాల భవనాన్ని ప్రారంభిస్తున్న స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్

నివేదిక – **బ్రహ్మచారి అశోక చైతన్య**

రామకృష్ణ-వివేకానంద సాహిత్యం సామాన్య ప్రజానీకానికి అందుబాటులో ఉండాలన్న సత్సంకల్పంతో, హైదరాబాదు రామకృష్ణ మఠం వారు ఈ క్రింది పుస్తకాలను రాయితీ ధరలకు అందజేస్తున్నారు. మఠం ప్రచురిస్తున్న ఇతర ధార్మిక గ్రంథాలు కూడా తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో తగ్గింపు ధరలకు అందించబడుతున్నాయి. ఆస్తిక మహాశయులు ఈ అవకాశాన్ని వినియోగించు కోగలరని మనవి.

| క్ర.సం. | పుస్తకం పేరు | తగ్గింపు ధర |
|---|---|---|
| 01. | శ్రీరామకృష్ణ పరమహంస(2 సంపుటాలు) | 60 |
| 02. | శ్రీశారదాదేవి చరితామృతము, వచనామృతము (సెట్టు) | 60 |
| 03. | స్వామి వివేకానంద (2 సంపుటాలు) | 60 |
| 04. | శ్రీరామకృష్ణ జీవితచరిత్ర | 20 |
| 05. | శ్రీరామకృష్ణ బోధామృతము | 25 |
| 06. | శ్రీవివేకానంద జీవితచరిత్ర | 20 |
| 07. | శ్రీవివేకానంద జీవితము మహత్కార్యము | 5 |
| 08. | రాజ యోగము | 10 |
| 09. | భక్తి యోగము | 10 |
| 10. | కర్మ యోగము | 10 |
| 11. | జ్ఞానయోగము | 25 |
| 12. | కొలంబో అల్మోరా ఉపన్యాసాలు | 30 |
| 13. | స్వామి శిష్యసంవాదాలు | 30 |
| 14. | శ్రీవివేకానంద లేఖావళి | 25 |
| 15. | సోదర సోదరీమణులారా! | 30 |
| 16. | ధ్యానం దాని పద్ధతులు | 10 |
| 17. | వ్యక్తిత్వ వికాసం | 10 |
| 18. | నా భారతం అమర భారతం | 15 |
| 19. | దైవంతో సహజీవనం (శ్రీరామకృష్ణుల గృహస్థ శిష్యుల జీవిత చిత్రణలు) | 50 |

**తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో రాయితీ కల్పించబడిన పుస్తకాలు.**

| క్ర.సం. | పుస్తకం పేరు | తగ్గింపు ధర |
|---|---|---|
| 01 | ఉపనిషత్కథలు | 12 |
| 02. | వేదాంత పంచదశి | 40 |
| 03. | దేవీ మాహాత్మ్యము | 15 |
| 04. | శ్రీమద్భగవద్గీత (టీకా తాత్పర్యము) | 30 |
| 05. | వివేక చూడామణి | 20 |
| 06. | శ్రీవేంకటేశ సుప్రభాతమ్, గోవిందనామములు. | 03 |
| 07. | సస్వర వేదమంత్రాలు(విస్తృత సంపుటం) | 60 |
| 08. | సస్వర వేదమంత్రాలు (టీకాతాత్పర్యం) | 20 |
| 09. | అధ్యాత్మ రామాయణం | 20 |
| 10. | శ్రీలలితా సహస్రనామ స్తోత్రం | 10 |
| 11. | శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రం (మూలం) | 05 |
| 12. | గీతాదర్శనం | 45 |
| 13. | మానవ ప్రతిభ (సచిత్ర) | 30 |
| 14. | బాలల రామాయణం, బాలల మహాభారతం, 5 భాగాల సెట్టు (తెలుగు మరియు ఇంగ్లీషులో లభ్యం) | 100 |
| 15. | బాలల స్వామి వివేకానంద, బాల భక్తులు,బాలల శంకరుడు, శ్రీకృష్ణావతారము,2 భాగాల సెట్టు (తెలుగు మరియు ఇంగ్లీషులో లభ్యం) | 100 |

**టి.టి.డి. రాయితీ పుస్తకాలు స్టాకు ఉన్నంతవరకే లభ్యం**

**గమనిక :** పోస్టల్ మరియు ప్యాకింగ్ చార్జీల నిమిత్తం ఒక పుస్తకానికి రూ.25/- ప్రతి అదనపు పుస్తకానికి రూ.5/- పంపించవలసి ఉంటుంది. మీరు ఆర్డరు చేసిన పుస్తకం రెండు సంపుటాలలో ఉన్న రెండు పుస్తకములుగా పరిగణించబడును. పుస్తకములు రిజిష్టర్డ్ బుక్ పోస్ట్ ద్వారా మాత్రమే పంపబడును. b

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/- అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/- అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/- అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| పేరు | చిరునామా | రూ. |
|---|---|---|
| | ఇప్పటి వరకు వసూలైన మొత్తం ... | 9,70,042 |
| రాజ పోషకులు : శ్రీమతి అంజనీదేవి, | చాటపర్రు - 534 004, ప॥ గో॥జిల్లా | 5,165 |
| పోషకులు : శ్రీమతి కె. ఈశ్వరమ్మ, | రాజంపేట - 516 115, కడప జిల్లా | 1,000 |
| పోషకులు : శ్రీ దంతులూరి రమేష్, | పాలకొల్లు - 534 260. | 1,116 |
| పోషకులు : శ్రీ బద్రీ నారాయణ, | మంగళగిరి, గుంటూరు జిల్లా -522 503. | 1,000 |
| పోషకులు : డాక్టర్ వి. అనురాధ, | రాజంపేట - 516 115, కడప జిల్లా | 1,000 |
| | మొత్తం . . . | 9,79,323 |

## శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి మీ పేరు మీద పది మందీ మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥ 600/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ళ పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు) ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ'లో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| 1265 | శ్రీ నాగభూషణం సి. గనపవరపు, యు.ఎస్.ఎ | జెడ్.పి.ఎచ్.ఎస్, నాచారం, ఖమ్మం జిల్లా - 507 306. |
| 1266 | " " | శ్రీ సీతారామచంద్ర దేవాలయం, నాచారం- 507 306. |
| 1267 | శ్రీ ఎమ్. ప్రకాష్, బళ్లారి - 583 103, కర్నాటక | సిటీ సెంట్రల్ లైబ్రరీ, బళ్లారి,- 583 101, కర్నాటక |
| 1268 | శ్రీమతి రేబాల దమయంతి, సికింద్రాబాద్ - 011 | లైబ్రేరియన్, యలమంచిలి-531 055,విశాఖపట్నం జిల్లా |
| 1269 | శ్రీ దేవిరెడ్డి నందగోపాల రెడ్డి, సికింద్రాబాద్ - 011 | లైబ్రేరియన్, అనకాపల్లి- 531 001, విశాఖపట్నం జిల్లా |
| 1270 | శ్రీ బి. రామచంద్రరావు, కూకట్‌పల్లి, హైదరాబాద్-072 | శ్రీఅల్లూరి సీతారామరాజు ఆధ్యాత్మిక గ్రంథాలయం,కూకట్‌పల్లి. |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 8 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 85 | $ 15 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 240 | $ 45 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 380 | $ 75 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1200 | $ 350 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, **Domalguda, Hyderabad- 500 029.**

ఆధ్యాత్మిక-అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 64 సంచిక: 6 జూన్ 2007

"ప్రతి జీవిలోనూ దివ్యత్వం గర్భితంగా ఉంది. అంతర్గతంగా ఉన్న ఆ దివ్యత్వాన్ని వ్యక్తం చేయడమే జీవిత పరమావధి." - స్వామి వివేకానంద

## ప్రార్థన

ఓం మేధాదేవీ జుషమాణా న ఆగాద్విశ్వాచీ భద్రా సుమనస్య మానా।
త్వయా జుష్టా నుదమానా దురుక్తాన్ బృహద్వదేమ విదథే సువీరాః ॥



సర్వవ్యాపీ, మంగళదాయినీ, శుభ ప్రదాయినీ, సంతోషదాయినీ, బుద్ధికి అధిదేవత అయిన సరస్వతీ దేవి ప్రసన్నమవుగాక! ఓ భగవతీ! నీ కృపతో మా బుద్ధి వికసించి పరమార్థ వైభవాన్ని గ్రహించ గలిగాము.

(మేధాసూక్తం నుంచి)

## ఈ సంచికలో...







SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com




# సువిద్యతోనే సార్థకత

విద్యార్థులు ఆటలు, పాటలు, విహారయాత్రలకు స్వస్తి చెప్పి చదువుల తల్లి చెంతకు చేరే సమయం ఆసన్నమైంది. పాఠశాల చదువులు ముగించి కళాశాలకు పోయే విద్యార్థులు కొందరైతే, కళాశాల చదువులు పూర్తిచేసి విశ్వవిద్యాలయాలకు వెళ్ళేవారు మరికొందరు. అలాగే విశ్వవిద్యాలయాలకు వీడ్కోలు చెప్పి విదేశాలకెగసే విద్యార్థులు మరెందరో! గదులు మారి తరగతులు పెరిగినా, గతులు వేరై ఘనకార్యాలు సాధించినా... మేధావుల్ని సృష్టించిన నేటి మన విద్యావిధానం మహాత్ముల్ని సృజించ టంలో విఫలమవుతుంది. వైజ్ఞానికంగా ఎంత ఎదిగినా వివేకపథంలో వెనుకంజ వేస్తుంది. నేటి సమాజంలో సత్యధర్మాలు, సేవా త్యాగాల్లాంటి... మానవతా విలువలు గగనకుసుమా లయ్యాయి. సంఖ్య (మార్కు)లకే ప్రాధాన్యతనిచ్చే విద్యతోపాటు నడవడికలో నాణ్యతను పెంచే విద్య చాలా అవసరం. అక్షర జ్ఞానంతో పాటు ఆధ్యాత్మిక విజ్ఞానం తోడైనప్పుడే సమా జంలో మానవతా విలువలు భాసిల్లుతాయి. చదువుతో పాటు సంస్కారాన్ని పెంచే విద్యే నిజమైన విద్య. బుద్ధిని వృద్ధిచేసే విద్యే నేటి సమాజంలోని అన్ని రుగ్మతలకు సరైన ఔషధం.



### విద్యకు భూషణం వినయం...

విద్యార్థి గురువు వద్ద ఎలా అణకువతో ప్రవర్తించాలో శ్రీకృష్ణభగవానుడు భగవద్గీత(4.34) లో బోధించాడు.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥

శిష్యుడు గురువు సన్నిధిలో ఉంటూ భక్తిశ్రద్ధలతో గురువుకు సపర్యలు చేస్తూ తన సందేహ నివృత్తి చేసుకోవాలి. శిష్యుని వినయ విధేయతలకు గురువు ప్రీతి చెంది శిష్యునికి జ్ఞానాన్ని ప్రబోధిస్తాడు.

పెద్దలయందు, గురువులయందు గౌరవమర్యాదలు లేనివాడు ఎన్నటికీ జీవితంలో ఉన్నతి పొందలేడు. అహంకారి అయిన దుర్యోధనునితో 'నువ్వు గురువులకు, పెద్దలకు వినయంతో సేవ చేయడం నేర్చుకో దాని వల్ల నీలో సత్ప్రవర్తన వృద్ధి చెందుతుంది' అని శ్రీకృష్ణుడు అంటాడు. విద్యార్థి గ్రంథాల ద్వారా నేర్చుకొనే దాని కన్నా గురువు సాంగత్యంలో నేర్చుకొనే విద్య ఎక్కువ ప్రయోజనాన్నిస్తుంది.

### ఆచరించేవాడే ఆచార్యుడు...

ఆచార్య (ఆసీనోతి) అంటే సంగ్రహించే వాడు. శాస్త్ర సారాన్ని సంగ్రహించి, విద్యార్థులకు బోధించేవాడు ఆచార్యుడు అని అర్థం. తాను సంగ్రహించిన వేదసారాన్ని శిష్యులకు ఆచరణలో చూపించిన వాడే 'ఆచార్యుడు'అని మరో అర్థం. ఆచరణాత్మక బోధ నలతో ఆదర్శజీవితాన్ని గడిపి, శిష్యుల్లో మానవతా విలువల్ని పెంపొందించే వాడే నిజమైన ఆచార్యుడు.

### విలువల్ని పెంచే విద్య...

నేడు మనకు కావలసిన విద్య ఎలా ఉండాలో స్వామి వివేకానంద మాటల్లో

We want that education by which character is formed, strength of mind is increased, the intellect is expanded...

శీలనిర్మాణం, మనోబలం, విశాలబుద్ధి ఈ మూడు సుగుణాల్ని పెంపొందించే విద్య నేడు మనకు అవసరం. స్వామి వివేకానంద నిర్వచించిన విద్యలో ఉన్న మూడు లక్షణాలను విద్యార్థి అలవరచుకోవాలంటే తైత్తిరీయో పనిషత్తులో గురువు శిష్యులకిచ్చిన సూచనల్ని ఆచరణాత్మకం చెయ్యాలి.

### సత్యం వద। ధర్మం చర। స్వాధ్యాయాన్మా ప్రమదః...

**మాతృ దేవోభవ। పితృ దేవోభవ। ఆచార్య దేవోభవ। అతిథి దేవోభవ।...** (తైత్తిరీయోపనిషత్తు).

**వ్యక్తిత్వ నిర్మాణం :** సత్యం వద... ధర్మం చర... ఈ రెండూ వ్యక్తిత్వ వికాసానికి మూల సూత్రాలు. విద్య మనిషి మేధస్సు పెంచేదిగా ఉండటంతో పాటూ మానవత్వాన్ని వికసింపజేసేదిగా ఉండాలి. సత్యభాషణం, ధర్మాచరణం, త్యాగగుణం ఏవ్యక్తిలో ఉంటాయో వారే మహాత్ములు. అలాంటి మహాత్ములున్న దేశం శాంతిసౌభాగ్యాలతో విరాజిల్లుతుంది. ఈనాటికీ శిబిచక్రవర్తిని, హరిశ్చంద్రుణ్ణి, శ్రీరామచంద్రుణ్ణి ఎందుకు స్మరిస్తున్నాం? శిబి చక్రవర్తిలో తొణికిసలాడే త్యాగగుణం, హరిశ్చంద్రునిలోని సంపూర్ణంగావున్న సత్యనిష్ఠ, శ్రీరామునిలో దర్శనమిచ్చే ధర్మనిరతి నాటికీ,నేటికీ,ఏనాటికీ చరిత్రపుటల్లో చిరస్థానం కల్పించుకొనేలాచేసాయి. కాబట్టి ఒకవ్యక్తి చిరకాలం పూజ్యనీయుడిగా పరిగణించబడాలంటే ఆ వ్యక్తి మేధాశక్తి, ఉన్నత పదవులే కారణం కాదనీ, వారి మహోన్నత ఆదర్శప్రాయమైన జీవితమే అని మనకు తెలుస్తుంది. సంపూర్ణ వ్యక్తిత్వ నిర్మాణానికి సత్యం, ధర్మం ఆచరణలో చూపాలి. అదే విద్య యొక్క అసలు ప్రయోజనం.

**మనోబలం:** విద్య కేవలం ధనార్జన కోసమో, భోగాలను అనుభవించటం కోసమో కాదు. మానవ జన్మ పరమావధి పరమాత్మ దర్శనం కోసమని మన శాస్త్రాలు చెబుతున్నాయి. ఆ దిశగా జీవితాన్ని కొనసాగించాలి. జీవిత లక్ష్యాన్ని మరచిపోకుండా ఉండటానికే 'స్వాధ్యాయాత్ మా ప్రమదః... శాస్త్రాధ్యయనాన్ని ఎన్నడూ విడువవద్దు అని శాస్త్రాలు బోధిస్తున్నాయి. జీవిత గమ్యాన్ని నిర్దేశించే శాస్త్రవచనాలను ఉల్లంఘించిన నాడు జీవిత లక్ష్యాన్ని మరచిపోయి సమస్యల ఊబిలో చిక్కుకుపోయే ప్రమాదం ఉంది. శాస్త్రవచనాలు మనోశక్తిని పెంచే మహామంత్రాలు. కష్టనష్టాలను ఎదుర్కొనే మనోబలాన్ని, మనోధైర్యాన్ని ఇవ్వని విద్య వల్ల ఈనాడు విద్యార్థులు మానసిక ఒత్తిళ్ళకు లోనవుతున్నారు. పరీక్షల్లో తప్పే విద్యార్థులు ఆత్మన్యూనతతో ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. ఏ చిన్న సమస్య ఎదురైనా భరించే మనో ధైర్యం లేక మాదక ద్రవ్యాలకు బానిసలవుతున్నారు. నిరాశా నిస్పృహల బారినుండి బయటపడలేక మానసిక రుగ్మతలకు గురి అవుతున్నారు.

...anything that makes you weak physically,
intellectually, and spiritually reject as poison...
- *Swami Vivekananda*

శారీరకంగా, మానసికంగా, ఆధ్యాత్మికంగా బలహీనుల్ని చేసేది ఏదైనా విషతుల్యంగా విసర్జించమని స్వామి వివేకానంద మనకు గుర్తు చేస్తున్నారు. బలహీనతల నుంచి బయటపడి జీవనయాత్రను సాగించేందుకు కావలసిన మనోబలాన్నిచ్చే విద్య అత్యంత అవసరం. నిజమైన విద్యావంతులు కష్టాలకు తలవంచరు. ఎలాంటి సమస్యలు ఎదురైనా 'అభీః అభీః' అంటూ ముందుకు పయనించగల్గే మనోబలాన్ని విద్య మనకు ప్రసాదించాలి.

**విశాలబుద్ధి:** ఎవరిలోనైతే స్వార్థచింతన, సంకుచిత బుద్ధి ఉంటుందో అలాంటి వారు పండితులైనా పామరులతో సమానం. విద్య వల్ల విశాలదృక్పథం అలవడటం పోయి, 'తన' అనే సంకుచిత సంకెళ్ళతో మనస్సును బంధిస్తే, ఆ సమాజం అక్షరాస్యులతో నిండినా అశాంతి నుండి మాత్రం విశ్రాంతి పొందలేదు.

కంటిపాపలా కాపాడుతూ పెంచిన తల్లినీ, పిల్లల అభ్యుదయానికై ఆరాటపడే తండ్రినీ, విద్యనేర్పిన గురువుల్నీ, శ్రేయస్సుకోరే పెద్దల్నీ ఎలా ప్రేమించి పూజించాలో తెలిపే సంస్కృతి మన విద్యా విధానంలో ఉండేది. మరి నేడు గురువులనే అగౌరపరిచే విద్యార్థిలోకాన్ని మనం చూస్తున్నాం. కన్నవారిపై కఠినత్వాన్ని ప్రదర్శించే పుత్రుల వైఖరి అత్యంత శోచనీయం. అలాంటి వారిని యోగి వేమన ఎవరితో పోల్చారో చూడండి.

తల్లిదండ్రి మీద దయలేని పుత్రుండు
పుట్టనేమి? వాడు గిట్టనేమి?
పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా?...

పుట్టలోని చెదల్లా కాకుండా కిరీటంలో మణిలా ప్రకాశించాలంటే 'మాతృ దేవోభవ, పితృ దేవోభవ, ఆచార్య దేవోభవ, అతిథి దేవోభవ...' అనే ఉపనిషత్తుల మంత్రాలు మనకు శిరోధార్యం కావాలి. సార్థకతను చేకూర్చే ఈ సువిద్యనే స్వామి వివేకానంద ఆశించారు. విలువల వెలుగులు పంచే పరిపూర్ణ విద్యతోనే సమాజంలో శాంతిసౌభాగ్యాలు విలసిల్లుతాయి.

# గోరుముద్ద

- స్వామి సుప్రియానంద

## వివేకంతోనే వికాసం

నేడు 'విద్య' మానవ జీవితంలో ఒక పెద్ద అంశంగా గుర్తించబడింది. మన దేశంలో ఇప్పుడు అక్షరాస్యత పెరిగింది. తల్లితండ్రులు మగపిల్లలతో సమంగా ఆడపిల్లలను చదివిస్తున్నారు. ఆడపిల్లలు చదువులో బాగా రాణిస్తున్నారు. కానీ పెద్దలకు తృప్తి కలగడం లేదు. పిల్లల నుండి ఇదివరకెన్నడూ లేనంత ఆశిస్తున్నారు. వారు పోటీ ప్రపంచంలో నెగ్గుకురావాలంటే చదువుకు మార్కులే కొలమానంగా పరిగణిస్తున్నారు. తల్లి తన మూడవ క్లాస్ చదువుతున్న కూతురికి 'కంప్యూటర్' పరీక్షలో నూటికి 98 మార్కులు వచ్చినా అసంతృప్తిని కనబరచడం నేడు మనం చూస్తున్నాం. దీనితో పిల్లల మీద చాలా 'ఒత్తిడి' పెరిగింది. ఈ కారణంగా వారి 'మానసిక' వికాసానికి అవకాశం దొరకటం లేదు.

ఈమధ్య ఒకరు, ఒక ఐదేళ్ళ అమ్మాయిని 'నీచదువెలా ఉంది?' అని ప్రశ్నించారు. దానికి ఆ అమ్మాయి 'చదువెలా ఉంటుంది. అది బాగానే ఉంటుంది. నీవు ఎలా ఉన్నావు? అని అడగండి' అని సమాధాన మిచ్చింది. ఇది మనం ఆలోచించాల్సిన విషయం. చదువు మనిషిని ప్రభావితం చేయాలి. పూర్వం 'చదువు - సంస్కారం' అనేవాళ్ళు. ఇప్పుడు చదువు గురించే మాట్లాడుతున్నారు. సంస్కారం సంగతి మరచిపోయాం! దీనికి కారణం మనలోని సృజనాత్మకతను నిర్లక్ష్యం చేయడమే!

ప్రతి మనిషిలోను 'సృజనాత్మకత' ఉంది. ఒక సహజ పరిణామం సృజనాత్మకత. ఒక మొగ్గ పువ్వుగా వికసించ డంలో మనకు కనిపిస్తుంది 'సృజనాత్మకత'. 'మొగ్గ'ను తుంచి 'పువ్వు'ను ఆశించడమే మనం చేస్తున్న తప్పు. అదే మన నిర్లక్ష్యం. ఒక 'మొగ్గ' పువ్వుగా వికసించడానికి సానుకూల వాతావరణం ఎంత అవసరమో, మనలోని సృజనాత్మకతను బహిర్గతం చేయడానికి సరైన వాతా వరణం కల్పించడం అంతే అవసరం.



ఏది సరైన వాతా వరణం అన్నది ఆలోచించ డానికి తీరికలేని కొందరు తల్లితండ్రులు సరైన వాతా వరణం ఉండేది 'ఎయిర్ కండిషన్డ్ స్కూల్' అను కొని వారి పిల్లలను అక్కడ చేరుస్తున్నారు. అలా చేసిన ఒక తండ్రి ఆత్మకథ ఇక్కడ మనం తెలుసుకోవడం చాలా అవసరం. ఆ తండ్రి ఎంతో హతాశుడై తన కథను ఇలా చెప్పాడు. "మా అబ్బాయిని ఎంతో వ్యయప్రయాసలకోర్చి ఒక పెద్ద స్కూల్లో చేర్పించాను. అక్కడమావాడికి 'సృజనాత్మక విద్య' అంటే 'ఎబిసిడి లతో' పాటు 'ఎమ్‌సెట్' పరీక్షకు తర్ఫీదిస్తా మన్నారు. కాని వాడు స్కూలు కెళ్ళిన నాలుగు రోజులకు 'డాడీ! ఇంట్లో ఒకటే ఉక్క పోస్తుంది. మా స్కూల్లో లాగ మన ఇంట్లో ఎ.సి. పెట్టించు" అని అడిగాడు. పిల్లల్లో సృజనాత్మకత మేల్కోవా లంటే ముందుగా తల్లితండ్రులు వారి ఆలోచనలను 'గుడ్డెద్దు చేలో పడ్డట్టుగా' కాక 'నిర్మాణాత్మకం' అంటే 'సృజనాత్మకం'గా రూపొందించు కోవాలి. సంస్కార విహీనమైన చదువు పిల్లలపాలిట 'సృజనాత్మకం' కాకపోగా 'మారణాత్మకం' అవుతుంది. పిల్లలలోని సహజత్వం నశించి జీవితం 'యాంత్రికం' అవుతుంది.

ఒక్కసారి మన బాధ్యతను గుర్తుచేసే స్వామి వివేకానంద మాటలు ఆలకిద్దాం! "తల్లితండ్రులు పిల్లలకు అనవసరమైన కట్టుబాట్లు పెట్టడంవల్ల వారి మానసిక వికాసానికి అవకాశం దొరకటం లేదు.... ప్రతివారిలోను అనంతమైన పూర్వజన్మ సంస్కారాలున్నాయి. వీటిని తృప్తిపరచటానికి అవకాశాలు కావాలి. మన దేశంలో అవకాశాలు ఇవ్వరు. ఆచారాలను మార్చాలంటే తల్లితండ్రులకు నూతనమైన శిక్షణ ఇవ్వాలి. ఈ పరిస్థితి ఎంతో శోచనీయం!... ఇతరుల జీవితాలను, హృదయాలను ఆజ్ఞాపించటానికి ముందు, మొదట తనను తాను అర్పించుకొని తీరాలి."

# ఔన్నత్యాన్నిచ్చే అణకువ

- స్వామి శశికాంతానంద

అణకువ గురించి శ్రీరామకృష్ణ పరమహంస అన్న మాటలివి: 'కొండపైన వర్షపునీరు ఎంతకురిసినా అక్కడ నిలువక అది కొండలోయలోనికి చేరుతుంది. అలాగే గర్వంతో మిడిసిపడే హృదయంలో భగవత్కృప నిలువదు." అణకువ గల హృదయంలోనే అది నిలుస్తుంది. త్యాగరాజస్వామి భగవంతుని 'గర్వమానస దూరుడ'ని స్తుతించారు.

ఒక గృహిణి నిద్రకళ్ళతో కొళాయి తెరచి బకెట్ దాని క్రింద పెట్టి లోపలికి వెళ్ళి హడావిడిగా తిరిగొచ్చింది. తీరా చూస్తే నీరు ధారగా పడుతున్నా బకెట్‌లో ఒక్కనీటి చుక్కైనా లేదు! కారణమేమిటంటారు? బకెట్ బోర్లించి ఉండడమే! ఆ బోర్లించిన బకెట్ లాంటిది గర్వంతో నిండిన మనస్సు.



భక్తితో మనం అర్చించే గుడిలోని విగ్రహం ఒకప్పటి బండరాయే కదా! నేర్పుతో శిల్పి దానిని అందమైన విగ్రహంగా మలుస్తాడు. ఎన్ని సమ్మెట దెబ్బలు తిన్నా బద్దలు కాక, సుత్తి దెబ్బలెన్నిపడినా విరగక, ఎన్నో ఉలి దెబ్బలకు గురయినా విసుగు చెందక, ఆ రాయి శిల్పి చేతిలో తనను తాను సంపూర్ణంగా అర్పించు కొని చివరివరకూ అణకువతో ఉండడం వల్లనే కదా నేడు పూజార్హమైంది. శిల్పి చేతిలో శిలలాంటివాడే గురువు చెంతనున్న శిష్యుడు. శిష్యుడంటే శాసనార్హుడు. గురుశాసనాలను అణకువతో శిరసావహించి, తనలోని అవగుణాలను అధిగమించి ఔన్నత్యాన్ని పొందుతాడు శిష్యుడు. శిష్యునిలోని అణకువ, జిజ్ఞాస, సేవాతత్పరతలకు ప్రసన్నుడై కృపతో గురువు శిష్యునికి జ్ఞానోపదేశం చేస్తాడు. గీతాచార్యుడు చెప్పిందీ ఇదే:

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినః తత్త్వ దర్శినః ॥**

కంసాలి చేతిలో సుత్తి దెబ్బలెన్నిటికో గురైన బంగారం అమూల్య రత్నాలతో పొదగబడిన కిరీటంగా మారింది. అణకువతో ఉండడం వల్లనేగదా అందరూ శిరస్సులు వంచి నమస్కరించే రారాజు శిరస్సునే అలంకరించిందా కిరీటం!

అణకువ అంటే బానిస బ్రతుకు కాదు. క్రమ శిక్షణతో, శాంతి సహనాలతో, పట్టుదలతో, కార్యాసాధనకై పెద్దల నాశ్రయించి ఆత్మోన్నతికి ఆత్మార్పణ చేసుకోవడం. దీనికి ఆంజనేయస్వామి జీవితమే చక్కని నిదర్శనం. బుద్ధి కుశలతకూ, ధైర్య సాహసాలకూ, స్వామి భక్తికీ తనకు తానే సాటి అయినప్పటికీ ఆయన ఎల్లప్పుడూ రాముని దాసుడే. బానిస మాత్రం కాదు. కొండ అద్దమందు కొంచెమై యుండదా! "ఎన్నో పండ్లతో నిండుగా ఉన్నచెట్టు ఎప్పుడూ వంగిఉంటుంది. అందుకే ఆత్మోన్నతి నొందదలచినవారు అణకువ కలిగి యుండాలి" అని శ్రీరామకృష్ణుల వారి ఉపదేశం.

జీవితంలో రాణించాలంటే విద్యాధికునికైనా, విద్యావిహీనునికైనా అణకువ చాలా అవసరం. అదిలేని వానికి జీవితం దుర్భరమౌతుంది. అడుగడుగునా మొట్టికాయలు తినాల్సొస్తుంది. అణకువ ఉన్న వానికి అన్నీ సాధ్యమే – ఇటు సిరిసంపదలు – అటు సుఖశాంతులు వానికి సొంతమౌతాయి. ధర్మనిరతి అలవడుతుంది. అణుకువ గలవాడే సుగుణాల రాశి. మహాభారత కారుని మాటల్లో –

**విద్యా దదాతి వినయం వినయాద్యాతి పాత్రతాం ।**
**పాత్ర త్యాత్ ధనమాప్నోతి ధనాద్ధర్మం తతṣుఖం ॥**

పాత్రలేనివాడు పాత్రుడు కాదంటారు. అణకువ గలవాడే నిగర్వి. అతడే పాత్రుడు – యోగ్యుడు. ఆదర్శ ప్రాయుడు, ఆరాధ్యనీయుడూ!!!

**(ఆకాశవాణి మద్రాసు కేంద్రం సౌజన్యంతో)**

భారతీయ మహిళా మణిదీపాలు : గార్గి

ఆంగ్లమూలం : డాక్టర్ ఎస్. రమణి
అనువక్త : రెంటాల జయదేవ

# వేదవిద్యలో విదుషీమణి

వేదకాలంలోని గొప్ప పండితురాళ్ళలో ఒకరు - గార్గి. జ్ఞానంలో ఆమె ఎందరో మహర్షులను అధిగమించి, ముందుకు సాగిపోయింది. ఆమె వాచక్నుమహర్షి కుమార్తె. సాక్షాత్తూ ఋషి పుంగవుడైన యాజ్ఞవల్క్యుడినే ఆమె సవాలు చేసిన వైనం బృహదారణ్యక ఉపనిషత్తులో మనకు కనిపిస్తుంది.

ఒకసారి జనక మహారాజు శాశ్వత సత్య స్వరూపానికి సంబంధించి అభిప్రాయాలు ఇచ్చి పుచ్చుకోవడం కోసం పెద్ద పండితుల సభ ఏర్పాటు చేశాడు. యాజ్ఞవల్క్యుడు, ఇంకా అనేక వందల సంఖ్యలో ఇతర ఋషిపుంగవులు దేశం నలు మూలల నుండీ ఆ సభకు హాజరయ్యారు. గార్గి సైతం జనక మహారాజు ఆస్థానానికి విచ్చేసింది.

ఆ సమయంలో జనక మహారాజు మనసులో ఓ ఆలోచన మెదిలింది. అక్కడకు వచ్చిన వారందరిలోకీ ఎవరు అత్యంత విద్యా సంపన్నులో తెలుసుకోవాలనే కోరిక ఉదయించింది. ఆయన ఓ వేయి ఆవులను అక్కడకు తెప్పించి, ప్రతి ఆవుకూ రెండు కొమ్ములకూ బంగారం నిండిన సంచీలు వేలాడదీశాడు. "ఓ మహర్షులారా! మీలో అతి గొప్ప వేద వేదాంగ పారంగతుడు ఎవరో వారు ఈ గోవులను తమ ఇంటికి తోలుకుపోవచ్చు" అని జనక మహారాజు అందరి ఎదుటా ప్రకటించాడు.

అయితే, అక్కడకు వచ్చిన మహర్షులెవరూ తామే అందరిలోకీ గొప్ప వేద పండితులమని ప్రకటించుకోవడానికి ధైర్యం చేయలేకపోయారు. అందుకని వారంతా పెదవి విప్పకుండా కూర్చుండిపోయారు. అయితే, యాజ్ఞవల్క్యుడు మాత్రం ఆ ఆవులను తమ ఆశ్రమానికి తోలుకుపోవాల్సిందిగా తన శిష్యుడికి ఆజ్ఞ జారీ చేశాడు. కానీ, ఇతర ఋషులు ఆ చర్యను సమ్మతించ లేదు. యాజ్ఞవల్క్యుడి జ్ఞానాన్ని పరీక్షించడం కోసం వారు ఆయనను రకరకాల ప్రశ్నలు అడగడం ప్రారంభించారు. అయితే, యాజ్ఞవల్క్యుడు వారందరి ప్రశ్నలకూ అద్భుతమైన రీతిలో చకచకా జవాబులు చెప్పాడు.

చిట్టచివరకు గార్గి లేచి నిలబడింది. యాజ్ఞవల్క్యుణ్ణి తాను కొన్ని ప్రశ్నలు అడగదలిచినట్లు ఆమె ప్రకటించింది. వాటికి గనక ఆయన సంతృప్తికరంగా సమాధానాలు చెప్పినట్లయితే, అందరిలోకీ ఆయనే ఉత్కృష్ట జ్ఞాన సంపన్నుడని ఒప్పు కుంటానని ఆమె ప్రకటించింది. కాగా, ఆమె వరుసగా సంధించిన ప్రశ్నలన్నిటికీ యాజ్ఞవల్క్యుడు సంతృప్తికరంగా సమాధానాలు ఇచ్చాడు. గార్గి - యాజ్ఞవల్క్యుల మధ్య నడిచిన సంవాదం ఆ కాలంలో మహిళల్లో సైతం ఉన్న లోతైన ఆధ్యాత్మిక అవగాహనకు చక్కటి ఉదాహరణ.

## పండుగలు - పర్వదినాలు

### జూన్ - 2007

| | | | |
|---|---|---|---|
| 11 | సోమవారం | : | ఏకాదశి |
| 26 | మంగళవారం | : | ఏకాదశి |

### జులై - 2007

| | | | |
|---|---|---|---|
| 10 | మంగళవారం | : | ఏకాదశి |
| 16 | సోమవారం | : | పూరీ జగన్నాథ రథయాత్ర |
| 26 | గురువారం | : | ఏకాదశి |
| 30 | సోమవారం | : | గురుపూర్ణిమ |

# ఆచార వ్యవహారాలు అంతరార్థాలు - 16

- రెంటాల జయదేవ

(గతసంచిక తరువాయి)

**ఎవరు అర్ఘ్యమివ్వాలి?**

వైదికంగా సంధ్యావందనం చేయడానికి వీలు లేని వాళ్ళు సైతం అర్ఘ్యమివ్వవచ్చు.

***అస్నాయీ స మలం భుంక్తే అజపీ పూయ శోణితమ్ ।***

***సూర్యా యార్ఘ్య మదత్వా తు సూర్యం హంతి స పాపకృత్ ॥***

'వైదిక సంధ్యా వందనం చేయడానికి అర్హత లేని స్త్రీలు కూడా స్నానమాచరించి, సూర్యుడికి అర్ఘ్యమివ్వవచ్చు. 'అర్ఘ్యం ఇచ్చే సమయంలో పఠించాల్సిన మంత్రం ఒకటుంది.

***ఏహి సూర్య సహస్రాంశో తేజోరాశీ జగత్పతీ ।***

***అనుకంపయ మాం భక్త్యా గృహాణార్ఘ్యం నమో - స్తుతే ॥***

*'ఓ సహస్రకిరణా! ఓ తేజోపుంజా! ఓ జగత్పతీ! ఓ సూర్య భగవానుడా! భక్తుడనైన నన్ను నువ్వు దయ చూడవలసింది. భక్తి పూర్వకమైన ఈ అర్ఘ్యాన్ని గ్రహించు. నీకు నా నమస్కారం!!'*

## సూర్యారాధన సిద్ధిప్రదాయకం!

**సూర్యారాధన**

కాగా, సూర్యుడికి అర్ఘ్యమివ్వకుండా భోజనం చేస్తే, అది పాపపు కూటితో సమానమని 'స్కాందపురాణం' పేర్కొంటోంది. సూర్యుడికి నమస్క రించకుండా ఎవరూ ఏ



శుభ కార్యక్రమం చేయ రాదని పెద్దలంటారు. ప్రత్యేకించి, సూర్యుడు ఒక రాశి నుంచి మరో రాశికి మారే సంక్రమణ సమయంలోసూర్యారాధన చేయడం కీలకం. అదే విధంగా ప్రతి పక్షంలోనూ ఆరోరోజును సూర్య షష్ఠిగా జరుపు కొంటూ, భగవదారాధన చేసే ఆచారం కూడా ఉంది. ఇక, వారంలో ఆదివారం సూర్యునికి ప్రీతికరమైన దినం. ఆ రోజున తప్పనిసరిగా సూర్యదేవుణ్ణి ప్రార్థించాలి. చాలా మంది ఆ రోజున ఉపవాసం కూడా ఉంటారు.

హిందువుల్లో చాలా మంది ప్రతి రోజూ ఉదయం సూర్యనమస్కారాలు, సూర్యారాధన చేస్తుంటారు. అందుకోసం ఓ రాగి చెంబులో నీళ్ళు తీసుకొని, దానిలో ఎర్ర చందనం, అక్షతలు, ఎర్ర పుష్పాలు, కుశలు కలుపుతుంటారు. ఆరుబయటకు వచ్చి, సూర్యాభిముఖంగా నిల్చొని, ఆ రాగి చెంబును తమ హృదయానికి దగ్గరగా ఉంచుకుంటారు. ఆ పైన సూర్య మంత్రాన్ని కానీ, గాయత్రీ మంత్రాన్ని కానీ పఠిస్తూ, ఆ జలాన్ని నిదానంగా సూర్యుడికి అర్పిస్తారు.

2006 డిసెంబర్
'అనంతపురం భక్త సమ్మేళనం'లో
డాక్టర్ కమల జయరావు ప్రసంగం.

# శారదమ్మ బోధ సర్వజనానికీ శిరోధార్యం



శారదాదేవి జీవించి ఉన్న రోజుల్లో మహిళలకి అక్షరజ్ఞానం చాలా తక్కువగా ఉండేది. కాబట్టి ప్రతి మహిళా చదువుకోవాలి అనేవారు అమ్మ. అమ్మ దగ్గరికి ఒక మహిళ ఒక అమ్మాయిని తీసుకువచ్చి " ఈ అమ్మాయికి బుద్ధి చెప్పండి, పెళ్ళి చేసుకోనంటోంది" అంది. అమ్మ తనకి చదువులేకపోయినా, సంప్రదాయ కుటుంబానికి చెందిన గ్రామీణ స్త్రీ అయినా "ఇప్పుడే పెళ్ళి ఎందుకు? బడికి పంపించి చదివించకూడదూ ! చదివిస్తే ఆ పిల్ల ఇటు పుట్టింటికీ అటు అత్తవారికీ కూడా ఎంతో ఉపయోగపడు తుంది" అన్నారు. దీనిలో అర్థం ఏమిటంటే చదువుకున్న మహిళలు (చదువు కున్న పురుషులు కూడా) తమ జీవితాన్నీ బాగు చేసుకో గలుగుతారు. తమ కుటుంబాల్ని కూడా సరిదిద్దు కోగలుగుతారు. విద్య అందరికీ ఎంతో అవసరం అని అమ్మ ఎప్పుడూ చెప్పేవారు. అమ్మకి సేవికగా ఉన్న సరళాదేవి తదనంతర కాలంలో శారదామఠానికి అధ్యక్షురాల య్యారు. అమ్మ ఆమెను చదువుకోమని ప్రోత్సహించడమే కాకుండా ఆమెకి అండగా ఉన్నారు.

**ఆత్మవిశ్వాసాన్ని పెంచే విద్య...** విద్య అంటే కేవలం అక్షర జ్ఞానం కాదు. ఆ విద్యవల్ల ఆ వ్యక్తి యొక్క మనోవికాసం జరగాలి. విద్యవల్ల ధైర్యం అనేది వస్తుంది. అమ్మ జీవితాన్ని చూస్తే ఆమె బందిపోటు దొంగల్ని ఎదుర్కొంది అని చదువుతాం. అంటే శారీరకంగా దొంగల్ని ఎదుర్కొంది అనీ కాదు, మహాశక్తి గలది అనీ కాదు. అందులో ఉన్న సందేశం ఏమిటంటే మన జీవితంలో ఎన్నో సమస్యలు వస్తాయి. అన్ని సమస్యల్నీ మనం ధైర్యంగా ఎదుర్కోవాలి అని. నేటి విద్యార్థి లోకాన్ని చూస్తే ఒక పరీక్షలో తప్పినా లేక పరీక్షలు బాగా వ్రాయలేదు అనుకున్నా లేక ఏచిన్న సమస్య వచ్చినా వాళ్ళు ఆత్మహత్యలకి పాల్పడుతున్నారు. ఇది చాలా శోచనీయమైన విషయం. వారికి విద్యవల్ల ఎందుకు మనోవికాసం జరగడంలేదు? వారికి ఆత్మవిశ్వాసం ఎందుకు రావడంలేదు? ఈరోజుల్లో విద్య అంటే పరీక్షలు వ్రాయడం, పాసు కావడం దాని తరువాత విదేశాలకు వెళ్ళిపోవడం. అక్కడ ఎదురయ్యే సమస్యల్ని ఎలా ఎదుర్కోవాలో కూడా తెలియని స్థితిలో ఉన్నారు. వీటినన్నింటినీ ఎదుర్కోడానికి ఆత్మ విశ్వాసం ఉండాలి. అమ్మ జీవితంలో ఎన్నో సమస్యలు, దేనికీ అమ్మ కుమిలిపోలేదు. ప్రతి ఒక్క దానినీ ధైర్యంగా ఎదుర్కొన్నారు. ఆ శక్తే ప్రతివ్యక్తిలోనూ ఉంది కాబట్టి ప్రతి ఒక్కరూ అమ్మ జీవితం ద్వారా ఇది తెలుసుకోవాలి.

**ప్రజాస్వామ్య విలువలు...** అమ్మ జీవితంలో మతము, కులము, జాతి, నిమ్న వర్గము, ధనిక వర్గము, చదువుకున్న వాళ్ళు, చదువుకోని వాళ్ళు అనే భేదాలేవీ లేవని చూపించారు. అమ్మ జీవితంలో కనపడేదేమంటే ప్రజాస్వామ్య విలువలు – అంటే ప్రతి వ్యక్తీ కూడా ప్రజాస్వామ్యంలో

సమానుడే. రాచరిక వ్యవస్థలో రాచరికంలో ఉన్నటువంటి వాళ్ళు పెద్ద వాళ్ళు, సామాన్య ప్రజలు తక్కువవాళ్ళు అని ఉంటుంది. మంత్రులు, నాయకులు, వారికి ఓటువేసే ప్రజలు అందరూ సమానమే. అదే విధంగా అమ్మ జీవితం మనం చదివితే ఈ దేశంలో ప్రతిఒక్కరూ ఏ విధంగా ఉత్తమ పౌరులు అవగలరో తెలుస్తుంది. కాబట్టి మన యువ తీయువకులు అందరూ అమ్మ జీవితాన్ని చదివి అమ్మకి చదువు అన్నది లేకపోయినా, పల్లెటూరిలో పుట్టి పెరిగినా, జాతి, మతం, కులం అనే కట్టుబాట్లు ఎక్కువగా ఉన్న ఆ రోజుల్లో కూడా ఈ కట్టుబాట్లన్నిటినీ ఛేదించుకుని అందరూ నా పిల్లలే అని అమ్మ ఎలా చూపారో తెలుసుకోవాలి.

నేడు పట్టణాల్లోనూ, నగరాల్లోనూ చదువుకున్న వారిలో ఈ కులభేదం, మత భేదం అనేవి వెర్రితలలు వేస్తున్నాయి. ఇవి మనిషికీ మనిషికీ మధ్యన అడ్డుగోడలను లేపుతున్నాయి. అమ్మ దృష్టిలో మనిషికీ మనిషికీ మధ్య భేదంలేదు. ఆఖరికి జంతువుల పట్ల కూడా భేద భావం చూపించలేదు అమ్మ. ప్రతి ఒక్క దానిలోనూ ఆత్మ ఉంది అని మన వేదాంత సందేశం. అమ్మ తన జీవితంలో దానిని ఆచరించి చూపారు.

**సహనంతో సమస్యల పరిష్కారం...** సహనం చాలా ముఖ్యమైనది. నేడు మనలో సహనం చాలా తగ్గిపోతోంది. భార్య ఒక్కమాట అంటే భర్త పడలేదు. అలాగే భర్త ఏమన్నా అంటే భార్య పడలేదు. తలిదండ్రులు ఒకమాట అంటే పిల్లలు పడలేరు. కాబట్టి కుటుంబంలోనూ, సమాజంలోనూ ఎన్నో కలహాలు వస్తున్నాయి. అన్ని రంగాల్లోనూ చూస్తున్నాం. ఎవరో ఏదో చిన్న మాట అనేసరికి లేదా ఏదో ఒక చిన్న సంఘటన జరిగిందని పెద్దగొడవలు లేవదీయడమో, బస్సులు తగలపెట్టడమో, ఇళ్ళు తగలబెట్టడమో జరుగుతుంది. ఇదంతా సహనం లేకపోవడం వల్లనే.

అమ్మ తన జీవితంలో అన్ని కష్టాల్నీ ఎంత సహనంతో ఎదుర్కొన్నారో, భరించారో చూపడానికే రాధు వచ్చింది. అంతే కాకుండా అమ్మలోని మరొక గొప్పగుణం తితీక్ష. అవతలి వాళ్ళమీద పగలేకుండా ఓర్పుకలిగి ఉండడం తితీక్ష. అమ్మలో ద్వేషంకానీ, కోపంగానీ మనకి ఎప్పుడూ కనపడవు. అమ్మ ప్రేమ స్వరూపిణి. ఆ ప్రేమే మన జీవితాల్లో కూడా అన్వయించు కోవడానికి ప్రయత్నించాలి.

**ఆధ్యాత్మికత అంటే...** ఆధ్యాత్మిక జీవితం ఎంత అవసరమో అమ్మ చెప్పారు. ఆధ్యాత్మిక జీవితం అంటే గుడికి వెళ్ళడం, కొబ్బరికాయ కొట్టడం కాదు. ఆధ్మాత్మిక జీవితం అంటే సాధన. ఆధ్యాత్మిక సాధన అంటే జపం చేసినా, తపం చేసినా మనలో ఉన్న అశేషశక్తి ఏమిటో తెలుసు కోవడం. అది లేనప్పుడు మనిషికి ఎన్నో మూఢ నమ్మకాలు వస్తాయి. సంఘంలో ఎన్నో మూఢనమ్మకాలున్న ఆ రోజుల లోనే అమ్మ వాటిని ఎదిరించి, ఎంత చక్కని పరిష్కా రాలు చూపారో తెలుసుకుంటే మనకి ఆశ్చర్యం వేస్తుంది. ఒకరోజు అమ్మ ఇంట్లోని వారెవరో రాత్రివేళ ఏదో అంటరాని వస్తువుని తొక్కి, అప్పుడు గంగా నదికి వెళ్ళి స్నానం చేస్తాను అన్నారు. స్నానం చేయాల్సిన అవసరం ఏముంది, కాళ్ళూ చేతులూ కడుక్కోమని, బట్టలు మార్చుకోమని అమ్మ నచ్చచెప్పారు. కాని ఆమె ఎంత చెప్పినా వినిపించుకోలేదు. తాను పవిత్రతా స్వరూపిణి కాబట్టి అమ్మ "సరే అయితే నన్ను తాకు" అన్నారు. నేడు కూడా చదువుకున్న వాళ్ళలో ఇలాంటి మూఢనమ్మకాలు చూస్తూనే ఉన్నాం.

అంజాద్ తిన్న ఎంగిలి విస్తరి అమ్మ తీస్తున్నప్పుడు మేనకోడలు "మనల్ని కులం నుండి వెలివేస్తారు, ఏం పని చేస్తున్నావు" అని వారించింది. అప్పుడు అమ్మ "శరత్ లాగే అంజాద్ కూడా నా సంతానమే" అన్నారు. మన కులం కానివారు వండినది మనం తినకూడదు, వారి ఎంగిలి మనం ఎత్తకూడదు... ఇవన్నీ మూఢనమ్మకాలు. భగవంతుడిపైన మనకి విశ్వాసం లేకనే ఈ మూఢనమ్మకాలు ఏర్పడతాయి. మూఢనమ్మకాలన్నీ భయానికి చిహ్నం. అమ్మ జీవితంలో అంతా ధైర్యమే చూపించారు. కానీ భయం లేదు. ఆమె నిర్భయ స్వరూపం. ఇంటా, బయటా కూడా మనకి అభయ ప్రదానం చేసేటటువంటిది ఆమె.

సహనం, సమత్వం, ఆత్మ విశ్వాసం మనలో అలవడిన నాడే మన జీవితాలు శాంతిమయం అవుతాయి. అందుకు శారదమ్మ జీవితమే మనకు శిరోధార్యం కావాలి!

**మ**తం పేరుతో మనం పాటించే ఆచారాలు మనసును పరిశుద్ధం చేయాలి. లేనట్లయితే అవి మనసును మలినం చేసే మూఢాచారాలుగా మారతాయి. అపరిశుద్ధమైన మనసు సులభంగా నిర్మలం కాదు. అభ్యుదయ భావాలను స్వీకరించి పాటించేందుకు ప్రయత్నించాలి. అప్పుడే మనసులోని అపరిపక్వత నశించి నిర్మలమౌతుంది.

**– శ్రీశారదాదేవి**

## మధుర స్మృతులు

- స్వామి భాస్కరానంద

# నిరాడంబరతకు నిలువెత్తు సాక్ష్యం

### స్వామి గంభీరానంద

విరాళాలు ఎంత విరివిగా వచ్చినా మఠాల లోని స్వామీజీల జీవనశైలి మాత్రం చాలా నిరాడంబరంగా సాగిపో తుందన టానికి స్వామి గంభీరానందజీ సాక్ష్యం. ఆయన రామకృష్ణ సంఘ పదకొండవ సర్వాధ్య క్షులుగా వ్యవహ రించారు. ఏ స్థాయిలో ఆయన బాధ్యతలు నిర్వహించినా ఆడంబ రాలకు చాలా దూరంగా ఉండే వారు. ప్రధాన కార్యదర్శిగా ఉన్న ప్పుడు ఆయనకి రోజుకి యాభైకి పైగా ఉత్తరాలు వచ్చేవి. అన్నింటినీ ఎంతో ఓపిగ్గా చదివి ఆయా విభాగాలకు స్వయంగా వెళ్ళి ఇచ్చి వచ్చే వారు. ఈ పనుల కోసం ఎప్పుడూ ఆఫీసుబాయ్‌పై ఆధార పడేవారు కాదాయన. రోజూ ఉదయం రెండు గంటల పాటు ఈ ఉత్తరాల పనికి కేటాయించేవారు. తరువాత కార్యాలయం బయట బల్లపై కూర్చొని సందర్శకులతో మాట్లాడేవారు. అలా కొత్తగా ఆయనని చూసినవారు సాధారణ స్వామీజీయే అనుకునేవారు. అలాగే మఠంలో ఏ చిన్న కాగితాన్ని కూడా ఆయన దుర్వినియోగం చేయనిచ్చేవారు కాదు. భక్తులు ఎంతో నమ్మకంగా ఇచ్చిన విరాళాల్లో ఒక్క రూపాయి కూడా వృధా పరచొద్దని మాకు చెబుతూ ఉండేవారు. వారు కూడా ఆచరించేవారు. తన కార్యాలయంలో ఏ చిన్న తెల్లకాగితం కనిపించినా పక్కన పెట్టుకొని వ్రాయటానికి వినియోగించేవారు. ప్రింటింగ్‌ప్రెస్ వాళ్ళ నుంచి వృథాపేపర్లు, ఒకవైపు రాసిన కాగితాలను కూడా తెప్పించుకొని వ్రాయటానికి పక్కన పెట్టుకునేవారు. స్వామి గంభీరానంద శిష్యులుగా మేమంతా అలాంటి ఎన్నో ఆదర్శనీయ అంశాల్ని ఆయన నుంచి నేర్చుకున్నాం. అలాగే ఆయన నేర్పేవిధానం కూడా ఎంతో సౌమ్యంగా, ఆత్మీయంగా ఉండేది. ఏ విషయాన్నీ కూడా ఆయన గంభీరంగా, కటువుగా చెప్పేవారు కాదు. నా విషయంలో కూడా ఓ అనుభవం ఎంతో కదిలించేట్లుగా ఉంటుంది. ఎప్పుడూ నా గదికి తాళం వేసే వాడిని కాదు. కొన్ని పుస్తకాలు, రెండు జతల సన్యాసి దుస్తులు, పాత ఫ్యాను తప్పితే అందులో ఏమీ ఉండవు కదా అన్న నిర్లక్ష్యంతో ఎప్పుడూ గదిని అలానే వదిలేసి వెళ్ళేవాణ్ణి. కాని ఒకసారి స్వామి గంభీరానందజీ నాతో 'బయటకి వెళ్ళినప్పుడు తాళం తప్పని సరిగా వేయటం అలవాటు చేసుకోవాలి. వేయకపోవటం వల్ల సాధారణ వ్యక్తుల మనసులో చోరభావనలకు అవకాశం కల్పించిన వారమవుతాం' అని చెప్పారు. ఆ తరువాత మెల్లగా అల వాటు చేసుకున్నాను. కానీ ఎందుకో ఒకసారి అలవాటులో పొర పాటుగా గదికి తాళం వేయటం మరచి పోయాను. తరువాత ఎప్పుడో గుర్తొచ్చి, పరిగెత్తుకొని గది దగ్గరకి వెళ్ళి చూసే సరికి గదికి తాళం వేసి ఉంది. వెంటనే తాళం కోసం వాచ్‌మెన్ దగ్గరకి వెళ్ళి అడిగాను. స్వామి గంభీరానందజీ తాళం వేసి తీసుకెళ్ళారని చెప్పాడు. ఆయన చెప్పినా, నిర్లక్ష్యంగా ఉన్నానన్న అపరాధభావంతో కాస్త భయంగా ఆయన దగ్గరకు వెళ్ళాను. కాని ఎంతో సాధారణంగా, సౌమ్యంగా గది తాళాల్ని చేతికిచ్చారు. అహానికి, ఆడంబరానికి తావులేని ఆయన శైలి మౌనంగా మాకు పాఠాలు నేర్పేది.

### ప్రయత్నిస్తేనే.. పురోగతి !

ఒక్కరోజులోనే వ్యక్తిత్వం పరిపూర్ణతను సాధించలేదు. సాధనను బట్టి మనసు దృఢపడుతుంది. పూర్ణపురుషులుగా ఎదగటం ఆకస్మికంగా సాధ్యపడదు. ఆధ్యాత్మిక అవకాశాల్ని అందిపుచ్చుకుంటూ దినదిన ప్రవర్ధమాన మవ్వాలి. ఎలాగైతే స్థోమతను బట్టి ఇంటిని ప్రణాళికా బద్ధంగా పూర్తి చేసుకుంటామో, అలాగే ఉన్నత వ్యక్తిత్వాన్ని కూడా నిర్మించుకోవాలి. ఉత్తమం అనుకున్నది స్వల్పమైనా సరే ఆచరించటం ప్రారంభించాలి. ఆదర్శజీవనం కారణజన్ములకే సాధ్యపడుతుందనే భావన నుంచి బయటపడి సాధన చేయాలి. ధర్మం స్వల్పమైనా సరే ఆచరించటం ప్రారంభిస్తే అమోఘమైన ఫలితాల నిస్తుంది.

– స్వామి రంగనాథానంద




# ఆత్మవిశ్వాసంతోనే అభ్యుదయం

ప్రజలకు మనం ఆదర్శవంతమైన, ప్రయోజనాత్మకమైన భావాలనే అందివ్వాలి. వ్యతిరేక భావాలు మానవుల్ని నిర్వీర్యం చేస్తాయి. తల్లితండ్రులు ఎప్పుడూ తమ పిల్లల్ని చదవమని పోరు పెడుతూ, వారికేమీ రాదనీ, వారు బుద్ధిహీనులనీ అనటం వల్ల పిల్లలు చివరికి అదేవిధంగా మారిపోతారు. పిల్లలకు మంచి మాటలు చెప్పి వారిని ప్రోత్సహిస్తే వారు తప్పకుండా అభివృద్ధిలోకి వస్తారు. కాస్త గ్రహణశక్తి ఎక్కువగా ఉన్న పిల్లల విషయంలో కూడా ఇదే పద్ధతి వర్తిస్తుంది. వారికి నిర్మాణాత్మకమైన భావాలను అందివ్వ గలిగితే వాళ్ళు నిజమైన మనుషులుగా రూపొంది తమ కాళ్ళమీద తాము నిలబడటం నేర్చుకుంటారు. వేష భాషలు, సాహిత్యం, కళలను ప్రభావితంచేసే ప్రతి చిన్న విషయంలోనూ మనం ప్రజల ఆలోచనలను, ఆచరణను విమర్శించకూడదు. వాటిని మరింత చక్కగా అమలుచేసే పద్ధతిని వారికి తెలియ జేయాలి. అదే పనిగా తప్పుపట్టడం వల్ల మనిషి మనసు గాయపడుతుంది. 'మేం వ్యర్థులం' అని భావించిన వారిని కూడా ప్రోత్సహించి వారి జీవన విధానాన్నే మార్చవచ్చు. ఆ బోధనావిధానమే అద్వితీయం.

**ప్రగతినిచ్చే ప్రోత్సాహం...** శారీరక, మానసిక, ఆధ్యాత్మిక విషయాలన్నింటిలో మానవులకు నిర్మాణాత్మకమైన భావసంపదను అందించటమే మతం ముఖ్యోద్దేశ్యం. ఎవరినీ ద్వేషించకూడదు. మనల్ని మనం ద్వేషించుకోవడం వల్లనే మనకు పతనం కలిగింది. నిర్మాణాత్మకమైన ఆస్తికభావ సంపదను వెదజల్లి మానవుల్ని ఉద్ధరించాలి. ఈ విధంగా మనం మొదట హిందూ జాతిని ఉద్ధరించి తర్వాత మొత్తం ప్రపంచాన్ని ఉద్ధరించాలి. మహాత్ములు అధఃపతితుడైన వాడికి కూడా ఆశను, ప్రోత్సాహాన్నిచ్చి వారిని ఉద్ధరిస్తారు. మనం కూడా వారి అడుగుజాడలనే అనుసరించి అందరినీ ఉత్తేజపరచాలి.

మన విజ్ఞాన సర్వస్వాలైన వేదాల్లోని, వేదాంతంలోని ఉత్తమోత్తమ భావాలను సరళ వ్యవహారికభాషలో మానవులకు వివరించి చెప్పాలి. నైతిక సూత్రాలనూ, మంచినడవడినీ, విద్యనూ బోధించి చండాలుని కూడా ఉన్నత స్థితికి తీసుకురావాలి. ఈ విషయాలన్నీ వివరించి యువతను, పెద్దలను, స్త్రీలను, పురుషులను అందరినీ మేల్కొల పాలి! అప్పుడే మన చదువులు సార్థకమౌతాయి.

**మహనీయునిగా మార్చేది...**

ప్రజల్ని ఉత్తేజపరిచి వారిని కార్యోన్ముఖుల్ని చేయాలి. జీవితంలో కష్ట నష్టాలను ఎదుర్కొనే సామర్థ్యం కలవారిగా రూపొందించాలి. శరీరంలో బలం, మనసులో ఉత్సాహం బుద్ధిలో స్వతంత్ర్య ఆలోచనల్ని కలిగించి వారిని సజీవచైతన్యమూర్తులుగా తయారు చేయాలి. వేద మంత్రాల్లో ఉండే అమోఘశక్తితో వారిని మేల్కొలపాలి. 'లేవండి మేల్కోండి' అనే అభయ సందేశాన్ని చాటి చెప్పాలి. అందరిలోను అనంతమైన శక్తి ఉందని వారికి బోధించాలి. వారిలో నిద్రాణమైన కార్య శూరత్వాన్ని తట్టిలేపాలి.

జీవితంలో ఒడిదుడుకుల్ని ఎదుర్కొనే సామర్థ్యాన్ని పెంచే మనోబలాన్ని ప్రసాదించాలి. వారిని స్వయం శక్తిపై ఆధారపడి జీవించేలా చేయాలి. ప్రతి విషయంలోనూ వీరోచితమైన పురుషత్వాన్ని పునరుజ్జీవింప జేయాలి. నిజమైన శ్రద్ధ, విశ్వాసాలు మనలో మేల్కొనాలి. అటువంటి విశ్వాసం మానవుల్ని మహ నీయులుగా చేస్తుంది. అటువంటి శ్రద్ధ లోపిస్తే దేశం నాశనమౌతుంది. మనదేశాన్ని పట్టి పీడిస్తున్న అనంతమైన దోషాలను శ్రద్ధ మాత్రమే రూపుమాప గలదు.

మంచి పనిచేసేవాడెన్నడూ దుర్గతిని పొందడు. ఫలితాలను ఆశించకుండా పని సాగించడమే మన విధి.

(స్వామి వివేకానంద 'స్వామి – శిష్య సంభాషణలు' నుంచి)

# శివమహిమ్నఃస్తోత్రం

(గత సంచిక తరువాయి)

**అసితగిరిసమం స్యాత్కజ్జలం సింధుః పాత్రం**
**సురతరువరశాఖా లేఖనీ పత్రమూర్వీ ।**
**లిఖతి యది గృహీత్వా శారదా సర్వకాలం**
**తదపి తవ గుణానామీశ పారం న యాతి ॥32॥**

పుష్పదంతుని హృదయాన్ని తెలుసుకుని మరో మహానుభావుడు పుష్పదంత కృతంగా చెప్పే శ్లోకం ఇది. శారదాదేవి అనుగ్రహించింది కనుక నేను ఇదంతా వర్ణించాను. నన్నూ, నాలాంటి ఎందరో కవులనూ అనుగ్రహించిన ఆ శారదాదేవి కాల మంతా కూర్చుని వ్రాసినా వర్ణించలేదు. శారదాదేవి అను గ్రహం పొంది వర్ణించే వాడికి కాలముందేమో కానీ శారదా దేవికి కాలముందా, ఆ తల్లి అనంత కాలంలో ఉంటుంది. ఈ అనంత కాలంలో ఉన్న శారద అనంతకాలం వర్ణిస్తున్నా అనంతమైన శివుడ్నీ ఆయన లీలల్నీ పూర్తిగా వర్ణించలేదు. శివుడి గురించి వ్రాయడం చాలా పెద్దపని అని అమ్మకు తెలుసు. శివుడు చాలా పెద్దవాడు కనుక పెద్ద (ఎత్తున) సామగ్రి సమకూర్చుకుందామనుకుంది వ్రాయడానికి. **అసితగిరిసమం స్యాత్కజ్జలం సింధుపాత్రం** = ఒక నల్లని కాటుక కొండని తెచ్చి సముద్రంలో కలిపిందట, సిరాతయారైంది. కల్పవృక్షం అరగదు, తరగదు. అందుకు కల్పవృక్షపు కొమ్మని పెరికి కలం తయారు చేసుకుంది. అదే **సురతరువర శాఖాలేఖనీ; పత్రమూర్వీ** = విశాలమైన భూమిని పత్రంగా చేసుకుని; **లిఖతియది గృహీత్వా శారదా సర్వకాలం** = ఉన్న కాలమంతా వీటితో వ్రాస్తూ ఉన్నా; **తదపి తవ గుణానామీశ పారం న యాతి** = ఇంతా వ్రాసినా నీ పూర్తి గుణాలను వర్ణించలేదు ఆ శారద!



దీనిలో అంతరార్థమేమిటంటే అమ్మవారి లవలేశ అనుగ్రహం పొంది మా లాంటి కవులు వర్ణించినా అది పూర్తయ్యేది కాదు. అలాగని ఆగలేమే! ఇంకా కవులు పుడుతూ ఉంటారు, చెప్తూ ఉంటారు. ఎందుకంటే సర్వకాలం శారద చెప్పదల్చుకుంది కనుక బహువిధాలుగా తాను కవులలో ప్రవేశించి ప్రేరేపించి చెప్తూనే ఉంటుంది. ఆ నాడు వేదములు చెప్పాయి, వ్యాసుడు చెప్పాడు, మహిమ్నఃస్తుతి కర్త చెప్పాడు, తరువాత హలాయుధ స్తోత్రం మొ॥ వ్రాసిన మహానుభావులు చెప్పారు, కాళిదాసు చెప్పాడు, శంకర భగవత్పాదులు చెప్పారు, ఎందరెందరో చెప్పారు, చెప్తారు. ఇదే శారదా సర్వకాలం. ఇందరి చేత శారద చెప్పిస్తూనే ఉంది అయినా **పారం నయాతి** = పారం తెల్సుకోలేదు.

**అసురసురము నీంద్రైరర్చిత**
**స్యేందుమౌళేర్గ్రథితగుణ**
**మహిమ్నో నిర్గుణస్యేశ్వరస్య ।**
**సకల గుణవరిష్ఠః పుష్ప**
**దంతా భిధానో**
**రుచిరమలఘు వృత్తైః**
**స్తోత్రమే తచ్చకార ॥33॥**

ఇందులో వర్ణించిన శివుడు ఎటువంటి వాడంటే సకల గుణా వరిష్ఠుడు, నిర్గుణుడు ఇద్దర్నీ వర్ణించారు. సగుణనిర్గుణ స్వరూపాలు రెండిటినీ వర్ణించి ఈ శ్లోకంలో సగుణ నిర్గుణ ఐక్యాన్ని చూపించారు.

**అహరహరనవద్యం ధూర్జటేః స్తోత్రమేతత్**
**పఠతి పరమభక్త్యా శుద్ధచిత్తః పుమాన్ యః॥**
**స భవతి శివలోకే రుద్రతుల్యస్తథా - త్ర**
**ప్రచురతరధనాయుః పుత్రవాన్ కీర్తిమాంశ్చ ॥34॥**

ప్రతీరోజూ కూడా ఈ స్తోత్రాన్ని శుద్ధ చిత్తంతో ఎవరు పారాయణ చేస్తారో వారు కావాల్సినంత ధనము, ఆయుష్షు, ఇతర సంపదలు కూడా పొందుతారు. అంతంలో శివలోకాన్ని చేరుతారు. ఇహపరాలు రెండూ ఇవ్వగలిగిన గొప్ప స్తోత్రం ఇది. చివరికి తీర్మాన మేమిటంటే....

**మహేశాన్నాపరో దేవో మహిమ్నో నాపరా స్తుతిః**
**అఘోరాన్నాపరో మంత్రో నాస్తి తత్త్వం గురోః పరమ్॥35॥**

మహేశ్వరుణ్ణి మించిన దైవంలేదు, మహిమ్న స్తోత్రాన్ని మించిన స్తోత్రం లేదు. అఘోరమైన శివమంత్రాన్ని మించిన మంత్రం లేదు. పరమ గురువైన శివ తత్త్వాన్ని మించిన తత్త్వం లేదు.

**దీక్షా దానం తపస్తీర్థం జ్ఞానం యాగాదికాః క్రియాః**
**మహిమ్నః స్తవపాఠస్య కలాం నార్హంతి షోడశీమ్ ॥36॥**

ఒక దీక్షగానీ, నియమపాలన కానీ, దానం కానీ, తపస్సు కానీ, తీర్థయాత్రలు కానీ, ధ్యానం కానీ, యాగం కానీ, యోగం కానీ ఇవన్నీ కూడా శివమహిమ్నః స్తోత్రంలో 16వ వంతుకి కూడా సరిపోవు.

**కుసుమదశననామా సర్వగంధర్వరాజః**
**శిశుశశి ధరమౌళేర్దేవదేవస్య దాసః॥**
**స ఖలు నిజమహిమ్నో భ్రష్ట ఏవాస్య రోషాత్**
**స్తవనమిదమకార్షీద్దివ్యదివ్యం మహిమ్నః ॥37॥**

బాలచంద్రధరుడు, చంద్రశేఖరుడు అయిన శివుని దాసుడు పుష్పదంతుడనే సిద్ధ గంధర్వరాజు రచిస్తున్నాడు. తన దోషం వలన తన మహిమ నుంచి జారి పడిపోయిన పుష్పదంతుడు ఈ స్తోత్రం చేసి తిరిగి ఉన్నతి పొందాడు.

**సురగురుమభిపూజ్య స్వర్గమోక్షైకహేతుం**
**పఠతి యది మనుష్యః ప్రాంజలిర్నాన్యచేతాః॥**
**వ్రజతి శివసమీపం కిన్నరైః స్తూయమానః**
**స్తవనమిదమమోఘం పుష్పదంతప్రణీతమ్॥ ॥38॥**

దేవతలు మునులు కూడా ఈ స్తోత్రాన్ని గౌరవిస్తారు. స్వర్గాన్నీ, మోక్షాన్నీ కూడా ఇవ్వగలిగిన స్తోత్రం ఇది. నమస్కార ముద్ర చేసి మనస్సుని అటూ ఇటూ పోనీయకుండా స్తోత్రం చేసిన వారు శివసామీప్యాన్ని పొందుతారు.

**ఆసమాప్తమిదం స్తోత్రం పుణ్యం గంధర్వభాషితమ్॥**
**అనౌపమ్యం మనోహారి సర్వమీశ్వరవర్ణనమ్ ॥39॥**

ఇది గంధర్వ భాషితం. ఇందులో మనకు తెలియని గంధర్వ విద్య దాగి ఉంది. నాదమే గంధర్వులు ఉపాసించే విద్య. ఆసమాప్త= మధ్యలో ఆపకుండా చివరివరకూ ఈ స్తోత్రాన్ని చదవాలి. అలా చదివితే అనౌపమ్యం మనోహారి= దీనికి సాటయిన స్తుతిలేదు; మనసుని హరింపచేసే మంజులమైన భావాలు స్తోత్రమంతా ఉన్నాయి; ఇదంతా ఈశ్వర వర్ణనమే. శివుడ్ని వర్ణించడం వలన వచ్చింది.

**ఇత్యేషా వాఙ్మయీ పూజా శ్రీమచ్ఛంకరపాదయోః॥**
**అర్పితా తేన దేవేశః ప్రీయతాం మే సదాశివః ॥40॥**

ఇలా స్తోత్రం చేశామంటే ఆయనని పొగిడామని కాదు, మన వాక్కులలో పూజించామని! అందుకే శంకరుని పాదాలకు అర్పించిన వాగ్రూప పూజ వలన దేవతలకు ఈశ్వరుడైన సదాశివుడు నన్ను అనుగ్రహించుగాక.

**తవ తత్త్వం న జానామి కీదృశో - సి మహేశ్వర॥**
**యాదృశో - సి మహాదేవ తాదృశాయ నమో నమః ॥41॥**

ఇంత చెప్పినా నీ తత్త్వం ఎలాంటిదో నాకు తెలియదు మహేశ్వరా! అలాంటి నీ తత్త్వానికి నమస్కారం.

**ఏకకాలం ద్వికాలం వా త్రికాలం యః పఠేన్నరః॥**
**సర్వపాపవినిర్ముక్తః శివలోకే మహీయతే ॥42॥**

దీనిని ఏకకాలం, ద్వికాలం, త్రికాలం చదివినవారు సర్వపాపాల నుండీ విముక్తులై, వారికి శివలోకం లభిస్తుంది.

**శ్రీపుష్పదంతముఖపంకజనిర్గతేన**
**స్తోత్రేణ కిల్బిషహరేణ హరప్రియేణ॥**
**కంఠస్థితేన పఠితేన గృహస్థితేన**
**సుప్రీణితో భవతి భూతపతిర్మహేశః ॥43॥**

ఈ స్తోత్రం అన్ని పాపాలనూ నశింపచేస్తుంది. దీనిని కంఠస్థం చెయ్యాలి, పఠనం చెయ్యాలి, భావన చెయ్యాలి. అలాగ చెయ్యడం వలన భూతపతి అయిన మహేశ్వరుడు సంతోషిస్తాడు.

ఇతి శ్రీ పుష్పదంత విరచితం శివమహిమ్నః స్తోత్రం సమాప్తమ్

**వ్యాఖ్యాత : సామవేదం షణ్ముఖశర్మ**
**విలేఖనం : శ్రీమతి ఎన్. శేషు**

### ధన్యవాదాలు

హైదరాబాద్ రామకృష్ణ మఠంలో 2005 ఫిబ్రవరిలో శ్రీసామవేదం షణ్ముఖశర్మ 'శివమహిమ్నః స్తోత్రం'పై వారం రోజులపాటు ప్రవచనాలిచ్చారు. వారి అనుమతితో ఆ ప్రవచనాల్లోని ముఖ్యాంశాలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2005 నవంబర్ నుంచి ప్రచురిస్తున్నాం. ఈ ధారావాహిక జూన్ నెలతో పరిసమాప్తమైంది. శ్రీ సామవేదం షణ్ముఖ శర్మ గారికీ, వారి ప్రసంగాలను విలేఖించిన శ్రీమతి ఎన్. శేషు గారికీ శ్రీరామకృష్ణ ప్రభ పాఠకుల తరఫున ధన్యవాదాలు తెలుపుతున్నాం. **– సంపాదకులు**

# మహేశ్వరుణ్ణే మెప్పించిన మధురగాయకులు

కథ: **సుందర రాజన్** బొమ్మలు: **శంకర్** తెలుగుసేత: **స్వామి జ్ఞానదానంద**

**1** సుందర నాయనారు కీర్తనలతో మైమరచిపోయిన పరమేశ్వరుడు తన కాలి మువ్వల సవ్వడి చేయలేదు. ఇది తెలుసుకున్న చేరమాన్ సుందర నాయనార్ దర్శించుకోడానికి తిరువారూర్ వచ్చాడు. దారిలో చిదంబరంలోని ఆలయంలో....




**2** పరమేశ్వరా! ఇన్ని రోజులకు మీ మువ్వలసవ్వడి వినే భాగ్యం దక్కింది. ఈ రోజు మీ నటరాజ స్వరూప దర్శనం కూడా ప్రసాదించారు. ధన్యుడనయ్యాను.



**3** అచ్చట చేరమాన్ భక్తితో మధుర కీర్తనలు ఆలపించాడు. గానం ముగిసిన వెంటనే పరమేశ్వరుని మువ్వల సవ్వడి వినిపించింది. అది విని భక్తులందరూ ఆనందభరితులయ్యారు.



**4** చాలా రోజులు చిదంబరంలోనే ఉంటూ పరమేశ్వరుణ్ణి దర్శించారు చేరమాన్. తరువాత అక్కడి నుండి బయలుదేరి పలు తీర్థయాత్రలు చేస్తూ తిరువారూర్‌కు వచ్చి సుందరనాయనారును కలుసుకున్నాడు.

**5**




**6**




**7**




**8**




మిగతా 36వ పేజీలో...

# పలిప్రశ్నే

**– స్వామి సుకృతానంద**

– డి. వేణుగోపాలరావు, టెక్కలి.

**? : గాయత్రీ మంత్రార్థాన్ని సవివరంగా తెలపండి.**

**✍: ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి၊ధియోయోనఃప్రచోదయాత్ ఓం.**

ఈ గాయత్రీ మంత్రం– ప్రతిపదార్థం, భావంతో సహా 'సస్వర వేదమంత్రాలు– టీకా తాత్పర్య వ్యాఖ్యాన సహితం'గా ఇప్పుడు రామకృష్ణ మఠం, హైదరాబాదు వారి ప్రచురణ లభ్యమవుతోంది.

**భావం :** భూమి, అంతరిక్షం, స్వర్గం – ఈ మూడింటినీ సృష్టించిన పరమాత్మ తేజస్సును మేము ధ్యానిస్తాము. మా మేధస్సునీ, బుద్ధినీ పరమాత్మ ప్రేరేపించుగాక !

**ప్రతిపదార్థం:** యో = ఎవరు, నః = మా, ధియో = బుద్ధిని, ప్రచోదయాత్ = ప్రేరేపిస్తున్నాడో, తత్ = ఆ, దేవస్య= పరమాత్మ ప్రకాశాన్ని, వరేణ్యం = పూజింపదగ్గ సవితుర్ = సృష్టికర్త, భర్గో= కాంతిని, ధీమహి = ధ్యానిస్తాము, భూర్భువః స్వః = భూమి, అంతరిక్షం, స్వర్గం. గాయత్రీ మంత్రంలో 'సవిత్రు' అంటే సూర్యుడని కూడా అర్థం. ఆయన స్వయం ప్రకాశ కుడు. ప్రత్యక్ష దైవం. పరమాత్మకు ప్రతీక. మనకు కనిపించే దేవుడు. ప్రకాశవంతా లన్నిటికీ ప్రకాశాన్ని ఇచ్చే దైవం పరమాత్మ. శారీరక, మానసిక ఆధ్యా త్మిక ప్రకాశం ఆ దివ్య ప్రకాశం నుంచే వెలువడుతుంది. భర్గో అంటే దహించేది అని అర్థ ముంది. జ్ఞాన తేజస్సు – మనలో ఉన్న అజ్ఞాన అంధకారాన్ని తొలగించి, ఆత్మజ్ఞానాన్ని ఇస్తుంది. గాయత్రీమంత్ర రహస్యం ఇది. ప్రాతఃకాలంలో సూర్యోదయానికి పూర్వం, మధ్యాహ్నం, సాయంకాలం సూర్యాస్తమయకాలంలో గాయత్రీజపం చేస్తే మంచిది.

– పి.వి. సుబ్బయ్య, హైదరాబాదు.

**? : రామకృష్ణ మఠాల్లో 'ఆరాత్రికం' నిర్వహిస్తారు కదా! ఆరాత్రికం అంటే ఏమిటో వివరించ ప్రార్థన.**

✍: సంధ్యాసమయంలో రామకృష్ణమఠాల్లో, రామకృష్ణ సేవా సమితుల్లో, భక్తుల గృహాల్లో శ్రీరామకృష్ణ భగవానుల ఆరాత్రికం నిర్వహిస్తారు. ఆరాత్రికం అంటే 'సాయంసంధ్యా సమయంలో చేసే దీపారాధన' అని అర్థం. ఆ సమయంలో స్వామి వివేకానంద శ్రీరామకృష్ణులపై వ్రాసిన "ఖండన భవ బంధన.." అనే బెంగాలీ గీతాన్ని పాడతారు. భగవాన్ శ్రీరామకృష్ణుల తత్త్వం ఏమిటో అందులో వివేకానంద వివరించారు. ఆయనే రచించిన "ఓం హ్రీం ఋతం త్వమచలో..." అని ప్రారంభమయ్యే సంస్కృత స్తోత్రాన్ని ఆలపిస్తారు. తరవాత దేవీ మాహాత్మ్యంలోని 'ఓం సర్వ మంగళ మాంగళ్యే శివేసర్వార్థ సాధికే.... అంటూ నారాయణీ స్తుతిలోని మూడు శ్లోకాల్ని రాగ యుక్తంగా ఆలపి స్తారు. ఆరాత్రిక మంటే ఇదే! మీకు అవకాశం లభిస్తే హైదరాబాద్ రామకృష్ణ మఠానికి ఆరు గంటల లోగా చేరుకొని ప్రత్యక్షంగా చూడండి. ఈ ఆరాత్రికం సంవత్సరం పొడవునా 365 రోజులూ జరుగుతుంది.

**కృషితో నాస్తి దుర్భిక్షం జపతో నాస్తి పాతకం...** కష్టించే వారికి కరువు ఉండదు. జపించే వారికి పాపం ఉండదు.

# ఆధ్యాత్మిక అన్వేషణ



- స్వామి తపస్యానంద

**ప్రశ్న:** ఆధునిక సమాజంలో భక్తికి ఉన్న స్థానమేమిటి?

**జవాబు:** సర్వకాల సర్వావస్థల్లోనూ మనిషి భగవంతునిపై భక్తివిశ్వాసాలు కలిగి ఉండాలి. దానికి అనుకూలమైన, ప్రతికూలమైన శక్తులు కూడా అన్ని కాలాల్లోనూ, అన్నిచోట్లా ఉంటాయి. కొంతమంది భావిస్తున్నట్లుగా, భక్తిని వ్యతిరేకించే శక్తులు ఉండడమనేది కేవలం మన కాలంనాటి ప్రత్యేకత ఏమీ కాదు. కానీ దీనిలో కొంత సత్యం కూడా లేకపోలేదు. పాండిత్యంతో కూడిన వాదోపవాదాలు కొందరిని సంశయాలకి గురి చేస్తాయి. అయితే పాండిత్యం కంటే కూడా విషయ సుఖాల పట్ల ఒక వ్యక్తికి గల తీవ్ర ఆకర్షణ అతడిలో సందేహాలు కలగ చేస్తుంది. భగవంతునిపై విశ్వాసానికి సంబంధించినంత వరకూ పాండిత్యం సాధారణంగా తటస్థంగానే ఉంటుంది. విశ్వాసం పేరుతో ప్రారంభమైన వివిధ అనాగరక మూఢ నమ్మకాలను అది ప్రశ్నించి నాశనం చేస్తుంది. అలా బూజుదులపడం కూడా చాలా యుక్తమైన పద్ధతే. సృష్టియొక్క అసలు తత్త్వాన్ని గురించి తమకేమీ తెలియదని పండితులకు కూడా తెలుసు. విజ్ఞాన శాస్త్రపు ఆధునిక తత్త్వవేత్తలు ఈ విషయాన్ని ధృవీకరిస్తున్నారు.



ప్రాపంచికతలో చిక్కిన పాండిత్యం

మానవులు తమ జీవితాల నుంచి భక్తిని ఎంతగా దూరం చేసుకుంటారో ఈ అనంత విశ్వంలో తాము నిరర్థకమైన జీవులుగా మిగిలినట్లు గ్రహిస్తారు. వారి దైనందిన జీవితంలో నైతికత దూరమౌతుంది. నీతి నియమాలు లేని మానవ సమాజం పశుప్రాయమైంది. ఎందుకంటే జంతువులకు సంబంధించినంతవరకూ, వాటి బుద్ధిని మార్చడం ఏమాత్రం వీలుకాదు. కానీ మానవుని విషయంలో బుద్ధిని నియంత్రించే శక్తులన్నీ అతని అధీనంలోనే ఉంటాయి. మనిషి తన జీవితానికి ఏదో ఒక పరమార్థాన్ని ఆపాదించనంత వరకు అతని చింతనాసరళి దుర్బలంగానూ, గందరగోళం గానూ తయారై, జీవితం చుక్కానిలేని నావలా మారుతుంది.

జీవితంలో మనిషి సుఖశాంతులతో ఉండాలంటే భగవంతునిపై భక్తివిశ్వాసాలు కలిగి ఉండడం ఆవశ్యకం. మానవ చరిత్రలో ఇంతకు పూర్వం కంటే ఇప్పుడు భక్తివిశ్వాసాలు అవసరం. ఎందుకంటే అవి లేనినాడు మనిషి మరింత అవినీతి పరుడిగా మారి దుఃఖాలను అనుభవించాల్సి వస్తుంది. `

**లౌ**కిక చింతలతో మనసును కలవరపడనివ్వకు. విద్యుక్తకర్మలను సకాలంలో నిర్వర్తిస్తూ మనసును మాత్రం సదా భగవంతుడి మీద లగ్నం చేయి. ఓడలోని దిక్సూచి ఖచ్చితంగా ఉత్తరదిక్కును చూపిస్తున్నంత వరకు ఓడ దిశ తప్పుతుందని కానీ అపాయం వాటిల్లుతుందని కానీ భయపడనక్కర లేదు. జీవననౌకకు దిక్సూచి లాంటి మనసు భగవంతుడి వైపు తిరిగివున్నంత వరకూ మానవుడికి ఏ అనర్థమూ వాటిల్లదు.

– శ్రీరామకృష్ణ పరమహంస

# స్వామీజీ స్ఫూర్తితో సహానం...

న్యూఢిల్లీలో 'రాజ్‌పథ్' భవనానికి వెళ్లే మార్గం... 1973, జనవరి గణతంత్ర దినోత్సవ సంబరాలు... కన్నుల పండువగా పోలీసు దళాల గౌరవ వందనం... అక్కడ పాతికేళ్ల ఓ మహిళా ఐ.పి.ఎస్. అధికారిణి సారథ్యంలో ఢిల్లీ పోలీసు దళం కనులపండువగా జరిపిన కవాతుకు అభినందనల వర్షం కురిసింది. అతిథిగా హాజరైన అప్పటి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి ఆ పాతికేళ్ల యువ నాయకురాలి సారథ్యానికి అబ్బురపడి స్వయంగా మెచ్చుకోవటమే కాకుండా, మరుసటి ఉదయం అల్పాహారానికి ఆహ్వానించారు. అంతటి గౌరవాభినందనలు అందుకున్న ఆ మహిళామణి, భారతదేశంలోనే ప్రప్రథమ ఐ.పి.ఎస్. అధికారిణి కిరణ్‌బేడి. మనదేశంలో పోలీసువృత్తికే ప్రతిష్ఠ తెచ్చిన ఉత్తమ ఉన్నత ఉద్యోగిని ఆమె. ప్రస్తుతం ఐక్యరాజ్యసమితి రక్షణ విభాగంలో కీలకపదవి నిర్వహిస్తున్న కిరణ్ జీవితం యువతులకే కాదు... ఈతరానికే ఆదర్శం. కాని తనను వెన్నంటి నడిపించింది మాత్రం స్వామి వివేకానంద సాహిత్యమని సగర్వంగా స్మరించుకుంటారు కిరణ్‌బేడి...

## ఇనుప కండరాలు... వజ్రసంకల్పం...

అల్పలక్ష్యాలు, అడ్డదారులు జీవితాన్ని నుసనం చేయవంటారామె. ముఖ్యంగా యువప్రాయంలో శరీరమే కాదు, మనసూ దృఢంగా ఉండాలని... ఇనుపకండరాలు, ఉక్కునరాలతో ఎదిగిన మనిషికే వజ్రసంకల్పం సాధ్యపడుతుందన్న స్వామీజీ మాటలే ఆచరణీయమని కిరణ్ భావిస్తారు. అందుకే ఆమె ఒక్క క్షణాన్ని కూడా వృథా చేసేవారు కాదు. కాలేజీ రోజుల్లో కూడా స్నేహితులతో పిచ్చాపాటి కబుర్లు చెప్పటం, సరదాగా తిరగటం ఆమెకు నచ్చేది కాదు. ఏ కాస్త సమయం దొరికినా పెయింటింగ్ వేసుకోవటమో, టెన్నిస్ బ్యాట్ పట్టుకొని క్రీడాస్థలికి పరుగెత్తటమో పనిగా పెట్టు కునేవారట.

వ్యాపకంగా ఓ మంచి అభిరుచి, వ్యాయామాన్ని పెంచే ఆట యువతీయువకులు ఉత్తమంగా ఎదిగేందుకు తోడ్పడతాయంటారు కిరణ్‌బేడి. అలా సాధన చేసి ఆమె కాలేజీ రోజుల్లోనే టెన్నిస్‌లో జాతీయ, అంతర్జాతీయ ఛాంపియన్‌గా నిలిచారు. అదే విధంగా ఎన్.సి.సి., ఎన్.ఎస్.ఎస్. వంటివి దేశభక్తిని పెంపొంది స్తాయని, బాధ్యతాయుతమైన పౌరులుగా మలచుతాయని నమ్మి ఆచరించారు.

## త్యాగాలూ తప్పవు...

మన దేహాన్ని కానీ మనసును కానీ బలహీనపరిచే ఎంతటి కోరికనైనా నిర్ద్వంద్వంగా త్యాగం చేయాలన్న వివేకానంద మాటలు శిరోధార్య మంటారు ఆ ధీరవనిత.

'...అందుకే చదువుకునే రోజుల్లో అందరూ పరుగెత్తే ఆశల బాటవైపు చూపు కూడా సారించక పోయేదాన్ని. మహోన్నత లక్ష్యాలు పెట్టుకున్నప్పుడు స్వల్పసుఖాల్ని త్యజించకతప్పదు. భవిష్యత్తులో భగవంతుడిచ్చే మణుల్లాంటి బహుమతుల కోసం ముందు మిణుగురుల్లాంటి సరదాలని విస్మరించటమే ధర్మం...' అనుకుంటూ నిరంతరం శ్రమించారు. నిఖార్సయిన పోలీసు అధికారిగా పేరు తెచ్చుకున్నారు. చివరికి వ్యక్తిగతమైన ఆడంబరాలు, ఆర్భాటాలు కూడదంటారు. తన పెళ్లితంతును కూడా వేడుకలకు దూరంగా దండలు మార్చుకొని 'మమ' అనిపించారు.



### నిజాయతీకి నిలువుటద్దం...

నిజాయతీ, ఓర్పు, ప్రేమ... మన అస్త్రశస్త్రాలైనప్పుడు ఈ ప్రపంచంలో ఏ శక్తీ మనను అడ్డుకోలేదు అన్న స్వామీజీ మాటలు అక్షరాలా ఆచరణలో చూపారు కిరణ్. ప్రలోభాలకు, పక్కదారులకు మారుపేరుగా మారిన పోలీసువృత్తిలో మచ్చలేని మణిపూసగా వెలిగారు. 'ప్రజాసేవకు పోలీసువృత్తినే మాధ్యమంగా ఎన్నుకున్నాను. ముందు ఎందరో నిరుత్సాహ పరిచారు. ఆడపిల్లకి సరిపడని వృత్తి అని నీరుగార్చ ప్రయత్నించారు. కాని ఈ ప్రపంచంలో మనకంటూ ఓ చరిత్ర మిగలాలంటే మన లక్ష్యం వైపు నిజాయతీగా,నిర్భయంగా నడవాలని ఆ రోజే నిర్ణయించు కున్నాను. అనుకున్నది సాధించాను.' అని గుర్తుచేసుకుంటారు. తన చిరకాల స్వప్నం సాకారమై ఐ.పి.ఎస్. అధికారిగా ఎదిగినా నిజాయతీనే తన చిరునామాగా చేసుకున్నారు కిరణ్.

### ఏటికి ఎదురీత...

ఎక్కడెక్కడ పోరాటం, తిరుగుబాటు ఉద్భవిస్తాయో అక్కడే జీవముంది... సత్యముంది... చైతన్యముంది. ప్రతీ గొప్పకార్యం అవహేళన, ప్రతిఘటన... ఆ తరువాత అంగీకారం అనే మూడు మజిలీల గుండా సాగిపోతుంది... అన్న స్వామి వివేకానంద వచనాలు ఆ స్త్రీమూర్తికి స్ఫూర్తికిరణాలయ్యాయి. అందుకే వృత్తిలో తను ప్రవేశపెట్టిన సంస్కరణలకు, ప్రయోగాలకు తొలుత అడ్డంకులే ఎదురైనా మొక్కవోని దీక్షతో ముందుకు సాగారు. ఆమె సామర్థ్యం, సాహసప్రయోగాలు సహించలేని సహ అధికారులు వృత్తిరీత్యా కక్షసాధింపు చర్యలకు పాల్పడ్డారు. పోలీసుశాఖలో ప్రాధాన్యం లేని ట్రాఫిక్ వంటి విభాగాలకు బదిలీ చేయించారు. కాని పనిని బట్టి తనకు కాదు తన వల్ల పనికి గౌరవం రావాలని నమ్మారు. అక్కడా తన ప్రత్యేకతను చాటుకున్నారు.

# . సాహసం...

- బి.సైదులు



# సంస్కరణల 'ధ్యానం'...

'లేవండి... మేల్కొనండి... గమ్యం చేరేంతవరకు విశ్రమించకండి'... అన్న స్వామీజీ ధీరవచనాలు ఆ ధీశాలిని నిరంతరం నీడలా తోడుండి నడిపించాయి. ఆమె ఉత్సాహాన్ని ఎలాగైనా నీరుగార్చాలని ఏ మాత్రం ప్రాముఖ్యం లేని తీహారు జైలు అధికారిణిగా బదిలీ చేశారు ఉన్నతాధికారులు. దాదాపు తొమ్మిదివేల మంది కరుడుగట్టిన ఖైదీలు కిక్కిరిసిన ఆ జైలు సకల దుర్గుణాల కూపం. ఖైదీలతో జైలు సిబ్బంది కుమ్మక్కై పరిస్థితిని మరింత భ్రష్టు పట్టించిన చరిత్ర ఆ కారాగారానిది. అయినా కిరణ్ ఆత్మవిశ్వాసం కించిత్తయినా సడలలేదు. తన సామర్థ్యానికి దానిని ఒక సవాలుగా స్వీకరించారు. సంస్కరణలకు శ్రీకారం చుట్టారు. తెల్లవారు ఝామునే ఆమె పనిగంటలు ప్రారంభమయ్యేవి. సహనంతో...సానుభూతితో మార్పు కోసం ఆమె పడుతున్న తపన చూసి ఖైదీలే కరిగిపోయారు. ఆమెకు సహకరించారు. చివరికి వారి మానసికి పరివర్తనకు ఆరంభించిన 'ధ్యాన' తరగతులకు కూడా పోటీపడి మరీ హాజరయ్యేవారు ఖైదీలు. అందులో భాగంగానే తీహారు జైలులో రామకృష్ణమఠం వంటి ఆధ్యాత్మిక సంస్థల ప్రతినిధులచే అభిభాషణ కార్యక్రమాలు నిర్వహించేవారు. దేశ,విదేశాల్లో తన పనితీరుకు ప్రతిఫలంగా లభించిన అవార్డుల సొమ్మును కూడా ఖైదీల సంక్షేమానికే వినియోగించేవారు కిరణ్‌బేడి. అందుకే ఆమెకు 1994లో ఆసియా నోబుల్ బహుమతిగా భావించే రామన్‌మేగసెసె అవార్డు బహూకరించిన సమయాన్ని తీహారు జైలు ఖైదీలు పండుగలా చేసుకొని పరవశించారు.

ఈ ప్రపంచంలో మన ఘనత మూన్నాళ్ల ముచ్చటే. సంపదలు, కీర్తిప్రతిష్ఠలు... నశించిపోయేవే. పరుల కోసం జీవించేవారే మనుషులు మిగిలినవారంతా జీవన్మృతులు... అన్న ఆ మహనీయుని మాటలే ఆ మహిళామూర్తికి మార్గదర్శకాలుగా నిలిచాయి. అందుకే ప్రజాసేవను వృత్తిగానే కాకుండా ప్రవృత్తిగానూ చేసుకున్నారు. తన ఆదాయంలో చాలా భాగాన్ని సంఘసేవకే వెచ్చిస్తున్నారు. ఇలా తన జీవితాన్ని వృత్తిరీత్యానే కాకుండా అభిరుచిగా కూడా అట్టడుగు జనసంక్షేమానికే సమిధిలా అర్పిస్తున్నారు కిరణ్‌బేడి. స్వామి వివేకానంద అమృతవాక్కుల్ని ఆచరణలో చేసిచూపెడుతున్న ఈ సహన, సాహసశీలి ఈతరానికి నిత్యస్మరణీయురాలు.



# సూర్యచంద్రులు ఆదర్శమూర్తులు

– డా॥ సంధ్యావందనం లక్ష్మీదేవి

**ఓం స్వస్తి పంథా మనుచరేమ సూర్యాచంద్ర మసావివ।
పునర్ద దతా ఘ్నతా జానతా సంగమే మహి ॥** *(ఋగ్వేదం, 5-51-15)*

మానవులంతా సూర్య చంద్రుల్ని ఆదర్శంగా తీసుకొని ఉన్నత మార్గంలో నడవాలని ఈ వేదమంత్రం చెబుతోంది.

ఈ సృష్టిలో అనేక రకాల ప్రాణులున్నాయి. అవి పరస్పరం ఒకదాని కొకటి సహకరించు కుంటాయి. అలాగే మానవులు కూడా ఒకరికొకరు సహకారం చేసుకోవాలని దీని అభిప్రాయం. లోకంలో జడ, చేతన పదార్థాలలో ఏదో ఒక విశేష గుణం ఉంటుంది. అలాగే ప్రత్యక్ష దేవతలైన సూర్య చంద్రుల్లో మానవులకు మార్గ దర్శనం చేసే విశిష్ట నియమాలు న్నాయి. మానవులంతా సహజంగా మంచి మార్గాన్నే ఎంచుకుంటారు. ఈ మంచి మార్గాన్నే వేదవిదులు 'స్వస్తి పంథా' అంటున్నారు.

మానవులు పొందాల్సిన ఉన్నతిని సూర్యచంద్రులతో పోలిస్తే ఈ వేద మంత్రంలో ఇతరులను ఆకర్షించే మూడు శుభ గుణాలున్నాయి. 1. దదతా 2. అఘ్నతా 3. జానతా.

'దదతా' అంటే దానగుణం. వేదాది ధర్మ శాస్త్రాలు, తత్త్వశాస్త్రాలు, ఉపనిషత్తులు, పురాణేతిహాసాలు, స్మృతి గ్రంథాలు మొదలైనవన్నీ ఈ దాన గుణాన్ని విశేషంగా వర్ణించాయి. దానమనేది ఒక విశిష్ట ఔదార్య లక్షణం. అందుకే దానగుణం గలవారే విశిష్టులని 'బృహదారణ్యక ఉపనిషత్తు' కీర్తిస్తుంది. సమస్త సంపదలనూ, రాజ్య భోగాలనూ తృణ ప్రాయంగా త్యజించిన మన్వాది మహర్షులు, చక్రవర్తులు మనకు గొప్ప దాతలుగా ఇతిహాసంలో కనిపిస్తారు.

'అఘ్నతా' అంటే అహింసను పాటించడం. **"అహింసా ప్రాతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః"** ***(యోగదర్శనం)***

అహింసను సిద్ధింపజేసుకున్న యోగి సమక్షంలో జాతి వైరమున్న జంతువులు కూడా పరస్పరం విరోధ భావం లేకుండా స్నేహంగా కలసిమెలసి జీవిస్తాయి. పరమాత్మ సాక్షాత్కారానికి ఈ అహింసావ్రతం చాలా గొప్పదని ఎందరో మహాత్ములు సూచించారు.

'జానతా' అంటే ఇతరుల గురించి తెలుసుకోవడం, వారిని అర్థం చేసుకోవడం, స్పర్థలు, సమస్యలు రాకుండా చూసుకోవడం మొదలైనవి. ఒక బలమైన వ్యవస్థీ కృత సమాజాన్ని నిర్మించాలన్నా, ధర్మబద్ధమైన సంఘాన్ని ఏర్పాటు చేయాలన్నా పరస్పర అవగాహన, ఆత్మావ లోకనం అవసరం. అందుకే ధర్మ శాస్త్రాలన్నీ రాజులు, ప్రజలు సచ్చరితులూ, సత్ప్రవర్తనులూ కావా లని ఘోషిస్తున్నాయి. ఉప దేశకులు, నాయకులు శీలవంతులైతే ప్రజలు సజ్జను లవుతారు. అప్పుడే శక్తిమంత మైన సమాజ నిర్మాణం జరుగు తుంది.

లోకంలో మనుష్యుల మధ్య పరస్పర అవగాహన లేకపోవడంవల్ల, వారి దృష్టి కోణాలు వేరువేరుగా ఉన్నందు వల్ల ఎవరూ స్పష్టమైన అభిప్రాయానికి రాలేరు. ఆరుగురు అంధులు ఒక ఏనుగును చేతులతో తడిమిచూశారు. అందులో ఒకడు ఏనుగు చెవుల్ని మాత్రమే చేతులతో పట్టుకొని ఏనుగు విసనకర్రలా ఉందన్నాడు. రెండోవాడు ఏనుగు నాలుగు కాళ్ళనూ చేతులతో తడిమి, ఏనుగు పెద్ద స్తంభంలా ఉందన్నాడు. మూడోవాడు కేవలం తొండాన్ని మాత్రం పట్టు కొని ఏనుగు ఒక తాడులా ఉందన్నాడు.

ఇలా ఆరుగురూ తలా ఓ రకంగా చెప్పారు. వాస్తవంగా ఈ ఆరుగురు చెప్పిందీ కొంతవరకు సత్యమే. అయితే, వారి వారి దృష్టి కోణాలు వేరైనందు వల్ల వారు చెప్పే పద్ధతిలో తేడా వచ్చింది. ఒక్కో సందర్భంలో మన పరిస్థితి కూడా అంతే. ఎవరైనా విజ్ఞులు కలసి 'మీరంతా చెప్పేది ఒక్కటే' అని చెబితే మన భ్రమ తొలగిపోతుంది. అందువల్ల ఒకరినొకరు అర్థం చేసుకోవడం ఎంతైనా అవసరమనీ, దాని వల్ల పరస్పర అవగాహన పెరిగి ఒకరికొకరు దగ్గరవుతారనీ, వారిలో సత్య దృక్పథం ఏర్పడుతుందనీ ఈ 'జానతా' శబ్దం తెలియజేస్తుంది.

ఉత్తమ సమాజ నిర్మాణానికి 'దాన గుణం, అహింస, పరస్పర అవగాహన' – అనే ఈ మూడు సుగుణాలూ చాలా అవసరం. a

యువవాహిని

# సూత్రధారుల్ని సృష్టించే సృజనాత్మకత

– కె. శ్రీనివాస్

"భవనంలోకి ప్రవేశించగలిగి ఉండీ చాలా మంది ప్రజలు నేలమాళిగలోనే నివసిస్తున్నారు. ఎందుకంటే వారు తమ సామర్థ్యంలో కేవలం 10% మాత్రమే వినియోగించుకుంటున్నారు" అని అమెరికాకు చెందిన సుప్రసిద్ధ మనోవైజ్ఞానికుడు విలియం జేమ్స్ విశ్లేషిస్తారు. నిజమే మరి...!! సేకరించిన విషయాలను మోసే కూలీలుగానే మనం తీరికలేకుండా ఉన్నాం. విస్మయపరిచే మనలోని సామర్థ్యాన్ని విస్మరించాం. అదే సృజనాత్మకత... మనిషికి మాత్రమే ఉన్న సాటిలేని శక్తి...!! సృజనశక్తి ఉన్నవారు సరికొత్తగా ఆలోచిస్తూ సూత్రధారులుగా రూపుదాలుస్తారు. మార్పే మంత్రంగా యాంత్రికతను జయిస్తారు. ప్రతిరోజూ ప్రగతి వైపే పయనిస్తూ వెల్లువలా ప్రపంచాన్ని ముంచెత్తుతారు.

## సరికొత్తగా సృజించండి!

సృజనాత్మకత ప్రతి ఒక్కరి సొత్తు. తేడా అంతా దాన్ని వెలికితీయడంలోనే ! ఒక శాస్త్రవేత్త బెంజీన్ అనే పదార్థ అణు నిర్మాణాన్ని గురించి ఆలోచిస్తూ నిద్రలోకి జారుకున్నాడు. నిద్రలో రెండు పాములు– ఒక దాని తోకను మరొకటి మింగుతున్నట్లు కలగన్నాడు. వెంటనే మేల్కొని, బెంజీన్ అణువు వృత్తాకారంలో ఉంటుందని ప్రతిపాదించాడు... అత్యుత్తమ ఆలోచనలు ఆకాశం నుండి ఊడిపడవు. ఎప్పటినుండో అవి మనసు పొరల్లో నిక్షిప్తమై ఉన్నాయి. ఏకాగ్రతతో మస్తిష్కాన్ని మథిస్తే సరికొత్త ఆలోచనలు మెరుపులా స్ఫురిస్తాయి. కాబట్టి మనం చేయాల్సిందల్లా మానసిక శక్తుల్ని ఎలా తట్టిలేపాలో తెలుసుకోవడమే!

## అడ్డంకులు కావవి...అవకాశాలు..!!

అవసరమే ఆవిష్కరణలకు అమ్మ... అని మనందరికీ తెలుసు. "ఎంతగా సమస్యలు ఎదురైతే అంతగా మనలోని శక్తి వెలుగుచూస్తుందని" అంటారు స్వామి వివేకానంద. ఈ పోరాట పటిమ ఉన్నవాళ్ళే సమస్యల్ని చిత్తుచేస్తూ పై అంతస్థుకు చేరతారు. అందుకే ఏదైనా సమస్య ఎదురైతే మెదడుకు పదును పెట్టే పరిస్థితులు లెదురయ్యాయని ఎదురీదేందుకు సిద్ధంగా ఉండాలి. సవాళ్ళను స్వీకరించాలి. సాధించేందుకు సర్వశక్తులూ ధారబోయాలి. సమస్యను అన్ని కోణాలలో విశ్లేషించాలి. పని తక్కువ, ఫలితం ఎక్కువగా ఉండే పరిష్కారాన్ని పట్టుకోవాలి.

## ప్రయోగం చేసి.. ఫలితాల్ని చూసి..

కొత్త ఆలోచనను ఆచరణలో పెట్టడంలో ఎన్ని కష్టాలైనా ఓర్చుకోవడానికి సన్నద్ధం కావాలి. పట్టు విడవకుండా, ఉత్సాహం కోల్పోకుండా ఉండాలి. సృజించే శక్తి ఉన్న ఎంతో

## పొరపాట్లను పారేయండి...!!



ప్రిన్స్‌టన్ యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా వెళ్ళిన ఐన్‌స్టీన్‌కు ఆఫీస్ గదిని చూపేందుకు వచ్చిన వ్యక్తి ఇంకా వస్తువులేమైనా అవసరమా? అని అడిగాడు. "కొన్ని పెన్సిళ్ళు... తెల్ల కాగితాలు... ఒక పెద్ద చిత్తు కాగితాల బుట్ట కూడా..." అని ఐన్‌స్టీన్ సమాధానమిచ్చాడు. ఎందుకంటూ ఆ వ్యక్తి ఆశ్చర్యపోయాడు. "నా పొరపాట్లను పారవేయడానికి" అని తాపీగా చెప్పి తన పనిలో మునిగిపోయాడు ఐన్‌స్టీన్. అవును... కొత్త ఆలోచనల్ని ఆచరణలో పెడుతున్నప్పుడు దొర్లే పొరపాట్లను పట్టించుకోకండి! పాఠాల్ని పిండుకుని వాటిని పారవేయండి! పొరపాట్ల నుండి లాభాన్ని పొందేందుకు ప్రయత్నిస్తే అవే తప్పులు మనల్ని తీర్చిదిద్దుతాయి. భవిష్యత్తుకు బంగారు బాటలౌతాయి. ఓటమిని ఒప్పుకోవటమే నిజంగా ఓడిపోవడం. అందుకే పడినప్పుడల్లా లేచి పరిగెత్తండి. శాస్త్రవేత్తలందరూ తమ అపజయాలను విజయాలకు అపూర్వ అవకాశాలుగా పరిగణించారు, అనితరసాధ్యమైన అద్భుతాల్ని సాధించారు.

మంది వ్యక్తులు ఈ రెండు లక్షణాలు లేకపోవడం వల్లే విజేతలుగా ఎదగలేక ఒడిదుడుకుల్ని ఎదుర్కొంటూ బతుకు బండిని లాగుతుంటారు. విజయానికి కావలిసింది 10% ప్రేరణ 90% పరిశ్రమ అని ఆవిష్కరణల పితామహుడు ఎడిసన్ అంటారు. పట్టువదలకుండా పరిశ్రమించిన పట్టుమని పదినెలలు కూడా పాఠశాలకు వెళ్ళని ఎడిసన్ తన జీవిత కాలంలో 1093 వస్తువులను ఆవిష్కరించాడు. ఆయన చెప్పిన ఈ ప్రయోగం – పరాజయం (Trail & error) పద్ధతే సృజనాత్మకతను పెంచుకోవడానికి సులువైన సూత్రం.

పరిశీలన, ప్రయోగం, పోరాటం ఈ మూడూ సృజనశక్తిని పెంచే మూల మంత్రాలు. వీటితో అందరిలా కాక కొందరిలా కొత్తగా ఆలోచించడం ప్రారంభించండి. జీవితంలో పట్టుదలతో ప్రయోగం చేయండి. ప్రగతిని సాధించి విజేతలుగా వెలుగొందండి. `



## ఆలోచించండి..! అబ్బురపరచండి..!

ముద్దలు మూటగట్టే ఆ పిల్లవాడికి ఎంతో తెలివైన వాడని పేరు. ఒక రోజు చుట్టపు చూపుగా వాళ్ళింటికి వచ్చిన మామయ్య వాడికి వెండి, రాగి నాణాలను చూపించి ఒకటి తీసుకోమని చెప్పాడు. కొద్దిసేపు ఆలోచించి రాగినాణాన్నే తీసుకున్నాడు పిల్లవాడు. ఎంతచెప్పినా వినలేదు. పిల్లవాడి ఈ తెలివి తక్కువ తనం అందరికీ వినోదంగా మారింది. ఎంతో మంది పనిలేకపోయినా వచ్చి నాణాలను చూపించి పిల్లవాడు వెండి రూపాయిని వదలి, రాగి నాణాన్ని తీసుకుంటుంటే నవ్వుకునేవారు. ఒకరోజు ఏదో పని మీద వాళ్ళ ఇంటికి వచ్చిన చిన్నాన్న పిల్లవాణ్ణి దగ్గరకి తీసుకుని రెండు నాణాల్లో ఏది విలువైందో చెప్పసాగాడు. ఒక్కక్షణం ఆగమని చెప్పి పిల్లవాడు లోపలికి వెళ్ళి పెద్ద పెట్టెని తెచ్చి చిన్నాన్న ముందుంచాడు. ఆశ్చర్యం..! దాన్నిండా రాగి నాణాలు..!! "మొదటి రోజే నేను వెండి రూపాయిని తీసుకొనుంటే ఇంత డబ్బు ఎలా వచ్చేది చిన్నాన్నా?" అని వేలెడంత లేని ఆ బుడతడు అంటుంటే ఆశ్చర్యపోవడం ఆయన వంతయింది! అవును మరి...! అందకుండా ఆలోచించే వారెప్పుడూ అందరినీ మించే వారే! పసితనంలోనే తమ ఆలోచనలతో ప్రపంచాన్ని అబ్బురపరిచే వారి సంగతి అటుంచుదాం! చిన్న చిన్న సమస్యల్ని సొంతంగా పరిష్కరించేందుకు ప్రయత్నిస్తూ మెదడుకు పదును పెడదాం. బుద్ధికి బలాన్నిచ్చే వ్యాయామాలతో పాటు వీలైనంత విశ్రాంతి ఇవ్వటాన్ని అభ్యసించాలి. కొత్తగా ఆలోచించలేమని కుంగిపోకుండా ఇప్పటికే ఉన్న సృజనశక్తిని సానబెట్టండి!

## సృజనశక్తిని సాధించేందుకు...!

తమ ఊహలతో ప్రపంచాన్ని ఉర్రూతలూగించిన విజేతల అలవాట్లే సృజనాత్మకతను సాధించేందుకు మన ముందున్న సోపానాలు.



1. మస్తిష్కాన్ని నిరంతరం పుస్తకాలతో నింపుతూ మొద్దుబార్చకండి. విరామ సమయంలో వ్యాయామం చేస్తూ విశ్రాంతి పొందండి. ఆరోగ్యం, ఆనందం వ్యాయామంతో ఒనగూరే ఇతర లాభాలు.



2. మానవ శరీరంలో ఎక్కువగా ప్రాణవాయువు కావల్సింది మెదడుకే! కాబట్టి శ్వాసించడమెలాగో తెలుసుకోవాలి. కడుపులోకి గాలిని తీసుకుంటూ ఊపిరి తిత్తులను పూర్తిగా నింపే ప్రయత్నం చేయాలి. దీన్ని ఓపికతో చేస్తే ఒత్తిడి కూడా క్రమంగా కనుమరుగవుతుంది.



3. శ్రావ్యమైన సంగీతాన్ని శ్రద్ధగా వింటూ సేద తీరండి. గడబిడలతో గందరగోళంగా ఉండే పాశ్చాత్య సంగీతం వివిధ రకాల రుగ్మతలకు దారి తీస్తుందని వెల్లడైంది!



4. ఏకాంతంగా ఉంటూ ఒంటరితనంలో ఉండే ఆనందాన్ని అనుభవించే వారిలో నూతన ఆలోచనలు పురి విప్పుకుంటాయి. ఆ సమయంలో మానసిక శక్తులను తట్టిలేపే ఉత్తమ సాహిత్యంతో సహవాసం చేయాలి.



5. ఇనుము, యశదం (zink) లాంటి ధాతువులున్న పౌష్టికాహారాన్ని తీసుకోండి. ఖరీదు ఎక్కువని కంగారు పడనక్కరలేదు. ఎంతో వెల గల ఎన్నో పదార్థాల్లో పోషక విలువలు అధికంగా ఉండవన్న సంగతి గమనార్హం!



# రామకృష్ణ మిషన్




**5/475, ట్రంకు రోడ్డు, కడప – 516 001 (ఆంధ్ర ప్రదేశ్)**

ఫోను: 08562 – 241633, *E - mail: kadapa math@ yahoo.com; website: www.rkm-kadapa.org*


## విజ్ఞప్తి

**రా**యలసీమ ప్రాంతానికి చెందిన కడప పట్టణంలో రామకృష్ణ మిషన్ శాఖ 2005లో ప్రారంభమైంది. ఆధ్యాత్మిక, సాంఘిక, సేవా రంగాలలో సేవలందించడానికి కడప శివార్లలో శాటిలైట్ – టౌన్‌షిప్‌గా రూపుదిద్దుకుంటున్న సుందరమైన ప్రాంతంలో రాష్ట్ర ప్రభుత్వం రామకృష్ణ మిషన్‌కు పది ఎకరాల భూమిని కేటాయించింది. ఈ స్థలంలో క్రింద తెలిపిన కార్యక్రమాలతో ఆధ్యాత్మిక సేవా కేంద్రం అభివృద్ధికి రామకృష్ణ మిషన్ ఒక బృహత్తర ప్రణాళికను రూపొందించింది.




1. **శ్రీరామకృష్ణుల విశ్వజనీన మందిరం**
2. **సాధు నివాస భవనం**
3. **కార్యాలయం, గ్రంథాలయం, పుస్తక విక్రయశాల**
4. **పాఠశాల భవనం** – పేద విద్యార్థులకు ఉత్తమ ప్రమాణాలతో విద్య నేర్పడానికీ, ఉన్నత పాఠశాలల విద్యార్థులకు ఉచితంగా ప్రత్యేక శిక్షణా తరగతులు నిర్వహించడానికీ ఈ పాఠశాల భవనం.
5. **ఉచిత హాస్టల్ భవనం:** ఉన్నత పాఠశాలలకు చెందిన పేద విద్యార్థుల బస కోసం ఈ ఉచిత హాస్టలు.
6. **ఆరోగ్య కేంద్రం:** హోమియో, ఆయుర్వేదం, ఫిజియోథెరపీ విభాగాలతో ఉచిత వైద్య సేవలందిస్తుంది.
7. **సభా ప్రాంగణం:** విద్యా సాంస్కృతిక కార్యకలాపాలు, ఉచిత మధ్యాహ్న భోజన వసతి నిర్వహించడానికి వీలుగా విశాలమైన భవనం.
8. **మానవ వనరుల అభివృద్ధి (హెచ్.ఆర్.డి) సంస్థ:** స్పోకెన్ ఇంగ్లీషు, కంప్యూటరు శిక్షణ, యోగా, విలువల ఆధారిత విద్యల శిక్షణ తరగతులను ఈ సంస్థ నిర్వహిస్తుంది.
9. **హెచ్.ఆర్.డి సంస్థ అతిథి బోధకులకు వసతి గృహం:** మానవ వనరుల అభివృద్ధి సంస్థ రెసిడెన్షియల్ కోర్సులో శిక్షణ పొందే విద్యార్థులకూ, అతిథి బోధకులకూ బస కోసం వసతి గృహం.
10. **గ్రామీణాభివృద్ధి సంస్థ:** గ్రామీణ యువకులకు తోటల పెంపకం, సాగునీటి యాజమాన్యం, గ్రామీణ ఆర్థికవ్యవస్థ, తేనెటీగల పెంపకం, పుట్టగొడుగుల పెంపకం, నీటి పంపుల మరమ్మత్తుల లాంటి అంశాల్లో శిక్షణ కోసం భవనం.

సహజ సుందరంగా శోభిల్లుతున్న ఆ పది ఎకరాల స్థలంలో ఇప్పటికే ఈ పని ప్రారంభమైందని హితులకూ, శ్రేయోభిలాషులకూ సంతోషంగా తెలియజేస్తున్నాం. దాదాపు 550 లక్షల రూపాయల అంచనాలతో ప్రారంభమైన ఈ ప్రజోపయోగమైన పనులకు ప్రతి ఒక్కరి నుంచీ ధన, వస్తు సహాయ, సహకారాలు అర్థిస్తున్నాం. విరాళాలను కృతజ్ఞతతో స్వీకరిస్తాం.

**'రామకృష్ణ మిషన్, కడప'** పేరిట చెక్కులు, డ్రాఫ్టుల రూపంలో విరాళాలను **'సెక్రటరీ, రామకృష్ణ మిషన్, 5/475, ట్రంకు రోడ్డు, కడప – 516 001'** అనే చిరునామాకు పంపవలసిందిగా కోరుతున్నాం. మీరిచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం మినహాయింపు ఉంది. పెద్ద మొత్తాలిచ్చే దాతల పేర్లు పాలరాతి మీద, ప్రత్యేక శిలా ఫలకాల మీద వ్రాయిస్తాం.

భగవత్సేవలో

**స్వామి ఆత్మవిదానంద**

కార్యదర్శి

# మహనీయుల జీవితాల్లో మధురఘట్టాలు

- ఆర్. కృష్ణ

## ఉపాధ్యాయుడినే మార్చిన ఉక్కుమనిషి

ఆ పాఠశాలలో ఆ ఒక్క ఉపాధ్యాయుడిదే రాజ్యం. తన తరగతిలో చదివే విద్యార్థులు తన దుకాణంలో అమ్మే పుస్తకాలే కొనాలన్నది అతని నిబంధన. అప్పటి వరకు ఆయన మాటే చెల్లేది... అదే విధానం కొనసాగేది. కాని ఒకసారి ఓ విద్యార్థి వేరే దుకాణంలో పుస్తకాలు కొనుక్కుని క్లాసులో అడుగుపెట్టాడు. ఆ విషయం ఆ ఉపాధ్యాయుడికి తెలిసి అగ్గిమీద గుగ్గిల మయ్యాడు. అందరి ముందు ఆ బాలుణ్ణి నిలదీశాడు. 'ఏం! నా మాట కూడా లెక్కచేయకుండా పుస్తకాలు వేరే దుకాణంలో కొంటావా? ఎంత ధైర్యం నీకు!' అంటూ గద్దించాడు. ఆ విద్యార్థి ఇసుమంతైనా తొణకకుండా 'అవును మాష్టారు! మీ పాఠాలు వినకపోతే భయపడాలి కానీ, పుస్తకాలు మీ దుకాణంలో కొనకపోతే కాదు కదా! అయినా పాఠాలు చెప్పాల్సిన మీరు వ్యాపారం చేయటం పద్ధతేనా?' అంటూ ఎదురు ప్రశ్నించాడు. ఉపాధ్యాయుడి వైఖరికి నిరసనగా తరగతి లోంచి వెళ్లిపోయాడు. ఆ మరునాడు అతడే కాదు, ఆ తరగతి విద్యార్థులెవరూ హాజరుకాలేదు. తరగతిని సామూహికంగా బహిష్కరించారు. ఆ తరువాత పెద్దల జోక్యంతో విద్యార్థులు దిగివచ్చారు. ఉపాధ్యాయుడు తన నిరంకుశ ధోరణికి సిగ్గుపడ్డాడు. తప్పు దిద్దుకున్నాడు. తన పద్ధతిని మార్చిన ఆ విద్యార్థిని అభినందిస్తూ అక్కున చేర్చుకున్నాడు. నిర్భీతితో గురువునే ప్రశ్నించిన ఆ విద్యార్థి ఎదిగి భారతజాతికి మహోన్నత నాయకుడయ్యాడు. అతడే ఉక్కుమనిషి సర్దార్ వల్లభాయ్ పటేల్. స్వాతంత్ర్యోద్యమంలో ఉత్సాహంగా పాల్గొనటమే కాకుండా, దేశంలో చెల్లాచెదురుగా ఉన్న 565 సంస్థానాలను ఒక్కతాటిపైకి తెచ్చాడు. భరతభూమిలో విలీనం చేశారు. ఆయన ధైర్యసాహసాలకు మెచ్చి జాతిపిత మహాత్మాగాంధీయే ఆయనను సర్దార్(సేనాపతి) అన్న పిలుపుతో ఆలింగనం చేసుకున్నారు.

## నాన్న నేర్పిన నిజాయతీ

అవి స్వాతంత్ర్యం సిద్ధించిన మొదటిరోజులు. పంచాయితీ బోర్డు ఎన్నికల్లో జైనులబ్దీన్ రామేశ్వరం పంచాయితీ ప్రెసిడెంటుగా ఎన్నికయ్యారు. కులమతాల ఆధారంగా కాక కేవలం ఉత్తమ ఆశయాలున్న ఆదర్శవంతమైన వ్యక్తిగా ప్రజల చేత ఆయన ఎన్నికయ్యారు. అదే రోజు సాయంత్రం ఆయన కుమారుడు కిరసనాయిలు దీపం వెలుగులో ఇంట్లో చదువుకుంటున్నాడు. ఎవరో అపరిచిత వ్యక్తి తలుపు తీసుకుని లోపలికి వచ్చాడు. "ప్రెసిడెంట్‌గా ఎన్నికైన నాన్నగారికి శుభాకాంక్షలు చెబుదామని వచ్చాను. నాన్న ఎక్కడ" అని ప్రశ్నించాడు. నాన్న ఇంట్లోలేడనీ, అమ్మ ప్రార్థనలో ఉందనీ పిల్లవాడు అతడికి చెప్పాడు. వచ్చిన తరువాత నాన్న గారికి ఇవ్వమని చెప్పి ఆ వ్యక్తి చక్కగా అలంకరించిన బహుమతిని ఆ బాలుడి చేతిలో ఉంచాడు. మళ్ళీ కలుస్తానని వెళుతున్న ఆ వ్యక్తికి వీడ్కోలు చెప్పి పిల్లవాడు బహుమతిని మంచం మీద ఉంచి చదువుకోవటంలో మునిగిపోయాడు. తండ్రి రాగానే మంచం మీద ఉంచిన బహుమతిని చూసి "ఏమిటిది? ఎవరిచ్చారు?" అని అడిగాడు. ఎవరో ఒక పెద్ద మనిషి ఇచ్చి వెళ్ళాడంటూ పిల్లవాడు బదులిచ్చాడు. తండ్రి పెట్టెను తెరచి చూశాడు. అందులో ఒక ఖరీదైన పంచె, శాలువా, పళ్ళు, ఒక చీటీ, తీపి పదార్థాలున్నాయి. ఆయన పట్టరాని కోపంతో కొడుకును కొట్టడం ప్రారంభించాడు. ఆ అరుపులు విని తల్లి లోపలినుండి వచ్చి పిల్లవాణ్ణి కొట్టవద్దని వేడుకుంది. శాంతించిన తండ్రి "భగవంతుడు మనకొక పదివిచ్చాడంటే, మన అవసరాలన్నీ ఆయనే సమకూరుస్తాడు. అంత కన్నా ఎక్కువ ఆశిస్తే అది అన్యాయమౌతుంది" అని వివరించాడు. కొడుకును దగ్గరకి తీసుకొని "ఎవరైనా మనకు ఏదైనా కానుక ఇస్తున్నారంటే దాని వెనక ఏదో ఉద్దేశం ఉండే ఉంటుంది. మన నుండి ఏదో ఆశిస్తున్నారన్నమాట. అందువల్ల కానుకలు పుచ్చుకోవడం తప్పు" అని చెప్పాడు. తండ్రి తనను కొట్టినందుకు పిల్లవాడు బాధపడలేదు. కోపం పెంచుకోలేదు అంతకుమించి ఎంతో విలువైన గుణపాఠం నేర్చుకున్నట్లు సంబరపడ్డాడు. ఆ చిన్నారే తదనంతరం భారత రాష్ట్రపతిగా ఎదిగిన అబ్దుల్ కలామ్.






-స్వామి పరిజ్ఞేయానంద

కుసుమ, హైదరాబాద్.

ప్రశ్న : ఆదర్శాలకు కట్టుబడి ఉండటం వల్ల నలుగురితో కలసి పనిచేసేటప్పుడు అశాంతే మిగులుతుంది. అలాంటప్పుడు ఆదర్శాలను కలిగి ఉండటం సబబేనా?

జవాబు : ఆదర్శాల్ని ఎంతవరకు ఆచరిస్తున్నామో మనం ముందు ఆలోచించాలి. ఆదర్శాలు వేరెవరో పాటించడం లేదని ఆలోచిస్తే మనకు మిగిలేది అశాంతియే! ఆదర్శాలు ఉండటం సబబా కాదా అనే ప్రశ్నకు స్వామి వివేకానంద చెప్పిన సమాధానం వినండి If a man with an ideal makes a thousand mistakes, I am sure that the man without an ideal makes fifty thousand. Therefore, it is better to have an ideal.

సభ్యతాసంస్కారాలకు అసలైన పరీక్ష అసభ్యతను భరించటమే అని ఒక మహాత్ముడు అన్నాడు. అదే విధంగా మీరు ఉన్నత ఆదర్శాలున్న వారైతే అవి లేనివారిని క్షమించగలగాలి. మహాత్ములు తాము ఎంతవరకు ఆదర్శజీవితాన్ని గడుపుతున్నామన్నదే ఆలోచిస్తారు. కాబట్టి అలాంటి మహాత్ముల జీవితం ఎంతో మందికి స్ఫూర్తిదాయకం అవుతుంది. ఆ బాటలో పయనిస్తే మనకూ మనశ్శాంతి తప్పక లభిస్తుంది.

డి.వి. దుర్గాభవాని, హైదరాబాద్.

ప్రశ్న: నిరాశ అలుముకున్నప్పుడు ఆశావాదంతో ఆలోచించమంటారు. అది ఎలా సాధ్యం?

జవాబు: మానవ జన్మనెత్తిన ప్రతి మనిషికీ అది సాధ్యం. "If I am in the dark , let me light a lamp " అంటారు స్వామి వివేకానంద. మనిషి చీకటిలో ఉన్నప్పుడు వెలుతురు కోసం ఎలా ఆరాటపడతాడో అలాగే నిరాశతో ఉన్న వ్యక్తి తృప్తి, ఆనందాల కోసం తపిస్తాడు. అది మానవ సహజం. అపజయాలు ఎదురైతే కారణాల్ని అన్వేషించాలి. సమస్యల్ని విశ్లేషించి, వాటిని సాధించేందుకు సర్వశక్తులా ప్రయత్నించాలి. ఆశావాదానికి ఆచరణాత్మక రూపం ఇదే. కష్టాలను కడతేర్చేందుకు అందివచ్చిన ఏ చిన్న అవకాశాన్నైనా ఉపయోగించుకోవడానికి సిద్ధంగా ఉండాలి. ఏ పరిస్థితిలోనైనా ఉత్సాహాన్ని కోల్పోకూడదు. కష్టాలెదురైతే మనం నిరాశతో నీరుగారి పోకూడదు. ఎందుకంటే అప్పుడు ప్రపంచంలోని ప్రతి విషయం ప్రతికూలంగానే కనబడుతుంది. కళ్ళముందే సమస్యకు పరిష్కారాలు కనిపిస్తున్నా వాటిని అర్థం చేసుకోలేని అంధులమౌతాం. జీవితం సుఖదుఃఖాల మిశ్రమమని గ్రహిస్తే, కష్టం వచ్చినా నిరాశ మనల్ని తాకలేదు.

All the strength and succour you want is within yourselves. Therefore make your own future... Plod on through the dark,brave heart, with all thy might... ఇలా ఉత్తేజకరమైన స్వామి వివేకానంద బోధల్ని చదవండి. నిరాశ మీలోంచి పటాపంచలౌతుంది.

కృష్ణవేణి, హైదరాబాద్

ప్రశ్న: నేను నిద్రలో ఎక్కువగా కలవరిస్తానట నా స్నేహితులు చెబుతారు. నాకు మాత్రం ఏమి కలగన్నానో గుర్తుండదు. నేనేం చేయాలి?

జవాబు: మేల్కొని ఉన్నప్పుడు గుర్తున్న విషయాలతోనే చాలా మంది సతమతమవుతుంటే, మీరు కలలోని విషయాలు గుర్తుండటంలేదని బాధపడతారెందుకు? ఒక విధంగా అది మీకో వరం అనుకోండి. మేల్కొని ఉన్నప్పుడు మాట్లాడటాన్ని అదుపుచేస్తే నిద్రలో కలవరించడం బహుశా తగ్గిపోవచ్చు! జాగ్రతావస్థలో ఆలోచనల్ని నిగ్రహిస్తే కలలను సైతం నిగ్రహించవచ్చు! ప్రయత్నించండి. b


మీ సమస్యలు పంపాల్సిన చిరునామా:

యువవాణి

శ్రీరామకృష్ణప్రభ, రామకృష్ణమఠం,
దోమల్‌గూడ, హైదరాబాద్-500 029

E- mail : rkprabhayuvavani@gmail.com

# మనసు మర్మం

– శ్రీరామ్

మనసును అదుపుచేయాలనుకునే వారు తెలుసుకోవాల్సిన కొన్ని విషయాలు.

1. మనసంటే ఏమిటి?
2. మనసెక్కడుంది?
3. మనసెలా ఉంటుంది?

పై ప్రశ్నలకు సమాధానాలను సంపాదించే ముందుగా సులభమైన మరో సమస్యను పరిష్కరించే ప్రయత్నం చేద్దాం.

మంచుముక్కలో నీరెక్కడుంది?

నీరు ఘనీభవిస్తే దాని స్థితిలో మార్పు సంభవించి మంచుగా మారుతుంది. నీరు, మంచు వేరు కాదనే ప్రాథమిక పరిజ్ఞానమే పై ప్రశ్నకు సరైన సమాధానం.



అదేవిధంగా మనసు, శరీరం వేరు వేరు పదార్థాలు కావు. మనసుకు స్థూల రూపమే శరీరం. శరీరానికి సూక్ష్మరూపమే మనసు. ఒకదానిపై ఒకటి ఆధారపడి పనిచేసే మనశ్శరీరాలు ప్రాణ శక్తికి రెండు ప్రతిరూపాలు. అందువల్ల శరీరాన్ని విడిచి మనసునూ, మనసును విడిచి శరీరాన్ని వర్ణించటం సాధ్యం కాదు.

**ప్రాణం - పదార్థం :** నామ రూపాలు లేని ప్రాణశక్తి మనసు ముఖ్య లక్షణం. నామ రూపాలుండీ, ప్రాణంలేని జడపదార్థమే శరీరం. శరీరానికి ఉన్న అన్ని లక్షణాలను మనసు ఆరోపించుకుంటుంది. మనసుకున్న చేతనా శక్తిని జడమైన శరీరం పొంది సచేతనం అవుతుంది. ఈ విధంగా మనసు, శరీరం విడదీయరాని సంబంధాన్ని కలిగి ఉన్నాయి. అందుకే శరీరాన్ని పీడించే వ్యాధులు మానసిక అశాంతినీ, మానసిక రుగ్మతలు శారీరక అనారోగ్యానికి కారణం అవుతాయి.

## మనసును మథించే ముందు...

మనసును అదుపు చేసే ముందుగా నడవడికను నియంత్రించుకోమనటం చాలా మందికి చేదుగా అనిపించే విషయం. బురదనీళ్ళతో నింపిన పాత్ర ఒకటుందని ఊహించుకుందాం! పాత్ర నిరంతరం కంపిస్తూఉంది. నీరు అలలతో అలజడిగా ఉంది. కల్లోలంగా ఉన్న నీరు పాత్ర కదలికను, కంపిస్తున్న పాత్ర నీటి నిశ్చలతను ప్రభావితం చేస్తున్నాయి. దీన్ని చక్కదిద్దడం ఎలా? నీటినే నేరుగా నిరోధించి శాంతిని స్థాపించగలమా? అందుకై మనం చేసే ప్రతి ప్రయత్నం అలలతో నిండిన నీటిని మరింత అల్లకల్లోల పరుస్తుంది. నీరు తేరుకొని శుభ్రం కాకుండా పాత్ర కదలికలు నిలువరిస్తాయి. ఈ సమస్యను సాధించేందుకున్న ఏకైక పరిష్కారం – పాత్రను స్థిరంగా ఉంచేందుకు ప్రయత్నించటమే! అప్పుడు నీరు క్రమంగా కుదురుకుని, అలలు మాయమై, నిర్మల మౌతుంది. పాత్ర కదలికల్ని ఆపే పనిలో మనం నీటిలోని అలజడిని సైతం అప్రయత్నంగానే అంతమొందిస్తాం! అంటే ప్రయత్నమేమో ఒకటే! ఫలితాలు మాత్రం రెండు! పాత్ర మన శరీరాన్నీ, బురదనీరు మలినమైన మనసునూ సూచిస్తాయని అనుకుంటే మనోనిగ్రహాన్ని ఎక్కడ మొదలుపెట్టాలో మనకు అర్థమవుతుంది.

మిగతా 35వ పేజీలో...

## విజయవంతంగా జీవించడం ఎలా ?

– స్వామి జగదాత్మానంద




అమెరికాలోని ఒక ప్రఖ్యాత మనస్తత్త్వ వేత్త,"జీవితం పట్ల మన వైఖరి మార్చుకోగలిగితే మన జీవితమే మారిపోతుంది" అని చెప్పాడు. కానీ మన వైఖరి మార్చుకొనేదెలా? మన చుట్టూ ఉన్న పరిసరాల స్వభావాన్ని, మన చుట్టూ ఉన్న మనుష్యుల స్వభావాన్ని, మన స్వభావాన్ని గురించి మనం తెలుసుకో గలిగినప్పుడు మన జీవితాలలో మార్పు కలుగుతుంది. ఈనాటి విజ్ఞానశాస్త్రం భౌతికప్రపంచంలో ఉన్న వందలాది విషయాల గురించి మనకు జ్ఞానాన్ని అందించగలదు కానీ అది జీవితం యొక్క ఉద్దేశ్యాన్ని, అర్థాన్ని తెలియచెప్పలేదు. ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ వ్రాసిన "ఔట్ ఆఫ్ మై లేటర్ ఇయర్స్" అన్న పుస్తకంలో, "విషయ పరిజ్ఞానం జీవితంలోని కొన్ని లక్ష్యాలను సాధించడానికి కావలసిన శక్తిమంతమైన సాధనాలను మనకు సమకూర్చగలదు కానీ జీవితపు పరమ గమ్యాన్నీ, దాన్ని సాధించాలనే కోరికనూ గురించిన పరిజ్ఞానం మరొక ఆధారం నుంచి రావాలి" అని చెప్పాడు. జీవిత లక్ష్యాలు ఏమిటి? అన్నిరకాల సుఖాలూ, విలాసాలనూ పొందడం, మంచి ఆహారపానీయాలు పొందడం, పిల్లలను పెంచి పెద్ద చేయడం – ఇవేనా జీవితపు లక్ష్యాలు? వీటిని మించినది ఏదీ లేదా?

నేనెవరిని? ఈ భూమి మీద ఎందుకున్నాను? ఇక్కడ నుంచి ఎక్కడకు వెళ్తాను? మరణమే అన్నింటికీ ముగింపా? మన దుఃఖాలకు, బాధలకు ఏమైనా అర్థం ఉందా? నాకూ నా తోటి వారికీ మధ్య సంబంధం ఏమిటి? ప్రకృతిలోని వివిధ శక్తులకీ నాకూ మధ్య ఏమైనా సంబంధం ఉందా? విశ్వాన్ని నియంత్రించే శక్తికీ నాకూ మధ్య ఏమైనా సంబంధం ఉందా? ఈ ప్రపంచంలో మనం చూసే వైవిధ్యానికి గల అర్థం ఏమిటి? ఇటువంటి ప్రశ్నలకు సమాధానాలు ఏవైతే ఉన్నాయో అవి మన జీవితానికి మార్గ నిర్దేశం చెయ్యాలి. లేనట్లైతే మన జీవితం పరిపూర్ణం కాదు. ఈ విషయంలో ప్రఖ్యాత తత్త్వవేత్త కేయిస్ అభిప్రాయాలు పూర్తిగా కొత్తవి కానప్పటికీ శాస్త్రీయ విశ్లేషణల వలన అవి జీవితం పట్ల కొత్త అర్థాలను స్ఫురింప చేస్తున్నాయి.

కేయిస్ చెప్పిన పై విషయాల ద్వారా జీవించడానికి కావలసిన నిర్దిష్టమైన ఆలోచనలు, ఆదర్శాలు లభిస్తాయి. తాత్త్విక వైఖరివలన భగవంతుడు, మనిషి వంటి వాటితో విశ్వానికి గల సంబంధం గురించి ఒక క్రమబద్ధమైన భావన ఇక్కడ గోచరిస్తుంది. విశ్వం, భగవంతుడు, ఆత్మ; వాటి మధ్యనున్న సంబంధం గురించి కలిగే అవగాహన వలననే మనిషి యొక్క స్వభావం, లక్షణాలు అలవడి మార్పు చెందడం జరుగుతుంది. దీని వలన ఈ విశ్వాన్ని సృష్టించే శక్తి, భగవంతుడే అని అంగీకరించగలం. కాబట్టి ఇది ధార్మిక వైఖరి. ఎందుకంటే దీనిలో కేవలం కంటికి కనిపించే దాని కన్నా, ఒక విశ్వజనీనమైన వైఖరితో అన్ని వాదాలనూ పరిష్కరించి నిశిత దృష్టితో ఆ పరమగమ్యాన్ని తెలుసుకొనే ప్రయత్నం చెయ్యగలం. అందుచేత ఇది ఒక తాత్త్విక వైఖరి. ఇది నిత్య జీవితంలోని సవాళ్ళనూ, సమస్యలనూ ఎదుర్కోవడానికి కావలసిన ఆచరణాత్మకమైన సూచనలను

ఇస్తుంది. కాబట్టి దీనిని మనం ఒక మనస్తత్త్వ శాస్త్ర సంబంధమైన పరిష్కారంగా కూడా చూడవచ్చు.

కేయిస్ తన రచనల్లో మళ్ళీ మళ్ళీ చెప్పినట్లు మాటలలో చెప్పలేనిదీ, మామూలు మనస్సుకు అర్థం కానిదీ, పవిత్రమైన మనస్సుతో సాక్షాత్కరించుకోగల ఒక అద్భుతశక్తి లేక సృష్టించే శక్తి ఒకటుంది.

అనువాదం– **అమిరపు నటరాజన్**

## ఆచరిస్తే... ఆనందం...



1. ఈ విశ్వాన్ని నియంత్రించే శక్తి ఒకటుంది.
2. ప్రతి ఆత్మ దివ్యమైందే.
3. జీవితానికి ఒక ప్రత్యేక అర్థం, ఉద్దేశం ఉన్నాయి.
4. మరణం అనేది జీవితానికి ముగింపు కాదు.
5. మానవ జీవితం కర్మ, పునర్జన్మ అనే నియమాలకు లోబడి పనిచేస్తుంది.
6. పవిత్రమైన, నిస్వార్థమైన ప్రేమ ఆ నియమాలకు పరిపూర్ణతను కలుగచేస్తుంది.
7. మనిషి ఏది కోరుకుంటే దాన్ని పొందగలడు. అతడి కోరిక, సంకల్పశక్తి అతడి లక్ష్యాన్ని రూపు దిద్దుతాయి. మన భవితని తీర్చదిద్దే శక్తి మన మనస్సుకి ఉంది. మన జీవిత సమస్యలన్నింటికీ సమాధానాలు మన దగ్గరే ఉన్నాయి.
8. మన జీవితానికి గల చివరి లక్ష్యం మనకూ భగవంతుడికీ మధ్య నున్న వాస్తవమూ, శాశ్వతమూ అయిన సంబంధాన్ని అర్థం చేసుకోవడమే.
9. జీవితంలో మీ ఆదర్శాలనూ, లక్ష్యాలనూ నియమంగా సూత్రీకరించుకోండి.
10. ఈ ఆదర్శాలనూ, లక్ష్యాలనూ అనుసరించడానికి మనం నిజాయతీగా పనిచెయ్యాలి.
11. చెడును వదలిపెట్టి ఉత్సాహంగానూ, చురుకుగానూ ఉండాలి.
12. సహనం అలవరచుకుని, మనం చేసే పనుల ఫలితాలను భగవంతుడికి వదలడాన్ని నేర్చుకోవాలి.
13. సమస్యలను తప్పించుకొనే ఉద్దేశాన్ని వదిలిపెట్టాలి. మంచి మాటలు, మంచి పనుల ద్వారా ఇతరుల హితవు కోసం మన మనస్సులో ఆలోచించాలి.

## వర్తమానమే బహుమానం...

మనశ్శరీరాలపై స్వాధీనత సాధించినప్పుడే ఆరోగ్యవంతమైన జీవితాన్ని కొనసాగించగలం. రాబోయే కాలాన్ని ఫలవంతం చేసుకోవాలంటే ముందు వర్తమానాన్ని ప్రణాళికాబద్ధంగా సవరించుకోవాలి. అస్తవ్యస్తమైన ఆలోచనల నుంచి బయటపడి మనసు నిలకడను అలవరచుకుంటే దైనందిన జీవితం ప్రశాంతంగా పయనిస్తుంది. మన ఆశలు, ఆశయాలు ఆందోళనలతో కాకుండా ప్రసన్న మానసికస్థితితోనే సుసాధ్యమవుతాయి. రూపులేని రేపటిపై విపరీత అంచనాలు పెంచుకోవటం మంచిది కాదు. వర్తమానాన్ని బహుమానంగా భావించి తీర్చిదిద్దుకుంటే భవిష్యత్తు దానంతట అదే బాగుపడుతుంది. అందుకే ఏ మంచి కార్యాన్నైనా రేపటికి వాయిదా వేయటం మాని వర్తమానంలోనే ఆచరించటం మేలు.



# రామకృష్ణ మఠం, ఇచ్ఛాపూర్

(బేలూరు మఠ శాఖాకేంద్రం)

పి.ఒ. మాయల్ - బందిపూర్, హుగ్లీ -712617, పశ్చిమ బెంగాల్





## విరాళాలకై విన్నపం

శశి మహరాజ్‌ను ఉద్దేశించి "మఠానికి శశి మూలస్తంభం లాంటివాడు. అతడు లేని మఠజీవితం ఊహించడమే అసాధ్యం" అన్నారు స్వామి వివేకానంద. శశి మహరాజ్ (స్వామి రామకృష్ణానంద) శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులు. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న రామకృష్ణమఠం, రామకృష్ణ మిషన్‌లను స్థాపించడంలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. శ్రీరామకృష్ణులు అనారోగ్యంతో ఉన్నపుడు శశి మహరాజ్ వారికి భక్తిశ్రద్ధలతో సపర్యలు చేశారు. శ్రీరామకృష్ణులు మహాసమాధి చెందాక కూడా వారి స్మృతి చిహ్నాల్ని శశి మహరాజ్ అంతే శ్రద్ధాభక్తులతో పూజించారు. అసమానమైన భక్తి ప్రపత్తులతో శశి మహరాజ్ ఆచరించిన పూజా విధానాన్నే నేడు రామకృష్ణ మఠ కేంద్రాలన్నిటిలో అనుసరిస్తున్నారు.

కలకత్తాకు 100 కి.మీ. దూరాన ఉన్న "ఇచ్ఛాపూర్" (హుగ్లీ జిల్లా) గ్రామంలో శశి మహరాజ్ జన్మించారు. స్థానిక భక్తులు కొన్ని సంవత్సరాల క్రితం శశిమహరాజ్ జన్మస్థలంలో ఒక రేకుల షెడ్‌లో తాత్కాలిక ప్రార్థనాలయాన్ని ప్రారంభించారు. అసంఖ్యాకమైన భక్తుల కోరికపై ఇక్కడ 21-08-1994న రామకృష్ణమఠ శాఖను ప్రారంభించారు.

12 లక్షల రూపాయల ఖర్చుతో శశిమహరాజ్ బంధువులకి పునరావాసం కల్పిస్తున్నాం. పేదలకు ఉచిత శిక్షణ తరగతులు నిర్వహిస్తున్నాం. ఉచిత సంచార వైద్యశాలను ప్రారంభించి, నిపుణులచే ఉచిత వైద్యసేవలు అందిస్తున్నాం. భక్తుల సౌకర్యార్థం శ్రీరామకృష్ణ విశ్వజనీన దేవాలయ నిర్మాణం చేపట్టాం. ఈ దేవాలయ నిర్మాణానికి సుమారు రూ. 93 లక్షలు వ్యయం కాగలదని అంచనా.

ఆలయం ఎత్తు - 65'
గర్భగుడి - 20' × 24'
ఆలయం చుట్టుకొలత - 80' × 56'
300 మంది భక్తులు కూర్చునేందుకు హాలు.



నిర్మాణంలోవున్న ఆలయం

భగవాన్ శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష సన్న్యాస శిష్యులు స్వామి తురీయానందజీ మహరాజ్ జన్మదినం-2003, జనవరి 17వ తేదీన రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు పూజ్య శ్రీస్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ వారిచే ఈ దేవాలయానికి శంకుస్థాపన జరిగింది.

సార్వజనీన దేవాలయ నిర్మాణానికి ఉదారులైన భక్తులు, శ్రేయోభిలాషులు, స్నేహితుల నుండి విరాళాల్ని కోరుతున్నాం.

విరాళాలను **Ramakrishna Math, Ichapur** పేరున చెక్కు లేదా డి.డి. తీసి **Ramakrishna Math, P.O. Mayal - Bandipur, Hooghly - 712617**కు పంపవలసిందిగా మనవి. అన్ని విరాళాలనూ కృతజ్ఞతతో స్వీకరిస్తాం.

మీరిచ్చే విరాళాలన్నింటికీ ఆదాయపుపన్ను చట్టంలోని సెక్షన్ 80G (vide memo No.DIT(E)/576/8E/40 69-70dt.08-08-2001) కింద పన్ను మినహాయింపు ఉంటుంది.

శ్రీరామకృష్ణులు, దివ్యజనని శ్రీ శారదామాత, స్వామి వివేకానంద, శశి మహరాజ్‌లు మిమ్మల్ని అనుగ్రహించాలని హృదయపూర్వకంగా ప్రార్థిస్తున్నాం.

భగవత్సేవలో
స్వామి నిర్లిప్తానంద
అధ్యక్షులు

పాడి పంటలతో దేశం సుభిక్షంగా ఉంది. దేశంలోని ప్రజల సమస్యలను పరిష్కరించే పాలకుడికి మాత్రం శాంతి కరువయింది. ఆయన్ని సతమత పెడుతున్న సమస్య – తన ఆకతాయి పిల్లవాణ్ణి అదుపులో పెట్టి బాధ్యత గల భావి యువరాజుగా తీర్చిదిద్దటం ఎలా...



అన్నదే! అదే సమయంలో మహాత్ముడైన ఒక సాధువు రాజ్యంలో విడిది చేసి ఎంతో మంది మనసుల్ని సమూలంగా మారుస్తున్నట్లు మహారాజుకు తెలిసింది. ఆయన తన సమస్యను

# పిల్లల ప్రేమను పొందేందుకు...

**- జి. సతీష్**

పరిష్కరించగలడని మంత్రులు చెప్పడంతో మహారాజు ఆలస్యంచేయకుండా సాధువును సందర్శించాడు. వినయంతో నమస్కరించి తన సమస్యను విన్నవించుకున్నాడు.

"మీ పిల్లవాడి మనసు మార్చగలను. ముందుగా మీరొక పని చేయాలి" సన్యాసి కంఠంలో మృదు గాంభీర్యం ధ్వనించింది. "ఆజ్ఞాపించండి మహాత్మా!" అత్రుతగా అన్నాడు మహారాజు. "మెలకువగా ఉన్న పులి మీసాల్ని మీరు స్వయంగా కత్తిరించి తీసుకురావాలి" అన్న సాధువు మాటల్ని విని రాజు తెల్లబోయాడు. "మనిషి మనసు మార్చటం కన్నా అసాధ్యమైందేమీ కాదు మహారాజా!" అంటూ సాధువు ప్రశాంతంగా లేచి పూజా మందిరంలోకి వెళ్ళిపోయాడు. తీవ్రంగా ఆలోచిస్తూ రాజు తన నివాసానికి తిరిగి వచ్చాడు.

రాజు మరునాడు సైన్యానికి శిక్షణ నిచ్చేందుకు ఖైదు చేసి పెంచుతున్న క్రూరమృగాలుండే ప్రదేశానికి వెళ్ళాడు. అక్కడ ఇనుప తలుపుల వెనక అసహనంగా తిరుగుతున్న పెద్దపులి ఆయన దృష్టిని ఆకర్షించింది. "ప్రభూ! ఆ పులి చాలా భయంకరమైంది. దూరంనుండే దానికి మాంసం విసురుతాను తప్ప ఇప్పటిదాకా దాన్ని సమీపించే సాహసం చేయలేదు" అని పక్కనే ఉన్న భటుడు హెచ్చరిస్తున్నా రాజు పట్టించుకోలేదు. సాధువు చెప్పిన మాటలు మదిలో మెదులుతుంటే, పాత్రలో మాంసం తీసుకుని ముందుకు కదిలాడు. తననే క్రూరంగా చూస్తున్న పులికి తానే స్వయంగా దూరం నుండి మాంసం విసిరాడు. ఈ విధంగా రెండు నెలలు గడిచాయి. పులి కళ్ళల్లోని క్రూరత్వం నెమ్మదిగా తగ్గుతున్నట్లు మహారాజు మనసుకు తోచింది.

మరుసటి రోజు పాత్రలోని మాంసాన్ని దూరం నుండి విసరకుండా పులిని సమీపించాడు. మొదట అనుమానంగా చూసిన పులి తరువాత తానే నెమ్మదిగా మాంసాన్ని తీసుకుని తినసాగింది. ఇలా చాలా రోజులు ఓపికగా ప్రయత్నించిన మహారాజు శ్రమ వృథా కాలేదు. పులి ఒకరోజు మాంసాన్ని తినటం ముగించి రాజు చేతిని కృతజ్ఞతతో నాకింది. అది తన పట్ల ఆప్యాయతను ప్రదర్శిస్తూందని ఆయనకు అనిపించింది.

మరునాడు మాంసాన్ని తినటం ముగించి తన చేతిని నాకుతున్న సమయంలో పులి తలను ప్రేమతో నిమిరాడు. తన శ్రద్ధకు పులి సంతోషించడం గమనించాడు. ఇలా మరో నెల రోజులు గడిచాయి. పులిని ఆప్యాయంగా నిమురుతూ, ప్రీతితో మాట్లాడటం మొదలు పెట్టాడు రాజు. పులి కూడా ఆయన పట్ల విశ్వాసాన్ని, ప్రేమను పెంచుకోసాగింది. ఒక రోజు పులి తల నిమురుతూ, ప్రేమగా పలకరిస్తూ చాకచక్యంగా చిన్న కత్తితో రెండు పులి మీసాల్ని కోసివేశాడు. పులి దాన్ని ఏ మాత్రం పట్టించు కోలేదు.

పట్టరాని సంతోషంతో రాజు తన అశ్వాన్నెక్కి సాధువు వద్దకు శరవేగంతో దౌడు తీయించాడు. ఆశ్రమాన్ని చేరి పులి మీసాలను మహాత్ముడి చేతిలో ఉంచాడు. సాధువు సంతోషించాడు కానీ పులి మీసాలను పక్కనే మండుతున్న మంటలో పడవేశాడు. ఆశ్చర్యచకితుడైన రాజు వంక ఆదరంతో చూశాడు. **(మిగతా... 40వ పేజీలో)**



(...29వ పేజీ తరువాయి)

## మనసు మర్మం



మనసంటే ఏమిటో మనం ఇప్పుడు వివరించవచ్చు.

1. మనసు బాహ్యశరీరానికి ప్రతిరూపమే. శరీరానికుండే రూపం, బాహ్య లక్షణాలన్నీ మనసుకు ఉంటాయి. కానీ అది రక్త మాంసాలతో నిర్మితమవలేదు. ప్రాణశక్తి అనే అత్యంత సూక్ష్మ ప్రకాశంతో మనసు నిండివుందని మనం ఊహించ వచ్చు.

2. మనసును నిగ్రహించడానికి మనకున్న మొదటి సాధనం శరీరమే!

**రాజయోగ రహస్యం :**

శరీరంతో మొదలుపెట్టి మనసును నిగ్రహించే మార్గానికే రాజయోగమని పేరు. దానిలో 8 భాగాలుంటాయి. అందుకే దీనికి అష్టాంగయోగమని పేరు. వాటిలో మొదటి మూడు- యమ నియమాలు, ఆసనం, ప్రాణాయామం- పూర్తిగా మనశ్శరీరాల కున్న అవినాభావ సంబంధంపైన ఆధారపడ్డవే. వీటిలో పూర్తి పోరాటం శరీరంతోనే. ఈ మూడు మెట్లను శరీరంపై కొంత విజయం సాధించిన తరువాత మనసుతో మనకు సంబంధం (Link) ఏర్పడు తుంది.

బుద్ధి సూక్ష్మమై మనసుతో పోరాడేందుకు సిద్ధమైన తరువాత ప్రత్యాహారం, ధారణ, ధ్యానం అనే మెట్లుంటాయి. వీటిలో మనసునే నేరుగా నిగ్రహించే ప్రయత్నం జరుగుతుంది. చివరగా మనసు స్వాధీనంలోకి వస్తుంది.

**నడవడికను నియంత్రించండి :**

శరీర నడతను నియంత్రించే నియమాలను పాటించ కుండా మనసునే నేరుగా అదుపుచేసే అభ్యాసాలు మేలు కన్నా ఎక్కువ కీడునే కలిగిస్తాయి. తీవ్రమైన తలనొప్పి, అసహనం చివరగా పిచ్చి పట్టడం లాంటి విపరిణామాల్ని ఎదుర్కోవలసి రావచ్చు. శరీరాన్ని నియంత్రించడంలో నిజానికి మనసును సైతం మనం అదుపుచేస్తున్నామన్న సంగతి మరచిపోకూడదు.

అందుకే మనసును అదుపు చేసే ముందు యమ నియమాల్లాంటి ప్రాథమిక విషయాలపై పట్టు సాధించడం ఎంతో అవసరం.

> ప్రస్తుతం మనం శరీరాన్నే 'నేను' అనుకుంటున్నాం! ఈ శరీరస్పృహ అధికంగా ఉన్నంతవరకూ ధ్యానం, ఏకాగ్రతలు సాధ్యం కావు. కాబట్టి ప్రస్తుతం మన పూర్తిపోరాటం శరీరంతోనే! **-స్వామి వివేకానంద**

...17వ పేజీ తరువాయి.

**9** మిత్రులిద్దరూ మధురకు వచ్చారు. పాండ్యరాజు నగరాన్ని చక్కగా అలంకరించి వారికి స్వాగతం పలికారు.




**10** చొక్కనాథా! కుబేరుడు కూడా నీ ఆనతికి కాచుకుని ఉన్నప్పుడు, నాలాంటి సామాన్యుని కూడా ఆదరించి నిన్ను దర్శించుకునే భాగ్యం కలిగించావు! మీ కృపాకటాక్షాన్ని ఏమని చెప్పను!



తర్వాత ముగ్గురు మహారాజులు పలు పుణ్యక్షేత్రాలు దర్శించారు. తరువాత కైలాసం వెళ్ళాలని సంకల్పించారు.

**11** మీరు భూలోకానికి వెళ్ళి నా ఆప్తుడు సుందరుణ్ణి ఐరావతం మీద ఎక్కించుకుని తీసుకురండి!



**12**



**13** సుందరుడు ఐరావతాన్నెక్కి ఆకాశంలో పయనించడం చూసి చెరమాన్ తన గుఱ్ఱం చెవిలో 'ఓం నమఃశివాయ' మంత్రాన్ని ఉచ్చరించాడు. ఆ గుఱ్ఱం వెంటనే ఆకాశానికి ఎగిరి ఐరావతాన్ని మూడుసార్లు ప్రదక్షిణ చేసింది.




**14** మహేశ్వరా ! చేరమాన్ నా మిత్రుడు. నాతోపాటు కైలాసం వచ్చాడు. ద్వారం దగ్గర వేచివున్న అతనిని అనుగ్రహించండి స్వామీ!



నన్ను స్తుతిస్తూ మైమరిచిన చేరమానుని తీసుకురండి.

**15**

దేవాధిదేవా! నేను సుందరునితో పాటు వచ్చాను. మీ పాద పద్మాల దర్శనం కోసం వేచి వున్నాను. అనుగ్రహించండి!



మీ ఇరువురి అచంచల భక్తి అశేష జనావళికి ఆదర్శప్రాయం.

పరమశివునికి జయం! జయం !!

చేతులు చరుస్తూ ఉదయం సాయంకాలం భగవత్సంకీర్తన చేయండి. మీ పాపాలూ, బాధలూ మిమ్మల్ని విడిచి పలాయనమవుతాయి. తెలిసో తెలియకో అమృతసరోవరంలో పడితే మానవుడు అమృతతుల్యుడౌతాడు. ఇష్టపూర్వకంగా కానీ సత్సాంగత్యంతోగానీ భగవత్సంకీర్తన చేసేవారు చివరకు భగవత్సన్నిధిని చేరుతారు.

– శ్రీరామకృష్ణ పరమహంస



# గ్రంథ పరిచయం

## వికాస తరంగాలు

**రచన: డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి,**
**పేజీలు: 148; వెల: రూ॥ 50/-** ($ 10)
**ప్రతులకు: నిశ్చింత ఛారిటబుల్ ట్రస్ట్, 29-1382 / 76, సమతానగర్, నేరెడ్ మెట్, హైదరాబాద్ - 500 056**




శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారు సమాజానికి ఉపయోగపడే అనేక విషయాల గురించి సందేశాత్మకమైన వ్యాసాలు వ్రాసారు. అవి వివిధ దిన పత్రికలలో ఆప్తవాక్యం, మంచి మాట, అంతర్యామి అనే శీర్షిక లతో ప్రచురితమయ్యాయి. వాటన్నిటినీ కూర్చి నిశ్చింత ఛారిటబుల్ ట్రస్ట్ వారు "వికాస తరంగాలు" పేరున పుస్తకం వెలువరించారు. చింతనాపరమైన ఈ వ్యాసాలు నేటి సమాజంలోని ప్రతి ఒక్కరికీ ఉపయుక్తమైన రీతిలో, చదివే వారికి సులభంగా అర్థమయ్యేటట్లు సరళంగా ఉన్నాయి.

- శ్రీమతి ఎన్. శేషు

## అయోధ్యాకాండ ( ప్రవాహినీ వ్యాఖ్య )

**వ్యాఖ్యాత: కాశీభొట్ల సత్యనారాయణ**
**పేజీలు: 222, వెల: రూ॥ 45/-**
**ప్రతులకు: శ్రీమతి కాశీభొట్ల లక్ష్మి, 2-7 ఎ - 12, శివాలయం దగ్గర, వెంకటనగర్, కాకినాడ.**




ఎందరో కవులు ఎన్నోవిధాలుగా రామాయణం వ్రాశారు. అన్ని భాషలలోకీ రామాయణాన్ని అనువదించారు. ఆదికవి వాల్మీకి రచించిన శ్రీమద్రామాయణమే కవులందరికీ ప్రాతిపదిక. నారదమహర్షి వాల్మీకిని "ఈ విశ్వం ఉన్నంత వరకూ నీవు రచించే రామాయణం నిలచి ఉంటుంది" అని ఆశీర్వదించాడు. ఈ రామాయణం ఒక తరగని నిధి. ఈ మహా కావ్యంలోని అయోధ్యా కాండకి రచయిత సరళ శైలిలో వ్యాఖ్యానం చేశారు. చదువరులను విశేషంగా ఆకట్టుకొంటుంది ఈ పుస్తకం అని చెప్పవచ్చు.

- శ్రీమతి ఎన్. శేషు



## శ్రీ రాధాకృష్ణ రామాయణం

**రచయిత : క్రమధాటి వెంకట రాధాకృష్ణ, వెల: రూ. 116, పేజీలు: 345, ప్రతులకు: కె.వి. రాధాకృష్ణ కె.వి. మాధవకుమార్, 207, విజయకృష్ణా రెసిడెన్సీ, 6వ ఫేజ్, కె.పి.హెచ్.బి. హైదరాబాద్.**

రామాయణం ఎన్నిసార్లు వ్రాసినా, మరెన్నిసార్లు చదివినా, నిత్యనూతనంగానే ఉంటుందని విశ్వనాథం వారి ఉవాచ. కథాక్రమానుసారం వచ్చిన రామాయణాలలో క్రమధాటి వారి కథనం మరో విశిష్ట రచన. రామాయణంలోని మూల శ్లోకాలకు యథాతథంగా కథానువాదం కాకుండా... మూలం లోని రహస్యాలను వెలువరిస్తూ వాల్మీకి రచనకు వ్యాఖ్యాన ప్రాయంగా రచన చేశారు రాధాకృష్ణగారు. రామ, రావణయుద్ధాన్ని మంచికి, చెడుకు, జ్ఞానానికి, అజ్ఞానానికి మధ్య నిరంతరం జరిగే సంఘర్షణగా వివరించడం ముదావహమైన విషయం. రామాయణ రహస్యాలను తెలియజేసే ఈ గ్రంథాన్ని జిజ్ఞాసువులైన పాఠకులు చదవాల్సింది.

- నాగ ప్రసాద్

## శ్రీకృష్ణలీలా బోధామృతము

**ఆంగ్లమూలం : శ్రీస్వామి శివానంద,**
**అనువాదం: డా॥ పన్నాల రాధాకృష్ణ శర్మ**
**పేజీలు: 269, వెల:రూ.65,**
**ప్రచురణ : దివ్య జీవన సంఘం, శివానంద నగరం పోస్టు, టెహ్రీ - గర్వాల్ -249192, ఉత్తరాంచల్.**




"మధురాధిపతే రఖిలం మధురమ్" పరమాత్ముడైన శ్రీ కృష్ణుని నామం,రూపం, బోధనలు మధుర మైనవే! మానవజాతి బంధ విముక్తి కొరకు,ముక్తి ప్రాప్తికొరకు, భగవానుడు బోధించిన గీత...గీతా బోధకు కార్యస్థానంగా... ధర్మా ధర్మములకు యుద్ధ నిలయముగా కురుక్షేత్రము నెన్నుకొనుట, బాల్యక్రీడలు, రాసక్రీడలు... ప్రతి అంశమూ ప్రత్యేకమైనదే. మూలానుకూలంగా సరళ సుందరంగా సాగిన అనువాద రచన పాఠకులను చదివించి, ఆలోచింపజేస్తుందనడంలో సందేహములేదు.

-నాగప్రసాద్

# వార్తావాహిని

## దక్షిణాఫ్రికాలో రామకృష్ణ మిషన్ శాఖ

శ్రీరామకృష్ణ - వివేకానంద బోధనల స్ఫూర్తితో స్వామి నిశ్చలానంద దక్షిణాఫ్రికాలోని డర్బన్‌లో రామకృష్ణ కేంద్రాన్ని 1943లో ప్రారంభించారు. ఈ కేంద్రానికి 2007 మార్చి 27 (పవిత్ర శ్రీరామనవమి)న రామకృష్ణ మఠం - మిషన్ శాఖా కేంద్రంగా గుర్తింపు నిచ్చారు. దక్షిణాఫ్రికాలో శ్రీరామకృష్ణ - వివేకానంద ఉద్యమ వ్యాప్తికి స్వామి నిశ్చలానంద (1925-1965) ముఖ్య కారణం. ఆయన దక్షిణాఫ్రికాలోని మొదటి హిందూ సంన్యాసి. వారి పూర్వాశ్రమ నామం ధనగోపాల్ నాయుడు. దక్షిణాఫ్రికాకు వలస వెళ్ళిన భారతీయ కుటుంబంలో ఆయన జన్మించారు. స్వామి వివేకానంద జీవితచరిత్ర - సందేశాలను చదివి ప్రభావితమై ఆయన రామకృష్ణ కేంద్రాన్ని ప్రారంభించారు. ఈ కేంద్రం అనాథలకు వసతి గృహాలు, శిశుసంరక్షణా పథకం, విద్యా,వైద్యసేవా పథకాలు, స్వయం ఉపాధి పథకం - ఇలా ఎన్నో సేవా కార్యక్రమాలను నిర్వహిస్తూంది. దక్షిణాఫ్రికా ప్రభుత్వం కోరిక మేరకు రెడ్‌క్రాస్ వారి విమానాన్ని అద్దెకు తీసుకుని వారానికి రెండుసార్లు మారుమూల గ్రామాలకు వెళ్ళి సేవలందిస్తోంది.



ఆశ్రమ ప్రాంగణంలో శ్రీరామకృష్ణ దేవాలయం, పుస్తక విక్రయశాల, గ్రంథాలయం, ఉచిత వైద్యశాల, కంప్యూటర్ శిక్షణా కేంద్రం ఉన్నాయి. ఈ కేంద్రం నుంచి 'జ్యోతి' అనే పేరుతో త్రైమాసిక ఆంగ్ల పత్రిక వెలువడుతూంది. మరిన్ని సేవా కార్యక్రమాలు చేపట్టి ప్రజల ఆధ్యాత్మిక ఉన్నతికి ఈ కేంద్రం మూలస్తంభం కాగలదని భగవాన్ శ్రీరామకృష్ణులను ప్రార్థిద్దాం!

నివేదిక- **స్వామి విమోక్షానంద, అధ్యక్షులు**
**రామకృష్ణ మఠం, డర్బన్, దక్షిణాఫ్రికా.**

## ఆధ్యాత్మిక అంతర్యోగం

పశ్చిమ గోదావరి జిల్లా **యండగండి రామకృష్ణ సేవా సమితి** ఏప్రిల్ 15వ తేదీన ఆధ్యాత్మిక అంతర్యోగ కార్యక్రమాన్ని నిర్వహించింది. రాజమండ్రి రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి అక్షరాత్మానందజీ ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమానికి 130 మంది భక్తులు హాజరయ్యారు. వక్తృత్వ పోటీలో విజేతలైన విద్యార్థులకు స్వామి అక్షరాత్మానందజీ బహుమతి ప్రదానం చేశారు. యండగండి శివార్లోవున్న రాయుడు వాని గూడెంలో స్త్రీల ఉపాధి కల్పనా పథకం కింద కుట్టుపనుల శిక్షణాకేంద్రాన్ని స్వామీజీ ప్రారంభించారు.

నివేదిక- **కె.ఆర్.కె ప్రభాకర్ రావు.**

## ప్రచారానికి శ్రీకారం



శ్రీరామకృష్ణ - వివేకానంద సాహిత్యాన్ని ఆంధ్రరాష్ట్రంలో నలుమూలలకూ చేరాలనే సత్సంకల్పంతో హైదరాబాదు రామకృష్ణ మఠం 'జ్ఞానవాహిని' (సంచార పుస్తక విక్రయశాల) ని ప్రారంభించింది. ఈ జ్ఞానవాహిని సేవలను పాఠశాలలు, కళాశాలల యాజమాన్యాలు, సేవాసమితులు సద్వినియోగం చేసుకోవచ్చు. 'జ్ఞానవాహిని'ని ఆహ్వానించాలనుకునే వారు మరిన్ని వివరాల కోసం **అధ్యక్షులు, రామకృష్ణ మఠం, దోమలగూడ, హైదరాబాదు-500 029** ను సంప్రదించండి.



## సుబోధ

**భక్తుడు:** ధనార్జన చేయకుండా కుటుంబ పోషణ ఎలా జరుగుతుంది?

**శ్రీరామకృష్ణులు:** నిత్య జీవితానికి అవసరమయ్యే పనులు చేస్తూ కుటుంబ అవసరాలకు డబ్బు సంపాదించుకోవచ్చు. భగవంతుని ఈవిధంగా ప్రార్థించాలి.. " భగవాన్! నా నిత్యావసరాలు క్రమ క్రమేణా తగ్గిపోయేటట్లు అనుగ్రహించు. లేనిఎడల వాటి వలలో పడి నిన్ను మర్చిపోయే ప్రమాదం ఏర్పడుతుంది. నిస్వార్థంగా సేవలు చేస్తున్నామనే ప్రారంభిస్తాం. కానీ అవి కాలక్రమంలో స్వార్థ పూరితాలుగా మారుతున్నాయి. ఒకసారి శంభుమల్లిక్, "ఆసుపత్రులు, పాఠశాలలు కట్టించాలని, రోడ్లు వేయించాలని, వ్యవసాయానికి కావలసిన నీటి వసతులు ఏర్పాటు చేయాలని" అన్నాడు. "అవసరానికి మించినవి, శక్తికి మించి భారమైన పనుల జోలికి పోవద్దు. నీ పరిమితిలో ఏం చేయగలవో ఆ కొద్ది మాత్రమే చెయ్యి, లేని ఎడల భగవంతుని విస్మరించటం జరగవచ్చును".

**భక్తుడు:** ఈ జన్మలో భగవత్సాక్షాత్కారం సాధ్యమేనా?

**శ్రీరామకృష్ణులు:** ఈ జన్మలోనే భగవత్సాక్షాత్కారం పొందవచ్చు. సంసార జీవనం సాగిస్తూనే అప్పుడప్పుడు ఏకాంతవాసం చెయ్యాలి. భార్యా పిల్లలకై కడవల కొద్దీ కన్నీరు కారుస్తారు. భగవంతుడి కోసం ఒక్క కన్నీటిబొట్టైనా రాల్చరు. ప్రారంభ దశలో ఎన్నో ఆటంకాలు ఎదురవుతాయి. వాటిని అధిగమించాలి. రోడ్డు పక్కన మొక్కలు నాటుతారు. నాటి నప్పుడు చుట్టూ కంచె వేస్తారు. లేని యెడల పశువులు మేసివేస్తాయి. మొక్క చెట్టుగా ఎదిగి మాను బలిష్టమైన తర్వాత కంచెను తీసి వేయవచ్చు. ఆ చెట్టుకు ఏనుగును కట్టివేసినా ఏమీ హాని జరుగదు. వివేక వైరాగ్యాలు సమకూరిన తర్వాత సంసార జీవితంలో ప్రవేశించినా ఎటువంటి హానీ జరగదు.

"కేవలం పాండిత్యం, ఉపన్యాసాల వల్ల ఏమీ సాధించలేం. విచక్షణా జ్ఞానం, శాంత స్వభావంతో దైవాన్ని ఆరాధించాలి. భగవంతునికి అసాధ్యమైనది ఏదీ లేదనే నమ్మకం ఉండాలి. పూర్వం ఇద్దరు యోగులుతపస్సు చేసుకుంటున్న చోటుకు నారదుడు వెళ్ళాడట! వాళ్ళిద్దరూ వైకుంఠంలో విశేషాలు తెల్పమని కోరారట! అందుకు నారదుడు "శ్రీ మహావిష్ణువు ఒక సూదిబెజ్జం ద్వారా ఏనుగులను, ఒంటెలను పంపుతున్నాడు" అని చెప్పాడట. అందుకు మొదటి యోగి "అవును, ఆయనకు ఏదీ అసాధ్యం కాదు" అన్నాడట. రెండవ యోగి "ఇది సాధ్యమయ్యే విషయమేనా" అని ప్రశ్నించాడట. నమ్మకం ఉన్నవానికి అన్నీ లభిస్తాయి. దైవసాన్నిధ్యం పొందాలంటే హృదయం పవిత్రం చేసుకొని హృదయంలో భగవంతుణ్ణి ప్రతిష్ఠించుకొని ఆరాధించాలి.

శ్రీ రామకృష్ణ ప్రభ
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029
ఫోన్: 040–2766 7799
E-mail : sriramakrishnaprabha@gmail.com



నిర్వాహక సంపాదకులు : స్వామి జ్ఞానదానంద
సంపాదకులు : స్వామి పరిజ్ఞేయానంద



# సురభి

నేను (స్వామి అపూర్వానంద) మాతృదేవి నుండి మంత్రదీక్ష తీసుకోవడానికి జయరాంబాటి వెళ్ళాను. మాతృదేవి సేవకులైన ఓ సాధువు వచ్చి నన్ను పూజా గదిలోకి తీసుకువెళ్ళారు.

మాతృదేవి ఆసనం మీద కూర్చొని పూజ చేస్తున్నారు. ఆమెకు సమీపంలో మరొక ఆసనం ఉంది. గురుదేవుల చిత్రపటానికి ప్రణమిల్లి దానిపై కూర్చోమన్నారు మాతృదేవి. నేను కూర్చున్న వెంటనే నా మీద కొద్దిగా గంగాజలం చల్లి తలను, శరీరాన్ని తమ చేత్తో స్పృశించారు. మాతృదేవి స్పర్శ నన్ను పులకితాంగుణ్ణి చేసింది. వర్ణనాతీతమైన ఆనందానుభవంతో మనస్సు నిండిపోయింది. మాతృదేవి కొంతసేపు కళ్ళు మూసుకొని కూర్చున్నారు. ఆ స్థితిలోనే నాతో, "గురుదేవులు నీకు ఇష్టమే కదా?" అని అడిగారు. అవునంటూ నేను చెప్పినప్పుడు మూడుసార్లు ఒక మంత్రాన్ని చెప్పారు. తర్వాత నన్ను కూడా వారితో పాటు మంత్రం ఉచ్చరించమన్నారు. అలా ఉచ్చరిస్తూ ఉన్నప్పుడు హఠాత్తుగా గోడవైపుగా చేతులు చాచి, "ఇదిగో, ఇదిగోచూడు. ఇదే నీ ఇష్టదైవం" అన్నారు. కళ్ళు మిరిమిట్లు గొలిపే తేజస్సు ఒకటి ఆవిర్భవించింది. సజీవమైన దివ్యకాంతులతో కూడిన ఒక దేవీమూర్తి ఆ తేజస్సులో సాక్షాత్కరించింది. ఆ దేవి కరుణాపూరిత నయనాలతో నన్ను చూసింది. ఒక్క క్షణం ఆశ్చర్యపోయాను, వైమరచిపోయాను. మాతృదేవి స్వరూపం కూడా అప్పుడు మరోవిధంగా కనిపించింది.

కొంతసేపయ్యాక మాతృదేవి ఆప్యాయంగా, "నాయనా! భయపడిపోయావా?" అని అడిగారు. మాతృదేవికి బదులు చెప్పే శక్తి నాలో లేదు. కనుక తల దించుకొని కూర్చున్నాను. మాతృదేవి నా ఎడమచేతిని పట్టుకుని జపం ఎలా చేయాలో చూపించారు. తర్వాత మాతృదేవి గురుదేవుల ఛాయాచిత్రాన్ని చూపించి, "గురుదేవులకు ప్రణామం చేయి. ఆయనే నీ ఇష్టదైవం. ఆయనే గురువు. ఇహపరాలకంతా ఆయనే! ఆయన సర్వదేవదేవీ స్వరూపులు" అన్నారు. నేను గురుదేవులకు ప్రణమిల్లి, మాతృదేవికి కూడా ప్రణమిల్లాను. ఎంత జపం చేయాలి, ధ్యానం ఎలా చేయాలి అనే విషయాల గురించి వివరించారు మాతృదేవి.

(మాతృమూర్తి శ్రీశారదాదేవి శిష్యులైన స్వామి అపూర్వానంద స్మృతుల నుంచి)



## విజ్ఞానం - వినోదం



- ఎస్. ప్రసాద్



### గమ్యం...!

**అజ్ఞేభ్యో గ్రంథినః శ్రేష్ఠాః గ్రంథిభ్యో ధారిణో వరాః।**
**ధారిభ్యోః జ్ఞానినః శ్రేష్ఠాః జ్ఞానిభ్యో వ్యవసాయినః॥**

అజ్ఞానులకన్నా గ్రంథాలను సేకరించే వారు శ్రేష్ఠులు. గ్రంథాలను గౌరవించేవారి కన్నా వాటిలోని విషయాన్ని గుడ్డిగా గుర్తు పెట్టుకొనే గుర్తించుకునేవారు గొప్పవారు. వారి కన్నా గ్రంథాల సారాంశాన్ని గ్రహించేవారు ఉన్నతులు. సారాన్ని గ్రహించి ఆచరించేవారు అత్యున్నతులు.

### తొందరపాటు...

ఒక దుకాణం ముందు గంటల తరబడి ఓపిగ్గా వరుసలో నిలబడి ఉన్న వ్యక్తులను ఖాతరు చేయకుండా ఒక వ్యక్తి ముందుకు దూసుకు పోసాగాడు. ఒకరిద్దరు అతణ్ణి పట్టుకుని వెనక్కు తోసారు. ఆ వ్యక్తి ఇదేమీ పట్టించు కోకుండా ముందుకు పోవడానికి ప్రయత్నించాడు. ఈసారి మరికొంత మంది కలిసి అతణ్ణి బలంగా వెనక్కు నెట్టారు. దాంతో చిర్రెత్తిన ఆ వ్యక్తి అరిచాడు- "అయితే సరే! ఈ రోజు నేను దుకాణాన్ని తెరవను... మీ ఇష్టం...!!

### పసితనం...



ఇద్దరు విద్యార్థులు భోజన విరామ సమయంలో మాట్లాడుకుంటున్నారు.

**నిఖిల్:** ఈ రోజు తరగతి గదిలోని గోడ గడియారం జారి కిందపడింది! అది ఒక క్షణం ముందే పడి ఉంటే మన ఉపాధ్యాయురాలి తల పగిలి ఉండేది!

**అఖిల్:** ఏం చేస్తాం..! అదెప్పుడూ ఆలస్యంగానే నడుస్తుంది!

### విలువైన విత్తనాలు

గతంలో వ్యాపారస్థులు మణిమాణిక్యాలు, వజ్ర వైఢూర్యాల బరువును తూచేందుకు కారట్ (Carat) విత్తనాల్ని వాడేవారు. తరువాత కారట్ అన్నపదం తూనికల ప్రమాణంగా వాడుకలోకి వచ్చింది. ఒక కారట్ అంటే సుమారు 170 మిల్లీ గ్రాముల బరువు...!



### విశ్లేషణ...

అపజయాలు రెండు సందర్భాల్లో సంభవించవచ్చు...

1. సరైన ఆలోచనల్ని ఆచరించటంలో విఫలమైనప్పుడు...
2. అసలు ఆలోచించకుండా పనిచేసినప్పుడు...

(....33వ పేజీ తరువాయి.)

### పిల్లల ప్రేమను పొందేందుకు...

"పిల్లవాడి ప్రేమను ఎలా పొందాలో అర్థమైందా మహారాజా! ప్రాణాలు తీసే పులి కన్నా పిల్లవాడు భయంకరుడేం కాదు కదా! శ్రమపడి ఓర్పుతో పులిని ఏవిధంగా మచ్చిక చేసుకున్నావో అలాగే ఇప్పుడూ ప్రయత్నించు! పిల్లవాణ్ణి ప్రేమతో పలకరించు! తప్పు చేస్తే ఓర్పుతో దిద్దడానికి ప్రయత్నించు! అతని ప్రేమను పొందిన తరువాత గురువుల సహాయం పొందమని ప్రేరేపించి, ప్రోత్సహించు. తప్పక విజయం సాధించగలవు!" అని చెబుతున్న సాధువుకు సాష్టాంగపడి వెను దిరిగాడు రాజు.

రాజభవనంలో తన అనుభవజ్ఞానాన్ని ఆచరణలో పెట్టేందుకు మహారాజు ప్రయత్నించాడు. తరగని ఓర్పుతో యువరాజును తీర్చి దిద్దే పనికి శ్రీకారం చుట్టాడు. తండ్రి చూపే ప్రేమాదరాల కారణంగా పుత్రునిలో క్రమంగా మార్పురా సాగింది. తండ్రి తన శత్రువుకాదనీ, శ్రేయోభిలాషి అనీ గుర్తించాడు. పట్టుదలతో పరిశ్రమించి అన్ని విద్యలూ అభ్యసించాడు. తండ్రికి తగ్గ తనయుడని ప్రజల ప్రశంసలు అందుకున్నాడు.

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.64-6, Sri Ramakrishna Prabha (Telugu Monthly) June 2007, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. H-HD-1071/2007-09. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2007-09.

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-
హైదరాబాద్ కులప్రశాసకుడు



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| పేరు | చిరునామా | రూ. |
|---|---|---|
| | ఇప్పటి వరకు వసూలైన మొత్తం ... | 9,79,323 |
| పోషకులు : | శ్రీ లక్ష్మణ్‌జీ దబ్బికర్, ముషీరాబాద్,హైదరాబాద్-500 020 | 3,800 |
| : | శ్రీ కె.వి. శివరామకృష్ణ, మోతుగూడెం - 507 113, ఖమ్మం జిల్లా | 1,150 |
| : | శ్రీ కె. వెంకటయ్య, భవానీ నగర్, తిరుపతి - 517 501 | 1,000 |
| : | శ్రీ కె.వి.వి.ఎస్. మూర్తి, అశోక్ నగర్, భద్రాచలం - 507 111 | 1,000 |
| : | శ్రీ కె. చలపతి, బసవన్నగుడి, బెంగుళూరు- 560 004 | 1,000 |
| | మొత్తం . . . | 9,87,273 |

## శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి మీ పేరు మీద పది మందీ మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥ 600/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ళ పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు) ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ'లో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| 1271 | శ్రీ వై.వి. కృష్ణమూర్తి, అశోక్ నగర్, హైదరాబాద్-20 | లైబ్రేరియన్, బాసర- 504 101, ఆదిలాబాద్ జిల్లా |
| 1272 | శ్రీ ఎస్.ఎస్ అప్పారావు రెడ్డి, విశాఖపట్నం - 530 013 | శ్రీ ఎన్. నరసింహారెడ్డి అండ్ సన్స్ లైబ్రరి, విశాఖపట్నం- 13 |
| 1273 | శ్రీ జి. మహేశ్వర్ రెడ్డి, నక్కవారి పాలెం, విశాఖపట్నం | గొరుసు బ్రదర్స్ లైబ్రెరి, విశాఖపట్నం - 530 013 |
| 1274 | శ్రీ బి. సత్యనారాయణ, మియాపూర్, హైదరాబాద్-50 | లైబ్రేరియన్, మోబెర్లిపేట్, అమలాపురం - 533 201 |
| 1275 | శ్రీ వి.వి. కృష్ణ శర్మ, ధవళేశ్వరం, ప.గో.జిల్లా- 533 125 | లైబ్రేరియన్, తిరుపతిపురం, అత్తిలి, ప.గో.జిల్లా |
| 1276 | " " | లైబ్రేరియన్, సూర్యారావుపాలెం, వయా తాడేపల్లిగూడెం. |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 8 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 85 | $15 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 240 | $ 45 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 380 | $ 75 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1200 | $ 350 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad- 500 029.

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 64 సంచిక: 7 జూలై 2007

"ప్రతి జీవిలోనూ దివ్యత్వం గర్భితంగా ఉంది. అంతర్గతంగా ఉన్న ఆ దివ్యత్వాన్ని వ్యక్తం చేయడమే జీవిత పరమావధి." - స్వామి వివేకానంద

## ప్రార్థన



శోషణం భవసింధోశ్చ ప్రాపణం సారసంపదః। యస్య పాదోదకం సమ్యక్ తస్మై శ్రీగురవే నమః ॥

న గురోరధికం తత్త్వం న గురోరధికం తపః। తత్త్వ జ్ఞానాత్ పరం నాస్తి తస్మై శ్రీగురవే నమః ॥

ఎవరి కృప వల్ల ఈ సంసార సాగరం శోషింపబడి, శాశ్వత సంపద లభిస్తుందో అటువంటి గురువుకు వందనాలు. గురువే సత్యం, గురుసేవే ఉత్తమం. ఆత్మ సాక్షాత్కారమే పరమావధి అని బోధించి నటువంటి గురువుకు వందనాలు.

( గురు స్తోత్రం )

ఈ సంచికలో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకుడు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

– సంపాదకులు



**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com




# సంపూర్ణ సమర్పణే సద్గురు దక్షిణ !

ప్రాపంచిక ప్రగతిని సాధించాలన్నా, ఆధ్యాత్మికోన్నతి పొందాలన్నా గురువు యొక్క సహాయం, సూచనలు చాలా అవసరం. 'గురువు' అనే పదానికి విభిన్న స్థాయిల్లో విభిన్న అర్థాలు చెప్పుకోవచ్చు. తనకు తెలిసిన విషయాల్ని 'ఉప' – అంటే, దగ్గరుండి విద్యార్థులతో 'అధ్యయనం' చేయించేవాడు ఉపాధ్యాయుడు. తనకు తెలిసిన విషయాల్ని బోధించడమే కాకుండా ఆచరించేవాడు ఆచార్యుడు. ఆచరతి ఇతి ఆచార్యః అని ఆచార్య శబ్దానికి వ్యుత్పత్తి. శిష్యుల ఆధ్యాత్మిక పురోగతికి



తోడ్పడేవాడే ఉత్తమ గురువు. అందుకే "గురుర్బ్రహ్మా, గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః" అని సృష్టి, స్థితి, లయ కారకులైన ఆ త్రిమూర్తులతో గురువును పోల్చారు.

**గురుః బ్రహ్మా :** గురువు శిష్యునిలో 'ఆధ్యాత్మిక జిజ్ఞాస'ను రగుల్కొలిపి ఆధ్యాత్మిక లోకాన్ని సృష్టిస్తాడు. బ్రహ్మ భౌతిక ప్రపంచాన్ని సృష్టిస్తే, గురువు ఆధ్యాత్మిక లోకాన్ని సృష్టిస్తాడు. కాబట్టి గురువును సృష్టికర్త అయిన బ్రహ్మతో పోలుస్తారు.

**గురుః విష్ణుః :** గురువు తన శిష్యులకు విద్యాబుద్ధులు నేర్పి, వారి యోగక్షేమాలకై అత్యంత శ్రద్ధ వహిస్తాడు. శిష్యుల ఆధ్యాత్మిక శ్రేయస్సుకై పాటుపడతాడు. కాబట్టి గురువును పాలనకర్త అయిన విష్ణువుతో సమానంగా పూజిస్తారు.

**గురుః దేవో మహేశ్వరః :** శివుడు లయకారుడు. గురువు శిష్యునిలో ఉన్న 'అహం' అనే అడ్డుగోడను తొలగించి, జీవాత్మను పరమాత్మలో లయమయ్యేలా చేస్తాడు. కాబట్టి గురువుకు శివుని స్థానాన్నిచ్చి ఆరాధిస్తారు.

ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించే గురువును పొందాలంటే శిష్యునిగా మనలో కొన్ని అర్హతలు ఉండాలి.

**అన్వేషణ :** జనన మరణ సంసార చక్రం నుంచి బయటపడి భగవత్సాక్షాత్కారాన్ని పొందగోరే వారు మాత్రమే గురువు ఆశ్రయాన్ని కోరుతారు.

**జనన మరణాది సంసారానల సంతప్తో**
**దీప్తశిరా జలరాశి మివ ఉపహార పాణిః** *(వేదాంత సార)*

*"శిరస్సుకు నిప్పు అంటుకున్న మనిషి ఆ మంటను ఉపశమింపజేయడానికి నీటి కోసం నదికెలా పరుగెడతాడో, అలా జనన మరణ సంసార తాపాగ్ని నుండి బయట పడడానికి సాధకుడు గురువును అన్వేషిస్తాడు."* విశాల సాగరాన్ని చేరేందుకు పరవళ్ళు తొక్కుతూ ప్రవహించే నదిలా గురువును చేరాలనే తపన ఉదయించడం శిష్యునికి ఉండాల్సిన మొదటి అర్హత.

**సత్యపాలన :** ఆత్మజ్ఞానం అర్థించేవారు సత్యనిష్ఠులై ఉండాలి. ఒకసారి సత్యకామ జాబాల అనే బాలుడు మంత్రోపదేశం చేయాల్సిందిగా గౌతమ మునిని ప్రార్థించాడు. "నీ తండ్రి ఎవరు? నీ గోత్రం ఏమిటి?" అని ఆ బాలుణ్ణి గురువు ప్రశ్నిస్తాడు. సత్యకామ తన తల్లి వద్దకు వెళ్ళి గౌతమ ముని అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పమంటాడు. బాలుడైన సత్యకామతో 'నీ తండ్రి ఎవరో తెలియదు, గోత్రం ఏమిటో తెలియదు'అని తల్లి చెబుతుంది. సత్యకామ తల్లి జాబాల చెప్పిన మాటల్ని విన్నది విన్నట్లు గురువుకు చెబుతాడు. సత్యకాముని సత్యనిష్ఠకు గురువు ముగ్ధుడై, ఆతణ్ణి తన శిష్యునిగా స్వీకరిస్తాడు. పరమాత్ముని తెలుసుకోవాలనే శిష్యుడు సత్యనిష్ఠుడై ఉండాలి. అది శిష్యునికి ఉండాల్సిన రెండో అర్హత.

**సమర్పణ :** గురువు మాట మీద సంపూర్ణ విశ్వాసం ఉంచి, తనను తాను త్రికరణ శుద్ధిగా గురువుకు సమర్పించుకోవడం శిష్యునికి ఉండాల్సిన మూడో అర్హత. గురువు ఏ మాట పలికినా, ఏ పని చెప్పినా తన శ్రేయస్సుకేనని శిష్యుడు విశ్వసించాలి. శిష్యుడు సంపూర్ణ సమర్పణ భావంతో గురు సన్నిధిలో మెలగాలి. అలా చేసిన నాడు శిష్యుని భక్తి శ్రద్ధలకు గురువు తృప్తి చెంది, జ్ఞానబోధ చేస్తాడు.

శిష్యునిగా స్వీకరించిన సత్యకామకు గురువు జ్ఞానబోధ ఏమీ చేయలేదు. కానీ, కొన్ని ఆవులనిచ్చి అడవికి తోలుకు వెళ్ళి మేపమన్నాడు గౌతమ ముని. ఆవుల సంఖ్య వెయ్యి అయిన తరువాతే తిరిగి ఆశ్రమానికి రావాల్సిందిగా ఆజ్ఞాపించాడు. సత్యకామ గుర్వాజ్ఞను మనఃస్ఫూర్తిగా అంగీకరించి, ఆవుల్ని అడవికి తోలుకెళ్ళాడు. ఆవుల సంఖ్య వెయ్యి అవగానే వాటిని తోలుకొని, ఆశ్రమానికి వచ్చాడు సత్యకామ. అతణ్ణి చూసిన గురువు, "సత్యకామా! నీ ముఖం బ్రహ్మ తేజస్సుతో వెలిగిపోతోంది" అన్నాడు. గురువు ఎలాంటి ప్రాథమిక బోధా చేయకుండానే సత్యకామకు ఆత్మ జ్ఞానం ఎలా కలిగింది? గురువు మాట మీద అచంచల విశ్వాసం ఉండడం వల్ల సత్యకామకు గురువు రూపంలో ప్రకృతి, పశుపక్ష్యాదులే ఆత్మబోధ చేశాయి. గురుకృప అంటే అదే!

స్వామి కల్యాణానంద తన గురువు స్వామి వివేకానందతో ఒకసారి హృషీకేశ్, హరిద్వార్ వచ్చారు. అక్కడున్న రోగులకు వైద్య సేవలు అందించడానికి ఎలాంటి సౌకర్యాలూ లేవు. ఆ రోగుల బాధను చూసి కల్యాణానందతో స్వామి వివేకానంద, "కల్యాణ్! ఇక్కడ అనారోగ్యంతో బాధపడుతున్న వారికి సేవలు అందించు. నీ జీవితం రోగినారాయణ సేవకు అంకితం చెయ్యి" అన్నారు. గురువాక్కును వేద వాక్కుగా భావించిన స్వామి కల్యాణానంద జీవితాంతం హరిద్వార్‌లోనే ఉంటూ రోగి నారాయణ సేవలో తరించారు. అయితే శిష్యుని ఆధ్యాత్మిక అభివృద్ధికి స్వామీజీ ఏ విధంగా భరోసా ఇచ్చారో చూడండి: "నా శిష్యులు వెయ్యిసార్లు నరకానికి వెళ్ళినా, వారిని రక్షించే బాధ్యత నాదే" అని స్వామిజీ ప్రకటించారు. గురువు పాదాల చెంత సంపూర్ణంగా నివేదించుకునే శిష్యుని ఆధ్యాత్మిక ఉన్నతికి గురువే బాధ్యత వహిస్తాడనడానికి స్వామీజీ మాటలే ప్రమాణం.

**సేవనం :** గురుసేవ చేస్తున్నప్పుడు ఎలాంటి అనిష్టం గానీ, చిరాకు గానీ వ్యక్తపరచకుండా గురుసేవనే దైవసేవగా భావించి చేయడం శిష్యునికి ఉండాల్సిన మరో లక్షణం. ఒక ఆశ్రమంలో ఓ శిష్యుడు ఉండేవాడు. గురువు నదికి వెళ్ళి నీళ్ళు తీసుకురమ్మంటే "గురువుగారూ! నాకు జలుబు చేసింది. ఇప్పుడు వీలు కాదు" అన్నాడు. మరోసారి గురువు "నాయనా! అడవికి వెళ్ళి వంటకు కట్టెలు తీసుకురా" అన్నాడు. అందుకు శిష్యుడు "గురువుగారూ! నాకు ఈ రోజు ఒంట్లో నలతగా ఉంది, ఇప్పుడు కుదరదు" అన్నాడు. ఇంకోరోజు "నాయనా ! పండ్లు, మిఠాయిలూ చాలా ఉన్నాయి. వచ్చి భుజించు" అన్నాడు గురువు. వెంటనే "గురువు గారూ! మీరు ఏ పని చెప్పినా ప్రతి సారీ కాదనడం నాకు ఇష్టం లేదు. ఈసారి మీ ఆజ్ఞను తప్పక శిరసావహిస్తాను" అని అన్నాడా శిష్యుడు. ఇలాంటి శిష్యుడికి ఆత్మజ్ఞానం అనంత దూరంలో ఉంటుంది మరి!

స్వామి వివేకానందుని శిష్యుడు స్వామి నిశ్చయానంద జీవితంలో ఓ ఘటన జరిగింది. గురుసేవ ఎలా చేయాలనడానికి అది ఒక ఉత్కృష్ట ఉదాహరణ.

స్వామి వివేకానంద ఓ పాడి ఆవును కొనాల్సిందిగా స్వామి నిశ్చయానందను పంపించారు. బయలు దేరుతున్నప్పుడు స్వామీజీ, నిశ్చయానందతో "ఆవు మెడలోని తాడును గట్టిగా పట్టుకో. తాడును వదిలేస్తే ఆవు పారిపోతుంది" అని హెచ్చరించారు. స్వామి నిశ్చయానంద ఆవును కొని, పడవలో ఎక్కించి గంగానది దాటుతూ రాసాగారు. నదీ ప్రవాహం ఉధ్ధృతమైనందు వల్ల పడవ తీవ్రంగా కుదపులకు లోనవడం ప్రారంభించింది. పడవ కుదుపులకు భయపడి, ఆవు నదిలోకి దూకింది. గురువు మాటల్ని అక్షరాలా పాటించే నిశ్చయానంద అంత జరిగినా ఆవు మెడలోని త్రాడును వదలకుండా,



ఆవుతో పాటు నదిలోకి దూకారు. పడవలో ఉన్న వారందరూ భయ కంపితులయ్యారు. ఆయన సాహసాన్ని ఒక మూర్ఖపు పట్టుదలగా వారు భావించారు. కానీ స్వామి నిశ్చయానంద తన ప్రాణాలు సైతం లెక్కచేయకుండా, ఉధ్ధృతంగా ప్రవహిస్తున్న నదిలో ఆవుమెడలోని తాడును పట్టుకొని, ఈదుకుంటూ అతి కష్టం మీద నది ఒడ్డుకు చేరారు. ఈ విషయం తెలిసిన స్వామి వివేకానంద తన శిష్యుని సాహసానికీ, సేవా నిరతికీ సంతోషించారు. గురుసేవలో ప్రాణాల్ని సైతం త్యజించడానికి సిద్ధమయ్యే శిష్యులపై గురుకృప అనంతం.

మనలోని జ్ఞానదీపాన్ని వెలిగించి జన్మ జన్మాంతరాలుగా ఉన్న అజ్ఞానపుటంధకారాన్ని పారద్రోలడానికి గురువు సన్నిధి అవసరం. ఆ సన్నిధికి మనం చేరాలంటే గురువు వాక్కు మీద సంపూర్ణ విశ్వాసం ఉంచి, సమర్పణ భావంతో గురువును సేవించాలి. అప్పుడే పున్నమి చంద్రుని చల్లని వెన్నెలలా గురుకృప మనపై కురుస్తుంది. జీవితం తరిస్తుంది. a

## గోరుముద్ద

- స్వామి సుప్రియానంద

# పుస్తక పరిజ్ఞానం

**ఒ**కసారి ఒక యువకుడు, స్వామి వివేకానందుల 'రాజయోగం' పుస్తకం చేతిలో పట్టుకొని, "నాకు 'రాజయోగం' మీద లేటెస్ట్ అండ్ బెస్ట్ పుస్తకం కావాలండి" అని అడిగాడు. ఇలా అడగడానికి కారణం ఏమిటని ఆరా తీస్తే, వివేకానందుల 'రాజయోగం' పుస్తకం మరీ చిన్నదిగా ఉండడమేనని తెలిసింది.

ఆధ్యాత్మిక సాధన చేస్తున్నామనుకుంటూ పెద్ద పెద్ద పుస్తకాలతో 'కుస్తీ' పట్టడం నేటి 'పోకడ'. ఇదే ఇప్పటి 'వైఖరి'. మన ఆలోచనలు మాటలుగా మారిన వైనమే ఈ 'వైఖరి'.



ఒక 'ఆలోచన' నాలుగు దశల రూపాంతరం చెంది, 'మాట' అవుతుందని 'యోగ శాస్త్రం' మనకు వివరిస్తోంది. ఆ నాలుగు దశలూ ఏమిటంటే- పర,పశ్యంతి, మధ్యమ, వైఖరి.

మాటలను చేతల్లో చూపించకపోతే మాటలుగానే మిగిలిపోతాయి. చేతల్లో చూపించడమంటే జీవితంలో ఆచరించడం. ఆ ఆచరణే 'సాధన'. ఆది శంకరులు 'వివేకచూడామణి'లో సాధకుణ్ణి ఇలా హెచ్చరిస్తున్నారు:

**వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్ర వ్యాఖ్యాన కౌశలమ్ ।**
**వైదుష్యం విదుషాం తద్వద్ భుక్తయే న తు ముక్తయే ॥**

*"ఆడంబర పదాలతో ఆకట్టుకునే వాక్చాతుర్యం, శాస్త్రాన్ని వ్యాఖ్యానించగల నైపుణ్యం, పండితుల పాండిత్యం - ఇవి 'భుక్తి'కే గాని 'ముక్తి'కి కాదు."*

"భగవత్సాక్షాత్కారానికి ఉపయోగపడని పుస్తక పాండిత్యం నిరర్థకం" అని శ్రీరామకృష్ణులు చెప్పేవారు. ఆచరణ యోగ్యమైన 'సమత్వం యోగముచ్యతే' అన్న గీతాచార్యుని పలుకులు పెడచెవిన పెడుతున్న రోజులివి.

ఈ పరిస్థితుల్లో యోగి మనఃస్థితిని తెలిపేలా శ్రీరామకృష్ణులు చెప్పిన కథను ఒకసారి జ్ఞాపకం చేసుకుందాం.

"ఒకానొక ప్రాంతంలో ఒక మఠం ఉండేది. మఠంలో నివసించే సాధువులు ప్రతిరోజూ భిక్షాటనకు వెళ్ళేవారు. ఒకరోజు జమీందారు ఒక వ్యక్తిని చితకబాదడాన్ని భిక్షాటనకు వెళ్ళిన ఒక సాధువు చూశాడు. దయాళువైన ఆ సాధువు అక్కడకు వెళ్ళి, కొట్టడం ఆపాల్సిందిగా జమీందారుతో అన్నాడు. దాంతో, ఆగ్రహంతో దహించుకుపోతున్న ఆ జమీందారు క్రోధం అంతా ఆ అమాయకపు సాధువు మీదకు మళ్ళింది. అంతే! స్పృహ తప్పిపోయేటంత వరకు ఆ సాధువును చావగొట్టాడు. ఇంతలో ఎవరో వచ్చి, ఈ సంగతి మఠంలో తెలిపారు. సాధువులు అక్కడకు పరుగు పరుగున వచ్చారు. అక్కడ తమ సోదర సాధువు నేల మీద పడి ఉండడం చూశారు. వెంటనే, నలుగురైదుగురు కలిసి ఆ గాయపడిన సాధువును ఎత్తుకొని మఠానికి తీసుకువెళ్ళారు. ఒక గదిలో పడుకోబెట్టారు. అతడికి చాలా సేపటి దాకా స్పృహ రాలేదు. అతడికి కొంచెం పాలు ఇవ్వాల్సిందిగా చివరకు ఎవరో సూచించారు. పాలు నోట్లో పోయగానే అతడు కళ్ళు తెరిచి, చుట్టూ చూశాడు.

ఇతడు పూర్తిగా స్పృహలోకి వచ్చాడో లేదోనని ఒక సాధువు అతడికి దగ్గరగా వెళ్ళి, బిగ్గరగా "ఓ స్వామీ! మీకు పాలు త్రాగిస్తున్నదెవరు?" అని అడిగాడు. అప్పుడు దెబ్బలు తిన్న ఆ సాధువు క్షీణస్వరంలో "సోదరా! అప్పుడు నన్ను చావబాదిన వ్యక్తే ఇప్పుడు పాలు త్రాగిస్తున్నాడు" అని బదులిచ్చాడు.

*(శ్రీరామకృష్ణ కథామృతం, మొదటి సంపుటం)*

ఇలా ఉంటుంది యోగి ఆత్మకథ. అందుకే, యోగానికి కొలమానం పుస్తకాల పరిమాణం(సైజ్), అందులోని 'మాటల గారడీ' కాదని సాధకులు గ్రహించాలి. # a

# వ్యక్తిత్వానికి పునాది
# నిజాయతీ

- స్వామి ఆత్మానంద



మనిషి జీవితంలో నిజాయతీకి ప్రాముఖ్యం ఉందా, దాని స్థానమెక్కడ అనే ప్రశ్నలు ఉదయిస్తాయి. ఈ రోజుల్లో స్వార్థం పెరగడం వల్ల, నిజాయతీ పరుడు జీవితంలో ఎన్నడూ పైకి రాలేడని అందరూ అనుకుంటారు. దీనికి ఎన్నో నిదర్శనాలూ చూపిస్తుంటారు. ఒక వ్యాపారి కానీ, పారిశ్రామికవేత్త కానీ నిజాయతీపరుడైతే అతని వ్యాపారం, పరిశ్రమ మూతబడిపోతాయి. ఆదాయ వివరాలను నిజాయతీగా చూపిస్తే పన్నుల వాళ్ళొచ్చి అతణ్ణి నిలువుదోపిడీ చేస్తారు. ఏ రంగంలోనైనా సరే పై అధికారుల్ని సంతోషపెట్టాలంటే ఉద్యోగి నిజాయతీకి తిలోదకాలివ్వాల్సిందే అనీ, నిజాయతీగా ఉంటే పనులు జరగవనీ అంతా అనుకుంటారు.

"నిజాయతీగా ఉండడం మంచిదే కానీ, ఎవరూ దాన్ని పాటించుకోనప్పుడు నేనొక్కణ్ణే నిజాయతీగా ఉండడం వల్ల ప్రయోజనం ఏమిటి?"అని కొందరు అనుకుంటారు. మహాభారతంలోని *"శఠం ప్రతి శాఠ్యం కుర్యాత్"* అనే వాక్యాన్ని ప్రస్తావిస్తూ, "దుష్టుడి పట్ల దుష్టుడిగానే వ్యవహరించాలి, సరళ స్వభావం కలవాడూ, నిష్కపటీ అయిన వ్యక్తితో సరళంగా, నిష్కల్మషంగా వ్యవహరించాలి" అని సమర్థించుకుంటారు మరి కొంతమంది.

ఈ రెండు వాదనల్లోనూ బలం కనిపిస్తుంది. ఓ విశ్వవిద్యాలయ కులపతి (Vice-Chancellor) నాకు మంచి మిత్రుడు. కొన్ని పుస్తకాలను ప్రచురించినందుకు అతనికి కొంత ఆదాయం లభించింది. సహజంగా దానితో అతనికి ఆ సంవత్సరం ఆదాయం పెరిగింది. అతను నిజాయతీకి మారుపేరు. ఆదాయపు లెక్కలలో ఒక్క పైసా కూడా విడవకుండా నమోదు చేస్తాడు. కానీ అధికారులు ఆ సంవత్సరం వచ్చిన ఆదాయం ప్రకారమే తరువాతి సంవత్సరాల్లో కూడా అతను పన్ను కట్టాలని ఆదేశించారు. అతను అప్పు చేసి ఆ పన్ను కట్టాడు. చాలా కాలం తరువాత అతను ఎక్కువగా కట్టిన పన్ను తాలూకు పైకం అతనికి తిరిగి ఇచ్చారన్నది వేరే విషయం. దీనివల్ల అతను శారీరకంగా, మానసికంగా ఆందోళనకూ, ఇబ్బందికీ గురయ్యాడు. ఈ ఇబ్బందులన్నీ తొలగడానికి అతనికి అంత సమయం ఎందుకు పట్టిందంటే అతను ఆ యా అధికారుల్ని సంతోషపెట్టడానికి (అంటే లంచం ఇవ్వడానికి) నిరాకరించాడు. ఈ సంఘటన వింటే నిజాయతీకి కట్టుబడడం కష్టాల్ని కొని తెచ్చుకోవడమనిపిస్తుంది కదూ!

నిజాయతీ మనిషి వ్యక్తిత్వానికి పునాది. నిప్పు వేడిగా ఉండడం దాని గుణం. వేడిమి లేనప్పుడు ఆ నిప్పుకి అస్తిత్వమే లేదు. నిజాయతీ మనిషి సహజ స్వభావం, అది లేనప్పుడు మానవత్వమే నశిస్తుంది. మనం ప్రపంచాన్ని మోసం చెయ్యడానికి వెనుకాడం కానీ ఎవరైనా మనల్ని మోసం చేస్తే చాలా బాధపడతాం. మన బంధు మిత్రులు, అన్నదమ్ములు, సేవకులు, మన దగ్గర పనిచేసే ఉద్యోగులు నమ్మకద్రోహం చెయ్యాలని మనం కోరుకుంటామా! మన తోటివాళ్ళు నమ్మకద్రోహం చేసినా ఫరవాలేదని ఊరకుంటామా!

నిజాయతీగా ఉంటే సమాజంలో బ్రతకడం కష్టమనీ, పైగా నేను ఒక్కణ్ణే నిజాయతీపరుడినై ఏం చెయ్యగలననీ - ఇలాంటి ద్వంద్వ భావాలకు మనం స్వస్తి పలకాలి. మనం మానవతా వాదులమైతే మనమే ముందుగా నిజాయతీగా ఉండడం మొదలుపెట్టాలి. గాంధీజీ స్వాతంత్ర్యోద్యమాన్ని ఒంటరిగానే మొదలుపెట్టారు. నిజాయతీతో కూడిన ఆయన జీవితం మనందరికీ ప్రేరణ కావాలి. ❑

*అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి*

ఆంగ్లమూలం: డాక్టర్ ఎస్. రమణి

అనువక్త: రెంటాల జయదేవ

# సేవలో తరించిన సోదరి

భారతదేశాన్ని అమితంగా ప్రేమించి, భారతదేశ సౌభాగ్యం, సంక్షేమం కోసం తమ జీవితాలనే పణంగా పెట్టిన విదేశీయులు చాలా మంది చరిత్రలో ఉన్నారు. వారిలో అగ్రగణ్యురాలు – సోదరి నివేదిత. ఆమె స్వామి వివేకానందుల ఆధ్యాత్మిక పుత్రిక. జన్మరీత్యా విదేశీయురాలైనా, భారత దేశాన్ని తన మాతృభూమిగా దత్తత తీసుకున్న మహోన్నత చరితురాలు.



సోదరి నివేదిత అసలు పేరు మార్గరెట్ ఎలిజబెత్ నోబెల్. 1867 అక్టోబర్ 28న ఉత్తర ఐర్లండ్‌లో ఆమె జన్మించింది. ఆధ్యాత్మికత పట్ల శ్రద్ధాసక్తులు, నిరుపేదల పట్ల సేవాభావం, దేశం పట్ల ప్రేమాభిమానాలను తన తల్లితండ్రుల నుంచి ఆమె పుణికి పుచ్చుకుంది. పాఠశాల, కళాశాల విద్యలను పూర్తి చేసిన తరువాత ఆమె అధ్యాపక వృత్తిని చేపట్టింది. లండన్‌లోని వింబుల్డన్‌లో సొంత పాఠశాలను ప్రారంభించింది.

మార్గరెట్ క్రైస్తవ దంపతులకు జన్మించినప్పటికీ, చిన్నప్పటి నుంచీ అన్ని మతాల ప్రబోధాలనూ గౌరవించేది. అసలైన మతమనేది మూఢ విశ్వాసాలన్నిటి కన్నా ఉన్నతమైనదనీ, పరమ సత్యాన్ని అన్వేషించడం మీదే దృష్టి నిలుపుతుందనీ ఆమె అభిప్రాయపడింది. స్వామి వివేకానంద లండన్‌కు వెళ్ళినప్పుడు 1895లో తొలిసారిగా ఆయనను మార్గరెట్ కలిసింది. మతమంటే 'ఆత్మ సాక్షాత్కారా'నికి సంబంధించిన విషయమే తప్ప వట్టి 'విశ్వాసం' కాదంటూ ఆయన చేసిన ప్రబోధం ఆమెను ఎంతగానో ఆకర్షించింది. సేవా తృష్ణ, నిస్స్వార్థ ప్రేమ, అందరిలోనూ ఉన్న ఆత్మ ఒక్కటే లాంటి ఆయన బోధనలు ఆమెను ఆకట్టుకున్నాయి. మహిళలు జీవితంలో పురోగమించాలంటే, వారిని విద్యావంతులను చేయడం ఎంతో అవసరమని స్వామి వివేకానంద ప్రగాఢంగా విశ్వసించారు. భారతదేశ స్త్రీల కోసం తాను చేపడుతున్న ఈ మహాత్కార్యంలో ఆమె తనకు ఎంతగానో సహాయపడగలదని ఆయన మార్గరెట్‌కు తెలిపారు. ఫలితంగా, మార్గరెట్ భారతదేశానికి రావాలని నిర్ణయించుకుంది. ఓడలో భారతదేశానికి ప్రయాణం ప్రారంభించింది. చివరకు 1898 జనవరి 28వ తేదీన కలకత్తా నగరానికి చేరుకుంది.

స్వామి వివేకానంద 1898 మార్చి 25న మార్గరెట్‌కు బ్రహ్మచర్య దీక్ష ప్రసాదించారు. భగవంతునికి నివేదించబడినది, అంకితమైనదనే అర్థం వచ్చేలా 'నివేదిత' అని నామధేయమిచ్చారు స్వామీజీ. కాలగమనంలో ఆమె 'సోదరి నివేదిత'గా ప్రాచుర్యంలోకి వచ్చింది. ఇరుగు పొరుగున ఉండే కొద్ది మంది బాలికలతో కలకత్తాలో ఆమె ఓ చిన్న విద్యాలయం ప్రారంభించింది. పాఠశాల ప్రారంభోత్సవం రోజున దివ్య జనని శ్రీశారదా దేవి వచ్చి ఆ విద్యాలయాన్ని సందర్శించారు. నివేదితనూ, అక్కడి విద్యార్థినులనూ దివ్యజనని శారదాదేవి స్వయంగా వచ్చి ఆశీర్వదించారు. ఆ పాఠశాల క్రమంగా ఎదుగుతూ వచ్చింది. కాగా, 1899లో కలకత్తాలో ప్లేగు వ్యాధి వ్యాపించింది. ఆ సమయంలో సోదరి నివేదిత స్వయంగా సామాజిక సేవలో మునిగిపోయింది.

1902లో స్వామి వివేకానంద మహాసమాధి చెందారు. రాజకీయ స్వాతంత్ర్యం సిద్ధించనిదే స్వామి వివేకానంద కలలు గన్న భారతదేశ పునరుద్దీపనం సాధ్యం కాదనే అభిప్రాయం సోదరి నివేదితకు సరిగ్గా అప్పుడే కలిగింది. ఆంగ్లేయుల పాలన నుంచి విముక్తి కోసం దేశంలో మహోన్నత జాతీయ సంగ్రామం సాగుతున్న రోజులవి. ప్రజల మనసుల్లో జాతీయతా భావనను మేల్కొల్పడంలో సోదరి నివేదిత అప్పుడు ప్రముఖ పాత్ర పోషించింది.

భారతదేశమంతటా ఆమె విస్తృతంగా పర్యటించింది. ఉపన్యాసాలు, చర్చలు, రచనల ద్వారా యువజనులకు ప్రబోధాలు చేసింది. ఆత్మ విశ్వాసాన్ని కలిగి ఉండాల్సిందిగా యువతరానికి చెబుతూ, దేశ సౌభాగ్యాన్నే తమ అసలైన లక్ష్యంగా చేసుకోవాల్సిందిగా ఉద్బోధించింది. విదేశీ పాలనకూ, విదేశీ వస్తువులకూ వ్యతిరేకంగా భారతదేశంలో స్వదేశీ ఉద్యమంలో ఆమె చురుకుగా పాల్గొంది. "ఎండిపోయిన ఎముకలు సైతం ఇప్పుడు కదలాడడం మొదలుపెట్టాయి అంటే, వాటిలో సోదరి నివేదిత నింపిన ప్రాణశ్వాసే కారణం" అని ప్రముఖ న్యాయశాస్త్ర ప్రవీణుడూ, దాత అయిన డాక్టర్ రాస్ బిహారీ ఘోష్ వ్యాఖ్యానించారు.

సోదరి నివేదితలోని జాతీయవాద తీవ్రత జాతీయోద్యమ నాయకులైన గోపాలకృష్ణ గోఖలే, శ్రీఅరవిందులు, భూపేంద్ర నాథ్ దత్ లాంటి వారికి ఆమెను సన్నిహితురాలిని చేసింది. విప్లవాత్మక భావాలున్న తమిళ మహాకవి సుబ్రహ్మణ్య భారతి మీద కూడా నివేదిత ప్రభావం చాలా ఉంది. దేశ స్వాతంత్ర్యం కోసం పోరాటంలో ఆయనకు ఆమె ప్రేరణనిచ్చింది. అలాగే, కులం, మతం లాంటి ఆలోచనలన్నిటినీ వదిలిపెట్టి, మనసులో ప్రేమకు మాత్రమే స్థానం కల్పించేలా చేసింది. సోదరి నివేదిత నుంచి సుబ్రహ్మణ్య భారతి ఎంతటి స్ఫూర్తి పొందారంటే, చివరకు తన కవితా సంపుటాల్లో రెండిటిని ఆమెకు అంకితమిచ్చారు. "గురువు"కు అని పేర్కొంటూ, వాటిని ఆయన అంకితం చేశారు.

భారతీయ కళల పట్ల కూడా సోదరి నివేదితకు అమితమైన ఆసక్తి. యువ కళాకారుల బృందం చేసే కళాకృషి మీద ఎంతో ఆసక్తి చూపుతూ, వారిని ఆమె ప్రోత్సహించేది. అలాగే, సోదరి నివేదిత మంచి వక్త. పదునైన పాళీ ఉన్న రచయిత్రి. "ది మాస్టర్ యాజ్ ఐ సా హిమ్", "కాళి – ది మదర్", "క్రాడిల్ టేల్స్ ఆఫ్ హిందూయిజమ్"తో సహా పలు పుస్తకాలను ఆమె రచించింది. భారతదేశంలో సోదరి నివేదిత గడిపిన జీవితం అద్భుతమైన త్యాగం, అంకిత భావం, నిస్స్వార్థ సేవలతో కూడిన మహత్తర గాథ.

"భారతదేశానికి సేవలందించడం కోసమే ఆమె తనను తాను పూర్తిగా అర్పించుకుంది. ఆమె తన సొంత ఉపయోగం కోసం దేన్నీ దాచిపెట్టుకోలేదు.... నిజానికి, ఆమె ప్రజల తల్లి" అని సోదరి నివేదిత గురించి విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ వ్యాఖ్యానించారు. సోదరి నివేదిత తన "సాధన" ద్వారా భారతీయులకు 'యజమానురాలిగా, సేవకురాలిగా, మిత్రురాలిగా' అవతరించిందని చెప్పడంలో అతిశయోక్తి ఎంతమాత్రమూ లేదు. 44 ఏళ్ళ చిన్న వయసులోనే ఆమె మరణించింది. ఎన్నో కీలకమైన ఘట్టాలతో కూడిన జీవితం ఆమెది. జీవించిన కొద్దికాలంలోనే తాను చేపట్టిన మహత్కార్యాన్ని ఆమె విజయవంతం చేసింది.

సోదరి నివేదిత ప్రారంభించిన విద్యాలయం ఈ రోజున 'సోదరి నివేదిత బాలికల ఉన్నత పాఠశాల' పేరిట నడుస్తోంది. రామకృష్ణ – శారదా మిషన్ ఈ పాఠశాలను నడుపుతోంది. కలకత్తాలోని అగ్రశ్రేణి పాఠశాలల్లో ఇది కూడా ఒకటిగా నిలిచింది.

1911 అక్టోబర్ 13న డార్జిలింగ్‌లో సోదరి నివేదిత మరణించింది. రామకృష్ణ, వివేకానందుల సోదరి నివేదితగా తనకు తానే చెప్పుకొనే ఆమె గౌరవార్థం ఆమె అంత్యక్రియలు నిర్వహించిన పవిత్ర స్థలంలోనే ఓ స్మారక చిహ్నాన్ని నెలకొల్పారు. ఆ స్మారక చిహ్నం మీద ఇలా ఉంటుంది: "భారతదేశం కోసం తన సమస్తం అర్పించిన సోదరి నివేదిత విశ్రమించింది ఇక్కడే!" ఆ మాటలు అక్షరాలా నిజం. భారతదేశం కోసం తన జీవితాన్ని పణంగా పెట్టిన ఉత్తమురాలు సోదరి నివేదిత. అందుకే, జన్మతః ఆమె విదేశీయురాలే అయినప్పటికీ, 'భారతీయ మహిళామణిదీపా'ల్లో ఒకరుగా భాసిల్లింది. a

## పండుగలు - పర్వదినాలు

### జూలై - 2007

| | | | |
|---|---|---|---|
| 10 | మంగళవారం | : | ఏకాదశి |
| 16 | సోమవారం | : | పూరీ జగన్నాథ రథయాత్ర |
| 26 | గురువారం | : | ఏకాదశి |
| 30 | సోమవారం | : | గురుపూర్ణిమ |

### ఆగష్టు - 2007

| | | | |
|---|---|---|---|
| 09 | గురువారం | : | ఏకాదశి |
| 10 | శుక్రవారం | : | స్వామి రామకృష్ణానంద జయంతి |
| 24 | శుక్రవారం | : | ఏకాదశి |
| 28 | మంగళవారం | : | స్వామి నిరంజనానంద జయంతి |

2006 డిసెంబర్‌లో తమిళనాడులోని ఆర్కాట్‌లో జరిగిన భక్త సమ్మేళనంలో మాతాజీ రామకృష్ణ ప్రియాంబ ప్రసంగం.

ఋషులూ, మునులూ ప్రార్థించగా కరుణించి దుష్ట శక్తులను నాశనం చేయడానికై భగవతీ దేవి ఈ భూమి పై అవతరించడం, ధర్మస్థాపన చేసి అంతర్ధానమవడం 'శ్రీ దేవీ భాగవతం'లో చదువుతాం. ఈ కలియుగంలో ఆ భగవతీ దేవియే శ్రీశారదాదేవిగా అవతరించి 67 సంవత్సరాలు తన మానవ రూపంలో దైవీ స్వరూపంతో విరాజిల్లింది. ఆమె ఒక సాధారణ గ్రామీణ స్త్రీలా వచ్చి ప్రతి ఒక్కరి పైనా తన కృపా కటాక్షాలను ప్రసరించింది. ఆ దేవి తన దివ్య శక్తులనూ, అద్భుత స్వరూపాన్నీ పూర్తిగా ప్రకటించ లేదు. కేవలం తన మాతృప్రేమతోనే ఆ తల్లి సమస్త విశ్వాన్నీ జయించింది. అమ్మ అందరికీ శరణునిస్తుంది. "నాయనా! నీవెప్పుడు కష్టాలలో ఉన్నా, 'నాకొక అమ్మ ఉంది' అని మాత్రం తలచుకో" అని అమ్మ చెప్పింది. ఆ మాట అమ్మ ఒసగిన అభయ మంత్రం.



ప్రతిష్ఠలు సమాజంలో నవ్వులపాలు కావడం ఆమెకు ఇష్టం లేదు. కొన్నేళ్ళు ఇలా గడవగా, ఆమె పెద్ద కొడుకు తన తండ్రి దుష్ప్రవర్తనతో విసిగి వేసారి, మూడేళ్ళ క్రితం ఇంటి నుండి పారిపోయాడు. ఆమె భర్త కూడా రెండేళ్ళ క్రితం ఇల్లు విడిచి మాయ మయ్యాడు. ఇద్దరు ఆడపిల్లలు, ఒక చిన్న మగ బిడ్డతో ఆమె ఒంటరి అయింది.



# కరుణా సాగరి శారదేశ్వరి

అమ్మ కరుణకు ఎల్లలు లేవు. ఆ తల్లి ప్రేమ పరిధిని తెలుసుకోవడం ఎవరి తరమూ కాదు. కష్టాలలో మునిగి నిరాశా నిస్పృహలలో కొట్టుమిట్టాడే వారిని మన శారదమ్మ తన మాతృ ప్రేమ, కృపా కరుణలతో సేద దీర్చి రక్షిస్తుంది. ఈ సత్యం ఈ రోజుకీ ప్రత్యక్షంగా మనం చూడవచ్చు.

ప్రతి నెలా ఆశ్రమ ప్రాంగణంలో సమావేశాలు నిర్వహిస్తాం. అందులో 'కలమరుదూర్' అనే గ్రామం నుండి 'గుణ సుందరి' అనే ఒక నిరక్షరాస్యురాలైన పేద మహిళ తనను తీవ్ర కష్టాల నుండి శ్రీశారదా మాత ఎలా రక్షించిందీ వివరించింది.

'గుణసుందరి' తన తల్లితండ్రుల ఇంట్లో ఎంతో అల్లారు ముద్దుగా, ప్రేమానురాగాలతో పెరిగిన బిడ్డ. వివాహానంతరం ఆమె తన భర్త ఊరైన 'కలమరుదూర్'కు వచ్చింది. అమాయకురాలైన గుణసుందరి తన భర్త తాగుబోతు అనీ, ఎవరికీ తెలీకుండా తరచూ ఇంటి నుండి పారిపోయేవాడనీ కుంగిపోయేది. అయినా ఎంతో సహనంతో ఓర్చుకొని తన 'కష్టాల్ని' ఎవరికీ తెలుపలేదు. ఎందుకంటే కుటుంబ పరువు

ఇలా తీవ్ర కష్టాలలో మునిగి ఉన్నప్పుడే, ఆమె 'శారదమ్మ'ను గురించి ఇతర స్త్రీల ద్వారా వినడం జరిగింది. ('శారదమ్మ' అనే పేరుతోనే ఆ గ్రామీణ స్త్రీలు శ్రీశారదాదేవిని తమ 'సొంతతల్లి'గా భావిస్తూ పిలుస్తారు).

'కలమరుదూర్' గ్రామంలో 'ఉళుందూర్ పేట్' ఆశ్రమం ఒక సమితిని ఏర్పరిచింది. ప్రతీ 15 రోజులకూ అక్కడి గ్రామీణ స్త్రీలు సమావేశమవుతారు. శ్రీశారదాదేవిని అక్కడి గ్రామీణ స్త్రీలందరూ తమ 'కులదేవత'గా పూజిస్తారు. శారదా దేవి చిత్రపటాన్ని ఒక్కోరోజు ఒకరి ఇంట్లో ప్రతిష్ఠించి, భక్తి శ్రద్ధలతో పూజించి నైవేద్యం సమర్పించడం అక్కడ ఆనవాయితీ. ప్రతి ఒక్కరూ 'శారదమ్మ'ను తమ ఇంటికి ఆహ్వానించి, పూజించి సేవించాలని కోరుకుంటారు. కనుక ఒకరి ఇంట్లో కేవలం ఒక రోజు మాత్రమే అమ్మ ఫోటోను ఉంచుకోవచ్చు.

ఒక సమావేశం రోజు 'గుణసుందరి'కి ఈ శారదమ్మ తనను రక్షించడానికే తమ ఊరికి వచ్చిందని గట్టి నమ్మకం కలిగింది. కాబట్టి, ఆరోజు తోటి స్త్రీలందరితో శారదమ్మ

ఫోటోను తన ఇంటికి తీసుకెళ్ళి పూజ చేస్తానని చెప్పింది. కష్టాలు, బాధలు తనకు చాలా ఎక్కువగా ఉన్నాయి కనుక, అమ్మను 10 రోజుల పాటు తన ఇంట్లో ఉంచుకొని పూజిస్తానని అభ్యర్థించింది. 'అమ్మ'ను చాలా బాగా చూసుకొంటానని విన్నవించింది.

అలా 'శారదమ్మ'ను తన ఇంటికి తీసుకెళ్ళి ఆమె చేసింది – శాస్త్రోక్తమైన సాంప్రదాయిక పూజలు కాదు. ఆమె తన ప్రేమ పూర్వకమైన సరళ హృదయంతో తనదైన నిరాడంబర శైలిలో అమ్మను పూజించడం ప్రారంభించింది.

వారి ఇంట్లో వేరుగా పూజ గది లేదు. ధాన్యం నింపే గోనె సంచీపై ఒక కొత్త గుడ్డ పరిచి, దానిమీద 'అమ్మ'ను ప్రతిష్ఠించి, తనకు తోచినట్లు పూజ చేస్తూ తనకు చేతనైన నైవేద్యం సమర్పించేది – అన్నమో, పాలో లేదా పాయసమో!

పగలంతా కష్టపడి పనిచేసి వచ్చి రాత్రి పూట ఎంతో వ్యాకులతతో ఆమె 'అమ్మ' ముందు ప్రతిరోజూ హృదయ విదారకంగా ప్రార్థించేది. "అమ్మా! శ్రీశారదాదేవీ! నేను నీ కూతుర్ని కాదా అమ్మా! సాయపడేవారు, "నా" అనే వారు నాకెవ్వరూ లేరు! నీ పావన పాదాలు మాత్రమే నాకు శరణ్యం తల్లీ! నా భర్త తాగుబోతు కావడం వల్ల మమ్మల్ని వదలి ఎక్కడికో వెళ్ళిపోయాడు. ఆయన ప్రవర్తనతో తీవ్ర నిరాశ చెంది, నా పెద్ద కొడుకు కూడా ఇల్లు విడిచి వెళ్ళిపోయి ఎక్కడో ఉంటున్నాడు. భర్త లేకుండా ఒంటరిగా గడిపే నా ఈ దురవస్థ చూసి లోకం దుమ్మెత్తి పోస్తుంది. సహాయం చేయవమ్మా తల్లీ! నా భర్తను నీవు తప్ప ఇంకెవ్వరూ బాగుపరచలేరు. నీ కృపాశీస్సులు ఉంటేనే ఆయన ఇంటికి తిరిగి రాగలడు. నా భర్త, నా పుత్రుడు – వీరిద్దరికీ సద్బుద్ధిని ప్రసాదించి, ఆశీర్వదించు అమ్మా! ఇద్దరూ త్వరగా ఇంటికి తిరిగొచ్చేలా ఆశీర్వదించు తల్లీ! నీవే శరణం!" – ఈవిధంగా వ్యాకులత నిండిన హృదయంతో, తీవ్ర ఆవేదనతో కన్నీళ్ళు నింపుకొని అమ్మ ముందు, సాక్షాత్తూ తనకు జన్మనిచ్చిన తల్లే తన ముందు కూర్చున్నట్లు భావిస్తూ ఆమె ప్రార్థించింది. ఆమెకు తన ముందు ఉన్నది కేవలం శారదాదేవి ఫోటో కాదు – సజీవమైన కన్న తల్లే! ఇలా పది రోజులు పూజలు, ప్రార్థనలు పూర్తయ్యాక మాట ఇచ్చినట్లే మరో భక్తురాలికి 'అమ్మ' ఫోటోను వాపసు చేసింది.

ఆ తరువాత ఆమె అనుకున్నట్లు ఏమీ జరుగకపోవడంతో చాలా నిరాశ చెందింది. ఓ వారం తరువాత అందర్నీ ఆశ్చర్యపరుస్తూ– ఆమె భర్త ఇంటికి తిరిగి రావడమే కాదు, తన చెడు ప్రవర్తనకు క్షమించాల్సిందిగా ప్రార్థిస్తూ ఇకపై తాను మద్యం ముట్టుకోనని పిల్లల ముందు ప్రతిజ్ఞ చేశాడు! 'అమ్మ' శారదాదేవి అపార కరుణ, కృపా కటాక్షాలు ప్రత్యక్షంగా చూస్తున్న గుణ సుందరి ఆనందబాష్పాలు రాల్చింది! అంతేకాదు, ఎప్పుడో పారిపోయిన ఆమె పెద్ద కొడుకు కూడా నాలుగు రోజుల తరువాత అకస్మాత్తుగా ఇంటికి తిరిగి వచ్చాడు.

గుణసుందరి ఆనందానికి హద్దులు లేవు! ఆమె తన కుటుంబ సభ్యులందరినీ ఆ రోజు అమ్మ పూజ జరుగుతున్న ఇంటికి తీసుకెళ్ళింది. అమ్మ ముందు మోకరిల్లి గట్టిగా ఇలా విలపించసాగింది: "అమ్మా! నీవు నాతో ఉన్నావు తల్లీ! నీవు నిజంగా నా తల్లివే! అన్న మాట ఇప్పుడు ఋజువు అయ్యిందమ్మా! కేవలం ఒక తల్లి మాత్రమే తన కూతురు కష్టాల్ని అర్థం చేసుకోగలదు. చూడమ్మా! నీ పిల్లలందరూ వచ్చేశారు! నా భర్త కూడా తాగుడు పూర్తిగా మానేశానని నీ సమక్షంలో పిల్లలపై ప్రమాణం చేశాడు! నీ కెలా కృతజ్ఞతలు తెలుపగలను తల్లీ!"

ఆ గ్రామీణ స్త్రీకి 'భక్తి' అంటే ఏమిటో తెలీదు! పూజా పద్ధతులు ఏమీ తెలియవు! మంత్ర తంత్రాలు ఏమీ తెలియవు! కానీ, ఆమెకు ఒకటి మాత్రం తెలుసు! 'శారదమ్మ' పై పరిపూర్ణ శ్రద్ధ, విశ్వాసం ఎలా ఉంచాలో ఆమెకు బాగా తెలుసు!

ఆమె శ్రీశారదాదేవి తన సొంత తల్లి అనీ, మహాదేవి అనీ, అమ్మ సదా తనను తప్పక రక్షిస్తుందనీ దృఢంగా, పరిపూర్ణంగా నమ్ముకొంది, విశ్వసించింది!

అలాంటి అచంచల విశ్వాసానికి ఆ దేవి కూడా తన కృపాకటాక్షాలు వర్షింపజేసింది. మనకూ అలాంటి శ్రద్ధా విశ్వాసాలు ఉంటే ఆ తల్లి మనల్ని తప్పక ఉద్ధరిస్తుంది!

కాబట్టి, అందరికీ కావలసిందల్లా విశ్వాసం! శ్రద్ధ!! ఈ కలియుగంలో భగవంతునిపై పరిపూర్ణ శ్రద్ధా విశ్వాసాలు కలిగియుండటమే సకల వేద శాస్త్రాల సారాంశమని శ్రీరామకృష్ణులు పలికారు. అసంభవాలు కూడా అమ్మ కృప వల్ల సంభవమవుతాయి! మనల్ని అన్ని కష్టాల నుండీ రక్షించి, శాంతి, ప్రేమానందాలు అందించటానికే శ్రీశారదా దేవి ఈ భువిపై అవతరించింది. కరుణాసాగరి అయిన శారదమ్మను ఆర్తితో ప్రార్థిస్తే ఆమె కృపాకటాక్షాలు తప్పక ఉంటాయని గుణసుందరి స్వీయ అనుభవమే మనందరికీ ఒక నిదర్శనం. a

– విలేఖనం : స్వామి అర్చనానంద

# ఋణత్రయం

- డాక్టర్ సంధ్యావందనం లక్ష్మీదేవి

సమస్త జీవరాశులలో మానవజన్మ అమూల్యమైనది. మనం ఈ జన్మలో అనుభవించే సుఖదుఃఖాలకు కారణం, గత జన్మలలో మనం చేసిన మంచి చెడుల కర్మ ఫలమే. మానవులకు సుఖం కావాలి, దుఃఖం వద్దు. *"సుఖం మే భూయాత్", "దుఃఖం మా భూయాత్"* – అని రోజూ కోరుకుంటాం. మానవులకు శాంతి సౌభాగ్యాలు కావాలంటే సత్కార్యాలను ఆచరించడమే ఏకైక మార్గం.

*"జాయమానో వై నరః త్రిభిః ఋణవాన్ జాయతే"* (తైత్తిరీయ సంహిత) జన్మించిన ప్రతి మనిషికీ మూడు ఋణాలుంటాయి. అవి: పితృ ఋణం, దేవ ఋణం, ఋషి ఋణం.



**పితృ ఋణం :** మనల్ని కని, పెంచి, కష్టపడి విద్యాబుద్ధులు చెప్పించి, సమాజంలో మనకు గౌరవ స్థానం కల్పించి మన కొరకు ఎన్నో త్యాగాలు చేసిన తల్లి తండ్రులకు మనం ఎంతో ఋణపడి ఉన్నాం. ఆ ఋణం తీర్చుకునేందుకు మనం వారిని శ్రద్ధతో ఆదరించి, సేవించి వారిమాటకు మాన్యతనిచ్చి వారికి అనుకూలంగా జీవించాలి. అలా చేస్తేనే 'పితౄణం' తీర్చుకున్నట్లు అవుతుంది.

ఈ పితౄణంలో రెండో భాగం, మన పెద్దలు మనల్ని ఏ విధంగా కని, పెంచి, సంస్కారవంతుల్ని చేశారో అలాగే మనం కూడా ఉత్తమ గృహస్థులమై సద్గుణ వంతులైన సంతానానికి జన్మనివ్వాలి, వారిని సంస్కారవంతుల్ని చేయాలి. సత్ పౌరుల్ని చేయాలి. మాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి, దేశభక్తి, దైవభక్తి అనే పంచ సౌశీల్యాలను వారికి బోధించి, జాతి గర్వించదగ్గ రత్నాలుగా తీర్చిదిద్దాలి. సంతానాన్ని మంచి వారిగా తీర్చిదిద్దినప్పుడే మన వంశానికి, దేశానికి మేలు జరుగుతుంది. అందుకే పెద్దలు పితృయజ్ఞంలోని ఈ భాగానికి ప్రాధాన్యమిచ్చారు.

**దేవ ఋణం:** పృథ్వి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం – ఇవి పంచ భూతాలు. ఇవి జడ దేవతలు. ఈ దేవతలను నిత్యం వాడుకుంటున్నాం. వాటిని అపవిత్రం చేస్తున్నాం. వాటిని శుద్ధి చేసే బాధ్యతను పరమాత్ముడు మానవులకే అప్పగించాడు. అందుకై నిత్యం ప్రాతః సాయం సంధ్యాసమయాలలో అగ్నిహోత్రం చేయాలి. *'అగ్నిర్ వై దేవానాం ముఖం'* –అగ్నిహోత్రం దేవతలందరికీ ముఖం, అంటే నోరు లాంటిది. దేవతల్ని శుద్ధి చేయాలంటే అగ్నిహోత్రం ద్వారానే చేయాలి. సుగంధ ద్రవ్యాలు, ఆవు నెయ్యి మొదలైన పుష్టికర పదార్థాలతో హోమం చేయాలి. ఇదొక వైజ్ఞానిక ప్రక్రియ. దీని ద్వారా 'దేవ ఋణం' తీరుతుంది.

**ఋషి ఋణం :** ఋషులు వేదాలు, ఉపనిషత్తులు, బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, గృహ్య సూత్ర గ్రంథాల ద్వారా మానవ శ్రేయస్సుకు మార్గాల్ని ఉపదేశించారు. వాటిని తెలుసుకొని ఆచరించాలి. ఋషులు త్రికాలజ్ఞులు. భూత భవిష్యత్ వర్తమానాలు వారికి తెలుసు. పరమాత్ముని వేద జ్ఞానాన్ని గ్రహించి గురుశిష్య పరంపరగా భావితరాలకు అందిస్తూ వచ్చిన ఋషులకూ, గురువులకూ ఋణపడ్డాం. వారి ఋణం తీర్చుకోవాలి. అందుకు జ్ఞానాన్ని ఆశ్రయించాలి. జ్ఞానం లేకుంటే మనిషి హీనంగా జీవిస్తాడు.

*'న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే'*

విద్యకూ, జ్ఞానానికీ మించిన పవిత్రమైన వస్తువు ఈ లోకంలో మరొకటి లేదు. ఋషి ఋణం తీర్చుకోవాలంటే మనం విద్యావంతులం, బుద్ధిమంతులం, జ్ఞానవంతులం కావాలి. తరువాత తరాల వారికి ఆ జ్ఞానాన్ని అందించాలి. ఇది గొప్ప తపస్సు లాంటిది. మనిషి ఇక్కడే కైవల్యానికి దారులు వేసుకుంటాడు. దీని ద్వారా ఋషుల ఋణం తీరుతుంది. c

# సహనంతో సర్వం సాధ్యం!

శిష్యునిగా రాణించాలంటే సహనం కీలకం. అందుకే "లక్షమంది గురువులు లభిస్తారు. కానీ శిష్యుడొక్కడైనా దొరకడం కష్టం." అని అంటారు. శిష్యుడవడం అంత సులభమైన పనికాదు. విశేషమైన సన్నాహం కావాలి. అనేక నియమాలను పాటించాలి. శిష్యుడు అంతరింద్రియ, బహిరింద్రియ నిగ్రహాన్ని అలవరచుకోవాలి. ఇంకా అనేక ఆధ్యాత్మిక గుణగణాలలో సుప్రతిష్ఠుడు కావాలి.



బహిరింద్రియాలు మనకు కనబడుతుంటాయి. అంతరింద్రియాలు మనకు కనబడేవి కావు. మనం సదా ఈ ఇంద్రియాల పిలుపులను వినిపించుకొంటూ, అవి ఆడించినట్లు ఆడుతుంటాం. ఈ ఇంద్రియాలకు సంబంధించిన వస్తువులు బాహ్య ప్రపంచంలో అంతటా ఉన్నాయి. దగ్గరలో ఏవైనా వస్తువులుంటే వాటిని చూడమని ఇంద్రియాలు మనల్ని నిర్బంధిస్తాయి. చూడడం, చూడకపోవడం మనకు సుసాధ్యాలైన పనులు కావు. మనకు స్వతంత్రం లేదు. ఇక్కడో పెద్ద ముక్కు ఉంది. ఎక్కడ నుంచో మంచివాసన వస్తోంది. నేను ఆఘ్రాణించ వలసిందే.

మనమెలా అయ్యామో చూడండి! మనల్ని మనమే బంధించుకొన్నాం. నాకు కళ్ళున్నాయి. ఎదుటనున్నది ఎలాంటిదైనా సరే చూసి తీరవలసిందే. ఎవరైనా అప్రియంగా మాట్లాడినా నేను విని తీరవలసిందే. నా శ్రవణేంద్రియం నన్నా విధంగా నిర్బంధిస్తుంది. పొగడినా, తెగడినా- మానవుడు వినే తీరాలి.

ఈ ఇంద్రియాలన్నీ - బహిరింద్రియాలు, అంతర్ ఇంద్రియాలు శిష్యుడి అధీనం కావాలి. శ్రమపడి అభ్యాసం చేసి చేసి అతడా స్థితికి రావాలి. ఇంద్రియాల ప్రేరణలకు, ప్రకృతి ఆజ్ఞలకు వ్యతిరేకంగా మనస్సును దృఢంగా అతడు వశం చేసుకోవాలి. "నువ్వు నా దానవు నిన్నాజ్ఞాపించ వలసింది నేను. నువ్వు దేన్నీ చూడొద్దు, వినవద్దు" అని మనస్సును ఆదేశించాలి. మనస్సు ఆ ఆజ్ఞను శిరసావహిస్తుంది. అప్పుడది దేన్నీ చూడదు, వినదు. ఏ రూపమైనా, శబ్దమైనా మనస్సును చలింప జేయలేదు. ఇంద్రియాల ఆధిపత్యం నుంచి మనస్సు విడివడ్డ స్థితి అది. వాటి నుంచి మనస్సు వేరుపడింది. అది ఇక ఇంద్రియాలను గానీ, దేహాన్ని గానీ అంటిపెట్టుకోలేదు. అప్పుడు బాహ్యవస్తువులు మనస్సును ఆజ్ఞాపించలేవు. వాటిని అంటిపెట్టుకోవడానికి మనస్సు ఇప్పుడు నిరాకరిస్తుంది. మీరీ దశను పొందినప్పుడు శిష్యులవడానికి అర్హత పొందారని గ్రహించండి. ఇందుచేతనే "మీకు సత్యం తెలిసిన పక్షంలో ఇంద్రియ నిగ్రహం సాధ్యం. మీకు సంయమశక్తి ఉంటే ఈ ఇంద్రియాలను అదుపులో పెట్టి చూపండి" అని నేను అంటాను. మనస్సెప్పుడూ బహిర్ముఖమై పరుగెత్తుతుంది. నేను ధ్యానం చెయ్యడానికి ఉపక్రమించగానే లోకంలోని తుచ్ఛ విషయాలన్నీ మనస్సులోకి పరుగెత్తివస్తాయి. మనస్సు స్వాధీనం తప్పి, చంచలంగా ఉన్నంతదాకా ఆత్మజ్ఞానం అసాధ్యం. మనోనిగ్రహం కోసం సాధన చేయాలి.

శిష్యుడికి సహనశక్తి అపారంగా వుండాలి. జీవితం సుఖంగా ఉన్నట్లు కనిపిస్తుంది. అన్నీ అనుకూలంగా ఉన్నప్పుడు మీతో మనస్సు సరసంగా వ్యవహరిస్తుంది. కానీ ఏదైనా ప్రతికూలమైనప్పుడు మనస్సుకు స్వాస్థ్యం తప్పిపోతుంది. అది మంచిది కాదు. దుఃఖాలనూ, కష్టాలనూ సణుగుడు లేకుండా భరించు. నీకు అపకారం జరిగినట్లు భావించవద్దు. ప్రతిక్రియ అనే ఆలోచన లేకుండా భరించాలి. ఇది యథార్థమైన సహనం. ఇలాంటి సహనాన్ని అలవరుచుకుంటే సర్వం సాధించవచ్చు. c

**(స్వామి వివేకానంద సాహిత్య సర్వస్వం 'లేవండి! మేల్కొనండి' నుంచి)**



# స్వామి జపానంద స్వీయ అనుభవాలు -1

**రా**మకృష్ణ సంఘ వరిష్ఠ సన్న్యాసులలో స్వామి జపానందజీ (1898 - 1972) ఒకరు. ఆయన 1898 మే 5వ తేదీన బుద్ధ పూర్ణిమనాడు బెంగాల్‌లోని హుగ్లీ జిల్లాలో చందన్ నగర్‌లో జన్మించారు. పదిహేనవ ఏట నుంచి బేలూరు మఠానికి వెళ్లడం ప్రారంభించిన ఆయన 1916లో ఇల్లు విడిచి మఠంలో చేరారు. ఆయనకు భగవాన్ శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులైన స్వామి బ్రహ్మానందజీ, స్వామి శివానందజీ, స్వామి సుబోధా నందజీల సాహచర్యం లభించింది. 1918 ఆగస్టు 22న శారదామాత ద్వారా మంత్రదీక్ష పొందారు. 1920లో వారణాసిలో స్వామి బ్రహ్మానందజీ వద్ద సన్న్యాస దీక్ష తీసుకున్నారు. అనంతర కాలంలో స్వామి జపానందజీ ఢాకా, రాజ్‌కోట్‌లలో శ్రీరామకృష్ణ ఆశ్రమ అధ్యక్ష బాధ్యతలు నిర్వహించారు. సన్న్యాస జీవితం గడుపుతున్న రోజులలో ఆయన ఆ పరమేశ్వరుణ్ణే నమ్ముకొని ఒక పరివ్రాజకునిగా భారత దేశంలోని అనేక తీర్థస్థలాలు పర్యటించారు. ఇతరులకు సైతం ఉపయుక్తంగా ఉండి, ప్రేరణ కలిగించడం కోసం స్వామి జపానందజీ తమ దేశ పర్యటన అనుభవాలను 'ప్రభు పరమేశ్వర్ జబ్ రక్షా కరే' అనే శీర్షిక కింద అక్షరీకరించారు. ఓ సన్న్యాసి విశిష్ట అనుభవాల సంకలనమైన ఈ భ్రమణ గాథ సామాన్యులకు సైతం ఉపకరిస్తూ, ఆసక్తి దాయకంగా సాగుతుంది. ఆ అనుభవాలకు అక్షరరూపంగా 'స్వామి జపానంద స్వీయ అనుభవాలు' ఇక నుంచి ప్రతి నెలా మీ కోసం! స్వామి జపానందజీ తనకు స్వయంగా ఎదురైన ఈ అనుభవాలను సైతం 'నేను, నాకు' అంటూ ఉత్తమ పురుషలో కాక, 'ఓ సాధువుకు' అంటూ ప్రథమ పురుషలో సార్వజనీనంగా చెప్పడం విశేషం. c



స్వామి జపానంద

# నర్మదా తీరంలో కాష్ఠ మౌనవ్రతం

**ఒ**కసారి స్వామి జపానంద పరివ్రాజక సన్న్యాసిగా జీవితం గడుపుతూ పావన నర్మదా నదీతీరంలో సంచారం చేస్తున్నారు. మధ్యప్రదేశ్‌లోని హోషంగాబాద్‌లో బయల్దేరి, గుజరాత్‌లోని భరుచ్ (భృగు కచ్) దగ్గరకు చేరారు. అక్కడ ఆయన 'కాష్ఠ మౌనవ్రతం' చేయడానికి నిశ్చయించుకున్నారు. అది చాలా కష్టమైన వ్రతం. ఎందుకంటే మామూలు మౌనవ్రతంలో సంకేతాల ద్వారా లేక వ్రాత ద్వారా ఎవరికైనా ఏమైనా తెలియజేయవచ్చు. 'కాష్ఠ మౌనవ్రతం'లో కంటితో కూడా సైగ చేయకూడదు. ఏ భావమూ వ్యక్తం చేయకుండా (కర్రలా) నిశ్చలంగా ఉండాలి. అందుకే దాన్ని 'కాష్ఠమౌనవ్రత'మంటారు. పావన నర్మదానదీ తీరంలో స్వాత్మానందంతో ధ్యానం చేసుకోవచ్చు, ధ్యానానికి ఏ విధంగానూ భంగం కలగదని భావించి ఆ విధమైన వ్రతం మొదలుపెట్టారు.

పరివ్రాజక జీవితంలో ఈ విధమైన వ్రతం చాలా ప్రమాదాలతో కూడుకున్నది. భిక్ష దొరకనప్పుడు ఆకలితోనే ఉండిపోవాలి. ఉండడానికి స్థలం లభించకపోతే అడవుల్లోనూ చెట్లకిందా గడపాలి. అన్న పానీయాలు లేకుండా ఉండడం చాలా కష్టమైన పని. ఒక్కొక్కసారి మృత్యువాత కూడా పడతారు. ఏమైనాసరే ఆ వ్రతం చేయాలని తీర్మానించుకున్నారు. అంతా ఆ దేవుని దయ అనుకుని చేయడం ప్రారంభించారు.

భరుచ్ నుంచి నర్మదానది ప్రవాహ దిశలో 8 మైళ్ళ దూరంలో చిన్న గ్రామం ఉంది. అందమైన స్థలం. నది ఒడ్డున విశాలమైన అశ్వత్థ (రావి) వృక్షం, పక్కనే శివాలయం, రావి చెట్టు చుట్టూ సిమెంటుతో కట్టిన చక్కటి అరుగు ఉన్నాయి.

సన్న్యాసి (స్వామి జపానంద) అక్కడికెళ్ళి కూర్చున్నారు. నదీతీరంలో ఉన్న తీర్థస్థలం అవడంతో చాలా మంది అక్కడకు వచ్చి నదిలో స్నానం చేసి శివుని దర్శనం చేసుకుని వెళుతున్నారు. మధ్యాహ్నమైంది. సన్న్యాసికి ఆకలి వేయసాగింది. భక్తులు వస్తున్నారు, వెళుతున్నారు. స్త్రీలు వచ్చి రావి చెట్టుకు నీరు పోసి, సన్న్యాసి వైపు ఒకసారి చూసి వెళ్ళిపోతున్నారు.

అపరాహ్ణం మూడు గంటలై ఉంటుంది. ఒక సజ్జనుడు దైవ దర్శనం చేసుకుని వచ్చి "నమో నారాయణ" అని పలకరించాడు. "ఎప్పుడు వచ్చారు? భిక్ష దొరికిందా?" అని అడిగాడు. సమాధానం రాకపోవడంతో ఒక్క క్షణం ఆలోచించి అక్కడ నుంచి వెళ్ళి, ఆలయ పూజారిని పిలుచుకొని వచ్చాడు. సన్న్యాసిని చూపించి, "ఈ సన్న్యాసి ఎప్పుడు వచ్చారు? ఎవరైనా భిక్ష పెట్టారా లేదా?" అని అడిగాడు. దానికి ఆ పూజారి "ఉదయాన్నే వచ్చారు. ఎవరినీ ఏమీ అడగ లేదు. ఏమైనా తిన్నారో, లేదో తెలియదు" అన్నాడు. ఒక పళ్ళెంలో రొట్టెలు, దాల్ (పప్పు) తీసుకొచ్చి సన్న్యాసికి పెట్టారు. ఆ విధంగా ఆ రోజు ఆయన ఆకలి తీరింది.

ఆనాటి నుంచి రోజూ ఆ సమయానికి రొట్టెలు, కూర, దాల్– ఏది ఉంటే అది ఆ పూజారి తీసుకువచ్చి, సన్న్యాసి ముందు ఉంచేవారు. ఆ విధంగా భోజనం సులువుగానే దొరికేది. అయితే కొంత మంది గ్రామస్థులు అక్కడకు రోజూ వచ్చి రాత్రి పన్నెండు, ఒంటి గంట వరకు కూర్చొని, లౌకిక విషయాలు చెప్పుకునేవారు. ధూమపానం చేస్తూ కాలక్షేపం చేసేవారు. అరుదుగా మాత్రమే ధార్మిక చర్చలు చేసేవారు.

సాధువు వాళ్ళను రావద్దని చెప్పలేరు. చెప్పినా వాళ్ళు అర్థం చేసుకునే మనుష్యులు కాదు. దీంతో ధ్యానం కుదరక మనస్సులో అశాంతి మొదలైంది. ఒకనాడు ఆ సాధువు నది ప్రవహిస్తున్న దిశలో రెండు మైళ్ళ దూరం వరకు నడిచి వెళ్ళి ఒక నిర్జన ప్రదేశం చూశారు. అక్కడ ఓ పెద్ద మర్రి చెట్టు, దాని దగ్గరలోనే శిథిలమైపోయిన చిన్న చిన్న దేవాలయాలు ఉన్నాయి. ఒక బావి కూడా ఉంది. బావిలోని నీటి రుచి చూద్దామని సాధువుకు అనిపించింది. అక్కడే ఉన్న తాడుకి తన కమండలం కట్టి, నీళ్ళు తోడి, తాగి చూశారు. నీళ్ళు చాలా ఉప్పగా ఉన్నాయి.

అంతలోనే ఆ శిథిలమైన గుడిలో నుంచి ఒక వృద్ధ వైష్ణవుడు వచ్చి "నీళ్ళు చాలా ఉప్పగా ఉంటాయి. కాచుకుని తాగాలి. టీ తాగాలనుంటే ఇక్కడకు రండి" అని అక్కడే శిథిలాల మధ్యలో ఉన్న ఒక దుకాణం దగ్గరకు తీసుకెళ్ళాడు. అందులోనే ఆ వైష్ణవుడు ఉంటాడు. టీ కాస్తూ చాలా విషయాలు చెప్పాడు. చివరిలో "మీరు ఇక్కడకు వచ్చి ఉండండి. నేను మీ సేవ చేస్తాను. గ్రామంలోకి వెళ్ళి భిక్ష తీసుకొని వచ్చి, మీ కోసం వండి పెడతాను. ఏకాంత వాసం చేయాలనుకుంటే ఇక్కడకు వచ్చి ఉండండి" అని అన్నాడు.

సాధువు మౌనంగానే తన సమ్మతి తెలిపి, మర్నాడు సాయంత్రం అక్కడకు వచ్చి మర్రిచెట్టు కింద ఆసనం వేసుకున్నారు. నలుపక్కలా సువిశాలమైన మైదానం. దగ్గరలోనే ఒకటిన్నర, రెండు మైళ్ళ వెడల్పు గల విశాలమైన నర్మదానది ప్రవహిస్తూ ఉంది. నీరు బురద రంగులో ఉప్పగా ఉంది. తాగడానికి పనికిరాదు. దగ్గరలో ఒక పల్లె కానీ, గ్రామం కానీ ఏదీ లేదు. జనసంచారం తక్కువగా ఉన్న ఆ స్థలం సన్న్యాసికి ఎంతో నచ్చింది. సూర్యాస్తమయం తరువాత పూర్తిగా నిర్మానుష్యంగా ఉండేది. నదిలో వెల్లువ వచ్చినప్పుడు గాలి బాగా వీచేది. గాలితో దుమ్ము, ధూళి బాగా ఎగిరేవి. గాలి హోరులో ఒక విధమైన శబ్దం వచ్చేది. ఆ చెట్టు కింద నివాసం సాధువుకు ఆనందాన్నిచ్చింది. c **(సశేషం)**

***అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి***

# స్వప్రయత్నమా? ప్రారబ్ధమా?

– కె. శ్రీనివాస్



**జీ**వితంలో మనకు ఎదురయ్యే జయాపజయాలు... సుఖదుఃఖాలు... స్వయం కృతమా? లేక ప్రారబ్ధ ఫలితమా? వాటిని అధిగమించగలమా? లేక అనుభవించే తీరాలా? ఈ సందేహాలు ఎదో ఒక సమయంలో మనల్ని వేధించక మానవు. మన శాస్త్రాలు సైతం వివిధ సమయాలలో విభిన్నమైన సమాధానాలనిస్తాయి.!

గతంలో చేసిన పనుల ప్రకారమే ప్రస్తుతం ఫలితాలు లభిస్తాయనేది ప్రారబ్ధ సిద్ధాంతం. ప్రయత్నం చేస్తేనే భవిష్యత్తులో ఫలితాల్ని పొందగలమనేది స్వప్రయత్న సిద్ధాంతం! ఫలితాలపై మన ప్రభావం శూన్యమని ఒకటి చెబితే వాటిని స్వయం కృషితో సృష్టించాల్సింది మనమేనని మరొకటి చెబుతుంది. స్వప్రయత్నంతో సిద్ధించే ఫలితం ఏంటో సులభంగానే మనకు అర్థమవుతుంది. కానీ ప్రారబ్ధాన్ని అంగీకరిస్తే మనకు ఒరిగే లాభమేంటో మన తర్కానికి అంత సులభంగా అందక సతమతపెడుతుంది.

**స్వప్రయత్నంతో దేన్నయినా సాధించవచ్చా?**

కొద్దిగా ప్రయత్నిస్తే పొందగలిగే వాటి విషయంలో ఈ ప్రశ్న తలెత్తదు. కానీ శక్తికి మించిన పనిని తలకెత్తుకున్నప్పుడు మాత్రమే మనలో ఈ సందేహం ఉదయిస్తుంది! స్వప్రయత్నంతో దేన్నయినా సాధించవచ్చునంటే దాని అర్థం – కోరిన ఫలితాలను పొందే వరకూ ప్రయత్నించడం ఆపవద్దని! అంతేకానీ, ప్రయత్నాన్ని మధ్యలోనే ఆపివేసి ఫలితాలు రాలేదని నిందించడం సరి కాదు. విజయానికి కావలసినంత శక్తిని వ్యక్తీకరించ గలిగినప్పుడే విజేతలుగా నిలువ గలమని స్వామి వివేకానంద చెబుతారు.

ఒకవేళ లక్ష్యం మనశక్తికి మించినదైనప్పుడు నిర్ణీత కాలంలో దాన్ని సాధించలేక పోవచ్చు. నిర్దేశించుకున్న విధంగా పనిని పూర్తిచేయలేక పోవచ్చు. కానీ శక్తి మేరకు కృషి చేస్తే మనం లక్ష్యం వైపుగా ప్రగతి సాధించి తీరుతాం! అసలు ప్రయత్నమే చేయకుండా ఉండడం కన్నా ఎంతో కొంత పురోగతి మేలే కదా!! అందుకే యోగి వేమన "సాధనమున పనులు సమకూరు ధరలోన" అంటూ ప్రయత్నం చేయమని ప్రోత్సహిస్తారు. "కార్యాన్ని సాధించాలంటే కష్టపడక తప్పదు. సింహమైనా సరే నోరు తెరుచుకొని కూర్చుంటే ఆహారం అందదు కదా!" అని 'హితోపదేశం' అనే గ్రంథం ప్రయత్నశూన్యులకు చురకలు వేస్తుంది.

**మనస్తత్వ లోపాలను సరిదిద్దే భావనే ప్రారబ్ధం :**

చేసిన ప్రయత్నం ఫలితంగానే విజయమో, పరాజయమో ప్రాప్తిస్తుంది. కానీ విజయపథంలో పయనిస్తున్నప్పుడు మనం స్వశక్తితో సర్వం సాధించవచ్చని భావించ వచ్చు!! ఈ విశ్వాసం మితి మీరితే అహంకారంగా పరిణమిస్తుంది. అప్పుడు మనకు శాంతి సహజంగానే సుదూర మవుతుంది.



మిగతా 30వ పేజీలో....

## మనసు - మర్మం

- శ్రీరామ్

# ధ్యానానికి దగ్గరి దారి

**మ**నసు బాధితులై బాధపడని వారుండరు. ఈ మనసే మనల్ని అన్ని రకాల కష్టాలకూ గురిచేసి అల్లకల్లోల పరుస్తుంది. అదృశ్యంగా ఉంటూనే అల్లరిచేయడంలో ఆరితేరిన ఈ శత్రువు ఆట కట్టించాలని మనలో చాలా మందికి ఉంటుంది.!

**చేయబోతే చాలా కష్టం.!!**

మన(సు)లోని అశాంతిని రూపుమాపేందుకు సాధారణంగా ధ్యానం చేయమంటారు. శ్వాస మీదనో, ఏదైనా రూపం మీదనో మనసును కేంద్రీకరించమంటారు. ధ్యానంతో పొందే లాభాలను వివరంగా విశదీకరిస్తారు. ఈ విషయాలు వినడానికి చాలా ఆసక్తికరంగానూ, చేయబోతే చాలా కష్టంగానూ ఉంటాయి. ధ్యానాన్ని ఎక్కడ మొదలు పెట్టాలో, ఎలా కొనసాగించాలో తెలియక పోవడమే దీనికి కారణం.

చెల్లాచెదరైన మనసు

**వెల్లువెత్తే ఆలోచనలు :**

ధ్యానంలో మనం ఒక విషయాన్ని గురించి ఆలోచించాలని అనుకొంటాం.! మరుక్షణమే మరెన్నో ఆలోచనలు వెల్లువలా మనల్ని ముంచెత్తుతాయి. అంటే ఎన్నో ఆలోచనలుగా మనసు ముందే చెదిరిపోయి ఉందన్నమాట! కానీ మనం ఉన్న పరిసరాలు, చేస్తున్న పనిలో మన శ్రద్ధను బట్టి కొన్ని ఆలోచనలు ప్రాధాన్యం వహించడం వల్ల మిగిలిన ఆలోచనల సంగతి మనకు తెలియదు.! ఉదాహరణకు... మనకు ఇష్టమైన పుస్తకం చదువుతున్నప్పుడు లేక మనసుకు ఆహ్లాదాన్నిచ్చే పనులు చేయాల్సివచ్చినప్పుడు పరిసరాలను విస్మరిస్తాం. స్వల్పమైన శారీరక ఇబ్బందులను అసలు పట్టించుకోం.! అవే పరిస్థితుల్లో మనకు విసుగు పుట్టించే పనుల్ని చేస్తున్నప్పుడు ఎంతో అసౌకర్యానికి గురి అవుతాం. అదే విధంగా ఏదైనా ఆలోచనలో నిమగ్నమైనప్పుడు మనకు ఇతర ఆలోచనల సంగతి తెలియదు, మిగిలిన అన్ని సమయాల్లో అనవసరమైన ఆలోచనలు అంతులేకుండా మనల్ని బాధపెడుతూనే ఉంటాయి.

**అనవసర ఆలోచనలను అరికట్టాలి :** ఈ విధంగా మనసు ఆలోచనలుగా విడిపోవడాన్ని అరికట్టాలి. ఇప్పటికే వివిధ విషయాలవైపు చెదిరి పోయిన మనసును ఒక దగ్గరకు చేర్చాలి. మనోచాంచల్యాన్ని నివారించడం అభ్యాసం చేస్తే మనకు ఏకాగ్రత కూడా సహజంగా సిద్ధిస్తుంది. అంతేకానీ మనసును కేంద్రీకరించాలని నేరుగా ప్రయత్నిస్తే తలనొప్పుల్ని కొని తెచ్చుకున్నట్లు అవుతుంది.

**అశాంతికి కారణాలను అన్వేషించాలి :**

ఇన్నాళ్ళూ ఎన్నో విషయాలను ఆలోచిస్తూ మనం బయటకు పరుగులు తీయడమే మన అశాంతికి కారణం. అశాంతికి కారణాలు అన్వేషిస్తూ మనసు లోతుల్లోకి దిగితే మనలో శాంతి నెలకొనడం ప్రారంభిస్తుంది. అందుకోసం మనం "కుదురుగా ఉండాల్సిన మనసు పలు దిశల్లో ఎందుకు పరుగులు తీస్తోందని" ప్రశ్నించుకోవాలి. "నిశ్చలంగా ఉండాల్సిన మనసు చంచలంగా ఎందుకు తయారయిందో" తెలుసుకోవాలి. ఈ విధమైన అంతర్మథనంతో మనసుని అతలాకుతలం చేస్తున్న కారణాలను అన్వేషించాలి. వాటిని విశ్లేషించి పరిష్కరించే ప్రయత్నం చేయాలి.



ఒక దగ్గరకు చేరిన మనసు

మిగతా 31వ పేజీలో....

- స్వామి సుకృతానంద

– ఎస్. జయలక్ష్మి, ధవళేశ్వరం

**? : సత్పురుషులు, మునులు మరణించిన తరువాత ముక్తి పొంది పుణ్యలోకాలకు వెళ్ళినట్లూ, జన్మరాహిత్యం పొందినట్లూ మనకు ఎలా తెలుస్తుంది?**

✍: ప్రశ్న వేసినంత సులభంగా సమాధానం మనకు లభించదు. జీవాత్మ అత్యంత సూక్ష్మం. ప్రాణం పోయేటప్పుడు కూడా దగ్గరున్న ఎవరికీ తెలియదు. ఎంతటి సూక్ష్మగ్రాహులైనా తెలియదు. దీనికి శాస్త్రాలే ఆధ్యాత్మిక ప్రమాణం. పుత్రేషణ, విత్తేషణ, లోకేషణ త్రయం– అంటే, సంతానం, ధనం, స్వర్గ – ఇంద్ర – చంద్రాది లోకాలు, బ్రహ్మ లోకాల మీద కోరికలు, కామన లేని వారూ, ముక్తిని కోరేవారూ మోక్షం పొందుతారని శాస్త్రం చెబుతోంది. అయితే అవతార పురుషులకు తమ భక్తులు, జ్ఞానులు మోక్షం పొందారో లేదో తెలుస్తుంది. శ్రీరమణమహర్షి మహాసమాధి అయినప్పుడు ఒక జ్యోతి ఆకాశంలోకి వెళ్ళినట్లు పలువురు భక్తులు చూశారని చెబుతారు. అలాగే, జగన్మాత భక్తురాలు అయిన రాణీ రాసమణి కలకత్తాలో మరణించినప్పుడు కూడా ఆమె దేవీలోకం వెళ్ళినట్లు శ్రీరామకృష్ణులు దక్షిణేశ్వరం నుంచి దర్శించారు. ఇలా ఎన్నో సంఘటనలు మహాత్ముల జీవితాల్లో మనం చదువుతాం. పాండురంగ భక్తుడైన తుకారామ్‌ను సాక్షాత్తూ వైకుంఠం నుంచి విమానం వచ్చి తీసుకువెళ్ళింది. గోదాదేవి శ్రీరంగనాథునిలో ఐక్యమైంది. మనకు అచంచల విశ్వాసం, భక్తి ఉంటే గానీ సద్గురువులు దర్శింపరు. జన్మరాహిత్యం అనేది చర్మ చక్షువులకు కనిపించదు కదా!

– ఎస్. సీతమ్మ, హైదరాబాద్

**? : 'కృష్ణార్పణం, రామార్పణం, శివార్పణం' అని అంటారు గానీ, 'లక్ష్మ్యర్పణం, సీతార్పణం, పార్వత్యర్పణం' అని స్త్రీ దేవతామూర్తుల పేరిట అర్పణం అనరు ఎందుకని? వివరించ ప్రార్థన.**

✍: సాధారణంగా వైష్ణవ భక్తులు 'కృష్ణార్పణం' అని అంటారు. శైవులు 'శివార్పణం' అని అంటారు. దేవీభక్తులు అమ్మ, లేదా అంబా, మా, జగదంబా అనుకొన్నప్పుడే ఆమె నామోచ్చారణలో ఆమెకు అన్నీ నివేదిస్తున్నట్లు భావిస్తారు. 'శక్తి' లేని దైవం ఏదీ లేదు. పైన 'కృష్ణార్పణం' అన్నప్పుడు లక్ష్మీదేవి, 'రామార్పణం' అంటే సీతమ్మవారు ఉండనే ఉంటారు. శ్రీరాముని శక్తే జానకి. శివార్పణంలో 'శివాని' (పార్వతీదేవి) ఉంటుంది కదా!

'దేవీ అపరాధ క్షమాపణ స్తోత్రం'లో –

***కామేశ్వరి జగన్మాతః సచ్చిదానంద విగ్రహే,***
***గృహాణార్చా మిమాం ప్రీత్యా ప్రసీద పరమేశ్వరి***

అని స్తుతిస్తున్నాం. శ్రీదుర్గాదేవి ఉపాసకులు దుర్గార్పణం, లక్ష్మీదేవి భక్తులు లక్ష్మ్యర్పణం, సీతమ్మ భక్తులు సీతార్పణం అనుకోవచ్చు. మనం ఏమి చేసినా హృదయపూర్వకంగా చేయడం, త్రికరణ శుద్ధిగా అర్చించడం, అర్పించడం ముఖ్యం. *భావగ్రాహీ జనార్దన!* భావాన్ని గ్రహించడం ముఖ్యం. కేవలం మాటల్లో ఏమీ జరగదు.

# ఆధ్యాత్మిక అన్వేషణ

- స్వామి తపస్యానంద

**ప్రశ్న:** మనసులోని చెడు సంస్కారాలను రూపుమాపేదెలా?

**జవాబు:** ఏదైనా ఒక కర్మను మళ్ళీ మళ్ళీ చేయడం వల్ల ఏర్పడిన మనఃప్రవృత్తినే 'సంస్కారం' అంటారు. చాలాకాలం గారాబం చేయడం వల్ల మనపై ఆసక్తిని పెంచుకొని, మనల్ని అంటిపెట్టుకొనుండే పెంపుడు కుక్కల లాంటివే ఈ సంస్కారాలు. ఉన్నట్లుండి అకస్మాత్తుగా ఒక నాడు వీటిని పారద్రోలాలంటే సాధ్యం కాదు. వీటి నుంచి మనం తప్పించుకొంటూ ఉండాలి. ఇవి మనల్ని సమీపించిననాడు వాటిపై దాడి చేసి దూరంగా తరిమి వేయాలి.

కాబట్టి ముందుగా చేయవలసిందేమంటే మన చెడు సంస్కారాల గురించి ఎరుక కలిగి ఉండడం! వాటిని పురికొల్పే సందర్భాల నుంచి తప్పించుకోవడం! ఇది ఒక సుడిగుండాన్ని ఎదుర్కోవడం లాంటిదే. తెలిసో, తెలియకో ఒకసారి దానిలో చిక్కుకుంటే మనం నిస్సహాయులమే సుమా! కానీ మన ముందున్న ఆ సుడిగుండం గురించి మనకు తెలిసి ఉన్నప్పుడు, దాని నుంచి తప్పించుకోవాలన్న కోరిక దృఢంగా ఉన్నప్పుడు దాని దరిదాపులకు కూడా పోకూడదు. అయితే కేవలం కళ్ళు మూసుకుంటే సరిపోదు. భయంతో తలను ఇసుకలో దూర్చడం ద్వారా ఉష్ట్రపక్షి ప్రమాదాలకు తావిస్తుంది.



మన అంతరాళం నుంచే ఈ చెడు సంస్కారాలను ఎదుర్కోవడమనేది ఇక్కడ ముఖ్యంగా గమనించాల్సిన విషయం. యోగసూత్రాల సృష్టికర్త అయిన పతంజలి మహర్షి చెప్పినట్లు ఈ చెడు సంస్కారాలను మరింత లోతైన స్థాయిలో పరిష్కరించేందుకు వాటికి వ్యతిరేకమైన మంచి సంస్కారాలపై మనసును ఏకాగ్రపరచడమే మార్గం. మంచి సంస్కారాలకు నిదర్శనాలైన వ్యక్తుల పైన లేదా విషయాల పైన మనస్సును లగ్నం చేయవచ్చు. కానీ భగవంతునిపై దృఢవిశ్వాసమున్న వ్యక్తి విషయంలోనైతే ప్రార్థన, ధ్యానం లాంటివి సాధన చేస్తూ దేవునితో మమేకమవడం ఉత్తమం. పాపప్రవృత్తి నుంచి బయటపడేందుకు భగవద్గీత ఇలా మార్గం చూపుతోంది: "ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి – ఇవే పాపప్రవృత్తికి నిలయాలు. ఇవి జ్ఞానాన్ని ఆవరించి, జీవుణ్ణి వంచిస్తాయి. అందువల్ల ఇంద్రియాలను ఆదిలోనే నియంత్రించడం ద్వారా పాపనివృత్తి కావించవచ్చు. భోగ విషయాల కన్నా ఇంద్రియాలు; ఇంద్రియాల కన్నా మనస్సు; మనస్సు కన్నా బుద్ధి; బుద్ధి కన్నా ఆత్మ శ్రేష్ఠమైనవి. ఆత్మ ఆధారంగా మనస్సును వశపరచుకోండి. విషయలాలస రూపంలో దాగిన శత్రువును నాశనం చేయండి".

మన మనస్సులోని ప్రతిచర్యలపై దృష్టి పెడుతూ, కేవలం సాక్షిగా వాటిని గమనించడం ద్వారా వాటి ప్రభావం నుంచి బయట పడగలుగుతాం. కాబట్టి మన ఇంద్రియాలు ఒక భోగవస్తువు మాయలో పడకుండా వాటిని బయట నుంచి పరిశీలించగలిగినప్పుడు లేదా మన బుద్ధి మనస్సులోని ఒక ముద్రను పరిశీలిస్తూ దానితో తనను తాదాత్మ్యపరచుకోకుండా వివేకం చూపగలిగినప్పుడు మనలోని భావాన్ని లేదా సంస్కారాన్ని జయించగలుగుతాం. మనలోని సంస్కారాలపై పట్టు సాధించాలంటే కేవలం సాక్షీభూతంగా నిలవడమే మార్గం. బుద్ధి శ్రేష్ఠమని చెప్పడం ద్వారా భగవద్గీత చెబుతున్నది ఇదే! సూక్ష్మంలోనే శ్రేష్ఠత్వం, తద్వారా స్థూల విషయాలను సాక్షిగా పరిశీలించే సుగుణం దాగి ఉన్నాయి. సాక్షిగా చూడడమంటే దేనితోనూ తాదాత్మ్యం చెందకపోవడం, తద్వారా స్థూలంలోని మాలిన్యాల నుంచి తప్పించుకోవడం. కానీ ఈ ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి కన్నా ఉన్నతమైనదీ, జీవులందరిలోనూ వెలుగుతున్న దివ్య కాంతిపుంజమూ ఆ భగవంతుడే. ఆయన చలవ వల్లే ఈ జగత్తంతా నడుస్తున్నది. అందువల్ల మనం ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి ద్వారా హృదయపూర్వక ప్రార్థన, ధ్యానాలతో దేవుని వైపు మరలాలి. చివరకు చెడు సంస్కారాల నుంచి మనకు విముక్తిని ప్రసాదించేది ఆయనే! a

# స్వామీజీ 'కర్మయోగం' కదిలించింది...

**-బి. సైదులు**



*ప్రపంచంలోని శ్రీమంతుల్లోనే ప్రథముడు. తన దరిదాపుల్లోకి కూడా ఎవరూ రాలేనంత సంపాదించి ఆదాయం అంతు చూసినవాడు. ధనాన్ని వ్యాపారంతో, కపటత్వంతోనే కాదు దార్శనికతతో కూడా తన దారికి తెచ్చుకోవచ్చని నిరూపించినవాడు. కోట్లకు కోట్లు కోటల్లా పేర్చుకున్నవాడు. అంతే ఔదార్యంతో సమాజానికి సేవచేస్తున్నవాడు. అతడే సాఫ్ట్‌వేర్ సామ్రాజ్యాధినేత బిల్‌గేట్స్. ఈ తరానికి పరిచయవాక్యాలు కూడా అవసరం లేని ఆయనను మాత్రం కదిలించింది... ధనం నుంచి దాతృత్వం వైపు నడిపించింది ఎవరో? ఏమిటో? ఆయన మాటల్లోనే... 'స్వామి వివేకానంద సాహిత్యం నా జీవితాన్నే మార్చేసింది. ముఖ్యంగా స్వామీజీ కర్మయోగం చదివిన తరువాత నాలో మేలుకున్న చైతన్యం మరచిపోలేనిది. నాలో చెలరేగే ప్రశ్నలెన్నింటికో ఆయన సాహిత్యం జవాబులు చూపింది. కర్మయోగం పుస్తకం జీవితానికి, కర్తవ్య నిర్వహణకు సంబంధించి నా దృక్పథాన్నే మార్చివేసింది. నా భవిష్యత్ కార్యాచరణకు మార్గదర్శకంగా నిలిచింది. ఇప్పటికీ ఊపిరిసలపని పనుల్లో కూడా ఆయన పుస్తకాలు చదవనిదే రోజు గడవదు. అందుకే నా ఆస్తుల్లో చాలాభాగాన్ని సమాజానికే చెందాలని నిర్ణయం తీసుకున్నాను.'*

## మనసున్న మార్గదర్శి....

సార్వజనీనమైన స్వామి వివేకానంద సందేశానికి దేశ, కాల, పరిస్థితులతో సంబంధం లేదని నిరూపించారు బిల్‌గేట్స్. వివాదాలకు తావివ్వక విలువలతో అధిపతిగా ఎదిగిన ఐశ్వర్యవంతుడాయన. స్వామీజీ కర్మయోగాన్ని అక్షరాలా ఆచరించి చూపిన బిల్‌గేట్స్ సంపాదనలో ఆదర్శం కాదు. సమష్టికృషికి, మొక్కవోని దీక్షకి... అపార సేవాభావానికి అన్నింటికీ మించి తను సాధించినదానిపై మమకార రాహిత్యానికి(డిటాచ్‌మెంట్) ఆయన మార్గదర్శి.

## కర్మయోగిదే కాలం...

తన కర్మను తాను చిత్తశుద్ధితో చేసేవాడికి కాలం కాళ్ళ కింద ఎర్రతివాచీ పరుస్తుంది. స్వార్థదృష్టితోనే ప్రతివారూ ముందు కర్మను ప్రారంభిస్తారు. కాని ఆ ఫలితం తనకే కాక మరెందరికో సంక్షేమాన్ని కలిగించిననాడు కర్మలో నిస్వార్థపు పాలు పెరుగుతూ ఉంటుందనే వారు స్వామీజీ. బిల్‌గేట్స్ దీనిని అక్షరాలా ఆచరణలో చూపారు. తరతరాలు అనుభవించే ఆస్తి వారసత్వంగా వచ్చినా ఆయన దానిని తనదిగా భావించలేదు. తను చేసే కర్మే తనదిగా భావించారు. తన ముందుతరం వారి వృత్తులైన న్యాయవాదం, రాజకీయం... తదితర రంగాలకు భిన్నంగా సాంకేతిక ప్రపంచంపై దృష్టి సారించారు.

## దార్శనికత...

కంప్యూటర్ భవిష్యత్తును శాసిస్తుందని దాదాపు నలభై ఏళ్ళ క్రితమే బిల్‌గేట్స్ ఊహించారు. తాను స్కూల్లో చదువుతున్న రోజుల్లోనే స్నేహితుల్ని కూడగట్టుకొని కంప్యూటర్ సాంకేతిక పరిజ్ఞానంపై కుస్తీపట్టారు. ఆ పరిధిని జన జీవనంలోకి మరింత విస్తరింప చేయాలని నిర్ణయించుకున్నారు. ఆర్థికంగా ఒక సంస్థ తమకు వెన్నుదన్నుగా ఉండేందుకు ఒప్పందం కుదుర్చుకున్నారు. రోజంతా తరగతి

పాఠాలు చదువుతూ, రాత్రి సమయాల్లో మిత్రులతో కంప్యూటర్‌పై పరిశోధనలు జరిపేవారు.

### ఆదిలోనే అడ్డంకులు...

తమ ఉత్సాహానికి ఆర్థికంగా, హార్దికంగా కొంత చేయూత లభిస్తుందనుకుంటున్న సమయంలో ఒక్కసారిగా బిల్‌గేట్స్ బృందానికి గడ్డు పరిస్థితులు ఎదురయ్యాయి. తమకు అండదండగా ఉంటున్న సంస్థ మూతపడటంతో వారి పరిశోధనలు మూలన పడే ప్రమాదం ఏర్పడింది. అయినా వారు నిరుత్సాహపడలేదు.

### మైక్రోసాఫ్ట్‌కు మూలపురుషుడు....

వ్యసనాలు.... వ్యక్తిగత సుఖాలలో ఓలలాడే చాలా మంది పాశ్చాత్య యువకుల్లా బిల్‌గేట్స్ తన జీవితాన్ని భోగమయం చేసుకోలేదు. వాటికి మించి శాశ్వత ఆనందక్షణాలు తనకు కంప్యూటర్‌తో గడిపినప్పుడే లభించేవంటా రాయన. అందుకే రెండు పదుల వయసు నిండకముందే సాఫ్ట్‌వేర్‌ని ఒక ప్రధాన రంగంగా సృష్టించారు. మిత్రుడు పాల్‌ఎలెన్‌తో కలసి మైక్రోసాఫ్ట్ కంపెనీకి శ్రీకారం చుట్టారు. ప్రపంచంలో వివిధ విభాగాలకు సౌకర్యవంతమైన సాఫ్ట్‌వేర్‌లను అందించే బృహత్తరమైన బాధ్యతను తన భుజస్కంధాలపై వేసుకున్నారు. ఫలితంగా రాయల్టీరూపంలో ఊహించనంత సంపద ఆయన్ని వరించింది.

### మనసూ సాఫ్ట్‌వేరే...

బిల్‌గేట్స్ వృత్తిపరంగానే కాదు ప్రవృత్తిపరంగానూ చాలా సున్నితస్వభావి. తన తొలిరోజుల్లో స్కూల్లో చేయికలిపిన మిత్రులే ఈనాటికీ ఆయన సహచరులు. భేషజానికి, బాహ్య ఆడంబరాలకి తావు లేని సరళమైన జీవితం ఆయనది. అందరినీ తన శ్రమలోనే కాదు సంపదలోనూ భాగ స్వాములను చేశారు. అందుకే ఈ రోజు ఆయన సంస్థలో పనిచేసే ఉద్యోగులందరూ మిలియనీర్లే... తన చిరకాల మిత్రులందరూ బిలియనీర్లే.

### ధనాన్ని దాతృత్వం వైపు మరల్చి...

తాను ఇంతగా ఎదిగేందుకు పరోక్షంగా సాయపడిన సమాజానికి ఏదో చేయాలన్న తపనతో బిల్‌గేట్స్ ప్రపంచ వ్యాప్తంగా బృహత్తర కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు. 'ఈ సమయంలోనే స్వామి వివేకానంద సాహిత్యాన్ని చదివాను. ముఖ్యంగా స్వామీజీ 'కర్మయోగం' నాకు కర్తవ్యాన్ని నిర్దేశించింది. నా బాధ్యత ఏమిటో గుర్తు చేసింది. నా సంపదలోని చాలా భాగాన్ని సమాజసంక్షేమానికే వెచ్చించాలని నిర్ణయం తీసుకున్నాను' అన్నారు ఆయన. బిల్‌గేట్స్ తన అర్థాంగి మిలిందాతో కలసి ఒక ఫౌండేషన్ నెలకొల్పారు. ముందు తనవంతుగా దాదాపు 3 వేల కోట్లతో కుల, మత, జాతి, వర్గ విచక్షణకు తావు లేకుండా సేవలందిస్తున్నారు. 1



## పనిని ప్రేమిద్దాం... ఫలితాన్ని కాదు!

– స్వామి వివేకానంద

మనం చేసే పనులపైనే మన వ్యక్తిత్వం ఆధారపడి ఉంటుంది. మనకు ఏది లభించినా అది మన కర్మ అంటే మనం చేసిన పనుల ఫలితం వల్లనే. అది నిస్వార్థపూరితమైతే ఫలితం మహత్తరంగా, శాశ్వతంగా మిగిలిపోతుంది. నిజానికి ఓటమి అన్న భావమే పొడచూపకూడదు. అది విజయానికి మరో పార్శ్వము, అనుభవమూ మాత్రమే. అందుకే ఓటమిని మరచిపోదాం. వాడక చిలుముపట్టిన యంత్రంలా కాకుండా, నిర్విరామశ్రమలో పనిముట్టులా పరిశ్రమిద్దాం. అలాంటి దీక్షకు స్థిరమైన చిత్తశుద్ధి, ఏకాంతవాసం అవసరం. ఏకాంతవాసంలో, అఖండమౌనంలో ఏ వ్యక్తి తీవ్రకర్మ పరత్వాన్ని చూడగలడో, తీవ్రకర్మపరత్వంలో ఎవరు ఎడారిలో నెలకొన్న నిశ్శబ్దాన్ని, ఏకాంతాన్ని అనుభవించగలడో అతడే నిజమైన యోగి. ఆత్మనిగ్రహానికి అది పరాకాష్ఠ. సత్త్వ, రజో, తమో గుణాలను మూడుశక్తులుగా మమేకం చేసి సమంగా జీవితంలో ఆచరించటమే కర్మయోగం. కర్మ చేసి కూడా ఫలితాన్ని ఆశించకపోవటం ధీరుల లక్షణం. మెచ్చుకుంటేనే సరిగ్గా పనిచేయాలనుకోవటం బలహీనుల లక్షణం. కీర్తిప్రతిష్ఠలకు అతీతంగా పనిని పరిపూర్ణంగా, ప్రత్యేకంగా చేసేవాడే నిజమైన కర్మయోగి. అతడే పనిని యజమానిలా చేయగలడు. ఎప్పుడైతే గుర్తింపు కోసం పని చేస్తామో, అప్పుడు బానిసలుగా మారిపోతున్నామనే అర్థం. అప్పుడు అశాంతికే తప్ప ఆనందానికి తావుండదు. నువ్వు ఏం చేస్తున్నావన్నది కాదు ఎలా చేస్తున్నావన్నదే ముఖ్యం.

## ఆంధ్రయోగులు: తాళ్ళపల్లి చంద్రయ్య

- డాక్టర్ బిరుదురాజు రామరాజు

పసిపిల్లల్లా ప్రేమిస్తే పరమాత్ముణ్ణి సులభంగా పొందవచ్చు. భగవంతునిపై బాల్యంలోనే కలిగిన భక్తిని సాధనతో సుసంపన్నం చేసి సిద్ధిఫలాన్ని పొందాడు ఇమ్మిడిజెట్టి చంద్రయ్య.

**పసితనంలోనే పురాణ శ్రవణం:** మహబూబ్‌నగర్ జిల్లా నాగర్ కర్నూలు తాలుకాలోని తాళ్ళపల్లి గ్రామంలో వెంకయ్య, అనంతమ్మ దంపతులకు జన్మించాడు చంద్రయ్య. చిన్నప్పటి నుంచే కథలంటే అతనికి మక్కువ. తాతయ్య పక్కన పడుకొని కథలు వింటూ నిద్రించేవాడు. పురాణ పురుషుల గాథల్ని తాతయ్య చెబుతుంటే వినేవాడు. వారిని చూడడమెలా అని ప్రశ్నించే వాడు. మంత్రజపం, ధ్యానంతో దేవుళ్ళను దర్శించవచ్చని తాతయ్య పదే పదే చెప్పిన సమాధానం మనుమడి మనసు మీద చెరగని ముద్ర వేసింది.



దేవీ ధ్యాన మగ్నశీలి

**పరతత్త్వానికై పరితాపం :** విద్యాభ్యాసం చేస్తూ గురువుల వద్ద శతక పద్యాలు, భారత భాగవతాలు శ్రవణం చేసి, వాటి స్ఫూర్తితో పద్యాలల్లడం ప్రారంభించాడు చంద్రయ్య. ఛందోబద్ధంగా కవిత్వం చెప్పడం నేర్చుకొన్నాడు. చదువులు భక్తిభావభరితమవడంతో చిన్నప్పుడు మనసులో నాటుకున్న భక్తి బీజాలు వటవృక్షాలుగా వృద్ధి చెందాయి. దాంతో దారిచూపే సద్గురువు కోసం చంద్రయ్య అన్వేషించడం మొదలుపెట్టాడు. తాళ్ళపల్లి ప్రక్కన ఉన్న కారవంగ గ్రామంలో నివసించే నారాయణాచారి సద్గురువని తెలుసుకొన్న చంద్రయ్య ఆయనను ఆశ్రయించాడు. నారాయణాచారి చంద్రయ్యకు మంత్ర దీక్షనిచ్చి, 12 ఏళ్ళ సాధన చేస్తే దేవి దర్శనమవుతుందన్నాడు. గురుదక్షిణగా కారువంగ గ్రామంలో వీరబ్రహ్మేంద్రుల మందిరం కట్టించడానికి చంద్రయ్య అహర్నిశలూ శ్రమించాడు. మందిరం అడుగున గురువుగారికి ధ్యాన మందిరం కట్టించాడు. దేవాలయ పనుల్ని పూర్తి చేస్తూనే ధ్యానాన్ని అభ్యసించాడు. స్వప్రయత్నానికి దైవానుగ్రహం తోడై, అనతికాలంలోనే అతని మనసు పరిణతి చెందింది. నిర్ణీత కాలానికి ముందే దేవి దర్శనమైంది. అయినా మంత్ర జపాన్ని మానలేదు. తన 35వ ఏట పదేళ్ళ పాటు భారతదేశమంతా పర్యటించి, మహాత్ములనూ, యోగులనూ దర్శించాడు. ఎన్నో సాధనల్ని అనుష్ఠించాడు.

**సాధన మార్గంలో ఎదురైన సిద్ధులు :** ఆయన చీకట్లో మౌనంగా ధ్యానం చేస్తుంటే ఆయన శరీరం ప్రకాశించేది. అప్పుడెవరైనా ఆయనను ముట్టుకుంటే విద్యుదాఘాతం తగిలినట్లుండేది. ఆయన సాధన చేసిన స్థలంలో మరెవ రైనా కూర్చుంటే అదే అనుభవం ఎదురయ్యేది. హేతువాది అయిన ఒక విద్యార్థి ఈ విషయాన్ని పరీక్షించినప్పుడు నిజమే నని నిరూపణైంది. ఇలాంటి ఎన్నో సిద్ధులు వశమైనా చంద్రయ్య వాటిని వ్యర్థమైనవిగానే తలచాడు. భగవంతుణ్ణే సర్వస్వంగా ఎంచాడు.

**విశ్వాసంతోనే గురువు అనుగ్రహం:** చంద్రయ్య ఒక పల్లెటూళ్ళో విడిది చేసినప్పుడు రత్నమ్మ, గోపమ్మ అనే స్త్రీలు ఆయన భక్తులయ్యారు. వారిద్దరూ దేవి దర్శనం చేయించాల్సిందిగా చంద్రయ్యను వేడుకొనేవారు. ఒకరోజు ఆయనెంత వద్దన్నా వారు వినలేదు. అర్ధరాత్రయినా అర్థించడం మానలేదు. వారి భక్తికి ముగ్ధుడైన చంద్రయ్య దయతో దర్శనమిమ్మని దేవిని ప్రార్థిస్తూ, ధ్యానంలో మగ్నుడయ్యాడు. ఇంతలో గోపమ్మకు నిద్ర ముంచుకు వచ్చింది. అదే సమయంలో దానిమ్మపండు రంగు దుస్తులు ధరించి, ఎనిమిదేళ్ళ బాలికలా దేవి దర్శనమిచ్చింది. ఈ దివ్య దర్శనంతో రత్నమ్మ జన్మ ధన్యమైంది. గాఢ విశ్వాసంతో మాత్రమే అరుదైన సద్గురువు అనుగ్రహం లభిస్తుందని రత్నమ్మకు అవగతమైంది. ఆమె గోపమ్మను తట్టి లేపబోతున్నంత లోనే దేవి అదృశ్యమైంది.

**సిద్ధుడికి దేహం ఓ చొక్కా :** ఈ లోకంలో చేయాల్సిన పని పూర్తవగానే చంద్రయ్య తన చుట్టూరా ఉన్న వారితో 'తొడుక్కున్న చొక్కాను తీసిపారేస్తాను' అన్నాడు. ఆ మాటలెవరికీ అర్థం కాలేదు. అన్నట్లుగానే ఆయన తన 68వ ఏట దేహాన్ని విడిచి, పరమాత్మలో లీనమయ్యారు. వారి శరీరాన్ని ఎక్కడ సమాధి చేయాలనే తర్జన భర్జనల్లో రెండున్నర రోజులు గడిచిపోయాయి. అయినా మృత దేహం చెక్కు చెదరలేదు. చివరకు ఆయన స్వగ్రామం తాళ్ళపల్లిలోనే శరీరాన్ని శాస్త్రోక్తంగా సమాధి చేశారు. అక్కడ ఒక శివలింగాన్ని స్థాపించి మందిరాన్ని నిర్మించారు.

# ఏది నిత్యం? ఏది సత్యం?

– బి. సైదులు

కట్టించుకుంటున్న కొత్త ఇంటిని చూసుకునేందుకు అయిదేళ్ళ కొడుకుతో కార్లో బయలు దేరారు ఓ మహిళా ఐ.ఎ.ఎస్. అధికారి. కారు వేగంగా వెళుతోంది. అద్దాల్లో నుంచి దారి పక్కన దృశ్యాల్ని ఆసక్తిగా గమనిస్తున్నాడు ఆ అబ్బాయి. ఇంతలో కారు ఓ శ్మశానం మూల మలుపు గుండా వెళుతుంటే, వింతగా చూస్తూ వెంటనే పక్కనే ఉన్న తల్లిని 'మమ్మీ! ఏంటది..?' అని అడిగాడు ఆశ్చర్యంగా! 'అది శ్మశానం బాబూ! అవన్నీ సమాధులు. మనుషులు చనిపోయాక, అలా మట్టిలో పెట్టేస్తారు' అని చెబుతూ, కొడుకు తలను పక్కకు తిప్పుతూ మాట మార్చేసింది.

ఇంతలో కారు వాళ్ళు కొత్తగా నిర్మిస్తున్న ఇంటి ముందు ఆగింది. పూర్తి కావొచ్చిన ఆ ఇంట్లో కొడుకుని తిప్పుతూ అన్నింటినీ పరిశీలిస్తున్నారామె. ఇంతలో బాబు మళ్ళీ 'మమ్మీ! ఏంటీ గదులన్నీ' అన్నాడు. 'మన ఇల్లురా ఇది. చూడు– ఇది హాలు, ఇది నీ గది, ఇది అన్నయ్యది, ఇది పూజ గది.' ఇలా విశాలంగా ఉన్న ఇంటిని ముచ్చటగా కొడుకుకి చూపించింది. ఇంతలో ఆ బాబు అనాసక్తిగా 'ఎందుకు మమ్మీ ఇంత పెద్ద ఇల్లు! మనం చనిపోయాక అంత చిన్న దాంట్లోనే పెట్టేస్తారుగా' అన్నాడు అమాయకంగా.

తెలియక ఆ పిల్లవాడు అన్న ఆ మాటలు ఆ ఐ.ఏ.ఎస్ అధికారిణి జీవన శైలినే మార్చేశాయి. ఐ.ఏ.ఎస్‌లో కూడా నేర్చుకోని పాఠం అయిదేళ్ళ కొడుకు నేర్పాడు. ఆ తరువాత ఆమె ఆలోచనా దృక్పథం మారింది. ఇది ఓ ఉన్నతాధికారిణి జీవితంలో జరిగిన యథార్థఘటన.

ఆ అయిదేళ్ళ అబ్బాయి అమాయకంగా అన్న ఆ మాటలు నిజంగా మనందరి మనసుల్ని తాకుతున్నాయి కదూ! విలాసాల్ని అవసరాలుగా భ్రమిస్తూ ఎండమావుల వెంట పరుగెడుతున్న మనకు ఇలాంటి హితవు కాస్త వెగటుగానే అనిపిస్తుంది. అందుకే ఆది శంకరాచార్యులు తమ 'భజగోవింద స్తోత్రం'లో 'మా కురు ధన జన యౌవన గర్వం హరతి నిమేషాత్ కాల స్సర్వం' అంటారు. నిత్యం తులతూగే సంపద, నిరంతరమూ నీరాజనాలు పలికే మందీమార్బలం, నవనవలాడే యౌవనం – అన్నీ శాశ్వత మనుకొని అహంకరిస్తుంటాం. కానీ ఒక్క క్షణంలో కాలం వీటన్నింటినీ హరించివేస్తుంది. సంపద, అధికారం, సౌందర్యం – ఇలా మనం శాశ్వతమనుకొని వెంపర్లాడేవన్నీ రెప్పపాటులో కాలగర్భంలో కలిసిపోయేవే! మరి ఎందుకు వాటి పట్ల మనకు అంత మమకారం.

శ్రీరామకృష్ణులు అన్నట్లు తామరాకుపై నీటిబొట్టులా వ్యవహరించాలి. అందుకే ఆది శంకరులు 'నిస్సంగత్వే నిర్మోహత్వం... నిర్మోహత్వే నిశ్చలతత్త్వం..' అన్నారు. అలాంటి శాశ్వత నిశ్చలత్వం మన సొంతం కావాలంటే ఆ నిస్సంగత్వ స్పృహ జీవన శైలిగా మారాలి. కానీ మనలో చాలా మంది కాస్త అధికారం చేజిక్కగానే ప్రపంచం తనకు దాసోహమైనట్లు భ్రమిస్తారు. చరిత్రలో తమదో ప్రత్యేక స్థానమనుకుంటారు. కానీ ఈ జగన్నాటకంలో భాగంగా ఈ వేదిక పైకి ఎంతమంది వచ్చి వెళ్ళారు.. వెళుతున్నారు... వెళ్ళనున్నారు.

అందుకే పోతనామాత్యులు 'శ్రీమద్భాగవతం'లో 'కారే రాజులు రాజ్యముల్ గల్గవే వారేరీ! సిరి మూటగట్టుకొని పోవంజాలిరే, పేరైనన్ గలదే' అన్నారు. ఈ భూనభోంతరాళాలకు చక్రవర్తులమని విర్రవీగిన ఎంత మంది వీరాధివీరులు ఈ రోజు మౌనంగా సమాధుల్లో సేద తీరడం లేదు!

ప్రపంచాన్ని జయించిన అలెగ్జాండర్ తన తుది క్షణాల్లో తన అనుచరులతో 'నేను చనిపోయాక, నా రిక్త హస్తాలను బయటకు పెట్టి ఖననం చేయండి. రాబోయే తరాలకు తెలియాలి – ప్రపంచాన్ని జయించిన చక్రవర్తి అయినా వట్టి చేతులతోనే ఈ లోకం నుంచి వెళ్ళిపోతాడని!' చెప్పాడు. స్వామి వివేకానంద "జీవితంలో ప్రతి క్షణం మరణ సమయాన్ని స్పృహలో ఉంచుకోండి. అప్పుడు మీరు కేవలం సాక్షిగా ఉంటూ నిస్సంగత్వాన్ని సాధించగలరు" అనేవారు. ఈ భావనతో జీవితం సాగిస్తే అహంభావానికీ, ఆవేదనకీ, ఆవేశానికీ తావే లేని అలౌకిక స్థితికి చేరుకోగలం. అహంకార, మమకారాలు అంటకుండా ఉండగలం. a

# దారి చూపే దేవుడు

ఆషాఢ పూర్ణిమనే 'గురుపూర్ణిమ'గా పేర్కొంటారు. భారతదేశంలో జరుపుకొనే పండుగలు, పబ్బాలలో దీనికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. ఎవరి జీవితం, ఉపదేశాలు స్ఫూర్తిదాయకాలో, అనేకానేక విషయ వ్యాపారాలతో నిండిన జీవనమార్గంలో పయనిస్తున్నవారికి ఎవరు ఆశ్రయస్థానంగా నిలిచి ఉంటారో, అలాంటి పూజనీయులు, వందనీయులైన వారికి ఈ రోజు హృదయ పూర్వక శ్రద్ధా భక్తులు చూపి, మనిషి తనను తాను ధన్యునిగా భావిస్తాడు. సాధారణంగా ఈ రోజున మంత్రోపదేశం చేసిన గురువులను ఆరాధిస్తారు. కానీ నిజానికి ఇది 'గురుపూజ' దివసం. ఎందుకంటే, గురువు లేనిదే ఎలాంటి విద్యా, జ్ఞానోపార్జనా సాధ్యం కావు. ఏ క్షేత్రమైనా కానివ్వండి, శిక్షణనిచ్చే గురువు పాత్ర మహనీయం.

ఈ ఆచారం భారతదేశంలో మాత్రమే నడుస్తున్నదని అనుకోకండి. ఆధునిక నాగరకతకు తలమానికమైన అమెరికాలో సైతం ఈ 'గురుపూజ' పద్ధతి ఉంది. దాన్ని ఏడాది కొక సారి 'థ్యాంక్స్ గివింగ్ డే'గా ఆచరిస్తుంటారు. ఆ రోజు వారు తమ అధ్యాపకులనూ, గౌరవ నీయులైన పెద్దలనూ సన్మానిస్తారు.

ఏదైనా అపరిచిత ప్రదేశానికి వెళితే ఒక మార్గ నిర్దేశకుని అవసరం ఎంతైనా ఉంటుంది. లేకుంటే దారి తప్పిపోయే ప్రమాదం ఉంది. ఆధ్యాత్మిక మార్గం మనకు పూర్తిగా అజ్ఞాతం. ఈ అజ్ఞాతమార్గంలో దారిచూపే వ్యక్తి లేకపోతే పతనం చెందే అవకాశం చాలా ఎక్కువ. ఆధ్యాత్మిక జీవనంలో గురువు ఆవశ్యకత ఎంతో ఉంది. బడిలో ఉపాధ్యాయుడు గణితం నేర్పుతున్నాడనుకోండి. మొత్తం తరగతికి ఒకే విధంగా బోధిస్తాడు. కానీ సాధనా మార్గంలో ఇది కుదరదు. ఒక్కొక్కరి స్వభావం ఒక్కోరకంగా ఉంటుంది. వారి సంస్కారం వేరు, మనస్సు తీరు వేరు. కనుక ఆధ్యాత్మిక విద్యా క్షేత్రంలో సామాన్యీకరణం పనిచేయదు. ప్రతి వ్యక్తికీ తన నిజస్వరూపాన్ని గురించి గ్రహింపుశక్తి ఎంత ఉందో తెలిసికొని దానికి తగ్గట్లు ఉపదేశం చేయాల్సి ఉంటుంది. కనుక కొందరి విషయంలో వారికి తగిన ఉపదేశం చేయడానికి గురువు చాలా ప్రయాసపడాల్సి వస్తుంది. ఈ సందర్భంగా స్వామి బ్రహ్మానందజీ ఇలా అన్నారు: "ఒక్కొక్కసారి మంత్రోపదేశం చేయడానికి చాలా శ్రమించాల్సి వస్తుంది. ఆ వ్యక్తి ఇష్టదైవం ఎవరో తెలుసుకోలేక కలత చెందుతుంటాను. మంత్రదీక్షకు పూర్వం ధ్యానంలో ఆతడి ఇష్టదైవం దర్శనమిస్తే మంత్రమిస్తాను, లేకుంటే ఇవ్వను అని ఒకసారి అనుకొన్నాను. దాదాపు గంట ధ్యానం తరువాత ఒక దేవతామూర్తిని తెలుసుకొన్నాను". బ్రహ్మానందజీ మాత్రమేకాదు, ఎన్నో మార్లు ఎందరి విషయంలోనో ఇలాగే జరిగింది. కనుక ఆధ్యాత్మిక జీవనంలో ఎదుగుదల కోసం సద్గురువు నుంచి మంత్రం, ఉపదేశం పొందే భాగ్యం లభిస్తుంది. విశ్వాసం, ఓర్పు, పట్టుదల, ఆ పైన ముఖ్యంగా అపార శ్రద్ధతో రోజుల తరబడి సాధన చేస్తేనే మంత్రం సిద్ధిస్తుంది. ఆత్మతత్త్వపు అపరోక్షానుభూతి కలుగుతుంది.

సనాతన ధర్మాన్ని ప్రతిష్ఠించిన వ్యాస మహర్షి ఆవిర్భావ దినంగా గురు పూర్ణిమను ఆచరిస్తాం.

***ద్వాపరే సమనుప్రాప్తే తృతీయే యుగపర్యాయే***
***జాతః పరాశరాత్ యోగీ వాసవ్యాం కళయా హరేః***

(భాగవతం 1.4.14)

దైవాంశతో పుట్టిన పరమజ్ఞాని వ్యాసదేవుని ఆవిర్భావంతో భూమిపై కొత్త ఆధ్యాత్మిక యుగం ఆరంభమైంది.

మొదట్లో వేదశాస్త్రమంతా ఒకటిగానే ఉండేది. ఆ కాలంలో మనన శీలురు, స్వాధ్యాయపరాయణులు అయిన బ్రాహ్మణులు వేదాలను వినినంత మాత్రాన గ్రహించగలిగే సామర్థ్యం కలిగి ఉండేవారు. కానీ రానురానూ మానవుల జ్ఞాపక శక్తి తగ్గుముఖం పట్టింది. దానితో వేద శాస్త్రాన్ని మొత్తం గుర్తుంచుకొనే శక్తి సామర్థ్యాలు సాధ్యాతీతమయ్యాయి. గతంతో పోలిస్తే మానవుల ఆయుఃప్రమాణం కూడా తగ్గింది. ఫలితంగా వేదాన్ని మరవకుండా నిరంతర

స్వాధ్యాయ శిక్షణలు కష్టతరమయ్యాయి. వైదిక ధర్మానికి ముప్పు వచ్చి పడింది. ధర్మం శాస్త్రంపై ఆధారపడిన పక్షంలో, శాస్త్రమర్మాన్ని అవగతం చేసుకోవడంలో అపచారం జరిగితే ధర్మం దోషపూరితమవుతుంది. శాస్త్రానికి వచ్చిన గొప్ప ప్రమాదాన్ని తప్పించి దానిని పునరురుద్ధరించడానికే వేదవ్యాసుడు జన్మించాడు. అందువల్లే వేదవ్యాసుడు పరమగురువుగా నేటికీ పూజలందుకొంటున్నాడు.



గురుపూర్ణిమ నాడు వ్యాసభగవానుడు పూజలందుకున్నట్లే ఆ గురు శక్తికి ఆధారమైన మానవ శరీరం దాల్చిన గురువులు కూడా పూజితులవుతారు. పరతత్త్వ లబ్ధి పొందగోరే ముముక్షువులకు ఆధ్యాత్మిక క్షేత్రంలో గురువు పాత్ర ఎంత మహత్తరమైనదో స్పష్టంగా తెలుసు.

గురువు అంటే ఎవరు? ఎవరు వేదవేదాంత పారంగతుడో, బ్రహ్మజ్ఞుడో, ఎవరు మరొకరిని సమస్త భయాల నుంచి దూరం చేయగలడో – ఆయనే యథార్థ గురువని శాస్త్ర వ్యాఖ్య. శిష్యుల పట్ల కరుణ కలిగి, సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపుడు దేహధారణ చేసి గురువుగా ఆవిర్భవిస్తాడు. కనుక గురువు మానవ మాత్రుడు కాదు.

అత్యంత నిష్ఠ, శ్రద్ధా భక్తులతో గురువు నిర్దేశించిన మార్గంలో పయనించి, గురువు ప్రసన్నతను పొందాలి. అప్పుడే శిష్యుడు శ్రేయస్సును పొంది, కృతార్థుడవుతాడు. ప్రాచీన గ్రంథాలలో దీనికి నిదర్శనాలు కనబడతాయి. ఏకలవ్యుని ఏకాగ్ర గురుభక్తి మనస్సును పులకరింపజేస్తుంది. ఆరుణి గురుపరాయణత ముగ్ధుల్ని చేస్తుంది.

గురువును ఆశ్రయించడమనే ఆచారం నిష్ప్రయోజనమని కొందరి అభిప్రాయం. స్వయంకృషి, పట్టుదలతో ఆధ్యాత్మికపథంలో పయనించగలమని వారు అంటారు. అయితే, "ఎంత తెలివి ఉన్నా, ఎంత శ్రమించినా, గురువు సహాయం లేనిదే అడుగులు తడబడి, పతనం చెందడం ఖాయం. దొంగతనం చేయడానికైనా ఒక గురువు అవసరం. అలాంటిది ఇంత గొప్ప బ్రహ్మవిద్య నేర్చుకోవడానికి గురువు అవసరం లేదా!" అన్నారు స్వామి బ్రహ్మానంద మహరాజ్. కనుక గురువును పొందడం అవసరం. ఈ భవసాగరాన్ని దాటించగలిగేది గురువే!

గురువు శిష్యునికి అన్ని విధాలా చేయూతనిచ్చేమాట నిజమే కానీ శిష్యుడు కూడా గట్టి ప్రయత్నం చేయాల్సి ఉంటుంది. పశువులు మేయకుండా చిన్న మొక్క చుట్టూ దడి కట్టి కాపాడతారు. మొక్కకు నీరుపోసి అది ఎదగడానికి అవసరమైనవన్నీ చేస్తారు. కానీ ఎదిగి, ఆకులు, పూలు, తొడగడం మొక్క స్వతహాగా, స్వయంగా చేయవలసిందే! కనుక, ఏకాంతంలో ఏకాగ్రచిత్తంతో జపధ్యానాలలో మగ్నమై, స్వీయ ఉన్నతికై సాధకుడు ఉద్యమించాలి. శ్రీరామకృష్ణుల అవతరణ ప్రాముఖ్యాన్ని స్వామి బ్రహ్మానందజీ నొక్కి చెప్పేవారు: "శ్రీరామకృష్ణులు యుగావతారం. శ్రీరామకృష్ణులు జీవలోకానికీ, శివలోకానికీ వారధి కనుకనే సాధారణ వ్యక్తులకు కూడా భగవత్ సాక్షాత్కారం సుగమమైంది. ఒకింత కష్టపడితే చాలు, కొంచెం సాధన చేస్తే చాలు చైతన్యం వస్తుంది. మీరు ఈ సువర్ణావకాశాన్ని పోగొట్టుకోవద్దు. లేవండి, ఉద్యమించండి".

"కృపావాయువు వీస్తోంది. తెరచాప ఎత్తండి" అని శ్రీరామకృష్ణులు అనేవారు. మనం చేయవలసిందల్లా తెరచాపను ఎత్తిపట్టడమే. అనుకూల కృపావాయువు వల్ల మన జీవితనౌక త్వరత్వరగా పయనిస్తుంది. గురువు సహాయం ఉండగా వేరే ఆలోచనలెందుకు! స్వామి బ్రహ్మానందజీ చెప్పిన ఈ కింది మాటలు ఎల్లప్పుడూ జ్ఞాపకం ఉంచుకోవాలి: "శ్రీరామకృష్ణులు చెప్పిన తండ్రీ కొడుకులు పొలం గట్లపై నడుస్తూపోతున్న దృష్టాంతం జ్ఞాపకం ఉందా? తండ్రి పిల్లవాడి చేయి పట్టుకు నడిపిస్తూ ఉంటే, వాడు పడిపోతాడనే భయం ఉండదు. కానీ పిల్లవాడు తండ్రి చేతిని విడిచిపెడితే? జారిపడే అవకాశం ఉంది. సద్గురువు ఆశ్రయం దొరికినవారు ఆ ఆశ్రయాన్ని వదల కుండా ఉంటే, గురువే శిష్యుల దోషాలనూ, లోపాలనూ సరి చేస్తాడు." ఈ యుగంలో భక్తులైన ముముక్షువులకు ఇది మంచి తరుణం. గురుకృప అనే గాలి వీచగానే తెరచాప ఎత్తిపడితే, ఆ దేవదేవుడు స్వయంగా పడవను నడిపించి, సత్యం శాంతి ఆనందాల నిత్యలోకానికి కొనిపోతాడు. a

**- ప్రవ్రాజిక అమలప్రాణ**

**తెలుగు సేత - డాక్టర్ కమల జయరావు**

## మహనీయుల జీవితాల్లో మధురఘట్టాలు - ఆర్. కృష్ణ

### సోక్రటీస్ స్థితప్రజ్ఞత



ఆధ్యాత్మిక ఉన్నతిని సాధించడానికి ప్రాచ్యం, పాశ్చాత్యం అన్న తేడాలేవీ లేవని సోక్రటీస్ తన అంతిమ ఘడియల్లోనూ నిరూపించారు. ఆయన తత్త్వోన్నతిని సహించని సమకాలికులు మరణ శిక్షతో ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నారు. విషం తాగాలని శిక్ష విధించారు. అయినా సోక్రటీస్ కుంగిపోలేదు. పైగా మృత్యువును కూడా చిరునవ్వుతోనే స్వీకరించ దలిచారు. అందుకే మరణానికి ముందు ఆయన మానసికవైఖరి ఆధ్యాత్మిక జీవిత ఉత్కృష్టస్థాయికి తార్కాణంగా చరిత్రలో మిగిలిపోయింది. సోక్రటీస్ తుది ఘడియల్ని ఆయన అనుయాయుడు ప్లేటో మహత్తరంగా అభివర్ణించాడు. ఎంతటి మేధావికైనా అంతటి గంభీరస్థితి దుస్సాధ్యమే. క్షణాల్లో మృత్యువు చేరువవుతుందని తెలిసినా ఆయన పెదవులపై దరహాసం చెదరలేదు. అదే మౌనం. అదే మందహాసం. ఎంతటి విషమైనా తన శరీరాన్ని కబళిస్తుందే కానీ, ఆత్మను కాదని తన అనుచరులకు ఆచరణలో చూపారు. సోక్రటీస్ అంతిమ క్షణాలకు సాక్షులుగా పరిజనమంతా దుఃఖసాగరంలో మునిగారు. విలపిస్తున్న అక్కడి మహిళలందర్నీ ఆయన బయటకు వెళ్ళమన్నారు. ఆ ప్రభావంతో ఎక్కడ మళ్ళీ తాను శరీరమే అన్న భ్రాంతి కలుగుతుందోనని జాగ్రత్తపడ్డారు సోక్రటీస్. ఇంతలో ఆయన అనుచరుడు ఒకడు "సోక్రటీస్! మీరు కన్నుమూశాక ఎలా దహనం చేయమంటారు" అని దీనంగా అడిగాడు. సోక్రటీస్ అదే చిరునవ్వుతో, "ముందు నేనెవరో తెలుసుకో! నన్ను కేవలం శరీరంగానే భావిస్తే, మృతదేహానికి ఎలా వీడ్కోలు పలుకుతారో అలాగే కానివ్వండి!" అని చేతిలోని విషపాత్రను తీసుకున్నారు. జీవించివున్నప్పుడూ, మరణ సమయంలోనూ ***'దుఃఖేషు అనుద్విగ్నమనాః సుఖేషు విగత స్పృహః'*** అని గీతాచార్యుడు బోధించిన స్థితప్రజ్ఞతను ఆచరణలో చూపిన సోక్రటీస్ మహనీయుడు.

### నేతాజీనే కదిలించిన రామరాజు

స్వాతంత్ర్య ఉద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులవి. జాతీయ నేతలంతా దేశమంతా పర్యటిస్తూ ఉద్యమాన్ని ప్రోత్సహిస్తున్నారు. అందులో భాగంగా విశాఖపట్నంలో బహిరంగసభ ఏర్పాటైంది. నేతాజీ సుభాష్ చంద్రబోస్ హాజరవుతున్నారని తెలిసి, సమీప గ్రామాల ప్రజలు పెద్దయెత్తున తరలి వచ్చారు. కళాశాల విద్యార్థులు కూడా ఎంతో ఉత్సాహంగా పాల్గొన్నారు. స్థానిక ఎ.వి.యన్. కళాశాల విద్యార్థులు మరింత ఉత్సాహంగా ముందువరుసలో కూర్చొని ఆ మహానేత కోసం నిరీక్షిస్తున్నారు. ఇంతలో నేతాజీ వేదికపైకి వచ్చి ప్రసంగాన్ని ప్రారంభించారు. "బ్రిటిష్ కుటిల పాలకులు మనకు స్వాతంత్ర్యం ఇవ్వకపోగా మనల్ని ఆకలిమంటలకు ఆహుతి చేస్తున్నారు. దారుణ హింసాకాండను ఇక సాగనివ్వకూడదు. అలాంటి దుష్ట పాలకులను మన నేల మీద నుంచి తరిమేయాలి. ఈ యజ్ఞంలో సమిధలయ్యేందుకు ఈ తెలుగునేల నుంచి ముందుకు వచ్చే యువకులెవరు?" అంటు ధీర గంభీర స్వరంతో సుభాష్ చంద్రబోస్ ప్రశ్నించారు.



ఒక్కసారిగా నిశ్శబ్దం. ఇంతలో ముందు వరుస నుంచి ఓ యువకుడు లేచి నిలబడి, "నేను వస్తాను. ఆ దొరల దురాగతాలను ఎదుర్కొని, స్వాతంత్ర్య సమరంలో ఆత్మ బలిదానానికైనా జంకబోనని తెలుగు బిడ్డగా శపథం చేస్తున్నాను" అన్నాడు. ఆ తెలుగుబిడ్డ చొరవకీ, త్యాగ నిరతికీ సభలో హర్షధ్వానాలు వెల్లివిరిశాయి. నేతాజీ ఆ యువకుడి ఉత్సాహానికి కదిలిపోయి వేదిక దిగి వచ్చారు. అభినందనలతో ఆలింగనం చేసుకున్నారు. సభ 'వందేమాతరం' నినాదంతో మారు మోగిపోయింది. అలా ఆ సభలో నాయకుడై వెలిగిపోయి, నేతాజీనే మెప్పించిన ఆ యువకుడు ఎవరో కాదు, మన్నెం వీరుడు మన తెలుగు జాతి ముద్దుబిడ్డడు అల్లూరి సీతారామరాజు. శపథం చేసిన ప్రకారమే రామరాజు తన జీవితాన్ని స్వాతంత్ర్య ఉద్యమానికి సమిధను చేశాడు.

**(జూలై 4న అల్లూరి సీతారామరాజు జయంతి)**

# ఆత్మవిశ్వాసం ఎక్కడ దొరుకుతుంది..?

– రాము జలదుర్గం

విజయం, సంతృప్తి, సంతోషాలతో వెలుగుతున్న వ్యక్తులకూ; అపజయాలు, అసంతృప్తి, అసహనాలతో నలుగుతున్న మనుషులకూ మధ్య కనిపించే ఒకే ఒక్క స్పష్టమైన తేడా 'ఆత్మవిశ్వాసం'. నేను ఊహించినట్లుగానే నా జీవితాన్ని మలుచుకోగల శక్తి నాలోవుంది అని నమ్మడమే ఆత్మవిశ్వాసం. అయితే ఈ ఆత్మ విశ్వాసాన్ని ఎలా పొందగలం?

**విమర్శలకు బాధపడకండి :** మీరు పూర్తిగా మంచిదే అని నమ్మిన పనిని ఇతరులు విమర్శించినా, ఎగతాళి చేసినా బాధపడకండి. ఏకాగ్రతతో మీ పని మీరు చేసుకుంటూ వెళ్ళండి. నవ్విన నాప చేనే పండుతుందనీ, మిమ్మల్ని అవహేళన చేసిన వాళ్ళే మీ గురించి గొప్పగా చెప్పుకునే రోజులు వస్తాయనీ నమ్మండి. విమానం కనిపెట్టే ముందు రైట్ సోదరులు, అమెరికా అధ్యక్షుణ్ణవ్వాలని ఉందని చిన్నప్పుడే అన్న బిల్ క్లింటన్ కూడా ఇవే పరిస్థితులను చిరునవ్వుతో ఎదుర్కొన్నారు. ఆ తరువాత సాధించి చూపారు.

**సాహసించేందుకు సిద్ధపడండి :** అవసరమైతే సాహసించేందుకు సిద్ధపడండి. అది మీ ప్రతిభను పెంచుతుందని తెలుసుకోండి. రోజూ ఒకే పద్ధతిలో మీరు చేసే ప్రయత్నాలు ఒకే రకమైన ఫలితాలనిస్తాయి. కాబట్టి కాస్తంత బద్ధకాన్ని పక్కన పెట్టి కొత్త పద్ధతుల్లో కృషి చేయండి. అలా చేస్తే విజయం మీదే. ఆత్మవిశ్వాసం కూడా బల పడుతుంది. ఒడ్డును వదిలి సాహసంచేసి, 71 రోజులు సముద్రంలో ప్రయాణించాడు కొలంబస్. నిత్య జీవితంలో ఇంతటి సాహసం చేయనక్కర లేదు. కానీ, ఉదయాన్నే లేవాలి. టీవీ చూసే సమయం తగ్గించుకోవాలి. ఇష్టం లేకపోయినా కష్టమైన సబ్జెక్ట్‌తో కాసేపు కుస్తీ పట్టాలి. ఇవన్నీ కూడా చిన్నపాటి సాహసాల లాంటివే. అయితే ఆ సాహసమే మిమ్మల్ని ప్రతిభావంతులుగా, ఆత్మ విశ్వాసం కలిగిన వ్యక్తులుగా తీర్చిదిద్దుతుంది.

**తప్పుల్ని సరిదిద్దుకోండి :** తప్పుల్ని నిజాయతీగా ఒప్పుకొని సరిదిద్దుకోండి. పొరపాట్ల నుంచి పాఠాలు నేర్చుకోవడం తెలివైన వాళ్ళ లక్షణం. ఆత్మవిశ్వాసం ఉన్నవాళ్ళే 'అహం' అనే అడ్డును తొలగించుకొని, మార్పును ఆహ్వానిస్తారు. వినాశకరమైన డైనమైట్‌ను కనిపెట్టిన ఆల్ఫ్రెడ్ నోబుల్ తన చివరి రోజుల్లో ప్రతిష్ఠాత్మకమైన నోబుల్ శాంతి బహుమతిని స్థాపించాడు. పొరపాట్లు అందరూ చేస్తారు. తెలివైనవాళ్ళు ఆ పొరపాట్ల నుంచి పాఠాలు నేర్చుకుంటారు. కానీ, మూర్ఖులు మాత్రం మళ్ళీ మళ్ళీ ఆ తప్పులే చేస్తారు.



**జీవితంలోని సవాళ్ళను ఎదుర్కోండి :** జీవితంలోని సవాళ్ళ నుంచి తప్పు కోవడం కన్నా వాటిని ధైర్యంగా ఎదుర్కొంటేనే మీ ఆత్మవిశ్వాసం, ఆత్మస్థైర్యం పెరుగుతాయి. చిన్నప్పుడు సైకిల్ నేర్చుకుంటూ బాలెన్స్ తప్పి కింద పడని వాళ్ళుండరు. అలా మళ్ళీ కింద పడతామని సైకిల్ నేర్చుకోవడం మానేశామా? 'పడుతున్నందుకు కాదు, పడిలేస్తున్నందుకే నాకు సముద్ర తరంగాలంటే ఇష్టం' అన్న ఓ కవి హృదయంలోని స్ఫూర్తిని ఇక్కడ అర్థం చేసుకోవాలి. ఎన్నిసార్లు ఓటమి ఎదురైనా తనకున్న ఆత్మవిశ్వాసమే థామస్ అల్వా ఎడిసన్‌ను ఎలక్ట్రిక్ బల్బ్ కనిపెట్టేలా చేసింది.

**సానుకూల వైఖరిని పెంచుకోండి :** జీవితంలో జరిగే సంఘటనలు అనుభవంలోకి తీసుకునే వైఖరిని బట్టి కూడా ఆత్మవిశ్వాసంలో హెచ్చు తగ్గులు కన్పిస్తాయి. సానుకూల వైఖరి (Positive thinking) అనేది మన ఆలోచనల తీరులో మార్పు తెచ్చి, ఆత్మవిశ్వాసాన్ని పెంచుతుంది. సముద్రపు అలలు భయంకరంగా పైకి లేచి, మనిషి జీవితాన్ని క్షణాల్లో హరించి వేస్తాయి. అయితే అవే అలలపై ఎంతో చాకచక్యంగా తెప్ప మీద తేలియాడుతూ, వాటితో ఆటలాడే సర్ఫింగ్ నిపుణులు కూడా మనకు కనిపిస్తారు.

ఏ వ్యక్తికైనా అప్పుడప్పుడు ఆందోళనలు, సందేహాలు, ఒత్తిళ్ళు సహజమే. అయితే అవి ఎంతకాలం మన మీద అధికారం చెలాయిస్తాయన్నది మనకున్న ఆత్మ విశ్వాసమే నిర్ణయిస్తుంది. a




-స్వామి పరిజ్ఞేయానంద

ఎమ్. నరేష్, శ్యామ్‌పేట్, వరంగల్ జిల్లా.

**ప్రశ్న:** ఆత్మవిశ్వాసం అందరిలో సమానంగా ఎందుకు ఉండదు? ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించుకొనే మార్గాన్ని సూచించండి.

**జవాబు:** ఆత్మవిశ్వాసం అందరిలో సమానంగా ఉండకపోవడానికి ఆయా వ్యక్తుల్లో శ్రద్ధా, పట్టుదలల్లో ఉన్న వ్యత్యాసమే కారణం.

What makes the difference between man and man is the difference in this Shraddha and nothing else. What makes one man great and another weak and low is this Shraddha.

*- Swami Vivekananda.*



జీవితంలో దేనినైనా సాధించాలంటే అపజయాల్ని అవకాశాలుగా స్వీకరించి మరింత ఉత్సాహంతోనూ, పట్టుదల తోనూ ప్రయత్నించాలి. మహాత్కార్యాలను సాధించిన ఏ మహాత్ముడైనా అపజయాల్ని చవిచూడకుండా ఉన్నతిని సాధించలేదు. ఈ విషయాన్ని గుర్తు పెట్టుకుంటే అవరోధాల్ని అధిగమించే ఆత్మస్థైర్యం మనలో పెరుగు తుంది. ఎవరెస్ట్ పర్వతాన్ని అధిరో హించడానికి మూడు మార్లు ప్రయత్నించి విఫలమైన 'ఎడ్మండ్ హిల్లరీ' ఎవరెస్ట్ శిఖరాన్ని చూస్తూ ఆత్మవిశ్వాసంతో అన్న ఈ క్రింది మాటలు మనకు స్ఫూర్తిదాయకాలు.

"You have defeated me thrice. But I will return and I will defeat you, because even as Everest you cannot grow any further, but I as a human being can."

వజ్రసంకల్పంతో దేన్నైనా సాధించవచ్చని సివిల్స్ విజయ కిరీటాన్ని ధరించిన ముత్యాలరాజు, ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించిన శేఖర్‌బాబు నిరూపించి, నేటి యువతరానికి స్ఫూర్తి దాతలుగా నిలిచారు.

ఇండోనేషియా మాజీ అధ్యక్షుడు సుకర్ణో 'నాజీవితాన్ని అమితంగా ప్రభావితం చేసిన మహనీయుడు స్వామి వివేకానంద. ఆ మహనీయుని బోధనల్ని రోజూ కొంతసేపైనా చదవకుండా నిద్రపోను'అన్నారు. కాబట్టి మీరు (యువత) కూడా స్వామి వివేకానంద సాహిత్యాన్ని రోజూ కనీసం 15 నిమిషాలైనా చదవడం అలవాటు చేసుకోండి. మీలో తప్పక ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. మరికొన్ని సూచనల కోసం శ్రీ రామకృష్ణ ప్రభ ఈనెల (జూలై) సంచికలో 'ఆత్మవిశ్వాసం ఎక్కడ దొరుకుతుంది?' అనే వ్యాసాన్ని చదవండి.

ఆర్. మురళీకృష్ణ, హైదరాబాద్

**ప్రశ్న:** వ్యక్తిత్వ నిర్మాణం, శీల నిర్మాణానికి గల తేడా ఏమిటీ? కేవలం వ్యక్తిత్వంతోనే సమాజంలో రాణించవచ్చు కదా! అలాంటప్పుడు శీలం అవసరమా?

**జవాబు:** వ్యక్తిత్వ నిర్మాణం, శీల నిర్మాణం – ఈ రెండు పదాలు వేరైనా భావం మాత్రం ఒక్కటే! 'వ్యక్తిత్వం' ఒక ఇల్లు అనుకుంటే 'శీలం' ఆ ఇంటికి పునాది లాంటిది. అంటే వ్యక్తిత్వమనే ఇల్లు సుస్థిరంగా ఉండాలంటే శీలం అనే పునాది దృఢంగా ఉండాలి మరి. కోటూ, బూటూ, సూటూ వేసుకుని ఆకర్షణీయంగా కనిపించడమే Personality అని నేటి యువతలో ఓ అపోహ. బయటకు అందంగా, ఆకర్షణీయంగా కనిపించడమే వ్యక్తిత్వం అయితే ఒంటిపై నిండుగా బట్ట అయినా కప్పుకోని గాంధీజీని నేటికీ మనం ఎందుకు స్మరిస్తున్నాం? సత్యం, ధర్మం అనే విలువల వస్త్రాన్ని నిండుగా కప్పుకొన్న వ్యక్తిత్వం ఆ మహాత్మునిది.

జీవితంలో ఎటువంటి అవరోధాల్ని అధిగ మించాలన్నా, దుఃఖాలయాన్ని ఛేదించాలన్నా శీలం యొక్క ప్రాధాన్యతను గురించి స్వామి వివేకానంద మాటల్లో...

"It is CHARACTER that can cleave through admantine walls of difficulties... The misery of man will continue to exist until man's character changes.

మానవతా విలువలతో కూడిన వ్యక్తిత్వమే నిజమైన వ్యక్తిత్వం. అలాంటి వ్యక్తిత్వం మనకు శ్రేయోదాయకం. అందరికీ స్ఫూర్తిదాయకం. a

**మీ సమస్యలు పంపాల్సిన చిరునామా :**

**యువవాణి**

**శ్రీరామకృష్ణప్రభ, రామకృష్ణమఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాద్-500 029**
E- mail : rkprabhayuvavani@gmail.com

# జ్ఞానతృష్ణే తపస్సు

**– స్వామి రంగనాథానంద**

స్వచ్ఛమైన విజ్ఞానం సరస్వతి. అనుష్ఠాన విజ్ఞానం లక్ష్మి. వ్యవసాయానికి శాస్త్రీయ విజ్ఞానాన్ని జోడించి దేశ సంపదను పెంపొందించవచ్చు. పరిశ్రమలకూ ఇది వర్తిస్తుంది. అన్నిచోట్లా ఈ తపోమూర్తులయిన దేవత లిరువురూ రాజ్యమేలుతారు. కానీ భారత దేశ వాసులమైన మనం వారిని నిజంగా ఎలా పూజించాలో నేర్చుకోవాలి. పూజించడమంటే దీపాలు వెలిగించి, వారి చిత్రపటాల ముందు హారతి ఇవ్వడం కాదు. విశ్వవిద్యాలయానికి వెళ్ళి, ఎన్నో పుస్తకాలు చదివి, మీకు మీరే బాగా ఆలోచించడం వల్ల మీరు సరస్వతీ పుత్రులవుతారు. కఠోర పరిశ్రమ, కలసికట్టుగా పనిచేయడం, కౌశలాన్ని పెంపొందించుకోవడంలాంటి వాటి ద్వారా లక్ష్మీదేవిని పూజించాలి. అప్పుడే మనకు లక్ష్మీ కటాక్షం కలుగుతుంది.

పాశ్చాత్యులు జ్ఞానం కోసం తపించి తద్వారా ఆధునిక నాగరకతను సృష్టించారు. వారికి క్లబ్బులకు పోవడానికి తీరిక లేదు. సమయానికి భోజన పానీయాలు లేక గంటల తరబడి పరిశోధనలు చేస్తూ రెండు వందల ఏళ్ళ కఠోర పరిశ్రమ తరువాత మహోన్నత శాస్త్రీయ విజ్ఞానాన్నీ, విధానాలనూ, సంపదనూ పెంపొందించుకున్నారు.

యుగాల క్రితం భారతావనిలోనూ జ్ఞానతృష్ణ, దానిలో ప్రేమ ఉండేవి. కాశీలో ఒక గురువున్నారని తెలిస్తే, 'ఆ గురువు దగ్గర విద్యనభ్యసించాలి' అనే సంకల్పంతో దక్షిణ భారతదేశం నుంచి కాశీకి నడుచుకుంటూ వెళ్ళేవారు. పశ్చిమ పంజాబులోని తక్షశిలకు (ప్రస్తుతం పాకిస్తాన్‌లో ఉంది) విద్యార్థులు నడచివెళ్ళేవారు. అక్కడ చరక, శుశ్రుతుల లాంటి ప్రసిద్ధ వైద్యుల వద్ద వైద్య విద్యను అభ్యసించేవారు. ఎక్కడైనా నిజమైన జ్ఞానతృష్ణ ఉన్నప్పుడు దాని కోసం కొంత కష్టాన్ని పట్టించుకొనేవారు కాదు.

జ్ఞానతృష్ణే తపస్సు. తపస్సు లేకుండా జ్ఞానం రాదు. తపస్సు, జ్ఞానం జంటగా కొనసాగుతాయి. దేశమంతా జ్ఞాన తపస్సనే భావంతో ఉత్తేజితమైతే, మన జాతీయ జీవనంలో మార్పులు వస్తాయి. తపస్సు చేయకుండా, హాయిగా కూర్చుంటే జ్ఞానం లభించదు. కష్టపడి ప్రయత్నించడాన్ని తపస్సంటారు. మన సంస్కృతిలోని మహత్తర పదం తపస్సు. ఉపనిషత్తుల లోనూ, భగవద్గీతలోనూ తపస్సనే పదం కనిపిస్తుంది. *'మనసశ్చ ఇంద్రియాణాం చ ఐకాగ్ర్యమ్ తప ఉచ్యతే'* – ఇంద్రియాలు, మనస్సుల శక్తులను కేంద్రీకరించడాన్ని తపస్సు అంటారు. లోకంలోని ఏ విధమైన జ్ఞానాన్వేషణకైనా ఆ నిర్వచనాన్ని ఇవ్వవచ్చు. శాస్త్ర వేత్తలు చేసేది అదే. వారు తమ మనస్సులకూ, భావాలకూ శాస్త్రీయంగా శిక్షణనిస్తారు. దాంతో వారు ప్రకృతిని ఛేదించి, ఎన్నో యుగాలుగా దాగి ఉన్న సత్యాలను బహిర్గతం చేస్తారు.

మన విద్యార్థులందరూ ఈ తపస్సు నిర్వచనాన్ని తమ దృష్టిలో ఉంచుకొని, పాఠశాలల్లో, కళాశాలల్లో అడుగు పెట్టాలి. పాఠశాలల్లో, కళాశాలల్లో, విశ్వవిద్యాలయాలలో కఠోర ప్రయత్నం లేకుండా జ్ఞానం పొందలేం. తపస్సు లేని జ్ఞానాన్వేషణ ఈ కాలపు విద్యలా చులకనగా తయారవుతుంది. జ్ఞానతృష్ణా కేంద్రాలైన విశ్వవిద్యాలయాల్లో మీరు అడుగుపెడితే, మీకు తపోభావన, ఆ వాతావరణం కనిపించదు. కొందరు మినహా అందరూ అన్నీ అతి సులభంగా సాధించాలనుకొనేవారే. కొందరు మాత్రమే తమలో తపోజ్వాలను నిరంతరం కలిగి ఉంటారు. మన సంస్కృతిలో తపస్సు, స్వాధ్యాయం కలిసి కొనసాగుతాయి. a

**(స్వామి రంగనాథానందజీ 'గీతోపన్యాసాల' నుంచి)**

**– అనువాదం: స్వామి అచిన్త్యానంద**

....16వపేజీ తరువాయి.

## స్వప్రయత్నమా? ప్రారబ్ధమా?

అదే విధంగా అపజయాలు ఎదురైతే వాటిని మన ప్రయత్న ఫలితమేనని అంగీకరించి, స్వీకరించగలగాలి. అప్పుడే వాటిని అధిగమించే ప్రయత్నం చేయగలం. అంతేగాని పరాజయాలు పలకరించి నప్పుడు ఆత్మన్యూనతలో మునిగిపోతే తీవ్రమైన అశాంతి తప్పదు. జీవితంలో ప్రగతి సాధ్యం కాదు.

ఎదురయ్యే జయాపజయాలు ఈ విధంగా మన మనస్తత్వాన్ని ప్రభావితం చేయకుండా ఉండేందుకే పెద్దలు ప్రారబ్ధం అనే భావాన్ని ప్రవేశపెట్టారేమో అనిపిస్తుంది. విజేతలు 'విధి'ని విశ్వసిస్తే తాము సాధించిన విజయాలను తమకు ఆపాదించుకోవడం ఆపుతారు. అప్పుడు అహంకారం వారి దరిచేరదు. ప్రారబ్ధాన్ని అంగీకరిస్తే పరాజితులు తమ అపజ యాలను పట్టించు కోకుండా ఉండవచ్చు. తిరిగి ప్రయత్నం చేసేందుకు సిద్ధంకావచ్చు! ఈ విధంగా ప్రారబ్ధం అనే భావన జయాపజయాలతో నిమిత్తం లేకుండా జీవన పోరాటాన్ని సాగించేందుకు మనల్ని సిద్ధం చేస్తుంది!



నిస్పృహకు లోనైతే విజయాలు సాధ్యం కావు.!

**అంతరార్థాన్ని గ్రహించి ఆచరించాలి :** మానవుడికి ప్రాపంచిక అభ్యుదయం ఎంత అవసరమో మానసిక శాంతి అంతే అవసరం. ఇవి స్వప్రయత్నంతోనే సాధ్యమవుతాయి. కానీ కేవలం ప్రయత్నాన్నే నమ్ముకున్న వారిని ఆత్మన్యూనతలూ, అహంకారాలూ (Inferiority & Superiority complexes) ప్రభావితం చేస్తాయనేది కాదనలేని నిజం. ఈలోపాలను విధి అనే భావన సరిదిద్దుతుంది. ఈ విధంగా సుఖదుఃఖాలు జయాపజయాల విషయంలో స్వప్రయత్నం, ప్రారబ్ధం అనే భావాలు మనకు సరైన దిశలో మార్గనిర్దేశం చేస్తాయి. ఈ రెండు భావాలూ ఒకదాన్ని మరొకటి పూర్తి చేస్తాయి. అంతరార్థాన్ని గ్రహించి ఆచరించే వారి జీవితాలు పరిపూర్ణం అవుతాయి. అంతేకానీ, ఈ రెండూ పరస్పరం వ్యతిరేకమైనవి కావు. వీటిలో దేన్ని తృణీకరించినా మన జీవితంలో సమతుల్యత లోపిస్తుంది. అశాంతి అలము కొంటుంది. a **(సశేషం)**

## ప్రయత్నం... ఫలితం...

**బి**థోవెన్ సుప్రసిద్ధుడైన పాశ్చాత్య సంగీత స్వరకర్త. ఒకసారి ఆయన ఆధ్వర్యంలో ఒక సంగీత కచేరీ ఏర్పాటైంది. సమావేశమైన శ్రోతలందరినీ ఆయన అత్యద్భుత నైపుణ్యంతో సంగీత సాగరంలో ఓలలాడించాడు. కచేరీ ముగిసిన వెంటనే శ్రోతల కరతాళధ్వనులతో సభ మిన్నుముట్టింది. అభిమానులు, ఆరాధకులు బిథోవెన్‌ను చుట్టుముట్టారు. అంతలో మధ్యవయస్కురాలైన ఒక మహిళ ఆయనను సమీపించింది. "భగవంతుడు మీ కిచ్చిన సంగీత జ్ఞానాన్ని నాకు కూడా అనుగ్రహించి ఉంటే ఎంత బాగుండేది?" అంటూ ప్రశంసించింది.

"ఈ నైపుణ్యం అసాధ్యమైన పరిజ్ఞానమూ కాదు... జన్మతః అబ్బిన అద్భుతమైన ప్రతిభ అంతకన్నా కాదు... రోజుకు ఎనిమిది గంటల చొప్పున... నలభై ఏళ్ళ పాటు క్రమం తప్పకుండా సంగీతాన్ని సాధన చేయండి! నాకు లభించిన అనుగ్రహమేదో మీకూ లభిస్తుంది. నా అంత వారు కావడానికి మీరు చేయాల్సిందల్లా అంతే!!" అంటూ అసలు విషయాన్ని నిర్మొహమాటంగా వివరించాడు బిథోవెన్. నిజమే...! కలలకు రూపునివ్వాలంటే కష్టపడాల్సిందే.! ప్రయత్నిస్తేనే పురోగతిని సాధించగలం.



కానీ పరిస్థితుల ప్రభావం వల్లో, ప్రయత్నలోపం వల్లో ఫలితాలు ఆశించినంతగా రాకపోవచ్చు. వాటిని మెరుగు పరుచుకొనే అవకాశం ఉంటే మరొకసారి ప్రయత్నించాలి. చేసిన తప్పుల్ని సమీక్షించుకోవాలి. వాటిని తిరిగి చేయకుండా జాగ్రత్తపడాలి. లక్ష్యాన్ని సాధించే దిశగా మరొకసారి ముందడుగు వేయాలి.

ఫలితాల్ని మార్చేందుకు మరొక అవకాశం లేకపోతే ప్రాప్తమింతే అనుకొని మనసుకు సర్దిచెప్పుకోవాలి! స్థిమిత పడాలి! అటువంటి సమయాలలో విధి పట్ల మనకుండే విశ్వాసం మనల్ని నిస్పృహకు లోనుకాకుండా నివారిస్తుంది. మనం నిరాశలో కూరుకుపోకుండా, మనకున్న ఇతర శక్తులు కుంటుపడకుండా కాపాడుతుంది. అదృశ్యరూపంలో మనకు లభించే అవకాశాలు మన నిరాసక్తత వల్ల వ్యర్థం కాకుండా అడ్డుకొంటుంది. a

....17వపేజీ తరువాయి.

## ధ్యానానికి దగ్గరి దారి



ప్రఖ్యాత చిత్రకారుడు లియోనార్డో డావెన్సీ జీవితంలో జరిగిన సంఘటన ఇదే విషయాన్ని వివరిస్తుంది.

ఆయన తన ప్రపంచ ప్రసిద్ధ కళాఖండం - "ది లాస్ట్ సప్పర్"కు రూపునిస్తున్న సమయం అది! ఏసుక్రీస్తు ముఖాన్ని మినహాయిస్తే మిగిలిన చిత్రాన్నంతా డావెన్సీ అత్యద్భుతంగా పూర్తిచేశాడు. ఇక క్రీస్తు ముఖాన్ని చిత్రించాల్సిన సమయం వచ్చింది. ఆ రోజు ఆయన మనసు అశాంతితో నిండి ఉంది. అందువల్ల ఆయన ఎంతగా ప్రయత్నించినా క్రీస్తు ముఖంలో ఉండే శాంతినీ, ప్రేమనూ, తన చిత్రంలో ప్రతిఫలించలేక పోయాడు. ఆయనెంతో విసుగు చెందాడు. తన అశాంతికి కారణమేమిటని కొంత సేపు ప్రశాంతంగా కూర్చొని ఆలోచించాడు. c **(మనసులోని మర్మాలు మరికొన్ని వచ్చే సంచికలో...)**



### పలు దిశల్లో పరిగెత్తే మనసు

**ఆ**కారంలో పెద్దవిగా ఉండే ఆహారకణాలను కొన్ని చీమలు కలిసి కట్టుగా లాక్కుపోతుండటం మనందరం చేసే ఉంటాం. నిజానికి అన్ని చీమలు ఒకే దిశలో ఆహారాన్ని తీసుకువెళ్ళవు! ముందుకు లాగేవి కొన్నయితే, వెనక్కి లాగేవి కొన్ని !! పక్కకు లాగేవి మరికొన్ని ! ఫలితంగా బలం ఏదిశలో అధికంగా ఉంటే ఆవైపే మొత్తం గుంపు కదులుతుంది!! అదేవిధంగా మనసు వివిధ విషయాలవైపు వేరువేరు ఆలోచనలుగా చెదిరిపోయి ఉంటుంది. కానీ ప్రాధాన్యత వహించే ఆలోచనే మనల్ని ఆక్రమిస్తుంది. ఈ విధంగా పలు దిశల్లో పరిగెత్తే మనసుని ఒక దగ్గరకి చేర్చడమే ధ్యానంలో మనం చేయాల్సినపని. c



# రామకృష్ణ మఠం, ఇచ్ఛాపూర్

(బేలూరు మఠ శాఖాకేంద్రం)

పి.ఒ. మాయల్ – బందీపూర్, హుగ్లీ –712617, పశ్చిమ బెంగాల్



## విరాళాలకై విన్నపం



**శ**శి మహరాజ్‌ను ఉద్దేశించి "మఠానికి శశి మూలస్తంభం లాంటివాడు. అతడు లేని మఠజీవితం ఊహించడమే అసాధ్యం" అన్నారు స్వామి వివేకానంద. శశి మహరాజ్ (స్వామి రామకృష్ణానంద) శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులు. ప్రపంచవ్యాప్తంగా ఉన్న రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌లను స్థాపించడంలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. శ్రీరామకృష్ణులు అనారోగ్యంతో ఉన్నప్పుడు వారికి శశి మహరాజ్ భక్తిశ్రద్ధలతో సపర్యలు చేశారు. శ్రీరామకృష్ణులు మహాసమాధి చెందాక కూడా వారి స్మృతి చిహ్నాల్ని శశి మహరాజ్ అంతే శ్రద్ధాభక్తులతో పూజించారు. అసమానమైన భక్తి ప్రపత్తులతో శశి మహరాజ్ ఆచరించిన పూజా విధానాన్నే రామకృష్ణ మఠ కేంద్రాలన్నిటిలో నేడు అనుసరిస్తున్నారు.

కలకత్తాకు 100 కి.మీల దూరంలో ఉన్న "ఇచ్ఛాపూర్" (హుగ్లీ జిల్లా) గ్రామంలో శశి మహరాజ్ జన్మించారు. స్థానిక భక్తులు కొన్ని ఏళ్ళ క్రితం శశిమహరాజ్ జన్మ స్థలంలో ఒక రేకుల షెడ్డులో తాత్కాలిక ప్రార్థనాలయాన్ని ప్రారంభించారు. అసంఖ్యాకమైన భక్తుల కోరికపై ఇక్కడ 21–08–1994న రామకృష్ణమఠ శాఖను ప్రారంభించారు.



నిర్మాణంలో ఉన్న ఆలయం

దాదాపు రూ. 12 లక్షల ఖర్చుతో శశి మహరాజ్ బంధువులకు పునరావాసం కల్పిస్తున్నాం. పేదలకు ఉచిత శిక్షణ తరగతులు నిర్వహిస్తున్నాం. ఉచిత సంచార వైద్యశాలను ప్రారంభించి, నిపుణులతో ఉచిత వైద్యసేవలు అందిస్తున్నాం. భక్తుల సౌకర్యార్థం శ్రీరామకృష్ణ విశ్వజనీన దేవాలయ నిర్మాణం చేపట్టాం. ఈ దేవాలయ నిర్మాణానికి సుమారు రూ. 93 లక్షలు వ్యయం కాగలదని అంచనా.

| | | |
|---|---|---|
| ఆలయం ఎత్తు | – | 65' |
| గర్భగుడి | – | 20' × 24' |
| ఆలయం చుట్టుకొలత | – | 80' × 56' |

300 మంది భక్తులు కూర్చునేందుకు హాలు.

భగవాన్ శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష సన్న్యాస శిష్యులు స్వామి తురీయానందజీ మహరాజ్ జన్మదినాన – 2003, జనవరి 17వ తేదీన రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు పూజ్య శ్రీస్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ వారిచే ఈ దేవాలయానికి శంకుస్థాపన జరిగింది.

సార్వజనీన దేవాలయ నిర్మాణానికి ఉదారులైన భక్తులు, శ్రేయోభిలాషులు, స్నేహితుల నుండి విరాళాల్ని కోరుతున్నాం.

విరాళాలను **Ramakrishna Math, Ichapur** పేరున చెక్కు లేదా డి.డి. తీసి **Ramakrishna Math, P.O. Mayal - Bandipur, Hooghly - 712617**కు పంపవలసిందిగా మనవి. అన్ని విరాళాలనూ కృతజ్ఞతతో స్వీకరిస్తాం.

మీరిచ్చే విరాళాలన్నింటికీ ఆదాయపుపన్ను చట్టంలోని సెక్షన్ 80G (vide memo No.DIT(E)/576/8E/40 69-70 dt.08-08-2001) కింద పన్ను మినహాయింపు ఉంటుంది.

శ్రీరామకృష్ణులు, దివ్యజనని శ్రీశారదామాత, స్వామి వివేకానంద, శశి మహరాజ్‌లు మిమ్మల్ని అనుగ్రహించాలని హృదయపూర్వకంగా ప్రార్థిస్తున్నాం.

భగవత్సేవలో
స్వామి నిర్లిప్తానంద
అధ్యక్షులు



# ప్రారబ్ధ కర్మ ఫలితం

కథ: అళగరాజా బొమ్మలు: శ్యాం తెలుగు సేత: స్వామి జ్ఞానదానంద

1 బుద్ధదేవుని దర్శనానికి పలువురు విచ్చేశారు. వారిలో ఒకడు.....










మిగతా 36వ పేజీలో....

## ఆచారవ్యవహారాలు - అంతరార్థాలు - 17

- రెంటాల జయదేవ

(గత సంచిక తరువాయి.)

### అర్ఘ్యమిస్తూ ఏమని ప్రార్థించాలి?

అర్ఘ్య మిస్తూ సూర్య భగవానుణ్ణి ప్రార్థించే విషయంలో 'శివ పురాణం' (6: 39, 40) ఇలా చెబుతోంది:

**సిందూర వర్ణాయ సుమండలాయ**
**నమో - స్తు వజ్రాభరణాయ తుభ్యమ్ ।**
**పద్మాభ నేత్రాయ సుపంకజాయ**
**బ్రహ్మేంద్ర నారాయణ కారణాయ॥**

**సరక్త చూర్ణం ససువర్ణ తోయం**
**సుకుంకుమాఢ్య సకుశం సపుష్పమ్ ।**
**ప్రదత్తమాదాయ సహేమ పాత్రం**
**ప్ర స్తిమర్ఘ్యం భగవన్ ప్రసీద ॥**

'ఓ భగవాన్! సిందూర వర్ణంతో నువ్వు చాలా అందంగా ఉన్నావు. వజ్రాభరణాలతో అలంకృతుడవైన నీ కళ్ళు పద్మాల లాగ ఉన్నాయి. చేతిలో కమలంతో నువ్వు సాక్షాత్తూ ఆ బ్రహ్మ, విష్ణు, ఇంద్రాదులు అందరికీ కారణుడివిగా కనిపిస్తున్నావు. ఓ భగవాన్! ఈ బంగారు పాత్ర నుంచి అందిస్తున్న సిందూరం, దర్భలు, పద్మాలతో కూడిన ఈ ఎర్ర రంగులోని నీటిని అర్ఘ్యంగా స్వీకరించు. ప్రీతి చెందు.'

ఇలా ప్రార్థిస్తూ, అర్ఘ్యమిచ్చిన వారి పట్ల సూర్య భగవానుడు సంప్రీతుడై, చక్కటి ఆరోగ్యాన్నీ, దీర్ఘాయువునూ ప్రసాదిస్తాడు. సమస్త భోగ భాగ్యాలనూ సమకూరుస్తాడు. మంచి పుత్రులనూ, మిత్రులనూ కటాక్షిస్తాడు. అలాగే, బుద్ధి, జ్ఞానం, తెలివితేటలు, కీర్తి ప్రతిష్ఠలు ప్రసాదిస్తాడు. మరణానంతరం 'సూర్య లోక' వాస ప్రాప్తి కలిగిస్తాడు.

### ఏ పురాణం ఏం చెబుతోంది?

ఈ విషయంలో 'బ్రహ్మ పురాణం' ఏమంటోందంటే:

**మానసం వాచికం వాపి కాయజం యచ్చ దుష్కృతమ్ ।**
**సర్వం సూర్య ప్రసాదేన తద్ శేషం వ్యపోహతి ॥**

'ఆదిత్యుణ్ణి ప్రార్థించి, అర్ఘ్యమిచ్చిన వారికి కోరినదెల్లా ఫలిస్తుంది. సాక్షాత్తూ ఆ ప్రభాకరుడే తానుగా వచ్చి, వారి కోర్కెలు తీరుస్తాడు. ఆ లోకసాక్షి ఆశీస్సులతో శారీరక, మౌఖిక, మానసిక పాపాలన్నీ పటాపంచలవుతాయి.'

సూర్యుణ్ణి ప్రార్థించినవారికి పాపాలు, రోగాలు, దారిద్ర్యం నశిస్తాయి. సంతోషం, చిరాయుష్షు లభిస్తాయి. సూర్యారాధకులకు శక్తి, బలం, పురుషత్వం, దైవత్వం సిద్ధిస్తాయని 'ఋగ్వేదం' పేర్కొంటోంది.

ఇతర దేవతలందరికీ ప్రకాశాన్ని అందించేది సూర్య భగవానుడేనని 'బ్రహ్మ పురాణం' స్పష్టం చేస్తోంది. సూర్యుడికి ఎవరు ఏది ఎంతిస్తే, అంతకు కొన్ని వందల రెట్లు ఆ భక్తుడికి అది తిరిగి లభిస్తుంది.




'సవిత సూర్య ఆరాధన' ద్వారా భోగ భాగ్యాలు, చక్కటి ఆరోగ్యం, సత్సంతానం, మొదలైనవి పొందవచ్చు. దాని వివరాలు 'స్కాంద పురాణం'లో కనిపిస్తాయి.

ప్రపంచంలోని జనులందరూ చేసే మంచి పనులకూ, చెడ్డ పనులకూ సూర్యభగవానుడే సాక్షి. ఆయన నుంచి దేన్నీ దాచలేం. అంతటి లోకసాక్షి గనుకనే 'సవిత సూర్య ఆరాధన' చేయాలని 'యజుర్వేదం' వివరిస్తోంది.

కాగా, ప్రార్థనల సందర్భంగా గాయత్రీ మంత్రాన్ని పఠిస్తే, సూర్యుడు ప్రీతి చెందుతాడని 'అగ్ని పురాణం' పేర్కొంటోంది.

### అనాది కాలం నుంచి ఆరాధన

నిజానికి, సూర్యారాధన ప్రాచీన కాలం నుంచి ఉన్నదే. ప్రాచీనులు సూర్యారాధనను జీవితంలో ఓ భాగంగా, ప్రథమ కర్తవ్యంగా చేశారు. దంతధావన చేసిన మరుక్షణమే

సూర్యబింబాన్ని చూసి నమస్కరించడం కర్షకులకు అలవాటు. శ్రోత్రియులు సంధ్యావందన ప్రక్రియలో భాగంగా సూర్యుడికి అర్ఘ్య జలాన్ని అర్పిస్తారు. ప్రాచీన కాలంలో గమనిస్తే, మట్టి కుండలన్నిటి మీదా సూర్యుడి చిత్రాలను గీసేవారు. మధ్య ప్రదేశ్‌లోని చంబల్ లోయలోని గుహా చిత్రాల్లో సూర్యుడికి దోసిలి ఒగ్గిన చిత్రాలు ఎక్కువగా కనిపిస్తాయి. ఇవాళ్టి గుజరాత్ రాష్ట్రపు ప్రాచీన నామం 'సౌర రాష్ట్రం' (దీన్నే 'సౌరాష్ట్రం' అని కూడా అంటారు). పరమ శివుని ద్వాదశ జ్యోతిర్లింగాలలో మొదటిదైన 'సోమనాథ లింగం' ఈ సౌరాష్ట్రంలోనిదే!

**ఆరోగ్య ప్రదాత**

ఆరోగ్యమనేది భాస్కరుని అధీనం. హృద్రోగం, బాల గ్రహ శాంతి, క్షయ, కుష్ఠు, కామెర్లు మొదలైన రోగాల నివారణకు సూర్య భగవానుడి అనుగ్రహం ముఖ్యం. ఆరోగ్యప్రదాత, జ్యోతిషాంపతి అయిన ఆదిత్యుణ్ణి ఆరాధించేది అందుకే!

సూర్యభగవానుడు వివిధ రూపాల్లో, నామాల్లో వివిధ అనారోగ్యాలను నివారిస్తాడు. సూర్య భగవానుడు ధనాన్నిచ్చే దైవం. 'ఆదిత్య' రూపంలో వాత పిత్తాది రోగాలను నివారిస్తాడు. 'సూర్య' రూపంలో కామెర్ల రోగాన్ని పోగొడ తాడు. 'కృష్ణ' రూపంలో సంతానం ప్రసాదిస్తాడు. 'పుష్య' రూపంలో సుఖ ప్రసవాన్ని కలగజేస్తాడు. 'సవిత్ర' రూపంలో సర్వ శస్త్ర బాధల్నీ, కంటి దోషాల్నీ తొలగిస్తాడు. ఆవులకు రోగాలు కలిగించే క్రిముల్ని ఉషా కిరణాల రూపంలో నశింపజేస్తాడు.

సూర్యరశ్మి ప్రభావం అనంతం. సూర్యుడు సహస్ర కిరణాలు కలవాడని వేదాలు ప్రస్తుతించాయి. ఆ వేయి కిరణాల పైన మరో ఏడు కిరణాలున్నాయి. వాటిని 'గ్రహ యోనః' అని అంటారు. ఆ ఏడూ ఏమిటంటే – 'సుషుమ్నం, హరికేశం, విశ్వకర్మ, విశ్వవ్యచ, సంపద్వసు, అర్వాగ్వం, స్వరాద్వసు'. ఇవి గ్రహాలను పోషిస్తాయి. ఇవికాక, ఇంకా నాలుగు వందల కిరణాలు వానలు కురవడానికి ఏర్పడ్డాయి. మూడు వందల కిరణాల వల్ల మంచు కురవడానికి అవకాశం ఏర్పడుతోందని శాస్త్రాలు చెబుతున్నాయి.

మయూరుడనే తెలుగు కవి 'సూర్య శతకం' వ్రాసి, కుష్ఠు రోగం నుంచి విముక్తుడయ్యాడు. ప్రతి ఆదివారం సూర్య దేవుణ్ణి ఆరాధించి, క్షీరాన్నం నివేదిస్తే, చర్మరోగాలు, కంటి వ్యాధులు నయమవుతాయి.

కోరిక, ధైర్యం, తెలివి, సమర్థత, ఆధిపత్యం, ప్రతిష్ఠ, శక్తి, ఉన్నత స్థితి, నమ్మకం, కీర్తి, హుందాతనం, ఉదార స్వభావం, ఆరోగ్యం, సంతోషం, ఆశ, వ్యక్తిత్వం, ఉన్నతంగా కని పించడం, మంచి మనసు, ఆలోచనా శక్తి, బలం కలిగి మనిషి విజయవంతంగా జీవించడానికి సూర్యభగవానుడే కారకుడు.

అలాంటి శ్రీసూర్యనారాయణ మూర్తిని ప్రసన్నం చేసుకొనేందుకూ, శాంతింపజేసేందుకూ ప్రతి రోజూ సూర్యార్ఘ్యం సమర్పించాలి.

**అలంకార ప్రియో విష్ణుః, అభిషేక ప్రియ శ్శివః, నమస్కార ప్రియో భానుః ।**

అని పెద్దల మాట. సూర్యుడు నమస్కార ప్రియుడు కాబట్టి, ఆయనను భక్తితో మనసారా ప్రార్థించి, నమస్కరిస్తే, ఆరోగ్యం తప్పకుండా చేకూరుతుంది. తేజస్సు వృద్ధి చెందుతుంది. సమస్త శుభాలూ కలుగుతాయి.

సర్వకార్య, కామ్య ఫలదాయని అయిన 'గాయత్రీ మంత్ర'నికి అధిష్ఠాత కూడా సూర్యభగవానుడే! అందుకే, సూర్యుడి ఆరాధన, అర్ఘ్య సమర్పణ అత్యంత కీలకం. ఆ ఆదిదేవుడి ఆరాధనతో తరించడం అందరి కర్తవ్యం. ❑

....33వ పేజీ తరువాయి.




**5** బుద్ధుడు చక్షుపాలుని గత జన్మ గురించి చెప్పసాగాడు. గత జన్మలో అతడు మంచి వైద్యుడు. ఒక రోజు ఓ మహిళ తడుముకుంటూ నడవడం అతను చూచాడు.

**6** వైద్యుని చికిత్సతో ఆమెకు కంటిచూపు వచ్చింది. చూపురావడంతో ఆమె పని చేస్తున్న ధనవంతుని యింట్లోనే పని చేయాలని తీర్మానించుకుంది. అందువల్ల తనకు చూపు రాలేదని అబద్ధం చెప్పింది. కానీ ఆమెకు చూపు వచ్చిందని వైద్యుడికి తెలుసు.






**7** తనను మోసగించిన ఆమె పట్ల వైద్యునికి విపరీతమైన కోపం వచ్చింది. ఆమె దృష్టి మళ్ళీ కోల్పోవడానికి ఒక పని చేశాడు.




**8** ఆ మందు రాసుకున్న వెంటనే ఆమెకు చూపు మళ్ళీ పోయింది!




9
ఆ వైద్యుడే ఈ జన్మలో ఈ సాధువుగా జన్మించాడు. ఈయనకు కంటిచూపు ఎందుకు లేదో ఇప్పుడు అర్థమయిందా?
అయ్యా! కృతఘ్నురాలయిన ఆమె చేసింది తప్పేకదా! అందు వల్లనే కదా వైద్యుడికి కోపం వచ్చింది!
నిజమే! అయినా....


10
'అయినా' ... అంటున్నారే!
ఆ స్త్రీ ఒక మామూలు మనిషి. కానీ, వైద్యుడు దైవ సమానుడు కదా! అతడు వైద్య ధర్మానికి విరుద్ధంగా ఆమెపై ప్రతీకారం తీర్చుకోవడం మహాపాపం.


11
అవును! తన కర్తవ్యాన్ని విస్మరించి కీడు చేసిన వైద్యునికి దండన విధింపబడింది.


ప్రారబ్ధ కర్మ ఫలాన్ని అనుభవించే తీరాలి. ఎవరూ దానినుండి తప్పించు కోలేరు. సాధనలు చేసే వ్యక్తి జీవితంలో ప్రారబ్ధ కర్మ తీవ్రత తగ్గుతుంది.
ఉదాహరణకు ప్రారబ్ధ కర్మానుసారం కాలు కోల్పోవలసి ఉంటే ఆ కాలుకి ఒక చిన్న ముల్లు గుచ్చుకోవడంతో ప్రారబ్ధ కర్మ తీరిపోతుంది.
– శ్రీశారదాదేవి

# గ్రంథ పరిచయం

## శ్రీ రుక్మిణీ కళ్యాణం

**వ్యాఖ్యాత : శ్రీ కె.వి.రాఘవాచార్యులు**
**పేజీలు: 156, వెల రూ. 100/-**
**ప్రచురణ : శ్రీపావని సేవాసమితి, ఎస్.ఆర్.టి.-270, సనత్‌నగర్, హైదరాబాద్-500 018.**



తెలుగులో ఎన్ని గ్రంథాలున్నా, భక్తి,రస మాధుర్యంతో చవులూరించే పోతనగారి భాగవతానిదే అగ్రస్థానం. భాగవత పద్యాలు పాడని కంఠం... వినని చెవులు... పులకించని దేహం... ఆనందించని హృదయం ఆంధ్ర దేశంలో లేవు. ముఖ్యంగా తెలుగునాట యుక్తవయస్సులో, గుణవంతుడైన వరుడికోసం భాగవతం దశమ స్కంధంలోని రుక్మిణీ కళ్యాణ చరిత్రను పారాయణ చేసే కన్యలకు ఇంకాబాగా తెలుసు."శ్రీ కంఠబాప ఖండన" పద్యానికి సమకూర్చిన వ్యాఖ్య ఆచార్యుల వారి పరిశీలనా దృష్టికి, పాండిత్య ప్రతిభావ్యుత్పన్నతలకు నిదర్శనం. పోతనగారి కవితామకరందానికి, సుకుమారమైన, హృద్యమైన వ్యాఖ్యానపు పుప్పొడిని మేళవించి, హృదయరసాయనంగా తెలుగు ప్రజలకు అందించిన శ్రీ రాఘవాచార్యులుగారు భగవత్‌కృపకు సర్వవిధములా అర్హులు. a **- నాగప్రసాద్.**

## గృహస్థాశ్రమము

**రచయిత: భగవాన్ శ్రీసత్యానందమహర్షులవారు**
**పేజీలు:136, వెల: 20/-,ప్రతులకు: శ్రీసత్యానంద ఆశ్రమం, ఇనమడుగు - 524 137, నెల్లూరు జిల్లా.**

## సంపూర్ణ రామాయణమ్ క్విజ్

**రచన:అవసరాల లక్ష్మీపతిరావు, పేజీలు: 55, వెల: 35 అవసరాల లక్ష్మీపతిరావు , డోర్ నెం. 1-14-8, పెదవాల్తేరు, విశాఖపట్నం - 530 017.**

## సనాతన హిందూ ధర్మము సదాచారము

**సంకలన కర్త : బ్రహ్మశ్రీ పులవర్తి సూకాలరావు**
**పేజీలు:48, వెల: 15/-,**
**23-2-10, వెంపటి వారి వీధి, కాకినాడ -1**

## ఆర్యాద్విశతి

**సంస్కృతమూలం : దుర్వాస మహర్షి**
**పేజీలు:172, వెల రూ.60/-,**
**తెలుగుటీక : నాగపూడి కుప్పుస్వామి, ప్రాప్తిస్థానము: ప్రాచీ పబ్లికేషన్స్, 3-3-859/1/ఎ, 2 ఫ్లోర్, కాచీగూడ, హైదరాబాద్ -500 027.**




జగన్మాత శ్రీ లలితా పరమేశ్వరీ దివ్యమంగళ స్వరూప, వైభవాలను రెండు వందల శ్లోకాలలో ఆర్యావృత్తంలో దుర్వాస మహర్షి కీర్తించి గానంచేసిన అపురూపమైన, అపూర్వమైన స్తోత్రము ఈ ఆర్యాద్విశతి. శ్రీ చక్రంలో, కేంద్రస్థానంలో, బిందువులో కామేశ్వరుని నామాంకిత రూఢయై, వివిధ ఆవరణలలో నివసించే దేవతలందరిచేత నిత్యమూ పూజలందుకునే శ్రీ రాజరాజేశ్వరీ దేవిని అభివర్ణిస్తుంది ఈ ఆర్యాద్విశతి. మహాశక్తిని అనేక విధాలుగా వర్ణిస్తూ, ఆమె గురించి పాడి, ఆనందాన్ని ఆస్వాదించడం ఒక వరం. ఆ వరాన్ని ఈ గ్రంథం మనకు ప్రసాదించింది. ఆది శంకరుని సౌందర్యలహరి, శివానందలహరి లాగ 'ఆర్యాద్విశతి' కూడా నిత్య పారాయణ గ్రంథం. a **- నాగప్రసాద్.**

## అరుణాచల మహిమ

**రచన: పులిచర్ల ఆదినారాయణ,**
**పేజీలు:98, వెల:20/-, ప్రచురణ: శ్రీదత్తసాయి సేవా సమాజ్, 1-9-295/32/5, సీతారామనిలయం, మసీదులైన్, విద్యానగర్, హైదరాబాద్ - 500 044.**

## గౌతమీ అవతరణం

**రచన: డా॥ కోడూరి రామకృష్ణ,**
**పేజీలు:59, వెల:20/-, ప్రాప్తిస్థానం : దేవీ అడ్వర్టయిజర్స్, 29-2-3, ఎ-1 కమ్యూనికేషన్స్, సబ్ కలెక్టర్ ఆఫీస్ రోడ్, గోకవరం బస్టాండ్, రాజమండ్రి.**

# వార్తావాహిని



వేసవి శిబిరాన్ని ప్రారంభిస్తున్న శ్రీ జి.ఎస్. సింఘ్వీ

**హైదరాబాద్ రామకృష్ణ మఠం** 8 నుంచి15 సంవత్సరాల లోపు పిల్లలకు నెల రోజుల పాటు వేసవి శిబిరాన్ని నిర్వహించింది. 1056 విద్యార్థినీ విద్యార్థులు పాల్గొన్న ఈ శిబిరంలో యోగాసనాలు, భజనలు, గీతాపారాయణం మొదలైన అంశాలలో శిక్షణ నిచ్చారు. ఏప్రిల్ 22న ఆంధ్రప్రదేశ్ హైకోర్ట్ ఛీఫ్ జస్టీస్ శ్రీ జి.ఎస్. సింఘ్వీచే ప్రారంభమైన ఈ శిబిరం మే 19న ముగిసింది. ఈ ముగింపు కార్యక్రమానికి ముఖ్య అతిథిగా ఆంధ్రప్రదేశ్ రెవెన్యూ ఎండోమెంట్స్ ముఖ్య కార్యదర్శి డా॥ ఐ.వి. సుబ్బారావు పాల్గొని సంగీతం, వక్తృత్వ, పారాయణ పోటీల్లో విజేతలైన విద్యార్థులకు బహుమతి ప్రదానం చేశారు. a – నివేదిక: **జి.కృష్ణ**

• • • • • •



వేసవి శిబిరం ముగింపు కార్యక్రమంలో నృత్య ప్రదర్శన

**రాజమండ్రి రామకృష్ణ మఠం** విద్యార్థులకు ఏప్రిల్ 30 నుంచి మే 27 వరకు వేసవి శిబిరాన్ని నిర్వహించింది. ఈ శిబిరంలో పిల్లలకు నిత్యప్రార్థన, ధ్యానం, యోగ, సంగీతం, చిత్రలేఖనం, నృత్యం, నాటకం, హస్తకళలు వంటి వివిధ అంశాల్లో శిక్షణనిచ్చారు. మే 27న జరిగిన ముగింపు కార్యక్రమంలో విజయవాడ రామకృష్ణ మిషన్ స్వామి శశికాంతానందజీ పాల్గొని 'నేటి బాలలే రేపటి పౌరులు' అని విద్యార్థులకు ఉత్తేజకరమైన సందేశాన్నిచ్చారు. a

నివేదిక – **స్వామి అక్షరాత్మానంద**

## అగ్ని ప్రమాద బాధితులకు సహాయక చర్యలు

**రాజమండ్రి రామకృష్ణ మిషన్** తూర్పు గోదావరి జిల్లా కొండమొదలు గ్రామంలో జూన్ 6వ తేదీన అగ్ని ప్రమాదానికి గురి అయిన కుటుంబాలకు తక్షణ సహాయక చర్యలు చేపట్టింది. 101 అగ్ని ప్రమాద బాధిత కుటుంబాలకు రూ॥ 1,50,000/- విలువ చేసే నిత్యావసర సామాగ్రిని పంపిణీ చేసింది. a నివేదిక – **స్వామి అచిన్త్యానంద**





వస్త్రాలను పంపిణీ చేస్తున్న స్వామి అక్షరాత్మానంద

• • • • • •

## వేట్లపాలెంలో 'వివేకవాహిని'



పుర వీధుల్లో 'వివేకవాహిని'తో ఊరేగింపు

**తూ**ర్పు గోదావరి జిల్లా, వేట్లపాలెం **రామకృష్ణ సేవా సమితి** మే 5 హనుమజ్జయంతి శుభ దినాన విజయవాడ రామకృష్ణ మిషన్ భావ ప్రచార రథం 'వివేకవాహిని'ని తమ గ్రామానికి ఆహ్వానించింది. ఆ రోజు సాయంత్రం జరిగిన బహిరంగ సభలో స్వామి సుప్రియానందజీ 'సమగ్ర శీలనిర్మాణమే వ్యక్తిత్వానికి పునాది' అని యువతను ఉద్దేశించి ప్రసంగించారు. తదనంతరం 'స్వామి వివేకానంద' చలన చిత్రాన్ని ప్రదర్శించారు. ఈ కార్యక్రమానికి పిల్లలు, పెద్దలు, యువతీ యువకులు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. a నివేదిక – **వి. వీరభద్రరావు**

# విజ్ఞానం - వినోదం

- ఎస్. ప్రసాద్

## అయ్యో.. పాపం..!

**పుణ్యస్య ఫలమిచ్ఛన్తి పుణ్యం నేచ్ఛంతి మానవాః**
**న పాపఫలమిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నతః**

మానవులు తమకు సకల శుభాలూ సమకూరాలని అనుకుంటారు. కానీ శుభాలనిచ్చే పుణ్య కార్యాలను మాత్రం చేపట్టరు. పైగా ప్రయత్నించి మరీ పాప కార్యాలనే చేస్తారు. ఆ పాపాల ఫలితాల్ని అంగీకరించడానికి మాత్రం సిద్ధపడరు.





## అమాయకత్వం...

"నా కోసం ఓ జాబు వ్రాసిపెట్టగలవా బాబూ!" అని ఓ పెద్దావిడ, పోస్టాఫీస్‌లో ఒకతణ్ణి అడిగింది.

ఎంతో వినయంగా ఆమె చెప్పినట్లే ఉత్తరం వ్రాసి, ఆమె చేతికిచ్చాడా యువకుడు. "మరేదైనా సాయం కావాలంటే చెప్పండి" అని చొరవగా అడిగాడు.

దానికి, ఆ వృద్ధురాలు అమాయకంగా "నా చేతివ్రాతకు క్షమించండి!" అని కూడా ఉత్తరం చివర్లో వ్రాసిపెట్టు బాబూ!" అంది.



## వారసత్వ వైభవం



మహాభారత యుద్ధానికి ముందు ధర్మరాజు భీష్మద్రోణాది పూజ్యులకు నమస్కరించాడు. ధర్మం మావైపుందని భావించే వారెవరైనా మా పక్షాన చేరి యుద్ధం చేయవచ్చని శత్రు సైన్యంలోని వీరులను అర్థించాడు. అప్పుడు ధృతరాష్ట్రుడికి 'వైశ్య' యందు జన్మించిన యుయుత్సుడు పాండవ పక్షాన చేరి, కౌరవులతో పోరాటం సాగించాడు. యుద్ధంలో అధర్మవర్తనులైన వంద మంది గాంధారీ తనయులు అసువులు బాసారు. ధృతరాష్ట్రుని పుత్రులలో చివరికి ప్రాణాలతో మిగిలింది యుయుత్సుడే!



## మన మహర్షులు

కుక్కుటమహాముని: తల్లితండ్రులకు సేవ చేయడమే గొప్ప తపస్సుగా భావించి, ఆచరించేవాడు కుక్కుటముని. దాంతో ఆయన గొప్ప తపశ్శక్తి సంపన్నుడు అయ్యాడు. గంగ,యమున, సరస్వతులు ప్రతి రోజూ కుక్కుటముని ఆశ్రమ ప్రాంగణాన్ని పరిశుభ్రం చేసేవారు. ఆ సేవా ఫలితంగా జనులందరూ ఆయా నదుల్లో స్నానము చేయడంతో తమకు అంటిన పాపాల్ని పోగొట్టుకొనేవారు.

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.64-7, Sri Ramakrishna Prabha (Telugu Monthly) July 2007, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. H-HD-1071/2007-09. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2007-09

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) 'వేదచూడామణి'** : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

**(ఆ) 'వేదార్థచూడామణి'** : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) వేదాధ్యాపకుడు** : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

**(ఆ) వేదభాష్యాచార్యుడు** : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు



# సుబోధ

**భక్తుడు :** సర్వసంగ పరిత్యాగం చేయకుండా భగవంతుణ్ణి పొందలేమా?

**శ్రీరామకృష్ణులు :** సంసారంలో ఉండడం వల్ల దోషం ఏమీ లేదు. కానీ మనస్సును భగవంతుడి వైపు మళ్ళించాలి సుమా! అలాకాకుంటే మీరు ఏమీ సాధించలేరు. ఒక చేత మీరు విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించండి, మరొక చేత భగవంతుణ్ణి పట్టుకోండి. మీ విధ్యుక్తధర్మ నిర్వహణానంతరం రెండు చేతులతో భగవంతుణ్ణి పట్టుకోండి.

బంధానికీ, ముక్తికీ – అంతటికీ మనస్సే మూలం. మనస్సును నువ్వు ఏ రంగులో ముంచితే ఆ రంగే అంటుకొంటుంది. రజకుడి నుంచి అప్పుడే వచ్చిన తెల్లని వస్త్రం లాంటిది మనస్సు. ఆ వస్త్రాన్ని నువ్వు ఎరుపు రంగులో ముంచితే అది ఎరుపు రంగును సంతరించుకొంటుంది. నీలంలోనో, ఆకుపచ్చ రంగులోనో ముంచితే అది నీలం, ఆకుపచ్చ రంగుల్ని సంతరించుకొంటుంది. నువ్వు ఆ వస్త్రాన్ని ఏ రంగులో ముంచితే ఆ రంగునే పొందుతుంది. ఏదో కాస్త ఆంగ్లం నేర్చుకోగానే 'వాట్ గీట్' అంటూ మాట్లాడడం మీరు గమనించే ఉంటారు. అంతేగాక బూట్లు ధరించి, ఈల వేస్తూ పోతుంటారు. ఇవన్నీ తోడుగానే వస్తాయి. ఓ పండితుడు గనక సంస్కృతం అధ్యయనం చేస్తే సంస్కృత శ్లోకాలను డబ డబ లాడిస్తాడు. నువ్వు కనుక దుస్సాంగత్యంలో ఉంటే, నీ సహచరుల లానే మాట్లాడతావు, ఆలోచిస్తావు. అలా కాక సజ్జనులైన భక్తుల సాంగత్యంలో ఉంటే నీ ధ్యాస, పలుకు భగవత్పరమైనవిగానే ఉంటాయి.

బంధం మనస్సుకు చెందినది, ముక్తి కూడా మనస్సంబంధితమే. 'నేను ముక్తుణ్ణి. సంసారంలో ఉన్నా, అరణ్యంలో ఉన్నా నేనెలా బంధితుణ్ణి అవుతాను? నేను భగవంతుని బిడ్డను. నన్నెవరు బంధించగలరు?' అని ఒక వ్యక్తి సదా చింతన చేస్తే, అతడు తప్పక ముక్తుడవుతాడు.

భగవన్నామ స్మరణతో శరీరం, మనస్సు సమస్తం పవిత్రమవుతాయి. పాపం, నరకం ఇత్యాదుల గురించే మాట్లాడుకోవడం ఎందుకు? 'ఓ భగవంతుడా! నిస్సంశయంగా నేను దుర్మార్గాలు చేశాను, మళ్ళీ అలా ప్రవర్తించను' అని ఒక్కసారి చెప్పు. భగవన్నామం పట్ల విశ్వాసం కలిగివుండు.

( 'శ్రీరామకృష్ణ కథామృతం' నుంచి )







# సురభి

కరువుతో బాధపడుతున్న వారి కోసం మాతృదేవి హృదయం ఎంతగా ద్రవించిందో నేను (స్వామి అపూర్వానంద) తెలుసుకోగలిగాను. ప్రతి పేదవాని ఇంటికి వెళ్ళడమూ, చీటీలు ఇవ్వడమూ, వారు వాటిని తీసుకువచ్చి చూపించి బియ్యం తీసుకెళ్ళడమూ, స్త్రీలకు బట్టలు ఇవ్వడమూ లాంటి వన్నీ నేను వివరించాను. అప్పుడు వివరించిన ఒక సంఘటన విని మాతృదేవి చలించిపోయారు:

మేము సహాయక చర్యలు చేపట్టిన ఓ గ్రామానికి ఒకరోజు ఉదయం వెళ్ళాం. బియ్యం తీసుకువెళ్ళిన ఎవరూ ఇంట్లో కనబడలేదు. పని మీద బయటకు వెళ్ళి ఉంటారనుకున్నాం. నిజానికి, పని దొరికిన వారికి బియ్యం ఇవ్వడం ఆపివేయాలి. పని దొరికిన వారి వివరాలు తెలుసుకోవడానికే మేం వెళ్ళాం. అప్పుడు గ్రామానికి బయటవున్న పొలంలో మోకాళ్ళ వరకు బురదలో నిలబడి చాలామంది నాట్లు వేస్తున్నారు. మేము అటువైపు వెళ్ళాం.

మమ్మల్ని చూడగానే ఒక స్త్రీ పొలంలో నుండి బయటకు వచ్చి దాక్కుంది. ఆమె ఎందుకు అలా చేసిందని అడిగినప్పుడు ఒక హృదయ విదారకమైన విషయం తెలిసింది. మొన్నటి రోజే ఆమె ప్రసవించింది. ఆ పసిగుడ్డును ఒక గుడ్డలో చుట్టి గట్టు మీద పడుకోబెట్టి పనికి వచ్చింది. అంతా కూటి కోసమే! ఆమె పని చేస్తూ ఉందని మాకు తెలిసిపోతే బియ్యం ఇవ్వడం ఆపేస్తాం కదా! అందుకని దాక్కుంది. కరువు కాఠిన్యం ఎంతగా ఆమెను బాధించి ఉండాలి! ఆ రోజు పుట్టిన చంటిబిడ్డను తీసుకుని పని కోసం వచ్చిందంటే ఆమె పేదరికం అలాంటిది.

నేను మెల్లగా ఆ స్త్రీ వద్దకు వెళ్ళి, "అమ్మా! కలత చెందకు. నీకు బియ్యం ఇవ్వడం ఆపం" అని చెప్పాను. ఆ మాటలు వినగానే ఆమెకు కాస్త ధైర్యం వచ్చింది.

ఈ సంఘటన విన్న మాతృదేవి శరీరం వణకి పోయింది. ఆమె కంటతడిపెడుతూ "ఆ రోజే ప్రసవించిన మనిషి పనికి రావడమా! పొలంలో పనిచేయడమా? నువ్వు మంచి పనే చేశావు నాయనా! గురుదేవులు నిన్ను ఆశీర్వదిస్తారు" అన్నారు. తర్వాత ఆర్ద్రంగా గురుదేవులతో "ప్రభూ! లోకులు ఎన్ని కష్టాలు అనుభవిస్తున్నారు! దీనికొక పరిష్కారం చూపలేరా?" అంటూ ప్రార్థించారు. ఆమె కంఠం గద్గదమైంది. ఇప్పటికీ ఆ కంఠస్వరం నా చెవులలో మారు మోగు తోంది. మాతృదేవి ఎంతటి కరుణాసాగరులో కదా!

**(మాతృమూర్తి శ్రీశారదాదేవి శిష్యులైన స్వామి అపూర్వానంద స్మృతుల నుంచి)**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

ఆగష్టు 2007

వెల : రూ. 8



మరచిన ఆదర్శాల్ని మననం చేద్దాం!



# సుబోధ



**భక్తుడు:** భగవంతుడు సాకారుడా? లేక నిరాకారుడా?

**శ్రీరామకృష్ణులు:** రెండూను! వేదాంత మార్గంలో అన్వేషించేవారికి నిరాకారుడు. వారు ఆత్మజ్ఞాన ప్రబోధంతో 'నేను' సత్యం, 'జగత్తు' మిథ్య, మాయ అని అంటారు. వారు సృష్టినంతా వస్తు విచారణ చేస్తూ ఉంటారు. ఈ వస్తువు భగవంతుడా – కాదా అన్న విచారణ చేస్తూ 'ఇది కాదు – ఇది కాదు' అంటూ చివరకు తన లోపలే ఉన్న ఆత్మను చేరుకొని ఆత్మజ్ఞానం పొందుతారు. ఆ కారణంచేత జ్ఞాని భగవంతుడు నిరాకారుడు అని గ్రహిస్తాడు. ఉదాహరణకు ఉల్లిపాయను తీసుకోండి! పైన ఉండే ఎర్రటి పల్చని పొర తొలగిస్తే లోపల మందపాటి తెల్లని పొరలుంటాయి. ఒక్కొక్కటిగా తొలగిస్తూ పోతే చివరికి ఏమీ మిగలదు! 'నేను' అన్న ఉప్పుతో తయారు చేసిన బొమ్మ ఒకటి సముద్రపులోతు కనుక్కునేందుకు సముద్రంలోకి దిగింది. అది సముద్ర జలాన్ని చేరగానే కరిగి నీళ్ళలో కలసిపోయింది. ఇక సముద్రం లోతు తెలిపేందుకు మిగిలిందెవరు? భగవత్సాక్షాత్కారం కాగానే 'నేను' అనే భావం నశించిపోయి తర్కం కూడా నశించి బ్రహ్మలోనే ఐక్యం అయినప్పుడు ఏ ఆకారాన్నీ చూడలేం. విచారణ పూర్తికానంత వరకూ తర్కిస్తూ ఉంటారు. విచారణ పూర్తి కాగానే మౌనం వహిస్తారు. అట్లాగే ఖాళీ కడవలో నీరు పోసేటప్పుడు శబ్దం వినిపిస్తుంది. కడవ కాస్త నిండగానే శబ్దం ఆగిపోతుంది. పూర్ణ జ్ఞానం కలిగినప్పుడు మనిషి మౌనం వహిస్తాడు. ఇదే పూర్ణ జ్ఞానానికి సంకేతం.

'నేను' అన్న భావం నశించాలంటే, "నేను భగవంతుని భక్తుడను, నేను భగవంతుని సేవకుడను" అన్న భావనతో మెలగాలి. ఈ తరహా భక్తులు భగవంతుణ్ణి వివిధ ఆకారాలతో సేవిస్తారు. భగవంతుడు అనంతమైన సచ్చిదానంద సాగరం. భక్తుని భక్తి, ప్రేమలనే చల్లదనంతో కొంతమేర సముద్రం ఘనీభవించి మంచుగడ్డగా మారుతుంది. అంటే, భగవంతుడు తన భక్తుల కోసం వివిధ రూపాలు ధరించి దర్శనమిస్తాడు. భక్తులు భగవంతునికి మానవాకారాన్ని ఆపాదించి తద్వారా భగవంతుణ్ణి ప్రార్థిస్తారు. సామాన్యులకు ఇది సులభమైనమార్గం. c

( 'శ్రీరామకృష్ణ కథామృతం' నుంచి )




శ్రీ రామకృష్ణ ప్రభ

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029

ఫోన్: 040-2766 7799

E-mail : sriramakrishnaprabha@gmail.com



నిర్వాహక సంపాదకులు : స్వామి జ్ఞానదానంద

సంపాదకులు : స్వామి పరిజ్ఞేయానంద

# సురభి



కరువు నివారణ కార్యక్రమంలో మా జీవిత విధానం గురించి వివరంగా అడిగారు మాతృదేవి. మేము ఆహారం ఏమి తీసుకుంటాం, ఎక్కడ ఉంటాం, ఏయే పనులు చేస్తాం - ఇలా విషయాలన్నీ అడిగారు. అందుకు కరువు నివారణ సమయంలో జరిగిన ఓ సంఘటన మాతృదేవికి వివరించాను.

"ఒక రోజు ఒక గ్రామంలో కరువు నివారణ కార్యాలను పర్యవేక్షించేందుకు వెళ్ళాను. 25 అడుగుల వెడల్పు వున్న ఓ చిన్న నదిని దాటి వెళ్ళవలసి వచ్చింది. మోకాళ్ళు వరకే నీళ్ళు ప్రవహిస్తూ ఉండడం వల్ల కాలినడకనే ఆ నదిని దాటాను. పగటి పూట బాగా వర్షం పడింది. తిరిగి వచ్చేటప్పుడు చూస్తే ఆ నది పొంగి ప్రవహిస్తూవుంది. చీకటి పడసాగింది. నదిని దాటేందుకు మరో మార్గం లేనందువల్ల ఒక చేత్తో గొడుగు పట్టుకుని నదిలో దూకాను. నదీప్రవాహ వేగంలో కొట్టుకుపోతూ ఒక ముళ్ళపొదలో చిక్కుకున్నాను. ప్రాణాలతో బయటపడతానో లేదో అని సందేహం కలిగింది. ఒక చేత్తో నీళ్ళలో ఈదుకుంటూ ఎలాగో అవతలి ఒడ్డుకు చేరుకున్నాను."

ఇలా వివరిస్తున్నప్పుడు మాతృదేవి ముఖం వివర్ణమయిపోయింది. కరుణ ఉట్టిపడే కంఠంతో ఆమె ఇలా అన్నారు: "నాయనా! గురుదేవులే నిన్ను కాపాడారు".

ఆ ముళ్ళపొదలో చిక్కుకొని ఎంత కష్టాన్ని అనుభవించానో, నేను వివరించిన సంఘటన విని మాతృదేవి కూడా అంతే కష్టాన్ని అనుభవించారు. నేను అనుభవించిన ఆవేదనతో తల్లి మనస్సు బాధపడింది. ఇప్పటికీ ఏ ప్రమాదం, ఆపద ఎదురైనా తక్షణం మాతృదేవి రూపం నా హృదయంలో మెదులుతుంది.

మాట వరుసగా మరుసటి రోజు కామార్పుకూర్‌కు వెళ్ళడానికి మాతృదేవిని అనుమతి కోరాను. అందుకు "వద్దు నాయనా! ఇప్పుడు కామార్పుకూరుకు పోవడం మంచిది కాదు. తర్వాత ఎప్పుడైనా వెళ్ళు. ఎలాగైనా ఇక్కడ మూడు రోజులు గడుపు. ఇది భయంకరమైన మలేరియా సమయం. అక్కడ మలేరియా సోకని ఇల్లంటూ లేదు. ఈ సమయంలో అక్కడికి వెళ్ళమని నేను ఎవరితోనూ చెప్పను" అని మాతృదేవి అన్నారు. ఇతరుల కష్టాల్ని తన కష్టాలుగా భావించి తల్లడిల్లే కోమల హృదయం మాతృమూర్తిది.

(మాతృమూర్తి శ్రీశారదాదేవి శిష్యులైన స్వామి అపూర్వానంద స్మృతుల నుంచి)



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| పేరు | చిరునామా | రూ. |
|---|---|---|
| | ఇప్పటి వరకు వసూలైన మొత్తం ... | 9,87,273 |
| పోషకులు | : శ్రీమతి నామన సత్యతులసి, కల్పాకం, తమిళనాడు - 603 102 | 1,116 |
| | : స్వామి నిశ్శ్రేయసానంద సరస్వతి, ఆగారం, కోలార్ జిల్లా, కర్ణాటక- 563 138 | 1,116 |
| | : మాస్టర్ ఎమ్. వివేకానంద రెడ్డి, కర్మన్‌ఘాట్ క్రాస్ రోడ్, హైదరాబాద్ - 500 035 | 1,000 |
| | : శ్రీ ఎ. వెంకటేశ్వర రెడ్డి, నిదన్నపురం, ఖమ్మం జిల్లా - 507 203 | 1,000 |
| | : ఎ. సరోజినీ దేవి, కోరమంగళ, బెంగుళూరు - 560 034 | 1,000 |
| | మొత్తం ... | 9,92,505 |

# శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి మీ పేరు మీద పది మందీ మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥ 600/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ళ పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు) ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ'లో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| 1277 | శ్రీ ఎన్. లక్ష్మిఆదిశేషు, మూసాపేట, హైదరాబాద్-18 | లైబ్రేరియన్, విద్యామందిర్ హైస్కూల్, కడప- 516 001 |
| 1278 | " " " | వై. సుబ్బి రెడ్డి మెమోరియల్ డిగ్రీ కళాశాల, కడప - 516 002 |
| 1279 | శ్రీ కె. లక్ష్మిశ్రీనివాస్, శ్రీకాకుళం - 532 001 | బ్రాంచ్ లైబ్రరీ, ఎర్రమంజిల్ కాలనీ, హైదరాబాద్-500 082 |
| 1280 | శ్రీ వి. రవి శర్మ, అశోక్‌నగర్, కాకినాడ | జీయర్ బుక్ ట్రెజరీ లైబ్రరీ, రామారావు పేట, కాకినాడ -4 |
| 1281 | " " " | శ్రీ రామలింగేశ్వరస్వామివారి దేవస్థానం, కాకినాడ-533 006 |
| 1282 | శ్రీ బి. చంద్రకుమార్, వెస్ట్ మారేడుపల్లి, సికింద్రాబాద్. | లైబ్రేరియన్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, ఆదిలాబాద్- 504 001 |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 8 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 85 | $15 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 240 | $ 45 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 380 | $ 75 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1200 | $ 350 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad- 500 029.

ఆధ్యాత్మిక-అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 64 సంచిక: 8 ఆగష్టు 2007

"ప్రతి జీవిలోనూ దివ్యత్వం గర్భితంగా ఉంది. అంతర్గతంగా ఉన్న ఆ దివ్యత్వాన్ని వ్యక్తం చేయడమే జీవిత పరమావధి." - స్వామి వివేకానంద

## ప్రార్థన

**చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం**
**శ్రియం లోకే దేవజుష్టా ముదారామ్ ।**
**తాం పద్మినీమీం శరణమహం ప్రపద్యే -**
**లక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే ॥**



చంద్రుని పోలినదీ, తేజోవంతమైనదీ, తన కీర్తిచంద్రికల వలన దేదీప్యమానంగా ప్రకాశిస్తూన్నదీ, దేవతలచే పూజలు అందుకొనునదీ, కరుణాస్వరూపిణీ, పద్మాన్ని ధరించినదీ, 'ఈం' అనే బీజమంత్రానికి భావంగా విరాజిల్లుతూన్నదీ అయిన మహాలక్ష్మిని నేను శరణుజొచ్చుతాను. ఓ దేవీ! నిన్ను ప్రార్థిస్తున్నాను, నా దారిద్ర్యం తీరిపోయేలా కరుణించు. (శ్రీ సూక్తమ్ నుంచి)

### ఈ సంచికలో...







**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com



## సంపాదకీయం

# మరచిన ఆదర్శాల్ని మననం చేద్దాం!

మువ్వన్నెల జెండా ముచ్చటైన జెండా ఆకాశాన రెపరెపలాడే రమ్యమైన జెండా. ఈ మూడు రంగుల జెండాను ఒంటి నిండా, బళ్ళనిండా అంటించుకొని 'ఐ లవ్ ఇండియా' (I Love India) అంటూ వీథుల్లో తిరగడం దేశభక్తికి నిదర్శనమా? కడుపునిండా తిండిలేక, ఒంటినిండా బట్టలేక అలమటిస్తున్న పేదలు ఒకవైపైతే, తినే పదార్థాల్లోనూ, ధరించే వస్త్రాల్లోనూ మూడు రంగుల్ని ప్రదర్శించి సరదాగా పార్టీలు చేసుకొనే ధనిక వర్గం మరోవైపు. ఇదా మన జాతి పతాకాన్ని గౌరవించే పద్ధతి? మన దేశభక్తిని ప్రకటించే విధానం? ఏది నిజమైన దేశభక్తి?... 'విజయీ విశ్వ తిరంగా ప్యారా ఝండా ఊంచా రహే హమారా (ప్రియమైన మన త్రివర్ణ పతాకం విజయంతో విశ్వంలో ఉవ్వెత్తున ఎగరాలి!) అంటూ రాగయుక్తంగా పాట పాడడం కాదు ప్రస్తుతం మనం చేయాల్సింది. మన జాతీయ పతాకంలోని మూడు రంగులూ మూడు ఆదర్శాల్ని మనకు గుర్తు చేస్తున్నాయి. కాషాయరంగు త్యాగానికీ, తెల్లరంగు ప్రేమ (పవిత్రత)కూ, ఆకుపచ్చరంగు సేవ (సుభిక్షత)కూ ప్రతీకలు.

త్యాగం, సేవా, ప్రేమ ఈ మూడు ఆదర్శాల్ని ప్రతి ఒక్కరూ ఆచరించి చూపగల్గడమే మనకున్న నిజమైన దేశభక్తికి నిదర్శనం. త్యాగం, సేవ ఈ రెండూ మన జాతీయ ఆదర్శాలని స్వామి వివేకానంద ఉద్ఘాటించారు. ఏ దేశంలో అయితే త్యాగం, సేవా వర్ధిల్లుతాయో ఆ దేశంలో 'ప్రేమ' వెల్లువై ప్రవహిస్తుంది.

**త్యాగం :** త్యాగేనైకే అమృతత్వమానశుః - త్యాగం వల్లనే అమరత్వం లభిస్తుందంటూ ఉపనిషత్తులు త్యాగానికే ప్రథమ స్థానాన్నిచ్చాయి. మన జాతీయ పతాకంలో కూడా త్యాగానికి ప్రతీక అయిన కాషాయ రంగుకే మొదటి స్థానాన్ని కల్పించడం గమనార్హం. "మహత్కార్యాలు మహాత్యాగాల వల్లనే సాధ్యమవుతాయి" అన్నారు స్వామి వివేకానంద - కాబట్టి ఒక వ్యక్తి గానీ, సమాజంగానీ, దేశంగానీ ఏ రంగంలోనైనా అభివృద్ధి చెందాలంటే త్యాగ గుణం అవసరం. మనకున్న దాంట్లో కొంత ఇస్తే దానం, అంతా ఇస్తే త్యాగం. ఒక పావురాన్ని రక్షించడానికి తన శరీరాన్ని కోసి మాంసాన్ని ఇచ్చాడు శిబి చక్రవర్తి.



ఒక మేకపిల్లను కాపాడాలని తన ప్రాణాలనే అర్పించడానికే సిద్ధమయ్యాడు సిద్ధార్థుడు. భారత మాతను దాస్యశృంఖలాల నుంచి విడిపించడానికి జీవితాల్ని తృణప్రాయంగా త్యజించిన అమరవీరులు మరెందరో.. ఇలా చరిత్రపుటల్ని తిరగేస్తే స్ఫూర్తినిచ్చే త్యాగమూర్తులు ఎంతోమంది స్ఫురణకు వస్తారు. త్యాగ భూమిగా పేరుగాంచిన మన భారతభూమిలో నేడు ఆ త్యాగధనులే కరువయ్యారా? ఆదర్శాల్ని మరచి అధర్మాలకు పాల్పడితే మిగిలేది స్వార్థజీవులే కదా!

మరచిన ఆదర్శాల్నీ, ఆదర్శపురుషుల్నీ మరలా మననం చేసుకొనే సమయం ఆసన్నమయింది. ఒక రూపాయి నాణాన్ని తెలియక తాకినా శరీరం కొంకర్లు తిరిగిపోయే శ్రీరామకృష్ణ పరమహంస లాంటి త్యాగీశ్వరుణ్ణి కన్న ఈ భారతభూమిపై, నేడు ఇతరుల సంపదల్ని ఎంత స్వాహా చేసినా చల్లారని తృష్ణ మనిషిలో నానాటికీ పెరుగుతోంది. మనచుట్టూవున్న చెట్లు కూడా త్యాగగుణాన్ని నేర్పే గురువులే అంటూ ఓ కవి హృదయం ఇలా తల్లడిల్లింది.

బ్రతికినన్నినాళ్ళు ఫలములిచ్చుటేకాదు
చచ్చికూడా యిచ్చు తనువు చీల్చి
త్యాగభావమునకు తరువులే గురువులు

తనువుతో పాటు మనసున్న మనం తరువుని గురువుగా నెరిగి త్యాగమయజీవితాన్ని గడపడానికి ప్రయత్నిస్తే భారతదేశం 'త్యాగభూమి'గా తనకున్న పేరును పదిలపరచుకోగలదు.

**సేవ :** దేశం పాడిపంటలతో పదికాలాలపాటు పచ్చగా ఉండాలనే ఆకాంక్షకు చిహ్నమే మన జాతీయపతాకంలోని ఆకుపచ్చరంగు. ఏ దేశమైనా శాంతిసౌభాగ్యాలతో వర్ధిల్లాలంటే ఆ దేశ ఆర్థికపరిస్థితి బాగా ఉండాలి. ఆర్థికంగా బలోపేతమవ్వాలంటే **'పాడిపంటలు పొంగిపొర్లే దారిలో నువు పాటుపడవోయ్'** అనే గురజాడ వారి మాటలు మనకు మహామంత్రం కావాలి. సోమరితనం వీడి అందరూ కలిసికట్టుగా కష్టించి పనిచేయాలి. కష్టాల్లోవున్న వారికి చేయూతనిచ్చి ఆదుకోవాలి. మన దేశం ఆర్థికంగా ఎంతో అభివృద్ధి చెందినప్పటికీ దారిద్ర్యం మాత్రం మనల్ని వీడని నీడగా వెంటాడుతోంది. దీనికి కారణం కోట్లకు పడగెత్తిన ధనవంతులకు, కూటికోసం శ్రమపడే సామాన్యులకు మధ్య గల తారతమ్యమే. ప్రపంచంలోని అత్యంత ధనవంతుడిగా పేరుగాంచిన అమెరికాదేశపు రాక్ ఫెల్లర్ ఒకసారి స్వామి వివేకానందను కలిశాడు. స్వామీజీ రాక్ ఫెల్లర్‌తో "సంపా



దించిన ధనం భగవంతునిది. ఆ ధనాన్ని ప్రజల సేవకై వినియోగించడానికే భగవంతుడు నీకు ప్రసాదించాడు" అని అన్నారు. మొదట స్వామీజీ మాటలు ఆయనకు రుచించలేదు. కానీ స్వామీజీ మాటల్లోని సత్యాన్ని గ్రహించిన రాక్‌ఫెల్లర్ తన సంపద నంతటినీ ప్రజాసేవా కార్యక్రమాలకే వినియోగించాడు. మహాదాతగా ప్రసిద్ధుడయ్యాడు. తనకున్న దాన్ని ఒక్కడే అనుభవించడం కన్నా పదిమందితో పంచుకొన్నవాడే ధన్యజీవి. దేశంలో అందరూ ఆనందమయంగా జీవించాలంటే **"సొంతలాభం కొంతమానుకు పొరుగువారికి తోడుపడవోయ్"** అన్న ప్రజాకవి గురజాడ వారి మాటల్ని మనం ఆచరణాత్మకం చేయాలి. అప్పుడే దేశమనే పూతోటలో మానవతా పుష్పాలు వికసిస్తాయి.

**ప్రేమ :** పవిత్రమైన మనస్సులో నుంచి పుట్టేదే స్వచ్ఛమైన ప్రేమ. ఆ స్వచ్ఛతకు చిహ్నమే జాతీయ పతాకంలోని తెలుపురంగు. అసూయాద్వేషాలు లేక స్వచ్ఛమైన మనస్సుతో అందరినీ ప్రేమించగలవారే భగవంతునికి ప్రియులు. ఓ ఊర్లో ఒక యువకుడు అందరికీ తనకు తోచిన సహాయం చేస్తూ, ప్రేమతో ఆదరించేవాడు. ఒక రోజు ఆ యువకుడికి ఓ కల వచ్చింది. ఆ కలలో దేవుడు పుస్తకంలో ఏదో వ్రాస్తూ కనిపించాడు. యువకుడు, "స్వామీ! మీరు ఏమిటి వ్రాస్తున్నారు?" అని దేవుణ్ణి అడిగాడు. "నన్ను ప్రేమించే వారి పేర్లను వ్రాస్తున్నాను" అన్నాడు. అయితే "ఆ జాబితాలో నా పేరు ఉందా?" అని యువకుడు దేవుణ్ణి అడిగాడు. "లేదు" అని దేవుడు బదులిచ్చాడు. మరుసటి రోజున ఆ యువకుడు మరలా కలగన్నాడు. ఈసారి కూడా దేవుడు పుస్తకంలో వ్రాస్తూ కనిపించాడు. యువకుడు "స్వామీ! ఇప్పుడేం వ్రాస్తున్నారు" అని అడిగాడు. అందుకు "నేను ప్రేమించే వాళ్ళ పేర్లను వ్రాస్తున్నాను" అన్నాడు దేవుడు. "మరి అందులో నా పేరు ఉందా?" అని యువకుడు అడిగాడు. "నీపేరే మొదటుంది" అని దేవుడు బదులిచ్చాడు. తోటివారిని ప్రేమించే వారిపై భగవంతుని ప్రేమ తప్పక ఉంటుందని ఈ కథ సారాంశం.

కాబట్టి దేశమనే దొడ్డవృక్షానికి ప్రేమలనే పూలు పూయాలంటే పవిత్రమైన మనస్సు ముఖ్యం. త్యాగం, సేవా అనేవి నదికి రెండు తీరాల లాంటివి. అవి దృఢంగా ఉంటే ప్రేమ అనే నది వెల్లువై ప్రవహిస్తుంది.

త్యాగం, సేవ, ప్రేమ ఈ మూడు ఆదర్శాల్ని మనం ఆచరణాత్మకం చేసినప్పుడే మనమంతా ఎదురుచూస్తున్న 2020 (ట్వంటీ ట్వంటీ) నాటికి మన త్రివర్ణ పతాకం విశ్వంలో విజయవంతంగా ఎగురుతుంది. దాన్ని తిలకిస్తూ సుహాసినీ, సుమధుర భాషిణీ అయిన భారతమాత మనల్ని ఆనందంతో ఆశీర్వదిస్తుంది. d

# గోరుముద్ద

- స్వామి సుప్రియానంద

## కౌన్సిలింగ్

ఇది 'కౌన్సిలింగ్' యుగం. కాలేజి సీట్లకు, ఉద్యోగాలకు, వ్యాపారాలకు, పిల్లలకు, పెద్దలకు, రోగులకు, యోగులకు ఒకటేమిటి అన్నిటికీ 'కౌన్సిలింగ్'.

ఈ మధ్య ఒకరు వారి కూతురి ప్రవర్తన వింతగా ఉందని ఆ అమ్మాయికి 'కౌన్సిలింగ్' అవసరమని అభిప్రాయపడ్డారు. అప్పటికే ఆ అమ్మాయి ఒక 'కౌన్సిలింగ్' ముగించి కాలేజీలో చేరింది, ఇది రెండవ 'కౌన్సిలింగ్'. ఇంతకీ ఆ అమ్మాయి వింత ప్రవర్తన ఏమిటంటే, 'నాన్నా! నేనంటే నీకు ప్రేమ లేదు. నాకు మొబైల్ ఫోన్ కావాలంటే నువ్వు కొనివ్వలేదు. మా స్నేహితులందరి దగ్గర ఫోన్ లున్నాయి.' అని చెప్పడమే!

ఆ తండ్రికి నిజంగా తన కూతురంటే చాల ప్రేమ. కాని ఆ అమ్మాయికి అది అర్థం కావడం లేదు. ఎక్కడుంది లోపం? పిల్లలకు మొదటి గురువులు తల్లి తండ్రులంటారు. చిన్న తనంలో నేర్చుకోవడం అనే ప్రక్రియలో పిల్లలకు ప్రతి విషయం వింతగా ఉంటుంది. వారు నెమ్మదిగా తెలుసు కుంటూ నేర్చుకుంటున్న ప్రతి విషయాన్ని ఆచితూచి దానికి మనం స్పందించాలి. ఈ స్పందన మోతాదు తగ్గినా హెచ్చినా పిల్లలలో అవగాహనాశక్తి క్షీణిస్తుంది. పిల్లవాడు బడికి పోనని మారాం చేసినప్పుడు డబ్బుల ఎరచూపి బడికి పంపిస్తే, ఆ పిల్లవాడు నేర్చుకునేది క్రమం తప్పకుండా బడికి వెళ్ళడమేకాని చదువు కాదు! చదువు కోవాలన్న ఆలోచన అతనిలో కలగాలి. అప్పుడు అతడు బడికి వెళ్ళడానికి డబ్బుని ఆశించడు. వ్యక్తి యొక్క అవగాహనాశక్తిని పెంచి ఆలోచింప చేసేదే నిజమైన 'కౌన్సిలింగ్'.



శ్రీరామకృష్ణ కథామృతంలో మనకు ఈ నిజమైన 'కౌన్సిలింగ్' దొరుకుతుంది. అదేమిటో శ్రీరామకృష్ణులు చెప్పిన ఈ కథలో మీరే చూడండి.

"ఒక మేక పిల్ల జూన్ నెలలో తన తల్లిమేక దగ్గర గంతులు వేస్తూ ఆడుకుంటూ ఉంది. ఆ ప్రక్కనే తంగేడు పొదలు ఉన్నాయి. అవి నవంబరు నెలలో నిండుగా మొగ్గలు తొడిగి పూలు పూస్తాయి. మేకలు వాటిని ఇష్టంగా తింటాయి. ఈ మేకపిల్ల గంతులు వేస్తూ, తల్లితో, "అమ్మా! నేను తంగేడు పూలు తింటానమ్మా" అంది. అది విని తల్లిమేక ఇలా చెప్పింది: "మంచిది! కానీ ఆ పని నువ్వు అనుకున్నంత సులభం కాదు. ఆ పూలను తినడానికి నువ్వు చాలా అపాయాలను దాటిపోవాలి. వచ్చే సెప్టెంబరు, అక్టోబరు నెలలు నీకు అంత మంచివి కాదు. దుర్గాదేవికి బలి ఇవ్వడానికి నిన్ను ఎవరో ఒకరు తీసుకు పోవచ్చు. ఆ తరువాత కాళీ పూజ పండగ వస్తుంది. ఆ పూజకు మన జాతిలోని మగ జంతువులన్నీ బలి అయి పోతాయి. ఈ గండాలన్నీ గట్టెక్కి, పెరిగి పెద్దయితే నవంబరు నెలకు నువ్వు ఆ పూలను తిన గలుగుతావు."

యవ్వనంలో మన మనసులు ఎన్నో కోరిక లను కలిగి ఉంటాయి. విచక్షణ లేని వాళ్ళు మనసులో కలిగిన అన్ని కోరికలు తీర్చు కోవాలని ప్రయత్నిస్తారు. అప్పుడు వారి జీవితాలు వాస్తవానికి దూరంగా ఉంటాయి. అందుకే 'కౌన్సిలింగ్' మనలోని విచక్షణా జ్ఞానాన్ని మేల్కొలిపేదిగా ఉండాలి. అంతేగాని నిద్రపుచ్చేదిగా కాదు.

మన 'కథానాయకి' ఒక విద్యార్థినిగా ఆలోచించడం మొదలు పెట్టాలి. అప్పుడు 'మొబైల్ ఫోన్' తనకు నిజంగా అవసరం లేదనీ, అది తన గొంతెమ్మ కోరిక' అనీ గ్రహిస్తుంది. వెంటనే తండ్రికూతుళ్ళ మధ్య ఏర్పడిన 'అపార్థం' అనే అడ్డుగోడ నేల కూలుతుంది. అప్పుడు 'మొబైల్'తో పని లేకుండా 'ప్రేమానురాగాలు' అనే 'నెట్‌వర్క్' పనిచేయడం మొదలవుతుంది. b



# రామనామం రమ్యాతిరమ్యం

- స్వామి జ్ఞానదానంద

శ్రీరాముని గుణగణాలు వర్ణింపబడే గ్రంథాన్ని 'రామాయణం' అంటాం. రామాయణాలు చాలా ఉన్నాయి. ఎన్ని రామాయణాలున్నా వాల్మీకి రామాయణం ఆదికావ్యం. వాల్మీకి మహర్షి ఆదికవి. శ్రీరామచంద్రుణ్ణి ఆదర్శ పురుషునిగా ఆయన చిత్రీకరిస్తారు. ఆయన "రామో విగ్రహవాన్ ధర్మః" ధర్మము అనే మాటకు ఒక రూపం కల్పిస్తే అదే రామచంద్రుడు అంటారు. ఈ లోకంలో ప్రతీ వ్యక్తీ ఎలా వ్యవహరించాలి – సమాజం పట్ల ఎలా వ్యవహరించాలి, కుటుంబం పట్ల ఎలా వ్యవహరించాలి, అన్న దమ్ముల పట్ల ఎలా మెలగాలి... ఇలాగ ప్రతి విషయంలో కూడా వాల్మీకి శ్రీరాముణ్ణి ఆదర్శవంతుడిగా చూపిస్తారు. అందువలననే రామాయణం అందరికీ ఆదర్శప్రాయమైన కావ్యం. రాముడు అందరికీ ఆదర్శప్రాయమైనవాడు.

అధ్యాత్మ రామాయణం బ్రహ్మాండపురాణంలోని ఒక భాగం. దీనిని వేదవ్యాస మహర్షి రచించారు. మోక్ష మార్గాన్ని అన్వేషించే ముముక్షువులకు ఇది ఒక పారాయణ గ్రంథం. దీనిలో శ్రీరాములవారు సాక్షాత్తూ భగవంతుని యొక్క అవతారం అని పదే పదే చూపిస్తారు. అధ్యాత్మ రామాయణం మనలో భక్తిని పెంపొందిస్తుంది. ముక్తికి మార్గాన్ని చూపిస్తుంది. అధ్యాత్మ రామాయణంలోని కొన్ని ఘట్టాలను చూద్దాం.

దశరథ మహారాజు పుత్రకామేష్టియాగం చేస్తాడు. పుత్రకామేష్టియాగంలో సాక్షాత్తూ అగ్నిదేవుడు ప్రత్యక్షమై దివ్యమైన పాయసాన్ని దశరథమహారాజుకి ఇస్తాడు. ఆ పాయసాన్ని దశరథుని భార్యలు స్వీకరిస్తారు. మహారాణి కౌసల్య మహా తేజోవంతుడైన మగశిశువును ప్రసవిస్తుంది. చైత్ర శుక్లపక్ష నవమినాడు, పునర్వసు నక్షత్రాన, కర్కాటక లగ్నంలో, గ్రహపంచకాలైన సూర్యుడు, అంగారకుడు, గురువు, శుక్రుడు, శని ఉచ్ఛస్థితిలో ఉన్న సమయాన, సూర్యుడు మేషరాశిలో సంచరించే సమయంలో పుష్పవృష్టి కురుస్తుంటే రాముల వారి జననం జరుగుతుంది. ఇక్కడ సాక్షాత్తూ భగవంతుడు – పట్టు పీతాంబరాలు ధరించి, కోటి సూర్య ప్రకాశంతో, శంఖ చక్ర గదా పద్మ ధారియై కౌసల్యకి దర్శనమిచ్చాడు. ఆమె ఆ దివ్య దర్శనాన్ని చూసి పరవశించి పోతుంది. కౌసల్యాదేవి ఆయనని "మేమందరం సంసార సాగరంలో మునిగి, జనన మరణ సముద్రంలో చిక్కుకుని, మీ మాయాశక్తి ప్రభావంతో పతి, పుత్ర, బంధు, ధన వ్యామోహాలకు లోనై ఉన్నాము. నేడు మీరు నాకు సాక్షాత్కరించినందు వలన నా జన్మ ధన్యమైంది'' అని ప్రార్థిస్తుంది. అప్పుడు భగవంతుడు "పూర్వ జన్మలో మీరిద్దరూ – అదితి– కశ్యప ప్రజాపతి – నా గురించి చాలాకాలం తపస్సు చేసినప్పుడు నేను మీకు ఇచ్చిన వరం ప్రకారం– నేడు నేను మీ పుత్రునిగా జన్మించాను" అని చెప్పి, సాధారణ శిశువుగా మారిపోతారు.

తరువాత వారి కులగురువు వశిష్ఠులవారు ఈ బాలునికి 'రామ'అని నామకరణం చేస్తారు. అప్పుడు దశరథ మహారాజు "ఈయన మహాసామ్రాజ్యానికి అధిపతి అవుతాడు కదా! ఈ బాలుని పేరు చాలా చిన్నదిగా ఉంది, 'రామ' అనే రెండే అక్షరాలున్నాయి. ఇంకా పెద్ద పేరుంటే బాగుంటుంది" అంటాడు. దానికి వశిష్ఠులవారు "రామ అనే రెండక్షరాలకి ఎంత మహిమ ఉందో తెలుసా?"అంటారు. 'ఓం నమో నారాయణాయ' అనే అష్టాక్షరీ మంత్రం నుండి 'రా' అనే అక్షరాన్నీ, శివ పంచాక్షరి అయిన 'ఓం నమః శివాయ' నుండి 'మ' అనే అక్షరాన్నీ తీసుకుని 'రామ' అనే మహామంత్రాన్ని ఇచ్చాను.'' అన్నారట. ఇందులో నారాయణమంత్రం, (శివ) పంచాక్షరీ మంత్రం కూడా ఇమిడి ఉన్నాయి. అందుకే పరమేశ్వరుడు ఎప్పుడూ రామనామం జపిస్తుంటాడు. పరమేశ్వరుడి గురువు రాములవారు, రాములవారి గురువు పరమేశ్వరుడు. అందువల్ల శివకేశవులు అభేదం అని తెలుస్తోంది ఇక్కడ. రామనామాన్ని తారకమంత్రం అంటారు. రమంతే యోగినః అస్మిన్ – ఇతి రామః ... అంటే – రాముడంటే యోగుల హృదయాలను రమింపచేసేవాడు. అందువలన "రామ" అనే పదం చాలా మహత్వ పూర్ణమైనటువంటిది.

ఆంగ్లమూలం : డాక్టర్ ఎస్. రమణి

అనువక్త : రెంటాల జయదేవ

# తెల్ల వాడి గుండెల్లో నిదురించిన తరుణి

# రాణి లక్ష్మీబాయి

భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో రాణి లక్ష్మీబాయి (1835 – 58) పేరు విననివారుండరు. ఝాన్సీ ప్రాంతానికి చెందిన ధైర్య సాహసోపేతురాలైన మహారాణి ఆమె. పంథొమ్మిదో శతాబ్దంలో బ్రిటీషు వారి పాలనను ఎదిరించిన వీర నారి ఆమె. బ్రిటీషు వారిపై భారతీయుల పోరాట స్ఫూర్తికి ఝాన్సీ లక్ష్మీబాయి ఓ ప్రతీక. వారణాసిలో మోరోపంత్‌థాంబేకు ఆమె జన్మించారు. మణికర్ణిక (మను) అనేది ఆమె చిన్నప్పటి పేరు. అప్పట్లో చిన్న మరాఠా సంస్థానమైన ఝాన్సీ పరిపాలకుడు రాజా గంగాధర రావు. ఆమెను ఆయనకిచ్చి వివాహం చేశారు. పెళ్ళయిన తరువాత ఆమె లక్ష్మీబాయిగా పేరొందింది. వారసులెవరూ లేకుండానే గంగాధరరావు మరణించాడు. చనిపోవడానికి ముందు దామోదర్‌ను ఆయన దత్తత తీసుకున్నాడు. అప్పట్లో లార్డ్ డల్‌హౌసీ బ్రిటీష్ గవర్నర్ జనరల్‌గా ఉండేవాడు. దామోదర్‌ను చట్టబద్ధమైన వారసుడిగా, లక్ష్మీబాయిని రాజప్రతినిధిగా అంగీకరించడానికి డల్‌హౌసీ నిరాకరించాడు. దాంతో గొడవ మొదలైంది. ప్రతిఘటనలు, నిరసనలు ఎదురైనప్పటికీ ఝాన్సీ సంస్థానాన్ని బ్రిటీషు సామ్రాజ్యంలో కలిపేసుకున్నారు. రాణి లక్ష్మీబాయికి అయిదు వేల రూపాయల చిన్న మొత్తాన్ని భరణంగా ఇవ్వసాగారు. అయితే, ఈ అగౌరవాన్నీ, పరాయివారికి లోబడి ఉండాల్సి రావడాన్నీ రాణి లక్ష్మీబాయి జీర్ణించుకోలేకపోయారు. ఝాన్సీ సంస్థానాన్ని అంత తేలిగ్గా వదిలిపెట్టరాదని ఆమె దీక్ష పట్టారు. ఆ తరువాత కొద్ది కాలానికే అసలుసిసలు మరాఠా మహారాణిగా బ్రిటీషు వారితో పోరాడే అవకాశం ఆమెకు వచ్చింది.

1857 మే నెలలో మీరట్, ఢిల్లీలలో సిపాయిలు బ్రిటీషు అధికారులపై తిరుగుబాటు చేశారు. ఆ రకంగా భారతదేశంలో బ్రిటీషు వారిపై పోరాటం ప్రారంభమైంది. అక్కడ నుంచి అది ఉత్తర భారతదేశంలోని ఇతర ప్రాంతాలకు విస్తరించింది. కాలక్రమంలో ఝాన్సీలో కూడా తిరుగుబాటు తలెత్తింది. ఝాన్సీ సంస్థానమంతటా రాణి లక్ష్మీబాయిదే అధికారమని ప్రకటించారు. బ్రిటీష్ జనరల్ సర్ హ్యూ రోజ్‌పై పోరాటం సాగిస్తూ, రాణి లక్ష్మీ బాయి తమ ఝాన్సీ కోటను ధైర్యంగా సంరక్షించారు. అయితే, తన పరిస్థితి అపాయకరంగా మారుతోందని గమనించిన ఆమె బ్రిటీషు సేనల్ని కల్పి ప్రాంతం దగ్గర నిలువరించారు. మరో స్వాతంత్ర్య సమరయోధుడు తాంతియా తోపే అక్కడ ఆమెతో చేతులు కలిపారు. సిపాయిలను సైన్యంలో చేర్చుకుంటూ, రాణి లక్ష్మీబాయి స్వయంగా పోరాటంలో పాల్గొన్నారు. అయితే, బ్రిటీషు వారు యమునా నదీ తీరంలో కల్పి ప్రాంతాన్ని తమ స్వాధీనం చేసుకున్నారు. రాణీ లక్ష్మీబాయి, తాంతియా తోపేలు ఇద్దరూ సమీపంలోని అటవీ ప్రాంతంలోకి పరారయ్యారు. దాంతో, తిరుగుబాటు ఆగిపోయిందని బ్రిటీష్ జనరల్ రోజ్ భావించాడు. అయితే, ప్రసిద్ధ గ్వాలియర్ కోటను తమ స్వాధీనంలోకి తెచ్చుకోవడం ద్వారా లక్ష్మీబాయి, తాంతియా తోపేలు బ్రిటీషు వారిని అదిరిపడేటట్లు చేశారు. గ్వాలియర్ మహారాజు కోట వదిలి పారిపోయాడు. ఆయన బలగాల్లో అత్యధిక భాగం రాణి లక్ష్మీబాయి పక్షం వచ్చేశాయి. దెబ్బతిన్న బ్రిటీషు వారు గ్వాలియర్ కోటపై ఒక్కసారిగా దాడి చేశారు. లక్ష్మీబాయి శౌర్య పరాక్రమాలు ప్రదర్శిస్తూ తీవ్ర పోరాటం సాగించినప్పటికీ, ఆ యుద్ధంలో ఆమె మరణించింది. ఆ విధంగా తన ఇంటికి సుదూర ప్రాంతంలో రాణి అసువులు బాసింది. ఆ పోరాటంలో సంఖ్యాపరంగానూ, ఆయుధాల విషయంలోనూ బ్రిటీషు వారిది పైచేయి కావడంతో లక్ష్మీబాయి అనుయాయులు ఓటమి పాలయ్యారు.



బ్రిటీషు సైన్యాన్ని ఎదిరిస్తూ, ఝాన్సీ లక్ష్మీబాయి చూపిన ధైర్య సాహసాలు, బలపరాక్రమాలు, సామర్థ్యం భారతీయులెవరూ ఎన్నటికీ మర్చిపోలేరు. భారతావనిలో పరాయి పాలనపై పోరాటానికి ప్రతీకగా ఆమె చిరస్మరణీయురాలు.

## శిక్ష కాదు శిక్షణ!



మనల్ని ఎవరైతే ప్రేమిస్తారో వారికి మాత్రమే మన మీద అధికారం చెలాయించడానికిగానీ, మనల్ని శిక్షించడానికిగానీ హక్కు ఉంటుంది. స్వామి రామకృష్ణానందది ప్రేమించే మాతృ హృదయం. అయితే విధి నిర్వహణలో అలసత్వాన్నిగానీ, పొరబాట్లనుగానీ ఆయన ఎంతమాత్రం సహించేవారు కాదు. మఠంలోని సన్న్యాసులందరూ సమయపాలన తు.చ. తప్పక పాటించాలనీ, వాళ్ళ వ్యక్తిగత అలవాట్లపట్ల చాలా జాగ్రత్తగా ఉండాలనీ ఆయన ఆశించేవారు. ఇందుకు ఏమాత్రం భిన్నంగా జరిగినా, వాళ్ళను ఆయనెంతో తీవ్రంగా మందలించేవారు.

స్వామి రామకృష్ణానంద పాటించిన క్రమశిక్షణను గురించి గుర్తుకు తెచ్చుకుంటూ పి.యమ్. మొదలియార్ ఈ విధంగా అన్నారు: బాహ్యమైన మర్యాదలు, మన్ననలను స్వామి రామకృష్ణానంద ఏనాడూ ఎవరి నుంచీ ఆశించలేదు. కానీ క్రమశిక్షణను పాటించే విషయంలో మాత్రం ఆయన చాలా కఠినంగా వ్యవహరించేవారు. ఒకసారి ఆయన ఆధ్యాత్మిక తరగతులు నిర్వహిస్తూ పాఠం చెబుతున్న సమయంలో ఒక విద్యార్థి గడ్డం క్రింద అరచేతిని ఆన్చి కూర్చొని ఉండటం ఆయన కంటపడింది. వెంటనే స్వామి అతడితో, "నువ్వు కూర్చున్న విధానం విచారాన్ని సూచిస్తుంది. అలా ఎప్పుడూ కూర్చోవద్దు" అని చెప్పారు. మరొక రోజున మరొక విద్యార్థి ఒక బల్లమీద కూర్చుని కాళ్ళాడిస్తూ ఉండటం గమనించి, ఆయన యిలా అన్నారు: "కాళ్ళు ఆడించడం ఆపు. అది మంచిది కాదు. అలా కాళ్ళు ఆడించడం క్షేమం కాదు." తన శిష్యుల ఆధ్యాత్మిక సంక్షేమంపట్ల ఆయనెంతో శ్రద్ధ వహించేవారు. వాళ్ళ వ్యక్తిగతమైన అలవాట్లను, ప్రవర్తనను ఆయన సరియైన పద్ధతిలో మలచేవారు. c

**(ఆగష్టు 10న స్వామి రామకృష్ణానంద జయంతి)**

## దయలోనే దైవారాధన



ఒకసారి శ్రీరామకృష్ణులు నిరంజనుణ్ణి గురించి తన భక్తులముందు ఇలా ప్రశంసించారు : "నిరంజనుణ్ణి చూడండి. అతడు దేనికీ బద్ధుడు కాదు. బీదరోగులను ఆసుపత్రికి తీసుకు పోవడానికి అతడు తన జేబులోని ధనం ఖర్చుపెడతాడు. ఇక పెళ్ళి ప్రసక్తి వస్తే చాలు, 'అయ్యో రామ! పెళ్ళనేది, విశాలాక్షి (కామార్పుకూరుకు దగ్గరలో ఉన్న ఒక ఏరు) లోని సుడిగుండం లాంటిది' అంటాడు. అతడొక దివ్యజ్యోతి మీద కూర్చున్నట్లుగా నా మనోనేత్రం ముందు ఒక దృశ్యం గోచరిస్తూ ఉంటుంది."

స్వామి నిరంజనానంద ఒకనాడు శ్రీరామకృష్ణులకు నివేదించడానికి కొన్ని మిఠాయిలను బజారులో కొని బారానగరుకు తిరిగివస్తున్నాడు. అదే దారిలో ఒక పేద స్త్రీ తన పిల్లవాణ్ణి చేతుల్లో ఎత్తుకొని నడుస్తూ వస్తోంది. ఆ పిల్లవాడు స్వామి చేతిలోవున్న మిఠాయిల పొట్లాన్ని చూసి "అమ్మా! నాకు మిఠాయిలు కావాలి" అంటూ ఏడ్వసాగాడు. అది చూసి స్వామి నిరంజనానంద ఆ పిల్లవాడి చేతిలో మిఠాయి పొట్లం పెట్టి "బాబూ! ఇదుగో ఈ మిఠాయిలు తిను" అన్నారు. అందుకు ఆ పేద ఇల్లాలు అభ్యంతరం తెలిపింది. "వద్దు స్వామీ! వద్దు. ఈ మిఠాయిలు మీరు భగవంతునికి నివేదించడానికి తీసుకు వెళుతున్నట్లున్నారు. భగవంతునికి నైవేద్యం పెట్టక ముందే వాటిని నా బిడ్డ తినడం మంచిది కాదు" అంది. అందుకు జవాబుగా స్వామి నిరంజనానంద, "లేదమ్మా, అలాంటిదేమీ లేదు. ఈ పసివాడు తింటే, ఆ భగవంతుడు తిన్నట్లే" అంటూ ఆమెకు నచ్చచెప్పారు. తన చేతిలోని మిఠాయిల పొట్లాన్ని ఆ బాలుడికిచ్చి, గురుదేవుల నివేదన కోసం మిఠాయిలను కొనడానికి మళ్ళీ బజారుకు వెళ్ళారు. c

**(ఆగష్టు 28న స్వామి నిరంజనానంద జయంతి)**



# ప్రార్థన పవిత్ర జీవన సాధన

– స్వామి శ్రీకాంతానంద

**2006 డిసెంబర్ 'అనంతపురం భక్త సమ్మేళనం'లో స్వామి శ్రీకాంతానందజీ ప్రసంగం.**

దైవప్రార్థన ఆధ్యాత్మిక మార్గంలో చాలా శక్తిమంతమైనది. ఆధ్యాత్మిక సాధనలన్నిటిలో ప్రార్థన చాలా సరళమైనదీ, సహజమైనదీ. ఎందుకంటే మనందరికీ ప్రార్థన ఎలా చేయాలో బాల్యం నుండీ తెలుసు. అయితే ప్రార్థన అంటే ఏమిటి? అపరిచితుల్ని మనమేదైనా కోరితే అది యాచన అవుతుంది. మన దగ్గర వాళ్ళనో, బంధువులనో లేక స్నేహితులనో ఏదైనా కోరితే దానిని అభ్యర్థన (లేక విన్నపం) అంటాం. ఈ యాచన దిశను భగవంతునివైపు తిప్పితే, అంటే మనుష్యుల్ని కాకుండా భగవంతుణ్ణి ఏదైనా అడిగి నట్లైతే అది ప్రార్థన అవుతుంది.

దివ్యజనని శ్రీశారదాదేవి బోధగయ వెళ్ళినపుడు అక్కడ బౌద్ధ సన్న్యాసుల్ని చూసి అమ్మ "ఈసాధువులు మఠాలలో ప్రశాంతంగా నివసిస్తున్నారు. అయితే నా బిడ్డలు అక్కడా ఇక్కడా సంచరిస్తూ ఆహారం కోసం భిక్షమెత్తుకొని జీవిస్తున్నారు. మీరు వారికి ఒక ఆశ్రమం ఏర్పరచకూడదా?" అని గురుదేవుల్ని ప్రార్థించారు. అమ్మ చేసిన ప్రార్థన ఫలితంగా స్వామి వివేకానంద రామకృష్ణ సంఘం ప్రారంభించారు.

**ప్రార్థన ఎందుకు శక్తిమంతమైనది?:** ఆధ్యాత్మిక సాధన అంటే కేవలం ప్రార్థనే. మహమ్మదీయులు రోజుకి 5మార్లు నమాజ్ (ప్రార్థన) చేస్తారు. ఎటువంటి పరిస్థితులలోనూ వారు నమాజ్ మానరు. క్రైస్తవులు భగవంతుణ్ణి కీర్తిస్తూ ప్రార్థిస్తారు. వాళ్ళు ప్రార్థనకి చాలా ప్రాముఖ్యమిస్తారు. హిందూమతంలో వేదాలలో ఉన్న శాంతిమంత్రాలు ప్రార్థనలే. వివిధ రూపాలలో వ్యక్తమవుతున్న దేవీదేవతలకి వేరువేరు ప్రార్థనలు – స్తోత్రాలు ఉన్నాయి. పురాణాల్లో కూడా ఎన్నో స్తోత్రాలున్నాయి. ఆ విధంగా అన్ని ధర్మాలలోనూ ప్రార్థన అనేది ఉంది.

**ప్రార్థన ద్వారా దైవసాక్షాత్కారం జరుగుతుందా?**

శ్రీరామకృష్ణులు, శ్రీశారదామాత, స్వామీజీ ప్రార్థన ద్వారా దైవసాక్షాత్కారం పొందవచ్చు అని తమ జీవితాలలో నిరూపించారు. గురుదేవులు ఎవరి సహాయం లేకుండా తీవ్ర సాధనతో ఒక సంవత్సర కాలంలో భగవత్సాక్షాత్కారం పొందారు. రాత్రీపగలూ నిరంతరం ప్రార్థించడమే వారు చేసిన సాధన. అలా తీవ్ర ప్రార్థన వలన దైవసాక్షాత్కారం పొందవచ్చు అని నిరూపించారు. అలాగే దివ్యజనని శ్రీశారదాదేవి స్వయంగా "నేను రోజూ రాత్రిసమయంలో చంద్రుడ్ని చూస్తూ, భగవంతుడా! చంద్రునిలో కూడా నల్లమచ్చవుంది. కానీ భగవత్సాక్షాత్కారానికి తోడ్పడేటట్లు నా స్వభావం నిర్మలంగానూ, నామనస్సు పవిత్రంగానూ ఉండేటట్లు చూడు అని గురుదేవుల్ని ప్రార్థించేదాన్ని" అనేవారు. పవిత్రంగా ఉన్నప్పుడే భగవత్సాక్షాత్కారం సాధ్యమవుతుంది. అర్జునుడు శ్రీకృష్ణుణ్ణి – 'ద్రష్టుమిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ' అంటూ 'మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో'. "ప్రభూ మీ దివ్యరూపాన్ని సందర్శించాలని ఉంది. నేను దానికి తగినవాడిని అనిపిస్తే నన్ను అనుగ్రహించి, నా ప్రార్థనను మన్నించి, అనంతమైన నీ రూపాన్ని చూపించు" అని ప్రార్థించాడు. ఏసాధనలూ చేయకపోయినా, ఏయోగాలూ ఆచరించక పోయినా అర్జునుని తీవ్రమైన ప్రార్థనల వలననే శ్రీకృష్ణపరమాత్మ "సరే, నువ్వు చర్మచక్షువులతో నా రూపాన్ని చూడలేవు. అసాధారణమైన నా రూపాన్ని చూడటానికి దివ్య చక్షువులను ఇస్తాను" అన్నాడు. అలా అర్జునునికి ప్రార్థన వలననే విశ్వరూప సందర్శనం కలిగింది.

**లౌకిక విషయాల గురించి ప్రార్థించవచ్చా?:** జీవితంలో ఎన్నో సమస్యలు, కోరికలు ఉంటాయి. ప్రాపంచిక విషయాల

గురించి ప్రార్థించడం తప్పుకాదు. గురుదేవులు కూడా దీనిని ఖండించలేదు. గీతలో శ్రీకృష్ణుడు

చతుర్విధా భజన్తే మాం జనాః
సుకృతినో – ర్జున ।ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ
జ్ఞానీ చ భరతర్షభ ॥

''ఆర్తులు, అర్థార్థులు, జిజ్ఞాసువులు, జ్ఞానులు అనే నాలుగు విధాల భక్తులు నన్ను ప్రార్థిస్తారు" అన్నాడు. మానసిక, శారీరక అనారోగ్యాలతో బాధపడేవారు తప్పకుండా ప్రార్థించాలి. దైవాన్ని నమ్మని హేతు వాదులు (నాస్తికులు) ఉంటారు, వారు బాధపడుతున్నా ప్రార్థించరు. సకామ ప్రార్థనతో సాధనని ప్రారంభించడం మొదటి పద్ధతి. కోరికలతో, బాధలతో ఎంతోమంది భక్తులు గురుదేవుల వద్దకు వచ్చే వారు. మధురబాబు, తన భార్య తీవ్రమైన అనారోగ్యంతో బాధపడుతుంటే, గురుదేవుల వద్దకు వచ్చి "స్వామీ! మీరే నా భార్యను రక్షించాలి" అని ప్రార్థించాడు. గురుదేవులు జగజ్జననిని ప్రార్థించి ఆమె అనారోగ్యం తాను స్వీకరించి, మధురబాబు భార్యని రక్షించారు.గురుదేవుల వద్దకి ఉపేంద్ర అనే నిరుపేద భక్తుడు వచ్చి ధనం కోసం ప్రార్థించేవాడు. గురుదేవులు ముందు సందేహించారు. ఆఖరికి అతని ప్రార్థన ఆలకించి అందుకు వారు సమ్మతించారు. అతను క్రమంగా ధనవంతుడయ్యాడు. స్వామి వివేకానంద జిజ్ఞాసువు. వారు భవతారిణి కాళీ వద్దకు వెళ్ళి "నాకు వివేక వైరాగ్యాలను ప్రసాదించు" అని కోరారట. జ్ఞానులు తమ కోసం ప్రార్థించరు. వారికేమీ అక్కర్లేదు. జ్ఞానికి ఉదాహరణగా భాగవతంలో రంతిదేవుణ్ణి చెప్తారు. "భగవాన్, నాకేమీ వద్దు. నేను స్వర్గానికి వెళ్ళాలనుకోను, పునర్జన్మ గురించి భయపడను. పరుల కష్టాలను తొలగించగలిగితే చాలు" అంటారు. జ్ఞానులు ఇతరుల క్షేమం కోసం సదా ప్రార్థిస్తారు. స్వామి వివేకానంద "సజీవ దైవాలైన పేదలను సేవించడానికి నేను మళ్ళీ మళ్ళీ జన్మించాలి" అన్నారు. మనం మొదటిదానితో ప్రారంభించి, నెమ్మదిగా కోరికలు లేని స్థితికి ఎదగాలి, ఆధ్యాత్మిక అభివృద్ధిని కోరాలి.



**ప్రార్థన ఎక్కడ చెయ్యాలి?:** శ్రీరామకృష్ణులు "మనే, వనే, కోనే" అనేవారు. 'మనే' అంటే మనసులో. మానసికంగా చేసే ప్రార్థన చాలా శక్తిమంతమైనది. గురుదేవులు "మానసికంగా ప్రార్థన చెయ్యాలి, వ్యాకులతతో ప్రార్థించాలి'' అనేవారు. శ్రద్ధ, వ్యాకులత లేని ప్రార్థన యాంత్రికం. అటువంటి యాంత్రిక మైన ప్రార్థన భగవంతుణ్ణి చేరదు. మన ప్రార్థన సఫల మవ్వాలంటే వ్యాకులతతో భగవంతుణ్ణి ప్రార్థించాలి. గురుదేవులు కాళీమాత కోసం విలపిస్తూ తీవ్ర వ్యాకులతతో ప్రార్థించడం వల్లనే అమ్మ సాక్షాత్కరించింది.

శ్రీరామకృష్ణులవారు 'కోనే' అన్నారు. నేడు శబ్దకాలుష్యం ఎక్కువగా ఉంది. ఇంట్లో పూజగదిలో కూర్చుని ప్రార్థన చెయ్యాలి. మూడవది 'వనే' అంటే వనం.

శ్రీరామకృష్ణులవారు ఏకాంతంలో ప్రార్థించాలి అని పదేపదే చెప్పేవారు. మధ్య మధ్య ఇంటినుండి ఎక్కడికైనా ఏకాంత ప్రదేశానికి వెళ్ళి "భగవంతుడా నాకు నువ్వే అంతా. ఈప్రపంచంలో నాకెవ్వరూలేరు" అంటూ ప్రార్థన చెయ్యాలి. హృదయ పూర్వకంగా చేసిన ప్రార్థన భగవంతుడు తప్పక వింటాడు. మనం ప్రార్థిస్తున్నపుడు మనసు ఏకాగ్రమవుతుంది. భగవంతుడు మన హృదయంలో సజీవంగా ఉన్నట్లు భావించాలి. ప్రార్థన అంటే దైవంతో సంభాషించడమే.

మన హృదయంలో ఉన్న దైవంతో మన కష్టాల్నీ, సమస్యల్నీ విన్నవించుకోవాలి. నిరంతరం ప్రార్థన చేయడం వల్ల భక్తి పెరుగుతుంది, చివరకి ప్రార్థన వలన దైవ సాక్షాత్కారం లభిస్తుంది. అందుకే అన్ని ధర్మాలలోనూ 'ప్రార్థన' చాలా ముఖ్యమైన సాధన. ప్రార్థనని మనం సాధనగా చేసుకుని మన కోరికల్ని భగవంతుని వైపు మరల్చాలి. అందరం భగవంతుడిని ప్రార్థించి ఆయన అనుగ్రహంతో మన జీవితాల్ని పవిత్రం చేసుకోవడానికి ప్రయత్నిద్దాం. n

**విలేఖనం : శ్రీమతి ఎన్. శేషు**



# రామకృష్ణ మఠం, ఇచ్ఛాపూర్

(బేలూరు మఠ శాఖాకేంద్రం)

పి.ఒ. మాయల్ - బందీపూర్, హుగ్లీ -712617, పశ్చిమ బెంగాల్





## విరాళాలకై విన్నపం

శశి మహారాజ్‌ను ఉద్దేశించి "మఠానికి శశి మూలస్తంభం లాంటివాడు. అతడు లేని మఠజీవితం ఊహించడమే అసాధ్యం" అన్నారు స్వామి వివేకానంద. శశి మహారాజ్ (స్వామి రామకృష్ణానంద) శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులు. ప్రపంచవ్యాప్తంగా ఉన్న రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌లను స్థాపించడంలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. శ్రీరామకృష్ణులు అనారోగ్యంతో ఉన్నప్పుడు వారికి శశి మహారాజ్ భక్తిశ్రద్ధలతో సపర్యలు చేశారు. శ్రీరామకృష్ణులు మహాసమాధి చెందాక కూడా వారి స్మృతి చిహ్నాల్ని శశి మహారాజ్ అంతే శ్రద్ధాభక్తులతో పూజించారు. అసమానమైన భక్తి ప్రపత్తులతో శశి మహారాజ్ ఆచరించిన పూజా విధానాన్నే రామకృష్ణ మఠ కేంద్రాలన్నిటిలో నేడు అనుసరిస్తున్నారు.

కలకత్తాకు 100 కి.మీల దూరంలో ఉన్న "ఇచ్ఛాపూర్" (హుగ్లీ జిల్లా) గ్రామంలో శశి మహారాజ్ జన్మించారు. స్థానిక భక్తులు కొన్ని ఏళ్ళ క్రితం శశిమహారాజ్ జన్మస్థలంలో ఒక రేకుల షెడ్డులో తాత్కాలిక ప్రార్థనాలయాన్ని ప్రారంభించారు. అసంఖ్యాకమైన భక్తుల కోరికపై ఇక్కడ 21-08-1994న రామకృష్ణమఠ శాఖను ప్రారంభించారు.

దాదాపు రూ. 12 లక్షల ఖర్చుతో శశి మహారాజ్ బంధువులకు పునరావాసం కల్పిస్తున్నాం. పేదలకు ఉచిత శిక్షణ తరగతులు నిర్వహిస్తున్నాం. ఉచిత సంచార వైద్యశాలను ప్రారంభించి, నిపుణులతో ఉచిత వైద్యసేవలు అందిస్తున్నాం. భక్తుల సౌకర్యార్థం శ్రీరామకృష్ణ విశ్వజనీన దేవాలయ నిర్మాణం చేపట్టాం. ఈ దేవాలయ నిర్మాణానికి సుమారు రూ. 93 లక్షలు వ్యయం కాగలదని అంచనా.

| | | |
|---|---|---|
| ఆలయం ఎత్తు | - | 65' |
| గర్భగుడి | - | 20' × 24' |
| ఆలయం చుట్టుకొలత | - | 80' × 56' |

300 మంది భక్తులు కూర్చునేందుకు హాలు.

భగవాన్ శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష సన్న్యాస శిష్యులు స్వామి తురీయానందజీ మహరాజ్ జన్మదినాన - 2003, జనవరి 17వ తేదీన రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు పూజ్య శ్రీస్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ వారిచే ఈ దేవాలయానికి శంకుస్థాపన జరిగింది.



నిర్మాణంలో ఉన్న ఆలయం

సార్వజనీన దేవాలయ నిర్మాణానికి ఉదారులైన భక్తులు, శ్రేయోభిలాషులు, స్నేహితుల నుండి విరాళాల్ని కోరుతున్నాం.

విరాళాలను **Ramakrishna Math, Ichapur** పేరున చెక్కు లేదా డి.డి. తీసి **Ramakrishna Math, P.O. Mayal - Bandipur, Hooghly - 712617**కు పంపవలసిందిగా మనవి. అన్ని విరాళాలనూ కృతజ్ఞతతో స్వీకరిస్తాం.

మీరిచ్చే విరాళాలన్నింటికీ ఆదాయపుపన్ను చట్టంలోని సెక్షన్ 80G (vide memo No.DIT(E)/576/8E/40 69-70 dt.08-08-2001) కింద పన్ను మినహాయింపు ఉంటుంది.

శ్రీరామకృష్ణులు, దివ్యజనని శ్రీశారదామాత, స్వామి వివేకానంద, శశి మహరాజ్‌లు మిమ్మల్ని అనుగ్రహించాలని హృదయపూర్వకంగా ప్రార్థిస్తున్నాం.

భగవత్సేవలో
స్వామి నిర్లిప్తానంద
అధ్యక్షులు

## ధీరవాణి

# స్వార్థరహితుడే సత్పురుషుడు



సాహసికులైన యువకులారా! మీకు కావలసినవి మూడే విషయాలు: అవి ప్రేమ, నిజాయతీ, సహనం. జీవితమంటే అభ్యున్నతి లేక విస్తరణ లేక ప్రేమ. ప్రేమమయమే జీవితం. ఇదే జీవిత పరమార్థం. స్వార్థపరత్వమే మరణం. ఇది ఇప్పటికే కాదు ఎప్పటికైనా సత్యమే. ఇతరులకు మంచి చేయటమే జీవితం. హాని సల్పటం మరణం. నీకు కనిపించే పశుప్రవృత్తిగల మానవుల్లో నూటికి తొంభై మంది మృతులే. ప్రేమించలేని మానవుడు జీవన్మృతుని క్రింద పరిగణింప బడతాడు. నిరుపేదల కొరకు, అమాయక ప్రజల కొరకు, అణగద్రొక్కబడిన వారికొరకు వేదన చెందండి; పరితపించండి; భగవంతుని పాద సన్నిధిలో మీ అంతర్గత వ్యధను వెల్లడించండి. తత్ఫలితంగా మీకు అజేయమైన శక్తి సామర్థ్యాలు, సహకారం సమకూరుతాయి. 'శ్రమించండి, పరిశ్రమించండి' అనే నినాదాన్ని ఇచ్చాను. ఇప్పటికీ అదే ప్రబోధాన్ని ఇస్తున్నాను. పిరికితనాన్ని విడనాడండి. మిన్ను విరిగి మీద పడుతుందని భయపడవద్దు. ధైర్యంగా ఎదుర్కొంటే అన్నిటినీ వశం చేసుకోవచ్చు. సంపదవల్ల ప్రయోజనం లేదు. పేరు, ప్రతిష్ఠలతో మనకు పనిలేదు. చదువుల వల్ల సాధించేదేమీ లేదు. కాని ప్రేమ అమూల్యమైంది. ప్రధానంగా నడతను నమ్ముకోండి. అదే దుర్భేద్యమైన కష్టాలనే కోట గోడలను కూడ ఛేదించి ప్రవేశించ గల్గుతుంది.

ధనికులపై విశ్వాసముంచవద్దు. వారు మృత సదృశులేగాని, సజీవులు కారు. భగవంతునిపై విశ్వాసముంచి ఆత్మవిశ్వాసాన్ని వీడక శ్రమించే వినయశీలురైన క్రింది తరగతి ప్రజలే ఏదైనా సాధించగలరు. వేరే వ్యూహరచనతో పనిలేదు. దీన జనులపై దృష్టి సారించండి. నేను పన్నెండు సంవత్సరాలు ఈ కార్యభారాన్ని నెత్తిన వేసికొని పర్యటించాను. సంపన్నులు, గొప్పవారనుకునే వారి ప్రతి ఇంటికీ వెళ్ళాను. భూగోళంలో సగం భాగాన్ని పర్యటించి, హృదయ వేదన పొందాను. భగవంతుడు కరుణామయుడు. ఆయన నాకు చేయూతనిస్తాడని తెలుసు. నేను ఈ నేలమీదే చలితోనో, ఆకలితోనో ఎక్కడో రాలిపోవచ్చు. కాని నా సందేశాన్ని మీరు అమలు చేయండి. బీదలపై కరుణ చూపండి. అమాయకుల కొరకు, దీనజనుల కొరకు శ్రమించండి; వారిని ఉద్ధరించండి.

ఆంగ్లేయుల నుండి మనం కొన్ని మంచి విషయాలు నేర్చుకోవటం అత్యావశ్యకం. నాయకులను అనుసరించడం లోనూ, అసూయను విడనాడడంలోనూ, కార్యసాధనలో సడలని పట్టుదల ప్రదర్శించడంలోనూ, ఆత్మ విశ్వాసంలోనూ మనం ఆంగ్లేయుల్ని ఆదర్శంగా తీసుకోవాలి. ఒక పనికై ఆంగ్లేయుడు తన నాయకుణ్ణి ఎన్నుకొన్న క్షణం నుండీ కష్టసుఖాల్లో విడనాడకుండా అతణ్ణే అనుసరిస్తాడు. మన దేశంలో దానికి భిన్నంగా ప్రతి వ్యక్తీ తాను నాయకుని హోదాలో ఉండాలని అభిలషిస్తాడు. అనుసరించే వాళ్ళు ఎవరూ ఉండరు. ప్రతిఒక్కరూ ఆజ్ఞలు జారీచేసే ముందు, ఇతరుల ఆజ్ఞలను పాటించటం నేర్చుకోవాలి. అసూయను త్యజించి, నాయకుణ్ణి అనుసరించటం తెలియనంతవరకూ, మనకు వ్యవస్థీక రించుకునే సామర్థ్యం లభించదు. ప్రతి వ్యక్తీ ఆత్మవిశ్వాసంతో, దూరదృష్టితో, పట్టుదలను వీడక కార్యసాధనకు పూనుకోవాలి. c

(స్వామి వివేకానంద 'నా భారతం అమర భారతం' నుంచి)



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -2

**(గత సంచిక తరువాయి)**

**వృ**ద్ధ వైష్ణవుడు ప్రతి రోజూ మధ్యాహ్నం రెండు గంటలకు రొట్టెలు, ఉదయం – సాయంత్రం టీ కాచి ఇచ్చేవాడు. ఒక రోజు లడ్డూలు, ఒక రోజు పూరీలు, పాయసం తెచ్చి ఇచ్చాడు. పప్పులో బాగా నెయ్యి వేసేవాడు. ఈ పాడుబడిన ఆలయంలో ఉంటున్న ఇతనికి ఇవన్నీ ఎక్కడి నుంచి వస్తున్నాయని ఆ సాధువు అనుకున్నారు. నాలుగైదు రోజుల్లో ఆ రహస్యం బయటపడింది. రోజూ సాధువు బయటకు వెళ్ళి తిరిగి వచ్చేవాడు. ఒక రోజు ఆ వృద్ధుడు ఎక్కడికీ వెళ్ళ వద్దనీ, దగ్గరలో ఉన్న పల్లె నుంచి జాగీర్దారు చూడడానికి వస్తున్నాడనీ ఆ సాధువుకు చెప్పాడు.



ఆ వృద్ధుని ద్వారా ఊళ్ళో అందరికీ ఆ సాధువు గురించి తెలిసింది. ఆయనే రోజూ పాలూ, బియ్యం, గోధుమ పిండి, నెయ్యి, కూరలు, పప్పులూ అన్నీ భిక్షగా ఇస్తున్నారు. మరి ఆ వృద్ధుడు వారందరికీ ఏమని చెప్పాడో కానీ, జాగీర్దారు, అతని సహచరులు అంతా కలిసి నాలుగైదు బళ్ళలో వచ్చారు. అందులో స్త్రీలు కూడా ఉన్నారు. అందరూ వినమ్రంగా నమస్కారాలు చేసి కూర్చున్నారు. “మీరు ఇక్కడకు రావడం మా అదృష్టం. మీరు ఇక్కడే ఉండండి. వర్షాకాలం వస్తే పైన కప్పు వేయిస్తాను. మీకు ఏ విధమైన కష్టమూ కలగదు. మీ కోసం రోజూ బియ్యం, గోధుమ పిండి, నెయ్యి, పాలు, పప్పులు, కూరలు – అన్నీ పంపిస్తాను” అన్నారు జాగీర్దారు. తరువాత వృద్ధుణ్ణి చూపిస్తూ “ఇతను మీకు బాగా వండి పెడుతున్నాడు కదా!” అని అడిగారు. అలాగే వృద్ధునితో “ఏ వస్తువు అవసరమైనా అడిగి తీసుకెళ్ళు. ఆయనకు ఏ కష్టమూ కలగకూడదు” అన్నాడు. సన్న్యాసి అంతా వింటూ స్థాణువులా కూర్చున్నారు. సాయం కాలం అందరూ గ్రామానికి తిరిగి వెళ్ళిపోయారు.

### ఊబిలో ఉండగా భగవత్ సహాయం

మరునాడు తొమ్మిది గంటల ప్రాంతంలో అయిదారు బళ్ళల్లో చాలా మంది స్త్రీ, పురుషులు వచ్చి సన్న్యాసి దగ్గరే కూర్చొని ఆయనతో మాట్లాడడానికి ప్రయత్నించి విఫలులయ్యారు. చేసేదేమీ లేక వివిధ ప్రదేశాలకు చెందిన సాధు సన్న్యాసుల గురించి వాళ్ళలో వాళ్ళే మాట్లాడుకోవడం ప్రారంభించారు. అక్కడే వంట చేసుకుని సాధువును కూడా భోజనానికి పిలిచారు. రోజంతా గడిచాక సాయంత్రం అందరూ వెళ్ళిపోయారు.

మరునాడు కూడా చుట్టు పక్కల పల్లెల నుంచి చాలా మంది జనం వచ్చి రోజంతా గడిపి వెళ్ళారు. ఈ వృద్ధుడు, జాగీర్దారు కలిసి ‘ఇక్కడకు ఓ గొప్ప యోగి వచ్చారు’ అని అంతటా ప్రచారం చేస్తున్నారని సన్న్యాసికి అర్థమైంది. నెమ్మదిగా అక్కడ నుంచి మరొక స్థానానికి వెళ్ళిపోవాలనీ, మౌనవ్రతం ఇంకా చాలా రోజులు ఉందనీ సాధువు అనుకున్నారు. ప్రశాంతంగా ధ్యానం చేసుకుందామనుకుంటే కుదరడం లేదు.

ఒకనాడు సమయం చూసుకొని అరేబియా సముద్రం దిశగా ప్రయాణమయ్యారు. నర్మదా తీరంలో ఎంత దూరం నడిచినా ఒక్క పల్లె కూడా రాలేదు. ఎండ, వేడి వల్ల చాలా అలసటగా ఉంది. నదిలో స్నానం చేస్తే బాగుంటుందని అనిపించి ఆ నిర్జన ప్రదేశంలో నదిలోకి దిగారు. ఎంత దూరం లోపలికి వెళ్ళినా మోకాళ్ళ వరకైనా నీళ్ళు లేవు. ఇంకా ముందుకు వెళ్ళారు. అక్కడ కొద్దిగా లోతు ఉంది. నీళ్ళు బురదగా ఉన్నాయి. ఆలోచిస్తూ ఉండగానే కాళ్ళు బురదలో కూరుకుపోయాయి.

అక్కడ ఒక ఊబి ఉంది. బయటకు రావడానికి ప్రయత్నం చేస్తున్నకొద్దీ కాళ్ళు ఇంకా లోపలకు కూరుకుపోతున్నాయి. ఇప్పుడేం చేయాలి? నిర్జన ప్రాంతం. దగ్గరలో గ్రామమేదీ లేదు. ఎవరైనా చూసి సహాయం చేస్తారనుకోవడానికి ఎవరూ తిరిగే ప్రాంతం కూడా కాదు. గొంతెత్తి అరుద్దామన్నా సాధువు ‘కాష్ఠ మౌనవ్రతం’లో

ఉన్నారు. భగవంతుడి నిర్ణయం ఏమిటో? పవిత్ర నర్మదా నదిలో శరీరం కూరుకుపోతుందేమో?

ఇంతలో పెద్ద శబ్దం వినిపించింది. ఓడ ఏదైనా వస్తున్నదనుకున్నారు. క్రమక్రమంగా ఆ శబ్దం గట్టిగా, తరువాత భయంకరంగా మారింది. చూస్తే పర్వతంలా అంత ఎత్తుగా లేచిన ఎర్రటి బురదనీటి అల ఉధృతంగా వస్తోంది. నీటి పోటు అయ్యుంటుంది. "అయిపోయింది. ఇంకెవరూ కాపాడలేరు. దీని దెబ్బ ఎంత ప్రచండమైనదంటే పెద్ద పెద్ద నావలు, ఒక మాదిరి స్టీమర్లు కూడా మునిగిపోతాయి, లేదంటే ముక్కలై పోతాయి. ఇక మృత్యువు ఆసన్నమైపోయింది. ఇదే భగవంతుడి నిర్ణయం కాబోలు" అనుకొని, ఆ సాధువు కళ్ళు మూసుకొని, మృత్యువు కోసం ఎదురుచూస్తూ నిల్చున్నారు.

నీటి కెరటం వచ్చి చేపను విసిరినట్లు ఆయనను గట్టిగా విసిరికొట్టింది. బురదలో కూరుకుపోయిన కాళ్ళు ఆ వేగానికి బయటకు వచ్చాయి. మరొక కెరటం ఆ సాధువును తీరం దిశగా తోసివేసింది. ఆ విధంగా నీటిలో నుంచి బయటకు వెళ్ళి పడ్డారు. లేచి నిల్చొని, దూరంగా వెళ్ళి కూర్చున్నారు. "ఇంకా ఆయువు ఉంది కాబోలు. నర్మదాదేవి నన్ను స్వీకరించలేదు. ఆ పరమేశ్వరుని లీలల్ని ఎవరు తెలుసుకోగలరు?" అనుకుని లేచి నడక సాగించారు.

కొంచెం దూరం నడిచాక ఒక శివాలయం కనిపించింది. ఆలయ పూజారి తినడానికి ఏదో పెట్టాడు. సాధువు రాత్రి అక్కడే ఉండిపోయారు. మరునాడు మళ్ళీ నర్మదా తీరంలో నడుస్తూ ముందుకు వెళ్ళారు. మధ్యాహ్నం అవుతూ ఉండగా ఒక శివాలయం కనిపించింది. చుట్టూ అడవి. ఆలయానికి దగ్గరలోనే ఒక బావి ఉంది. అందులోనూ ఉప్పు నీరే. ఆ ప్రదేశం ఆకర్షణీయంగా ఉంది. నర్మదా నది, అరేబియా సముద్రంలో కలుస్తున్న చోట ఉన్న ఆ గ్రామం పేరు హరిపురా. అక్కడే ఆ సాధువు బస ఏర్పాటు చేసుకున్నారు. ప్రకృతి అందాలు ఆహ్లాదకరంగా ఉన్నాయి. రాత్రిపూట క్రూరమృగాల నుంచి తనను తాను రక్షించుకునేందుకు ధుని చాలా అవసరం. ఒక ధుని వెలిగించి ఆసనం వేసుకొని అక్కడే



కూర్చున్నారు. కొంచెం సేపటికి ఒక రైతు ఆవుల్ని తోలుకొని అటు వచ్చి, ఆలయం తలుపులు తెరచి లోపలకు వెళ్ళి పూజ చేసి వచ్చాడు. ఆ వ్యక్తి సంస్కారవంతుడిలా ఉన్నాడు. "నమో నారాయణ" అంటూ సన్న్యాసికి నమస్కారంచేసి, శివునికి నైవేద్యం పెట్టిన వేరుసెనగ కాయలు, ఖర్జూరం ఇచ్చాడు. బాగా ఆకలిగా ఉండడం వల్ల సాధువు వెంటనే అవి తిన్నారు. ఆ రైతు ఏవో ప్రశ్నలు అడిగాడు కానీ వేటికీ అతనికి సమాధానం రాలేదు.

రాత్రి సాధువు చాలా ఆనందంగా, ప్రశాంతంగా గడిపారు. దగ్గరలో ఎవరూ లేరు. దూరంగా ఏదో జంతువు అరిచింది. ఆ అరుపు విని లేళ్ళు భయపడి గుంపులు గుంపులుగా వచ్చి ధుని దగ్గర నిల్చున్నాయి. మనిషి ఉన్నాడని వాటికి ధైర్యం! ఇంకే జంతువులూ హాని చెయ్యవని తలచి అవి నిర్భయంగా అక్కడకు వచ్చినట్లున్నాయి. రెండో రోజూ పూజారి రాలేదు. ముందు రోజు కనిపించిన రైతు వచ్చి పూజ చేసి, వేరుసెనగ కాయలు, ఖర్జూరం నైవేద్యం పెట్టి సన్న్యాసికి ప్రసాదం ఇచ్చి వెళ్ళిపోయాడు. రోజంతా ఎవరూ రాలేదు. ప్రశాంతంగా గడిచింది. మూడో రోజు కూడా తినడానికి అదే దొరికింది. ప్రతి దినం అవే తినడంతో కడుపు నొప్పి, అజీర్తి మొదలయ్యాయి. నీరు తాగుదామంటే ఉప్పు నీరు. నాలుగో రోజు కూడా ఆ రైతు భక్తితో వేరుసెనగకాయలు, ఖర్జూరం ఇచ్చాడు. ఇంతలో బరోడా నుంచి తహసీల్దార్ కొంతమందితో కలిసి అక్కడకు వచ్చాడు. దైవదర్శనం చేసుకొని, సన్న్యాసి దగ్గరకు వచ్చి క్షేమ సమాచారాలు అడిగాడు. సన్న్యాసి మాట్లాడరనీ, మౌనంగా ఉంటారనీ, మూడు నాలుగు రోజులుగా అక్కడే ఉన్నారనీ, గ్రామంలోకి వెళ్ళరనీ రైతు చెప్పాడు. మరి భిక్ష ఎలా వస్తున్నదని తహసీల్దారు అడిగాడు. దానికి రైతు "నేనే వచ్చి రోజూ దేవునికి నైవేద్యం పెట్టిన వేరుసెనగకాయలు, ఖర్జూరం ఇస్తున్నాను. వాటితోనే ఆయన కడుపు నింపుకుంటున్నారు" అని చెప్పాడు. "పూజారి ఏ ఏర్పాటూ చేయలేదా" అని ఆ తహసీల్దారు అడిగాడు. "పూజారి అసలు రానే రారు" అని ఆ రైతు సమాధాన మిచ్చాడు. ## **(సశేషం)**

**అనువాదం : శ్రీమతి జి. ఎస్. లక్ష్మి**

# అదృశ్యంగా ఉండే అదృష్టం!



– జి. సతీష్

పేదవాడైన సీతయ్య బ్రతుకు తెరువు కోసం కట్టెలు కొట్టేవాడు. వాటిని ఊళ్ళో అమ్మగా వచ్చిన చాలీ చాలని డబ్బుతో, సంసారాన్ని భారంగా నెట్టుకొచ్చే వాడు. అందువల్ల ఏ దేవతైనా కరుణించి తన కష్టాలను తీరిస్తే బాగుంటుందని కలలు కనేవాడు సీతయ్య.

ఒక రోజు యథావిధిగా సీతయ్య కట్టెల కోసం అడవికి వెళ్ళాడు. ఒక పెద్ద చెట్టును ఎంచుకొని దాన్ని నరికేందుకు గొడ్డలి పైకెత్తాడు. వెంటనే ఒక మృదువైన కంఠస్వరం "ఆగు సీతయ్యా! ఆగు!" అంటూ వారించినట్లు అనిపించింది. అంతలోనే కళ్ళు మిరుమిట్లు గొలిపే ప్రకాశంతో ఒక దేవత అతని ముందు ప్రత్యక్షమయింది. 'నేను వృక్షదేవతను! భరించలేని పేదరికం వల్లనే కదా



పచ్చని చెట్టును పొట్టనబెట్టుకోవాలను కుంటున్నావు! నీకు మూడు వరాలను ఇస్తాను. ఆ దారిద్ర్యం తీరిపోయేలా రోజుకొక వరాన్ని కోరుకో" అని ప్రశాంతంగా పలికింది వృక్ష దేవత!

"కోరికలు తీరుస్తానని చెప్పి మాట తప్పవు కదా!" అని అనుమానంగా అడిగాడు సీతయ్య! "మాట తప్పే అలవాటు మనుషులదే కానీ మాదికాదు సీతయ్యా!" అంటూ వృక్షదేవత అభయమిచ్చి, అదృశ్యమయింది!

పట్టరాని సంతోషంతో సీతయ్య ఇంటి దారి పట్టాడు. ఇల్లు చేరుతూనే "ఈ రోజు మధ్యాహ్నం మా ఇంటిల్లిపాదీ పిండి వంటలతో విందు భోజనం చేయాలి" అని కళ్ళు మూసుకొని మనసులో కోరుకున్నాడు. కళ్ళు తెరిచే సరికి ఎదురుగా భోజనం సిద్ధంగా ఉంటుందనుకున్నాడు. కానీ అలాంటిదేమీ జరగలేదు. కానీ ఎవరో తలుపు తడుతున్న చప్పుడయింది. సీతయ్య వెళ్ళి తలుపు తీసి, ఎదురుగా పక్కింటి రాజయ్య నిలబడి ఉండటం చూశాడు. "సీతయ్యా! ఈ రోజు మా ఇంట్లో వ్రతం జరుపుకుంటున్నాం! మీరంతా మధ్యాహ్నం మా ఇంటికి తప్పకుండా రావాలి" అంటూ ఎంతో ఆప్యాయంగా సీతయ్య కుటుంబాన్ని ఆహ్వానించాడు. "ఈ రోజు మా ఇంటికే విందు భోజనం రాబోతుంది! కాబట్టి మీ ఇంటికి రాలేం రాజయ్యా!" అని సీతయ్య వచ్చిన ఆహ్వానాన్ని నిరాకరించాడు. చేసేదేమీ లేక రాజయ్య వెను దిరిగాడు. సాయంత్రమైనా భోజనం సీతయ్య ఇంటికి రాలేదు! దాంతో ఇంటిల్లిపాదీ నూకలతో కొంత గంజి కాచుకొని తాగారు. ఆకలిని చల్లార్చుకున్నారు. వృక్షదేవత వరం ఫలించక పోవడం సీతయ్యకు ఆశ్చర్యం కలిగించింది!

మరునాడు బాగా ఆలోచించి, దాసదాసీ జనంతో పెద్ద భవంతి కావాలని కోరుకున్నాడు. వర ప్రభావంతో తన పూరిల్లు పెద్ద భవంతిగా మారిపోతుందని అతని ఉద్దేశం. కానీ అలాంటిదేం జరగలేదు. కానీ ఎవరో తనను పిలుస్తున్నట్లు వినిపించింది. తలుపు తీసిన సీతయ్యకు అక్కడొక అపరిచిత వ్యక్తి కనిపించాడు.

మిగతా 29వ పేజీలో...



# మానవ ప్రగతికి మనో నియంత్రణ

- స్వామి రంగనాథానంద

**సు**ఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి॥

(భగవద్గీత 2-38)

'సుఖదుఃఖాలు, లాభనష్టాలు, జయాపజయాలు, సమానంగా స్వీకరిస్తూ, నీవు యుద్ధం చేయాలి! అలా చేస్తే నీకు పాపం అంటదు'.

నిత్యజీవితంలో తరచుగా మనసు కలతలకు లోనవుతూ ఉంటుంది. కాబట్టి, మనం మనసును స్వాధీనంలో ఉంచుకోవడం నేర్చుకోవాలి. శాంతంగా, స్థిరంగా ఉండడం అలవరచుకోవాలి. ఈ సమత్వాన్నే యోగమని నిర్వచిస్తాడు శ్రీ కృష్ణుడు.

వేగవంతమైన నేటి సమాజంలో మనసును ఎంత ప్రశాంతంగా ఉంచుకోగలిగితే అంత మంచిది! మనోనిశ్చలత ఎంతో అద్భుతమైన భావన. ఘనకార్యాలను ఉద్వేగంతో సాధించలేము. ఏ కార్యాన్నైనా సాధించాలంటే మనసు భావోద్వేగాలకు లోనుకాకుండా జాగ్రత్త వహించాలి. అప్పుడు మాత్రమే శాంతంగా, స్థిరంగా సమస్యలను అధిగమించవచ్చు.

కష్టాలు ఎదురైనప్పుడు మనసు ఆందోళనకు గురి కావడం సహజం. అయితే, మనసు నిశ్చలంగా ఉండేందుకు తగిన సామర్థ్యాన్ని శిక్షణతో పెంచుకోవచ్చు! ప్రతికూల పరిస్థితులను ఎదుర్కొనే సామర్థ్యం మనుషులకు మాత్రమే ఉంది.

జంతువుల్లో మనోనియంత్రణకు అవకాశమే లేదు. కాబట్టి వాటిలో ఏ భావం ఉదయించినా అవి ఆ భావాలకు బానిసలు అవుతాయి. అదే జంతు స్వభావం. మనసు పనితీరును క్రమబద్ధం చేయని మానవులు కూడా జంతువులతో సమానమే. నాగరకత అభివృద్ధి చెందని ప్రాథమిక స్థాయిలో మనం జంతువుల్లానే ప్రవర్తించాం. కానీ జంతువులకున్నంత అశాంతి మానవులకు లేదు. అది మనకు ప్రకృతి ప్రసాదించిన వరం. మనిషిలోని ఆలోచనలన్నీ క్రియారూపంలో వ్యక్తమవడానికి కొంత సమయం పడుతుంది. మానవుడు బుద్ధి వికాసం చెందిన జంతువు అనడానికి అదే నిదర్శనం.

చర్య, ప్రతిచర్యల మధ్య విరామం ఎంతగా పెరిగితే మానవుడు తన మనసుని అంత స్వాధీనపరచుకున్నాడని అర్థం. ఉదాహరణకు - ఎవరైనా మనల్ని దూషిస్తే, వెంటనే ప్రతి చర్యగా వారిని దూషించవచ్చు! దీనిని సహజ చర్య అంటాము. కానీ అలా చేస్తే మనకూ, జంతువులకూ తేడా ఏమీ ఉండదు! చర్య, ప్రతిచర్యలకు లోనుకాకుండా ఉండేందుకు తగిన శక్తి మనలోనే ఉంది. మనిషి యొక్క పరిణామం మనోనియంత్రణపైనే



ఆధారపడి ఉంది. జంతువుల్లా కాక మనం ప్రకృతి నుండి లభించే స్పందనలకు ప్రతిస్పందించకుండా ఉండగలగడమే మానవుని స్వాతంత్ర్యానికి నిజమైన నిర్వచనం. మనో నిగ్రహాన్ని సాధించటం ప్రారంభించగానే మనలోని పశుత్వం పోయి మానవత్వం వృద్ధిచెందుతుంది. మనోనియంత్రణ సాధించిన వ్యక్తి ఏ రంగంలోనైనా ఉన్నతిని సాధించగలడు. కాబట్టి భావోద్వేగాల బారి నుంచి బయటపడడానికి అందరూ ప్రయత్నించాలి. అదే నేడు మనమంతా చేయాల్సిన సాధన. ఈ సాధన సఫలీకృతం అయినప్పుడే మానవ ప్రగతి సాధ్యం. c

(స్వామి రంగనాథానందజీ 'గీతోపన్యాసాల' నుంచి)

అనువాదం : స్వామి అచిన్త్యానంద

- స్వామి సుకృతానంద



– కె.వి. రామదుర్గయ్య, నెల్లూరు.

**? : భగవంతుని ఆరాధనవల్లనే మానవుడు మహాత్ముడై గురువుగా అవతరిస్తున్నాడు. కానీ శ్రీరామకృష్ణ మఠం వారు భగవంతుని కంటే గురుపూజకే ఎక్కువ ప్రాధాన్యతను యిస్తారు. ఎందువల్ల?**

✍: శ్రీరామకృష్ణమఠాల్లో శ్రీరాముణ్ణో, శ్రీకృష్ణుణ్ణో, లేక మరే పురాణదేవతనో కాక శ్రీరామకృష్ణుణ్ణే ఆరాధించడం వల్ల మీకు ఈ సందేహం కలిగి ఉండవచ్చు! "ఎవరు రాముడో ఎవరు కృష్ణుడో ఆ రామ, కృష్ణులే ఇప్పుడు రామకృష్ణునిగా అవతరించారు" అని శ్రీరామకృష్ణులే తన అవతార తత్త్వాన్ని స్వామి వివేకానందకు స్వయంగా చెప్పారు. కాబట్టి భక్తులు ఆయన్ని సాక్షాత్తూ భగవంతుడి అవతారంగానే పూజిస్తున్నారు. శ్రీరామకృష్ణ జీవిత చరిత్రను చదివితే ఆయన అవతార విశిష్టత మీకు అర్థమవుతుంది.

మీరు అనుకున్నట్లు గురువూ, భగవంతుడూ వేరు కాదు. శిష్యుడి మనసు పరిపక్వత చెందినపుడు భగవంతుడే సద్గురువుగా అతని వద్దకు వస్తాడు. ముక్తి మార్గాన్ని చూపుతాడు. గురువును కేవలం మానవ మాత్రుడిగానే పరిగణించేవారు ఆధ్యాత్మికంగా పురోగ మించరని సద్గురువులందరూ చెబుతారు. అలాంటప్పుడు గురువునే భగవంతుడిగా పూజించడంలో తప్పేముంది?

– కోరా జయకరరావు, నిడదవోలు.

**? : నేను రకరకాల నామాలను జపించాను. కానీ శివుడు పార్వతితో 'రామనామం సర్వ పాపవినాశిని' అని చెప్పాడని చదివాను. ఏ నామమైనా చిత్తశుద్ధితో చేస్తే చాలా? లేక రామనామమే చేయాలా?**

✍: నామరూపాలు వేరైనా భగవంతుడొక్కడే! అతణ్ణి ఏ పేరుతో పిలిచినా పలుకుతాడు. అన్ని పేర్లూ ఆయనవే! ప్రతినామమూ శక్తివంతమైందే! పంచదారతో తయారు చేసిన ఏనుగు, చిలుక, పులి బొమ్మలు రూపాల్లో తేడాయే కానీ పదార్థం (రుచి)లో కాదు కదా! అలాగే భగవంతుని రూపాలు వేరైనా దివ్యశక్తి (నామ రుచి) మాత్రం ఒక్కటే! కాబట్టి పదే పదే నామాన్ని మారుస్తూ ఉండే బదులు జపించే సంఖ్యను పెంచే ప్రయత్నం చేయండి. నామం పట్ల నిష్ఠ, భగవంతుడిపై ప్రేమ పెరిగినకొద్దీ మీ ఇష్టదైవమే సర్వదేవ, దేవీ రూపాలను ధరించాడనే దృఢ విశ్వాసం మీలో కలుగుతుంది.

– కృష్ణ, వెల్లపాలెం.

**? : రుక్మాంగదుడెవరు? అతని కథ వివరించండి?**

✍: రుక్మాంగదుడు ఒక రాజైనప్పటికీ స్వయంగా ఏకాదశి వ్రతాన్ని అనుష్ఠిస్తూ, ఆ దిశగా ప్రజలను కూడా ప్రోత్సహించేవారు. దేవతలు అతడి వ్రతనిష్ఠను పరీక్షించ దలచి 'మోహిని' అనే అప్సరసను అతడి వద్దకు పంపారు. రుక్మాంగదుడు ఆమెను చేరదీసినప్పటికీ వ్రతాన్ని మాత్రం కొనసాగించేవాడు. అతడు వ్రతదీక్ష పూనడానికి బయలు దేరేప్పుడల్లా 'తనను వీడి వెళ్ళవద్దని' ఆమె అడ్డుకునేది! అయినా రుక్మాంగదుడి మనసు మారేది కాదు. ఆమె చివరి ప్రయత్నంగా కుమారుని వధించి వెళ్ళమని షరతు పెట్టింది. అప్పుడు రుక్మాంగదుడు తమ కుమారుణ్ణి వధించేందుకై కత్తి ఎత్తాడు. అంతలో దేవతలు ప్రత్యక్షమై అతని వ్రతనిష్ఠను కొనియాడి, కోరిన వరాలు ప్రసాదించారు. ఎలాంటి ప్రలోభాలకూ లొంగని నిష్ఠాగరిష్ఠుడు ఆయన.

# ఆధ్యాత్మిక అన్వేషణ



- స్వామి తపస్యానంద

**ప్రశ్న :** రామకృష్ణ దేవాలయాలలో ఇతర హిందూ దేవీదేవతల చిత్రపటాలకు బదులుగా శ్రీరామకృష్ణుల చిత్రపటాన్ని ఎందుకు పూజిస్తారు?

**జవాబు :** రామకృష్ణ మఠ దేవాలయాలన్నీ ముఖ్యంగా మఠ సాధువుల కోసం, శ్రీరామకృష్ణులను దైవాంశ సంభూతునిగా భావించే ఇతర భక్తుల కొరకు ఉద్దేశించినవి. ఏసుక్రీస్తువలెనే శ్రీరామకృష్ణులు కూడా దైవాంశసంభూతులని వారి అనుయాయులు విశ్వసిస్తారు. ఈ 19వ శతాబ్దంలో కూడా యేసుక్రీస్తు వంటి మహాత్ముడు జన్మించారంటే అనేకులు ఒక వింతగా భావిస్తారు కూడా! అటువంటి మహానుభావునికి ప్రణతు లర్పించడంలో నిజానికి వింత ఏముంది?

హిందూమతంలో దేవునికి, ప్రకృతికి మధ్య లక్ష్మణరేఖ అంటూ ఏమీ లేదు. పరమాత్ముని అనంతశక్తి వ్యక్తీకరణమే ఈ ప్రకృతి. ప్రకృతిలోని ఏ వస్తువునైనా సరే తగిన రీతిలో పవిత్రీకరించి, దానిలో దివ్యత్వాన్ని ఆవాహన చేసిన తరువాత దానిని భగవంతుని ప్రతిరూపంగా మనం కొలవవచ్చును. అటువంటి ప్రతిరూపాలన్నిటిలో పుణ్యపురుషుడు అనేవాడు ఇంటి చావడి వంటివాడు. (దీని అర్థమేమంటే – భగవంతుడు ఈ ప్రకృతిలో అన్నిచోట్లా భాసిస్తున్నప్పటికీ ఒక పుణ్యపురుషుని హృదయంలో మరింతగా అభివ్యక్తమౌతాడు. తన యజమానిని కలవగోరిన వ్యక్తి మరెక్కడా కాకుండా కేవలం ఆ యజమాని ఇంటిచావడిలో మాత్రమే వేచిచూసి చివరికి అతనిని కలిసే విధంగానే సాధకుడు భగవంతుని కొరకై పుణ్యపురుషులను ఆశ్రయించాలి.) అటువంటి పుణ్య పురుషుడు కనుక ఆ సాధకుని ఆధ్యాత్మిక గురువు కూడా అయినట్లైతే హిందూ సంప్రదాయం ప్రకారం ఆ గురువునే దైవంగా శిష్యుడు కొలువవచ్చును. ఆ గురువు సాధారణ గురువులవలె కాక జగద్గురువు, అవతారపురుషుడు అయినట్లైతే భక్తిభావంతో చూసే ప్రతి ఒక్కరికీ అతడు పూజ్యనీయుడౌతాడు.

సాధారణ ఆధ్యాత్మిక గురువులూ, జగద్గురువుల మధ్య గల భేదాన్ని శ్రీరామకృష్ణులు ఒక మామూలు వెదురుకర్రతోనూ, పెద్ద ఓడతోనూ పోల్చిచెప్పారు. మామూలు వెదురుకర్ర సహాయంతో కేవలం ఒక వ్యక్తి మాత్రమే నదిని దాటగలుగుతాడు. అదే ఒక ఓడలో అయితే లెక్కలేనంతమంది ఎన్నోసార్లు ఆ నదిని దాటగలుగుతారు. రాముడు, కృష్ణుడు, క్రీస్తు, శ్రీరామకృష్ణుల వంటివారు జనులకు మోక్షాన్ని ప్రసాదించే మాధ్యమంగా నిలిచారు. దైవానుగ్రహానికీ, అవ్యాజప్రేమకూ వారు నిలువెత్తు నిదర్శనాలు. కాబట్టి వారు భగవదారాధనకు, భగవద్దర్శనానికి ఉన్నత ప్రతీకలుగా భాసిస్తారు. శ్రీరామకృష్ణుల అనుయాయులు వారిని కేవలం ఒక సాధారణ ఆధ్యాత్మిక గురువుగా కాకుండా జగద్గురువుగా ఎలా భావిస్తారో అదే విధంగా మేమూ వారిని పూజార్హునిగా, ప్రత్యక్షదైవంగా భావిస్తాము. అంతేకాక, శ్రీరామకృష్ణులు తన ఆధ్యాత్మిక సాధనల సమయంలో ఒక ప్రత్యేక ఆధ్యాత్మికానుభవాన్ని సంపాదించారు. వారు హిందూమతంలోని వైష్ణవ, శైవ, శాక్తవంటి అన్ని రకాల సంప్రదాయాలకనుగుణంగా సాధనలను ఆచరించారు. క్రైస్తవ, ఇస్లాం మత సాంప్రదాయాల్లో కూడా వారు సాధనలనొనరించారు. ఈ సాధనల అంతిమదశలో ఆయా దేవీదేవతలు తనకు దర్శనమిచ్చి, చివరగా తనలోనే లీనమైనట్లు గాంచారు. ఆ విధంగా శ్రీరామకృష్ణులు మానవాళి పూజించిన ఆ పరమాత్ముని వివిధ రూపాలను తనలోనే ఇముడ్చుకొని ఉన్నారు. కాబట్టి ఏ దేవీదేవతలను కొలిచేవారికైనా సరే శ్రీరామకృష్ణులు పూజ్యనీయులు. పరమాత్ముడనేవాడు ఒక్కడే. శ్రీరామకృష్ణుల అవతారంతో సహా ఆ పరమాత్ముని వివిధ అవతారాలు ఇంటికి ఉండే కిటికీల వంటివారు. ఆ కిటికీల ద్వారా సాధకుడు అనంత లోకాలను ఆవరించియున్న విశాల దివ్యత్వాన్ని దర్శించ గలుగుతాడు. c

# కలతలూ..కన్నీళ్ళూ..

ఆర్థర్ ఏష్ వింబుల్డన్ విజేత అయిన మొట్టమొదటి నల్లజాతీయుడు. ఆ సమయంలో ఆయనకు టెన్నిస్ అభిమానుల నుంచి అభినందనల వర్షం కురిసింది. ఆఫ్రికన్ల ఆత్మాభిమానాన్ని ఆకాశం అంచుల దాకా చాటిన ఆయనను విధి మాత్రం వింతరీతిలో కాటేసింది. 1992లో గుండె శస్త్రచికిత్స కోసం ఆసుపత్రిలో చేరిన ఆర్థర్ ఏష్‌కు పొరపాటున ఎక్కించిన కలుషిత రక్తంతో ఎయిడ్స్ సోకింది. ఒక్కసారిగా అభిమానుల ఆవేదన కట్టలు తెంచుకుంది. వేలవేల ఉత్తరాల రూపంలో ఆయనకు సానుభూతి ప్రకటించింది. ఒక అభిమాని దుఃఖాన్ని అణచుకోలేక ఆయన వద్దకు వెళ్ళి ఈ వ్యాధి మీకే ఎందుకు రావాలి? దేవుడు మీకే ఎందుకు ఈ శిక్ష విధించాడు? అంటూ దేవుణ్ణి నిష్ఠూరమాడింది.



అప్పుడు ఆర్థర్ ఏష్ ఎంతో నిబ్బరంతో, చెదరని చిరునవ్వుతో **'ప్రపంచంలో 5 కోట్ల మంది టెన్నిస్ ఆడాలని కలలు కంటారు. అందులో 50 లక్షల మందే ఆ ఆటను సాధన చేయగలరు. 5 లక్షల మందే ప్రొఫెషనల్ ఆటగాళ్ళుగా ఎదగగలరు. 50 వేలమంది అంతర్జాతీయ స్థాయిలో రాణించగలరు. 5 వేల మంది పోటీకి నిలబడగలరు. 50 మంది సెమీఫైనల్‌కు చేరుకుంటారు. ఇద్దరే ఫైనల్‌లో నిలుస్తారు. ఒక్కరే విజేతగా నిలబడి బహుమతి అందుకుంటారు. ఆ ఒక్కణ్ణి నేనే అయినప్పుడు దేవుణ్ణి ప్రశ్నించలేదే నన్నే ఎందుకు ఈ స్థానానికి ఎంపిక చేసుకున్నావని! మరి అలాంటప్పుడు ఈ భయంకర వ్యాధికి నన్నే ఎందుకు ఎన్నుకున్నావని దేవుణ్ణి అడిగే హక్కు నాకెక్కడుంది.!'** అంటూ ధైర్యంగా మృత్యువును ఆహ్వానించాడు. అందుకే ఆయన ఆటలోనే కాదు అంతిమఘడియల్లోనూ విజేతే....

### కన్నీళ్ళూ కొన్నాళ్ళే....

కానీ మనం చిన్న కష్టానికే కుంగిపోయి దేవుడు నాకే ఎందుకు ఈ కష్టాలు పెట్టాడని కుమిలిపోతాం. సుఖసంతోషాలలో మాత్రం ఆ విధాతకు కృతజ్ఞతగా వ్యవహరించం. అయినా సాధారణ మానవుల్లాగ ఆ భగవంతుడికి ఒకరిపై కోపం, మరొకరిపై ప్రేమా ఉండవు. ఆయనకు అందరూ సమానమే. పున్నమి వెన్నెలనే కాదు, అమావాస్య అంధకారాన్ని కూడా ఆకాశం ప్రశాంతంగానే అనుభవిస్తుంది. పక్షం రోజుల పాటు పూర్ణచంద్రుని కోసం నిరీక్షిస్తుంది. మన జీవితాల్లోనూ అంతే! ఏ కష్టమూ కలకాలం ఉండదు. 'యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్... యుద్ధ మీదృశమ్' యుద్ధం అంటే యాదృచ్ఛికంగా తెరుచుకున్న స్వర్గద్వారమని శ్రీకృష్ణులు అంటారు. సమస్యకు కూడా ఎంత ఆశావహ నిర్వచనమో చూడండి! సమస్య వచ్చినప్పుడే పోరాడేతత్త్వం పెరుగుతుంది. గెలిస్తే విజయం లభిస్తుంది. ఓడితే మంచి అనుభవమవుతుంది. అందుకు కన్నీళ్ళూ కొన్నాళ్ళే అని తెలుసుకుందాం! వాటికి కూడా కృతజ్ఞతగా ఉందాం.

### కష్టాలు కొందరికే కాదు...

కష్టనష్టాలు, ఆవేదనలు, ఆందోళనలకు ఎవరూ అతీతం కాదు. యుగపురుషుడైన స్వామి వివేకానంద జీవితమే దీనికి



**ప్రపంచ విజేతను నేనే అయినప్పుడు దేవుడిని ప్రశ్నించలేదే నన్నే ఎందుకు ఈ స్థానానికి ఎంపిక చేసుకున్నావని! మరి అలాంటప్పుడు ఈ భయంకర వ్యాధికి నన్నే ఎందుకు ఎన్నుకున్నావని దేవుడిని అడిగే హక్కు నాకెక్కడుంది.!'**

– ఆర్థర్ ఏష్

Zkhq# Jrg# khosv# |rx# lq# |rxu# wuxedv
\rx#ghyhors#idlwk#lq#klv#delolwlhv
Zkhq#kh#lv#ghod|lqj#lw
Kh#kdv##idlwk#lq#|rxu#delolwlhv

నిదర్శనం. ప్రపంచాన్ని తన వ్యక్తిత్వంతో ప్రభావితం చేసిన ఆయన వ్యక్తిగతంగా పడరాని కష్టాలు పడ్డారు. ఆయన కుటుంబం ఆకలితో అలమటించింది. ఆత్మీయుల అకాల మరణాలు, నిరుద్యోగం, ఆర్థిక బాధలు, దాయాదుల పోరు... ఆయనను అలల్లా ముంచెత్తాయి. అయినా కించిత్తు కూడా కుంగిపోలేదు. నిబ్బరంగా నిలబడ్డారు. విశ్వానికే ఆత్మవిశ్వాసాన్నిచ్చారు. అదీ ధీరుల లక్షణమంటే! ఏ కష్టమైనా, సుఖమైనా మనకొక్కరికే వచ్చినది కాదు. మనకన్నా ముందు ఆ కష్టసుఖాల్ని అనుభవించినవారు ఎందరో ఉన్నారు. మనతో పాటు అనుభవిస్తున్న వారూ ఎందరో ఉన్నారు. మన తరువాత కూడా ఎందరో అనుభవిస్తారు.

# ... కొన్నాళ్ళే!

– బి. సైదులు

## దుఃఖం దేనికి?...

ఈ ప్రపంచంలో మన దుఃఖాలకు చెప్పే చాలా కారణాలకు అర్థమే లేదు. ఆవేదన, ఆందోళనలు... పరిస్థితులపై కాదు మన మానసిక సామర్థ్యంపై ఆధారపడి ఉంటాయి. కొందరు అనుకున్న సమయానికి బస్ రాకపోతేనే ఆందోళన పడతారు. కొందరు వ్యాపారంలో నిలువునా మునిగినా నిబ్బరంగానే నిలబడతారు. ప్రతికూల పరిస్థితుల తీవ్రత మనసుపై ఏ స్థాయిలో ప్రభావాన్ని చూపుతుందన్నదే ముఖ్యం. అందుకే భగవద్గీతలో భగవానుడు '...శీతోష్ణ సుఖదుఃఖదాః ఆగమాపాయినో నిత్యాస్తాం తితిక్షస్వ భారత' అంటాడు ...సుఖదుఃఖాలు వస్తూ పోతుంటాయి. వాటిని సహనంతో స్వాగతించటం, పంపటమే కాని వాటికి మనం ప్రభావితం కాకూడదు. మన వయస్సు, అనుభవాలతో పోలిస్తే వాటి పరిధి చాలా స్వల్పం.

## ప్రేమ పరిధిని పెంచుకుందాం...

'ఎవరిలోనూ తప్పులను ఎంచకండి. ఈ ప్రపంచంలో అందరూ నీవారే! పరులెవరూ లేరు. అందరినీ ప్రేమిస్తే దుఃఖానికి తావే లేదు' అంటారు జగజ్జనని శారదాదేవి. మనం ప్రేమించే పరిధిని ఎంత విస్తరించుకుంటే అంత ఆనందం మనకు. అందరినీ ఆ పరిధిలోకి ఆహ్వానిస్తే పరాయివారంటూ ఎవరూ కనిపించరు.

## ఫలితమేదైనా ప్రసాదమే....

ఎంత తక్కువ ఆశిస్తే, నిరాశ పడే అవకాశం అంత తగ్గుతుంది. ఎప్పుడయితే మనలో ఆశించటం ప్రారంభమవుతుందో అప్పుడు సుఖ దుఃఖాల స్పృహ మొదలవుతుంది. అందుకే గెలుపులో గర్వించటమే కాదు ఓటమిలో ఓదార్చే రీతిలో మన మనసును మలచుకుందాం... a



## ఆవేదన... ఆనందం...

కన్నీటి ఊటను నింపే ఆ కళ్ళే...
ఆనందాశ్రువుల్నీ వర్షిస్తాయి...
ఆవేదన ఎంత రమ్యంగా చెక్కితే
ఆ జీవితం అంత రంగులమయమైన
మేడ అవుతుంది.
వేయివక్కలుగా విరిచిన వెదురే
సుమధురాల వేణువై
రాగాలు పలుకుతుంది..
సంతోషంతో నీకు మాటలు కరువయినప్పుడు,
మనసును ఆకాశంలా పరచిచూడు
బాధల మేఘాలు కమ్ముకున్న
భావాల తారకలు కనిపిస్తాయి...
ఆనందం ఆవేదన కంటే గొప్పదంటారు కొందరు!
కాదు ఆవేదనే గొప్పదంటారు ఇంకొందరు...!
కాని మిత్రమా! సుఖదుఃఖాలు రెండూ సమమే!
ఒకటి నీ పక్కనుంటే, మరొకటి నీ మరోపక్క
పడుకొని ఉంటుంది....

– ఖలీల్ జిబ్రాన్



# శ్రీ రామకృష్ణ మిషన్ గిరిజన సంచార వైద్యశాల



**వివేకానంద రోడ్, రాజమండ్రి - 533 105**

**విన్నపము**

## పరిచయము :

1985వ సంవత్సరంలో తూర్పు ఏజన్సీలో గిరిజనులకు మెరుగైన వైద్యం అందించాలనే ఉద్దేశ్యముతో శ్రీ రామకృష్ణ మిషన్ ఆధ్వర్యములో గిరిజన సంచార వైద్యశాల ప్రారంభమైనది. ప్రస్తుతం ఇద్దరు డాక్టర్లు, ఎనిమిది మంది సిబ్బందితో గిరిజనులకు సేవలు అందిస్తోంది. ఎక్స్-రే, ఇ.సి.జి., స్కానింగ్, లాబ్ వంటి అధునాతన సౌకర్యములు కూడా గలవు. వైద్య బృందం గురువారం నుండి ఆదివారం వరకు నాలుగు రోజులు నాలుగు ప్రాంతాల్లో గిరిజనులకు వైద్యసహాయం అందిస్తోంది. రాజమండ్రి నుండి 53 కిలోమీటర్ల దూరంలో గల రంపచోడవరంలోని ITDA క్వార్టర్స్‌లో వైద్యబృందం బసచేస్తుంది. దేవీపట్నం మండలంలో పోతవరం, దామనపల్లి; గంగవరం మండలంలో జడేరు; రంపచోడవరం మండలంలో సిరిగిందలపాడు మొదలగు ప్రాంతాలలో సేవలు అందిస్తున్నాము. ఈ నాలుగు క్యాంపులలో ప్రతివారం సుమారు 200 గ్రామాలు నుండి 1600 మంది రోగులు వచ్చి మిషన్ యొక్క సేవలతో ఉపశమనం పొందుతున్నారు. 2006 ఏప్రిల్ నుండి 2007 మార్చి వరకూ 66,753 మంది రోగులకు ఉచిత వైద్య సేవలందించాము.

## లాబొరేటరీ :

రంపచోడవరంలోని బేస్ క్యాంప్‌లో అధునాతన సౌకర్యములతో లాబొరేటరీ సదుపాయం ఉన్నది. మిగిలిన ప్రాంతాల్లో కూడా రక్తపరీక్షలు (HB, TC, DC, ESR, MP Widal, VDRL, RBS, RA Factor, H.I.V, HB's Ag, Sputum, AFB, Manotux,) యూరిన్ ఆల్బుమిన్, షుగరు, మైక్రో, బైల్‌సాల్ట్‌లు, బైల్‌పిగ్‌మెంట్స్, ప్రెగ్నన్సీ మొదలైన పరీక్షలన్నీ లాబొరేటరీలో జరిపి వ్యాధినిర్ధారణ జరుగుచున్నది.

## క్షయవ్యాధి చికిత్స :

గిరిజన ప్రాంతాల్లో క్షయవ్యాధి ఎక్కువగా ఉంది. పేదరికం వలన వారికి సరైన వైద్యసదుపాయం అందక ఎంతో మంది క్షయవ్యాధితో పెద్దలు, పిల్లలు బాధపడుతున్నారు. వీరికి ఉచితముగా వైద్య సౌకర్యములు అందించి వారికి పూర్తిగా తగ్గేవరకు మా పర్యవేక్షణలో ఉంచుతున్నాము. ప్రస్తుతం సంవత్సరానికి 310 మంది క్షయరోగులకు చికిత్స నందిస్తున్నాము. క్షయరోగులకు రాజమండ్రిలో గల ప్రముఖ వైద్యుల పర్యవేక్షణలో చికిత్స నందిస్తున్నాము. 2006 నుండి 2007 సం॥లో 150 మందికి క్షయవ్యాధి నివారణ అయినది. మిగిలిన రోగులు చికిత్స పొందుచున్నారు. వ్యాధి తీవ్రత తగ్గింది.

## క్షయరోగులకు సంవర్థక ఆహారము :

క్షయరోగులు చికిత్సతో పాటు పోషక ఆహారాన్ని తీసుకోవాలి. సాధారణంగా గిరిజనులు పోషకఆహార లేమితో బాధపడుతుంటారు. కాబట్టి చెన్నై TB Research Centre వారి ఫార్ములా ప్రకారం ఆశ్రమములో తయారు చేయబడిన పోషక ఆహార పొడిని తగు మోతాదులో రోగులకు అనుదినం తీసుకోవడానికి అందిస్తున్నాము.

## మెగా మెడికల్ క్యాంపులు :

సంచారవైద్యశాల వారానికి నాలుగు రోజులు చికిత్సతోబాటు మూడు నెలలకు ఒకసారి నిర్వహించే మెగా మెడికల్ క్యాంప్‌లో రాజమండ్రి నుండి 20 మంది ప్రముఖ వైద్యులు వెళ్ళి గిరిజనులకు సేవలు అందిస్తున్నారు. సుమారు 1000 మంది ఈ క్యాంప్ ద్వారా ఉచితంగా లబ్ధిని, ఉపశమనాన్ని పొందుచున్నారు.

## నెలావారి క్యాంపులు :

నెలకోసారి ENT, డెంటల్, గైనిక్, పాథాలజిస్టు, సోనాగ్రఫిస్టులు గిరిజన రోగులను పరీక్షచేస్తున్నారు.

## గిరిజనులకు కంటి పరీక్షలు :

మెగాక్యాంప్‌లో కంటి పరీక్షలు కూడా చేసి, అవసరమైన రోగులను రాజమండ్రికి తీసుకొని వచ్చి, ఉచితంగా ప్రైవేటు ఆసుపత్రిలో ఆపరేషన్ చేయిస్తున్నాము. రోగులకు, వారితో వచ్చిన సహాయకులకు ఉచితంగా నిత్యావసరాలు సమకూరుస్తున్నాము. ఆపరేషన్ తరువాత రోగులకు కళ్ళజోళ్ళు ఉచితంగా ఇవ్వబడుచున్నవి.

## ఆపరేషన్‌లు :

నెలకోసారి సర్జను రోగులను పరీక్ష చేస్తారు. ఆపరేషన్ అవసరమైన వారిని రాజమండ్రి తీసుకువచ్చి ఆపరేషన్ జరిపిస్తున్నాము. నిత్యావసర ఖర్చులు మిషన్ భరిస్తుంది.

**సంవత్సరానికి అయ్యే ఖర్చులు**
**రూపాయలలో**

| | |
|---|---:|
| మందులు | 10,000,000.00 |
| జీతాలు | 4,80,000.00 |
| వాహనముల ఖర్చు | 70,000.00 |
| క్షయవ్యాధి రోగులకు పోషకాహారం | 25,000.00 |
| ముద్రణ తదితరాలు | 10,000.00 |
| కంటి పరీక్ష శిబిరాల ఖర్చు | 5,000.00 |
| మెగా క్యాంపులు (4) | 25,000.00 |
| రిపేరు పనులు | 4,000.00 |
| కరెంటు ఖర్చులు | 3,000.00 |
| పోస్టు మరియు టెలిఫోన్ ఖర్చులు | 2,000.00 |
| చిల్లర ఖర్చులు | 1,000.00 |
| పారిశుద్ధ్యపు ఖర్చులు | 1,000.00 |
| మొత్తం ఖర్చులు | 16,26,000.00 |





వాస్తవంగా అయ్యేఖర్చు, ప్రభుత్వం అందిస్తున్న సహాయం కంటే మించిపోవుచున్నది. అనారోగ్యముతో బాధపడుచున్న పేద గిరిజనులకు ఇంకా మెరుగైన వైద్యసేవలు అందించాలనే ఉద్దేశ్యముతో, ఆశయముతో పైన వివరించిన సేవల కొరకు దయార్ద్ర హృదయులైన ప్రజలు విరివిగా విరాళాలు ఇచ్చి మీ వంతు సహకారము అందించవలసినదిగా కోరుచున్నాము. మీ విరాళాలను 'శ్రీరామకృష్ణ మిషన్, రాజమండ్రి' పేరిట చెక్కులు, డ్రాఫ్టుల రూపంలో 'సెక్రటరీ రామకృష్ణ మిషన్, వివేకానంద రోడ్, రాజమండ్రి – 533 105' అనే చిరునామాకు పంపవలసిందిగా కోరుతున్నాం. మీరిచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80G క్రింద పన్ను మినహాయింపు కలదు.

భగవత్సేవలో
**స్వామి అక్షరాత్మానంద**
కార్యదర్శి

(గత సంచిక తరువాయి...)



# మనసు - మర్మం

- శ్రీరామ్

కొద్ది సేపటి క్రితమే తాను ఒక వ్యక్తితో గొడవపడటం డావెన్సీకి స్ఫురించింది. ఆ వ్యక్తి పట్ల ఉన్న కోపం, ద్వేషమే ఇప్పుడు తన అశాంతికి కారణమని గుర్తించాడు. వెంటనే వెళ్ళి ఆ వ్యక్తికి మనస్ఫూర్తిగా క్షమాపణ చెప్పాడు. తిరిగి వచ్చి చిత్రాన్ని సంతృప్తికరంగా పూర్తి చేశాడు.

## వెలుగులో వెదికితే...

మానసిక సమస్యలతో సతమత మవుతున్నప్పుడు కొందరు వ్యక్తులు ధ్యానాన్ని పరిష్కారంగా ఎంచు కుంటారు! ప్రాపంచికతలో కోల్పోయిన మనశ్శాంతిని ధ్యానంలో పొందాలను కుంటారు! చీకట్లో పోగొట్టుకున్న వస్తువుని వెలుగులో వెదికినందు వల్ల ప్రయోజనం ఏమిటి? అశాంతితో అలమటించే వారు దాని మూలాలు ఎక్కడ ఉన్నాయో కనుగొనాలి. సాధారణంగా వారు తమ జీవనశైలిని మార్చుకునే ప్రయత్నం చేస్తే ప్రశాంతత వారి జీవితాల్లోకి ప్రవేశిస్తుంది. అదికూడా ఒక రకంగా మనో నిగ్రహాన్ని అభ్యసించడమే! ఆ విధంగా కొంత అశాంతిని దూరం చేసుకున్న తరువాతే ధ్యానం చేసేందుకు వారు సిద్ధమవగలరు!



## నిగ్రహానికి నాంది!

## మనో నిగ్రహానికి మొదటి మెట్టు...

అందుకు "ఆత్మ విమర్శ" చేసుకోవడం ఎంతో ప్రయోజనకరంగా ఉంటుంది. ఇతరుల తప్పులెన్నేందుకే మనసు ఎల్లప్పుడూ ఉరకలు వేస్తుంది. మనలోని ఈ విమర్శనాత్మక ధోరణిని మన వైపే తిప్పుకోవాలి. మనసుకు ఎదురీదటం అంటే ఇదే! ఆత్మ విమర్శతో మన తప్పుల్ని గుర్తించి పశ్చాత్తాపం చెందాలి. వీలైతే వాటిని సవరించుకొనే ప్రయత్నం చేయాలి. ఎన్నో సమయాల్లో మన శక్తి సామర్థ్యాలపై మనకుండే అపోహలే మానసిక సమస్యలకు మూలకారణాలు అవుతాయి. మనల్ని మనం గొప్పగా చిత్రించుకోవడానికి వృథా చేసే శక్తిలో ఎంతో కొంత శక్తిని ఉపయోగిస్తే చాలు! మనం స్వయంగా గొప్పవాళ్ళమే కావచ్చని స్వామి వివేకానంద చెబుతారు. అందుకోసం మొదట మనల్ని మనం సరిగా అంచనా వేసుకోవాలి. మనం పరిపూర్ణులమనే భ్రమను వీడి మనలోని అపరిపూర్ణత్వాన్ని గుర్తించగలగాలి. దాన్ని ఎల్లప్పుడూ జ్ఞాపకముంచు కోవాలి. అప్పుడు మనసు ఉద్ధృతి చాలా వరకు తగ్గు ముఖం పడుతుంది. c



నిగ్రహానికి నాంది - ఆత్మవిమర్శ!

## అహంకారమే అవరోధం...

సుప్రసిద్ధ గ్రీకు తత్త్వవేత్త సోక్రటీస్ తన వద్ద శిష్యరికం చేయాలని వచ్చేవారికి ఒక విచిత్రమైన పరీక్ష పెట్టేవాడు. వారిని దగ్గరలో ఉన్న కొలను దగ్గరకు వెళ్ళి, దాంట్లోకి తొంగి చూడమనే వాడు. వారు గమనించిన విషయాన్ని బట్టి తన శిష్యులను ఎంపిక చేసుకొనే వాడు! ఒకనాడు ఆయన శిష్యులలో ఒకరు ఇదే విషయాన్ని భయం, బిడియం లేకుండా సోక్రటీస్ వద్ద ప్రస్తావించాడు! ఆ కొలనులో ఏదైనా రహస్యం ఉందా? అని తన సందేహాన్ని వ్యక్తం చేశాడు! "అవును నాయనా! గొప్ప ఆధ్యాత్మిక తత్త్వం ఆ కొలనులో దాగి ఉంది! కొలనులో చేపలు కనిపించాయని చెప్పిన వారినే నేను శిష్యులుగా స్వీకరిస్తాను! తమ ప్రతిబింబాన్ని చూశామని చెప్పిన వారిని తరువాత రమ్మంటాను! ఎందుకంటే వారికి తమ గొప్పదనాన్ని గురించిన ఎరుకమాత్రమే ఉంది! అలాంటి అహంకారులు జీవితంలో శాంతిని సాధించడం కష్టం!" అని సోక్రటీస్ తనదైన శైలిలో సమాధానమిచ్చాడు.

తమ ప్రత్యేకతలతో పాటు లోపాలను కూడా గుర్తించే వినయవంతులే సంతోషంగా జీవితాల్ని సాగించగలరు. జీవితంలో ఎన్ని ఒడిదుడుకులు ఎదురైనా ప్రశాంతంగా వారు అధిగమిస్తారు. అహంకారులను పట్టిపీడించే మానసిక సమస్యలు వారికి అత్యంత తక్కువగా ఉంటాయి! c

# స్వప్రయత్నమా? ప్రారబ్ధమా?

కె. శ్రీనివాస్

నిజమైన ఆధ్యాత్మికత నిత్య జీవితానికి వ్యతిరేకమేమీకాదు. అసలు సిసలైన ఆధ్యాత్మపరులే జీవితాన్ని పరిపూర్ణంగా ఆస్వాదించగలరు. అలాంటి ఆధ్యాత్మిక స్థాయిని అందుకోవాలంటే మన వ్యక్తిత్వాలు సంపూర్ణంగా వికసించాలి. అందుకు అడ్డుపడే మన అహంకారాలను, ఆత్మన్యూనతలను అధిగమించాలి. అహంకారం ఆవరించిన వారు తమ సామర్థ్యాన్ని అతిగా అంచనా వేసుకుంటారు. ఆకాశానికి నిచ్చెనలు వేస్తూ శక్తికి మించిన పనుల్ని తలకెత్తుకుంటారు. అలాంటివారి జీవితాల్లో సహజంగానే అసంతృప్తి రాజ్యమేలుతుంది! ఆత్మన్యూనతతో బాధపడేవారు తమ సహజ శక్తుల్ని విస్మరిస్తారు. వారికి ప్రపంచమంతా ప్రతికూలంగానే కనిపిస్తుంది. ఆత్మ విశ్వాసాన్ని కోల్పోయి ఎదురుగా ఉన్న అవకాశాలను సైతం వారు అంది పుచ్చుకోలేరు! తెలిసో తెలియకో మానసిక స్థాయిలో ఈ అవరోధాలను దాటితే పరిస్థితులను ఉన్నవి ఉన్నట్లుగా అంచనా వేయగలం! అప్పుడు అనంత ఆనంద సామ్రాజ్యం మన సొంతమవుతుంది. ఇలాంటి వ్యక్తిత్వ వికాస విశేషాలను అర్థం తెలియకపోయినా అందరూ ఆచరించి లాభం పొందాలనుకొనే వారు మన మహర్షులు. అందుకే వాటిని మన ఆచార వ్యవహారాలలో పొందుపరిచేవారు. ఆ ప్రయత్నంలో భాగంగానే కర్మ సిద్ధాతం రూపొంది ఉండవచ్చు.!

## విధి ఉందని ఒప్పుకుంటే...

మనమంతా వేరు వేరు శక్తులతో జన్మించాం. ప్రతివారికీ పుట్టుకతోనే మానసికంగా, శారీరకంగా కొన్ని పరిమితులు ఉన్నాయి. వాటిని జయించే ముందుగా అవి ఉన్నాయని గుర్తించాలి. కానీ చాలామంది తమ బలహీనతలను గుర్తించినా వాటిని అంగీకరించరు. కొంతమంది వాటినే తలుచుకుంటూ కుమిలిపోతారు. మరికొంత మంది వాటిని కప్పిపుచ్చుకునే ప్రయత్నంలో మరింత మనోవ్యధను కొనితెచ్చుకుంటారు. వారి ఆత్మ న్యూనతా భావం అనేక మానసిక రుగ్మతలుగా రూపుదాలుస్తుంది.!

(గత సంచిక తరువాయి...)

విధి ఉందని ఒప్పుకుంటే ఈ పరిస్థితిని అధిగమించవచ్చు! మనకున్న పరిమితుల్ని మన ప్రారబ్ధంగా మనస్ఫూర్తిగా అంగీకరించాలి. అప్పుడే వాటి బాధ నుండి బయటపడగలం. లోపాల్ని గురించి చింతించడం మానేసి లోపల ఉండే శక్తులపై దృష్టి సారించగలం. వాటి సహాయంతో విజేతలుగా అవతరిస్తే... ఇదివరకు లోపాలుగా కనిపించిన విషయాలే ఇప్పుడు విజయ సోపానాలుగా శోభిస్తాయి. పైవిధంగా మనల్ని ప్రోత్సహించేందుకే ప్రారబ్ధమనే భావన ఉద్భవించి ఉండవచ్చు.! అంతే కానీ మనల్ని పాటుపడకుండా ఆపేందుకు కాదు!

## విధిని అంగీకరిస్తే విజయాలా?

మానసికంగా, శారీరకంగా దృఢంగా ఉన్న కుశాగ్ర బుద్ధులు సైతం తమ సామర్థ్యంపై పరిపూర్ణ విశ్వాసాన్ని ఉంచరు. చిరస్మరణీయమైన విజయాలను సాధించేందుకు కేవలం స్వశక్తి మాత్రమే సరిపోదని వారికి తెలుసు. ఎందుకంటే గెలిచి తీరాలన్న తీవ్రమైన తపనలో తెలియకుండానే తప్పులు చేసే అవకాశం ఉంది. అందువల్ల వారెప్పుడూ ఫలితాలు తమ చేతిలో లేవని మనస్ఫూర్తిగా నమ్ముతారు.

### శాంతి, శక్తుల సమన్వయం...



స్వప్రయత్నాన్ని శక్తి మేరకు చేస్తూనే, అన్నీ ప్రారబ్ధం ప్రకారమే జరుగుతాయని చెప్పే ఒక మహాపురుషుడు మనకు మహాభారతంలో కనిపిస్తాడు. ఆయనే శ్రీకృష్ణుడు. అన్నికార్యాలను చక్కబెడుతూనే, నేనేమీ చేయడం లేదని ఆయన అనటంలోని ఆంతర్యాన్ని మనం గ్రహించాలి. జయాపజయాలకూ, సుఖదుఃఖాలకూ అంటకుండా జీవిత సంగ్రామాన్ని సాగించటమెలాగో శ్రీకృష్ణుని చూసి నేర్చుకోవాలి. అప్పుడే శాంతంగా ఉంటూ మనలోని సర్వశక్తుల్నీ ఉపయోగించుకోవడం ఎలాగో మనకు తెలుస్తుంది. c

మనసులోని ఆందోళన అధికం కాకుండా జాగ్రత్త పడతారు. అంతేతప్ప పొరపాటునైనా ప్రయత్నం సాగించడాన్ని ఆపరు.

ప్రపంచ ప్రసిద్ధులైన మేధావులందరూ తమ ఘనకార్యాలను విధికి (భగవంతుడికి) ఆపాదిస్తారు! దాని అర్థం విధి (భగవంతుడు) వీరిపట్ల పక్షపాతంతో వ్యవహరిస్తుందని కాదు! వారు అసలు ప్రయత్నమే చేయలేదనీ కాదు! ఏయే సందర్భాలలో వారు ఫలితాలను అప్రయత్నంగా విస్మరించారో... చేస్తున్న పనిలో పూర్తిగా నిమగ్నమయ్యారో... తమ సర్వశక్తుల్నీ అత్యద్భుతంగా ఆవిష్కరించారో... ఆయా సమయాల్లో వారు అనితరసాధ్యమైన అద్భుతాలను సాధించారు.

**నిజమైన విజేతలు...**

ప్రారబ్ధ సిద్ధాంతం పని చేయవద్దని ఎప్పుడూ చెప్పదు! నిజానికి శక్తి కొద్దీ శ్రమించని వారికి అది ఎలాంటి సహాయమూ చేయలేదు! అందుకే లక్ష్యసాధనకై శ్రమించేప్పుడు స్వప్రయత్నాన్నే నమ్మాలి. ఫలితాలను స్వీకరించేప్పుడు వాటితో ప్రభావితం కాకుండా ఉండాలి. గెలుపే గమ్యం కాదనీ, ఓటమీ ఓ పాఠమే అనీ గుర్తుంచుకోవాలి. విజయం వస్తే "నా వల్లే" అని విర్రవీగకుండా, అపజయమొస్తే బాధలో మునిగి భవిష్యత్తును విస్మరించకుండా ఉండేందుకు విధి, ప్రారబ్ధం, ప్రాప్తం అనే భావాలు మనకు ఉపకరిస్తాయి. నిరంతరం సాగే జీవన పోరాటంలో జయాపజయాలు చిన్నచిన్న మజిలీలే! గెలుపు, ఓటముల్ని సమానంగా స్వీకరించేవారే జీవితాన్ని జయించే నిజమైన విజేతలు! c

## అసలు రహస్యం..

ఒకరోజు మొఘల్ చక్రవర్తి అక్బర్, అతని ఆస్థాన సంగీత విద్వాంసుడు తాన్‌సేన్ రాజభవనం వసారాలో పచార్లు చేస్తున్నారు. అదే సమయంలో అటుగా వెళుతున్న భిక్షగాడి గానం వారికి వినిపించింది. భక్తిలో మునిగి అతడు చేస్తున్న అమర గానంతో అక్బర్ మైమరచి పోయాడు. భిక్షగాడు వెళ్ళిపోయిన తరువాత "ఇతడి గానంలో ఏదో మాధుర్యం ఉంది తాన్‌సేన్! ఎన్నో రోజులుగా మీ సంగీతాన్ని వింటున్నా నాకు ఇలాంటి అనుభూతి కలుగలేదే!" అని అక్బర్ తన ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు. "అవును ప్రభూ... నేను మీ నుండి బహుమతుల్ని ఆశించి గానం చేస్తాను. కానీ అతడు ఆశ అన్నదే లేకుండా గానం చేస్తున్నాడు. అదే తేడా!" అని తాన్‌సేన్ అసలు రహస్యాన్ని వివరించాడు.

అవును...! ఫలితాల్ని గురించి చింతించడం మానేస్తే పనిలో పూర్తిగా నిమగ్న మవుతాం. అప్పుడు మనలోని మొత్తం శక్తి బయటికి వస్తుంది. ఫలితాలు కూడా ఆశించిన దాని కన్నా అధికంగానే వస్తాయి. అందుకే మనం నిమిత్తమాత్రులమని మనస్ఫూర్తిగా విశ్వసిస్తూ ప్రయత్నాన్ని పూర్తి స్థాయిలో కొనసాగించాలి. c



విధిని విశ్వసించడం ఆందోళనను తగ్గిస్తుంది.

## ఆటను ఆస్వాదించేవాడు....

ఫలితాలను గురించి విపరీతంగా ఆలోచించేవారే తీవ్రమైన ఆందోళనకు గురవుతారు. అప్పుడు వారు తమ సహజ శైలిలో పని చేయలేరు. ఎంతగొప్ప వైద్యులైనా దగ్గరి బంధువులకు వైద్యం చేయాల్సివస్తే వెనకాడతారు. ఫలితం ఏమవుతుందో అనే భయం వారి మనసులో అలజడి రేపుతుంది. చదరంగాన్ని ఆడేవారి కన్నా, ఆటను గమనిస్తున్న వారికే మంచి ఆలోచనలు వస్తాయని ప్రతీతి! ఎందువల్ల? గెలుపే గమ్యంగా ఆడే ఆటగాడి అంతరాంతరాళాల్లో ఓటమి భయం ఉండనే ఉంటుంది! ఆ ఒత్తిడి మూలంగా అతడిలో సహజంగా కనిపించే నైపుణ్యం ఆ సమయంలో కనుమరుగవుతుంది. అందువల్ల అతడు పూర్తి స్థాయిలో తన శక్తులను ప్రదర్శించలేక పోవచ్చు! గెలుపు, ఓటముల్ని విధికి వదిలేసి, వాటితో నిమిత్తం లేకుండా ఆటను ఆస్వాదిస్తున్న ప్రేక్షకుడికి అత్యుత్తమ ఆలోచనలు రావడంలో ఆశ్చర్యం ఏముంది? c



మహనీయుల జీవితాల్లో
# మధురఘట్టాలు
- ఆర్.కృష్ణ

## కులం కంటే గుణం గొప్పది!



తిలకం ధరించి రైలులో ప్రయాణం చేస్తున్న ఒక వ్యాపారి భోజనం చేసేందుకు సిద్ధమవుతూ తన ముందు ఖద్దరు దుస్తుల్లో ఉన్న ఒక నాయకుణ్ణి చూశాడు. "మహాశయా! మీది ఏ కులం?" అని ప్రశ్నించాడు.

"ఏదైనా కులానికి చెందిన వాడనైతేగదా నా కులం చెప్పడానికి" అన్నాడు ఖద్దరు ధరించిన వ్యక్తి. వ్యాపారి అదే ప్రశ్నను పదేపదే అడగసాగాడు. అప్పుడా వ్యక్తి ఉద్రేక పడకుండా ఇలా అన్నాడు."సేఠ్‌జీ! మీకు అంతగా కావాలంటే వినండి".

"ఉదయం ఇల్లు, దొడ్డి శుభ్రం చేసుకునేటప్పుడు నేను పాకీవాణ్ణి. చెప్పులు శుభ్రం చేసుకునేటప్పుడు చర్మకారుణ్ణి. బట్టలు ఉతుక్కునేటప్పుడు చాకలిని. డబ్బులెక్క చూసుకునేటప్పుడు కోమటిని. కాలేజీలో పాఠం చెప్పేటప్పుడు బ్రాహ్మణుడిని. అన్యాయాన్ని ఎదిరించేటప్పుడు క్షత్రియుణ్ణి. ఇప్పుడు నా కులమేదో మీరే నిర్ణయించండి" అన్నాడు.

ఈ సమాధానం విని రైలు పెట్టెలో ఉన్న ఇతర ప్రయాణీకులు కూడా ఆనందించారు. ఇంతలో తదుపరి స్టేషను వచ్చింది. ఆ నాయకుడికి స్వాగతం పలికేందుకు అధిక సంఖ్యలో వచ్చిన ప్రజలు ఆయనకు పూలమాలలు వేసి పాదాభి వందనాలు చేయసాగారు.

సేఠ్‌జీ ఆశ్చర్యపోయాడు. ఆ నాయకుడు ఎవరో కాదు 'ఆచార్య జె.బి.కృపలానీ' అని తెలుసుకుని చాలా సిగ్గుపడ్డాడు. తనను క్షమించమని చేతులు జోడించి వేడుకున్నాడు. "వృథాగా కులం గురించి ఆరాలు తీయడం మానండి మనిషి గుణాన్ని బట్టి గౌరవించడం నేర్చుకోండి" అని కృపలానీ అతనికి హితవు పలికాడు. c

## మదర్ మనసు కరిగిన వేళ!

'మానవసేవే మాధవసేవ' – అనే భగవద్గీతా సారాన్ని ఆచరణలో పెట్టి 'విశ్వమాత'గా, ప్రపంచ మన్ననలను పొందిన మహామనీషి మదర్ థెరెసా.



1910లో, యుగొస్లేవియాలో పుట్టిన థెరెసా, తల్లితండ్రులు ఆల్బేనియన్‌లు. ఆమె అసలు పేరు ఆగ్నస్. ఒకసారి ఆమె, స్కూలు నుంచి వస్తుండగా, దారిలో ఆమె హృదయాన్ని కలచివేసిన ఒక సంఘటన జరిగింది. ఆమె లేతమనసు బాధతో తల్లడిల్లి పోయింది. రోడ్డుప్రక్కన పడుకుని వున్న చిన్న కుక్కపిల్ల కాలు మీదగా ఒక మోటారు కారు వేగంగా పోయింది. బాధతో అరుస్తూ రక్తసిక్తమైన కాలుతో, నేలమీద పొర్లాడుతున్న ఆ కుక్కపిల్ల బాధను ఆ బాలిక చూడలేకపోయింది. దారినపోతున్న పెద్దవాళ్ళెవరూ దాని సంగతి పట్టించుకోవటం లేదు. మదర్ థెరెసా వెంటనే కార్యరంగంలోకి దిగింది. తన చేతి రుమాలుతో దాని రక్తాన్ని తుడిచి కట్టుకట్టింది. తరువాత దానిని ఒక పశువుల వైద్యుడి దగ్గరకు తీసుకెళ్ళి, మందు వేయించి, దాని బాధను నివారించే వరకూ ఆమె ఆగలేదు. తరువాత ఇంటికి ఆలస్యంగా వచ్చిన కూతుర్ని తండ్రి మందలించగా ఆమె జరిగిన సంగతి చెప్పింది.

ఈ సేవాగుణమే ఆమెను 1929లో భారతదేశంలో స్థిరపడేట్లు చేసింది. 1971లో బంగ్లా శరణార్థులకు, 1977లో ఆంధ్ర ప్రాంతంలోని దివిసీమ వాసులకు, అలాగే అసహాయులైన దీనులందరికీ 'మదర్'గా ప్రసిద్ధికెక్కి, 'నోబెల్ బహుమతి'తోపాటు, 'భారతరత్న' బిరుదుని కూడా పొందింది. c




-స్వామి పరిజ్ఞేయానంద

జి. సందీప్, హైదరాబాదు.

**ప్రశ్న :** యోగ సిద్ధులున్నాయా? అది నిజమే అయితే ఎలా సాధించాలి?

**జవాబు :** స్వామి వివేకానంద ప్రతి ఆధ్యాత్మిక విషయాన్నీ, తర్కంతో పరిశీలించి, నిరూపితమైతేనే స్వీకరించేవారు. వారు కూడా ఈ సిద్ధులను మొదట నమ్మలేదు. కానీ స్వయంగా ఎన్నో సార్లు సిద్ధుల్ని ప్రదర్శించే వారిని ఆయన కలుసుకొన్నారు. సిద్ధుల్ని గురించి స్వామి వివేకానంద 'రాజయోగం', 'మానసిక శక్తులు' అనే పుస్తకాలను చదవండి.

**జన్మ ఔషధి మంత్ర తపః సమాధిజాః సిద్ధయః**

(పతంజలి యోగసూత్రాలు)

'జన్మతః, ఔషధాలతో, మంత్ర శక్తితో, సాధనతో, ఏకాగ్రతతో సిద్ధుల్ని పొందవచ్చును'. రాజయోగంలో వివరించిన విధంగా, అర్హుడైన గురువువద్ద మనసుతో ప్రయోగం చేస్తే మీరు కోరిన ఫలితాలను పొందవచ్చు.

"ఒకడు ఎన్నో ఏళ్ళు సాధన చేసి నీటిపై నడిచే సిద్ధిని పొందాడట. ఒక అణా ఇస్తే నదిని దాటించడానికి పడవవాడు ఉన్నాడు. ఆ సిద్ధి కోసం ఎన్నో ఏళ్ళు సాధన చేసి విలువైన జీవితాన్ని వృథా చేయడం ఎందుకు? ఈ జన్మను భగవత్సాక్షాత్కారం కోసం వినియోగించడం ఉత్తమం"అని శ్రీరామకృష్ణులు అనేవారు.

ఆధ్యాత్మిక మార్గంలో పయనించే వారికి ఈ 'సిద్ధులు' ఒక 'డివిడెండ్లు' లాంటివి. ఆ డివిడెండ్ల లెక్కల చిక్కుల్లో పట్టుపడితే జీవిత లక్ష్యమైన 'భగవత్సాక్షాత్కారం' అనే 'ఇన్‌వెస్ట్‌మెంట్'ని మరచిపోయే ప్రమాదం ఉంది. అందుకే శ్రీరామకృష్ణ పరమహంస సిద్ధుల్ని సాధించడంతోనే సంతృప్తి చెందక ఆత్మజ్ఞానం కోసం ప్రయత్నించమని బోధించేవారు.

బి.వి.వి. ప్రసాద్, హైదరాబాదు.

**ప్రశ్న:** నేను గొప్ప ఉపన్యాసకుడిగా ఎదగాలని ఉంది! కానీ మాట్లాడబోతే ఏం చెప్పాలో గుర్తుకు రాదు!

**జవాబు :** ఉపన్యాసం ఇవ్వడం ఒక కళ! వక్తగా ఎదిగేందుకు మొదట సభాభయం (stage fear) పోవాలి. వివరించాలనుకున్న విషయంపై పూర్తి పట్టుండాలి. అన్నింటినీ మించి కావల్సింది ఆత్మ విశ్వాసం. ఈ మూడు లక్షణాలు ఉన్నవారెవరైనా మంచి ఉపన్యాసకులు కాగలరు!

ఇందుకు మీరు పుస్తకాలను చదవడం అలవాటు చేసుకోవాలి. మీ పరిజ్ఞానాన్ని పెంచుకోవాలి. చెప్పే విషయాన్ని సులభంగా అర్థమయ్యే రీతిలో చిన్న చిన్న కథలతో, ఆహ్లాదాన్నిచ్చే హాస్యగుళికలను జోడించి శ్రోతల్ని రంజింప చేయాలి. గొప్ప వక్తల ఉపన్యాసాలను వినాలి! వారి స్వరంలోని హెచ్చు తగ్గులను జాగ్రత్తగా గమనించి, అనుకరించే ప్రయత్నం చేయాలి! దాంతో శ్రోతలను మరింత ప్రభావితం చేయవచ్చు! చిన్నచిన్న సమావేశాల్లో ఉపన్యసించడం మొదలుపెడితే మీకున్న అన్ని భయాలు పోతాయి.

డెమస్తనీస్ కథ మీకు తెలిసే ఉంటుంది. ఆయనకు నత్తి! పైగా సభా భయం! కానీ గొప్ప ఉపన్యాసకుడిగా ఎదగాలనే తన ఆకాంక్షను నెరవేర్చుకొనేందుకు నోట్లో చిన్న చిన్న గులక రాళ్ళను వేసుకొని, సముద్ర తీరాన అలల హోరులో ప్రతి రోజూ రకరకాల ఉపన్యాసాల నివ్వడం అభ్యాసం చేసేవాడు! అలాంటి నిరంతర కృషితో క్రమంగా ఆయన ఒక అద్భుతమైన వక్తగా ఎదిగాడు! అలాంటి పట్టుదల ఉంటే మీరూ గొప్ప ఉపన్యాసకులుగా మారవచ్చు. ప్రయత్నించండి!


**మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :**

**యువవాణి**

శ్రీ రామకృష్ణప్రభ, రామకృష్ణమఠం,
దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
E- mail : rkprabhayuvavani@gmail.com

...16వ పేజీ తరువాయి.

## అదృశ్యంగా ఉండే అదృష్టం !

"అయ్యా! పక్క ఊరిలో ఉన్న మీ పెదనాన్నగారు అనారోగ్యంతో బాధపడుతున్నారు. మిమ్మల్ని వెంటనే తీసుకు రమ్మన్నారు" అని వచ్చిన పని చెప్పాడు. "నేనిప్పుడెంతో అవసరమైన పనిలో ఉన్నాను. రాలేనని వారికి చెప్పండి" అంటూ సీతయ్య తలుపు మూసేసాడు! రాత్రి గడిచినా సీతయ్య పూరిల్లు పెద్దభవంతిగా మారలేదు! రెండవ వరం కూడా ఫలించక పోవడంతో సీతయ్య విచారంతో కుంగిపోయాడు.

మరునాడు తన చివరి వరంగా లక్ష వరహాలు కావాలని కోరుకున్నాడు సీతయ్య. వరహాల మూటైతే ప్రత్యక్షం కాలేదు కానీ సాయంత్రం వేళకు ఇద్దరు దృఢకాయులు సీతయ్య ఇంటికి వచ్చారు. 'జమీందారు గారు నిన్ను ఉన్నఫళంగా తీసుకురమ్మన్నారు" అని గద్దించారు. సీతయ్యకు ముచ్చెమటలు పోశాయి. ఎందుకంటే కొన్ని రోజులు క్రితం అనుమతి లేకుండా, జమీలోని చెట్టు నరుకుతూ జమీందారుగారి కంటే పడ్డాడు సీతయ్య. పట్టుకోవాలని ప్రయత్నిస్తే, దొరక్కుండా తప్పించుకున్నాడు. కాబట్టి తనను శిక్షించేందుకే జమీందారు పిలుస్తున్నాడని సీతయ్యకు భయం వేసింది! వెంటనే తడబడుతున్న స్వరంతో "అయ్యా! మా పెదనాన్నకు ఆరోగ్యం బాగాలేదని కబురు వచ్చింది! జమీందారు గారిని తరువాత కలుస్తానని చెప్పండి!" అని వచ్చిన వస్తాదుల్ని వేడుకొన్నాడు. వారు సీతయ్య మాట నిజమే అనుకొని, జమీందారు గారికి చెప్పేందుకు వెళ్లారు. తన తెలివితేటలకు తానే మురిసిపోయాడు సీతయ్య. వరం ఎప్పుడు ఫలిస్తుందా? అని నిరీక్షించసాగాడు. రాత్రయినా సీతయ్యకు వరహాలు లభించలేదు.

మరునాడు తెల్లవారగానే సీతయ్య కోపంతో ఊగిపోతూ గొడ్డలి భుజాన వేసుకున్నాడు. వృక్షదేవత కనిపించిన చెట్టు వద్దకు బయలుదేరాడు. దాన్ని సమీపించగానే "అవివేకంతో ఇచ్చిన వరాలను వృథా చేసుకొని మళ్ళీ వచ్చావా సీతయ్యా!" అంటున్న దేవత కంఠస్వరం అతనికి వినిపించింది. "నీవిచ్చిన వరాల్లో ఒక్కటి గూడా ఫలించలేదు తల్లీ" అని సీతయ్య జరిగిన సంగతంతా పూసగుచ్చినట్లు చెప్పాడు. దేవత నవ్వి "పక్కింటి రాజయ్యతో మీకు విందు ఏర్పాటు చేయించాను. మరణించే ముందుగా మీ పెదనాన్న ఆస్తిని నీకు ఇచ్చే విధంగా ఆయన మనసు మార్చాను. జమీందారు గారి స్థలంలో నీవు కొట్టిన చెట్టు కింద ఆయనకు పది లక్షల వరహాల నిధి దొరికింది. అందులో ఒక లక్ష వరహాలు బహుమతిగా నీకివ్వాలనే బుద్ధి పుట్టించాను. నా మీద నీకు నమ్మకం లేదు. నీకు నచ్చిన విధంగానే కోరికలు తీరాలనే తెలివితక్కువతనంతో, అహంకారంతో అదృశ్యంగా వచ్చిన అవకాశాలనన్నింటినీ కాలదన్నుకున్నావు! ఇది నీ స్వయంకృతాపరాధం!" దేవత మాటలు విని సీతయ్య నోట మాట రాక కొయ్య బారిపోయాడు. తరువాత తేరుకొని "మరో మూడు వరాలియ్యి తల్లీ" అని అర్థించాడు. "అవకాశం వదిలితే తిరిగి రాదు సీతయ్యా! ఇకపై నువ్వు చేయాల్సింది నీ స్వశక్తిని నమ్ముకోవడమే! ఎండిన చెట్లను మాత్రమే నరుకు. పచ్చని చెట్ల జోలికి పోకుండా, వాటిని చక్కగా సంరక్షించు. నీ భుక్తికి ఏ లోటూ ఉండదు" అని ఆశీర్వదించి దేవత మాయమైంది.

తదనంతరం దేవత చెప్పిన విధంగా నడుచుకొంటూ తృప్తిగా జీవనం సాగించాడు సీతయ్య. c

## శ్రీరామకృష్ణ ప్రభ వార్షిక చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా! దిగువ పేర్కొన్న నెంబర్ల నడుమ ఉన్న సంవత్సర చందాదారుల చందా గడువు తీరిపోనుంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీ రామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.*

90001 - 91435 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2007 ఆగష్టు తో** తీరిపోనుంది!

100002 - 111658 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2007** సెప్టెంబర్ **తో** తీరిపోనుంది!

**శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్**

**గమనిక:**

1. **మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.**
2. **మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.**
3. **మీకు పత్రిక ప్రతి నెలా 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.**



# సత్సంబంధాలు నెలకొల్పటమెలా ?

- స్వామి సత్యరూపానంద

మానవుడు నిజానికి దివ్యస్వరూపుడని వేదవాక్కు. ఆ భావనతో సంబంధబాంధవ్యాలను కొనసాగిస్తే దుఃఖానికి, ఆశానిరాశలకు అతీతమైన ఆనందాల్ని పొందగలం.

**మా**నవుడు సంఘజీవి. పసిపాప నుంచి పండుముదుసలి వరకు ఏ దశలోనైనా సంబంధబాంధవ్యాలు అనివార్యం. అవి సానుకూలంగా ఉంటేనే జీవితానికి సార్థకత. అందుకే ఆ నైపుణ్యం కుటుంబం నుంచి మొగ్గతొడగాలి. అయితే సాధారణ స్థాయిలో మానవసంబంధాలన్నీ స్వార్థపూరితాలే; దాదాపు మానవీయతకు తావే ఉండదన్నది సుపరిచితం. విలువలు లోపించిన మానవసంబంధాలన్నీ మూన్నాళ్ళ ముచ్చటగానే మిగిలిపోతాయి. కనుకనే చాలా మందికి కొందరితో సంబంధాలు దుర్భరంగాను, తమ శక్తిని పీల్చి వేస్తున్నట్లు తోస్తాయి.

**ఉన్నత విలువలు... ఉత్తమ మార్గాలు...**

ఆరోగ్యకరమైన, పటిష్ఠమైన సంబంధాలకు ఉపయోగపడే ఆ ఉన్నత విలువలు ఏమిటన్నదే ప్రశ్న. మనకు మార్గదర్శకం చేయగల, ఎన్నటికీ మారని, స్థిరమైన, నిత్యమైన విలువలు అసలు ఉన్నాయా అన్నది తెలుసుకోటానికి మానవ వ్యక్తిత్వం, దాని వివిధ కోణాలను అర్థం చేసుకోవాలి. మనిషి వ్యక్తిత్వానికి పలు కోణాలుంటాయి. ఇది నిత్య జీవితంలో మనకు అనుభవైకవేద్యమే. మనుష్యులందరి స్వభావం ఒకేలా ఉండదు కదా! కొందరు ప్రశాంతచిత్తులు, మరికొందరు అశాంత చిత్తులు. మనిషంటే ఒక శరీరమే కాదు ఎన్నో ఉద్వేగాల, అనుభూతుల కలపోత. అందుకే మానసికకోణాన్ని స్పృశించని సంబంధాలన్నీ నిరర్థకాలే. ఈ భౌతిక, మానసిక సంబంధాలని మించినది, దివ్యమైనది ఆత్మసంబంధం.

**అనుబంధాలు... అవసరాలు....**

మనిషి ఉనికి ఎన్నో సామాజిక, ఆర్థిక సహాయ సహకారాలపై ఆధారపడి ఉంటుంది. అంతేకాక, ఇతరులను ప్రేమించాలి, వారితో సంబంధం కలిగి ఉండాలనే ఆకాంక్ష ప్రతీ హృదయంలోనూ వేళ్ళూనుకొని ఉంటుంది. మనిషికి తినటానికి తిండి ఉన్నంత మాత్రాన సరిపోదు కదా! మరెన్నో అవసరాలుంటాయి. అన్నింటికీ మించి ప్రేమించటం, ప్రేమను పొందటం. అది తల్లి ప్రేమ నుంచి బిడ్డల ఆదరణ వరకు. ప్రతి మానవసంబంధం వెనుక ఉన్న ఉద్దేశం ఆనందప్రాప్తి. ఆ లక్ష్యంతో ఇతరులతో కలకాలం నిలిచే, చక్కటి సంబంధం కలిగి ఉండాలంటే అవతల వ్యక్తి కూడా ఒక మనిషేనని గుర్తుపెట్టుకోవాలి. మనం ఏర్పరచుకునే బాంధవ్యాల వెనుక ఉండే ఉద్దేశాన్ని ఎప్పటికప్పుడు సమీక్షించుకుంటూ ఉండాలి. పూర్తిగా స్వార్థపూరితమైతే ఆ సంబంధం ఎక్కువకాలం నిలవదు సరికదా, వేదనాభరితం, దుఃఖపూరితం అవుతుంది. నిజానికి స్వార్థ సంబంధం ఒక సంబంధమే కాదు. అవతల వ్యక్తిని తన స్వప్రయోజనానికి వాడుకునే వ్యాపారమది. ఉదాహరణకు భార్యాభర్తల మధ్య పరస్పర గౌరవం, త్యాగబుద్ధి లేకపోతే ఆ బాంధవ్యంలో సుఖముండదు. అది బెడిసి కొడుతుంది. అలా ఉద్రిక్తభరితమైన జీవితాలు గడపుతున్న దంపతుల మధ్య నిజమైన ప్రేమ ఉండదు. ఇద్దరూ వారి వారి స్వార్థాన్నే కోరుకుంటారు. స్వార్థం భౌతికసుఖం, మానసిక దోపిడీ మాత్రమే కాదు, తన అహంకారాన్ని పోషించుకొనే ప్రయత్నం కూడా. మానవ సంబంధ బాంధవ్యాలు బెడిసికొట్టటానికి ప్రధాన కారణం అహంభావం.

**ఆత్మీయతలు... ఆనందతీరాలు...**

కాబట్టి చక్కటి, చిక్కటి బాంధవ్యానికి ఆధారం ప్రేమ. అది కేవలం భావోద్వేగం కాదు. మానవుని దివ్యత్వాన్ని ప్రతిబింబించే మహోన్నతస్థితి అది. ఇవ్వటమే కాని తిరిగి పొందాలనే భావన ఉండదు. మీరు నాపై ఇంత ప్రేమ కురిపిస్తున్నారు, చివరకు జడభరతునికి పట్టిన స్థితే మీకూ వస్తుందన్నారట స్వామి వివేకానంద శ్రీరామకృష్ణులతో. తాను పెంచుకున్న లేడిపై ఉన్న అనురాగం మూలంగా జడభరతుడనే ఋషి మరుజన్మలో లేడిగా పుట్టాడని ఒక పురాణగాథ. శ్రీరామకృష్ణులు చిరునవ్వుతో 'నేను నీలో నారాయణుణ్ణి చూస్తున్నాను. కాబట్టి నీపై నాకింత ప్రేమ' అన్నారు. బాంధవ్యాన్ని చిరస్థాయిగా నిలబెట్టగలిగేది ఈ విధమైన ప్రేమ మాత్రమే.

వ్యాకోచమే జీవనం, సంకోచమే మరణం అన్నారు స్వామి వివేకానంద. మనిషి శారీరక ఎదుగుదలకు హద్దు ఉంటుంది. కానీ హృదయ వైశాల్య వ్యాప్తికి అంతులేదు. అదే మనసులోని సంకుచితత్వాన్ని, అన్ని రకాల అడ్డుగోడలను ధ్వంసం చేయగలదు. అప్పుడు మనం ప్రేమిస్తున్న వ్యక్తితో మనం మమేకం కాగలం.

**ప్రేమసాధన... పవిత్రభావన...**

మనలో సాధారణంగా చాలామంది బాహ్యరూపం, ఆర్భాటాలు, స్వప్రయోజనాలు ... వీటి ఆధారంగానే సంబంధాలు పెట్టుకొని ప్రేమ భావనను సంకుచిత పరుస్తున్నాం. నిజమైన మానవసంబంధాలు హృద యాల్ని విశాలపరచాలి. స్వామి వివేకానంద తన భక్తియోగం ఉపన్యాసాల్లో 'భగవంతుని తప్పించి, మనం మరి దేనిపైనా విపరీతమైన మమత పెంచుకోకూడదు. అన్నీచూడు, అన్ని పనులు చేయి కాని వాటిపై మమత వద్దు. అమితమైన మమత మూలంగా మనిషి భ్రష్టుడవుతాడు. తన మనస్సుపైనా ఇంద్రియాలపైనా సంయమనం లేక బానిసగా బతుకుతాడు....ఒక వ్యక్తికి బానిసగా బతకటం కంటే ఉన్నతమైన విషయాలు ఈ ప్రపంచంలో ఎన్నో ఉన్నాయి. అందరినీ ప్రేమించు, అందరికీ మేలు చేయి కాని ఎవరికీ బానిస కాకు. ఒకటి, మమత మనల్ని దిగజారుస్తుంది, రెండవది మనల్ని అత్యంత స్వార్థపూరితులను చేస్తుంది. జనహిత కార్యాలపై తప్పించి మరి దేనిపైనా మమత వద్దు కానీ అందరికీ ప్రేమను పంచండి' అని హితవు పలికారు. మానవ సంబంధాలను ఏర్పరచు కోవటంలోని సారమింతే. ప్రధానమైన ఈ సత్యాలను నిర్లక్ష్యం చేసి, శాస్త్రవచనాలపై శ్రద్ధ చూపక పోతే మనం ఆనందప్రదమైన, శాశ్వత మానవ సంబంధాలను ఎన్నటికీ నిర్మించుకోలేము. ఆధ్యాత్మికంగా ఎదిగిన వ్యక్తులు అంటే తమ ఆత్మతత్త్వాన్ని వ్యక్తపరచటానికి ప్రయత్నించి సమస్త మానవాళితో మమేకం చెందగోరే వారు మాత్రమే నిజంగా ప్రేమించగలరు.

**నిత్యసంబంధం...నైతికత్వం...**

మనలోనూ, ఇతరులలోనూ అంతర్గతంగా ఉన్న దివ్యత్వాన్ని వికసింపచేయటమే ప్రతి ఉత్తమ సంబంధానికి లక్ష్యం కావాలి. ఒక సంబంధం కలకాలం నిలవాలంటే నైతిక జీవనం అత్యంతావశ్యకం. మరొక విధంగా చెప్పాలంటే, నిస్వార్థ ప్రేమ అనే ఇరుసు చుట్టూ మానవ సంబంధాలు పరిభ్రమించాలి.

భౌతికంగా మనం వేర్వేరు వ్యక్తులమైనా, మన అందరిలో ఉన్న ఆత్మ ఒక్కటే. కనుక మనమందరం ఒక్కటే. మన మధ్య కనపడుతున్న భేదాన్ని పూడ్చుకొని మనోనైర్మల్యంతో మానవ సంబంధాలు పెంచుకోవాలి.

ఇలాంటి సంబంధాలు నెలకొల్పటానికి మనం బాధ్యతా యుతంగా నడుచుకోవాలి. సంకుచిత స్వభావాన్ని విశాలం చేసుకొని, మన సంబంధాల్ని దివ్యంగా మార్చాలి. మనం సంబంధం లేదా బాంధవ్యం పెట్టుకున్న వ్యక్తిని మన ఇష్ట దైవంగా చూడాలి. అప్పుడు జీవితమంతా ఒక ఆరాధన కాగలదు. ఆరాధన అంటే మనలో ఉన్న దివ్యత్వాన్ని ప్రకటింపచేయడం. అవతల వ్యక్తిని మన ఇష్టదేవతగా చూసినప్పుడు మన జీవితం కూడా దివ్యం కాగలదు. సంబంధంలో ఒక మహోన్నత ఆదర్శాన్ని ఆచరించే ప్రయత్నం చేయకపోతే, వ్యామోహం అనే ఊబిలో పడి అంతులేని జననమరణాల వలయంలో చిక్కుకొనే ప్రమాదం ఉంది. a

**అనువాదం : డాక్టర్ కమల జయరావు**

# వర్తమానమే వాస్తవం

- రాము జలదుర్గం



మనిషి ఎదుర్కొంటున్న ఎన్నో సమస్యలకు గతంలో జరిగిన సంఘటనలకు సంబంధించిన ఒత్తిళ్ళూ, భవిష్యత్తుకు సంబంధించిన ఆందోళనలే కారణాలు. వర్తమానంలో జీవించడం, వర్తమానం గురించి మాత్రమే ఆలోచించడం, పనిని సంపూర్ణంగా ప్రేమించడం మనకు అసలు అలవాటులేని పద్ధతులు. జీవితమంటే ఇప్పుడు మనతో ఉన్న కాలమే అన్న అవగాహన చాలా అవసరం. తల్లి ఒడిలో ఆడుకుంటున్న పసివాడిని ఒక్కసారి గమనించండి, ఏ కారణం లేకుండానే తన కాళ్ళను చేతివేళ్ళను చూసుకుంటూ ఆనందంగా గడిపేస్తాడు. బహుశా గతం, భవిష్యత్తులంటే ఏమిటో తెలియని అమాయకత్వం కూడా కావొచ్చు.

**అవగాహన :** గతంలో జరిగిపోయిన తప్పులు, అవమానాలు, నిర్ణయాలు గురించి ఆలోచించడం మొదలుపెడితే మరోసారి ఆ బాధని అనుభవించడం తప్ప, గతంలోకి వెళ్ళి నిర్ణయాల్ని మార్చుకోవడం కుదరని పని కదా! అలాగే భవిష్యత్తులోకి ప్రయాణించి, రాబోయే పరిస్థితులు, ఎదుర్కొనబోయే ఇబ్బందులు, జరగబోయే సంఘటనలు, ఊహించుకున్న ప్రమాదాల గురించి ఆలోచిస్తే భవిష్యత్తుకు బంగారు బాటలు అటుంచి ఆందోళనతో కూడిన ముళ్ళబాటలో నడక సాగుతుంది. "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన... శ్రీకృష్ణుడు కర్మయందే నీకు అర్హత ఉందిగానీ, ఫలితమునందు నీకు అధికారం లేదనే ప్రబోధానికి గూడార్థం - 'వర్తమానం' గురించే. కర్మ వర్తమానాన్నీ, ఫలితం భవిష్యత్తునూ సూచిస్తాయి. భవిష్యత్తులో రాబోయే ఫలితాల్ని గురించి ఆలోచిస్తే, వర్తమానంలో నీ బాధ్యతను సంపూర్ణంగా నిర్వర్తించలేవని స్పష్టంగా వివరించాడు శ్రీకృష్ణుడు.

ఒక మహానుభావుడు చెప్పినట్లు గతం అనేది పెట్రోలు లేక ఆగిపోయిన కారులాంటిది. ఆగిపోయిందాన్ని ఎంత తోసినా, చేయినొప్పి తప్ప, కారు ముందుకు కదలదు. ఆ అనవసర ప్రయాసను పక్కన పెట్టి తక్షణ కర్తవ్యం చేపట్టడమే జీవితమంటే. గతం చెల్లని చెక్కు, భవిష్యత్తు గ్యారంటీ లేని ప్రామిసరీనోటు, వర్తమానం చేతిలో వున్న 'క్యాష్' లాంటిదని అందరికీ అర్థమయ్యేరీతిలో పలువురు ప్రవచించారు కూడా.

**జీవించడమెలా?** 1. మనలో చాలా మంది భవిష్యత్తులో జరగబోయే విషయాల గురించి అతిగా ఆలోచిస్తూ, వాటిని దిగులుగా మార్చుకుని అవే వారి సమస్యలుగా చెప్పు కుంటారు. నిజానికి దిగులుపడడం, ఆందోళన పడడం సమస్యలు కావు. సమస్యలకు పరిష్కారాలుంటాయి. కానీ దిగులుకు పరిష్కారం దిగులు పడకపోవడమే. ఆందోళనకు సమయం వెచ్చించే కంటే ప్రణాళికాబద్ధమైన పనిని ఎంచుకుని శ్రద్ధగా చేయడమే భవిష్యత్తుకు బంగారు బాట.

2. ఒక కారుకొంటే జీవితంలోకి సంతోషం వస్తుందనుకుంటే అనుకున్న కారు రాగానే మరో కంపెనీ కారు ఆకర్షిస్తుంది. ఉద్యోగం దొరికితే ఇక చింతలే ఉండవనుకున్న వ్యక్తి ఉద్యోగం రాగానే, తన అసంతృప్తికి కారణాలు వెతుక్కుంటాడు. అంతేకాదు, మరొక చోట తృప్తి దొరుకుతుందని తన ఆనందాన్ని వాయిదా వేసుకుంటాడు. ఆనందం వాయిదా వేసేది కాదు. సంతృప్తి ఈ క్షణంలో పొందలేని వారు మరోసారి పొందుతామనుకోవడం కేవలం భ్రమ. కాబట్టి వాయిదా మనస్తత్వం నుంచి బయట పడాలి.

3. ఒకవేళ ఈ ఆలోచనలతో మీరు ఒత్తిడికి గురి అవుతున్నట్లు అనిపిస్తే దీర్ఘమైన శ్వాసను తీసుకుని నేను బాగానే వుంటాను... బాగానే వున్నాను... బాగానే వుండబోతాను... అన్న సూచనలు మీ మనసుకు ఇవ్వండి. ధ్యానం ఉత్తమమైన మార్గం. శ్వాస మీద ధ్యాస అంటే మరేమీ కాదు; పూర్తిగా వర్తమానంలో జీవించడమే! ఆలోచనలు ఆందోళనా కారకాలు కాబట్టి గతానికి స్వస్తి చెప్పండి. c **గతం ఒక జ్ఞాపకం.... భవిష్యత్తు ఒక ఊహ వర్తమానమే వాస్తవం.**



# విద్య నేర్చుకునే విధానం

కథ: **సుందరరామన్** చిత్రాలు: **తంగరాజు** తెలుగుసేత : **స్వామి జ్ఞానదానంద**

(ఇది మహాభారతంలో లోమశ మహర్షి పాండవులకు చెప్పిన వృత్తాంతం)

1 భరద్వాజ మహర్షి కుమారుడు యవక్రీతుడు గురుకులవాసం చేసి చదువు నేర్చుకోవడానికి సుముఖంగా లేడు. చిటికెలో చదువు నేర్చుకోవాలని ఆతని అభిలాష. అందువల్ల ఇంద్రుని గురించి తపస్సు చేశాడు.



యవక్రీతుని తపస్సుకు మెచ్చి ఇంద్రుడు ప్రత్యక్షమయ్యాడు!







మిగతా 36వ పేజీలో...

ఆచార వ్యవహారాలు - అంతరార్థాలు - 18

- రెంటాల జయదేవ

# కార్యమేదైనా కీలకమైన కలశ ఆరాధన

మన హిందూ ధార్మిక కార్యకలాపాల్లో కలశానికి కీలకమైన స్థానం ఉంది. ప్రతి పుణ్యకార్యంలోనూ అనేక ఇతర వస్తు సామగ్రితో పాటు జలంతో నిండిన 'కలశం' ముఖ్యపాత్ర పోషిస్తుంది. 'కలశం' అంటే – నీళ్ళు నింపిన చెంబు లాంటిది. వెండి, ఇత్తడి, రాగి, మట్టి లాంటి వాటిలో ఏదో ఒకదానితో ఆ పాత్రను చేస్తారు. ఆ చెంబు లాంటి దాని మూతి భాగంలో మామిడి ఆకులు ఉంచుతారు. వాటి మీద కొబ్బరికాయను పెడతారు. కలశం కంఠ భాగం చుట్టూ ఎరుపు, తెలుపు రంగు దారాల్లో ఏదో ఒకటి కడుతుంటారు. కొన్నిసార్లు ఆ పాత్ర చుట్టూరా క్లిష్టమైన డైమండ్ ఆకారపు చట్రం లాగా కూడా దారం కడతారు. పాత్ర మీద కొన్నిసార్లు రకరకాల డిజైన్లు కూడా వేస్తారు. అలాంటి పాత్రను 'కలశం' అంటారు.



## పూర్ణ కుంభమంటే?

నీటితో కానీ, బియ్యంతో కానీ నింపిన కలశాన్ని 'పూర్ణ కుంభం' అంటారు. జడమైన ఈ శరీరాన్ని దివ్యమైన జీవశక్తితో నింపినప్పుడు ఎన్నో ఆశ్చర్యకరమైన పనులు చేయగల శక్తి దానికి వస్తుందనీ, అదే జీవితమనీ తెలియజెప్పడం ఈ 'పూర్ణ కుంభం'లోని ప్రతీకాత్మకత.

సర్వసాధారణంగా కలశ పాత్రలు రాగితో చేసినవి అయ్యుంటాయి. ఇత్తడివి కూడా ఉపయోగించడం కద్దు. ఇటీవలి కాలంలో ఈ లోహాలవి దొరకనప్పుడు స్టీలు వాటిని వాడడం కూడా చూస్తున్నాం. పూజ, హోమాది పుణ్య కార్యాలలోనైతే కలశాన్ని ముందు నీటితో నింపి, దాని పై భాగంలో ఎఱ్ఱ రంగు వస్త్రం చుట్టిన కొబ్బరికాయను, మామిడాకులతో సహా కలిపి ఉంచుతారు. కార్యక్రమం ముగిసిన తరువాత కొన్ని సందర్భాల్లో ఆ కలశ జలాన్ని 'చరణామృతం' (తీర్థం)గా వినియోగించడం చూస్తుంటాం. ఇంకొన్నిసార్లు ఆ మంత్రపూరిత కలశ జలాన్ని ఇంట్లోనూ, చుట్టూరా జల్లుతారు. ఆ జల ప్రభావంతో సకల శుభాలూ కలుగుతాయని నమ్మకం.

సాంప్రదాయికమైన గృహప్రవేశం, వివాహం లాంటి ముఖ్యమైన సందర్భాలన్నిటిలో వైదికంగా కలశాన్ని స్థాపించి, ఆరాధించడం చూస్తుంటాం. కొన్నిసార్లు ప్రవేశ ద్వార సమీపంలో స్వాగత సూచనగా కూడా దాన్ని ఉంచుతుంటారు. ధార్మిక ప్రముఖులకు ఎదురు వెళ్ళి వేద మంత్రోచ్చారణలతో స్వాగతిస్తున్నప్పుడు కూడా సాంప్రదాయిక పద్ధతిలో 'పూర్ణ కుంభా'న్ని వినియోగిస్తారు. పూర్ణ కుంభ స్వాగతం పలకడమంటే అదే!



జ్ఞానవంతులు తమను తాము అనంత సత్యంలో భాగంగా చూసుకుంటారు కాబట్టి, వారు పరిపూర్ణులు. సంతోషం, ప్రేమలకు ప్రతి రూపాలైన వారు సమస్త శుభాలకూ ప్రతినిధులు. అలాంటి వారి గొప్పదనాన్ని గుర్తిస్తూ, వారికి గౌరవసూచకంగా నిండు మనసుతో ఆహ్వానం పలకడానికి, 'పూర్ణకుంభ' స్వాగతం చెబుతారు.

## కలశాన్ని ఆరాధించడమెందుకు?

ఈ చరాచర సృష్టి జరగడానికి ముందు శ్రీమహావిష్ణువు పాలకడలిలో శేషతల్పం మీద సేద తీరుతూ ఉన్నాడట. ఆయన నాభి నుంచి ఓ పద్మం పుట్టింది. అందులో సృష్టికారకుడైన బ్రహ్మదేవుడు ఉద్భవించాడు. ఆయన తరువాత ఈ ప్రపంచం మొత్తాన్నీ సృష్టించాడు. 'కలశం'లోని నీళ్ళు ఈ సృష్టి మొత్తం ఆవిర్భవించడానికి కారణమైన ఆధారభూత జలానికి ప్రతీక. అది అందరికీ జీవశక్తి ప్రదాత. కలశం మీద ఉంచిన మామిడాకులు, నారికేళం ఈ సృష్టికి ప్రతీకలు. ఇక, కలశం చుట్టూ కట్టిన దారం ఈ సృష్టి మొత్తాన్నీ కట్టి ఉంచే, ప్రేమకు సూచన.

అందుకే, కలశాన్ని శుభప్రదాయనిగా భావించి, ఆరాధిస్తారు.

ఏ దైవ కార్యక్రమంలోనైనా సరే కలశ స్థాపన చేసిన తరువాత దానిలోకి సమస్త పవిత్ర నదుల జలాల్నీ ఆహ్వానిస్తారు. సమస్త వేద విజ్ఞానాన్నీ, సమస్త దేవీ దేవతల ఆశీస్సుల్నీ అందులోకి ఆవాహన చేస్తారు. అలా చేసిన తరువాత ఆ కలశంలోని జలాన్ని అభిషేకంతో సహా అన్ని రకాల క్రతువులకూ ఉపయోగిస్తారు. ఏదైనా ఆలయ కుంభాభిషేకం జరుగుతోందంటే, ఆ కోలాహలం చూసి తీరాల్సిందే. విస్తృత స్థాయిలో భారీయెత్తున జరిగే కుంభాభిషేకంలో ఆలయ గోపురం మీద కలశ పాత్రలతో పవిత్ర జలాల్ని ఉంచుతారు.

దేవతలు, రాక్షసులు క్షీరసాగరాన్ని మథించినప్పుడు అందులో నుంచి అమృత కలశాన్ని తీసుకొని దేవుడు ప్రత్యక్షమయ్యాడు. ఆ కలశంలోని అమృతం జరామరణ భయం లేకుండా చేస్తుంది. కాబట్టి, ఆ రకంగా కలశమనేది చిరంజీవత్వానికి కూడా చిహ్నం.

త్రిమూర్తులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు తమ భార్యలైన సరస్వతి, లక్ష్మి, పార్వతి దేవీలతో 'కలశం'లో వసిస్తారు. కాబట్టి, కలశాన్ని పవిత్రమైనదిగా భావిస్తారు. అలాగే, ప్రాచీన దేవాలయాల్లో - లక్ష్మీదేవి పద్మం మీద కూర్చొని ఉంటే, ఆమెకు చెరో వైపున రెండు ఏనుగులు తమ తొండాలతో కలశ జలాన్ని అభిషేకిస్తున్న దృశ్యం చాలా చోట్ల కనిపిస్తుంది. a

**(కలశపూజ విధివిధానాలు వచ్చే సంచికలో...)**

## పండుగలు - పర్వదినాలు

### ఆగష్టు - 2007

| | | | |
|---|---|---|---|
| 09 | గురువారం | : | ఏకాదశి |
| 10 | శుక్రవారం | : | స్వామి రామకృష్ణానంద జయంతి |
| 24 | శుక్రవారం | : | ఏకాదశి |
| 28 | మంగళవారం | : | స్వామి నిరంజనానంద జయంతి |

### సెప్టెంబరు - 2007

| | | | |
|---|---|---|---|
| 04 | మంగళవారం | : | శ్రీకృష్ణ జన్మాష్టమి |
| 07 | శుక్రవారం | : | ఏకాదశి |
| 10 | సోమవారం | : | స్వామి అద్వైతానంద జయంతి |
| 15 | శనివారం | : | వినాయక చతుర్థి |
| 23 | ఆదివారం | : | ఏకాదశి |

...33వ పేజీ తరువాయి.


5
దేవేంద్రుడు మళ్ళీ యవక్రీతునికి ప్రత్యక్షమయ్యాడు.
యవక్రీతా! నీ కోరిక అశాస్త్రీయం! నిరంతర అధ్యయనంతో మాత్రమే విద్య అలవడుతుంది.!
ప్రభూ! ఎంత తపస్సు చేసినా మీకు నాపై దయ కలగడం లేదా!
యవక్రీతా! నా మాట విను! విద్యకోసం వృధా ప్రయత్నం చేయకు!!
మీరు నా కోరిక నెరవేర్చే వరకూ తపస్సు ఆపను!


6
వీడికి ఎలా నచ్చ చెప్పాలి?


7
యవక్రీతుడు స్నానానికి వెళుతూ ఒక బ్రాహ్మణుడు మట్టిని గంగలో వేస్తుండడం చూశాడు.


8
అయ్యా! మీరేం చేస్తున్నారు?
నదిని దాటడానికి వంతెన కడుతూ ఉన్నాను.


9
ఇదేం పిచ్చిపని! ఇలా పిడికిళ్ళతో మట్టిని తీసి గంగానదిలో వేస్తూ వంతెన నిర్మించడం సాధ్యమా?
గురువు లేకుండానే సకల శాస్త్ర పారంగతుడవ్వాలని నువ్వు యత్నించగా లేనిది, దోసిళ్ళతో మట్టిని వేసి వారధి నిర్మించలేమా ఏమిటి?

10 యవక్రీతుడు నిశ్చేష్టుడయ్యాడు, వెంటనే బ్రాహ్మణుడు ఇంద్రునిగా మారాడు.




11




12 యవక్రీతుడు తన తండ్రి వద్దకు తిరిగివచ్చాడు.




యవక్రీతుడు సర్వశాస్త్రాలు అభ్యసించి పండితుడయ్యాడు. ఇంద్రుని వరం కూడా ఇందుకు తోడ్పడింది.

13 విద్యనభ్యసించకపోతే, జ్ఞానోదయం కాకపోతే లోకంలో పురోగతి ఎలా సాధ్యపడుతుంది?...



గురుగృహ నివాసమే విద్య అని నా అభిప్రాయం. గురువుతో శిష్యుడికి వ్యక్తిగతమైన సన్నిహిత పరిచయం వుండాలి. జాజ్వల్యమైన అగ్నివంటి శీలంగల గురువు వద్ద బాల్యం నుండి నివసించాలి. అత్యున్నతమైన బోధస్వరూపుడైన వ్యక్తిని తన ఎదుట చూస్తుండాలి. గురువు వ్యక్తిగత జీవనం కళ్ళముందు కానరాకుండా నిజమైన విద్య సాధ్యం కాదు.

– స్వామి వివేకానంద

# గ్రంథ పరిచయం

## శ్రీవిద్యా ప్రకాశము

**రచయిత: దివాకర్ల సీతారామ శర్మ**
**వెల : 125/-, పేజీలు: 220,**
**ప్రతులకు: టాగూర్ పబ్లిషింగ్ హౌస్, షాపు.నెం.20, వైశ్య హాస్టల్ బిల్డింగ్, కాచిగూడా చౌరాస్తా, హైదరాబాద్ - 27.**



శ్రీవిద్యా లేదా శ్రీదేవీ ఉపాసన, శ్రీచక్రార్చన మొదలైన శక్తి ఆరాధనా విధానాలు ఆచరణలో అసాధ్యాలనీ, కొన్ని సమయాలలో వికటించి, విపరీత వ్యతిరేక పరిణామాలు కలిగిస్తాయనీ సామాన్యులే కాక పండితులు కూడా భావిస్తూ ఉంటారు. పవిత్రమైన, ఆధ్యాత్మిక, మానసిక శక్తి ప్రదమైన "శ్రీవిద్య" గురించి సర్వ జనులకూ విశ్లేషణాత్మకంగా వివరించి, అపోహలను పోగొట్టటానికి దివాకర్ల సీతారామ శర్మ గారు చక్కగా కృషి చేశారు. సౌందర్యలహరి, దుర్గా సప్తశతి, దశమహావిద్యలు, భావనోపనిషత్తు వంటి దేవీ మహిమను వివరించే గ్రంథాలను సూక్ష్మంగా పరిచయం చేస్తూ, నవావరణ అర్చనా విధానాన్ని సశాస్త్రీయంగా అందించారు. శ్రీవిద్యోపాసకులు దేవి భక్తులు తప్పని సరిగా చదవవలసిన గ్రంథమిది. c - నాగ ప్రసాద్.

## శ్రీవిష్ణు సహస్రనామము

**వ్యాఖ్యాత : జింకా బూశన్న**
**వెల : 80/-, పేజీలు: 412,**
**ప్రతులకు : జింకా బూశన్న, రిటైర్డ్ మునిసిపల్ కమీషనర్, చింతలరాయుని పాల్యం , తాడిపత్రి-515 411 అనంతపురం జిల్లా.**



మానసిక అశాంతికి దూరం కావటానికి, భగవంతుని అనుగ్రహాన్ని పొందటానికి "విష్ణు సహస్ర నామ" పారాయణం సులభోపాయమని భక్తుల విశ్వాసం. యాంత్రికంగా, కంఠోపాఠంగా పారాయణం చెయ్యటం కన్నా ప్రతి నామాన్ని, దాని అంతరార్థాన్ని తెలిసి మనన పారాయణలు చేస్తే, భగవదనుభూతి సులభమవుతుందని పెద్దల వచనం. జింకా బూశన్న గారు సులభ శైలిలో విష్ణుసహస్రనామాలకు సాధికారికమైన అర్థవివరణలు ఈ పుస్తకంలో అందించారు. భారతాంతర్గతమైన భీష్మ ప్రోక్తమైన విష్ణు సహస్రనామాలకు వ్యాఖ్యానం చేసిన బూశన్నగారు సర్వదా అభినందనీయులు. c - నాగ ప్రసాద్

## భగవాన్ బోధ

**సంకలనం : సాయికృష్ణ, పేజీలు : 44, వెల : ఉచితం, ప్రతులకు : ఎస్. వి. సాయి కృష్ణ రావు, ఫ్లాట్ నెం. 301, 3వ అంతస్థు, పావని విల్లా అపార్ట్‌మెంట్స్, వేదాయపాలెం, నెల్లూరు - 4. ఫోన్ నెం. 0861- 2338787.**

## వేద సదస్సు

**రచన : శ్రీవిద్యాస్వరూపానందగిరి స్వాములవారు, పేజీలు : 141, ప్రతులకు: మేనేజరు, శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమం రోడ్డు, శ్రీ శుకబ్రహ్మాశ్రమము (పోస్టు) శ్రీకాళహస్తి - 517 640, చిత్తూరు జిల్లా.**

## కృష్ణ

**రచయిత : డా॥ ధారా రామనాథ శాస్త్రి, పేజీలు : 320, వెల : 100/-, ప్రతులకు : మధుమతి పబ్లికేషన్స్, మామిడిపాలెం, ఒంగోలు - 523 002.**

## భృగు సంహిత

**తాత్పర్యకర్త : శ్రీగణపతి శాస్త్రి , పేజీలు:156, వెల: 36/- ప్రతులకు : టాగూరు పబ్లిషింగ్ హౌస్, షాప్ నెం. 20, వైశ్యా హాస్టల్ బిల్డింగ్, కాచిగూడా చౌరస్తా, హైదరాబాదు - 500 027.**

## ఉచిత విద్యార్థి వసతి గృహం ప్రారంభం

**కడప రామకృష్ణ మిషన్,** పుట్లంపల్లిలోని నూతన ప్రాంగణంలో మార్చి నెలలో సాధునివాసాన్ని అంగరంగ వైభవంగా ప్రారంభించింది. ఈ శాఖ ఇప్పుడు ఆర్థికంగా వెనుకబడిన విద్యార్థుల కోసం ఉచిత వసతి గృహాన్ని ప్రారంభించింది. పది మంది పేద విద్యార్థులతో ఈ వసతి గృహాన్ని చెన్నై విజయా హెల్త్ సెంటర్ ట్రస్టీ శ్రీ పి. రమణారెడ్డి జూన్ 24వ తేదీన ప్రారంభించారు. అదే రోజున చెన్నై శ్రీరామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి గౌతమానందజీ మహరాజ్ శ్రీరామకృష్ణ వివేకానందుల చిత్ర ప్రదర్శనశాలను ప్రారంభించారు. a



## విద్యార్థుల్లో స్ఫూర్తి నింపిన 'వివేకవాహిని'



**ఒంగోలు శ్రీరామకృష్ణ సేవా సమితి** విజయవాడ రామకృష్ణ మిషన్ భావప్రచార రథం 'వివేకవాహిని'ని ఆహ్వానించి **జూన్ 25 నుండి 30వ తేదీ** వరకు ప్రకాశం జిల్లాలోని ఒంగోలు, మద్దిపాడు, చీమకుర్తి, కొత్తపట్నం, ఈతముక్కల, సింగరాయకొండ, టంగుటూరు మొదలైన ప్రాంతాలలో పాఠశాల, కళాశాల విద్యార్థులకు 'వ్యక్తిత్వ వికాస' సదస్సుల్ని నిర్వహించింది. విజయవాడ రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి శశికాంతానందజీ 'విద్యార్థులు ఏకాగ్రత, సత్యసంధత, సేవానిరతి అలవరచుకోవాలి'అని సోదాహరణంగా వివరించారు. ఉత్తమ ఉపాధ్యాయుని లక్షణాలు, ఉత్తమ శిష్యుని నడవడిక సనాతన గురుకుల సంప్రదాయంతో పోల్చి స్వామీజీ వివరించారు. ఆయా గ్రామాలలో సాయంత్రం ఏర్పాటుచేసిన బహిరంగ సభల్లో శ్రీరామకృష్ణ, శారదా, వివేకానందుల సందేశాల ఆవశ్యకతను ఆయన తెలియజేశారు. 'స్వామి వివేకానంద', 'శిలనూ నేనే శిల్పినీ నేనే', 'లెండి మేల్కొనండి' లఘుచిత్రాల ప్రదర్శనలు విద్యార్థులకు ఎంతో స్ఫూర్తినిచ్చాయి. బహిరంగ సభల్లో 'యుగావతార్' 'శ్రీరామకృష్ణ కథారత్నాలు' వీడియో చిత్రాలు ప్రజలను బాగా ఆకట్టుకున్నాయి. ఈ ఆరు రోజులపాటు జరిగిన సభల్లో సుమారు 6000 మంది విద్యార్థులు, 500 మంది పురప్రజలు లబ్ధిపొందారు. a నివేదిక: **పి.వి. నరసింహారావు**

## పార్వతీపురంలో వ్యక్తిత్వవికాస సదస్సు

**పా**ర్వతీపురం జట్టు భావ సమాఖ్య సేవాశ్రమం జూన్ 24వ తేదీన 'వ్యక్తిత్వవికాస సదస్సు' నిర్వహించింది. ఈ కార్యక్రమంలో సుమారు 200 మంది విద్యార్థులు, ఉపాధ్యాయులు పాల్గొన్నారు. హైదరాబాద్ రామకృష్ణ మఠం స్వామి అనుపమానందజీ మాట్లాడుతూ 'స్వామి వివేకానందుని మాటలతో స్ఫూర్తి పొంది జమ్‌షట్‌జీ టాటా దేశానికి ఎలా సేవలందించారో వివరించారు. ఈ కార్యక్రమంలో స్వామి పరిజ్ఞేయానంద 'మహాత్ముల జీవితాల్ని ఆదర్శంగా తీసుకొని ఆచరించినప్పుడే నిజమైన వ్యక్తిత్వ వికాసం సాధ్యం'అని సోదాహరణంగా వివరించారు. a నివేదిక: **డి. పారినాయుడు**



వ్యక్తిత్వ వికాస సదస్సులో ప్రసంగిస్తున్న స్వామి అనుపమానందజీ.

# విజ్ఞానం - వినోదం



## సార్థకత

**శ్లోకేన వా తదర్థేన పాదేనైకాక్షరేణ వా ।**
**అబంధ్యం దివసం కుర్యాద్ దానాధ్యయన కర్మభిః॥**

ప్రతి రోజూ ఒక శ్లోకాన్ని గానీ, దాని అర్థాన్ని గానీ చదవాలి. అది సాధ్యం కాకపోతే ఒక పాదాన్ని అయినా, కనీసం ఒక అక్షరాన్నయినా చదవాలి. దాంతో పాటు ఎంతో కొంత దానం కూడా చేయాలి. అప్పుడే ఆ రోజు సార్థకమవుతుంది.



## నిజమే మరి!

యమభటులు ఒక నిరక్షరాస్యుణ్ణి నరకానికి తీసుకువచ్చారు. చిత్రగుప్తుడు అతణ్ణి విచారించి యముడి ముందు హాజరు పరిచాడు.

**చిత్రగుప్తుడు:** ప్రభూ! ఇతడు తనకు శిక్ష ఎందుకని అంటున్నాడు.

**యముడు:** ఏమయ్యా! నువ్వుచేసిన పాపాలు నీకు తెలియవా?

**నిరక్షరాస్యుడు:** నిలువునా నా పేణాలు తీసినోరు మీరు దొరలా ఏ సిచ్చా లేకుండా నా ఎదురుగా కూకున్నారు! ఏయో సిన్న, సిన్న తప్పులు సేత్తే నాకేమో పెద్ద,పెద్ద సిచ్చలు ఏత్తావంటన్నారే! ఇదేం న్యాయం సామీ!

## సిసలైన సంపద



ధన దాహంతో తపించేవారు ఎంత ధనమున్నా దరిద్రులే! సంపదలు స్వల్పంగావున్నా, సంతృప్తికి ఏ కొదవా లేనివారు ఎన్నటికీ శ్రీమంతులే!



## మన మహర్షులు

**ముద్గలుడు:** అతిథులను శక్తి మేరకు సత్కరించడాన్నే గొప్ప తపస్సుగా భావించేవాడు ముద్గలుడు. తనకున్నదంతా ఇతరులకు దానం చేయడంలో మహదానందాన్ని పొందేవాడు. దుర్వాస మహర్షి ఇతడి దానశీలతను పరీక్షించి సంతుష్టుడయ్యాడు. శరీరంతోనే స్వర్గానికి వెళ్ళగలవని ఆశీర్వదించాడు. మరుక్షణమే దేవలోకం నుండి వచ్చిన విమానం ముద్గలుడి ముందు ఆగింది. దాన్ని ఎక్కేముందు వచ్చిన దూతను దేవలోకం ఎట్లా ఉంటుందని ముద్గలుడు ప్రశ్నించాడు. "చేసిన సత్కర్మలన్నీ అయిపోయేవరకూ, నీవక్కడ అన్ని భోగాలనూ అనుభవించవచ్చు. తరువాత భూలోకానికి తిరిగి రావాల్సి ఉంటుంద"ని దేవదూత అతడితో చెప్పాడు. అది విన్న ముద్గలుడు "దాన ధర్మాలతో నేను ఎంతో ఆనందంగా ఉన్నాను. నాకు మరే భోగాలూ వద్దు" అని స్వర్గాన్ని తిరస్కరించాడు. తిరిగి తన తపస్సులో మునిగిపోయాడు.



## వారసత్వ వైభవం

**శునశ్శేపుడు:** అజీగర్తుడనే బ్రాహ్మణుని కుమారుడే శునశ్శేపుడు. తీవ్రమైన కరువు సమయంలో తిండి లేక అజీగర్తుడు తన కుమారుణ్ణి విక్రయించాడు. ఆ పాపంతో అతడికి మరణానంతరం పిశాచత్వం వచ్చింది. శునశ్శేపుడికి ఈ సంగతి తెలిసింది. జరిగిన దాంట్లో తన తప్పేమీలేదు. కానీ తన వల్లే తండ్రికి ఈ పరిస్థితి దాపురించిందని బాధపడ్డాడు శునశ్శేపుడు. దుర్గతుల నుండి రక్షించి తండ్రి దుఃఖాన్ని నివారించాలని సంకల్పించుకొన్నాడు. గౌతమీ నదీ తీరంలో ఎన్నో ఏళ్ళపాటు కఠోరమైన తపస్సు చేశాడు. సంపాదించిన తపః ఫలితాన్ని ధారపోసి తండ్రికి సద్గతులను కలిగించాడు.

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.64-8, Sri Ramakrishna Prabha (Telugu Monthly) August 2007, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. H-HD-1071/2007-09. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2007-09.

# శ్రీరామకృష్ణ - వివేకానంద భావ ప్రచార పరిషత్





## 17వ వార్షిక భక్తసమ్మేళనం - 2007 డిసెంబర్ 7,8,9 తేదీలు, హుజూర్‌నగర్

*సమ్మేళన వేదిక: శ్రీరామకృష్ణ సేవాసమితి నూతన ప్రాంగణం, సాయిబాబా మందిరం వెనుకవీధి, హుజూర్‌నగర్.*

### ఆహ్వానం

నల్గొండ జిల్లాలోని శ్రీరామకృష్ణ సేవాసమితుల ఆధ్వర్యంలో హుజూర్‌నగర్‌లో 2007 డిసెంబర్ 7,8,9 తేదీలలో జరిగే 17వ వార్షిక భక్తసమ్మేళనానికి ఇదే మా ఆహ్వానం.

- ఈ సమ్మేళనంలో పాల్గొనే సంస్థలు, తమ సభ్యులు ఒక్కొక్కరి నుంచి రూ.100/- సభ్యత్వ రుసుముగా వసూలుచేసి, జత చేసిన సభ్యత్వ పత్రములో వివరాలు తెలపాలి. రుసుము ఎమ్.ఓ/డి.డి ద్వారా 15-11-07 తేదీ లోగా **సెక్రటరీ, శ్రీరామకృష్ణ సేవాసమితి, మెయిన్‌రోడ్డు, హుజూర్‌నగర్-508204** చిరునామాకు పంపవలెను. **15-11-07 తర్వాత నమోదు చేసుకొనే వారు రూ.150 చొప్పున చెల్లించాలి.** సంబంధిత పత్రాలు 7-12-07 తేదీన సమావేశ ప్రాంగణంలో పొందవచ్చు.
- డిమాండ్‌డ్రాఫ్టులు పంపదలచినవారు **"సెక్రటరీ/ట్రెజరర్, శ్రీరామకృష్ణ సేవాసమితి, హుజూర్‌నగర్"** పేరున "ఆంధ్రా బ్యాంక్," హుజూర్‌నగర్ (కోడ్ నెం. 209)లో చెల్లుబాటు అయ్యేలా పంపవలెను. S.B.A/C No. 02090 11000 12860) ఆన్‌లైన్ ద్వారాగూడా పైకం పంపవచ్చును. **చెక్కులు అంగీకరింపబడవు.**
- సంస్థల నుంచి వచ్చే సభ్యులు వారిలో ఒకరిని నాయకునిగా ఎంపిక చేసుకోవాలి. సదరు వ్యక్తి ఆ బృందానికి అవసరమైన సదుపాయాలను సమకూర్చడానికి సమన్వయకర్తగా వ్యవహరించాలి.
- ప్రతినిధులకు ఉచిత భోజన, నివాస వసతి 7-12-07 (శుక్రవారం) ఉదయం నుండి 9-12-07 (ఆదివారం) రాత్రి వరకు ఏర్పాటు చేయబడును.
- "భక్తుల సేవ భగవంతుని సేవ" కనుక ఈ బృహత్తర కార్యక్రమానికి అయ్యే వ్యయాన్ని భరించడానికి ధన వస్తు, సేవ రూపేణా తమవంతు సహాయ, సహకారాల్ని అందించి, భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ఆశిస్తున్నాం.
- ఇవి ఈ కార్యక్రమాల్లో ఒక పూటకు అయ్యే ఖర్చు వివరాలు. ఈ ఖర్చులలో ఒక దానికి గానీ, అన్నిటికి గానీ విరాళాల్నిచ్చి సహకరించ ప్రార్థన.

| | |
|---|---|
| టీ/కాఫీ | : రు. 5,000/- |
| ఉపాహారం | : రు. 10,000/- |
| భోజనం | : రు. 40,000/- |

- ఈ సమ్మేళనం సందర్భంగా ఒక స్మారక సంచికను విడుదల చేయనున్నాం. ఆ సంచికలో ప్రకటనల నిచ్చి ప్రోత్సహించగలరు. ప్రకటనల ట్యారిఫ్ వివరాలు:

| | పూర్తి పేజీ | అర పేజీ | పావుపేజీ |
|---|---|---|---|
| కలర్ : | 3,000 | 1,500 | 750 |
| బ్లాక్ & వైట్ : | 1,500 | 750 | 375 |
| 2,3 కవరు పేజీలు | 5,000 | - | - |
| 4వ కవరు పేజీ | 10,000 | - | - |

### సంప్రదించవలసిన చిరునామాలు

**1) దేవులపల్లి సుబ్రహ్మణ్యశర్మ, ఆర్గనైజింగ్ సెక్రటరీ, 17వ వార్షిక భక్తమ్మేళనం శ్రీరామకృష్ణ సేవాసమితి, వర్తక సంఘ భవనం మేడమీద, మెయిన్‌రోడ్, హుజూర్‌నగర్-508 204, సెల్:94407 08907, ఫోన్:08683 - 242 216**

**2) యమ్.యస్. రాఘవరావు, ట్రెజరర్, శ్రీరామకృష్ణ సేవాసమితి, హుజూర్‌నగర్ - 508 204, సెల్: 98491 03001**

### భక్తులకు సూచనలు

- సాధారణ వసతి సౌకర్యాలు మాత్రమే (హాలులు, తివాచీలు, సామూహిక కాలకృత్యాలకు) ఏర్పాట్లు చేయబడినవి.
- ప్రత్యేక సదుపాయములు (లాడ్జిలలో గదులు) కావలసినవారు ముందుగా పైకం పంపినట్లైతే రిజర్వు చేయడం జరుగుతుంది.
- 6-12-07 రాత్రి నుండి మిరియాలగూడ రైల్వేస్టేషన్, కోదాడ ఆర్.టి.సి. బస్‌స్టాండ్‌లలో రిసెప్షన్ కౌంటర్ ఏర్పాటు చేస్తాం.

ఆధ్యాత్మిక-అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 64 సంచిక: 10 అక్టోబరు 2007

"ప్రతి జీవిలోనూ దివ్యత్వం గర్భితంగా ఉంది. అంతర్గతంగా ఉన్న ఆ దివ్యత్వాన్ని వ్యక్తం చేయడమే జీవిత పరమావధి." - స్వామి వివేకానంద

## ప్రార్థన



నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః ।
నమః ప్రకృత్యై భద్రాయై నియతాఃప్రణతాః స్మ తామ్॥
రౌద్రాయై నమో నిత్యాయై గౌర్యై ధాత్ర్యై నమో నమః ।
జ్యోత్స్నాయై చేన్దురూపిణ్యై సుఖాయై సతతం నమః ॥

నిత్యశుభంకరి అయిన మహాదేవికి సదా నమస్కృతులు. మూలప్రకృతీ, రక్షాశక్తీ అయిన మహాదేవికి నమస్కృతులు. భయంకరీ, శాశ్వతరూపిణీ, స్థితికారిణీ, కౌముదీ (వెన్నెల), చంద్రరూపిణీ, సుఖ ప్రదాయినీ అయిన గౌరీ దేవికి నియత చిత్తులమై మేము ప్రణమిల్లుతున్నాము.

(దేవీ మాహాత్మ్యం నుంచి)

## ఈ సంచికలో...







SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com



## సంపాదకీయం

# అనునిత్యం ఆనందమయ జీవనం

"దేవాలయంలో ప్రార్థన, భజనల్లో లీనమైనప్పుడూ, ఆధ్యాత్మిక ప్రవచనాలు వినడంలో నిమగ్నమై ఉన్నంతసేపూ మనస్సు చాలా ప్రశాంతంగా ఉంటుంది. కానీ గుడి నుంచి ఇంటికి వెళ్ళగానే మనశ్శాంతి కాస్తా మటుమాయమై పోతుంది! ఇలా జరగడానికి కారణమేమిటి?" అని చాలా మంది భక్తులు సందేహ శస్త్రాలను సంధిస్తూ ఉంటారు.

ప్రాథమిక దశలో ఉన్న భక్తుల్ని ఉద్దేశించి శ్రీరామకృష్ణులు "కొలిమిలో పెట్టినప్పుడు ఇనుము వేడెక్కి ఎర్రగా అవుతుంది. అదే ఇనుమును కొలిమి నుంచి బయటకు తీయగానే చల్లారి, నల్లబడుతుంది. అలాగే సామాన్య భక్తులు దేవుని సన్నిధిలోనూ, సాధుసంగంలోనూ ఉన్నంతసేపూ భక్తిపారవశ్యంలో మునిగితేలుతూ ఉంటారు. గుడిని వీడగానే వారిలో పరవళ్ళు తొక్కే పారవశ్యం సన్నగిల్లిపోతుంది" అనేవారు.

**మకరందాన్ని గ్రోలే తుమ్మెదగా మనస్సు :** మనస్సుకు నిశ్చలత, ప్రశాంతత చేకూరాలంటే ఒకసారి కుళ్ళిన పదార్థాలపైనా, మరోసారి మధుర పదార్థాలపైనా వాలే ఈగ స్వభావాన్ని విడనాడాలి. మకరందాన్ని మాత్రమే ఆస్వాదించే తేనెటీగ స్వభావం అలవడాలి. మనస్సు దుష్ట సంస్కారాల ప్రభావం నుంచి బయటపడితే మనం ఎక్కడున్నా, ఏం చేస్తున్నా ప్రశాంత జీవనం కొనసాగించగలం. కాబట్టి ముందు మన మనస్సులో మార్పు రావాలి.

**పరిసరాల ప్రభావం తాత్కాలికమే!** ఒకసారి భోజరాజు తన పరివారంతో వేటకి వెళ్ళాడు. మండుటెండలో చాలా దూరం ప్రయాణం చేయడం వల్ల ఆయన పరివారమంతా ఆకలి బాధకు తాళలేకపోయారు. వారి క్షుద్బాధను ఎలా తీర్చాలా అని తీవ్ర ఆలోచనలో పడ్డాడు భోజరాజు. ఇలా ఆలోచిస్తుండగా కొంత దూరంలో ఓ మొక్కజొన్న తోట ఆయన కంట పడింది. ఇంతలో "స్వామీ! ఈ మొక్కజొన్న తోట నాదే! మీరు, మీ పరివారంతో సహా మొక్కజొన్నలు తిని ఆకలి తీర్చుకోండి" అనే కేక ఆయనకు వినబడింది. అటువైపు తిరిగిన భోజరాజుకి ఎత్తైన మంచెపై కూర్చొనివున్న రైతు కనిపించాడు. ఆ రైతు మాటలపై నమ్మకం ఉంచి భోజరాజుతో పాటు ఆయన పరివారమంతా తోటలో ప్రవేశించింది. వారందరూ మొక్క జొన్నలు కోసుకొని తినడం ప్రారంభించారు. అదే సమయంలో మంచె దిగిన ఆ రైతు "ఎవర్రా మీరంతా! నా తోటను దోచుకు తింటున్నారు" అని అరవడం ప్రారంభించాడు. కోపోద్రిక్తుడైన రైతును చూచి రాజ పరివారం తోటలో నుంచి బయటకు వచ్చేసింది. ఆ రైతు తిరిగి వెళ్ళి మంచెపై కూర్చున్నాడు. వెళ్ళిపోతున్న రాజపరివారాన్ని చూచి "మీరంతా నా తోటలోని మొక్క జొన్నలు తిని, ఆకలి తీర్చుకోండి" అని అనసాగాడు. ఇదంతా గమనిస్తున్న భోజరాజుకు అతడి వింత ప్రవర్తన ఆశ్చర్యం కలిగించింది. 'ఈ రైతు ఎత్తయిన ఆ మంచెపై కూర్చున్నప్పుడు ఎంతో ఆదరంతో తోటలోకి అనుమతిస్తున్నాడు. కిందకు దిగగానే 'నా తోట అంతా నాశనం చేస్తున్నారు' అని గద్దిస్తున్నాడు. రైతు స్వభావంలో వచ్చిన ఈ మార్పుకి కారణమేమిటి' అని రాజు తనలో తాను వితర్కించుకొన్నాడు.

భోజరాజు, తన పరివారంతో రాజ్యానికి తిరిగి వెళ్ళాడు. భటులను పిలిచి, మొక్కజొన్న తోట ఎంత ఖరీదైనా సరే రైతు నుంచి కొనాల్సిందిగా ఆజ్ఞాపించాడు. భటులు, రైతు వద్దకు వెళ్ళి రాజాజ్ఞను తెలియజేశారు. అతడు కోరినంత ధనం ఇచ్చి, ఆ తోటను కొన్నారు. మరుసటి రోజే రాజు మంచెవున్న స్థలాన్ని తవ్వించాడు. ఆ ప్రదేశంలో వారు విక్రమాదిత్యుని స్వర్ణ సింహాసనం కనుగొన్నారు.

విక్రమాదిత్యుడు కరుణా మయుడు. దానగుణ తత్పరుడు. ఆ మహారాజు సింహాసనం ఉన్న ప్రదేశంలో కూర్చోగానే ఆయన ఉదారగుణం రైతులో ఉదయించేది. కిందకు దిగగానే రైతు నిజస్వభావం బయటపడేది. కాబట్టి బాహ్య పరిసరాల ప్రభావం వల్ల మనసులో వచ్చిన మార్పు శాశ్వతం కాదని ఈ కథ మనకు చెబుతోంది.

**పనిలోనూ పరమార్థం :** భగవంతుని పట్ల భక్తి కేవలం పూజా గదికి, ఆలయానికి మాత్రమే పరిమితం కాకూడదు. మన వృత్తిని భక్తితో మేళవించినప్పుడే భుక్తిమార్గాన్ని కూడా భక్తి మార్గంగా మలచుకోవచ్చు. మనం చేస్తున్న ప్రతి పనినీ భగవంతునితో అనుసంధానం చేసుకొన్నప్పుడు మనం దేవాలయంలో ఉన్నా, కార్యాలయంలో ఉన్నా మనస్సు భగవన్మయం అవుతుంది. అలా పరమాత్ముడు కొలువై ఉన్న మనస్సు శాశ్వత ఆనంద నిలయం.

**సన్మార్గంలో స్వధర్మాచరణ :** సంసారంలో ఉంటూనే స్వధర్మాన్ని పాటిస్తూ, కుటుంబ బాధ్యతల్ని నిర్వహిస్తూ, నిరంతరం భగవంతుని చింతనతో ఎలా జీవించాలో శ్రీరామకృష్ణులు ఓ కథలో చెప్పారు. ఆ భక్తుని కథ మనందరికీ స్ఫూర్తిదాయకం.

"ఒక ఊరిలో ఓ బట్టల వ్యాపారి ఉండేవాడు. అతడు గొప్ప రామభక్తుడు. ఆ వర్తకుడు వస్త్రాల్ని నేస్తూ, 'రామేచ్ఛ వల్ల ఈ రోజు వస్త్రాలు నేస్తున్నాను. రామేచ్ఛ వల్ల వస్త్రాల్ని బజారుకు తీసుకువెళ్ళి అమ్ముతున్నాను. ఎవరైనా 'వస్త్రం ధర ఎంత' అని అడిగితే 'రామేచ్ఛ వల్ల ఈ వస్త్రానికి అయిన నూలు ఖరీదు ఒక రూపాయి. రామేచ్ఛ వల్ల వస్త్రం తయారీకైన కూలీ నాలుగు అణాలు. రామేచ్ఛ వల్ల లాభం రెండు అణాలు. కాబట్టి, రామేచ్ఛ వల్ల ఈ వస్త్రం అమ్మకం ధర ఒక రూపాయి ఆరు అణాలు' అని చెప్పేవాడు. ఆ వర్తకుడు చాలా నిజాయతీ పరుడని ప్రజల్లో బాగా నమ్మకం కుదిరింది. దాంతో, ఆ వర్తకుడు చెప్పిన ధరకే వస్త్రాలను కొనేవారు. అతను రోజూ వ్యాపారం ముగించాక ఇంటికి వెళ్ళి, స్నానపానాదులు అయిన తరువాత రామనామ సంకీర్తన చేసుకొనేవాడు...".

శ్రీరామకృష్ణులు చెప్పిన కథలోని కొంతభాగం మాత్రమే ఇక్కడ వివరించాం. వస్త్రాలు నేసే ఆ వర్తకుడి కథ వల్ల మనం తెలుసుకోవలసింది ఎంతో ఉంది. అనునిత్యం జీవితాన్ని భగవన్మయం చేసుకోవడానికీ, నిజాయతీగా జీవించడానికీ అవసరమైన రెండు విషయాల్ని ఈ కథ మనకు తెలియజేస్తుంది.

మొదటి విషయం ఏమిటంటే, ఆ వ్యాపారి భక్తిధర్మానికీ, వృత్తిధర్మానికీ రామనామంతో వారధి నిర్మించాడు. కాబట్టి భక్తితో రాముణ్ణి కొలుస్తూ ఎంత ఆనందాన్ని అనుభవించేవాడో, పనిచేస్తున్నప్పుడు కూడా అంతే ఆనందాన్ని పొందేవాడు. మనం కూడా దేవుణ్ణి దేవాలయంలోనో, తీరిక సమయాల్లోనో తలచుకోవడంతో సరిపెట్టుకోకూడదు. పనిలో నిమగ్నమైనప్పుడు కూడా భగవంతుణ్ణి తలచుకోవడానికి ప్రయత్నించాలి.

రెండో విషయం – వర్తకునిలో ఉన్న నిజాయతీ. భక్తి మార్గంలో ఉంటూ, వ్యాపార కార్యకలాపాల్లో నిజాయతీని వీడలేదు. వస్త్రానికైన ఖర్చు, లాభం – దాపరికం లేకుండా చెప్పడం వర్తకుని నిజాయతీకి నిదర్శనం. అతని మనసు భగవంతుని స్మరణతో పవిత్రమవడం వల్లనే అది సాధ్యమైంది.

**ఆచరణలో ఆచార్యుల బోధలు:** అర్జునుడు కురుక్షేత్రంలో యుద్ధం చేయడానికి విముఖత చూపినప్పుడు. '...సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ' అని అతడికి కర్తవ్యాన్ని గుర్తుచేశాడు శ్రీకృష్ణుడు.

"స్తంభాన్ని పట్టుకొని దాని చుట్టూ ఎంత జోరుగా తిరిగినా పడిపోకుండా ఉంటాం. అలాగే భగవంతుని పాదపద్మాలను గట్టిగా పట్టుకొని, మన పనులన్నీ నిర్వహిస్తే మనకు ఎలాంటి ఆపదలూ, అశాంతీ కలుగవు" అని శ్రీరామకృష్ణులు బోధించారు. అందుకే, మనం 'భగవంతుడా! నా మనస్సు నిరంతరం నీతోనే నిండి ఉండేలా అనుగ్రహించు" అని ప్రార్థించాలి.

హృదయపద్మంలో ఆసీనులై ఉన్న భగవంతుని ముందు మనస్సు అనే ప్రమిదలో, భగవన్నామమనే జ్యోతి అనునిత్యం జ్వలించేలా జాగ్రత్త వహించాలి. అలా మన హృదయ వాసుడి ఉనికిని మరువకుండా ఉన్నప్పుడే **'అనునిత్యం ఆనందమయ జీవనం'** సాధ్యమవుతుంది. C



# గోరుముద్ద

- స్వామి సుప్రియానంద

## సర్వజీవ సంరక్షిణి!

స్వామి వివేకానంద 1898 ఆగష్టులో కాశ్మీరులోని జగజ్జనని క్షీరభవానీ ఆలయాన్ని సందర్శించారు. మొఘలాయీల దండయాత్రతో ఆ ఆలయం అప్పటికే శిథిలావస్థలో ఉంది. కొల్లగొట్టబడిన ఆ దేవాలయపు దుర్భర స్థితిని చూసి స్వామీజీ అశాంతికి గురి అయ్యారు. అప్పుడు ఆయన తనలో తను ఇలా అనుకున్నారు, "నేనే గనక అప్పుడు ఉండివుంటే మొఘలాయీల ఈ దుష్కార్యాన్ని అడ్డుకునేవాణ్ణి. నా ప్రాణాలు సైతం లెక్కచేయక జగజ్జనని ఆలయాన్ని పరిరక్షించే వాణ్ణి." స్వామీజీకి ఈ ఆలోచన కలిగిన వెంటనే జగజ్జనని అశరీరవాణి ఆయనకు ఇలా వినిపించింది: "నాయనా! నువ్వు నన్ను రక్షిస్తావా? లేక నేను నిన్ను రక్షిస్తున్నానా?"



ఈ అనుభూతి పొందిన స్వామీజీ కాలాంతరంలో "కారుణ్యం ఉట్టిపడే ఆమె కంఠస్వరం విన్న తరువాత ప్రణాళికలు రూపొందించడం ఆపివేశాను. అంతా ఆమె సంకల్పం ప్రకారమే జరుగుతుంది" అని అన్నారు.

"కాళీ ఆరాధన నా ప్రత్యేకమైన పిచ్చి" అనే వారు స్వామీజీ. నిజమైన 'కాళీ ఆరాధన' ఏమిటో ఆయన జీవితంలో ఆచరించి చూపించారు. "జగన్మాత అంశను కొంచెమైనా మన తల్లిలో చూసి ఆరాధిస్తే మనకది మహత్త్వాన్ని కలిగిస్తుంది. మనలో నిద్రాణమైవున్న కుండలినీ శక్తే జగన్మాత. ఆమెను ఆరాధింపనిదే మనం ఎన్నటికీ ఆత్మ జ్ఞానాన్ని పొందలేం" అంటారు స్వామీజీ.

ఆయన ఆరాధన ఫలితమే ఒక దివ్య భావోద్వేగపు వెల్లువై 'కాళీమాత' కవితగా మనముందు నిలచింది.

నక్షత్రాలు సమసిపోయాయి
మేఘాలు మేఘాలను క్రమ్ముతున్నాయి
అది స్పందమాన, శబ్దమాన గాఢాంధకారం....
అంధకారబంధుర ఆకాశాన్నంటే ఉవ్వెత్తు తరంగాలతో
దోహదం చేస్తూ సముద్రం దానితో చేరింది
భయంకరమైన ఆ విద్యుత్కాంతి
నలుదిక్కులా కర్కశ కరాళ మృత్యువును ప్రదర్శిస్తూంది.
దుఃఖాలను మహామారులను వెదజల్లుతూ
ఆనందోన్మాదంతో నాట్యం చేస్తూ
రా, తల్లీరా
నీ పేరు మహాకాళి
నీ శ్వాస మృత్యువు
కంపిస్తూన్న నీ ప్రతి పదం
ఒక ప్రపంచాన్ని శాశ్వతంగా
తుడిచి వేస్తుంది.
ఓ కాళీ! సర్వ నాశన కారీ
రా, తల్లి! రా...

(స్వామి వివేకానంద, సంపుటం-2, పేజీ.144)

స్వామి వివేకానంద మహనీయ వ్యక్తిత్వానికి ఒక ముఖ్య పార్శ్వం ఆయన 'కాళీ పిచ్చి.' వాల్మీకి తన శోకం నుండి శ్లోకాన్ని పుట్టిస్తే, స్వామీజీ తన గళం నుండి శక్తిని ప్రసాదిస్తారు.

భయాన్ని జయించడానికి భయంకరాన్ని ఆరాధించమంటారు. మనలోని అహంకారం, స్వార్థం, వాంఛలన్నిటినీ కాల్చి బూడిద చేసిన తరువాతే కాళీమాత మన హృదయ కుహరంలోకి విచ్చేస్తుంది అంటారు స్వామి వివేకానంద॥

నీ హృదయాలయంలో దేవుణ్ణి ప్రతిష్ఠించదలిస్తే
మొదట నీ హృదయాన్ని పవిత్రీకరించుకో.
మనస్సు పవిత్రమవగానే మాధవుడు విచ్చేస్తాడు.
మనలో ఉన్న పదకొండు గబ్బిలాలు -
పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు,
మనసు అనే ఏకాదశేంద్రియాల్ని
వశం చేసుకున్నప్పుడు హృదయాంతరాళంలో
భగవంతుణ్ణి ప్రతిష్ఠించుకోవచ్చు.

– భగవాన్ శ్రీరామకృష్ణ

# జ్యోతిర్మయ రూపంలో జగజ్జనని సందర్శనం



శ్రీరామకృష్ణులు దక్షిణేశ్వరం నుండి శ్యాంపుకూర్‌కు తరలివెళ్ళారు. అదే సమయంలో దుర్గాపూజ ఉత్సవాన్ని తన ఇంట్లో జరుపుకోవడానికి శ్రీరామకృష్ణుల నుండి సురేంద్ర అనుమతి పొందాడు. అంతకు మునుపు ఏటేటా జరుపుకొనే ఈ ఉత్సవాన్ని కొన్ని దుర్ఘటనలు జరగడంతో ఆపివేశారు. దుర్గాపూజను నిర్వహించడం పట్ల ఆతడి సోదరులు భయాందోళనలు వ్యక్తం చేశారు. కానీ ఉత్సవం నిర్వహించాలని సురేంద్ర తీర్మానించాడు. అనారోగ్య కారణంగా గురుదేవులు రాకపోవడం ఆతడికి వెలితిగా అనిపించింది.

సంధిపూజ (దుర్గాపూజ మహోత్సవంలో రెండు, మూడు రోజుల మధ్య వచ్చే శుభముహూర్తం) సమయంలో, భక్తులు, డాక్టర్ సర్కార్ సమక్షంలో గురుదేవులు తమ గదిలో ప్రగాఢ సమాధి మగ్నులయ్యారు. అరగంట తరువాత బాహ్య చైతన్యంలోకి వచ్చి, ఇలా అన్నారు: "ఇక్కడ నుండి సురేంద్ర నివాసం దాకా ఒక జ్యోతిర్మయమైన బాట ఏర్పడి ఉండడం చూశాను. సురేంద్రుని భక్తి వల్ల జగజ్జనని అక్కడి విగ్రహంలో అభివ్యక్తమై, తన త్రినేత్రాన్ని తెరచి దివ్యకాంతిని వెదజల్లింది. ఆమె ముందు దీపాల పరంపర వెలుగుతోంది. ప్రాంగణంలో కూర్చొని 'అమ్మా, అమ్మా' అంటూ సురేంద్ర దయనీయంగా ప్రార్థిస్తున్నాడు. మీరందరూ ఇప్పుడే అతడి వద్దకు వెళ్ళండి. మిమ్మల్ని చూసి ఊరడిల్లుతాడు."



సురేంద్రనాథ్ మిత్రా

ఆయన అనుజ్ఞ మేరకు స్వామి వివేకానంద, ఇతర భక్తులు సురేంద్ర నివాసానికివెళ్ళారు. శ్రీరామకృష్ణుల దర్శనం అక్కడ జరుగుతున్న బాహ్య సంఘటనలకు కచ్చితంగా సరిపోయి ఉండడం చూసి వారు ఆశ్చర్య పోయారు. ●

హృదయరామ్ ఇంట్లోని నూతన పూజామందిరంలో దుర్గాపూజ మహోత్సవం జరపాలని సంకల్పించాడు. అందుకు శ్రీరామకృష్ణులు ఆమోదం తెలిపారు. మథుర్ కావలసిన డబ్బు అందజేశాడు. గురుదేవులను కూడా తన వెంట తీసుకువెళ్ళాలని హృదయ్ అనుకొన్నాడు.



హృదయరామ్ ముఖోపాధ్యాయ్

కానీ తన కలకత్తా నివాసంలో జరిగే పూజలో గురుదేవులు పాల్గొనాలని మథుర్ పట్టుబట్టాడు.

శ్రీరామకృష్ణులు హృదయ్‌ను అనునయిస్తూ ఇలా అన్నారు: "బాధపడకు. ప్రతి రోజూ నీ పూజను తిలకించడానికి సూక్ష్మ రూపంలో అక్కడకు వస్తాను. నువ్వు మాత్రమే నన్ను చూడగలవు. మంత్రాలు పఠించడానికి మరొక బ్రాహ్మణుని నియమించి, నీకు తోచిన రీతిలో పూజ జరిపించు. పూర్తిగా ఉపవాసం ఉండకుండా మధ్యాహ్నం వేళ పాలు, గంగాజలం, కలకండ పానకం పుచ్చుకో. ఈ సూచనలను తు.చ. తప్పకుండా పాటిస్తే జగజ్జనని నీ పూజను స్వీకరించడం తథ్యం."

హృదయ్ ఆనందభరితుడై, ఇంటికి వెళ్ళి గురుదేవుల సూచనల మేరకు మూడు రోజులూ దుర్గాపూజ జరిపాడు. ప్రతి రోజూ ఆరాత్రిక సమయంలోను, సంధిపూజ (రెండవ, మూడవ రోజుల మధ్య జరిపే ప్రత్యేక పూజ) సమయంలో శ్రీరామకృష్ణులు తేజోమయ రూపంలో దుర్గామాత విగ్రహం ప్రక్కన కనబడడం చూసి హృదయ్ ఆశ్చర్యపోయాడు.

కొద్ది రోజుల్లోనే అతడు దక్షిణేశ్వరానికి తిరిగివచ్చి, తాను చూసిన అద్భుతం గురించి గురుదేవులకు చెప్పాడు.

శ్రీరామకృష్ణులు ఆ సంగతి విని, ఇలా అన్నారు: "అవును. ఆరాత్రిక సమయంలోనూ, సంధిపూజ సమయంలోనూ నీ పూజను తిలకించాలని ఎంతో ఆతురత చెందాను. సమాధి స్థితిలో నన్ను కాంతి మార్గంలో తీసుకుపోతున్నట్లు అనిపించింది. నీ పూజామందిరంలోకి జ్యోతిర్మయ రూపంలో వచ్చాను". ●

# జయ జయ హే మహిషాసుర మర్దిని...

– శ్రీమతి గరిమెళ్ళ లక్ష్మి



మహిషాసురుడు బ్రహ్మదేవుని గురించి ఘోర తపస్సు చేశాడు. . దేవ దానవ గంధర్వులలో ఏ పురుషుడూ తనను చంపకుండా మహిషాసురుడు వరం పొందాడు. పురుషులే తననేమీ చేయలేనప్పుడు ఇక స్త్రీల వల్ల తనకేం ప్రాణ భయమని మహిషాసురుడి ఆలోచన. అయితే, స్త్రీయే తన పాలిట మృత్యువు అవుతుందని అతను గ్రహించలేకపోయాడు.

వరగర్వంతో మహిషాసురుడు భూలోకాన్ని జయించాడు. స్వర్గం పైకి దండెత్తాడు. ఇంద్రుడు, దిక్పాలకులు మొదలైన దేవతలంతా తమ తమ వాహనాల మీద వచ్చారు. ఇరుపక్షాలకూ వంద ఏళ్ళ పాటు ఘోరయుద్ధం జరిగింది. చివరకు మహిషుడు జయించాడు. ఇంద్రాది దేవతలు త్రిమూర్తుల దగ్గరకు వెళ్ళి విషయమంతా తెలియజేశారు. బ్రహ్మ ,విష్ణు ,మహేశ్వరులతో సహా సర్వ దేవతలూ తమ శక్తుల్ని ఏకం చేయాలని సంకల్పించారు. అదే సమయంలో వారి శరీరాల నుండి అసమానమైన తేజస్సు ఉత్పన్నమైంది. అది ముల్లోకాలకూ వ్యాపించి, ఒక స్త్రీమూర్తిగా ఏర్పడింది. శివుని తేజస్సు ఆమె ముఖంగా, శ్రీమహావిష్ణువు తేజస్సు ఆమె బాహువులుగా, బ్రహ్మ తేజస్సు ఆమె పాదాలుగా – ఇలా వారి తేజస్సులు ఆమె వివిధ అవయవాలుగా ఏర్పడ్డాయి. పద్దెనిమిది చేతులతో ఉన్న ఆమెకు దేవతలు వివిధ ఆయుధాలను సమకూర్చారు. తమ మహిమతో ఆమెకు అనేక ఆభరణాలనూ, పట్టు వస్త్రాలనూ సమర్పించారు. హిమవంతుడు ఆమెకు బంగారు రంగులో ఉన్న సింహ వాహనాన్నీ, రత్నాల హారాన్నీ ఇచ్చాడు. ఆ దేవి వారందరూ ఇచ్చిన ఆభరణాలను ధరించి, సింహవాహినిగా శోభించింది.

ఆ జగన్మాతను చూసి దేవతలందరూ “ఓ నారాయణీ, కల్యాణీ, భగవతీ, దేవీ! నీకు నమస్కారం! మహిషాసురుడు మా అందరినీ బాధిస్తున్నాడు. అతణ్ణి సంహరించి, మమ్మల్ని కాపాడు తల్లీ!” అని ప్రార్థించారు. జగదంబ వారికి అభయమిచ్చి, మహాట్టహాసం చేసింది. దానికి పర్వతాలు చలించాయి, దిక్కులు ప్రతిధ్వనించాయి, భూమి కంపించింది, రాక్షసుల గుండెలు అదిరాయి. మహిషుడు దద్దరిల్లి పోయాడు. మహిషుడు ఆయుధాలు చేతబట్టుకుని జగన్మాత ఉన్న ప్రదేశానికి వచ్చాడు. మహిషుణ్ణి చూసిన దేవి శంఖం పూరించింది. వెంటనే మహిషుడు దేవీ అతిలోక సౌందర్యానికి మోహితుడై “దేవీ! మనిద్దరం వివాహం చేసుకుంటే దేవదానవుల యుద్ధాలు మటుమాయ మవుతాయి. లోకాలు హాయిగా ఉంటాయి” అన్నాడు. అప్పుడా తల్లి, “ఓరీ! దేవతలకు మేలు చేయడం కోసం రూపం లేని నేను రూపం ధరిస్తాను, జన్మ లేని నేను జన్మిస్తాను. దుష్టులను శిక్షించడానికే నేను శరీరాన్ని ధరిస్తాను” అంది.

దేవీ మాటలు విన్న మహిషుడు కోపోద్రిక్తుడై ఆమె మీదకు బాణం విడిచాడు; ఆమె దాన్ని మధ్యలోనే ఖండించి, తన ఉక్కుబాణాలను అతడి పైకి సంధించింది. అలా వారిద్దరూ శరయుద్ధం చేయసాగారు. సైన్యమంతా ఒకొక్కరూ మరణించగా, మహిషాసురుడు రెట్టించిన కోపంతో అనేక జంతు రూపాలు ధరించి అమ్మ వారితో పోరాడసాగాడు. చివరకు అమ్మ చక్రాయుధాన్ని రాక్షసుని మీదకు విడిచింది. ఆ చక్రం భయంకరంగా నిప్పులు కక్కుతూ వెళ్ళి, అతడి శిరస్సును ఖండించింది.

మహిషాసురుని మరణానికి అన్ని లోకాలూ పరమానంద భరితమయ్యాయి. దేవతలందరూ ఆ జగదంబను ఎన్నో విధాలుగా స్తుతించారు. అప్పుడు ఆ తల్లి “మీకు కష్టం వచ్చినప్పుడల్లా నన్ను తల్చుకోండి” అని వారిని ఆశీర్వదించి అంతర్థానమైంది.

ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నాడు మహిషాసురునికీ, జగన్మాతకూ మధ్య ప్రారంభమైన యుద్ధం తొమ్మిది రోజుల పాటు కొనసాగింది. పదవరోజు లోకకంటకుడైన మహిషాసురుణ్ణి జగజ్జనని సంహరించింది. అదే విజయ దశమి!

(అక్టోబర్ 21న విజయదశమి)

## ప్రత్యక్షానుభూతే ప్రమాణం

**కా**ళీ (స్వామి అభేదానంద) తన చేతలను అద్వైత వేదాంతంతో సమర్థించుకొనేవాడు. అష్టావక్ర సంహిత చదివి, "నేతి, నేతి" (ఇది కాదు, ఇది కాదు) అనే అద్వైత మార్గంలో సత్యాసత్య విచక్షణ చేసేవాడు. అలా చేస్తూ, భగవంతుని పట్ల ఇతరులకున్న అభిప్రాయాలు గుడ్డి నమ్మకమేనని వారితో వాదించేవాడు.

శ్రీరామకృష్ణులు కాళీతో "నీకు భగవంతునిపై నమ్మకం ఉందా? శాస్త్రాలను ప్రమాణాలుగా నమ్ముతావా?" అని అడిగారు. "లేదండీ" అని కాళీ సమాధాన మిచ్చాడు. భగవత్సాక్షా త్కారం కలగనంత వరకూ, వేదాలలోని సత్యాన్ని గ్రహించనంతవరకూ వాటిని నేను గుడ్డిగా నమ్మను అన్నాడు. కాళిలోని నిజాయతీని గమనించిన శ్రీరామకృష్ణులు సంతోషంతో, ''నువ్వు అన్నింటినీ తెలుసుకొని, ఆమోదించే రోజు తప్పక వస్తుంది" అన్నారు.

స్వామి అభేదానంద

కాళీ తన స్వీయ చరిత్రలో ఇలా వ్రాశాడు: "ఒకరోజు మధ్యాహ్నం గురుదేవులు తమ మంచం పైన పడుకొని ఉన్నారు. బయట తోటలో ఒక వ్యక్తి పచ్చగడ్డి మీద అటూ ఇటూ నడుస్తున్నాడు. గురుదేవులు అప్పుడు నాతో 'దయచేసి అతణ్ణి ఆ గడ్డి మీద నడవవద్దని చెప్పు. నాకు చాలా బాధగా ఉంది. అతడు నా ఛాతీ మీద నడుస్తున్నట్లుగా ఉంది' అన్నారు.

ఆయన మాటలు వినగానే నాకు ఆశ్చర్యం వేసి, బయటకు వెళ్ళి చూస్తే ఆయన చెప్పినట్లే ఒక వ్యక్తి గడ్డి మీద నడవడం కనిపించింది. వెంటనే గడ్డి మీద నడవద్దని అతనికి చెప్పాను. అప్పటికిగాని శ్రీరామకృష్ణుల బాధ తగ్గలేదు."

అద్వైతానుభూతికి ప్రత్యక్ష ప్రమాణంగా నిలచిన శ్రీరామకృష్ణుల సన్నిధిలో కాళీలో బ్రహ్మానుభూతి గురించిన సందేహాలూ, అపోహాలూ తొలగిపోయాయి.#

**(అక్టోబర్ 4న స్వామి అభేదానంద జయంతి)**



స్వామి అఖండానంద

## ప్రేమసుధా భరితం - భక్తిమార్గం

**ఆ**లంబజారులో స్వామి అఖండానందులకు మలేరియా జ్వరం సోకింది. ఈ స్థితిలో ఉండగానే వారికి ఒక దివ్యానుభూతి కలిగింది. భక్తిమార్గం ప్రబోధించే పంచ భావాల కన్నా 'అహం బ్రహ్మాస్మి' అన్న అద్వైతానుభూతే గొప్పదని అంత వరకూ అఖండానందులు అనుకొనేవారు. కానీ ఆ రోజు వారికి కలిగిన దివ్యానుభూతి ఇది: "ఆ గదిలో చైతన్యమూర్తి అయిన బాలగోపాలుణ్ణి అఖండానంద స్వామి చూశారు. స్వామి శరీరం నుంచి కృష్ణుని తల్లి యశోద బయటకు వచ్చింది. బాలగోపాలుడు వెన్న కోసం మారాం చేస్తున్నాడు. యశోద లాలనగా పాటపాడుతూ అతణ్ణి జో కొడుతోంది. అంతలో రామకృష్ణులు ప్రత్యక్షమై 'ఎంత రమణీయ దృశ్యమిది!' అన్నారు. అఖండానందులు ఆనందోత్సాహంలో ఓలలాడుతూ, "ప్రభో! ఈ అనుభూతి అనుపమానం! ఇక నాకు నిర్వాణం కూడా అక్కరలేదు. ఈ ఆనందాన్ని పొందడానికి వందలాది జన్మలు ఎత్తాల్సి వచ్చినా నేను సిద్ధమే" అన్నారు.

ఈ దివ్యానుభూతి పొందిన తరువాత స్వామి అఖండానంద స్మృతి కథలో "ఒక వేసవి మధ్యాహ్నం వేడిగా ఉండి, ఉక్క పోయడంతో నాకు నిద్ర పట్టలేదు. మిగిలిన వాళ్ళంతా చెమటలు పట్టి ప్రక్కలు తడిసినా, నిద్రలోనే ఉన్నారు. నేను లేచి విసనకర్రతో వాళ్ళందరికీ విసిరాను. చెమటలన్నీ ఆరిపోయి సుఖంగా నిద్రించారు. కానీ నా శరీరం కూడా అరగంటలో చల్ల బడింది. ఇతరుల బాధలనూ, సుఖాలనూ నావిగా భావించి, స్పందించే శక్తిని నేను పొందానని తెలుసుకొని, పరమానంద భరితుణ్ణయ్యాను." అని వ్రాశారు. e

**(అక్టోబర్ 11న స్వామి అఖండానంద జయంతి)**

# దేవీ వైభవం

- శ్రీ సామవేదం షణ్ముఖశర్మ విలేఖనం : శ్రీమతి ఎన్. శేషు

**(శ్రీ సామవేదం షణ్ముఖశర్మ గారు చెన్నై రామకృష్ణ మిషన్ ఆశ్రమ సభా ప్రాంగణంలో తొమ్మిది రోజుల పాటు 'దేవీ వైభవం' పై ప్రసంగించారు. ఆ ప్రవచనాల్లోని ముఖ్యాంశాలను ఈ సంచిక నుంచి 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు ధారావాహికగా అందిస్తున్నాం.)**

'దేవీ వైభవం' అనగానే అమ్మవారి విశేషమైన వైభవాలు ఎక్కడెక్కడ వర్ణించి ఉన్నాయో చెప్పుకోబోతున్నాం. దేవీ వైభవం చెప్పుకోవడానికి ఆధార గ్రంథం ఏమిటి? 'దేవీ భాగవతం' అంటే ఒక ఆధార గ్రంథం అని అర్థమవుతుంది. 'లలితా సహస్రం' అంటే అర్థమవుతుంది. 'దేవీ మాహాత్మ్యం' అన్నా ఆధార గ్రంథమని అర్థమవుతుంది. 'దేవీ వైభవం' అంటే భారతీయమైన ఆర్ష గ్రంథాలన్నీ ఆధార గ్రంథాలే. వేదాలు మొదలుకొని మంత్ర శాస్త్రాల వరకూ అపారమైన విస్తారంతో అమ్మవారి వైభవం ప్రస్తావితమవుతూ ఉంది. వేదమే అమ్మవారి వైభవం, అమ్మ వారి కథ, పలుకే వేదం, అంతా అమ్మవారి స్వరూపమే. అమ్మవారిని స్తుతిస్తూ మూక మహాకవి ఇలా అంటారు:

*''వేదమయీం నాదమయీం*
*బిందుమయీం పరపదోద్య*
*దిందుమయీం మంత్రమయీం*
*తంత్ర మయీం ప్రకృతి మయీం*
*నౌమి విశ్వ వికృతి మయీం".* వేదంలో తొలుత నుంచీ అమ్మ వైభవం ప్రస్తావితమైంది. ప్రత్యేకించి ఋగ్వేదంలో 'సరస్వతీ సూక్తం' ఉంది. అలాగే దుర్గాసూక్తం, శ్రీసూక్తం సరేసరి. ఇలా అనేక దేవీ సూక్తాలను చెబుతూ సరస్వతి, అరుంధతి మొదలైన నామాలతో పరాశక్తి స్తుతి ఉంది.



ఉపనిషత్ వాఙ్మయంలో అమ్మవారి వైభవం విస్తారంగా ఉంది. "శ్రుతి సీమంత సిందూరీ కృత పాదాబ్జ ధూళికా" అని అమ్మ వారిని కీర్తిస్తున్నాం. శ్రుతి = వేదం; వేదం యొక్క సీమంతం, వేదం యొక్క శిరఃస్థానాలే ఈ ఉపనిషత్తులు. సీమంతం అంటే శిరస్సు. ఆ శిరస్సు దగ్గర ఉన్న పాపిట కాంతులు అమ్మ వారి పాదాలకు పారాణి దిద్దుతున్నాయి. అంటే అమ్మ వారి పాదాల పారాణి వేదమాతల పాపిటకు సిందూరం అయింది. అంటే వేదానికి శిర-స్థానమే అమ్మ చరణాలు. వేదమాతలు అమ్మ వారి పాదాలను తలలపై పెట్టుకున్నారు. అంటే ఉపనిషత్ ప్రతిపాద్యమైన పరతత్త్వమే అమ్మ పదం అని చెప్పడం 'లలితా సహస్రం'లో వశిన్యాది వాగ్దేవతల హృదయం. అందుకే

"శ్రుతి సీమంత సిందూరీ
కృత పాదాబ్జ ధూళికా
సకలాగమ సందోహ
శుక్తి సంపుట మౌక్తికా"

నిగమం అంటే వేదం, ఆగమం అంటే స్థూలంగా మంత్ర శాస్త్రాలు (మనం 'తంత్రం' అని చెప్పు కుంటున్నది). వేదాలలోనూ, ఇటు తంత్రాలలోనూ కూడా అమ్మవారి వైభవం విస్తారంగా ప్రస్తావితమైంది. అందుకు 'నిజాజ్ఞా రూప నిగమా'లో వేదం; 'శ్రుతి సీమంత' అనే శబ్దంలో వేదాంతం చెప్పబడు తున్నాయి. 'సకలాగమ సందోహ శుక్తి సంపుట మౌక్తికా' అన్నప్పుడు ఆగమాలు చెప్పబడుతున్నాయి. ఆగమాలనే ముత్యపు చిప్పలో అమ్మ వారు ముత్యంలా వెలిగిపోతున్నారు. అందుకే అటు వేదాలలోనూ, ఇటు తంత్రశాస్త్రాలలోనూ అమ్మ వారి వైభవాన్ని విస్తారంగా వివరించారు. ముఖ్యంగా ఉపనిషత్తుల్లో

దేవీ ఉపనిషత్తు, దేవీ అధర్వశీర్షోపనిషత్తు, బహ్వృచోపనిషత్తు, అరుణోపనిషత్తు, కేనోపనిషత్తు మొదలైనవన్నీ అమ్మవారి వైభవాన్ని చెబుతున్నాయి. ఈ విధంగా ఒక వైపు ఆర్షమైన సాహిత్యాన్ని మనం చెప్పుకున్నాం.

రెండోది పురాణాలు. పురాణాలన్నిటిలో "దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదారయేత్" అని పురాణవిద్య ప్రారంభ మవుతుంది. పురాణ ప్రారంభమే దేవీం సరస్వతీం = దేవి అయిన సరస్వతి. అమ్మలు ఎక్కువ లేరు, ఉన్నది ఒకే అమ్మ. ఆ తల్లినే మనం సరస్వతి అనీ, గాయత్రి అనీ, దుర్గ అనీ, లక్ష్మి అనీ రకరకాల నామాలతో పిలుస్తున్నాం. ఇన్ని నామాలు ఉన్నప్పుడు అన్ని రూపాలు! ఏ రూపమైనా ధరించగలదు ఆ తల్లి. ఆమె అనేక రూపాలతో వ్యక్తమవుతోంది.



మనకు ఉపనిషత్తులు చెబుతున్న ప్రకారం సరస్వతి అంటే పరాశక్తి జగదంబిక. లలితా పరాభట్టారిక అయిన జగదంబికకే సరస్వతీ నామం ఉంది. "సరస్వతీ శాస్త్రమయీ గుహాంబా గుహ్య రూపిణీ" అందుకే మనం సరస్వతికి నమస్కరించి, వ్యాసునికి నమస్కరించి, పురాణవిద్యలో ప్రవేశిస్తున్నాం. పురాణాలన్నిటిలోనూ అమ్మ యొక్క కీర్తిని వైభవంగా చెప్పారు. ప్రత్యేకించి అమ్మకు సంబంధించిన పురాణం 'దేవీ భాగవతం' ఒక్కటే. దేవీ భాగవతం తరువాత 'మార్కండేయ పురాణం' ప్రత్యేకించి 'దేవీ మాహాత్మ్యం' అనే పేరుతో ఒక అపూర్వమైన అమ్మ తత్త్వాన్ని అనుగ్రహించింది. అదంతా కూడా మనకు బ్రహ్మ విద్యా తత్త్వాన్ని బోధిస్తోంది. ఈ దేవీ మాహాత్మ్యాన్ని 'చండీ సప్తశతి' పేరుతో కొందరు, 'చండీ నవశతి' పేరుతో కొందరు వారి వారి పద్ధతులలో ఆగమోక్తంగా మలచుకుని ఉపాసన చేస్తున్నారు.

అన్ని పురాణాలలోనూ అమ్మ గురించి చెబుతున్నారు. 'స్కాంద పురాణం'లో, 'శివ మహాపురాణం'లోనూ ప్రస్తావించారు. ఇది కాక మహాభారతం కూడా దేవీ వైభవాన్ని విస్తారంగా అందజేస్తోంది. కురుక్షేత్ర యుద్ధానికి ముందు అర్జునుణ్ణీ, ధర్మరాజునీ దుర్గాదేవిని స్తోత్రం చేయవలసిందిగా శ్రీకృష్ణుడు బోధించినట్లు కనపడుతోంది. అలాగే అనిరుద్ధుణ్ణి బాణాసురుడు బంధించినప్పుడు నాగపాశం నుంచి విమోచన కలిగించడానికి నారదమహర్షి వచ్చి దుర్గాదేవి యొక్క మంత్రాన్ని జపించమని ఉపదేశిస్తాడు.

భాగవతంలో మరొక విశేషం కనపడుతుంది. శ్రీకృష్ణపరమాత్మ శమంతకమణిని తీసుకురావడానికి వెళ్ళినప్పుడు జాంబవంతుడితో యుద్ధం చేస్తూ చాలాకాలం గుహలో ఉండిపోతాడు. ఆ గుహ బయట యాదవులందరూ ఉండి, ఆయనకు ఏమైనా ప్రమాదం జరిగిందేమో అని అమ్మ వారిని ఆరాధిస్తారు. అప్పుడు దుర్గాదేవి ప్రత్యక్షమై, ఆయన శత్రుంజయత్వాన్ని సాధించి, జాంబవంతుణ్ణి అనుగ్రహించి వస్తారని వారికి అభయ మిచ్చినట్లు మనకు భాగవతం చెప్తోంది. ఆ తల్లి భాగవతంలో శ్రీకృష్ణుని సహోదరిగా – నందుని కుమార్తె నందాదేవిగా ఆవిర్భవించింది. పద్మనాభ సహోదరి – సరసిజ నాభ సహోదరిగా ఆ యోగమాయను మనం కీర్తిస్తాం. కృష్ణ పరమాత్మ స్వయంగా "దుర్గ, కృష్ణ, మాధవి, వైష్ణవి... ఇవి జగదాంబ నామాలు. ఈ నామాలతో ఎవరు కీర్తన చేస్తారో వారు అన్ని అరిష్టాలనూ పోగొట్టుకొని, అమ్మ అనుగ్రహానికి పాత్రులవుతారు" అని దేవతలకు దేవీ విద్యను బోధించినట్లు భాగవతం చెబుతోంది.

అమ్మ వైభవం కనపడని చోటు లేదు. విశ్వమంతా దేవీ వైభవమే. వాఙ్మయమంతా దేవీ వైభవమే. బాగా చింతన చేస్తే మన శరీరంలో అణువణువునా దేవీ వైభవమే. మనదేమీ లేదు. ఈ తొమ్మిది రోజులూ "నాది" అనే భావం – "అహం" పోగొట్టుకోవడానికే కూర్చుంటున్నాం. చివరకు 'అహం ఇత్యేవ భవానీ' – అహం అనేది కూడా భవానీ తత్త్వమే అనుకోవాలి. "నేను" ముందు అమ్మను ఆశ్రయించి, ఆ నేను అమ్మలో కరిగి, ఇక నేను అనేటటువంటి ఈ నేను భావం మిగలకుండా సర్వం అంబామయం అనే స్థితి పొందడానికే మనం ఇక్కడ కూర్చున్నాం. అది అమ్మ కృప వల్ల లభించవలసిందే. "నేను" అనేది పోయినప్పుడు ఇక నేను చెబుతున్నాననేది ఏమిటి ఉంది. పలుకే అమ్మ, బుద్ధి అమ్మ, జ్ఞానం అమ్మ, ఆ వాక్ బుద్ధి జ్ఞానాధిష్ఠాత్రి అయిన జగదంబిక మీ యందు నా యందు ఉండి, పలికించి, పరిశీలింపజేసి, అవగాహన అయ్యేటట్లు అనుగ్రహింపవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

**(సశేషం)**



# భక్తుడికి భావమే ప్రధానం

- శ్రీమతి వల్లభజోస్యుల జలజ

జాతి, మతం, వయస్సు మొదలైన భేదాల మీద ఆధారపడేది కాదు – భక్తి యోగం. భక్తి యోగాన్ని బాల్య, కౌమారాల్లో కాకుండా వార్ధక్యంలోనే అవలంబించాలని చాలా మంది అభిప్రాయం.

వైరాగ్యమంటే ఏమిటో తెలుసుకొని, సంసారంలో ఆసక్తి లేకుండా, భగవంతుని ప్రసంగంలో కొద్దిగా శ్రద్ధ కలిగి ఉన్నవాళ్ళకు భక్తియోగం సిద్ధిస్తుందని భాగవతం స్పష్టం చేస్తోంది. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" అని శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో చెప్పినట్లుగా భగవంతుని మీద శ్రద్ధ లేకుండా ఎప్పుడూ సందేహాలతో, అనుమానాలతో నిండిపోయి ఉన్న మానవుడు భక్తి సాధన ఏ విధంగా చేస్తాడు? ఇలాంటి వాళ్ళకు భక్తి యోగం దుర్లభమే. సర్వకాల సర్వావస్థల్లో కాకపోయినా, అప్పుడప్పుడైనా భగవంతుని మీదకు వెళ్ళే మనసున్న వారికి భక్తియోగం ప్రయోజనకారి అవుతుందనడంలో ఎలాంటి సందేహమూ లేదు.

భక్తి సాధనకు బాల్యంలోనే బీజం పడి మొలకెత్తాలి. బాల్యంలో హృదయం నిర్మలంగా ఉండడం వల్ల భక్తి బీజాన్ని నాటడానికి మంచి సమయం. తరువాతి కాలంలో సంసారంలో మునిగి ఉండడం వల్ల హృదయం గట్టిబడి, భక్తి బీజం మొలకెత్తదని శ్రీరామకృష్ణ పరమహంస బోధించారు.

భక్తి రాజ్యంలో జాతి, మత, కుల భేదాలు లేవు. భగవంతుని దగ్గర అందరూ సమానులే. ఛండాలురైనా సరే, భగవంతునికి ఆత్మ సమర్పణ చేసి, ప్రార్థించడం మొదలుపెడితే, భగవంతుడు వశుడైనట్లుగా మనకు ఎందరో భగవత్ భక్తుల కథల వల్ల తెలుస్తోంది. గుహుడు ఒకసారి శ్రీరామచంద్రుణ్ణి "ఓరీ రామా!" అని పిలిచినప్పుడు, లక్ష్మణుడు ఆ సంబోధన వినగానే గుహుని మీదకు విల్లు ఎక్కుపెట్టాడట. శ్రీరామచంద్రుడు తమ్ముణ్ణి వారించి, గుహుడు చేసిన అపరాధమేమీ లేదనీ, ప్రేమ వల్లనే "ఓరీ రామా" అని పిలిచాడనీ, గుహుడు తనకు పరమ మిత్రుడనీ అన్నాడట. భక్తి లేని బ్రాహ్మణుని దగ్గరకు పోనినీ, భక్తుడైన ఛండాలుని దగ్గరే ఉంటాననీ శ్రీరామచంద్రుడు అభయమిచ్చాడు. పంచవటీ తీరంలో శబరి ఎంగిలి చేసి ఇచ్చిన పండ్లను శ్రీరామచంద్రుడు ఇష్టంగా తిన్నాడు.

విద్య లేకపోతే భగవత్ భక్తి చేకూరుతుందా అనే సందేహం రావచ్చు. ఈ విషయంలో శ్రీరామకృష్ణ పరమహంస మనకు ఆదర్శ ప్రాయులు. వారు చదువు కోకపోయినా, వారితో పోల్చదగిన జ్ఞానులు ఎంతమంది ఉన్నారు? ఎంతోమంది గొప్ప గొప్ప విద్వాంసులు ఆయన దగ్గర జ్ఞానామృతాన్ని పానం చేస్తూ ఉండేవారు. ఇదే విధంగా ఎంతోమంది భక్తులు చదవడం, వ్రాయడం తెలియకపోయినా భక్తవరేణ్యులుగా పూజలందుకోవడం మనకు తెలుసు. భక్తి వల్లనే జ్ఞాన వికాసం కలుగుతుంది. ఈశ్వరుడు మనందరికీ తల్లీ తండ్రీ అయి ఉన్నాడు కదా! తల్లితండ్రులను పిలవడానికి విద్య కానీ, వాగాడంబరం కానీ అవసరం లేదు.

అక్షర జ్ఞానం లేనివాడైనా సరే, బిడ్డ "అమ్మా" అని పిలుస్తూ ప్రేమతో తల్లి చుట్టూ తిరుగుతాడు. తల్లి కూడా బిడ్డను చేరదీస్తూ, లాలిస్తూ, బిడ్డ చుట్టూ తిరుగుతూ ఉంటుంది. భక్తుడు, భగవంతుడు కూడా ఇంతే. భక్తుడు భగవంతుణ్ణి పిలుస్తూ, ఆర్తితో, వేదనతో ఏడుస్తూ, భగవంతుణ్ణి గురించిన ఆలోచనలతోనే ఉన్నప్పుడు ఆ అవ్యాజ కరుణామూర్తి తన నిజ స్వరూపాన్ని భక్తులకు చూపిస్తాడు.

భక్తుల చరిత్రలు ఒక్కసారి తిరగేస్తే, ధ్రువుని వయస్సు ఎంత? వ్యాధుని నడత ఎలాంటిది? కుబ్జ ఎంతటి సౌందర్యవతి? సుదాముడు ఎంతటి ధనవంతుడు? విదురునిది ఎలాంటి వంశం? అయినప్పటికీ వాసుదేవుడు వీరందరి పట్ల విశేషమైన కృప చూపించాడు. భక్తి ప్రియుడు, భక్త సులభుడు అయిన వాసుదేవుడు కేవలం భక్తి వల్లనే సంతుష్టుడయ్యాడు. కాబట్టి భక్తుడికి భావమే ప్రధానం కానీ బాహ్యాడంబరాలు కావని గ్రహించాలి. ౬

# మత పతాకంపై శాంతి సందేశం

ప్రపంచంలో ప్రజలందరూ ఒకే మతాన్ని అనుసరిస్తూ ఒకే మూసలో పోసిన నైతిక ప్రమాణాల్ని ఆమోదించడం దురదృష్టకరమైన పరిణామం. అలా జరిగినప్పుడు మతపరమైన, ఆధ్యాత్మికపరమైన ప్రగతి నశిస్తుంది. మన మత సత్యాలే ఉత్కృష్టమైనవనీ, వాటినే ప్రజలందరూ అనుసరించాలనీ ఆకాంక్షించడం విరమించాలి. ఒకే ప్రపంచ మతాన్ని వ్యవస్థీకరించి, ఆ ధర్మాల్ని, విధానాల్ని అనుసరించాలనే విశ్వాసం నుండి ప్రజల్ని విముఖుల్ని చేయాలి.

మనం ఇతర మతస్థులపట్ల సహనం ప్రదర్శించటమే కాదు వారిని అభిమానించి అక్కున చేర్చుకోవాలి. ఆ భావనే, ఆ సత్యమే సర్వమతాలకూ ప్రాణ ప్రతిష్ఠాపన మంత్రం కావాలి.



ఎవరినీ నిరసించవద్దు. తోటి వారికి చేయూతనీయగల్గితే మంచిదే. లేకుంటే చేతులు జోడించి వారి శ్రేయస్సును ఆకాంక్షిస్తూ వారి త్రోవను వారిని పోనీయి. అంతేకానీ తోటి వారిని అభిశంసిస్తూ వారి ప్రయత్నాలకు ఆటంకాలు కల్పించడం ఉచితం కాదు. ఇతరులను నిరసించడం, అభిశంసించడాల్లో మన శక్తిని వృథా చేయకూడదు.

మానవులందరి గమ్యం ఒకే ఒక సత్యాన్ని తెలుసుకోవడమే! మధ్యలో మనం కల్పించుకొన్న విభేదాలు ఊహామాత్రాలే! విభిన్న మతవిశ్వాసాల వల్ల ప్రజలకు మేలే కల్గుతుంది. ఏ విశ్వాసమైనా, వ్యక్తిని మతపరమైన జీవన విధానంలో ఇమిడ్చి మంచిని పెంచుతుంది కానీ కీడు చేయదు. అంతేకాదు మత విధానాలు ఎన్ని ఎక్కువుంటే సమాజానికి అంత ఎక్కువ ప్రయోజనం కల్గుతుంది. వాటి వలన వ్యక్తుల్లో దైవ ప్రవృత్తి పెరిగే అవకాశాలు బాహుళ్యంగా లభిస్తాయి.

క్రైస్తవుడు, హిందువు కానక్కరలేదు. బౌద్ధమతస్థుడిగా మారనవసరం లేదు. అలాగే హిందువుగానీ, బౌద్ధుడుగానీ క్రైస్తవునిగా మారవలసిన అవసరం లేదు. ఏ మతస్థుడైనా పరమతం యొక్క ప్రధానాంశాల్ని జీర్ణించుకొని, తన ప్రత్యేక విశ్వాసాలను సంరక్షించుకోవాలి. తన పురోభివృద్ధి ప్రమాణాన్ని తన మార్గంలో అనుసరిస్తూ, ఆత్మవికాసాన్ని సాధించుకోవాలి.

పవిత్రత, నిర్మలత్వం, దాతృత్వం ఇవి ప్రపంచంలో ఏ మతానికీ పరిమితం కాదు. ప్రతి మతంలోను సర్వోత్కృష్టులైన స్త్రీ పురుషులు ఉద్భవించారు. ఈ నేపథ్యంలో ఎవరైనా తన మతం మాత్రమే గొప్పదనీ, అది మాత్రమే సజీవంగా వర్ధిల్లుతుందనీ, మిగతా మతాలు నశిస్తాయనీ కలలు కంటే, అతని మూర్ఖత్వానికి మనం జాలిపడాలి. అలాంటి వారి కనువిప్పు కొరకు ప్రతి మత కేతనంపైనా 'సహకరించు – నిరోధించకు', స్వీకరణ మాత్రమే – వినాశంకాదు', 'సామరస్యం, శాంతి మాత్రమే, వ్యతిరేకత కాదు' అనే నినాదాల్ని ప్రస్ఫుటంగా లిఖించవలసి వుంటుంది.

ఎప్పటికైనా విశ్వానికంతటికీ ఒకే మతం అంటూ ఉండడం తటస్థిస్తే అది దేశ, కాల పరిస్థితులకు అతీతంగా ఉంటుంది. అలాంటి మతాన్ని మనం ప్రజల ముందు ఉంచగలిగితే అసహనానికీ, పరమత ద్వేషానికీ స్థానముండదు. భగవంతుని అనంత తత్త్వమే మతాలన్నిటి యొక్క సమాహారం. #

**(స్వామి వివేకానంద 'నా భారతం అమర భారతం' నుంచి)**



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

### స్వామి జపానంద స్వీయ అనుభవాలు -4

## పక్షుల్లోనూ పరమాత్మ దర్శనం

**(గత సంచిక తరువాయి)**

గురువు గారి దగ్గరకు వెళ్ళి కూర్చున్నాను. అప్పుడు ఆయన, "నిన్నటి నుండి ఒకే మాట మనస్సులో తిరుగుతోంది. మత్తు పదార్థాల గురించి మీరు చెప్పింది నిజమే. కానీ అలవాటై పోయింది. ఎలా మానడం? ఒక్క సారిగా వదిలేస్తే కష్టం. ధ్యానం కుదరదు" అని అన్నారు.



అప్పుడు ఆ సాధువు (*స్వామి జపానంద*) "క్రమంగా తగ్గించండి. ఏ మత్తూ తీసు కోకుండా ధ్యానం చేయడానికి ప్రయత్నించండి. నెమ్మదిగా ఆ అలవాటు పోతుంది" అని చెప్పారు.

ఆ మాటలు విని గురువుగారు సంతోషించారు. "అలాగే ప్రయత్నిస్తాను" అన్నారు. ఇంతలో బ్రహ్మచారులు భిక్ష తీసుకుని వచ్చారు.

భోజనం చేశాక సన్న్యాసి మళ్ళీ తన ప్రయాణం సాగించారు. నర్మదా తీరంలోనే మరో గ్రామం వైపు నడక సాగించారు. అడవి మార్గంలో వెళుతున్నారు. ఏ సందడీ లేదు. సుమారు ఒక గంట అలా నడిచి ఉంటారు. ఒక చెట్టు కింద నుంచి వెళుతూ ఉంటే చిన్న గుడ్లగూబ లాంటి పక్షులు ఏడు ఆ చెట్టుపైన కూర్చొని ఉన్నాయి. అవి పిచ్చుకల కన్నా కొంచెం పెద్దవిగా ఉన్నాయి. అవి సన్న్యాసి వైపే చూస్తూ తలలు ఊపుతున్నాయి.

ఆ కొమ్మ కింద నుంచే సన్న్యాసి వెళ్ళాలి. అవి తలలు ఊపుతూ సన్న్యాసిని చూస్తూనే ఉన్నాయి. ఆ పక్షులు తనతో ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తున్నాయని భావించి సన్న్యాసి అక్కడే ఉండిపోయారు. పక్షులు చెప్పదలుచుకున్నది ఏమై ఉంటుందా అని ఆలోచిస్తూ కూర్చున్నారు. "ఈ పక్షులు సామాన్యంగా సాయంకాలం చీకటి పడే వేళకు బయటకు వస్తాయి. పగలు చెట్టు తొర్రలో దాగి ఉంటాయి. అడవుల్లో ఎప్పుడైనా పగలు బయటికి వస్తాయేమో! పగలు వాటికి కళ్ళు బాగా కనిపించవు. అందుకని అవి రాత్రే తిరుగుతాయి. ఆహారం వెతుక్కుంటాయి" అని సాధువు అనుకోసాగారు.

కొంతసేపయ్యాక ఆ పక్షులు ఒక్కొక్కటే ఎగిరి వెళ్ళిపోయాయి. అప్పుడు సన్న్యాసి ఆ చెట్టు కింద నుంచి బయలుదేరారు. పది అడుగులు నడిచేసరికి ఒక మలుపు వచ్చింది. అక్కడ నీటి దగ్గర నుంచి నడవడానికి తోవ ఉంది. అక్కడ సన్న్యాసికి అప్పుడే ఒక సింహం వచ్చి, వెళ్ళినట్లు అడుగుజాడలు కనిపించాయి. "ఇప్పుడే ఇక్కడకు ఒక సింహం వచ్చి, నదిలో నీళ్ళు తాగి వెళ్ళినట్లుంది. ఆ పక్షులు అలా నన్ను ఆపకపోయి ఉంటే, నేను ఆ సింహానికి ఆహారం అయ్యుండే వాణ్ణి. ఆ ఏడు పక్షుల రూపంలో సప్తదేవతలు ఈశ్వరుని నిర్దేశానుసారం నన్ను రక్షించారు" అని సాధువు గ్రహించారు. పెద్ద ఆపద నుంచి తనను కాపాడిన ఆ పరమేశ్వరునికి మనస్సులోనే నమస్కరించారు.

## నిద్ర పోనివ్వని నాగుపాము

(పరివ్రాజక సన్న్యాసి (*స్వామి జపానంద*) సౌరాష్ట్రలో జునాగఢ్ దగ్గర ఉన్న బిల్ఖా సంస్థానంలో చాతుర్మాస్య దీక్షలో ఉన్నారు. 'ప్రభునా పీపలా' అనే పేరున్న పెద్ద రావి చెట్టు దగ్గర బిల్ఖా సంస్థానానికి చెందిన ఒక ముఖ్య ఉద్యోగి ఇల్లు ఉంది. అక్కడే సన్న్యాసి బస చేశారు.)

అది వర్షాకాలం. బాగా వర్షాలు పడడం వల్ల నూతులూ, చెరువులూ – అన్నీ నీటితో నిండి ఉన్నాయి. నీటి వసతి బాగుండడంతో చెట్లూ పొదలు అన్నీ పచ్చగా ఉన్నాయి పొలాలన్నీ పచ్చగా నవనవలాడుతున్నాయి. ఎటుచూసినా వాతావరణం మనస్సుకు ఆహ్లాదకరంగా ఉంది. రాత్రి ఏకాంతంలో సన్న్యాసి ఆనందంగా గడిపేవారు. కీచురాళ్ళ ధ్వని తప్ప మరే శబ్దాలూ వినపడేవి కావు. అడవి మృగాలు నిశ్శబ్దంగా విహరించేవి. ఒక

వృద్ధుడు పనులు చేసి పెట్టేవాడు. అతణ్ణి పటేల్ అని పిలిచేవారు. అతడు మంచివాడు. శక్తి కొద్దీ పని, సేవ చేసేవాడు.

ఒకరోజు రాత్రి ఆస్థానంలో హరికథ విని తిరిగి వచ్చేసరికి సన్యాసికి చాలా ఆలస్యమైపోయింది. ఆ రోజు పటేల్ సెలవులో ఉన్నాడు. అందుకని అక్కడ ఇంకెవరూ లేరు. సన్యాసి తన గదిలోకి వెళ్ళి మంచం మీద పడుకున్నారు. కిటికీలు తెరచి ఉన్నాయి. చల్లటి గాలి వీస్తోంది. కానీ ఎంత ప్రయత్నించినా నిద్ర రావడం లేదు. కళ్ళు మూతపడగానే ఎవరో మాట్లాడుతున్నట్లు "ఇదిగో ఇక్కడుంది" అనే మాట వినిపించేది. ఆ మాటలు ఎటు నుంచి వినిపిస్తున్నాయో అటు నాలుగున్నర అడుగుల ఎత్తున్న బీరువా ఉంది. అందులో ఏవో మందులున్నాయి. ఆ గదిలోనే అయిదు, అయిదున్నర అడుగులు ఎత్తున్న మరో రెండు బీరువాలున్నాయి. మళ్ళీ మళ్ళీ "ఇక్కడ ఉంది", "ఇక్కడే ఉంది" అనే మాటలు ఎవరో అంటున్నట్లు అనిపించేసరికి ఆ సన్యాసికి నిద్రే పట్టలేదు. చివరకు ఒక లాంతరు తీసుకుని అక్కడ ఎవరున్నారో అని అటూ ఇటూ వెతికారు. ఎక్కడా ఎవరూ కనిపించలేదు. వెళ్ళి పడుకున్నారు. ఈ సారి "ఇక్కడ ఉంది" అన్న మాట ఇంకా స్పష్టంగా వినిపించింది.

ఇక ఆయన పడుకోలేకపోయారు. "ఇవాళ బుర్రలో ఏం దూరిందో కానీ నిద్ర రావడం లేదు. ఇలా వినిపిస్తోంది" అనుకొని, మళ్ళీ దీపం తీసుకొని చూశారు. బీరువా కింద ఇటూ ఇటూ కర్రతో కొట్టారు. ఏమీ లేదు. మళ్ళీ మంచం మీద పడుకోగానే "ఇక్కడ ఉంది" అనే వినిపించసాగింది. ఏదో భ్రాంతిలా ఉంది. ఇక నిద్ర రాదు. ఏమిటి చెయ్యడం?

ఆఖరుసారిగా ఒక్కసారి చూద్దాం అని లేచారు. కర్రతో ఇటూ అటూ కొడుతూ ఒక బల్ల ఎక్కారు. చివరకు బీరువా పైన కర్రతో కొట్టారు. "బుస్" అని గట్టిగా బుస వినిపించగానే, అక్కడ ఒక పాము ఉందని తెలిసింది. కానీ కనిపించడం లేదు. మరొకసారి కర్రతో కొట్టగానే బుస కొడుతూ పాము ఎగిరి కింద పడింది. తెరిచి ఉన్న ద్వారం గుండా బయట వరండాలోకి వెళ్ళిపోయింది. అది పొడవాటి నల్లటి నాగుపాము. వరండా చుట్టూ వెదురుతో దడి కట్టి ఉంది. ఒక మూల సీసాలతో నిండిన కర్ర పెట్టెలున్నాయి. వాటి వెనక ఆ పాము వెళ్ళి దాక్కుంది. తలపైన కర్ర దెబ్బ తగిలినందువల్ల ఇప్పుడు ఆ పాము ఆయనకు శత్రువైంది. వెదురు దడికి ఉన్న తలుపు తెరిచి ఆ కర్ర పెట్టెలను అటూ ఇటూ కదిపితే ఆ పాము బయటకు వచ్చింది. అక్కడ నుంచి కదిలి, దడికి ఉన్న కన్నంలో నుంచి బయటకు వెళ్ళడానికి ప్రయత్నించింది. అడవి మృగాలు లోపలకు రాకుండా ఆ దడి కట్టారు. దడికి ఉన్న కన్నాలలో నుంచి ఆ పాము సులువుగా బయటకు వెళ్ళగలదు. పాము శరీరం సగం బయటకు వెళ్ళింది.

ఇంకా త్వరగా దాన్ని తరిమేద్దామనే ఉద్దేశంతో సన్యాసి కర్రతో కొట్టారు. ఆ దెబ్బకు దాని ఎముక విరిగి, సగం శరీరం బయట సగం శరీరం లోపల వేలాడుతూ ఉండిపోయింది. ఆ పాము కోపంతో భయంకరంగా బుసలు కొడుతూ దడి మీద తలతో కొట్టసాగింది. పావుగంట, 20 నిమిషాల వరకు అలా కొడుతూనే ఉంది. దాని ముఖ భాగం వెదురుకు కొట్టుకొని, కోసుకొని ముక్కలైంది. ఆఖరికి అది చనిపోయింది. అన్ని వైపులా కొంత దూరం వరకు రక్తపు చుక్కలు పడ్డాయి.

పరివ్రాజక సన్యాసి రెండు గంటల తరవాత ఆ నాగుపాముకు అంత్యక్రియలు చేశారు. జరిగిన



తప్పుకు తనను క్షమించాల్సిందిగా ఈశ్వరుణ్ణి ప్రార్థించారు. ఆ నాగుపాము ఏడడుగుల పొడవుంది. తరువాత సన్యాసి నిశ్చింతగా నిద్రపోయారు. ఉదయం లేచేసరికి పటేల్ వచ్చాడు. "ఇక్కడ ఉంది. ఇక్కడ ఉంది" అని పలుమార్లు చెప్పి, ఆ సాధువును రక్షించినవాడు సాక్షాత్తూ ఆ భగవంతుడే! #e **(సశేషం)**

**అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

# గురు సేవా పరాయణుడు గోవింద భట్టు

కథ: **అళగరాజా** చిత్రాలు: **శంకర్** తెలుగుసేత: **స్వామి జ్ఞానదానంద**

**1** శ్రీరామానుజుని మేనమామ తిరుమలై నంబి. ఆ వైష్ణవాచార్యుడు తిరుపతిలో స్వామి వారి సేవలో నిమగ్నుడై ఉండేవాడు. ఒకసారి తన మేనమామను చూడాలని రామానుజుడు తిరుపతికి వెళ్ళాడు.

**2** రా నాయనా! రామానుజా! కాంచీపురంలో అందరూ క్షేమమే కదా!



నమస్కారం మామయ్యా! తమ అనుగ్రహం వల్ల అందరూ కుశలమే. స్వామిని దర్శించుకోవడానికీ, మీ ఆశీస్సులు పొందడానికీ వచ్చాను.

**3** తిరుమలై నంబి అల్లుడు గోవిందభట్టు. ఆయన తిరుమలై నంబికి శిష్యుడు కూడా! అతడు రామానుజుని పినతల్లి కుమారుడు. అతనిని పలకరించిన రామానుజుడు...



గోవిందా! నువ్వు ధన్యుడవు. తిరుపతిలోనే ఉంటూ స్వామికి సేవ చేస్తూ ఆచార్యునికి కూడా సేవలందిస్తూ ఉంటున్నావు. నువ్వు నిజంగా భాగ్యశాలివి!

**4** ఒక సాయంత్రం రామానుజుడు తోటలో పచార్లు చేస్తున్నాడు. అప్పుడు గోవిందభట్టు ఒక నాగుపాము నోటిలో తన చెయ్యి ఉంచడం రామానుజుడు గమనించాడు.



**5** గోవిందా! నీకెంత కరుణ! విషసర్పం బాధను కూడా పోగొట్టావు. సకల జీవుల దుఃఖాలనూ తనవిగా భావించి, వాటిని ఆదుకొనడానికి ప్రయత్నించే నిజమైన భక్తుడవు నువ్వే!



అంతా మీ అనుగ్రహం స్వామీ!

**7** అన్నీ తెలిసే ఇలా చేస్తున్నావా?




స్వామీ! గురుదేవులు శయనించేటప్పుడు ఈ శయ్య వారికి, సౌకర్యంగా ఉంటుందో లేదో అని చూడడానికే ఇలా చేశాను.

**6** ఒకరోజు గోవిందభట్టు తమ గురువర్యులైన తిరుమలై నంబి నిద్రించే శయ్య మీద పడుకుని ఇటూ అటూ పొర్లడం చూసి, రామానుజుడు హడలి పోయాడు.

అపచారం! అపచారం! నువ్వేం చేస్తున్నావు గోవిందా! ఆచార్యుని శయ్య మీద పడుకోవడమా? దీని పర్యవసానమేమిటో నీకు తెలుసా?



తెలుసు స్వామీ! నరకవాసమే!

**8** మామయ్యా! నాదొక్క మనవి! గోవిందుణ్ణి నాతో పాటు పంపి అనుగ్రహించండి!




అలాగే ఆచార్య దేవా!

మిగతా 36వ పేజీలో...



**- స్వామి సుకృతానంద**



–ఎస్. ఎస్. నారాయణ, ముమ్మిడివరం

**? : శ్రీరామకృష్ణులు "భగవదనుగ్రహం అనే మందమారుతం సదావీస్తున్నది. నీ తెరచాపను ఎత్తు" అన్నారు దీని అంతరార్థమేమిటి?**

✍: భగవంతుడు కరుణామయుడు. శివునికి 'కరుణానిధి' అనే నామముంది. భక్తులపై ఆయన అనుగ్రహం సదా, సర్వదా ఉంది. అయితే మాయ, భ్రమలలో పడి భక్తుడు ఇది తెలుసుకోవడంలేదు. తన కష్టాలకు కారణం దైవానుగ్రహం లేకపోవడమే అనుకుంటున్నాడు. భగవన్నామస్మరణకు తనకు తీరికలేదనీ, ఎన్నో బాధ్యతలు ఉన్నాయనీ వాపోతుంటాడు. నీకు ఎన్ని పనులున్నా దైవస్మరణ వదలవద్దని శ్రీరామకృష్ణుల ఉవాచ. "భగవదనుగ్రహం మంద మారుతంలా ఎల్లప్పుడూ వీస్తున్నది. నీ తెరచాపను ఎత్తు" అంటే నువ్వు సాధనలు చెయ్యి అని అర్థం. ఎన్ని పనులున్నా నామస్మరణ, సంకీర్తన, జపధ్యానాలు చెయ్యమని చెబుతున్నారు శ్రీరామకృష్ణులు. అలా చేసిన నాడు దైవానుగ్రహం తప్పక లభిస్తుంది.

– ఎం. వెంకట రావు, బుట్టాయిగూడెం

**? : మధు కైటభులను సంహరించింది శ్రీమహావిష్ణువు కదా! మరి మధుకైటభ సంహారం 'దేవీ మాహాత్మ్యం' ఎలా అవుతుంది?**

✍: బ్రహ్మదేవుడు జగన్మాతను ప్రార్థించగా త్రిగుణాత్మిక అయిన ఆమె తన తమోగుణాన్ని ఉపసంహరించుకొని యోగనిద్రలో ఉన్న మహావిష్ణువును మేల్కొల్పుతుంది. అప్పుడు మహా విష్ణువు మేల్కొని మధు కైటభుల్ని వధిస్తాడు.

జీవుడు కూడా తమోగుణం – అంటే మోహం తొలగితేనే ఆత్మ చైతన్యుడవుతాడు. అప్పుడు అజ్ఞానం తొలగి, నిజచైతన్యం ప్రకాశిస్తుంది. మధు కైటభుల వధకు అమ్మ వారు పరోక్షంగా కారణమయ్యారు.

సీతా రామ లక్ష్మణులు వెళుతున్నారు. రాముని వెనుక సీతమ్మ, ఆ వెనుక లక్ష్మణుడు. రాముడు పరబ్రహ్మ. లక్ష్మణుడు జీవుడు. ఇక, సీతమ్మ మాయ. లక్ష్మణుడు (జీవుడు) రాముని (పరబ్రహ్మ) దర్శనం పొందాలంటే అమ్మవారు పక్కకు తొలగాలి. జగన్మాత అనుగ్రహంతోనే అజ్ఞానాంధకారాలు తొలగి, సాక్షాత్కారం అవుతుంది.

– జి. కేశవరావు, కాకినాడ

**? : సూక్ష్మ పంచభూతాలు అంటే ఏంటి?**

✍: ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, భూమి – ఈ పంచ మహాభూతాల ఆవిర్భావానికి ముందు తన్మాత్రలు సూక్ష్మ పంచ మహాభూతాలు. సూక్ష్మం నుంచే స్థూలం వస్తుంది. ఇవి సృష్టికి పూర్వం ఉండేవి. ఇవి స్థూల జగత్తు ఆవిర్భావానికి కారణాలు. వీటిలో ఆకాశం, వాయువు సూక్ష్మాలే, కంటికి కనపడవు.

–సి. హెచ్. శ్రీరామిరెడ్డి, పొదలకొండపల్లె.

**? : గ్రహణ సమయంలో జపం చేయవచ్చునా?**

✍: గ్రహణ సమయంలో జపం, నైమిత్తిక కర్మ. అనంత ఫలదాయకం. గ్రహణ సమయంలో మనస్సు చాలా ప్రశాంతంగా ఉంటుంది. తొందరగా ఏకాగ్రత ఏర్పడుతుంది. C

# ఆధ్యాత్మిక అన్వేషణ



**- స్వామి తపస్యానంద**

**ప్రశ్న:** 'ఎవరికైతే ఇది చివరి జన్మో వారు ఇక్కడకు వస్తారు' అనీ, అలాగే 'కనీసం ఒక్కసారైనా భగవంతుణ్ణి ఆర్తితో పిలిచినవారు ఇక్కడకు రాక మానరు' అనీ శ్రీరామకృష్ణులు చెప్పారు. ఈ వాక్యాలను అర్థం చేసుకొనేదెలా?

**జవాబు:** మొదటి వాక్యం ద్వారా తమ చివరి జన్మను గడుపుతున్నవారిలో అధికులు శ్రీరామకృష్ణుల చెంతకు చేరుతారని అర్థం చేసుకోవచ్చు. కానీ అలాంటి వాళ్ళందరూ కూడా తప్పని సరిగా శ్రీరామకృష్ణుల వద్దకు చేరాలని మాత్రం దానర్థం కాదు. మోక్షానికి మార్గాలు పలు విధాలన్న వారి సందేశానికి ఇది వ్యతిరేక మవుతుంది.

ఒక అవతార పురుషుడు సశరీరుడై ఉన్నప్పుడు ఉన్నత సాధకులు అనేకులు సహజంగానే అతని వైపు ఆకర్షింపబడతారు. శ్రీరామ కృష్ణుల విషయంలో ఇది మరింత స్పష్టం. ప్రచార ఆర్భాటాలకు దూరంగా ఉంటూ శిష్యులను పోగు చేసుకోవడానికి యాత్రల లాంటివి చేయక పోయినప్పటికీ, ఆధ్యాత్మిక పథంలో బాగా పురోగమించిన కొందరు సాధకులు సహజంగానే శ్రీరామకృష్ణుల ఆధ్యాత్మిక శక్తికి ఆకర్షితులై, వారిని శరణుజొచ్చారు. అయితే ఆ వర్గానికి చెందని ఇతర ఉన్నత ఆధ్యాత్మిక సాధకులు కూడా తప్పక ఉండవచ్చు.

ఇక రెండో వర్గానికి సంబంధించినంత వరకూ నిజమైన సాధకులందరూ శ్రీరామకృష్ణుల జీవితం, వారి ఉపదేశాల వైపు ఆకర్షితులవుతారని అర్థం. సాధారణంగా జనులు ఒక సత్పురుషుణ్ణి - అతని బాహ్య రూపం, మానవాతీత శక్తులు, వాగ్ధాటి, ఇతరుల్ని ఆకర్షించే శక్తి మొదలైన వాటిని చూసి అంచనా వేస్తారు.

కానీ శ్రీరామకృష్ణులలో అలాంటి లక్షణాలు లేశమైనా లేవు. నిష్కాపట్యం, తీవ్ర వైరాగ్యం, పవిత్రత, అచంచల భక్తి వారి ప్రత్యేకతలు. అలాంటి లక్షణాలను పుణికిపుచ్చుకోవాలనే తపన ఉన్నవారు మాత్రమే వారి గొప్పతనాన్ని అవగతం చేసుకోగలరు. అందువల్లే అలాంటి సాధకులు శ్రీరామకృష్ణుల చెంతకు చేరతారు. ఆ మహాపురుషుని సౌశీల్యం ఆధ్యాత్మిక సాధకులను కట్టిపడేస్తుంది. ఒక రకంగా సాధకుల ఆధ్యాత్మిక శ్రేష్ఠతను కనిపెట్టే గీటురాయి - శ్రీరామకృష్ణులు.

శ్రీరామకృష్ణులు తమ శరీరాన్ని చాలించిన తరువాతి కాలంలో కూడా మీరు ప్రశ్నలో పేర్కొన్న రెండు వాక్యాలకూ ప్రాధాన్యం ఉంది.



అవతార పురుషుడి సాంగత్యం సాధకుల జీవితాల్లో వెలుగులు నింపుతుంది.

అవతార పురుషుడనే వాడు కేవలం తన సమకాలీనుల కోసమే జీవించడు. శ్రీరామ కృష్ణులు స్థూల శరీరంతో ఉన్నప్పుడు వారి సాంగత్యాన్ని పొందిన వారి లానే, ఆ తరువాత వచ్చినవారు కూడా ఆధ్యాత్మికంగా వారితో మమేకం కాగలరు. భగవదేచ్ఛకు వ్యక్తీక రణమే అవతార పురుషుడు. అతడు ఈ స్థూల శరీరాన్ని వీడిన తరువాత కూడా సూక్ష్మ శరీరం ద్వారా భగవదనుగ్రహానికి మాధ్యమంగా నిలుస్తాడు. తాము విడిచివెళ్ళిన ఆధ్యాత్మిక సంప్రదాయాలకు ఆకర్షితులైన భక్తుల కోరికలను ఈడేర్చుతుంటారు. అందువల్లే ఈ నాటికీ ప్రపంచం నలుమూలల్లోనూ ఆధ్యాత్మిక సాధకులు శ్రీరామకృష్ణుల పట్ల ఆకర్షితులవుతుండడాన్ని మనం చూస్తున్నాం.

> నియమనిష్ఠలున్న వాడు ఒకప్పుడు దుష్టసంసర్గం ఏర్పడినా శ్రద్ధా భక్తుల్ని కోల్పోడు. భగవన్నామం వినబడగానే మైమరచి పోతాడు. చెకుముకి రాయి వేలాది సంవత్సరాలు నీటిలో ఉన్నా, బయటికి తీసి దాన్ని రాతితో కొట్టగానే నిప్పురవ్వల్ని వెలికి చిమ్ముతుంది. **- స్వామి బ్రహ్మానంద**

# ... ఆ మహనీయుల మార్గంలో 'మహాత్ముడు'

- స్వామి గుణేశానంద　　అనువక్త : బి.సైదులు

రెండువేల సంవత్సరాల మానవ రాజకీయ చరిత్రలోనే శక్తిమంతమైన ఉద్యమానికి ఊపిరిగా నిలిచినవాడు, రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యపు పునాదులను కదిలించినవాడు... గాంధీ మహాత్ముడు. ఇంతటి మహాపురుషుడు మనలాగే రక్తమాంసాలతో నిజంగానే ఈ నేలమీద నడిచాడంటే ముందుతరాల వాళ్ళు నమ్మరని పాశ్చాత్యమేధావులతోనే నీరాజనాలందుకున్నవాడు. భారతీయ ఆధ్యాత్మిక వారసత్వానికి ప్రతీకగా, సత్యాగ్రహమే సాధనంగా భారతావనికి స్వేచ్ఛాపతాకను ప్రసాదించినవాడు. సత్యం, అహింస, త్యాగం... ముప్పేటలా అల్లుకున్న పవిత్ర సూత్రమే ఆయన అంతరంగం. అంతటి మహాత్ముడికీ పరోక్షంగా మార్గనిర్దేశం చేసిన మహనీయులు శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద. 'ఆ ఇద్దరి మహనీయులకు సమమైన వారు వేరొకరు ఉంటారనుకోను. నేను ఆదర్శంగా స్వీకరించిన ధర్మాలన్నీ ఆచరించి చూపినవారు' అన్నారు మహాత్మాగాంధీ.

### స్వామీజీ...సత్యాగ్రహి...

స్వామి వివేకానంద, గాంధీజీ 1893లో ఒకేమారు విదేశీయాత్రకు బయలుదేరటం యాదృచ్ఛికం. చికాగో సర్వమత మహాసభల కోసం స్వామీజీ అమెరికాకూ, ఆంగ్లేయుల పాలనకు సహాయనిరాకరణ ప్రకటించేందుకు గాంధీజీ దక్షిణాఫ్రికాకూ పయనమయ్యారు. ఆయనలాంటి కర్మయోగి అక్కడ అవసరమని స్వామీజీ ముందే ఊహించారు. అందుకే స్వామీజీ మహాపురుష్ (స్వామి శివానంద) మహరాజ్‌కి ఒక లేఖ వ్రాస్తూ 'దక్షిణాఫ్రికా వాసులకు ఆధ్యాత్మిక బాధ్యత తీసుకునేందుకు ఒక వ్యక్తి కావాలి. అతడు యురోపియన్లతో మంచి సంబంధబాంధవ్యాలను కలిగి ఉండాలి. ఈ పని చేసేందుకు దృఢమనస్కుడైన వ్యక్తి కావాలి. దీని ఫలితం మున్ముందు భారతావనికి సత్ఫలితాలనిస్తుంది.' అని స్పష్టం చేశారు. ఆ దార్శనికుడి మాటలు వృథాపోలేదు. మహాత్ముని రూపంలో సాకారమయ్యాయి. దక్షిణాఫ్రికాలో ఉన్నరోజుల్లో గాంధీజీ కూడా స్వామి వివేకానంద అక్కడ పర్యటించాలని ఎంతో ఆకాంక్షించారు. తన మిత్రునికి ఒకమారు ఉత్తరం వ్రాస్తూ 'స్వామీజీ ఇక్కడ పర్యటించేలా ఒప్పించు. ఆయనలో అద్భుతమైన దైవశక్తి ఉందనుకుంటున్నాను. తన ప్రసంగంతో యురోపియన్లను మంత్రముగ్ధుల్ని చేయగలరు. భారతీయులపై యురోపియన్లలో ప్రేమను, ఆరాధనను పెంచగలరు.' అంటూ మహాత్మాగాంధీ స్వామీజీని దక్షిణాఫ్రికాకు ఆహ్వానించేందుకు విశ్వప్రయత్నం చేశారు. కాని అనారోగ్య కారణాలవల్ల స్వామీజీ వెళ్లలేకపోయారు. కాని ఆయన ఆశయప్రతినిధిగా గాంధీజీ భారతీయతను విశ్వవ్యాప్తం చేశారు.

### శ్రీరామకృష్ణుల మాటలే శిరోధార్యం...

గురువరేణ్యులు శ్రీరామకృష్ణుల ఆదర్శజీవితం తనను అధికంగా ప్రభావితం చేసిందని మహాత్మాగాంధీ స్వయంగా ఎన్నోమార్లు స్మరించుకునేవారు. బ్రహ్మచర్యం, త్యాగం, స్థైర్యం వారి నుంచే అలవడ్డాయనేవారు. ముఖ్యంగా శ్రీరామకృష్ణులు శారదామాతను గౌరవించిన తీరు గాంధీజీపై తీవ్ర ప్రభావాన్ని చూపింది. ఆ స్ఫూర్తితోనే తన అర్ధాంగి కస్తూర్బాను 'బా' (అమ్మ) అని సంబోధించేవారు. ఆపదసమయల్లోనూ రామనామస్మరణనే నమ్ముకున్నతీరు, నిరాడంబర జీవనశైలి పరోక్షంగా శ్రీరామకృష్ణుల నుంచే అలవడినవని చెప్పుకునేవారు గాంధీజీ. 'నిజానికి ఆయనే మహాత్ముడు. ఎవరిని ఆ పేరుతో సంబోధించాలో తెలీక జనం నన్ను ఆత్మీయంగా అలా పిలుస్తున్నారే కానీ, నిజానికి ఆ బిరుదుకు అర్హులు శ్రీరామకృష్ణులే' అని అభిప్రాయపడ్డ నిగర్వి మహాత్మాగాంధీ.

### సేవాభావంలోనూ స్ఫూర్తి....

మహాత్మునిలో సేవాభావానికి స్ఫూర్తినిచ్చినది స్వామీజీ జీవితం, ప్రసంగాలే. 'దరిద్రదేవోభవ'– దీనులు, అజ్ఞానులు, అందరిలో ఉన్నదీ ఒకే భగవంతుడన్న స్వామి వివేకానంద మాటలు మహాత్ముని కదిలించాయి. తన హరిజనోద్ధరణ నినాదానికి ఊపిరిపోశాయి. 'నేను మళ్లీపుడితే... పీడితుల, నిరాధారుల మధ్యే పుడతాను. వారికి సేవచేస్తూ భగవంతుని చేరుకోగలను' అనేవారు గాంధీజీ. త్యాగగుణాన్ని కన్నుమూసేంత వరకూ త్యజించలేదు మహాత్ముడు. సామాన్యులు, పీడితులే ఆయన ఆత్మీయులు. స్వామీజీ ఆశయాలను మరింతగా ఆచరణలోకి తేవాలని ఆరాట పడేవారు గాంధీజీ. ఆ మహనీయుని ఆశయాల్ని కాస్తంత ఆచరణలో పెడితేనే జనం నన్ను మహాత్ముడని కొనియాడుతున్నారు. నూటికి నూరు పాళ్లు ఆచరిస్తే అద్భుతాలు జరుగుతాయని అంటూ ఉండేవారు గాంధీజీ.

### ...ఆ అడుగుజాడల్లోనే అపర త్యాగమూర్తి...

విస్తృతంగా పర్యటించటం వల్లే భారతావని సమస్యల్ని అవగతం చేసుకోగలమని, ఆర్ద్రతతో సేవచేయగలమని మహాత్ముడు గుర్తించటానికి కూడా స్వామీజీయే కారణం. 1886లో శ్రీరామకృష్ణుల నిష్క్రమణ అనంతరం స్వామీజీ కాశ్మీరు నుంచి కన్యాకుమారి వరకు పర్యటించారు. ఈ కర్మభూమి కన్నీళ్ళను చూసి కరిగిపోయారు. కార్యాచరణకు శ్రీకారం చుట్టారు. ఈ నేలకు జవజీవాలను ప్రసాదించారు. ఇదే స్ఫూర్తితో గాంధీజీ కూడా 1915లో భారతదేశం అణువణువును ప్రత్యక్షంగా పరిశీలించారు. 'మనదేశానికి స్వాతంత్ర్యం తేవటానికి రాలేదు నేను. ముందు అట్టడుగు జనానికి సేవచేస్తాను. వారిలో స్వాతంత్ర్యకాంక్ష రగిలిస్తాను. ఆ తరువాతే స్వేచ్ఛాభారతావని గురించి ఆలోచిస్తాను' అని 1932 వరకు దేశపర్యటనతో, భవిష్యత్ ఉద్యమప్రణాళికల రచనలతో గడిపారు. స్వామీజీలా మహాత్ముడు కూడా ముందు ప్రజలు నైతికతను అలవరచుకోవాలని తపన పడేవారు.

### బేలూరు మఠంలో గాంధీజీ

1902లో స్వామి వివేకానందను కలిసేందుకు బేలూరుమఠం వెళ్ళారు గాంధీజీ. కాని అప్పటికే స్వామీజీ ఆరోగ్యం క్షీణించింది. దాంతో ఆయన ఎవరినీ కలిసే పరిస్థితిలో లేరని తెలుసుకొని గాంధీజీ మిన్నకున్నారు. ఆ తరువాత స్వామీజీ మహాభినిష్క్రమణ అనంతరం 1921లో గాంధీజీ తిరిగి బేలూరు మఠం వెళ్ళారు. అప్పుడు స్వామీజీ గదికి వెళ్ళి 'నేను ఇక్కడ ఉపన్యసించటానికో, స్వాతంత్ర్య ఉద్యమస్ఫూర్తిని నింపటానికో రాలేదు. నేనిక్కడికి ఒక శిష్యునిలానే వచ్చాను. నాకు శక్తిని ప్రసాదించిన స్థలానికి కృతజ్ఞతలు అర్పించేందుకు వచ్చాను' అని వినమ్రంగా పలికారు గాంధీజీ.

### 'గీత'దాటని పావనజీవనం...

ప్రపంచచరిత్రలోనే ప్రశస్తమైన రాజకీయ ఉద్యమానికి సారథిగా నిలిచినా గాంధీజీ ఏనాడూ ఆధ్యాత్మికపథాన్ని వీడలేదు. శ్రీరామకృష్ణులు తరచూ ఉదహరించే తామరాకుపై నీటిబొట్టులా నిస్సంగత్వ ధోరణితోనే మసలేవారు మహాత్మా గాంధీ. భగవద్గీత పారాయణానికే కాదు, ఆచరణకూ పరమోన్నత జీవనసారస్వతమని ఋజువు చేశారు. భారతీయ ఆధ్యాత్మిక పరంపర పరమోత్కృష్ట మోక్షాన్నే ప్రసాదించినపుడు, స్వాతంత్ర్యం ఎందుకు సాధ్యం కాదని నిరూపించారు. భారతీయ తత్త్వసారాన్ని సత్యాగ్రహంగా స్వీకరించి ఉద్యమాన్ని నడిపారు. జయకేతనం ఎగురవేశారు. వ్యక్తిగత జీవితంలోనూ విలువల 'గీత'దాటని పవిత్రజీవితం మహాత్ముడిది.

### జవజీవాలనిచ్చిన జాతిపిత....

దాస్యంలో మగ్గుతున్న భారతావనికి జవజీవాలనిచ్చి జాగృతం చేసిన జాతిపిత మహాత్ముడు. 'ఎవరి హృదయం పరులకోసం తపించి, సేవచేసి తరిస్తుందో అలాంటి హృదయంలోనే దేవుడు కొలువుంటాడు. పీడితులపై కరుణచూపేవాడే మహాత్ముడు' అని ఉద్ఘాటించేవారు స్వామి వివేకానంద. ఆ అక్షరతూణీరాలు గాంధీజీకి ఆచరణీయ అగ్నికణికలై దారిచూపాయి. అక్షరాలా మహాత్ముణ్ణి చేశాయి. చల్లనిచూపు, పీలకాయం, పలచని మోము, కట్టేది ముతక కొల్లాయి. తినేది కొంచెం అన్నం, నేలమీద పడక, విశ్రమించేది తక్కువ, పరిశ్రమే ఎక్కువ. ఆయన మూర్తీభవించిన కరుణ, క్షమ. పసివాడిలా నిష్కల్మషుడు. విరోధులతో సైతం మర్యాదగా, మృదువుగా మాట్లాడే స్వభావం. అంతర్ముఖ తత్త్వం. అజేయమైన ఆత్మశక్తి. ఎక్కడా రాజీపడడు. లౌక్యం తెలీని జ్ఞాని. నిజంగా కర్మయోగి... అని విదేశీయులు సైతం ఆదర్శంగా తీసుకోవాలని తపించే గాంధీజీ నిజంగా ఈ శతాబ్దంలోనే అరుదైన మహాత్ముడు.

**(అక్టోబర్ 2న గాంధీ జయంతి)**

# ఆత్మ పరిశీలనతో ఆత్మీయత!

- ప్రవ్రాజిక అఖండ ప్రాణ

మనుష్యుల మధ్య సత్సంబంధాల్ని పెంపొందించుకోవడం ఓ కళ. ఇది నడుస్తూ ధ్యానం చేయడం వంటిది. మనసు ప్రవాహాన్ని గమనిస్తూ, మన చుట్టూవున్న వారితోపాటు సాగిపోవడం. అయితే జీవితంలోని చాలా విషయాలలాగనే ఈ కళ అంతర్గత చర్యతోనే ప్రారంభం అవుతుంది. ఏమిటా అంతర్గత చర్య?

అమెరికాలోని చెరొకీ జాతి ప్రజల్లో వాడుకలో వున్న ప్రాచీన కథ ఒకటుంది. ఒక సాయంకాలం వేళ ఓ వృద్ధ చెరొకీయుడు మనుష్యుల్లో జరిగే అంతర్యుద్ధం గురించి తన మనవడితో చెప్పాడు. ఈ యుద్ధం మనలో అంతర్గతంగా దాగివున్న రెండు తోడేళ్ళ మధ్య జరుగుతున్నది. ఒకటి చెడ్డ తోడేలు. అదే స్వార్థం, దురహంకారం, మమకారం, అసూయ, అసహనం, కోపం, నిరాశ, స్వార్థం, ఆత్మన్యూనతా భావం, హింస, దుఃఖం.

**# నన్ను ద్వేషించే వారిని కూడా ప్రేమిస్తాను.**

**# మాటల్నీ, చేతల్నీ సమన్వయం చేస్తాను.**

**# ఇతరుల్ని నొప్పించకుండా ప్రయత్నిస్తాను.**

**# నాకు మంచి కానిదాన్ని ఇతరులకు చేయను.**



రెండవది మంచి తోడేలు. అదే నిస్వార్థత, సమదృష్టి, ఆత్మ నిగ్రహం, నిర్లిప్తత, సంతృప్తి, ఓర్పు, నిజాయతీ, ధైర్యం, క్షమా గుణం, విశ్వాసం, ప్రతిభ, సంతోషం, శాంతి.

మనవడు దీన్ని గురించి ఓ నిముషం ఆలోచించి తాతని 'తాతయ్యా, మరి ఏ తోడేలు గెలుస్తుంది?' అని అడిగాడు. వృద్ధ చెరొకీ వెంటనే "నువ్వు ఎవర్ని పెంచిపోషిస్తావో ఆ తోడేలు" అని సమాధానం చెప్పాడు.

మన జీవిత లక్ష్యాన్ని నెరవేర్చడానికి మనసుల్ని మంచి భావాలతో నింపుకోవాలి. దీనికి గాను కొంత సమయాన్ని కేటాయించాలి. కనీసం రోజుకి ఒక్కసారైనా నిదానంగా కూర్చుని మన జీవితం గురించి ఆలోచించాలి. అప్పుడు మనం మనలో ఉన్న "మంచి తోడేలు"ని తృప్తిపరచినట్లవుతుంది. అంతేకాక కొద్ది నిముషాలపాటు మౌనంగా ఉండి ధ్యానం, జపం చేయాలి. మనలోని అంతరాత్మతో సంబంధం కలిగి ఉండాలంటే మంచీ, చెడులకు అతీతంగా ఉండాలంటే ఆత్మవిమర్శ చేసుకోవాలి.

దివ్యజనని శ్రీశారదాదేవి ఆచరణాత్మకమైన సలహా ఒకటి ఇచ్చారు. 'కనీసం ఉదయం ఒకసారి, సాయంత్రం ఒకసారి నువ్వు ఒకచోట నిదానంగా కూర్చొని, రోజులో చేసే పనులలో మంచీ, చెడులను గురించి ఆలోచించాలి. అది పడవకి చుక్కానిలా నీకు ఉపయోగపడుతుంది.' ఇలాంటి అభ్యాసం వల్ల క్రితం రోజుకీ ఈరోజుకీ మన మనః స్థితిని పోల్చుకోవచ్చు. ఉదయం, సాయంత్రం చేసే పనితోపాటు, ఆత్మవిమర్శ చెయ్యందే మనం ఏం సాధిస్తున్నామన్నది ఎలా తెలుస్తుంది? మన దైనందిన జీవితంలో ఇటువంటి సాధనలు చెయ్యడానికి ప్రయత్నించకపోతే మన హృదయం, భ్రమలతోనూ, బాధలతోనూ, నిరాశతోనూ నిండిపోతుంది. అంతేకాక మన మనస్సులోనే సవాలక్ష సందేహాలు పుట్టి మనల్ని కురుక్షేత్రంలోని అర్జునిడిలా సంశయాత్ముల్ని చేస్తాయి.

ఆలోచనలే మన చేతలుగా మారతాయి. ఆ చేతల్ని క్రమబద్ధీకరించుకుంటే అవే అలవాట్లుగా అవుతాయి. అవి మన పరిణతికి అద్దం పడతాయి. కాబట్టి వాటి పట్ల జాగ్రత్త వహించడం ఎంతో అవసరం.

మనవైపు మనం వెనక్కి తిరిగి చూసుకోవడం మూలంగా మనం చాలా పాఠాలు నేర్చుకోవచ్చు. బైరన్ క్యాటీ అనే ఆమె ఆత్మపరిశీలన ద్వారా ప్రయోజనం పొందడమే కాకుండా ఇతరులకి కూడా సమావేశాలు, వెబ్‌సైట్, పుస్తకాల ద్వారా సలహాల్ని, సూచనల్ని ఇస్తుంది. వాటిలో కొన్ని:

1. ఇతరులు నన్నే విధంగా గౌరవిస్తారో అలాగే నేను కూడా వారిని గౌరవిస్తాను.
2. నాకు మంచి కానిదాన్ని ఇతరులకు చేయను.
3. నన్ను నేను ఎలా ప్రేమిస్తానో అలానే ప్రపంచాన్ని కూడా ప్రేమిస్తాను.
4. మంచివారికి నేను మంచిగా ఉంటాను. చెడ్డవారి పట్ల కూడా నేను మంచిగానే ప్రవర్తిస్తాను.
5. ఇతరుల్ని నొప్పించకుండా ఉండడానికి ప్రయత్నిస్తాను.
6. నన్ను ద్వేషించే వారిని కూడా ప్రేమిస్తాను.
7. సత్యాసత్యాలను బేరీజు వేసుకొంటాను.
8. మాటల్నీ, చేతల్నీ సమన్వయం చేస్తాను.

ఎంతో విశాలమైన, బాధ్యతాయుతమైన జీవితంలోకి అడుగు పెట్టబోతున్న యువత ఆరోగ్యవంతమైన మానవసంబంధాలను ఏర్పరుచుకోవడానికి 'ఆత్మ పరిశీలన' అలవర్చుకోవాలి. అప్పుడే నిజమైన ఆత్మీయతను పెంపొందించుకోవడం సాధ్యమవుతుంది.

స్వామి వివేకానంద "మన మనస్సుపైనే మనం ఆధారపడాలి. మనస్సుని విశ్లేషించి అందులోనే ఉన్న సత్యాన్ని కనుగొనగలగాలి. వేదాంత తత్త్వానికి ఇదే పునాదిరాయి" అంటారు. **అనువాదం : డాక్టర్ ఎన్. గిరజా నిర్మల**

## పండుగలు - పర్వదినాలు

### అక్టోబరు - 2007

| | | | |
|---|---|---|---|
| 04 | గురువారం | : | స్వామి అభేదానంద జయంతి |
| 07 | ఆదివారం | : | ఏకాదశి |
| 11 | గురువారం | : | మహాలయ అమావాస్య, స్వామి అఖండానంద జయంతి |
| 19 | శుక్రవారం | : | మహా అష్టమి |
| 21 | ఆదివారం | : | విజయదశమి |
| 22 | సోమవారం | : | ఏకాదశి |
| 25 | గురువారం | : | లక్ష్మీపూజ |

### నవంబరు - 2007

| | | | |
|---|---|---|---|
| 05 | సోమవారం | : | ఏకాదశి |
| 08 | గురువారం | : | దీపావళి |
| 09 | శుక్రవారం | : | కాళీపూజ |
| 20 | మంగళవారం | : | ఏకాదశి |
| 22 | గురువారం | : | స్వామి సుబోధానంద జయంతి |
| 23 | శుక్రవారం | : | స్వామి విజ్ఞానానంద జయంతి |

## మంచిని పోషించు - చెడును జయించు

– షేక్. గౌస్ సాహెబ్

పూర్వము మానవులు భక్తి, రక్తి, శక్తులతో ప్రగతి సాధించారు. నేడు కుయుక్తి వల్ల క్రింద పడిపోతున్నారు. మాటలు కోటలు దాటుతున్నా, చేతలు గడపదాటడం లేదు. మాటలకూ, చేతలకూ పొంతన లేదు. సమాజం అంతటా కల్మషం వ్యాపించింది. ఈ కల్మషం యువ హృదయాలను కలుషితం చేస్తోంది. అధికారులుగాని, అనధికారులుగాని, ధనికులుకాని, పండితులు కాని ఎవరైనా సరే ఈ విషయంలో తగిన శ్రద్ధ చూపించడం లేదు. అందువల్ల యువత పెడతోవలు తొక్కుతోంది.



మంచిని పోషించి చెడును జయించాలి!

శాంతిదేవత, ధర్మదేవత కళకళలాడే దేశమే సర్వ సౌభాగ్య వంతంగా విలసిల్లుతుంది. కాబట్టి యువతీ యువకులు ధర్మ పరాయణులై పరవళ్ళు త్రొక్కుతున్న అధర్మాన్ని నిరోధించడానికి నడుం బిగించాలి. ఈ విషయంలో అశ్రద్ధ వహించడం క్షమార్హం కాదని ఈ శ్లోకం చెబుతోంది.

**కర్త కారయితా చైవ ప్రేరకశ్చాను మోదకః ।**
**సుకృతే దుష్కృతే చైవ చత్వారస్సమ భాగినః ॥**

కార్యం చేసే వాడు, చేయించేవాడు, ప్రేరేపించేవాడు, ఆమోదించేవాడు– ఈ నాలుగురూ చేపట్టే కార్యం సత్కర్మ అయినా, దుష్కర్మ అయినా ఫలితాన్ని సమంగా అనుభవిస్తారు. కాబట్టి సత్కార్యాల్ని చేసేవాడికి సత్ఫలితం, దుష్కార్యాల్ని చేసేవాడికి దుష్ఫలితం సంభవిస్తుంది. దుర్యోధనుడికి సహకరించిన కర్ణుడు నశించాడు. ధర్మస్వరూపుడైన రాముణ్ణి ఆశ్రయించడం వల్ల విభీషణుడు రాజై రాణించాడు. కాబట్టి నేటి సమాజం కురుక్షేత్ర రణరంగంలా కాకుండా రామరాజ్యాన్ని స్థాపించాలంటే మనమంతా మంచిని పోషించి చెడుని జయించడానికి సన్నద్ధం కావాలి. ఆ బాధ్యత నేటి యువతదే!

## మనసు - మర్మం

– శ్రీరామ్

# అనిర్వచనీయం... ఆత్మానుభవం

మనసు సహజ లక్షణం చంచలత్వం. అశాంతితో నిండిన అలాంటి మనసే అన్ని దుఃఖాలకూ మూల కారణం. ఆలోచనలనే అలల అలజడిని రూపుమాపి, మనసును నిశ్చలంగా చేయాలి. అప్పుడే అనిర్వచనీయమైన ఆనందం మన అనుభవంలోకి వస్తుంది. గాఢనిద్రలో మనసు లయమైనప్పుడు సరిగ్గా ఇలాంటి స్థితే ప్రతి ఒక్కరికీ కలుగుతుంది. కానీ అచేతనంగా ఉన్న మనకు ఆ సమయంలో ఏమీ తెలియదు. కేవలం మేల్కొన్న తరువాతే 'నేను గాఢంగా నిద్రించాను... అప్పుడు నాకు ఏ కలతా లేదు' అని మనకు తెలుస్తుంది కాని ఆ క్షణంలో మాత్రం మనోనిశ్చలత్వాన్ని గురించిన జ్ఞానం ఏ మాత్రమూ ఉండదు.

ఎవరైనా ప్రయత్నించి నిద్రపోగలరు. కానీ కలలు కనడం, గాఢనిద్రలోకి జారుకోవడం మన చేతిలో ఉండవు. అవి అప్రయత్నంగా సంభవిస్తాయి. మన ప్రమేయం లేకుండానే లభించే అలాంటి స్థితులు ఎక్కువ కాలం నిలవవు. తిరిగి వాటంతట అవే వీగిపోతాయి కూడా!

వివిధ వ్యక్తులు మత్తు పదార్థాలకు అలవాటు పడడం కూడా దాదాపు అలాంటిదే! అవి ఆలోచనలను నిర్వీర్య పరిచి మనసును కొద్దిసేపు అచేతనంగా ఉంచుతాయి. కానీ అదే మనసు మేల్కొన్నప్పుడు విపరీతమైన బలం పుంజుకొని, విజృంభిస్తుంది. అప్పుడు దాన్ని ఆపడం వారి తరం కాదు.

నిద్రావస్థలో లేని సమయంలోకూడా అప్పుడప్పుడూ ప్రతివారూ ఇలాంటి అనుభూతి పొందుతారు. కానీ అప్పుడు వారు అప్రమత్తంగా ఉండకపోవచ్చు. విపరీతమైన దుఃఖంలో, సంతోషంలో అన్ని ఆలోచనలూ అడుగంటిపోతాయి. దాన్ని మనం గమనించం. ఆ పరిస్థితిలో మనం వివశులమై ఉండడమే దీనికి కారణం.

ఆ అచేతన స్థితిని జాగ్రదావస్థలో పరిపూర్ణ ప్రజ్ఞలో ఉన్నప్పుడు పొందాలి. ఆ ఆనందం అనిర్వచనీయం. దాన్ని కొన్ని క్షణాలపాటు కాదు... నిరవధికంగా అనుభవించాలి. ప్రయత్న రహితంగానే నిరంతరం ఆ అనుభూతిలో ఉండగలగాలి. అప్పుడు మన సమస్యలన్నీ శాశ్వతంగా దూరమవుతాయి. బాధ, దుఃఖం మన దరిచేరలేవు. అసలైన 'ఆనందం' అంటే అదే!

ఆలోచనలన్నింటినీ సమూలంగా నాశనం చేసినప్పుడు మనం ఆ స్థాయికి చేరుకోగలం. అందుకోసం మొదట వాటిని ప్రయత్నించి అణిచివేయాలి! వదలకుండా కొనసాగిస్తున్నప్పుడు ఈ సాధన మన స్వభావంగా మారడం మొదలవుతుంది! 'తలపులు' తలెత్తడమే క్రమంగా తగ్గిపోతుంది! కొంత కాలానికి ఆలోచనలన్నీ సమసిపోయి మనస్సు పరిశుద్ధమైన అద్దంలా ఆనందానికి ప్రతి రూపమవుతుంది.

ఆలోచనలన్నింటినీ ఏక మొత్తంగా, ఒకేసారి నిర్మూలించడానికి సాధ్యం కాదు. "కనీసం ఒక 'తలపు'నైనా ఒక క్షణంపాటు నిరోధించ గలిగితే ఎంతో సాధించినట్లు" అని చెబుతారు. కాబట్టి ఆరంభంలో కొన్ని మంచి ఆలోచనల్ని విడవకుండా పట్టుకోవాలి. వాటి సహాయంతో అనవసరమైన వాటిపై విజయం సాధించే ప్రయత్నం చేయాలి. ఒక్కొక్క కోరికా బలహీనమవుతూ, మనసులో నుండి మాయమయ్యేకొద్దీ మనలో వర్ణనాతీతమైన ఆనందం పెల్లుబుకుతుంది. ప్రపంచంలోని ఏ వస్తువు వల్లా లభించని అద్వితీయమైన అనుభూతి అది! #

# భారతీయ మహిళా మణిదీపాలు: చెన్నమ్మ

ఆంగ్లమూలం : డాక్టర్ ఎస్. రమణి

అనువక్త : రెంటాల జయదేవ

ఆధునిక మైసూరుకు వాయవ్య దిశలోని చిన్న రాష్ట్రం – కేలడి. అక్కడ పదిహేడో శతాబ్దిలోని ద్వితీయార్ధంలో నాయక వంశానికి చెందిన ఇద్దరు సోదరులు ఉండేవారు. వారి పేర్లు: భద్రప్ప నాయక, సోమశేఖర నాయక. రెండో సోదరుడైన సోమశేఖర నాయకుడి భార్య చెన్నమ్మ.



## పరాక్రమంలో, పరిపాలనలో సాటిలేని మహిళ

అపారమైన పాలనా సామర్థ్యం ఉన్న స్త్రీ మూర్తిగా చెన్నమ్మ పేరు సంపాదించింది. ప్రభుత్వపు పగ్గాలు చేపట్టడానికి భర్త ఆమెను అనుమతించాడు. ఆయన తన సోదరుడితో కలసి పరిపాలన సాగిస్తున్నప్పుడూ, ఆ తరువాత తానే ఒంటరిగా పాలకుడైనప్పుడూ కూడా భార్య చెన్నమ్మకే పగ్గాలు అప్పగించాడు. ఆయన జీవిత చరమాంకంలో రాజ్య పరిపాలన మొత్తాన్నీ చెన్నమ్మే నిర్వహించింది. క్రీ.శ. 1677లో సోమశేఖర నాయకుడు మరణించాడు. ఆయన మరణానంతరం భార్య చెన్నమ్మ పూర్తి స్థాయిలో అధికారం నిర్వహించింది. ఎంతో తెలివితేటలతో, పాతికేళ్ళకు పైగా కాలం పాలన జరిపింది.

శివాజీ కుమారుడైన రాజారామ్‌కు ఒకానొక సందర్భంలో ఆశ్రయమిచ్చి, చెన్నమ్మ ఎంతో ధైర్యం చూపింది. రాయ్‌గఢ్ ప్రాంతం నుంచి రాజారామ్ తప్పించుకొని వచ్చాడు. అతని కోసం ఔరంగజేబు తీవ్రంగా గాలిస్తున్న రోజులవి. అయినప్పటికీ చెన్నమ్మ బెదరలేదు. రాజారామ్‌ను పట్టుకోవడం కోసం చివరకు మొఘలాయీ సేనలు ఆమె రాజ్యంలో ప్రవేశించాయి. మొఘలాయీలను చెన్నమ్మ చిత్తుగా ఓడించింది. రాజారామ్ పటిష్ఠమైన జింజి కోటకు పారిపోవడానికి చెన్నమ్మ సాయపడింది. ఆమె ధైర్యసాహసాలు చూసి, ఔరంగజేబు ఎంతో ముచ్చటపడ్డాడు. ఆమె పరాక్రమానికి ముగ్ధుడై, ఎంతో విలువైన కానుకలు ఇచ్చి గౌరవించాడు.

ఆమె పోరాట కౌశలానికి మరో ఉదాహరణ కూడా ఉంది. దళవాయి తిమ్మప్ప నేతృత్వంలోని మైసూరు సైన్యాన్ని ఆమె పోరాడి, జయించింది. తిమ్మప్ప కుమారుణ్ణి బందీగా పట్టుకొని, తన యుద్ధ నైపుణ్యాన్ని చూపింది.

ఉదార స్వభావానికీ, పండితులను గౌరవించడానికీ చెన్నమ్మ పెట్టింది పేరు. సంచార జీవనం సాగించే లింగాయత సాధువుల కోసం ఆమె మఠాలు కట్టించింది.

పరిపాలనా దక్షురాలిగా చరిత్రలో చెన్నమ్మ ప్రసిద్ధికెక్కింది. ఉదాత్త శీలం, పరాక్రమం, దాతృత్వం, దైవభక్తి ఉన్న పరిపాలకురాలిగా ఆమె అందరికీ ఆదర్శప్రాయం. c

---

మనకు పురుషుల కంటే ఆడ సింహాలను పోలిన వనితలు అవసరం. వారే ముఖ్యంగా భారత స్త్రీల అభివృద్ధి కొరకు పాటుపడాలి.

సాహసోపేతమైన వచనాలు, అంతకంటే మిక్కుటమైన సాహసకృత్యాలు మనకు అవసరం. ప్రపంచం దైన్యస్థితిలో వుంది. జాగృతులుకండి. చైతన్యవంతులై కృషి చేయండి. ఐదువందల మంది పురుషులతో భారత దేశం విజయం సాధించటానికి యాభై సంవత్సరాలు పడితే అదే విజయం ఐదు వందల మంది స్త్రీల వల్ల కొన్ని వారాల్లోనే సాధ్యమవుతుంది.

– స్వామి వివేకానంద

# నిరాడంబరత్వం ఆయన నైజం!



నెహ్రూ లాగ బహుముఖమైన ప్రతిభగలవారు కాదు లాల్ బహదూర్ శాస్త్రి. పైగా ఆయనది నిరాడంబరమైన వేషం. లాల్ బహదూర్ శాస్త్రి ప్రవర్తనలో కూడా ఏ మాత్రం ఆడంబరం ఉండేది కాదు. సామాన్యమైన వ్యక్తిగా కనిపించే వారు. పోనీ, గంభీరమైన విగ్రహమా అంటే, అదీ కాదు- పొట్టి వారు. ప్రధానమంత్రి అయిన తరవాత కూడా లాల్ బహదూర్ శాస్త్రి వేషంలో కానీ, అలవాట్లలోకానీ మార్పు రాలేదు.

భోపాల్‌లో ఒకసారి ఒక ఉర్దూ కవి ఆయనతో, "మీ ప్రస్తుతవేషం (ధోవతి, కుర్తా) ప్రధానమంత్రి హోదాకు తగినట్లు లేదు. పైగా మీరు ప్రతిరోజూ ఎందరో విదేశీయుల్ని కూడా కలుసుకోవాలాయె!" అని అన్నారట.

అందుకు లాల్ బహదూర్ నవ్వుతూ, స్వామి వివేకానందుల మాటలను ఇలా గుర్తు చేశారట: "చేతలను బట్టి ఒక వ్యక్తి శీలాన్ని నిర్ణయించాలి కానీ, అతని వేషధారణను బట్టి కాదు. అలాగే, ఒక దేశం గురించి చెప్పేటప్పుడు ఆ దేశ ప్రజల గుణగణాలను చూడాలి కానీ, జనసంఖ్య ముఖ్యం కాదు."

ఈ దృష్టితో చూస్తే లాల్ బహదూర్ శాస్త్రి చాలా గొప్పవాడిగా కనిపిస్తారు. ప్రధానిగా ఆయన 18 నెలలే అధికారంలో ఉన్నా, సాధించిన విజయాల వల్ల చెరగని పేరు, తరగని కీర్తి గడించారు.

ఆయన ఎంత నిరాడంబరుడో, అంత నిజాయతీ పరుడు కూడా. ఆ రెండు లక్షణాలూ ఆయన తెచ్చి పెట్టుకున్నవి కావు. పుట్టుకతోనే అలవడినవిగా కనిపిస్తాయి. 1952 మొదలు కన్ను మూసేదాకా (కొన్ని నెలలు తప్ప) ఆయన కేంద్ర ప్రభుత్వంలో మంత్రిగా పనిచేశారు. కానీ, ఆస్తిపాస్తులేమీ ఆర్జించలేదు. అలహాబాద్‌లో ఓ ఇల్లు కొనుక్కోవాలని ఆయన అనుకున్నారు. కానీ, తక్కువ ధరకు ఒక్క ఇల్లూ దొరకలేదు. ఉన్నత పదవుల్లో ఉండి కూడా స్వార్థచింతనకు చాలా దూరంగా నిలిచిన లాల్ బహదూర్ శాస్త్రిని కొనియాడకుండా ఎలా ఉండగలం! C

**(అక్టోబర్ 2న లాల్‌బహదూర్ శాస్త్రి జయంతి)**

# పక్షపాతం లేని పాలకుడు

అబ్దుల్ కలాం బంధువులు 2006 మే నెలలో (ఆయన రాష్ట్రపతిగా ఉన్నప్పుడు) దక్షిణాది నుండి ఆయనను చూడడానికి ఢిల్లీ వెళ్ళారు. కలాం వచ్చిన బంధువులందర్నీ స్వాగతించి, వారు మళ్ళీ ఢిల్లీ వదిలే వరకూ వారి అవసరాలను ఎంతో శ్రద్ధగా చూశారు. వచ్చిన 53 మందికీ అయ్యే ఖర్చు అంతా పైసలతో సహా లెక్కవేసి ఉంచమని రాష్ట్రపతి భవనంలో వ్యయాన్ని నియంత్రించే అధికారిని ఆయన ఆదేశించారు.

వచ్చిన బంధువుల కోసం ఒక్కమారు కూడా కార్యాలయానికి సంబంధించిన వాహనమేదీ



ఉపయోగించలేదు. ఢిల్లీ రాను పోను రవాణా ఖర్చులు, ఢిల్లీ నగరంలో వారు తిరగడానికి అయ్యే ఖర్చులే కాకుండా రాష్ట్రపతి భవన్‌లో వారు బస చేసిన గదులకి (అధికార పూర్వకంగా నిర్దేశించబడిన ధర ప్రకారం) అయిన అద్దె, వారి భోజనాలకు అయిన మొత్తం ఖర్చు తానే భరించారు.

వచ్చిన బంధువులందరూ వారం రోజులు ఉండి వెళ్ళి పోతున్నప్పుడు రాష్ట్రపతి గుండె బరువెక్కినా జేబు తేలిక పడింది. ఆయన స్వంత ఖర్చుల కింద నమోదయిన మొత్తం పైకం రూ. 3,54,924 మాత్రమే! C



యువవాహిని

# ఆదర్శవంతుల్ని అందించాల్సింది అధ్యాపకులే !

– స్వామి రంగనాథానంద

వెలుగుతున్న దీపమే ఇంకో దీపాన్ని వెలిగించగలదు. ఉపాధ్యాయులు కూడా వెలుగుతున్న దీపాల్లాంటివారు. తాము వెలుగుతున్న దీపంలా ఉండాలంటే నిత్యం జ్ఞానార్జనాపరులై ఉండాలి. అప్పుడే విద్యార్థుల్లో జ్ఞానజ్యోతిని వెలిగించే శక్తి కలుగుతుంది.

విద్య కన్నా శ్రద్ధ ముఖ్యమైనది. శ్రద్ధ లేని విద్య నిష్ప్రయోజనం. కర్మ శరీరం నుండి, జ్ఞానం బుద్ధి నుండి, శ్రద్ధ హృదయం నుండి ఉత్పన్నమవుతాయి. శ్రద్ధ ఉంటే ఏ రంగంలోనైనా శక్తి సామర్థ్యాల్ని వృద్ధి చేసుకోవచ్చు.

ఉపాధ్యాయుడు కేవలం విద్యార్థులకు పాఠాల్ని బోధించడమే కాకుండా వారిలో భావవినిమయానికి తోడ్పడాలి. కేవలం బోధన కోసం ఉపాధ్యాయుడి అవసరం లేదు. పుస్తకాల ద్వారా, పత్రికల ద్వారా, టీవీ, రేడియో, టేప్‌రికార్డర్ల ద్వారా కూడా విద్య నేర్చుకోవచ్చు. ఈ సాధనాల ద్వారా విద్యాబోధన జరుగుతోంది కూడా! ఇలాంటి బోధన వల్ల సమాచారం ఒకరి నుండి మరొకరికి అందుతుందే తప్ప వేరే ప్రయోజనం లేదు.



విద్య అంటే కేవలం బోధన మాత్రమే కాదు. విద్యలో వ్యక్తిత్వ పాత్ర ఎంతో ఉంది. ఉపాధ్యాయులు ఆదర్శవంతులైతే వారి బోధనల ద్వారా విద్యార్థుల్ని ఎంతగానో ప్రభావితం చేయవచ్చు. అందువల్ల వారు అందించేది కేవలం సమాచారం మాత్రమే కాదు– ప్రేరణ కూడా.

ఉపాధ్యాయ వృత్తి చాలా కీలకమైంది. గొప్ప బాధ్యతాయుతమైంది. ఒక ఇంజనీరు తప్పు చేస్తే ఒక బ్యారేజి కూలిపోవచ్చు. ఒక డాక్టర్ తప్పు చేస్తే ఒక రోగి మరణించవచ్చు. అదే ఒక ఉపాధ్యాయుడు తప్పు చేస్తే ఉత్తమ పౌరుల్ని కోల్పోతాం. దానివల్ల సమాజానికి తీరని నష్టం సంభవిస్తుంది. అందుకే ఉపాధ్యాయులు బోధనను ఒక వృత్తిగా కాక మహత్తర బాధ్యతగా స్వీకరించాలి. అప్పుడే సామాజిక స్పృహతో అంకితభావంతో పని చేయడం సాధ్యం.

విద్యలో ముఖ్యమైనది భావ వినిమయం, మనస్సుల మేళవింపు. విద్య గురించి స్వామి వివేకానంద ఇలా విశ్లేషించారు 'ఇవ్వగలిగినవాడే బోధిస్తాడు. బోధన అంటే మాట్లాడడం కాదు. అది పరస్పర భావ వినిమయం.' అధ్యాపకులూ, విద్యార్థులూ విద్యను మనస్సుల మేళవింపుగానో, వ్యక్తిత్వాన్ని సంపన్నం చేసేది గానో మలచాలి. అంతేతప్ప, అధ్యాపకుడి నోట్సులో నుంచి విద్యార్థి నోట్‌బుక్కు నింపడం కాదు. జ్ఞాన సముపార్జనకు వ్యక్తిత్వ నిర్మాణం చాలా అవసరం.

**బోధన అనేది ఒక సామాజిక బాధ్యత. విద్యార్థులకు ఉత్తమ ఆదర్శాలను అందిస్తూ అధ్యాపకులు వారి వ్యక్తిత్వాలను తీర్చిదిద్దాలి .**

దురదృష్టవశాత్తూ, నేటి విద్యా విధానంలో అదే కొరవడుతోంది. ప్రాథమిక తరగతుల నుండే పిల్లలకు వ్యక్తిత్వ నిర్మాణంతో కూడిన విద్య బోధిస్తే, పెద్దవారైన తరువాత వారు ఆదర్శవంతులుగా తయారవుతారు. మానవునిలో సహజసిద్ధంగా కొన్ని పరిపక్వతలు ఉంటాయి. వాటికి ప్రదర్శనా యోగ్యత ఇవ్వడమే విద్య. ఆ మార్గంలోని అవరోధాల్ని తొలగించడమే ఉపాధ్యాయుని ఏకైక కర్తవ్యం. c **సేకరణ: ఆర్. కృష్ణారావు**

> సమాచారం మెదడులోకి దట్టించుకొని, అది ఎప్పటికీ జీర్ణంకాక, జీవితమంతా గందరగోళాన్ని సృష్టించేది 'విద్య' కాదు. జీవంపోసి, వ్యక్తిత్వంగల మనుష్యుల్ని తయారుచేసే విద్య నేడు మనకు కావాలి.
>
> మంచి శీలాన్ని నిర్మించి, మానసిక బలాన్ని పెంచి, బుద్ధిని వికసింపజేసే విద్యే నిజమైన విద్య.
>
> **– స్వామి వివేకానంద**




– స్వామి పరిజ్ఞేయానంద

**వినయ్, హైదరాబాద్**

**ప్రశ్న:** ఈ లోకంలో అతి విలువైందీ, అరుదైనదీ ఏది?

**జవాబు:** ఈ లోకం అతి విచిత్రమైంది. అది దేశ, కాల, పరిస్థితుల్లో బందీ అయి ఉంది. అందుకే ఏ వస్తువు విలువైనా ఆ మూడింటినీ అనుసరించి మారుతూ ఉంటుంది. ఒక నదీ తీరంలో మంచి నీటికి విలువే ఉండకపోవచ్చు. కానీ అదే నీరు ఎడారిలో ప్రాణం పోసే అమృతంతో సమానం. రోజూ పాయసం తాగే వారికి గంజి ఎంతో రుచిగా అనిపిస్తే, రోజూ గంజి తాగే వారు పాయసం గురించి కలలు కంటూ ఉండవచ్చు. మనకు ఈ రోజు విలువైందిగా కనిపించిన వస్తువు రేపు వెలలేనిదిగా అనిపించవచ్చు.

దేశ, కాల, వ్యక్తులతో సంబంధం లేకుండా, అందరికీ అన్ని వేళలా, అన్ని ప్రదేశాల్లోనూ ఎంతో అవసరమైంది ఒకటుంది. అదే – మనశ్శాంతి! చెల్లించాల్సిన ధర రూపంలో చూసినా అది ఎంతో అపురూపమైంది. ఎందుకంటే దాని ఖరీదు – 'మన సర్వస్వం' కన్నా ఎక్కువే! మనకు ఉన్నదంతా ధారపోసినా మనశ్శాంతి దొరకడం చాలా కష్టం. అది లేని వారు అన్నీ ఉన్నా ఏమీ లేని వారితో సమానం. ఆ శాంతే సొంతమైతే ఏమీ లేకున్నా, వారితో సరితూగే సంపన్నులెవరూ లోకంలో ఉండరు. కాబట్టి లోకంలో అతి విలువైనదీ, అందరికీ కావలసిందీ–మనశ్శాంతి.

**శ్రీవాణి, కర్నూల్.**

**ప్రశ్న:** నాకు కోపం ఎక్కువే! కానీ ఎవరిమీదైనా ఆవేశ పడ్డప్పుడు, కొంతసేపటి తరువాత వారికి క్షమాపణ చెబుతాను. ఈ కోపం పోవాలంటే ఏం చేయాలి?

**జవాబు:** సాధారణంగా ఏ మనిషీ తనలో ఉన్న లోపాలను అంత సులభంగా అంగీకరించడు. కానీ మీరు మీ లోపాన్ని అంగీకరించడం హర్షణీయం. అందువల్ల మీ లోపం నుంచి మీరు సగం బయటపడినట్లే! మిగతా సగం కొద్ది ప్రయత్నంతో సరిదిద్దుకోవచ్చు.

తూటాల వంటి మాటలతో ఎదుటివారి హృదయాన్ని గాయపరిచిన తరువాత మన్నించమని వారిని ప్రాధేయ పడడం వల్ల ప్రయోజనమేముంది? అందుకే అద్దం లాంటి మనస్సు పగిలిపోతే అతకదని ముందే గ్రహించాలి.

ఒక వ్యక్తి కోపం వచ్చినప్పుడల్లా తన భార్యను కొట్టేవాడు. ఈ విషయం తెలిసిన ఆ ఊరి పెద్దమనిషి అతడితో 'కోపం వచ్చినప్పుడు ఇంటి చుట్టూ పది సార్లు తిరిగి ఆ తరువాత నీ భార్యను కొట్టు' అని సలహా ఇచ్చాడు. ఆ సలహా ప్రకారం అతడు కోపం వచ్చినప్పుడు ఇంటి చుట్టూ పదిమార్లు తిరిగేవాడు. అలా తిరిగి వచ్చేసరికి ఆయనలో కోపం కరిగిపోయేది.

"The Greatest remedy for anger is delay. When angry, count 10 before you speak, if very angry, count 100"

- **Seneca**



**మనశ్శాంతి మన చేతుల్లోనే!**

భగవద్గీతలో శ్రీకృష్ణుడు కోపాన్ని 'అసుర గుణం'తో పోల్చాడు. క్షమాగుణం మనిషిని దేవతగా మారిస్తే కోపం దేవతల్ని సైతం దానవులుగా మారుస్తుంది. కాబట్టి మొదటే క్షమించడం అలవాటు చేసుకుంటే, తరువాత క్షమాపణలు కోరే బాధ తప్పుతుంది. సూచనలు ఎన్నైనా ఇవ్వవచ్చు. కానీ నిజంగా ఆచరించేవారికి ఒక్క సూచన చాలు కదా! ❍


మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:

**యువవాణి**

శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,

దోమల్ గూడ, హైదరాబాద్ – 500 029

E- mail : rkprabhayuvavani@gmail.com




- రాము జలదుర్గం

ఉద్యోగం చేస్తూ రోజూ ఆ పనినే, తిట్టుకుంటూ "ఛీ ఏమి ఉద్యోగం?" "నా బ్రతుకే ఇంత!'' ''ఇదీ ఒక జీవితమేనా?'' అంటూ బ్రతుకుల్ని నెట్టు కుంటూ పోయే మనుషుల్ని మనం రోజూ చాలా మందిని చూస్తుంటాం. మరి అంత ఇష్టం లేని పనిని ఎందుకు చేస్తుంటారు? తమకిష్టమైన పనినే ఎందుకు ఎంచుకోరు? ఈ ప్రశ్నలకు బహుశా వారి దగ్గర కూడా సమాధానాలు ఉండకపోవచ్చు... దీనికి అసలు కారణం, ప్రతి మనిషి తనదైన ఒక అనుకూల వలయాన్ని (Comfort zone) సృష్టించుకోవడమే!

**అనుకూల వలయం :** చెవులకింపుగా వున్న ఈ మాటకి అర్థం ఏంటంటే, మనిషి ఎటువంటి ఒత్తిడి, ఆందోళన లేని కొన్ని అలవాట్లను, అభిప్రాయాలను ఏర్పరుచుకొని వాటిని మాత్రమే ఆశ్రయించి, అదే 'అనుకూల పరిస్థితి' అని భ్రమపడడం. బయటి ప్రపంచంలో జరుగుతున్న మార్పులకు ఏ మాత్రం స్పందించకుండా తమదైన ప్రపంచంలో జీవిస్తూ వుండే వైఖరే ఈ అనుకూల వలయం. అందుకు గల కారణాలు:

1. ఏ మార్పుకూ స్పందించని 'జడత్వాన్ని' తెలియ కుండానే అలవర్చుకోవడం.
2. అపజయానికి కారణం ఆలోచించడం మానేసి, ఇతరులను నిందించే ప్రయత్నం చేయడం.
4. ఎక్కడున్నా మనసులో అభద్రతా భావం.
5. నమ్మకం వాస్తవానికి దూరంగా ఉంటూ, నమ్మిన దానినే నిజమని ఊహాలోకంలో జీవించడం.
6. ఏదైనా సాధించే శక్తి ఉన్నప్పటికీ. ఆశక్తిని తామే గుర్తించనంతగా ఆ వలయంలో చిక్కుకు పోవడమే ఓ పెద్ద బలహీనత.
7. వీరి ప్రవర్తనలపై వీరికే అదుపు ఉండకపోగా, అలవాట్లే వీరిని శాసిస్తాయి.
8. అసలేమీ చేయకుండా ఉండడమే, తప్పులు చేయకుండా ఉండడానికి మార్గం అని నమ్ముతుంటారు.

> **బయటి ప్రపంచంలో జరుగుతున్న మార్పులకు స్పందించకుండా తమదైన ప్రపంచంలో జీవించే వైఖరే ఈ 'అనుకూల వలయం'**

**ఈ వలయం నుంచి బయట పడడం ఎలా?**

1. గతంలో ఆశించిన ఫలితాలే రావడం వల్ల అవే అభిప్రాయాలను కొనసాగిస్తూ వాటినే అలవాట్లుగా మార్చుకుంటాం. కానీ ఎల్లకాలం ఆ నమ్మకాలే పనిచేయవని గ్రహించాలి. సృజనాత్మకతకు మూలం, పాత అనుభవాలను కాసేపు పక్కన పెట్టడమే... కాబట్టి ఒక్కసారి మీ అలవాట్లను, పునః పరిశీలించండి. ఒకసారి ఒక తోపుడు బండిలో కొన్న మామిడి పళ్ళు తీపి తక్కువగా ఉంటే, బళ్ళలో అమ్మేవేవీ తియ్యగా ఉండవు అనుకోవడం సబబుకాదు కదా!
2. కొత్త ఆలోచనలు, కొత్త ప్రయోగాల ద్వారా వచ్చే కొత్త ఫలితాల్ని పరిశీలించండి, కొత్త ఫలితాల నుంచి నేర్చుకున్న పాఠాల్ని జీవిత ఉన్నతికి ఉపయోగించండి. ఓ అరగంట ముందుగానే నిద్రలేవడం మొదట్లో చాలా కష్టమన్పించినా ఆ తర్వాత మీరు పొందే మానసికోల్లాసాన్ని తలుచుకుంటే మార్పు అవసరమన్పిస్తుంది.
3. ఇతరులను మెప్పించడం కోసం మీ జీవితంలో మార్పులు తీసుకురానక్కర్లేదు. మీ స్వానుభవాన్నే నమ్మండి. మార్పుల ద్వారా పొందే సానుకూల ఫలితాల్ని మీ జీవితానికి అన్వయించుకోండి. చేతకానప్పుడు అందరిముందు స్పూన్ ఫోర్క్‌లతో భోంచేయక్కర్లేదు. చేత్తోనే శుభ్రంగా తింటే చాలు.
4. ఎప్పుడూ చేసే పనిని, ప్రతిసారీ చేస్తున్నట్లుగానే చేస్తుండడం వల్లే మీ ఉద్యోగం, పని, మీకు బోర్ కొడుతుండొచ్చు. కాబట్టి ప్రతి పనిలోనూ ప్రత్యామ్నాయలు వెతికితే బహుశ ఆ కొత్త మార్గాలే మీ పనిని మరింత సులభతరం చేయొచ్చు.
5. ఎప్పుడూ మీ వైపు నుంచే కాకుండా అవతలి వారి వైపు నుంచి కూడా ఆలోచించండి. అప్పుడు వారిపై మీకున్న దురభిప్రాయాలు తొలగిపోతాయి.
6. దృక్పథం కొత్తగా ఉండాలేగానీ, ప్రపంచం మొత్తాన్ని కొత్తగా చూడొచ్చు. అలా చూడ్డం మొదలెడితే, పాత దృశ్యాలే కొంగొత్తగా కన్పిస్తాయి. c



- సి.ఎన్. సీత

సీతా స్వయంవరానికి అయోధ్య మహారాజు దశరధునికి పిలుపు వెళ్ళలేదు. దానికి కారణం ఉంది. ఒకప్పుడు మిథిలలో కాటకం వచ్చింది. వర్షాలు లేవు. భూములన్నీ బీటలువారి పంటలు లేక, తినడానికి తిండి, తాగడానికి నీళ్ళు లేక ప్రజలు అల్లాడి పోయారు. ఎన్నో యజ్ఞయాగాలు చేసినా, ఆ వరుణ భగవానుడికి దయ రాలేదు. ఏం చేయాలో అని మహారాజు జ్యోతిష్కులను పిలిపించి వారిని సలహా అడిగాడు.

వారు గ్రహాలు మొదలైన వాటిని గుణించి ఒక సలహా ఇచ్చారు. ఎవరైనా ఉత్తమ గుణాలు గల శీలవతియైన స్త్రీచేతితో వడికిన నూలుతో తయారైన నూలు దారం పచ్చికుండకు కట్టి దానితో నీళ్ళు తోడి, ఆ నీళ్ళను చల్లితే వానలుపడి దేశం సుభిక్షమవుతుందని చెప్పారు.

అలాంటి వారు ఎక్కడున్నారని విచారించగా, అయోధ్య మహారాజు దశరధుని పెద్ద భార్య కౌసల్యాదేవి అటువంటి ఉత్తమురాలని తెలిసింది. జనకమహారాజు దశరధునికి ఒక విన్నపం చేసుకున్నాడు. ఆమెను పంపి తమ దేశంలోని దుర్భిక్షాన్ని తొలగించవలసిందనీ, ఆమెను సకల లాంఛనాలతో తాము గౌరవంగా తీసుకుని వచ్చి, తిరిగి పంపగలమనీ అన్నాడు. దశరధుడు సమ్మతించి ఆమెను సపరివారంగా పంపటానికి ఏర్పాట్లుచేశాడు. ఈ లోగా అంతఃపురంలో కొందరు, నీళ్ళు తోడడానికి మహారాణి వెళ్ళడమేమిటి? ఎవరైనా దాసిని పంపిస్తే సరిపోతుందని అలోచించి, ఒక ఆంతరంగికురాలైన దాసికి కౌసల్యలాగే అలంకారం చేసి పంపించాలను కున్నారు. ఆ దాసి "నేను మహారాణి దగ్గర దాసిని, ఆమె లాగే వెళ్ళి వారిని మోసం చేయలేను" అన్నది.

అయినా ఆమెను ఎలాగో ఒప్పించి, మేలిముసుగు ఉండడం వల్ల నీవెవరివో ఎవ్వరికీ తెలియదు, కౌసల్యను తలుచుకుంటూ వెళ్ళి రమ్మని పంపారు.

ఆ ప్రకారమే ఆ దాసి మేనాలో సైనికులు, పరివారం వెంట రాగా వెళ్ళి పచ్చికుండకు తాను స్వయంగా వడికిన దారం కట్టి మనసులో కౌసల్యను ధ్యానంచేస్తూ నీళ్ళు తోడింది. అందరూ సంతోషంతో జయజయ ధ్వానాలుచేసి ఆమె పాదాలకు నమస్కరించారు.

జనక మహారాజు నమస్కరించడానికి వచ్చినప్పుడు, ఆ దాసి తన మేలి ముసుగును తొలంగించి తానెవరన్నదీ తెలియజేసింది. అందరూ ఆశ్చర్యపోయారు. ఔరా! అయోధ్యలో స్త్రీలంతా ఉత్తమ గుణాలు కలవారు. అందుకే ఆ రాజ్యం అంత సుభిక్షంగా ఉన్నది. కానీ మహారాణికి బదులు దాసిని పంపారని కోపం వచ్చింది వారికి.

అందువల్లనే, మహారాణికి బదులు దాసిని పంపినట్లుగా స్వయంవరానికి రాకుమారునికి బదులు వేరెవరినైనా పంపుతారేమోనని సందేహంతో సీతా స్వయంవరానికి రమ్మని అయోధ్యకు ఆహ్వానం పంపలేదు. తర్వాత విశ్వామిత్రుడు రాకుమారులను తీసుకునిరావడం, రాముడు విల్లు విరిచి, సీతను పరిణయమాడడం అందరికీ తెలిసిందే గదా! #



# జయాపజయాలు

- జి.సతీష్

విశాలపురిని పాలించే రాజు విజయసేనుడికి చదరంగం అంటే అమితాసక్తి. ఆయన రాచకార్యాల్లో తల మునకలై ఉండేవాడు కానీ ఏమాత్రం తీరిక దొరికినా మంత్రి ప్రదీపుడితో చదరంగం ఆడేవాడు, అప్పుడే అతడి మనసు శాంతించేది. అప్పుడప్పుడూ రాణితోనూ, సేనాపతితో కూడా ఆడటం ఆయన అలవాటు. ఎవరితో ఆడినా గెలుపు మాత్రం ఎల్లప్పుడూ విజయసేనుడినే వరించేది! అది ఆయనకు ఎంతో ఆనందాన్ని కలిగించేది.



ఒకరోజు ఆటలో మంత్రి ప్రదీపుడు అసాధారణమైన ప్రజ్ఞ కనపరిచాడు. మొదటిసారి మహారాజును ఓడించాడు. అంతవరకూ ఓటమి అన్నది ఎరగని రాజుగారి ముఖం కోపంతో ఎరుపెక్కింది. పట్టరాని ఆగ్రహంతో పళ్ళు పటపటమని కొరుకుతూ అక్కడి నుండి లేచాడు. చదరంగం బల్లను ఒక్క తన్ను తన్ని, విసవిసా అంతఃపురం వైపు వెళ్ళిపోయాడు. అయితే మరునాడు మంత్రిని పిలిపించి తన ప్రవర్తనకు నొచ్చుకొన్నాడు. వారిద్దరూ తిరిగి ఆట ప్రారంభించారు. ఈసారి మహారాజే గెలిచాడు. ఆయన ముఖం కళకళలాడింది. కానీ తరువాతి ఆటలో మంత్రి ప్రదీపుడు గెలిచాడు. విజయసేనుడు తనను తాను తమాయించుకొన్నాడు. ఏమీ మాట్లాడకుండా అక్కడి నుండి వెళ్ళిపోయాడు. ఇక అప్పటి నుండి మంత్రి ప్రదీపుడే ప్రతీరోజూ ఆటలో గెలువసాగాడు. కానీ మహారాజు తన వరుస ఓటముల్ని జీర్ణించుకోలేకపోతున్నాడు. ఆయన వదనంలో విషాదం అలుముకోసాగింది. రాచకార్యాల్లో సైతం ఆయన చురుకుదనాన్ని కోల్పోయాడు. రాజు మనఃస్థితిని తెలివైన ప్రదీపుడు పూర్తిగా అర్థం చేసుకొన్నాడు.

మరునాడు ఆటలో మంత్రి, ప్రదీపుడు ఓడిపోయాడు. ఎన్నో రోజుల తరువాత మహారాజు పెదవులమీద చిరునవ్వు వెలిసింది. అది చూసిన మంత్రి ప్రదీపుడికి ఎంతో సంతోషం వేసింది. ఆ తరువాత ఎన్నడూ ఆయన మహారాజును ఆటలో ఓడించలేదు. ఇలా కొంతకాలం గడిచింది. ప్రతిరోజూ ఆటలో తనే గెలుస్తున్నా మహారాజును ఏదో అసంతృప్తి ఆవరించసాగింది రాను రాను ఆటలో ఆసక్తి సన్నగిల్లడం మొదలైంది. ఆ విషయమే ఆయన ఒకసారి మంత్రితో ప్రస్తావించాడు. ‘‘మహారాజా! పిన్న వయసులోనే చదరంగంలో నిపుణుడైన ఆనందుడనే వాడు ఎన్నో రాజ్యాలు పర్యటిస్తున్నాడు. చదరంగంలో ఆటగాళ్ళను ఓడిస్తూ చివరికి మన రాజ్యాన్ని చేరుకున్నాడు. అతణ్ణి తమ అనుమతితో పిలిపిస్తాను. తమ సమస్యకు అతడేమైనా పరిష్కారం చూపగలడేమో చూద్దాం!’’ అన్నాడు మంత్రి. రాజు అంగీకరించాడు. మరునాడే మంత్రి సమక్షంలో వారిద్దరి సమావేశం ఏర్పాటైంది.

రాజు సమస్యను ఆనందుడు ఎంతో ఆసక్తిగా విన్నాడు. ‘‘మహారాజా నేను మొదట మీతో చదరంగం ఆడాలనుకుంటున్నాను. తరువాతే ఏదైనా పరిష్కారం సూచించగలను” అన్నాడు. కొంతసేపటిలోనే వారిద్దరి మధ్యా ఆట ప్రారంభమైంది. మొదటి ఆట మహారాజే గెలిచాడు. ఆయన ముఖంలో ఆనందం వెల్లివిరిసింది. కానీ తరువాతి ఆటలన్నీ వరుసగా ఆనందుడే గెలిచాడు. రాజు ఎంత జాగ్రత్తగా, ఆలోచించి ఆడినా లాభం లేకపోయింది. మహారాజులో క్రమంగా సహనం నశించసాగింది! అది గమనించిన మంత్రి ప్రదీపుడు “మహారాజా నన్ను ఒకసారి ప్రయత్నించమంటారా?” అని అర్థించాడు. అందుకు రాజుగారు నిరుత్సాహంగానే ఒప్పుకున్నారు. మంత్రి ప్రదీపుడు ఆనందుణ్ణి మొదటి ఆటలోనే చిత్తుగా ఓడించాడు. తరువాతి ఆటలన్నింటిలో అవలీలగా విజయం సాధించాడు. (మిగతా 38వ పేజీలో...)

> జీవితం ఒక నిరంతర పోరాటం.
> గెలుపుకు బానిసలు కాకుండా,
> ఓటమికి బాధపడకుండా
> ముందుకు సాగిపోవాలి.

# స్ఫూర్తికి మూలస్థానం

– జయ లఖాని

ఎటన్ వంటి సుప్రసిద్ధ పాఠశాలలకు చెందిన ధార్మిక విద్యాధికారులను ఉద్దేశించి ప్రసంగించమని మమ్మల్ని ఆహ్వానించారు. ధార్మిక విద్యలో హిందూధర్మం పాత్ర గురించి మేమంతా కూలంకషంగా చర్చించాం. ఆ గదిలోని వాతావరణం నెమ్మదిగా తీవ్రమవసాగింది. సమావేశం చివరలో ఒక మహిళ మా వద్దకు వచ్చి ధన్యవాదాలు తెలియజేస్తూ, "ఇంతవరకూ నేను ఆధ్యాత్మిక ఎడారిలో జీవిస్తున్నాను. దాని నుంచి నన్ను బయటకు తెచ్చినందుకు చాలా ధన్యవాదాలు" అన్నారు. అలా అంటుండగా కళ్ళ నుంచి నీరు వచ్చి ఆమె ఏడ్వసాగింది. 'కేవలం హిందువుల మనస్సులనే కాక మరెందరినో మనం ఎలా ప్రభావితం చేయగలుగుతున్నాం?' అని మమ్మల్ని మేము ప్రశ్నించుకున్నాం. దానికి సమాధానం చాలా సరళమైనది.



మా ఉపన్యాసాలు శ్రీరామకృష్ణులు స్వామి వివేకానందుల బోధనలకు సంబంధించినవే, వారి బోధలు విశ్వజనీనమైనవి కనుకనే మాకు ఇది సాధ్యమయింది. ఈ మహాత్ములెవరు, హిందూ ధర్మంలో వారి స్థానమేమిటి? 'గత శతాబ్దంలో భారతదేశపు ఆధ్యాత్మిక కాంతి పుంజం' అనే అంశంపై 'ది టైమ్స్ ఆఫ్ ఇండియా' పత్రిక తమ పాఠకుల నుంచి అభిప్రాయాలను సేకరించింది. దానికి జవాబుగా **స్వామి వివేకానందుల** వారిని ఏకగ్రీవంగా సూచించారు అందరూ. ఆయనకు మార్గ దర్శకత్వాన్నిచ్చి ముందుకి నడిపిన ఆధ్యాత్మిక శక్తి ప్రదాత శ్రీరామకృష్ణులు. ఈ మహోన్నత వ్యక్తుల బోధనలు కేవలం హిందువులకే కాక సమస్త మానవాళికీ అమోద యోగ్యం, ఆచరణీయం. అందుకే నేడు ప్రపంచదేశాలలో శ్రీరామకృష్ణ, స్వామి వివేకానందుల సందేశాలు ఎంతోమందికి స్ఫూర్తినిచ్చి, ప్రగతి పథంలో నడిపిస్తున్నాయి. e

(గత సంచిక తరువాయి)

# భావి జీవిత నిర్దేశకాలు... భావోద్వేగాలు...9

- జి. మధుసూదన్



సర్దిచెబుతూ, బుజ్జగిస్తూ ఉన్నత ఆదర్శాలకు తమ అనుభవాల్ని రంగరించి అనాయాసంగా పిల్లలకు అందించే పెద్ద తరం నానాటికీ కనుమరుగవుతోంది. భావోద్వేగాల నియంత్రణకై బాల్యంలోనే లభించాల్సిన శిక్షణ భావి యువతకు కరువవుతోంది.

విలాసాలే పరమావధిగా పరుగులెత్తడంలో నవతరానికి ఉన్నంత తాపత్రయం, తమ వ్యక్తిత్వాలకు మెరుగులు దిద్దుకోవడంలో లేకపోవడం శోచనీయ విషయం. విజయాల్ని సొంతం చేసుకోవాలన్నా, వాటిని పదిలంగా పదికాలాల పాటు కాపాడుకోవాలన్నా - కావలసింది స్వయం నియంత్రణ. ఇది నేటి తరం తప్పక తెలుసుకోవాల్సిన విషయం. సమాజంలో ఆకర్షణలు అమితంగా పెరిగిపోతున్న సమయంలో అది ఆచరణ యోగ్యం కాదేమో అనిపిస్తుంది. కానీ దీన్ని విస్మరిస్తే జీవితంలో విఫలం కాక తప్పదు.

**'అదుపు'నిచ్చే అప్రమత్తత:** భావి జీవిత నిర్దేశకాలైన భావోద్వేగాలను అదుపు చేసుకోవాలనుకొనే వారు తమ ఆలోచనా విధానం పట్ల అన్నివేళలా అప్రమత్తంగా ఉండాలి. దీన్నే Metacognition అంటారు. అదే విధంగా ఎల్లవేళలా మనఃస్థితిని ఎప్పటి కప్పుడు సమీక్షించుకోవడాన్ని Meta mood అంటారు. ఈ రెండింటినీ కలిపి స్వయం ప్రజ్ఞ (Self awareness) అనవచ్చు! దీంతో మెదడు అన్ని వేళలా

## మన పురాణాల్లో ఆవేశ పరులు.... ఆలోచనాశీలురు...



ఒళ్ళు తెలియని ఆవేశాలతో అందరినీ హడలెత్తించే ఆవేశపరులూ... ప్రతికూల పరిస్థితులలోనూ యుక్తాయుక్త విచక్షణను కోల్పోని ఆలోచనాశీలురూ - మన పురాణేతిహాసాల్లో కనిపిస్తారు. మొదటి రకం వారు మనం ఎలా ఉండకూడదో నేర్పిస్తే, రెండో రకం వారు అబ్బురపరిచే స్వయం నియంత్రణతో మనకు ఆదర్శంగా నిలుస్తారు.

ముక్కోపానికి పెట్టింది పేరు దుర్వాస మహాముని. దానివల్ల ఎందరో బాధ పడడమే కాదు, స్వయంగా ఆయనే భంగపడ్డ సందర్భాలూ చాలా ఉన్నాయి.

ఇక సంయమనానికి సంపూర్ణ రూపం శ్రీకృష్ణుడు. చేయాల్సింది శత్రుసంహారమైనా సరే శాంతంగా, ఒక బాధ్యతలా నిర్వర్తించాడే తప్ప భావోద్వేగాలను దరి చేరనీయలేదు. పైగా ఎదుటివారి ఉద్వేగాలను పొరపాటు పడకుండా అంచనా వేయడంలో ఆయనది అందెవేసిన చేయి. అంతకు మించి, వాటిని తనకు కావలసిన విధంగా మలచుకోగల సమర్థత ఆయన సొంతం. అందుకే ఆయన 'జగన్నాటక సూత్రధారి'.



ఇక భావోద్వేగాల బారిన పడి ఎన్నో సార్లు బాధపడినవాడు విశ్వామిత్రుడు. కానీ పడిన ప్రతి సారీ లేచి పరుగెత్తడానికే ప్రయత్నించాడు ఆయన. ఆత్మ పరిశీలనకు అలుపెరుగని పోరాటాన్ని జోడించి, చివరకు తన ఉద్వేగాలను అధిగమించడంలో విజయం సాధించాడు. చేసిన తప్పును ఒప్పుకుని దిద్దుకోవడమే ధీరుల లక్షణం. దీనికి సజీవ నిదర్శనంగా నిలచే విశ్వామిత్రుడు నిజంగానే అందరికీ ఆదర్శప్రాయుడు. c

చురుకుగా ఉంటూ, భావోద్వేగాలు అదుపు తప్పకుండా అడ్డుకుంటుంది. 'నేను ఆవేశపరుణ్ణి... ఈ క్షణం నేను ఆవేశంలో ఉన్నాను' అని గ్రహించినప్పుడు దాన్ని నివారించడం సులభమవుతుంది. ఆ సమయంలో ఆవేశం స్థానంలో ఆలోచన చోటు చేసుకుంటుంది. కాబట్టి ఉద్వేగాలపై అదుపు సాధించాలనుకునే వారు స్వయం అప్రమత్తతను పెంచుకోవడం చాలా అవసరం.

ఎదుటి వారి ఉద్వేగాలను గుర్తించేందుకు ప్రయత్నించడం కూడా అందుకు దోహదం చేస్తుంది. మనం ఎదుటివారి భావోద్వేగాల వెనుక సరైన కారణాలను అర్థం చేసుకోలేక పోయినప్పుడు, మన భావమే సరైనదని అనుకొన్నప్పుడు మన ఆవేశాన్ని అరికట్టడం సాధ్యం కాదు. అందుకే సమస్యను ఎదుటివారి కోణంలో నుండి కూడా ఆలోచించడం అలవర్చుకోవాలి.

**లక్షణాలను సరిదిద్దే లక్ష్యం:** సరైన లక్ష్యం లేకుండా జీవన ప్రవాహంలో కొట్టుకుపోతున్నప్పుడు మన ఉద్రేకాలు విశ్వరూపం దాలుస్తాయి. మన ఉద్వేగాలకు సరైన మార్గాన్ని చూపనప్పుడు వాటి ఉద్ధృతికి మొదట బలయ్యేది మనమే! స్వామి వివేకానంద "ఒక ఆదర్శం ఉన్నవారు వేయి తప్పులు చేస్తే అది లేనివారు యాభైవేల తప్పులు చేయడం తథ్యం" అని అంటారు. లక్ష్యసాధనలో చిత్తశుద్ధి ఉన్నవారికి అదుపు, అప్రమత్తతలు సునాయాసంగానే అలవడతాయని దాని అర్థం కాబట్టి నిర్దిష్టమైన లక్ష్యం, జీవితం పట్ల సరైన అవగాహన, సరైన మార్గదర్శకత్వం ఉన్నప్పుడు భావోద్వేగాలను విజయవంతంగా నియంత్రించుకోగలం!

## ప్రాచ్యులూ... పాశ్చాత్యులూ...

**భా**వోద్వేగాలను తాత్కాలికంగా అణచుకోవడం మంచిదే. కానీ వాటిని శాశ్వతంగా నిర్మూలించడమే మన లక్ష్యం. అంటే భావోద్వేగాలను నియంత్రించుకోవడం మన సహజ లక్షణమై పోవాలన్న మాట! కానీ ఆ లక్ష్యాన్ని చేరుకోవడానికి ముందు ప్రయత్నపూర్వకంగా మన ఉద్రేకాలను అణచుకోవడం అభ్యాసం చేయాలి! కానీ పాశ్చాత్యులు ఈ సిద్ధాంతాన్ని విశ్వసించరు. ఉద్వేగాలను ఎప్పటికప్పుడు వ్యక్తీకరించాలనీ, వాటిని అణచుకుంటే మరెన్నో మానసిక, శారీరక సమస్యలకు దారి తీస్తాయనీ వారంటారు. పైగా భావోద్వేగాలు లేని జీవితం నిస్సారంగా ఉంటుందని వారనుకుంటారు. పాశ్చాత్య ప్రపంచంలో వేగంగా పతనమవుతున్న నైతిక విలువలు, రోజు రోజుకూ పెరుగుతున్న నేరాలు లాంటివి వారిలో అభద్రతా భావాన్ని పెంచుతూ, అశాంతి రేపుతున్నాయి. కాబట్టి 'నియంత్రణకు తిలోదకాలివ్వడం' అనే వారి ఆలోచనా దృక్పథం సరైనది కాదని నిరూపణ అవుతోంది!

మరి భారతీయులో...! ఒక ఉన్నత లక్ష్యం కోసం తమ ఉద్వేగాలను అణచుకోవడంలో తప్పు లేదని వారు భావిస్తారు. అందుకే స్వయం నియంత్రణను జీవన విధానంలో భాగంలో మార్చు కున్నారు. అంతేకాక భారతీయులు తమ ఉద్వేగాలను ఒక ఉన్నత దిశగా మళ్ళించే ప్రయత్నం చేస్తారు.

జంతువుల్లా విచ్చలవిడిగా సంచరించడం నాగరకత కాదనీ, స్వయం నియంత్రణకు ప్రాధాన్యమిచ్చే సంస్కృతి లేని నాగరకతలేవీ చరిత్రలో నిలబడలేదనీ భారతీయులకు తెలుసు. అందుకే పాశ్చాత్యుల విలాసమయ జీవితం లేకున్నా, జీవితాల్ని విషాదమయం చేసే అశాంతితో భారతీయులు ఎన్నడూ అంతగా బాధపడలేదు!

**ఏడ్చి ఏం లాభం?** బాధనూ, దుఃఖాన్నీ అణచుకోలేక కన్నీళ్ళు కార్చడం బేలతనానికి చిహ్నమని ఎంతోమంది నమ్మకం! కానీ ఇది సరైనది కాదని మనో వైజ్ఞానికులు చెబుతారు. ఆవేశానికీ, ఉద్వేగానికీ లోనైనప్పుడు విడుదలయ్యే రసాయనాలు కన్నీటి ద్వారా బయటకు వెళతాయి. దాంతో మన ఉద్వేగం తగ్గుముఖం పట్టి మనసు తేలికపడుతుందని వారంటారు. బాధను మరచిపోవడానికంటూ వివిధ వ్యసనాలకు అలవాటు పడడం కన్నా అది మంచిదే కదా!



- రెంటాల జయదేవ

(గత సంచిక తరువాయి)



మంత్ర జలంతో నిండిన కలశాన్ని పూజా మందిరంలోకి తీసుకొని వచ్చి, అక్కడ స్థాపించాలి. కలశానికి పసుపు రాసి, మూడు చోట్ల కుంకుమ బొట్లు పెట్టాలి. ఆ పైన, "*కలశే గంధ పుష్పాక్షతై రభ్యర్చ్య*" అని చెప్పి, కలశ జలంలో గంధం, అక్షతలు, పుష్పాలు ఉంచాలి. "*ఓం ఆదిత్య మండలాయ నమః, ఓం సోమ మండలాయ నమః*" అని నమస్కరించాలి. అటు పైన ఈ కింది మంత్రాలను ఉచ్చరిస్తూ, అక్షతలతో, పుష్పాలతో కలశాన్ని పూజించాలి.

***కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్ర స్సమాశ్రితః ।***
***మూలే తత్ర స్థితో బ్రహ్మా మధ్యే మాతృగణాః స్మృతాః ॥***
***కుక్షౌతు సాగరా స్సర్వే సప్త ద్వీపా వసుంధరా ।***
***ఋగ్వేదో - థ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః ॥***
***అంగైశ్చ సహితా స్సర్వే కలశాంబు సమాశ్రితాః ।***
***ఆయాంతు దేవ పూజార్థం సకల దురిత క్షయ కారకాః ॥***

*'కలశ ముఖంలో విష్ణుమూర్తి, కంఠ భాగంలో శివుడు, మూలంలో బ్రహ్మదేవుడు, మధ్య భాగంలో మాతృగణాలు ఆశ్రయించి ఉన్నారు. కలశంలోని జలాల్లో సాగరాలన్నీ, సప్తద్వీపాలతో కూడిన భూమి, ఋగ్వేద - యజుర్వేద - సామవేద - అధర్వణ వేదాలు, వేదాంగాలతో సహా సమస్త దేవతా గణాలు కూడా ఆశ్రయించి ఉన్నారు. సమస్త పాపాలనూ తొలగించడానికి వారంతా వచ్చెదరు గాక!'*

ఆ తరువాత కలశంలోకి ఆవాహన చేసిన సప్త నదుల పుణ్య జలాలనూ ఇలా పూజించాలి:

*"ఓం గంగాయై నమః, ఓం యమునాయై నమః, ఓం గోదావర్యై నమః, ఓం సరస్వత్యై నమః, ఓం నర్మదాయై నమః , ఓం సింధవే నమః, ఓం కావేర్యై నమః... ఇతి పుష్పైః పూజయామి"*

కలశంలోని నీటిలో ఆ యా పుణ్య నదుల జలాలన్నీ ఉన్నాయనే గట్టి నమ్మకంతో ఇలా పుష్పాలతో కలశాన్ని పూజించాలి.

**కలశారాధన మంత్రాలు**

కలశంలోని జలాన్ని దేవతగా వర్ణిస్తూ, మంత్రించి, పరబ్రహ్మగా పూజించడం మనకుంది. కలశారాధన సమయంలో పఠించే మంత్రాలు కొన్ని:

***ఆపో వా ఇదగ్ం సర్వం విశ్వా భూతా న్యాపః***
***ప్రాణావా ఆపః పశవ ఆపో - న్న మాపో - మృత మాపః***
***సమ్రాడాపో విరాడాపః స్వరాడాప శ్ఛన్దాగ్ స్యాపో***
***జ్యోతీగ్ ష్యాపో యజూగ్ ష్యాపః సత్య మాపః***
***సర్వా దేవతా ఆపో భూర్భువః సువరాప ఓమ్॥***

*'అప్'* అంటే జలమని అర్థం. *"మనం చూస్తున్న ఈ దృశ్యమాన జగత్తు అంతా నిజంగా జలమే! సృష్టి అయిన సర్వ జీవరాశులూ జలమే. శరీరంలోని ఉచ్ఛ్వాస నిశ్వాసాలూ జలమే. నాలుగు కాళ్ళ జంతువులూ జలమే. అన్నం, దాన్ని సృజించే పైరులూ జలమే. అమృతం కూడా జలమే! సంరాట్ - నిరంతరమూ జ్వలించేదీ జలమే. విరాట్ - వివిధ*



*రూపాలూ, ప్రయోజనాలూ ఉన్నవి సర్వం జలమే. స్వరాట్ - స్వయం ప్రకాశకాలైనవన్నీ జలమే. ఛందస్సు జలమే. జ్యోతీగ్ం - ప్రకాశవంతమైన నక్షత్రాలన్నీ జలమే. యజూగ్ం - వేదమంత్రాలు జలమే. సత్యమూ జలమే. సర్వ దేవీ దేవతలూ జలమే. భూః, భువః, సువః - భూమి, అంతరిక్షం, స్వర్గం - ఈ మూడు మహా వ్యాహృతులూ జలమే. వీటన్నిటికీ మూలాధారం పరబ్రహ్మ. ఆ బ్రహ్మకు చిహ్నం ప్రణవం. అంటే, 'ఓంకారం'."* వర్షాలు పుష్కలంగా పడి, పంట భూములు తడిసి ఉండడానికి ఈ మంత్రాలను పఠిస్తారు.

**కలశం దేనికి ప్రతీక?**

కలశాన్ని త్రిమూర్త్యాత్మకంగా సంభావించి పూజించడం, విజయం కోసం ఆశీస్సులు కోరడం సాధారణంగా మన వాళ్ళ అలవాటు. కలశాన్ని సముద్రుడికి ప్రతీకగా భావిస్తూ, వరుణ దేవుణ్ణి పూజించే అలవాటు కూడా ఉంది. మానవ జీవితాన్ని నీటితో నిండిన కుండతో పోలుస్తుంటారు. అంటే, అది ప్రాణానికి ప్రతీక అన్న మాట.

మొత్తం మీద - ప్రార్థనల్లో, పుణ్యకార్యాల్లో, పట్టాభిషేకాల్లో, నూతన గృహ ప్రవేశాల్లో, తీర్థయాత్ర ప్రారంభ సమయాల్లో - ఇలా అనేక సందర్భాల్లో కలశ ఆరాధన చేయడం అవశ్యం అనుసరణీయం. c

9 ...17వ పేజీ తరువాయి




10




11 గోవిందుడు గృహస్థ జీవనం సాగించేటట్లు అతణ్ణి ఒప్పించమని గోవిందుని తల్లి, రామానుజుల వారిని ప్రాథేయపడింది.




12



**13** గోవిందుని ఆత్మ జ్ఞాన ఔన్నత్యాన్ని అందరూ గ్రహించాలని రామానుజులు సంకల్పించారు. ఒకనాటి రాత్రి శిష్యుల సమక్షంలో రామానుజులు ఆసీనులై ఉన్నారు!

శిష్యులారా! ఆ గదిలో ఒక సూది నేల మీద పడిపోయింది. దాన్ని వెదకి తీసుకురండి!

**14** స్వామీ! సూది దొరకలేదు!

గోవిందా! నువ్వు వెళ్ళి వెదకి చూడు!

గోవిందుడు లాంతరు కూడా లేకుండా ఆ గదికి వెళ్ళి, నేల మీద పడి ఉన్న సూదిని తీసుకువచ్చాడు.

**15** ఏమి ఆశ్చర్యం! అది ఎలా సాధ్యమయింది?

నా హృదయంలో అంతర్యామిగా ప్రకాశిస్తున్న భగవంతుడే అన్నిటినీ చూపిస్తున్నాడు.

**16** గోవిందా! నువ్వు సన్న్యాసం స్వీకరించి భక్తి తత్త్వాన్ని ప్రచారం చేయి.

సన్న్యాస ఆశ్రమ స్వీకారానికి నాకు అర్హత ఉందని మీరు అనుకుంటే తప్పక అనుగ్రహించండి స్వామీ!

నీకు సన్న్యాస స్వీకారానికి అర్హత ఉంది. ఈ రోజే సన్న్యాస దీక్ష ప్రసాదిస్తాను.

**17** 'నాలుగువేల దివ్య ప్రబంధ' పాశురాల అభినయన కళలో ప్రావీణ్యం సంపాదించి, వైష్ణవ గురు పారంపర్యంలో శ్రీరామానుజుల తరువాతి స్థానాన్ని అలంకరించిన మహనీయుడు గోవింద భట్టు.

"విషసర్పం భయంకరమైనది. ఎవరైనా దాన్ని పట్టుకోవాలని ప్రయత్నిస్తే అది కాటు వేస్తుంది. కానీ, పాములను పట్టుకొని ఆడించే విద్య నేర్చుకున్నవాడు, పామును పట్టుకోవడం మాత్రమే కాకుండా, దాన్ని ఆభరణంలా గొంతుకూ, చేతులకూ చుట్టుకుంటాడు. అదే విధంగా, ఆత్మ జ్ఞానం పొందిన వాడికి కామినీ కాంచనాలు ఎలాంటి కీడూ చేయలేవు."

– భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస

(...31వ పేజీ తరువాయి.)

## జయాపజయాలు

విజయసేనుడికి ఆనందంతో పాటు ఆశ్చర్యం కూడా కలిగింది. ఆయన ముఖకవళికల్ని గమనిస్తున్న ఆనందుడు అసలు సమస్యను వివరించడం మొదలు పెట్టాడు.

"మహారాజా! ఆటలో ఆనందం రెండు రకాలుగా ఉంటుంది. గెలుపు ద్వారా కలిగేది ఒకటైతే, జయాపజయాలతో నిమిత్తం లేకుండా ఆడుతున్నంతసేపూ కలిగే ఆనందం మరొకటి. మొదటిది ఏదేమైనా గెలుపే ముఖ్యం అనుకునే వారిలో ఉంటుంది. అది ఆటగాడి తాపత్రయాన్ని పెంచుతుంది కానీ ఆడే సమయంలో అతడి ప్రజ్ఞను హరిస్తుంది! ఇక అనుక్షణం అప్రమత్తంగా ఉంటూ, ఆటలో నిమగ్నమైతే పొందే ఆనందం రెండవది. అటువంటి ఆటగాళ్ళు ఓటమి ఎదురైనా తామెక్కడ తప్పు చేశామో అని పునరాలోచించుకుంటారు తప్ప, కుమిలిపోరు". రాజు ఆసక్తిగా వినసాగాడు.

"మీరు విజయమే ముఖ్యమని భావిస్తుంటారు. అందుకే మంత్రిగారు మిమ్మల్ని ఓడించినప్పుడు భరించలేక పోయారు. ఇప్పుడు మీరే వారిపై ప్రతిరోజూ గెలుస్తున్నా మీకు సంతోషం లేకపోవడానికి కారణం - మంత్రి గారి ముఖంలో ఓడిపోయానన్న బాధ లేకపోవడమే! ఎందుకంటే మంత్రిగారు స్వయంగా గెలవగలిగి ఉండీ కావాలనే మీ చేతిలో ఓడిపోతున్నారు. ఓటమి బాధతో కుంగిపోయిన వారి ముఖాలను చూస్తూ విజయ గర్వంతో పొంగిపోవడం మీ అలవాటు. కానీ ఆ ఛాయలు మచ్చుకైనా మంత్రిగారి ముఖంలో లేకపోవడం మీకు బాధాకరంగా పరిణమించింది" అంటూ ముగించాడు ఆనందుడు. విజయసేనుడు కళ్ళుమూసుకుని జరిగిందంతా జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. అప్పుడు ఆయనకు ఆనందుడు చెప్పింది అక్షరాలా నిజమని తోచింది!

ఆయన కళ్ళుతెరచి ఆనందుడి వంక చూస్తూ "మరి మన మొదటి ఆటలో నువ్వెలా ఓడావు" అని అడిగాడు. దానికి ఆనందుడు చిరునవ్వుతో "అప్పుడు నేను మీ ఆటను గమనిస్తున్నాను. మీకు సహజంగా ఆటలో నైపుణ్యం ఉంది. అందువల్లనే నన్ను మీరు ఓడించగలిగారు. తరువాత మీ పద్ధతి తెలిసింది. నేను కొత్త ఎత్తులతో ఆడాను. కానీ మీరు విషాదంలో మునిగి నా ఆటను గమనించలేదు. అందువల్లే ఓడారు" అన్నాడు.

"మరి మంత్రిగారి చేతిలో ప్రతిసారీ ఎలా ఓడావు? అదెలా సాధ్యం" అని ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశాడు మహారాజు. "ఎందుకంటే ఆయన నాకు చదరంగం ఆట నేర్పిన గురువుగారు. పైగా ప్రతిరోజూ ఒక స్నేహితుడిలా ఆటలోని మెళకువలు నేర్పే మా తండ్రి గారు" అంటూ తన వేషాన్ని తీసివేసాడు అనందుడు. తన సాహసానికి మన్నించమని వేడుకున్నాడు.

రాజుగారి బాధ పటాపంచలైంది. అప్పటి నుండి జయాపజయాలతో నిమిత్తంలేని నిజమైన ఆనందాన్ని ప్రతి ఆటలోనూ అనుభవించసాగాడు విజయసేనుడు. C



## శ్రీరామకృష్ణ ప్రభ వార్షిక చందాదారులకు విన్నపం

***ప్రియ పాఠకులారా! దిగువ పేర్కొన్న నెంబర్ల నడుమ ఉన్న సంవత్సర చందాదారుల చందా గడువు తీరిపోనుంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.***

110003 - 111999 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2007 అక్టోబర్‌తో** తీరిపోనుంది!

120002 - 128121 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2007 నవంబర్‌తో** తీరిపోనుంది!

**శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష, అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్**

**గమనిక:**

1. మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
2. మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
3. మీకు పత్రిక ప్రతి నెలా 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

# వార్తా వాహిని

## గ్రామీణ ప్రాంతాలకు 'అమృతగంగ'



మంచినీటి ఎద్దడి ఉన్న గ్రామీణ ప్రజలకు త్రాగునీటిని అందించాలనే సత్సంకల్పంతో హైదరాబాద్ రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ 'అమృతగంగ' పథకాన్ని చేపట్టారు. ఈ పథకం కింద (2006 జూన్ నుంచి 2007 ఏప్రిల్ వరకు) రంగారెడ్డి జిల్లా-పెద్దాపురం, దేవరంపల్లి, కేసారం; మహబూబ్‌నగర్ జిల్లా-తిరుమలాపురం,మద్దెలబీడు గ్రామాల్లో ఐదు నీటి పంపులను వేయించారు. ఈ నీటి సరఫరా పథకం ప్రారంభ కార్యక్రమాల్లో స్వామి శ్రీకాంతానందజీ, స్వామి అనుపమానందజీ పాల్గొన్నారు. ఈ పథకంలో భాగంగా ఇంత వరకూ రూ॥8,75,000లు ఖర్చుకాగా, తుమ్మ చంద్రమౌళి, కుంచం కృష్ణయ్యసెట్టి, గుడా శివప్రసాద్, పి. బాలకృష్ణమూర్తి గార్లు తమ వంతు ఆర్థిక సహాయాన్నిచ్చి సహకరించారు.

నివేదిక : శంకర్ రెడ్డి

## విద్యార్థుల వికాసానికి 'వివేకవాహిని'

శ్రీరామకృష్ణ సేవాసమితులు (కైకలూరు, కర్నూలు, ఖమ్మం, కర్లపాలెం) విజయవాడ రామకృష్ణ మిషన్ భావప్రచార రథం 'వివేకవాహిని'ని ఆహ్వానించాయి. ఈ సమితుల ఆధ్వర్యంలో

1. కృష్ణాజిల్లా, కైకలూరు - ఆగష్టు 20,21,22,23
2. కర్నూలు - ఆగష్టు 7,8,9,10
3. ఖమ్మం - ఆగష్టు 1,2,3,4
4. గుంటూరుజిల్లా కర్లపాలెం - జూలై 19,20,21



తేదీలలో వివిధ పాఠశాల, కళాశాల విద్యార్థులకు 'వ్యక్తిత్వ వికాస' సదస్సులు, భక్తులకు 'ఆధ్యాత్మిక సత్సంగ' సమావేశాలు నిర్వహించబడ్డాయి. వివిధ ప్రాంతాల్లో జరిగిన ఈ కార్యక్రమాల్లో స్వామి శశికాంతానందజీ, స్వామి సుప్రియానందజీ, స్వామి వినిశ్చలానందజీ, స్వామి విముక్తానందజీ, స్వామి ఈశప్రేమానందజీ పాల్గొని విద్యార్థుల్నీ, భక్తుల్నీ ఉద్దేశించి ప్రసంగించారు. ఈ సమావేశాల్లో 'స్వామి వివేకానంద', 'శిలనూ నేనే శిల్పినీ నేనే', 'లెండి మేల్కొనండి' యుగావతార్, 'శ్రీరామకృష్ణ కథారత్నాలు' లఘుచిత్రాలను ప్రదర్శించారు. సుమారు 15000 మందికి పైగా విద్యార్థులూ, భక్తులూ ఈ సమావేశాల ద్వారా లబ్ధిపొందారు.

నివేదిక : సి. హెచ్. శివరామరాజు, డా॥ శరత్‌చంద్ర, కె. వెంకటేశ్వరరావు.

## 'శ్రీరామకృష్ణ ధ్యాన మందిరం' తృతీయ వార్షికోత్సవం

ప్రకాశం జిల్లా, గిద్దలూరు మండలం, వెల్లుపల్లె గ్రామంలో ఆగష్టు 2వ తేదీన శ్రీరామకృష్ణ ధ్యాన మందిరం తృతీయ వార్షికోత్సవం జరుపుకుంది. ఈ కార్యక్రమానికి గుంటూరు శారదా మఠం ప్రవ్రాజిక భవానీప్రాణ మాతాజీ అధ్యక్షత వహించారు.

సుమారు 500 మంది భక్తులు పాల్గొన్న ఈ సమావేశంలో భవానీప్రాణ మాతాజీ 'శ్రీరామకృష్ణుల గురుభావం'పై, ధర్మాత్మాప్రాణ మాతాజీ 'శ్రీ శారదాదేవి



జీవిత విశేషాల'పై ప్రసంగించారు. విద్యార్థులు నిర్వహించిన కోలాట భజన అందరినీ ఆకట్టుకుంది.

నివేదిక : డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

# విజ్ఞానం - వినోదం

సేకరణ: ఎన్.శివప్రసాద్ బొమ్మలు: సి.హెచ్. రమేష్

## వజ్ర సంకల్పం



క్రీడాయామ్ కందుకవత్ వసుధా
కుల్యా జలధిః । స్థలీచ పాతాళం
వల్మీకశ్చ సుమేరుః కృతప్రతిజ్ఞస్య ధీరస్య ॥

వజ్ర సంకల్పం గల కార్య సాధకుడికి సకల భూమండలం ఒక బంతి లాంటిది. సముద్రం ఒక కొలనుతో సమానం. పాతాళమైతే ఒక చిన్న పళ్ళెం లాంటిదే! అతడికి సుమేరు పర్వతం కూడా చీమల పుట్ట కంటే గొప్పదేం కాదు!

## విజేతల లక్షణం



మన ప్రయత్నం ఫలించక పోవచ్చు! కానీ ప్రయత్నించడంలో మాత్రం విఫలమవ కూడదు విజయానికి కావలసిన మొదటి లక్షణం ఇది!

## వారసత్వ వైభవం



హరితస్వుడనే రాజు గొప్ప గాయకుడు. మహావిష్ణువు సైతం ఆయన సంగీతంతో పరవశుడయ్యేవాడు. అందుకు బ్రహ్మదేవుడు ఏదైనా వరం కోరుకొమ్మన్నాడు. పరిపూర్ణ గాయకుడైన శివుడు ఆలపించే శంకరాభరణ రాగం వినాలని ఉందని హరితస్వుడు అర్థించాడు. కానీ శివుడి గానం వింటున్న హరితస్వునికి అందులో భావం లోపిస్తున్నదని అనిపించింది. అదే సమయంలో పరమేశ్వరుడు కూడా రాజు సంగీత సామర్థ్యం గురించి ఆలోచిస్తున్నాడు. అందువల్లే ఆయన చిత్తంలో ప్రశాంతత లోపించి, గానం అపరిపూర్ణమైంది. ఇదే విషయాన్ని హరితస్వుడు నిస్సంకోచంగా వెల్లడించాడు. తనను విమర్శించినందుకు శివుడు ఆయన్ను శపించలేదు పైగా ఆయన నిర్భయత్వాన్ని మెచ్చుకొని మరింత శక్తి సామర్థ్యాలను ప్రసాదించాడు.



## మంత్రం ఫలించాలంటే...

ఒక ఊరికి వచ్చిన మంత్రగాడు అందరికీ తాయెత్తులు, యంత్రాలు మంత్రించి ఇస్తున్నాడు. అతడు ఒకరోజు ప్రజలందరికీ తన తాయెత్తు మహిమను వివరిస్తున్నాడు. అదే సమయంలో ఒక వ్యక్తి హడావిడిగా అతడి దగ్గరకు వచ్చాడు.

**వ్యక్తి:** అయ్యా! ఇంట్లో దోమల్ని నాశనం చేసేందుకు మీరిచ్చిన తాయెత్తు పని చేయడం లేదు.

**మంత్రగాడు:** దాన్ని ఎక్కడ ఉంచుతున్నావు?

**వ్యక్తి:** దాన్ని పూజించి, పూజామందిరంలో ఉంచుతున్నాను?

**మంత్రగాడు:** దాన్ని దోమతెరలో ఉంచి నువ్వు కూడా అందులోనే నిద్రించాలి! అప్పుడే ఆ తాయెత్తు పనిచేస్తుందని చెప్పాను కదయ్యా!

## మన మహర్షులు : ఉదంకుడు

ఉదంకుమహర్షి తపస్సుకు మెచ్చి శ్రీకృష్ణుడు తన విశ్వరూపం దర్శన మిచ్చాడు. ఏదైనా వరం కోరుకొమ్మన్నాడు. నీ దర్శన భాగ్యమే మహా ప్రసాదం! ఇంకేమీ వద్దన్నాడు ఉదంకుడు. కానీ శ్రీకృష్ణుడి బలవంతం మీద "నిన్ను తలిచినప్పుడు నీరు దొరికేలా" అనుగ్రహించమని అడిగాడు. సరేనని శ్రీ కృష్ణుడు అంతర్థానమయ్యాడు. ఒకరోజు ఉదంకుడికి దాహమై శ్రీకృష్ణుని స్మరించాడు. వెంటనే ఒక ఛండాలుడు అతని వద్దకు వచ్చి నీరు ఇవ్వబోయాడు. అతని రూపం చూసి ఏవగించుకున్న ఉదంకుడు నీరు తన కక్కరలేదని పలికాడు.



వెంటనే శ్రీకృష్ణుడు ప్రత్యక్షమై, ఆ రూపంలో ఇంద్రుడే అమృతమిచ్చేందుకు వచ్చాడనీ చెప్పి సాధారణ జలం లభించేలా అనుగ్రహించాడు. తన అహంకారం వల్లే అమరుడయ్యే అదృష్టాన్ని పోగొట్టుకొన్నానని బాధపడ్డాడు ఉదంకుడు.



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.64-10, Sri Ramakrishna Prabha (Telugu Monthly) October 2007, Regd. with the Registrar of Newspaper for India Und
No. 1120/57. Postal Registration No. H-HD-1071/2007-09. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2007-09

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-
హైదరాబాద్ కులప్రశాసకుడు

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

డిసెంబరు 2007

వెల : రూ. 8





సామరస్య జీవనానికి
సహనమే సాధనం!



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| పేరు | చిరునామా | రూ. |
|---|---|---|
| | ఇప్పటి వరకు వసూలైన మొత్తం ... | 9,99,755 |
| మహారాజ పోషకులు : | శ్రీ నూకల రమేశ్, రామంతాపూర్, హైదరాబాద్ - 500 013 | 10,000 |
| పోషకులు : | శ్రీ పి. ప్రతాప్, జి.వి. గూడెం, నల్లగొండ - 508 004 | 1,116 |
| : | శ్రీ బోలిశెట్టి శ్రీరంగనాయకులు, గుంటూరు - 522 019 | 1,116 |
| : | శ్రీమతి జి. రమాదేవి, పెద గంట్యాడ, విశాఖపట్నం - 530 044 | 1,000 |
| : | శ్రీమతి పి. విజయశ్రీ, బేగంపేట, హైదరాబాద్ - 500 016 | 1,000 |
| | మొత్తం . . . | 10,13,987 |

# శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి, మీ పేరు మీద పది మందీ మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥600/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ల పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు) ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ'లో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| 1289 | శ్రీ టి. బుచ్చయ్య, నాచారం, హైదరాబాద్-500 076 | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, బోగారం, కీసర - 516 001 |
| 1290 | " " " | ప్రభుత్వ జూనియర్ కళాశాల, భువనగిరి, నల్లగొండ - 508 116 |
| 1291 | నీలిశెట్టి ఛారిటబుల్ ట్రస్ట్, కొత్తపేట, వినుకొండ | శ్రీసరస్వతీ శిశుమందిర్, వినుకొండ, గుంటూరు జిల్లా- 647 |
| 1292 | వై.వి.ఎస్. చలపతిరావు, మలక్‌పేట, హైదరాబాద్ - 36 | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, ముక్తేశ్వరం, తూ.గో. జిల్లా- 211 |
| 1293 | శ్రీ ఎ. నారాయణరాజు, విజయనగరం - 535 501 | డి. పారినాయుడు జట్టు భావ సమాఖ్య ఆశ్రమం, పార్వతీపురం |
| 1294 | శ్రీమతి కె. వీణారావు, జూబిలీ హిల్స్, హైదరాబాద్-33 | వివేకానంద కేంద్ర, ఎల్లారెడ్డిగూడ, హైదరాబాద్-500 083 |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 8 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 85 | $15 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 240 | $ 45 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 380 | $ 75 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1200 | $ 350 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.



సంపుటం: 64 సంచిక: 12 డిసెంబరు 2007

"ప్రతి జీవిలోనూ దివ్యత్వం గర్భితంగా ఉంది. అంతర్గతంగా ఉన్న ఆ దివ్యత్వాన్ని వ్యక్తం చేయడమే జీవిత పరమావధి." - స్వామి వివేకానంద

## ప్రార్థన

జయ భగవద్గీతే జయ భగవద్గీతే ।
హరి హియ కమల విహారిణి సుందర సుపునీతే ॥
నిశ్చల భక్తి విధాయిని నిర్మల మలహారీ ।
శరణ రహస్య ప్రదాయిని సబవిధి సుఖకారీ ॥
దయాసుధా బరసావని మాతు! కృపాకీ జై ।
హరిపద ప్రేమ దానకర అపనోకరలీ జై ॥



మహావిష్ణువు హృదయంలో విహరించెడి, సుందరమైన, పవిత్రమైన ఓ తల్లీ! మాలోని మాలిన్యాన్ని తొలగించి, తత్త్వజ్ఞానాన్నీ, నిశ్చల భక్తినీ ప్రసాదించు. దయతో మాకు శరణాగతి రహస్యాన్ని బోధించిన ఓ గీతా దేవీ! మా పై నీ కరుణను కురిపించి హరి పాదముల యందు ప్రీతి కలిగేలా చేయుము. (గీతా ప్రార్థన)

## ఈ సంచికలో...



### యువవాహిని...







**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com





# సామరస్య జీవనానికి సహనమే సాధనం!

నేడు దేశాల మధ్య దూరాలు తగ్గాయి. ప్రపంచమే ఓ కుగ్రామంగా మారింది. అయితే, మనుష్యుల మధ్య అంతరాలు మాత్రం పెరిగాయి. వేగవంతమైన జీవన విధానం ఈ నవీన యుగ నైజం. ప్రేమ, ఆప్యాయతలు, ఆత్మీయతానురాగాలు గగన కుసుమాలుగా మారిన కాలమిది. అందుకే మానవ విలువలు మళ్ళీ వికసించాలనీ, మమతలు వెల్లువై ప్రవహించాలనీ అంతర్జాతీయ స్థాయిలో 'మానవ సత్సంబంధాల' (Inter-personal Relationship)పై చర్చలు, సమావేశాలు, సదస్సులు నిర్వహిస్తున్నారు.



తోటి మనిషితో ఎలా కలసిమెలసి మెలగాలో, సత్సంబంధాల్ని ఎలా పెంపొందించుకోవాలో, అనురాగం ఆప్యాయతల్ని ఎలా అలవరచుకోవాలో, శాంతియుత జీవనం ఎలా కొనసాగించాలో తెలుసుకోవడం నేడు ప్రధాన చర్చనీయాంశంగా మారింది. ఈ నేపథ్యంలో సాటివారితో శాంతియుత సహజీవనానికి మాతృమూర్తి శ్రీశారదాదేవి జీవితం, సందేశం నేటి తరానికి ఎంతో ఉపకరిస్తాయి.

శ్రీశారదాదేవి జన్మించింది ఓ కుగ్రామంలో! తోబుట్టువుల తగాదాలు, మరదళ్ళ వేధింపులు, మేనకోడళ్ళ మందలింపులు – వీటి మధ్య సాగిన జీవనయాత్ర శారదమ్మది. అలజడులు, అపవాదులు, అపోహలు – ఇలా ఎన్ని కష్టాలు ఎదురైనా సరే, చల్లని వెన్నెల కురిపించే చంద్రునిలా అందరిపైనా ప్రేమామృత వర్షాన్ని కురిపించింది శారదమ్మ. సమదర్శిత్వాన్ని పరమోత్కృష్ట స్థాయిలో అమ్మ ప్రదర్శించి చూపింది. తర, తమ భేదాలు తారస్థాయికి చేరిన నేటి సమాజంలో అసూయ, అహంకారాలను అణచివేసి, ఆత్మీయత, అనురాగాలను పెంచడానికి అమ్మ జీవిత సందేశమే నేడు మనకు శరణ్యం.

**తప్పులెన్నువారు తమ తప్పులెరుగరు:** ఎప్పుడూ పరుల దోషాలను ఎంచే వారికి మనశ్శాంతి అసంభవం. ఇతరుల తప్పులను పదే పదే చింతిస్తే మన మనస్సే కలుషితమవుతుంది. అలాంటి కలుషితమైన మనస్సులో ప్రశాంతత ఎలా సాధ్యమవుతుంది?

'మనశ్శాంతి కావాలంటే పరుల దోషాలను ఎంచకు, నీలోని దోషాలను వెతుకు' – ఇదే శారదమ్మ మనకిచ్చిన చరమ సందేశం.

ఒక గురువు వద్ద ఓ శిష్యుడు పన్నెండు సంవత్సరాలు గురు శుశ్రూష చేసి అనేక విద్యల్ని అభ్యసించాడు. శిష్యుడు విద్యాభ్యాసం ముగించుకుని వెళ్ళి పోతున్నప్పుడు శిష్యునికి బహుమతిగా గురువు ఒక అద్దం ఇచ్చి 'ఈ అద్దాన్ని ఎవరివైపు చూపిస్తే వారి గుణాలు ఇందులో కనిపిస్తాయి' అని అన్నాడు. గురువు ఇచ్చిన అద్దాన్ని శిష్యుడు స్వీకరించి మొట్టమొదట గురువు పైనే అద్దంతో ప్రయోగం చేశాడు. ఆ అద్దాన్ని గురువు వైపు త్రిప్పిన వెంటనే గురువులోవున్న దోషాల్ని చూపించింది. ఇన్నాళ్ళూ ఇలాంటి గురువుకి సేవ చేసి నా జీవితాన్ని వృథా చేసుకున్నానని శిష్యుడు వాపోయాడు. వెంటనే ఆశ్రమాన్ని వీడి అతడు వెళ్ళిపోయాడు. ఆ అద్దం తీసుకుని ఎన్నో దేశాలు తిరిగాడు, ఎంతో మందిని చూశాడు. కానీ అద్దాన్ని ఎవరివైపు తిప్పినా ఏదోఒక దోషాన్ని చూపిస్తుంది. చివరికి 'ఈ ప్రపంచమంతా దోషపూరితమే, ఒక్కడు కూడా సద్గుణాలువున్నవాడు కనిపించటం లేదు' అని శిష్యుడు నిరాశ చెందాడు. గురువు వద్దకు తిరిగి వచ్చి జరిగినదంతా గురువుకు చెప్పాడు. అప్పుడు గురువు నవ్వుతూ అద్దాన్ని ఒక్కసారి శిష్యునివైపు తిప్పాడు. ఆ అద్దంలో కామం, క్రోధం, లోభం, మోహం... కనిపించాయి. అప్పుడు 'నాలోనే ఇన్ని దోషాలున్నాయా!' అని శిష్యుడు సిగ్గుతో తలదించుకున్నాడు.

గురువు 'ఈ అద్దాన్ని నీకిచ్చింది నీలోని దోషాల్ని గుర్తించి, సరిదిద్దుకోవడానికి గానీ, ఇతరుల దోషాల్ని వెతకడానికి కాదు' అని శిష్యునితో అన్నాడు.

తమలోని దోషాల్ని సరిదిద్దుకోవడానికి ప్రయత్నించే వారు మహాత్ములు. అందుకు విరుద్ధంగా వ్యవహరించే వారు దురాత్ములు. అందుకే యోగి వేమన

*"తప్పు లెన్నువారు తండోప తండంబు*
*ఉర్వి జనులకెల్ల నుండు తప్పు*
*తప్పు లెన్ను వారు తమ తప్పులెరుగరు"* అంటారు. కాబట్టి సమాజంలో శాంతి సౌధాల్ని నిర్మించాలంటే ముందు మనల్ని మనం సరిదిద్దుకోవాలి.

**మనసుంటే మార్గాలెన్నో!:** మనుష్యుల మధ్య మనః స్పర్థలకు సంకుచిత స్వభావమే కారణం. అందరూ మనవారేనని అనుకుంటే, ఇతరుల కష్టాల్ని మన కష్టాలుగా భావించగలం. అమ్మ విశాల హృదయంలో సజ్జనులకూ, దుర్జనులకూ; పండితులకూ, పామరులకూ; ధనికులకూ, పేదలకూ; ఆఖరికి పశుపక్ష్యాదులతో సహా అన్ని జీవులకీ చోటుంది. కాబట్టి మనం కూడా అలాంటి విశాల దృక్పథాన్ని అలవరచుకోవడానికి ప్రయత్నించాలి.

శారదాదేవి దక్షిణేశ్వరంలోని 'నహబత్'లో కాళ్ళు చాపుకోవడానికి కూడా చాలనంత చిన్న గదిలో ఎంతో మంది శ్రీరామకృష్ణ భక్తులకూ, శిష్యులకూ వంట చేసేవారు. స్త్రీభక్తులు ఆమెతో పాటు అక్కడే బస చేసేవారు. ఎన్ని ఇబ్బందులున్నా అందరూ మనవారే అన్న భావన ఉంటే అందరితోనూ ఆనందంగా జీవించగలం.

నేడు ఇల్లు ఎంత పెద్దదైనా మనస్సులు చిన్నవిగా మారడం వల్ల సొంతవాళ్ళకు సైతం కొంత చోటైనా ఇవ్వని సంకుచిత తత్త్వం మనల్ని ఆవరించింది. 'జొది హోయ్ సుజొన్ తేతూల్ పతాయ్ నవజొన్' (ఇష్టమైతే ఓ చింతాకు మీద తొమ్మిది మందైనా కూర్చోవచ్చు) అని బెంగాలీలో ఓ సామెత. నిజమే! మనకు ఇష్టమైతే ఎంత కష్టాన్నైనా భరించడానికి వెనుకాడం కదా! అందుకే, ఇష్టాయిష్టాలకు అతీతంగా ఉండడానికి ప్రయత్నిస్తే ఎంత కష్టమైనా, భరించగలిగే శక్తి మనకు లభిస్తుంది.

మనల్ని విమర్శించిన వారినీ, నిందించిన వారినీ ఆదరించడం కష్టమే. కానీ, కనీసం మనల్ని అభిమానించిన వారినీ, మనపై ఆధారపడిన వారినీ ఆదరించడం నేర్చుకోవాలి. అలా చేస్తే, ఒంటరివాళ్ళవుతున్న తల్లితండ్రుల సంఖ్యనూ, విడిపోతున్న భార్యాభర్తలు, అనాథాశ్రమాల పాలవుతున్న బాలబాలికలు, ఆదరణ లేక ఆత్మహత్యకు పాల్పడుతున్న యువతీ యువకుల సంఖ్యను అరికట్టవచ్చు.

**సహనమే సుగుణం:** ఏ చిన్న సమస్య ఎదురైనా సహనం కోల్పోవడమే మన విభేదాలకు అసలు కారణం. సహనంతో వ్యవహరిస్తే, చాలా సమస్యలు పరిష్కార మవుతాయి. అందుకే 'సహనానికి మించిన సుగుణం లేదు' అని శారదాదేవి సహనానికి ఉన్నత స్థానమిచ్చారు. ***క్షమా యశః క్షమా ధర్మః క్షమయా విష్ఠితం జగత్*** – సహనమే కీర్తికీ, ధర్మానికీ, సమస్త జగత్తుకూ ఆధారం.

రోజువారీ కార్యకలాపాలన్నీ సవ్యంగా సాగాలంటే మనందరికీ ముఖ్యంగా కావల్సింది 'సహనం'. అమ్మ జీవితం చదివిన వారికి శారదమ్మ సహనశక్తిని చూసి భూదేవి కూడా ఆశ్చర్య పడిందేమోనని అనిపించక మానదు. శ్రీరామకృష్ణులు మహాసమాధి చెందిన తరువాత తినడానికి కూడా ఏమీ లేని క్లిష్టపరిస్థితుల్ని శారదమ్మ ఎదుర్కోవాల్సి వచ్చింది. అయినప్పటికీ తన కష్టాల్ని ఎవ్వరికీ చెప్పకుండా ఒంటరిగానే భరించి సహనానికి ప్రతిరూపంగా నిలిచింది శారదమ్మ.

మనం ఇళ్ళల్లో చిన్న చిన్న సమస్యలకే సహనాన్ని కోల్పోయి, కోపతాపాలకు గురవుతాం. అమావాస్య కోసారి కూరలో ఉప్పు త(ఎ)క్కువైతే చీదరించుకునే భర్తలు, ఏదైనా అడిగితే చాలు భగ్గుమనే భార్యలు శారదమ్మ సహనశీలాన్ని కొంతైనా అలవర్చుకోవడానికి ప్రయత్నించాలి.



రైల్వేస్టేషన్లో ఓ భార్యాభర్తలు రైలు కోసం ఎదురుచూస్తూ నిలుచున్నారు. రైలు రావడం ఆలస్యమైంది. 'రైలు రావడానికి ఇంకెంత సమయం పడుతుంది?' అని భర్త, భార్యనడిగాడు. 'నేనేమైనా స్టేషన్ మాస్టర్‌ను అనుకున్నావా' అంటూ బుస్సుమంది ఆ భార్యామణి.

చిన్న చిన్న విషయాల్లోనే సహనం కోల్పోయే మనుష్యుల మధ్య సత్సంబంధాలు ఎలా ఏర్పడతాయి? కాబట్టి శ్రీశారదాదేవి జీవితాన్ని మనం ఆదర్శంగా తీసుకుందాం. ***'సామరస్య జీవనానికి సహనమే సాధనం'*** అని తెలుసుకొని ప్రయత్నిద్దాం.

# గోరుముద్ద

- స్వామి సుప్రియానంద

## శరణం 'మూర్తి త్రయం'

ఒక చిన్న మేఘం సూర్యుణ్ణి కనుమరుగు చేసినట్లు ఒక్కోసారి ఓ చిన్న సందేహం ఆధ్యాత్మిక జీవితంలో తాత్కాలిక అయోమయాన్ని సృష్టిస్తుంది.



శ్రీరామకృష్ణులు సర్వదేవదేవీ స్వరూపులు. మరి శ్రీశారదాదేవి, స్వామి వివేకానందులకు మన ఆధ్యాత్మిక సాధనలో ఎలాంటి స్థానం కల్పించాలి?

ఈ సందేహానికి సమాధానంగా ఓ చిన్న కథను చెప్పుకొందాం.

ఒక బుద్ధ విహారం (బౌద్ధ సన్యాసుల మఠం)లో కొత్తగా చేరిన భిక్షువు గురువుని ఇలా ప్రశ్నిస్తాడు:

'అయ్యా! ఈ బుద్ధ విహారంలోని మూడు ద్వారాలూ తెరచి ఉంటే నేను ఏ ద్వారం గుండా ప్రవేశించాలి?

గురువు: 'విశ్వాసం' అనే ద్వారం గుండా ప్రవేశించాలి.

భిక్షువు: మరి మిగతా రెండు ద్వారాల ప్రయోజనం ఏమిటి?

గురువు: ఆ రెండు ద్వారాల నుండి కూడా ప్రవేశించవచ్చు.

భిక్షువు: ఆ రెండు ద్వారాలను ఏమంటారు?

గురువు: ఒకటి 'జ్ఞాన ద్వారం' మరొకటి 'దయా ద్వారం'.

భిక్షువు: ఒక ద్వారం గుండా మన లక్ష్యం సిద్ధిస్తే మిగతా రెండు ద్వారాలు అవసరం ఏముంది?

గురువు: ఎవరయితే 'విశ్వాస ద్వారం' ఉపయోగిస్తారో వారు బుద్ధుడి నుండి, 'జ్ఞాన ద్వారం' ఉపయోగిస్తే ధర్మం నుండి, 'దయా ద్వారం' గుండా అయితే సంఘం నుండి లక్ష్యాన్ని సాధిస్తారు. ఎవరు ఏ ద్వారం గుండా వెళ్ళినా లక్ష్యాన్ని సాధించవచ్చు.

ఎంతోమంది శ్రీరామకృష్ణ భక్తులు కూడా వారి వారి ప్రేరణకు తగ్గట్లు శ్రీరామకృష్ణ - శారదా- వివేకానంద ద్వారాల నుండి మఠంలోనికి ప్రవేశిస్తారు. ఆ తరువాత అనేక కారణాల వల్ల బాహ్య ప్రపంచపు ఒత్తిళ్ళకు గురై భగవంతునియందు విశ్వాసం కోల్పోయి అయోమయ ప్రపంచంలో ఊగిసలాడుతుంటారు. అందుకనే జీవితానికి ఓ లక్ష్యం ఉండాలి. ఆ లక్ష్య సాధనలో కష్టాలు ఎదురైనా నిరాశ చెందకుండా భగవంతునియందు విశ్వాసంతో ముందుకు సాగాలి. ఇదే 'విశ్వాస ద్వారం'.

విచక్షణా జ్ఞానంతో సంసార విధుల్ని నిర్వర్తిస్తూ భగవంతుని దివ్య పాదారవిందాల మీద మనస్సు నిల్పాలి. ఇదే సాధకుల ప్రథమ కర్తవ్యం. దీనినే 'జ్ఞాన ద్వారం' అంటారు.

మనస్సు స్వార్థంతో నిండి ఉన్నప్పుడు ఎదుటివారిని పట్టించుకోం. 'కాకి పిల్ల కాకికి ముద్దు' అన్నట్లు మన స్వార్థం మనకు సంతోషాన్నిచ్చినా ఇతరులకు కష్టాన్ని కలిగిస్తుందని తెలుసుకోవాలి. మనలో దయాగుణం లేకపోతే శాంతియుత సంఘ జీవనం సాధ్యం కాదు. కాబట్టి స్వార్థం వీడి అందరినీ ఆదరించడం నేర్చుకోవాలి. 'దయా ద్వారం'లో ప్రవేశించడం అంటే ఇదే!

మనమీద మనకు విశ్వాసం ఉంటేనే భగవంతుని యందు నిజమైన భక్తి సాధ్యమవుతుంది. అలాంటి భక్తి శరణాగతికి సోపానంగా మారుతుంది. ఎప్పుడైతే మన 'శరణాగతి' సంపూర్ణమవుతుందో అప్పుడు మనలో ఊగిసలాటపోయి 'లక్ష్యసిద్ధి' కరతలామలకం అవుతుంది.

'మూర్తి త్రయం'లో ఏ ఒక్కరి నుండి స్ఫూర్తి పొందినా వారి యందు మనకు శరణాగతి భావం ఉంటే గమ్యాన్ని చేరుకోవడం తథ్యం.

కాబట్టి శరణమే శరణం 'మూర్తి త్రయం' ! a

# దయ, ప్రేమల సంగమం స్వామి ప్రేమానంద



భగవత్సాక్షాత్కారం పొందిన వ్యక్తి ఏ విధంగా ప్రవర్తిస్తాడో, ఎలా పని చేస్తాడో, ఈ ప్రపంచంలో ఎలా ఉంటాడో స్వామి ప్రేమానంద జీవితం తెలియజేస్తుంది. జనుల బాధలు చూసి ఆయన హృదయం ప్రేమ, దయలతో ఆర్ద్రమై, ఏ విధమైన స్వార్థమూ లేకుండా సేవ చేసేవారు. ఆయనకు పనే పూజగా మారేది. శ్రీరామకృష్ణుల సేవ, భక్తుల సేవ రెండూ వేరు కాదని స్వామి ప్రేమానంద దృఢంగా విశ్వసించేవారు.

భక్తులకు ఆహారం, ఆతిథ్యం ఇచ్చి, వారిని సేవించడం మహద్భాగ్యంగా ఆయన పరిగణించేవారు. ఒక్కోసారి ఆయన తాను తినకుండా కూడా భక్తులకు భోజనం పెట్టేవారు. భక్తులు అప్పుడప్పుడు భోజనాలు అయిపోయాక వచ్చేవారు. వారి కోసం ఆయన వంటగదికి వెళ్ళి, స్వయంగా వంట చేసి భక్తులకు భోజనం పెట్టేవారు.

ఒకసారి కలకత్తా నుంచి ఒక ధనిక కుటుంబం బేలూరు మఠానికి కారులో వచ్చింది. వారు ప్రసాదం తీసుకోకుండా తిరిగి వెళ్ళిపోబోతున్నారు. స్వామి ప్రేమానంద ఒక స్వామిని పిలిచి, వెంటనే పరిగెత్తుకెళ్ళి వారికి కొంచెం ప్రసాదం ఇమ్మన్నారు.

ఒకసారి కొందరు భక్తులు ఒక పసిబిడ్డతో వచ్చారు. ఆ పసిబిడ్డ పాల కోసం ఏడుస్తోంది. వెంటనే స్వామి ప్రేమానంద గురుదేవుల నివేదన కోసం తీసి ఉంచిన పాలను ఆ పసిబిడ్డకు ఇచ్చారు. భక్తుల్లోనూ భగవంతుణ్ణి దర్శించి సేవించేవారు స్వామి ప్రేమానంద. అందుకే ఆయన జీవితం 'దయ, ప్రేమల సంగమం'. a

**(డిసెంబరు 18న స్వామి ప్రేమానంద జయంతి)**

భారతీయ మహిళా మణిదీపాలు : చాంద్ బీబీ

ఆంగ్లమూలం : డాక్టర్ ఎస్. రమణి

అనువక్త : రెంటాల జయదేవ

# చరిత్ర పుటల్లో చెక్కుచెదరని ధీరవనిత

పదహారో శతాబ్దానికి (క్రీ.శ. 1547 - 99) చెందిన ముస్లిమ్ మహిళల్లో ముమ్ముందుగా పేర్కొనదగిన స్త్రీ మూర్తి - చాంద్ బీబీ.

ఆమె అహ్మద్‌నగర్‌కు చెందిన హుస్సేన్ నిజామ్ షా కుమార్తె. ఆమెను బీజాపూర్‌కు చెందిన అలీ అదిల్ షాకు ఇచ్చి వివాహం చేశారు. నిజానికి, దక్కన్ ప్రాంతంలోని ఈ రెండూ శత్రు సంస్థానాలు. అయితే, విజయనగర సామ్రాజ్యానికి వ్యతిరేకంగా ఈ రెండు రాజ్యాలూ కొంతకాలం చేతులు కలిపాయి.

వివాహ లాంఛనంగా ఆమెకు షోలాపూర్ కోట దక్కింది. చాంద్ బీబీ ఎంతో తెలివైన మహిళ. ప్రతిభావంతురాలు. పాలనాపరమైన వ్యవహారాలన్నిటిలో భర్త ఆమెను సంప్రతిస్తుండేవాడు. సైనిక దండయాత్రల్లో పాల్గొనేందుకు తనతోపాటు ఆమెను కూడా అనుమతిస్తుండేవాడు. అయితే, ఓ నపుంసకుడు వంచన చేసి, ఆయనను హత్య చేశాడు. చాంద్ బీబీ భర్త మరణంతో అతని మేనల్లుడైన ఇబ్రహీమ్ అదిల్ షా బీజాపూర్ గద్దెనెక్కాడు. చాంద్ బీబీ రాజ ప్రతినిధి అవతారమెత్తి, రాజ్యాన్ని ఎంతో నేర్పుతో, సామర్థ్యంతో పరిపాలించింది. కమల్ ఖాన్ అనే దక్కన్ అమీర్ ఆమెకు సహాయం చేశాడు.

తరువాత బీజాపూర్ సంస్థానంలో అంతర్గత విభేదాలు మొదలయ్యాయి. అమీరూ, మంత్రీ అయిన కమల్ ఖాన్‌కు చాంద్ బీబీ పలుకుబడి, ప్రాబల్యం చూసి ఈర్ష్య పుట్టింది. అతడు ఆమెను అగౌరవంగా చూడడం మొదలుపెట్టాడు. అహంకార పూరితంగా వ్యవహరించసాగాడు. అయితే, మరో అమీర్ అయిన కిష్వర్ ఖాన్ సహాయంతో, ఆమె అతణ్ణి పక్కన పెట్టింది. ఆ రకంగా చాంద్‌బీబీ అతణ్ణి శిక్షించింది. కిష్వర్ ఖాన్‌ను మంత్రిగా నియమించింది. అయితే, కిష్వర్ ఖాన్ కొందరిని చాంద్ బీబీకి వ్యతిరేకంగా మార్చడం ద్వారా, ఆమెను ఆ ఉన్నత పదవి నుంచి పక్కకు తప్పించాలని ప్రయత్నించాడు. చాంద్ బీబీని బీజాపూర్ నుంచి బయటకు పంపివేశారు. సతారా కోటకే ఆమెను పరిమితం చేశారు. అయితే, చెప్పుడు మాటలతో చాంద్ బీబీకి వ్యతిరేకంగా వ్యవహరించిన వారు తమ తప్పు తెలుసుకున్నారు. వెంటనే చాంద్ బీబీని మళ్ళీ బీజాపూర్‌కు రప్పించారు. కిష్వర్ ఖాన్‌ను గోల్కొండకు పారిపోయేలా చేశారు. అక్కడ అతణ్ణి చంపివేశారు.



దక్కన్ ప్రాంతపు అమీర్ల అధికారాన్ని దీటుగా ఎదుర్కోవడం కోసం చాంద్ బీబీ వ్యూహాత్మకంగా అబిస్ అమీర్ అయిన ఇఖ్లాస్ ఖాన్‌ను మంత్రిగా నియమించింది. అయితే, ఆమె ఎంపిక సంతోషమేమీ కలిగించలేదు. దక్కన్ అమీర్లకూ, అబిస్ అమీర్లకూ మధ్య విభేదాన్ని నియంత్రించడం కోసం చాంద్ బీబీ చేసిన ప్రయత్నాలన్నీ బూడిదలో పోసిన పన్నీరయ్యాయి. బీజాపూర్, అహ్మద్‌నగర్‌ల మధ్య సంబంధాలు రోజు రోజుకూ మరింత క్షీణించసాగాయి. అమీర్ల మధ్య ఈర్ష్య,అసూయ, శత్రుత్వాలు పెరిగిపోయాయి.

ఆ తరువాతి నెలల్లో చాంద్ బీబీ మీద పడుతున్న తన వయసును కూడా లెక్క చేయకుండా మొఘల్ చక్రవర్తి సైన్యంతో పోరాడింది. వారు ముట్టడిని విరమించుకొనేలా చేసింది. శత్రువులు తమ దాడిలో కోట ప్రాకారంలో కొంత భాగాన్ని పేల్చివేశారు. అప్పుడు సాక్షాత్తూ చాంద్ బీబీయే దగ్గరుండి తన మనుషుల్ని ముందుకు నడిపించి, దెబ్బతిన్న ఆ ప్రాకారాన్ని బాగు చేయించింది. రాజకుమారుడు మురాద్ ఆమె ధైర్య సాహసాలకు ముగ్ధుడై, ఆమెకు చాంద్ సుల్తాన్ అనే బిరుదు ఇచ్చాడు. సైనిక దండయాత్ర కానుకగా బీదర్ సంస్థానాన్ని గ్రహించి, అహ్మద్‌నగర్ విడిచి వెళ్ళిపోయాడు.

అహ్మద్ నగర్‌లో అంతర్గత కలహాలు కొనసాగుతూ వచ్చాయి. అక్బర్ చక్రవర్తి ఈ అవకాశాన్ని అందిపుచ్చుకొని, అహ్మద్‌నగర్ మీద మళ్ళీ దండయాత్ర చేశాడు. శక్తిసంపన్నమైన అక్బర్ సైన్యాన్ని ఎదిరించడం కష్టమని గ్రహించిన చాంద్ బీబీ చివరకు మొఘలాయిలతో సంధి చేసుకోవాలని భావించింది. అయితే, ఆమె పథకం తెలిసిన ఓ నపుంసకుడి చెప్పుడు మాటలు విన్న దక్కన్ అమీర్లు ఆ సంధిని విశ్వాస ఘాతుకంగా పరిగణించారు. దాంతో, వారు చాంద్ బీబీ మీద తిరుగుబాటు చేశారు. ఆమెను పట్టి బంధించి, మరణశిక్ష విధించారు.

ప్రజల కోసం ఎంతో చేసిన చాంద్ బీబీ దురదృష్టవశాత్తూ, కృతఘ్నులైన తన సొంత మనుష్యుల చేతుల్లోనే ప్రాణాలు కోల్పోయింది. చాంద్ బీబీ పట్ల చూపిన క్రూరత్వానికి గాను అహ్మద్‌నగర్ ప్రజలు భారీ మూల్యం చెల్లించుకోవాల్సి వచ్చింది. అహ్మద్‌నగర్ సంస్థానం కాస్తా చివరకు మొఘల్ సామ్రాజ్యంలో భాగమై పోయింది.

పరిపాలనా దక్షత, రణతంత్రంలో ప్రజ్ఞ ఉన్న చాంద్ బీబీ గొప్ప పండితురాలు కూడా! అరబిక్, పర్షియన్ భాషల్లో ఆమె విద్వాంసురాలు. అలాగే, దక్కన్ ప్రాంతానికి చెందిన అనేక భాషల్లో ఆమె ధారాళంగా మాట్లాడగలిగేది. అయితే, ఆమె జీవితంలోని అత్యంత దుఃఖం కలిగించే విషయం ఏమిటంటే, ఆమెకంటూ కన్నబిడ్డలు లేకపోవడం! ఏమైతేనేం, ప్రజలందరినీ కన్నబిడ్డల్లా పాలించి, ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగిన మహిళగా చాంద్ బీబీ స్థానం చరిత్ర పుటల్లో చెక్కుచెదరనిది. a

## పండుగలు - పర్వదినాలు

### డిసెంబరు - 2007

| | | | |
|---|---|---|---|
| 05 | బుధవారం | : | ఏకాదశి |
| 18 | మంగళవారం | : | స్వామి ప్రేమానంద జయంతి |
| 20 | గురువారం | : | వైకుంఠ ఏకాదశి , గీతా జయంతి |
| 24 | సోమవారం | : | క్రిస్‌మస్ ఈవ్ |
| 30 | ఆదివారం | : | శ్రీశారదాదేవి జయంతి |

### జనవరి - 2008

| | | | |
|---|---|---|---|
| 01 | మంగళవారం | : | కల్పతరు దినోత్సవము |
| 04 | శుక్రవారం | : | ఏకాదశి, స్వామి శివానంద జయంతి |
| 12 | శనివారం | : | జాతీయ యువజన దినోత్సవం |
| 14 | సోమవారం | : | స్వామి శారదానంద జయంతి |
| 15 | మంగళవారం | : | సంక్రాంతి |
| 18 | శుక్రవారం | : | ఏకాదశి |
| 21 | సోమవారం | : | స్వామి తురీయానంద జయంతి |
| 29 | మంగళవారం | : | స్వామి వివేకానంద జయంతి |

## శ్రీరామకృష్ణ ప్రభ వార్షిక చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా! దిగువ పేర్కొన్న నెంబర్ల నడుమ ఉన్న సంవత్సర చందాదారుల చందా గడువు తీరిపోనుంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.*

10001 - 100304 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2007** డిసెంబరుతో తీరిపోనుంది!

20003 - 22181 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008 జనవరితో** తీరిపోనుంది!

**శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్**

**గమనిక:**

1. మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
2. మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
3. మీకు పత్రిక ప్రతి నెలా 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

# దేవీ వైభవం

శ్రీ సామవేదం షణ్ముఖశర్మ        విలేఖనం: శ్రీమతి ఎన్. శేషు



**(గత సంచిక తరువాయి)**

**వ్యా**స భగవానుడు 'దేవీ భాగవతం' వ్రాస్తూ, మూడు పాదాలతో ఒక శ్లోకం వ్రాశాడు (సాధారణంగా శ్లోకానికి నాలుగు పాదాలుంటాయి). ఎందుకంటే ఆమె త్రిపుర సుందరి. వేదాలలో ఆ తల్లి వేదమాత– గాయత్రి. ఆ గాయత్రీ తత్త్వమంతా, అందరికీ అంద జేయాలనుకొని, మూడు పాదాల్లో పెట్టాడు.

*"సర్వ చైతన్య రూపాం తామ్*
*ఆద్యాం విద్యాం చ ధీమహి,*
*బుద్ధిర్ జ్ఞాన ప్రచోదయాత్"*



అమ్మవారెవరయ్యా అంటే ఒక్క మాటలో చెప్పారు – *సర్వ చైతన్య రూపాం* = సర్వ చైతన్య రూపిణి. *ఆద్యాం* = సర్వజగతికీ ఆదిలో ఉన్న తల్లి ఆమే. *విద్యాం* = బ్రహ్మవిద్యా స్వరూపిణి. తేటతెల్లంగా సత్యాన్ని గోచరింపజేసే జగదంబికే ఆ తల్లి. అలాంటి తల్లిని, *ధీమహి*= ఉపాసిస్తున్నాను; అంటే నా బుద్ధితో ఆ మహాశక్తిని అనుసంధానం చేస్తున్నాను. ఆ తల్లియే *బుద్ధిర్ జ్ఞాన ప్రచోదయాత్* = బుద్ధులన్నిటినీ ప్రేరేపించే జగదంబిక. సర్వ బుద్ధుల్నీ ప్రేరేపించే ఆత్మ చైతన్యమే అమ్మ వారు అని వ్యాసదేవుడు స్పష్టం చేశాడు. 'దేవీ భాగవతం'లోని మొదటి ప్రార్థనా శ్లోకం ఇది. అందుకే దేవీ భాగవతం గాయత్రీ మంత్రాత్మకం అని ప్రత్యేకించి చెప్పారు.

అమ్మ అంటేనే గాయత్రి. *"గయాం త్రాయతే ఇతి గాయత్రీ", "గాతారం త్రాయతే ఇతి గాయత్రి"* – గానం చేసేవారిని కాపాడుతుందిట అమ్మ వారు. బ్రహ్మానంద అనుభవంతో పలికే మాట గానం. భగవదనుభవంతో పలికే ప్రతి శబ్దమూ గాయత్రీ మంత్రమే. మన శరీరంలోనే వేదాలున్నాయన్నారు. ఋగ్వేదమేదో, సామవేదమేదో, యజుర్వేదమేదో చెప్పారు. ఈ వేదాలు ప్రతి శరీరంలోనూ ఉన్నాయి. మన ప్రాణశక్తే సామవేదం, మన ఊపిరే సామగానం. ఈ గానం (అంటే ఊపిరి పాట) ఆగిపోతే, బ్రతుకు ఆగిపోతుంది. ఈ ప్రాణశక్తి నుండే సర్వశరీరం స్పందనాత్మకం అవుతుంది. అందుకే ప్రాణశక్తి సరస్వతీ అన్నారు. సరస్వతి అంటే నాదమయి, గాన స్వరూపిణి, సంగీతమాతృక. కుండలినీ ఉపాసన కూడా మనం ప్రాణశక్తి ద్వారానే చేస్తున్నాం. అదే జగదంబిక.

అమ్మ వారు సామవేదంలో ఉన్నారట, సామ గానంలో అమ్మ వారు గోచరిస్తారు. అందుకే మూకకవి "*ప్రేమవతీ కంపాయాం సీమవతీ యతి మనస్సు భూమవతీ సామవతీ నిత్యగిరాం సౌమవతీ శిరసి భాతి హైమవతీ*'' అన్నారు. సత్యగిరాం = వేదవాక్కులు; వాటిలో అమ్మవారెలా ఉన్నారంటే సామవతీ = సామస్వరూపిణి అయి ఉన్నారట. "*సామగాన ప్రియా సౌమ్యా సదాశివ కుటుంబినీ*'' – ప్రాణగాన ప్రియ జగదంబిక. ప్రాణగానమే సామగానం. సామగానంలో ప్రసరించే చైతన్యమే జగదంబిక. ఆ ప్రాణగానం సర్వ జగత్తులో ఉంది.

ఋగ్వేదం సూర్యుని యొక్క మండలం అన్నారు. యజుర్వేదాలు ఆయన శరీరం అన్నారు. సామ మంత్రాలు ఆయన కిరణాలు అన్నారు. ఆ కిరణాలలో ఉన్న సర్వ చైతన్యాలూ అమ్మే! అరుణోపనిషత్తు 'సూర్య కిరణాల్లో ప్రసరించే శక్తే జగదంబిక' అని వచిస్తోంది. అందుకే "*భానుమండల మధ్యస్థా భైరవీ భగమాలినీ*" అన్నారు. ఆ జగదంబిక ఎవరు అంటే – "అరుణాం కరుణా తరంగితాక్షీం

*ధృత పాశాంకుశ పుష్పబాణ చాపామ్...”* అరుణ స్వరూపమైన ఆజగదంబికత్వాన్ని మన ప్రాణశక్తిలో ప్రసరించే తన ఆ దివ్య స్వరూపాన్ని దర్శించాల్సిందిగా బోధిస్తోంది. కనుక ఊపిరి పాటల్లో అమ్మ ఉంది. మనం పట్టించుకున్నా పట్టించు కోకపోయినా ఆ పాట ఎప్పుడూ సాగుతూనే ఉంటుంది. ఆ సాగుతున్న అమ్మ గానాన్ని గమనించి, అందులో అమ్మ రూపాన్ని దర్శించి ఉపాసించేది యోగవిద్య. అమ్మను స్థూలరూపంలో ఆరాధించేటటువంటిది భక్తిలో ప్రాథమిక అవస్థ. ఇంకా పరిశీలిస్తే ఆ ప్రాణశక్తిగా ప్రసరిస్తున్న బ్రహ్మ స్వరూపిణిని దర్శించడం అసలైన ఉపాసన. ఈ చైతన్యమే ప్రకాశం. అదే – దేవి. ‘దేవి’ అనే శబ్దానికి అర్థం ఏమిటంటే – ‘వ్’ అనే ధాతువు నుంచి ‘దేవి’ అనే శబ్దం వచ్చింది. స్త్రీ లింగంలో దేవి, పుంలింగంలో దేవః. అమ్మ ఆ రెండూ కానటువంటి తత్త్వం. ఈ తత్త్వాన్ని మనం ఒక స్త్రీగానో లేక ఒక పురుషాకృతిగానో ఆరాధిస్తున్నాం. కానీ తత్త్వతః అమ్మ వారిది నిర్గుణమే. ఆ విషయం మనకు ‘లలితా సహస్రం’ చెబుతోంది.



“*నిర్లేపా నిర్మలా నిత్యా నిరాకారా నిరాకులా నిర్గుణా నిష్కళా శాంతా నిష్కామా నిరుపప్లవా*” అని చెబుతున్నారా నిర్గుణతత్త్వాన్ని! మనం వ్యక్తం చేసుకోలేం కనుక “క్లేశో – ధిక తరస్తేషామవ్యక్తాసక్త చేతసామ్” అన్నారు శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో. అవ్యక్తమైన నిర్గుణతత్త్వం అందరికీ అర్థం కాదు, “అమ్మా! నువ్వీ రూపం ధరించి, ఇలా ఆరాధించడం ఎందుకు చెబుతున్నావు? ఏ రూపమూ లేని నీ తత్త్వాన్ని మేం అర్థం చేసుకోలేకపోతున్నాం”. అంటే “సగుణం నిర్గుణాన్ని ఎలా అందుకోగలదు?''. అసలు ''దేనితో అందుకోవా లనుకుంటున్నావు... చిత్తమనే దానితో అందుకోవాలి. ఈ చిత్తం గుణమయమే. గుణమయమైన చిత్తం నిర్గుణాన్ని ఎలా అందుకుంటుంది? ఒక ఇంద్రియానికి ఒక గుణం ఉన్నప్పుడు అది ఆ పనే చేస్తుంది. చిత్తమే త్రిగుణాత్మకమైనప్పుడు త్రిగుణా తీతమైన నన్ను నువ్వెలా చూడగలవు? అయితే నేను ఎంత త్రిగుణాతీతనో, అంత త్రిగుణాత్మకమని తెలుసుకో; నేను ఎంత లోకాతీతనో, అంత లోకవ్యాపిని కూడా! సర్వలోకాలలోనూ నేనే వ్యాపించి ఉన్నాను; లోకానికి అతీతంగానూ నేనున్నాను. త్రిగుణాత్మక మైన చిత్తంతో నువ్వు నన్ను ధ్యానం చేయడానికి నేను నిర్గుణాన్ని అయినా సగుణరూపంతో నీ కోసం వచ్చాను” అంటుందా తల్లి. అందుకు అమ్మవారి రూపాలు మన కోసం, మనం ఆరాధించడానికి వచ్చాయి. “రూపం లేకుండా ఉన్న నన్ను మీరు పట్టుకోలేరు కనుక నాకో రూపాన్నీ, పేరునూ ఆపాదించుకున్నాను'' అంటారు అమ్మవారు. “నీకు అన్ని రూపాలు ఎందుకు” అంటే “మీ కోసమే ఇన్ని రూపాలు, ఇన్ని నామాలు” అంటారు. మహర్షులు అమ్మ వారికి మూడు రూపాలు చెబుతూ, ఇలా ప్రార్థిస్తారు:

*“విద్యా ప్రదాన సమయే శరదిందు శుభ్రాం*
*లక్ష్మీ ప్రదాన సమయే నవి విద్రుమాభాం*
*విద్వేష వర్గ దళనే చ తమాల నీలాం*
*దేవీం త్రిలోక జననీం శరణం ప్రపద్యే”*

అమ్మవారొక్కరే. “దేవీం త్రిలోక జననీం – ముజ్జగాలకూ అమ్మ”. ముజ్జగాలకూ తల్లివైన నువ్వు ఒక్కదానివి ఇన్ని రూపాలు ఎలా ధరించావంటే, విద్యా ప్రదాన సమయే *శరదిందు శుభ్రాం* = తల్లీ! నాకు విద్యనివ్వడానికి నువ్వు చక్కటి శరత్కాల వెన్నెల లాంటి తెల్లని కాంతులతో సరస్వతీ రూపంలో కనిపిస్తున్నావు. నీ చేతిలో పుస్తకం, వీణ, ఆ చిన్ముద్ర, ఆ తెల్లని కాంతి – ఈ విద్యా లక్షణాలన్నీ ఆ రూపంలో ఉన్నాయి. నీ తెల్లని కాంతి ఉన్నదే...

*“శరజ్జ్యోత్స్నా శుభ్రాం శశియుత జటాజూట మకుటాం।*
*వరత్రాస త్రాణ స్ఫటిక ఘటికా పుస్తక కరామ్।*
*సకృన్న త్వాం నత్వా కథమివ సతాం సంనిదధతే ।*
*మధు క్షీర ద్రాక్షా మధురిమధురీణా భణితయః ॥”*

“ఓ సౌందర్యలహరీ! త్రిపుర సుందరీ! శరత్ జ్యోత్స్న శుద్ధమైన నీ శారదాకృతిని ఎవరు ధ్యానిస్తున్నారో వారికి వాక్కునూ, బుద్ధినీ, జ్ఞానాన్నీ నువ్విస్తావు తల్లీ!” అంటారు శంకర భగవత్పాదులు. a **(సశేషం)**




**- స్వామి సుకృతానంద**

– రామ్మోహన్‌రావు, హైదరాబాద్

**? : కలలు ఎందుకు వస్తాయి? భవిష్యత్తులో జరగబోయే విషయాలను కలలు సూచిస్తాయా?**

✍: జాగ్రదవస్థలో ఉన్న సంస్కారాలే స్వప్నావస్థలో కలలుగా వస్తాయి. ఈ స్వప్నాలు అనేక జన్మ సంస్కారాల ఫలితం. సాధారణంగా తెల్లవారుజామున వచ్చే కలలు నిజమవుతాయని మన పెద్దల అభిప్రాయం.

– జి. సాయిబాబా, ప్రొద్దుటూరు

**? : త్రిమూర్తుల ఆవిర్భావం గురించి తెలుప మనవి.**

✍: త్రిమూర్తులైన బ్రహ్మ,విష్ణు, మహేశ్వరుల గురించి వివరాలు పురాణాల్లో ఉన్నాయి. బ్రహ్మవైవర్త పురాణం, శ్రీమద్భాగవతం, విష్ణు పురాణం, స్కాంద పురాణాల్లో త్రిమూర్తుల విశేషాలను వ్యాస భగవానుడు సవివరంగా వ్రాసి, మనకు జ్ఞానభిక్ష పెట్టాడు. త్రిమూర్తులు శాశ్వతులు, ఒకే అద్వితీయ బ్రహ్మ త్రిమూర్తులుగా ఆవిర్భవించి సృష్టి,స్థితి, లయలు చేస్తోంది.

– కె. లక్ష్మీ నరసింహయ్య

**? : పాపాలనేవి ఆగామి, సంచితాలు, ప్రారబ్ధాలు కదా! వీటి క్షయం ఏ విధంగా జరుగుతుంది? గాయత్రీ జపం, ఆదిత్యోపాసన ద్వారా పాపాలు పోతాయంటారు. ఇంకా ఉపాయాలుంటే వివరించ మనవి.**

✍: పై విభాగం కర్మలకు ఉంది కానీ, పాపాలకు కాదు. కర్మల్ని ప్రధానంగా 'ప్రారబ్ధం, సంచితం, ఆగామి' అని మూడు విధాలుగా వివరించారు. ఈ జన్మలో అనుభవించే సుఖదుఃఖాలకు 'ప్రారబ్ధ'కర్మ కారణం. అనాదిగా వస్తున్నది 'సంచితం'. మరుజన్మలో అనుభవించవలసింది 'ఆగామి'. దైవదర్శనంతో పాప ప్రక్షాళనం అవుతుంది– ఒక్క ప్రారబ్ధ కర్మలు తప్ప! గాయత్రీ జపం, సూర్యోపాసన ద్వారా బుద్ధి వికసించి, మేధస్సు వృద్ధి చెందుతుంది. మిగతా మార్గాలైన కర్మయోగం, భక్తియోగం ఉన్నా గాయత్రీ ఉపాసనతో గమ్యం చేరుకోవచ్చు.

– జి. నాగేశ్వరరావు, శ్రీకాకుళం

**? : ద్రౌపది పతివ్రతలలో ఒకరని అంటారు. అది ఎలా? వివరించండి.**

✍: ద్రౌపది పూర్వ జన్మలో ఒక ఋషి కన్య. ఎంత ప్రయత్నించినా ఆమెకు వివాహం కాలేదు. అప్పుడామె శివుణ్ణి గురించి తపస్సు చేసింది. శివుడు ప్రత్యక్షమైనప్పుడు ఆతురతలో ఆమె "పతిమ్ దేహి... పతిమ్ దేహి..." అంటూ ఐదుసార్లు అంది. "నీవు 'భర్తనివ్వు' అని ఐదు సార్లు అడిగావు. కాబట్టి రాబోయే జన్మలో నీకు ఐదుగురు భర్తలు లభిస్తారు" అని అన్నాడు. అందుకే ఆమెకు ఐదుగురు భర్తలు లభించారు.

***"వైవాహికో విధిః స్త్రీణాం సంస్కారో వైదికః స్మృతః ।***
***పతి సేవా గురౌ వాసో గృహార్థే అగ్ని పరిక్రియా ॥"***

(మనుస్మృతి – 2.67)

స్త్రీలకు వివాహం విధి వైదిక సంస్కారం లాంటిది. పతి సేవ అనేది గురుకులవాసం లాంటిది. గృహకార్యాలు అగ్నిదేవుడి సేవ లాంటివి. పంచపాండవులు ద్రౌపదిని అగ్నిసాక్షిగా వివాహమాడారు. వారిని ఆమె సమానంగా సేవించింది. అందువల్లనే ఆమెను 'పతివ్రత' అని పిలిచారు. ఆమె వారిపై ఎప్పుడూ నిందారోపణ చేయ లేదు. పైగా పాతివ్రత్య జీవితం గురించి ద్రౌపది అలనాడు సత్యభామకు ఉపదేశం చేసింది.

**నవంబరు–07 సంచిక 'పరిప్రశ్న' 2లో సవరణ:**

5. విశుద్ధ – కంఠస్థానం
6. ఆజ్ఞా – కనుబొమల మధ్యస్థానం

# ధీరవాణి



మాతృమూర్తి శారదాదేవి ఆధ్యాత్మిక శక్తికి నిలయం. అయినా, ఆమె బాహ్య ప్రకృతి మాత్రం లోతైన సముద్రంలా ప్రశాంతతను ప్రదర్శిస్తుంది. భారతీయ జీవన స్రవంతిలో ఆమె ప్రవేశం దేశచరిత్రలో నూతన అధ్యాయానికి సంకేతంగా నిలుస్తుంది. ఆమె తన జీవితంలో ప్రదర్శించిన, బోధించిన ఆదర్శ ధర్మాలు భారతదేశంలోని స్త్రీల విమోచనోద్యమాలకు పారమార్థికతను చేకూరుస్తాయి. అంతేకాదు, ప్రపంచ దేశాల్లోని యువతుల మనస్సుల్లో ప్రవేశించి వారిని అమితంగా ప్రభావితం చేస్తాయి. ముఖ్యంగా మన భారతదేశంలో స్త్రీత్వానికి పరాకాష్ఠ మాతృత్వమే. ఇది ప్రతి స్త్రీలోనూ ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన సహజ స్వభావం. దీని చిహ్నాలు మనం చిన్న పిల్లల్లో కూడా చూడవచ్చు.

## ప్రశాంతతకు చిహ్నం ప్రేమకు ప్రతిరూపం



శక్తి లేకుండా ఈ ప్రపంచంలో పునరుత్పత్తి జరగదు. మన దేశం అన్ని దేశాల్లోకీ మిక్కిలి బలహీనమైనదిగానూ, వెనుకబడినది గానూ ఉంది. ఎందువల్ల? శక్తి స్వరూపాన్ని మన దేశం గౌరవహీనంగా చూడడమే దీనికి కారణం. భారతదేశంలో శక్తిని పునరుజ్జీవింపజేయడానికే మాత జన్మించింది. ఆమెను ఆదర్శంగా తీసుకొని గార్గి, మైత్రేయి లాంటి వాళ్ళు మళ్ళీ జన్మించాలి. శక్తి యొక్క కరుణ లేకుండా మనం ఏదీ సాధించలేం. అమెరికా, ఐరోపా లాంటి దేశాల్లో నేను చూసిందేమిటో తెలుసా? వారూ శక్తిని ఆరాధిస్తారు. కానీ అది కామ దాహంతో మాత్రమే! ఆ విధంగా వారు తమ అజ్ఞానాన్ని ప్రదర్శిస్తారు. అలా కాకుండా అదే శక్తిని పవిత్ర భావంతో, సాత్వికభావంతో మాతృమూర్తిగా ఎంచి పూజిస్తే, వారికి లభించే సత్ఫలితాలు అమితంగా ఉంటాయి.

నాకు మాతృమూర్తి అనుగ్రహం పితృదేవుని కరుణ కన్నా కొన్ని వందల వేల రెట్లు ఎక్కువ విలువైంది. మాతృదేవత యొక్క దయ, ఆమె శుభాశీస్సులు నాకు సర్వోత్కృష్టమైనవి. మాత మీద గుడ్డి ప్రేమ ప్రదర్శిస్తున్నందుకు నన్ను మన్నించాలి. కానీ ఆమె ఆజ్ఞల్ని పాలించి, ఆమె కనుసన్నల్లో మెలిగే శక్తులు దేన్నైనా సాధించిపెట్టగలవు. నేను అమెరికా ప్రయాణానికి సన్నద్ధుణ్ణి అయ్యే ముందు మాతకు ఓ ఉత్తరం వ్రాశాను. శుభాశీస్సులను అందించవలసిందిగా ఆ ఉత్తరంలో అభ్యర్థించాను. ఆమె ఆశీస్సులు లభించిన తక్షణమే నేను ఏకబిగిన సముద్రం దాటి అమెరికా చేరాను.

మాత నా మనస్సులోకి వచ్చినప్పుడు మాత ముందు రాముని గొప్పతనం ఎంత అని అనిపిస్తుంది. దానికి కారణం నాకు ఆమెపై ఉన్న వెర్రి భక్తి కావచ్చు. రామకృష్ణుణ్ణి ఒక అవతారపురుషునిగా అందరూ భావించవచ్చు. కానీ మాత పట్ల భక్తి భావం ప్రదర్శించని వారు గౌరవార్హులు కారు. a

(స్వామి వివేకానంద
'నా భారతం అమర భారతం' నుంచి)



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -6

**(గత సంచిక తరువాయి...)**

ఇద్దరు దృఢకాయులైన సిక్కులు కత్తులు పట్టుకొని, త్వరితగతిన వచ్చి "స్వామీజీ! మాతో రండి. ఇక్కడ మీరు ఉండడం క్షేమం కాదు. మా ఇంటికి రండి. మా ఇంట్లో మీకు ఏ విధమైన భయమూ ఉండదు" అని అన్నారు.

"అక్కడకు కూడా వాళ్ళు వస్తే మీరేం చేస్తారు? మీరెంతమంది ఉన్నారు? వాళ్ళెంతమంది ఉన్నారు? హిందువులెంతమంది ఉన్నారు?" అని సన్న్యాసి అడిగారు.



"మావి ఏడు కుటుంబాలు, హిందువులవి సుమారు మూడువందల కుటుంబాలు, వాళ్ళవి పదిహేనువందల కుటుంబాలున్నాయి" అన్నారు. "మరి పదిహేను వందల మంది వచ్చి మిమ్మల్ని కొడితే, మీరు తట్టుకోగలరా? నన్ను తీసుకెళ్ళి అంత సాహసం చెయ్యవద్దు. అంతకన్నా వాళ్ళు ఇక్కడే నన్ను ఏమైనా చేస్తే గ్రామంలో శాంతి ఉంటుంది కదా! నన్ను వదిలి మీరు వెళ్ళండి" అని సన్న్యాసి అన్నారు.

"లేదు స్వామీ! మేము వెళ్ళం. మిమ్మల్ని ఎవరైనా ఏమైనా చేస్తే మేం భరించలేం. మీరు మా ఇంటికి రాకపోతే గురుద్వారాకు వచ్చి ఉండండి. గురుద్వారాలో ఎవరూ ఏమీ చెయ్యరు" అన్నారు.

"ఏమైనా సరే నేను ఇక్కడే ఉంటాను" అని సన్న్యాసి చెప్పారు. ఇద్దరు సిక్కులు కత్తులు పట్టుకొని, మెట్ల మీద కూర్చున్నారు. కింద ఇంట్లో ఉన్నవాళ్ళు ఎప్పుడో, ఎక్కడికో వెళ్ళిపోయారు. సన్న్యాసి వాళ్ళిద్దర్నీ కూడా మేడ మీదకు పిలిచి కూర్చోమన్నారు. అక్కడ మసీదు నుంచి అందరూ కేకలు వేస్తూ, దీపాలు పట్టుకొని బయల్దేరారు. ఎప్పుడు ఎవరేం చేస్తారో అని ఇక్కడ వీళ్ళు రాత్రంతా మేలుకొని ఉన్నారు.

ముందే పరిచితుడైన పఠాన్‌కోట్ పోలీస్ ఇన్‌స్పెక్టర్ సన్న్యాసిని చూసి "మీరు ఈ ఊరికెప్పుడు వచ్చారు?" అని అడిగారు. సన్న్యాసి "నేను ఆర్య సమాజస్థుణ్ణి కాను. కానీ ప్రస్తుత సమాజంలో ఒకణ్ణి. ప్రతి ఒకరికీ తమ ధర్మప్రచారం చేసే హక్కు ఉంటుంది. దాన్ని హింసతో విరోధించకూడదు"అని ఇన్‌స్పెక్టర్‌కి వివరించారు. అంతా విని ఇన్‌స్పెక్టర్ గారు "మీరు నిశ్చింతగా ఉండండి. నేనంతా చక్కబరుస్తా" అని చెప్పి, మసీదు వైపు వెళ్ళారు. అరగంట తరువాత ఇన్‌స్పెక్టర్‌తో కలిసి, మౌలా గారు కూడా అక్కడికి వచ్చి సన్న్యాసికి క్షమాపణ చెప్పారు. అప్పటి నుంచి ఆ ఊరిలో ఎటువంటి వివాదాలు లేకుండా ప్రశాంతత చోటు చేసుకుంది.

## సర్దార్జీ రూపంలో సహాయం

పరివ్రాజక జీవితం గడుపుతున్నప్పుడు స్వామి జపానందకు అమరనాథ్ వెళ్ళాలనిపించింది. అలా అనుకున్న వెంటనే రావల్పిండి వెళ్ళారు. అక్కడకు చేరేసరికి ఆయన దగ్గర పది అణాలు మాత్రం మిగిలాయి. అందుకని ఆయన కాలినడకన ప్రయాణం చెయ్యాలని నిశ్చయించుకున్నారు. ఆ సమయంలో ఆయన రావల్పిండిలో రామ్ బాగ్‌లో ఉన్నారు. ఒకరోజు అక్కడికి కొంతమంది అమరనాథ్ యాత్రికులు వచ్చి బస చేశారు. తమతో కలిసి భోజనం చెయ్యాల్సిందిగా సన్న్యాసిని పిలిచారు. హరి షా అనే ఒక భక్తుడు 'అమరనాథ్ వస్తారా' అని భోజన సమయంలో సన్న్యాసిని అడిగాడు. సన్న్యాసి "అమరనాథ్ వెళ్ళాలనే ఉంది. కానీ, నడుస్తూ వెళ్ళాలని నా కోరిక. అలా నడుస్తూ వెళితే కాశ్మీర్ అంతా చూడవచ్చు" అన్నారు.

హరిషా వయస్సు 71 - 72 ఏళ్ళు. యాత్రికులందరిలోకీ పెద్దవాడు. ఆరు అడుగుల ఎత్తైనవాడు, బలవంతుడు. కాశ్మీర్‌లో అతనికి లక్షల్లో బియ్యం, గోధుమల వ్యాపారం ఉంది. ఆయన ఉదార స్వభావి, మంచి దాత. మిగిలిన యాత్రికులతో ఆయన, "మనం కూడా నడిచే వెళదాం. ఏమంటారు?" అని అన్నారు. శ్రీనగర్ 200 మైళ్ళ దూరంలో ఉంది. అంత దూరం నడవడమంటే చాలా సమయం పడుతుంది. ఆరోగ్యం పాడు కావచ్చు. అందుకని శ్రీనగర్ వరకు బస్సులో వెళ్ళడమే మంచిదని ఒక యాత్రికుడు అన్నాడు. కానీ నడిచే వెళ్దామని హరి షా మళ్ళీ అంటూ, "ఇలాంటి

అవకాశాలు మళ్ళీ మళ్ళీ రావు. స్వామీజీతో కలిసి నడుద్దాం" అన్నారు.

మరొక భక్తుడు కూడా "నడిచే వెళదాం. దోవలో సత్సంగం కూడా ఉంటుంది. ఒక్కొక్క గ్రామం చూసుకుంటూ వెళ్ళడంలో చాలా ఆనందం ఉంటుంది. పూర్వం రోజుల్లో అందరూ కాలినడకనే తీర్థయాత్రలు చేసేవారు. అందులో ఎన్నో లాభాలున్నాయి. ఎంతో జ్ఞానం సంపాదించవచ్చు. కొత్త కొత్త వ్యక్తుల పరిచయాలు కూడా అవుతాయి. అస్వస్థత కారణంగా ఎవరైనా నడవలేకపోతే గుర్రం మీద వస్తారు. అందరం నడిచే వెళ్దాం. స్వామీజీ కూడా మనతోనే వస్తారు" అన్నాడు. సన్న్యాసి "అలాగే! నేను కూడా మీతోనే వస్తాను తిరిగి రావడం కూడా నడిచే వస్తారు కదా!" అన్నారు. హరి షా "అవును. ఇప్పుడే నిశ్చయించుకుందాం. ప్రస్తుతానికి నడిచే తిరిగి వద్దాం అనుకుందాం. రాలేని వాళ్ళు బస్సులో రావచ్చు" అన్నారు. అందరూ అంగీకరించారు.

మూడోరోజు తక్షశిలా నగరం చూసి, ఏకతాబాద్ వైపు ప్రయాణమయ్యారు. అక్కడ నుంచి నడక మొదలైంది. అందరూ నడుస్తూ రావల్పిండి – శ్రీనగర్ మార్గంలో డూమేల్ పుల్ చేరారు. ఆ రోజు విశ్రాంతికి ఏదైనా శిబిరానికి చేరాలంటే ఇంకా పదిహేను, పదహారు మైళ్ళు నడవాలి. ఎందుకో తెలియదు కానీ ఉదయం నుంచి సన్న్యాసికి తన జీవితంలో అది అంతిమ దినమని అనిపిస్తోంది. అందుకని ఎవరితో మాట్లాడాలని అనిపించక పోవడంతో మౌనంగా నడుస్తున్నారు. హరి షా రోజూ ఆయన పక్కనే నడిచే వారు రాత్రి కూడా ఆయన దగ్గరే తన పక్క పరుచుకుని పడుకునేవారు. ఆ రోజు కూడా ఆయనతోనే కలిసి నడుద్దామనుకున్నారు. నడుస్తూ నడుస్తూ ఏదో ఒక ప్రసంగం మొదలుపెట్టడం ఆయన అలవాటు. ఆ రోజు కూడా అలాగే మాటలు మొదలుపెట్టబోతే సన్న్యాసి, "ఇవాళ ఎందుకో ఒక్కణ్ణే నడవాలని అనిపిస్తోంది. మాట్లాడాలని లేదు. అందుకని, "మీరు ముందు నడవండి. నేను వెనక వస్తాను" అన్నారు. స్వామీజీకి కోపం వచ్చిందేమో, అందరినీ వదలి వేరే వెళ్ళిపోదామని అనుకుంటున్నారని హరి షా తలచారు.

వెంటనే "సరే స్వామీజీ! మీరు ముందుగా నడవండి. మేమంతా వెనక నడిచి వస్తాం" అన్నారు. స్వామీజీ సమ్మతించి, ముందుగా నడవడం మొదలుపెట్టారు. కొంత దూరం వెళ్ళేసరికి పెద్ద వర్షం పడడం మొదలైంది. అక్కడ తలదాచుకోవడానికి తగిన ఆశ్రమం లేనందువల్ల వాళ్ళంతా వర్షంలో తడుస్తూనే నడక సాగించారు.

ఉదయం తొమ్మిది, పది గంటల ప్రాంతంలో వాళ్ళందరూ ఒక కొండ చరియ దగ్గరకు చేరుకున్నారు. బాటకు ఒక వైపు ఎత్తైన కొండ, మరొక వైపు పెద్ద లోయ. వర్షం తగ్గింది కానీ పైన కొండ మీద నుంచి వేగంగా రాళ్ళు, బురద, మట్టి వచ్చి పడుతున్నాయి. 'ఇందుకే పొద్దుటి నుంచి ఈ వేళతో నా జీవితం సరి అనిపిస్తోంది' అని సన్న్యాసి తన మనస్సులోనే అనుకున్నారు.



ఆయన ఒక చోట నిల్చొని, కళ్ళు మూసుకొని దైవ ప్రార్థన చేస్తూ మృత్యువు కోసం ఎదురుచూస్తున్నారు. అయిదారు నిమిషాలు రాళ్ళ వాన కురిసింది. అతని చుట్టూ రాళ్ళు, బురద పడి నాలుగు వైపులా పెద్ద ఎత్తైన గోడలా తయారైంది. వెనకాల వస్తున్న భక్తులంతా ఆయన బురదమట్టిలో కూరుకు పోయారనుకొని అరవడం మొదలుపెట్టారు. కానీ సన్న్యాసి మీద ఒక్క చిన్న రాయి కూడా పడలేదు. రాళ్ళవాన ఆగగానే ఒక సర్దార్ వచ్చి రాళ్ళ గుట్ట మీదకు ఎక్కి, తన తలపాగా విప్పి ఒక కొసను సన్న్యాసికి అందేలా విసిరాడు. అది పట్టుకొని, అతని సహాయంతో బయటకు వచ్చారు స్వామీజీ. ఆయన ఒంటి మీద గాయమన్నది లేకుండా బయటకు రావడం చూసి, అందరూ సంతోషించారు. ఆ పరమేశ్వరుడే సర్దార్జీ రూపంలో వచ్చి రక్షించాడు అని భావించి ఆ సన్న్యాసి భక్తులతో యాత్ర కొనసాగించారు. a **(మిగతా వచ్చే సంచికలో)**

**అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

కథ : టి.ఎం.ఎస్ చిత్రాలు : శంకర్ తెలుగు సేత : స్వామి జ్ఞానదానంద

11వ శతాబ్దంలో కర్ణాటక రాష్ట్రంలోని ముదనూరు అనే గ్రామంలో దాసిమయ్య జీవించాడు. శివభక్తుడైన అతడు నేత పని చేస్తూ జీవించేవాడు. జీవితంలోని తదుపరి కాలంలో అతను ఎన్నో సామాజిక సంస్కరణలు చేపట్టాడు. ప్రారంభదశలో ఒక రోజు దాసిమయ్య భార్య తన భర్తతో...

స్వామీ! ఈ అందమైన దారప్పోగులు చూడండి.



అవును! ఈ చక్కని పోగులతో అందమైన వస్త్రాన్ని తయారు చేయ వచ్చు కదా!

చెప్పినట్లే శివలీలలనూ, శివభక్తుల విశిష్టతలనూ వివరించే అందమైన చిత్రాలతో కూడిన ఒక వస్త్రాన్ని దాసిమయ్య తయారుచేశాడు.

ఆహా! మనస్సును ఆహ్లాదపరచేలా ఎంత అందంగా ఉంది! ఈ వస్త్రాన్ని పరమేశ్వరునికి అలంకరిస్తే ఎలా ఉంటుంది!



నిజమే! కానీ మన దారిద్ర్యం పోగొట్టు కోవడానికి దీన్ని బజారులో అమ్మితే కొంత డబ్బు వస్తుంది కదా!

సంతలో...

ప్రజలారా! చూడచక్కని రంగుల చిత్రాలతో తయారుచేసిన వస్త్రం ఇది! దీన్ని కొనుగోలు చేసి, భగవంతునికి అలంకరించండి!



'అయ్యా! నీ మాటలు నిజమే. చాలా అందమైన వస్త్రమే ఇది. పరమేశ్వరునికి అలంకరించ డానికి తగినదే! కానీ ఇంత విలువైన వస్త్రం కొనడానికి మా దగ్గర డబ్బు లేదు కదా'! ఉత్సాహం కోల్పోయిన దాసిమయ్యకు హఠాత్తుగా ఒక శివభక్తుడు కనిపించాడు.

నాయనా! అలసిపోయినట్లుగా ఉన్నావేం?



వందనాలండీ! ఇంత ముచ్చటైన వస్త్రాన్ని కొనడానికి ఎవరూ ముందుకు రావడం లేదు.

ఇది ఎంతో ఖరీదైన వస్త్రం! దీన్ని ఎవరు కొనుగోలు చేయగలరు?

శివభక్తుని తేజస్సును చూసి తన్మయుడైన దాసిమయ్య ఒక్క క్షణం ఆలోచించి...

స్వామీ! శివనామాన్ని జపించుకుంటూ నేత నేసిన ఈ వస్త్రాన్ని శివభక్తులైన మీకే సమర్పిస్తున్నాను!




ఇలాంటి వస్త్రాన్ని మీలాంటి తేజస్సంపన్నులైన శివ భక్తునికి కానుకగా ఇచ్చానంటే ఆమె సంతోషిస్తుంది.

మరుసటి ఉదయం... శివభక్తుడు ఇచ్చిన పదార్థాలన్నీ ఎంత వాడినా, తరగకుండా నిండుగానే ఉన్నాయి.

స్వామీ! ఏమి ఆశ్చర్యం! పాత్రలలో ఉంచిన సామగ్రి ఎంత తీసినా తరగడం లేదు. ఎన్నో రెట్లు పెరిగాయి!



అంటే.. మన వస్త్రాన్ని స్వీకరించింది సాక్షాత్తూ పరమేశ్వరుడే! ఆయన కృపాకటాక్షంతో మన పేదరికం పోయింది!

ఆ వస్త్రాన్ని తీసుకున్న శివభక్తుడు దాన్ని ముక్కలుగా చేసి, తన జటాజూటానికీ, యోగదండానికీ, కమండలానికీ చుట్టుకున్నాడు. తరువాత...




దాసిమయ్య తన భార్యతో జరిగినవన్నీ చెప్పాడు. ఆమె కూడా చాలా సంతోషించింది. వాటినన్నిటినీ పాత్రలలో నింపి ఉంచింది.

శివుని మహత్త్వాన్ని దాసిమయ్య అన్ని చోట్లా ప్రచారం చేయసాగాడు. ఇది చూసి అసూయ పడిన ఇతర మతాల వారు కొందరు ఆయనను పరీక్షకు గురిచేశారు. ఒక బిందెలో విషసర్పాన్ని దాచి, దానిపై ఒక గుడ్డను చుట్టి ఆయన దగ్గరకు తీసుకెళ్ళారు.




సంశయమెందుకు! ఇదిగో చూడండి!

బిందెలో చేయి పెట్టి, అందులో నుంచి ఒక స్ఫటిక శివలింగాన్ని బయటకు తీసి చూపాడు దాసిమయ్య. అన్య మతస్థులు దాసిమయ్య మహనీయుడని గ్రహించి వెళ్ళిపోయారు.

మిగతా 36వ పేజీలో...



# మానవత్వానికి మొదటి మెట్టు!

–స్వామి రంగనాథానంద

*కర్మణ్యేవాధి కారస్తే మా ఫలేషు కదాచన।*
*మా కర్మఫల హేతుర్భూః మాతేసంగోస్త్వ కర్మణి॥2.47॥*

'కర్మలు చేయడానికే నీకు హక్కుంది. కానీ వాటి ఫలాలపై ఏమాత్రమూ లేదు. కర్మ ఫలాల్ని నువ్వు సంకల్పించ కూడదు; ఆ కర్మతో నువ్వు బంధం కలిగి ఉండకూడదు.'

నాలుగు ప్రతిపాదనలున్న భగవద్గీతా శ్లోకమిది. 'కర్మలు చేయడానికే నీకు హక్కుంది. కర్మఫలాల కోసం కాదు! నీ కర్మ యొక్క ఉద్దేశం ఫలం అవకూడదు; కర్మలు చేయకుండా ఉండకు' అని ఈ శ్లోకం చెబుతోంది. ఇది చాలా ముఖ్యమైన శ్లోకం. ఫలాన్ని ఆశించకుండా మనం పని ఎలా చేయగలం? అదొక మహోన్నతమైన విషయం. ఈ విధమైన శ్లోకాన్ని విన్నప్పుడు విద్యార్థులు కేవలం పైపై భావాన్ని మాత్రమే గమనిస్తారు. నేను మైసూర్ ఆశ్రమంలో హాస్టల్ వార్డెన్‌గా ఉన్నప్పుడు, విద్యార్థులతో కలసి తోట పని చేసేవాడిని. తోటలో పూలు, పండ్లు లభించేవి. "కేవలం పని చేయడానికే మనకు హక్కుంది. ఫలాలు మాత్రం స్వామీజీకి వెళతాయి!" అని విద్యార్థులు హాస్యంగా అనేవారు.



ఒకరోజు ఈ శ్లోకంలోని భావాన్ని వారికి నేను వివరించాను. అప్పుడు ఈ శ్లోకంలో ఉన్న భావాన్ని వారు తెలుసుకున్నారు.

ఈ లోకంలో నేను ఏకాకిని కాను. నేను ఏ పని చేసినా, నేను దాని ఫలాన్ని గ్రహించి, మిగిలినదంతా మరచి పోతానంటే కుదరదు. మనకున్న దాన్ని ఇతరులతో పంచుకోవాలి. 'ఇది నా పని, ఇవన్నీ నాకే చెందుతాయి' అనే ప్రవృత్తి నుండి బయటపడాలి. విశాలమైన ప్రపంచం మన చుట్టూ ఉంది. ఈ ప్రపంచానికి మనమెంతో ఋణపడి ఉన్నాం. కాబట్టి ఈ కర్మ భావన, సాంఘిక సంక్షేమం, మానవాభివృద్ధి మనకో విషయం స్పష్టం చేస్తోంది. నా ప్రయత్నాల వల్ల లభించే కర్మఫలాలకు నేనొక లబ్ధిదారుణ్ణి, మిగిలిన లబ్ధిదారుల్ని కూడా పరిగణనలోకి తీసుకోవాలనే భావాన్ని మన ముందు ఉంచుతుంది. శ్రీరామకృష్ణుల మాటల్లో చెప్పాలంటే అపరిపక్వ 'నేను' పరిపక్వ 'నేను'గా మారాలి. మనం 'నేను' అనే స్థానంలో 'మనం' అనడం నేర్చుకోవాలి. ఆధ్యాత్మిక అభివృద్ధిలో అది మొదటి దశ.

మనలోని నిజమైన ఆత్మ అందరితో మమేకమవుతుంది. నీవూ, నేనూ ఒకటే. ఏసుక్రీస్తు రెండు విషయాలు చెప్పాడు: "నువ్వు భగవంతుణ్ణి పరిపూర్ణ హృదయంతో ప్రేమించు. అదే మొదటి నిబంధన. రెండవది నువ్వు నీ పక్కింటి వారిని నీలాగే ప్రేమించు."

ఆధ్యాత్మిక, నైతిక కోణాలలో మానవ జీవితంపై రమ్యమైన సమీక్ష ఇది. జర్మన్ తత్త్వవేత్త పాల్ డ్యుసెన్ 'నీవు నీ పక్కింటి వారిని నీ లాగే ప్రేమించు. అయితే ఎందుకు అని నీవు ప్రశ్నిస్తే బైబిలులో దానికి సమాధానం లేదు. దానికి సమాధానం ఉపనిషత్తులలో ఉంది. నీవే నీ పక్కింటివాడివి. మీరిద్దరూ ఒక్కటే. ఒక అనంతమైన ఆత్మయే'' అన్నారు.

కర్మ ఫలాలన్నీ నాకే చెందాలనే ప్రవృత్తి వల్ల కర్మలు చేయకుండా ఉండిపోవడం భారతదేశంలో అత్యధికం. మనకు మతపరమైన భావనలు ఎంతగా ఉన్నా, సాంఘిక దృక్పథంలో మనం బాగా విఫలమయ్యాం. సామాజిక ఆస్తి ఎవరి ఆస్తీ కాదు. వీధి కుళాయి ఎవరిదీ కాదు. మనం మన కుళాయిల గురించే శ్రద్ధ తీసుకుంటాం. వీధుల్లో కుళాయిల నుంచి నీళ్ళు వ్యర్థమవుతుంటే ఊరుకుంటాం. అది మనకు సంబంధించినది కాదు కాబట్టి దాన్ని పట్టించుకోం. ఈ విధమైన సంకుచితత్త్వం మన దేశాన్ని కబళించి, బలహీనం చేసింది. స్వార్థపరత్వం, అవినీతి, హింస, దోపిడీ – ఇవన్నీ ఆ సంకుచిత ప్రవృత్తి నుంచి వచ్చేవే! కాబట్టి నేను సంఘానికి చెందినవాణ్ణని తెలుసుకున్నప్పుడు మాత్రమే మనలోని సంకుచిత తత్త్వం నశిస్తుంది. అదే మానవత్వానికి మొదటి మెట్టు.

అనువాదం: స్వామి అచిన్త్యానంద

# ఆధ్యాత్మిక అన్వేషణ



- స్వామి తపస్యానంద

**ప్రశ్న:** ఆధ్యాత్మిక మార్గంలో కాస్త అయినా పురోగమిస్తున్నామని ఎలా తెలుసుకోగలం?

**జవాబు:** చాలా సందర్భాలలో పురోగమనం (అభివృద్ధి) చాలా నెమ్మదిగా క్రమక్రమంగా జరుగుతుంది; పెద్ద పరిధి ఉన్న గడియారంలో ముల్లు ఎంత నెమ్మదిగా కదులుతుందో అలా! క్రమంగా జరిగే దాన్ని గుర్తించడం కష్టం. చిన్నపిల్లలుగా ఉన్నప్పుడు మనం ఒక భాషను అధ్యయనం చేసినా, అభివృద్ధి ఉన్నా సరే, మన అభివృద్ధిని గమనించడం చాలా కష్టం. శారదాదేవి ఆధ్యాత్మిక సాధకుని పురోగమనాన్ని నిద్రలో స్ట్రెచర్ మీద తీసుకుని పోబడుతున్న వ్యక్తితో పోలుస్తారు. అతడికి తాను ఎక్కడికి వెళుతున్నాడో తెలియదు, అయితే లేచి తాను గమ్యస్థానంలో ఉన్నట్లు గ్రహించాక, అతనికి జరిగింది తెలుస్తుంది. స్ట్రెచర్ మీద నిజంగా అతణ్ణి తీసుకొని వెళుతున్నప్పుడు అతడికి తెలియకపోయినా అతడు ముందుకు సాగుతూనే (పురోగమిస్తూనే) ఉన్నాడు.

ఆధ్యాత్మిక జీవితానికి సంబంధించిన మన దృక్పథం ప్రాపంచిక వ్యవహారాలలో కన్నా భిన్నంగా ఉండాలి. ప్రాపంచిక జీవితానికి సంబంధించిన విషయాలలో మన మనోవైఖరి పరిమాణాత్మకమైనది. విజయాన్ని (లేక పురోభివృద్ధిని) నిర్ణయించడానికి కొలత పద్ధతి ఒకటే ప్రయోగిస్తారు. అయితే ఈ కొలవడం అనే ఆలోచనను వదిలిపెట్టే వరకూ మనం ఆధ్యాత్మిక ప్రాధాన్యమున్న జగత్తులోకి ప్రవేశించనట్లే.

'అనావృష్టి వచ్చినా వ్యవసాయమే తన వృత్తిగా చేసుకున్న రైతు ఎలాగైతే వ్యవసాయాన్ని వదిల పెట్టడో, అలాగే నిజమైన సాధకుడు ఆధ్యాత్మిక సాధనలో ఎన్ని కష్టాలు ఎదురైనా భరించి, సంపూర్ణ విశ్వాసంతో సాధన చేస్తాడు' అని శ్రీరామకృష్ణులు చెప్పేవారు. శ్రీశారదాదేవి చెప్పినట్లు ప్రతీ ఆధ్యాత్మిక సాధకుడూ అతడికి తెలిసినా, తెలియకున్నా అభివృద్ధి చెందుతూనే ఉంటాడు – నిద్ర పోతున్న వ్యక్తి తనకు తెలియకుండానే స్ట్రెచర్ మీద వెళ్ళినట్లు!

భగవంతునిపై విశ్వాసం పెరిగేకొద్దీ మనకు భయమూ, శంకావంటివి తొలగుతాయి. కొన్ని సమయాల్లో ఈ విశ్వాసం మందగించడం వల్ల అధైర్యం, నిరుత్సాహం కలుగుతాయి.

అయితే నిజమైన సాధకుని జీవితంలో ఇవన్నీ తాత్కాలికమైనవి. అతడు కదిలిపోయే మబ్బులానో, గాలి తెరలానో ఆ మనఃస్థితి పోవడం కోసం ఓరిమితో ఎదురు చూడాలి. రాను రానూ మనలో శాంతి, పవిత్రత, సమర్థతలు అధికమవుతుంటే మనం ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందుతున్నామని అనుకోవచ్చు. a



# పవిత్రమూర్తి ఆగమనం రాజమహేంద్రి పావనం

దివ్యజనని శారదాదేవి దక్షిణ భారతదేశ యాత్ర ముగించుకొని, మద్రాసు నుంచి కలకత్తాకు తిరుగు ప్రయాణమయ్యారు. మార్గమధ్యంలో రాజమహేంద్రవరంలో ఆగి, ఒక రోజు బస చేశారు. ఆంధ్రప్రదేశ్‌లోని రాజమండ్రి పట్టణం గోదావరి నదికి ఎడమగట్టున విస్తరించి ఉంది. ఈ పట్టణంలో కోటి లింగాల క్షేత్రం చాలా ప్రసిద్ధి చెందినది. వేద వ్యాసుడు, ఆది శంకరులు, చైతన్య మహాప్రభువు మొదలైన మహా పురుషులు ఈ పుణ్యక్షేత్రాన్ని సందర్శించారు. పుణ్యక్షేత్రమైన ఈ నగరం శారదామాత పాదధూళితో మరింత పుణ్యభూమి అయింది.

శ్రీశారదాదేవి 1911 ఏప్రిల్ 5వ తేదీన గోదావరి రైల్వే స్టేషన్‌లో దిగారు. శ్రీమాత వెంటనున్న తమ బృందంతో ఆనాటి జిల్లా సెషన్స్ జడ్జిగారి వసతి గృహంలో అతిథిగా బస చేశారు. వారి గృహం గోదావరి తీరానికి సుమారు 500 మీటర్ల దూరంలో ఉంది. ***(ఫోటో 1)***

ఈ గృహం ఒకప్పటి రాజు రాజరాజ నరేంద్రుడి కోటలోని భవనం. ఈ భవనాన్ని ఆనుకొని, గోదావరి పుష్కరాల రేవు ఉంది. అక్కడే రైల్వే‌బ్రిడ్జి (ఇప్పటి పాతది) ఉంది. ఈ భవనం లోపల నుంచే గోదావరి నదిలోకి గ్రానైట్ రాళ్ళతో చేసిన మెట్లు ఉండేవి. ఇవి ఇంచుమించు రెండున్నర అడుగుల వెడల్పు, పక్కగోడలతో ఉన్నాయి. ఈ మెట్ల దారిని భవనంలోని వారు అంతరంగికంగా ఉపయోగించుకొనేవారు. ఈ మెట్ల మీదుగానే వెళ్ళి, దివ్యజనని శారదాదేవి గోదావరీ స్నానం చేశారు.

తరువాతి కాలంలో ఈ భవనాన్ని మునిసిపల్ హైస్కూల్‌గా మార్చి, ఉపయోగించారు. ఈ మెట్లు ఇప్పటికి సుమారు 40-50 ఏళ్ళ క్రితం వరకూ ఉండేవి. ఈ పాత భవనాన్ని కూల్చివేసి, పక్కనున్న మునిసిపల్ వాటర్‌వర్క్స్‌తో కలపడం జరిగింది. ఉధృతమైన గోదావరి వరద నీటిని అదుపు చేయడం కోసం ఎత్తైన బలమైన అడ్డుగోడను రాతితో నిర్మించారు. దీని కారణంగా మెట్లలోని అధిక భాగం పోయాయి. వీటిలోని చివరి మెట్లు ఇప్పటికీ మనకు కనిపిస్తాయి. ***(ఫోటో 2)***

శారదామాత మరునాడు, అంటే 1911 ఏప్రిల్ 6న గోదావరి రైల్వే స్టేషనులో రైలెక్కి, పూరీ పుణ్యక్షేత్రాన్ని దర్శించడానికి వెళ్ళారు. శ్రీశారదాదేవి రాజమండ్రి పర్యటన స్మృతి చిహ్నంగా పుష్కరాల రేవు పక్కన ఆమె విగ్రహాన్ని ఎత్తైన మండపంపై ప్రతిష్ఠించారు. ఈ సుందరమైన విగ్రహం పాత రైలు వంతెన వైపు చూస్తున్నట్లు మనకు కనిపిస్తుంది ***(ఫోటో 3).*** దీన్ని రాజమండ్రిలోని శ్రీశారదా సంఘం వారు నెలకొల్పారు. ఈ స్మృతి చిహ్నాన్ని 1991 ఆగష్టు 13న శ్రీమత్ స్వామి రంగనాథానందజీ మహరాజ్ ఆవిష్కరించారు. రానున్న 2011 ఏప్రిల్ 5, 6 తేదీల నాటికి దివ్యజనని శ్రీశారదాదేవి రాజమండ్రి సందర్శించి, శత వసంతాలు నిండుతాయి.

– డాక్టర్ పాలేపు వేంకటేశ్వర రావు



రాజమండ్రిలో శ్రీశారదాదేవి బస చేసిన వసతి గృహం



భవనం లోపలి నుంచి గోదావరి తీరానికి మెట్లదారి.



పుష్కరాల రేవు వద్ద శ్రీశారదాదేవి మండపం

# సంతోష దీపం వెలగాలి నిత్యం



– రామ్. జలదుర్గం

సంతోషంగా ఉండాలని ఎవరు మాత్రం కోరుకోరు! మరి కోరుకున్న వాళ్ళంతా సంతోషాన్ని పొందుతున్నారా అంటే 'లేదు' అనే సమాధానమే మనకు సాధారణంగా వినిపిస్తుంది.

అయితే సంతోషాన్ని కోరు కోవడానికీ, పొందడానికీ మధ్య దూరమెంత? కోరుకుంటున్న సంతోషాన్ని పొందకుండా అడ్డుకునే శక్తులేమిటో తెలుసుకుందాం.

"జరుగుబాటుంటే సంతోషంగా ఉండడం ఏమంత గొప్ప విషయమేం కాదు. ప్రతికూల పరిస్థితుల్లోనూ, సంతోషాన్ని వెతికి పట్టుకోగల వైఖరి నిత్య సంతోషానికి మూలకారణం" అన్నాడు ఓ తత్త్వవేత్త.

నిజానికి, సంతోషాన్నిచ్చేవి భౌతికంగా కన్పించే వస్తు సముదాయం కాదు. మానసిక భావనలు, సున్నితమైన ఉద్వేగాలు. బ్రతికినంత కాలం సంతోషంగా కాలం గడపాలని అందరూ కోరుకున్నా, పరిస్థితులు ప్రతికూలిస్తే అనుకున్నవి అనుకున్నట్లుగా జరగకపోతే, తాను ఊహించినట్లుగా అవతలి వ్యక్తి ప్రవర్తన లేకపోతే మనలో చాలామంది నిరాశ, నిస్పృహ, అసంతృప్తితో నీరసపడిపోతారు. సంతోషం, ఆనందం, ఉత్సాహం, ఉల్లాసం ఏదైనా అనండి, వీటికి సంబంధించిన భావన చాలు మనసు హాయిగా గాలిలో తేలినట్లుండడానికి. ఈ స్థితినే అందరూ కోరుకున్నా, చాలా మందికి ఈ సంతోషం అనే స్థితిని ఎలా అనుభవించాలో తెలియకపోవడం దురదృష్టకరం. ఇటీవల ఇంగ్లండ్‌కు చెందిన 'వరల్డ్ వేల్యూస్ సర్వే' అనే సంస్థ ప్రపంచంలోని ప్రజల్లో ఎవరు సంతోషంగా ఉన్నారో తెలుసుకోవడం కోసం ఒక సర్వేను నిర్వహించింది. అందులో ప్రపంచం మొత్తానికి నైజీరియా అత్యంత సంతోషాన్ని ఆస్వాదించే దేశంగా, రుమేనియా అతి నిరాశకు గురైన దేశంగా ప్రకటించింది. మొత్తం 65 దేశాల పరిస్థితులను ప్రకటిస్తే అందులో మొదటి నాలుగు స్థానాల్లో, నైజీరియా, మెక్సికో, వెనిజులా, ఎల్‌సాల్వడార్ కాగా, చివరి మూడు రుమేనియా, అర్మీనియా, రష్యాదేశాలు అసంతృప్తితో రగులుతున్న దేశాలుగా ప్రకటించబడ్డాయి. అందులో భారతదేశం 21వ స్థానంలో ఉండగా పాకిస్థాన్ 23వ స్థానంలో నిలిచింది.... ఈ సర్వేలో ర్యాంకులతో పాటు సంతోషానికి గల 10 కారణాలను కూడా ఈ సంస్థ వెల్లడించింది.

1. ఎప్పుడూ సంతోషంగా ఉండాలనే దృఢ సంకల్పం.
2. భార్యాభర్తలు అన్యోన్యంగా ఉండడం.
3. స్నేహం చేయడం.... వారి భావాల్ని గౌరవించడం.
4. తక్కువగా ఆశించడం.... ఉన్నదాంతో తృప్తి చెందడం.
5. ఇతరులకు మేలు చేయడం.
6. బాగా డబ్బు సంపాదించడం.
7. వృద్ధాప్యంలో తృప్తిగా జీవించడం.
8. తనకు లేనిదాన్ని గురించి చింతించకపోవడం.
9. భగవంతునిపై విశ్వాసం ఉంచడం.
10. ఇతరులతో పోల్చుకోకపోవడం.

ఈ సర్వే ప్రధానాంశాలు గమనిస్తే... బిజీ జీవితాన్ని గడిపే నగర ప్రజల కంటే, ఉన్నదాంతో తృప్తి పడే పల్లెటూరి ప్రజలే ఎక్కువ ఆనందంగా ఉన్నారట. ఎక్కువ వస్తువుల కోసం, విలాసాల కోసం ఆరాటపడడం ఆనందాన్ని చంపుకోవడం లాంటిదేనట. దేశానికీ, దేశానికీ మధ్య సంతోషాన్నిచ్చే విషయాలపై కాస్తంత అభిప్రాయభేదాలున్నా అన్ని దేశాల ప్రజలు ఏకగ్రీవంగా అంగీకరించిన అంశమేంటంటే...డబ్బు, వస్తువులు మాత్రమే ఆనందాన్ని ఇవ్వలేవు అన్నది ప్రధానాంశం.

డబ్బు కేవలం వస్తుకొనుగోలుకు అవసరమయ్యే సాధనం మాత్రమే. ఈ సాధనం ద్వారా కావలసిన వస్తువు, ఆ వస్తువు నుంచి సౌకర్యం, తద్వారా సంతోషం పొందే అవకాశాలున్నాయి. అయితే దురదృష్ట వశాత్తూ మనిషి ప్రయాత్నాలన్నీ జీవితాంతం డబ్బు సంపాదన దగ్గరే ఆగిపోయి డబ్బే సంతోషమనే భ్రమలో పడి, సంపాదనా

మార్గంలో బిజీగా ఉంటూ... సంతోషానికి అర్థం ఏనాడో మర్చి పోయాడు.

**మరి సంతోషంగా ఉండాలంటే!** బోసినవ్వులతో కిలకిలనవ్వే చిన్న పిల్లల్ని చూడండి, వాళ్ళ ఆనందానికి ఏ పెద్ద కారణాలూ ఉండవు, చిటికేస్తే చాలు నవ్వుతారు. రెండు సంవత్సరాల పిల్లలు రోజుకు నాలుగు వందల సార్లు నవ్వితే 16 సంవత్సరాల పై బడిన వ్యక్తి రోజుకు 15-17 సార్లు మాత్రమే నవ్వుతాడని రుజువైంది. మనిషి ఎదుగుతున్న కొద్దీ నవ్వు దూరమవుతుండడం గమనించాల్సిన విషయం. సంతోషానికి నవ్వు ప్రతీక కదా!... కేవలం సంతోషంగా ఉండాలన్న కోరిక మాత్రమే చాలదు. అందుకు దృఢమైన నిర్ణయం చాలా అవసరం. ప్రతీ క్షణం ఆ నిర్ణయాన్ని గుర్తుంచుకోవాలి.



మనిషి జీవితంలో సంతోషం పాత్ర చాలా వుంది. అది మానవసంబంధాలను, చుట్టూ ఉన్న పరిస్థితులను, వ్యక్తులను, ఇతరులపై ఏర్పరచుకునే అభిప్రాయాలను కూడా ప్రభావితం చేస్తుంది. కాబట్టి సంతోషం అనే దీపం ఎప్పుడూ వెలుగుతూనే ఉండాలి.

**వీలైనంత సాధారణంగా జీవించడం :**

స్వార్థాన్ని కొంతవరకు తగ్గించుకుని, ఇతరులకు సహాయం చేయడంలోని తృప్తి ఆనందానికి దారి తీస్తుంది.

నేను ఈ రోజు సంతోషంగానే ఉన్నాను, అన్నీ సక్రమంగానే జరుగుతున్నాయి అన్న ఆలోచనలు కొనసాగిస్తే చాలు. ఆ రోజంతా ఈ ఆలోచనల ప్రభావం, మీ ప్రవర్తనపై పడడమే కాకుండా మీ వైఖరిలో మార్పు వచ్చి, ఇలా ఆలోచించడం అలవాటవుతుంది.

మనకున్న అదృష్టాన్నీ, సంపదనూ, సంబంధాలనూ తలచుకొని గొప్పగా భావించడం, లేని వాటి గురించి ఆలోచించడం కంటే చాలా మంచిది.

సంతోషానికైనా, బాధలకైనా ఎవరికి వారే బాధ్యత వహించాలి తప్ప ఇంకె వరినో బాధ్యులను చేయకూడదు.

తక్కువగా ఆశించడం, ఎక్కువగా ఇవ్వడం అన్నది ఆనందానికి మూలంగా ప్రపంచ ప్రజలంతా అంగీకరించిన వాస్తవం.

సంతోషంగా ఉండాలంటే... ఆ సంతోషాన్ని సృష్టించుకునే నేర్పుకూడా కలిగి ఉండడం చాలా అవసరం... ప్రస్తుతం అనవసర విషయం గురించి ఆలోచించి ఒత్తిడికి గురవడమా? లేక మంచి సంఘటనలు గుర్తు తెచ్చుకుని ఉద్వేగాలను అదుపులో ఉంచుకోవడమా? అన్న నిర్ణయం తీసుకోగలిగిన ఎవరైనా నిత్య సంతోషంతో వెలుగుతారు... `

## వివేకానంద వాణీ సంస్థ విద్యార్థులకు గమనిక

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029.**

**వివేకానంద వాణీ సంస్థ ( జనవరి- మార్చి 07 బ్యాచ్) విద్యార్థులకు జనవరి నుంచి డిసెంబరు 07 వరకు ఒక సంవత్సరం పాటు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాస పత్రికను కానుకగా అందించింది. మీ పరిపూర్ణ వికాసానికి చేయూతనిచ్చి, మిమ్మల్ని విజయ పథంలో నడిపించేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' విశేష కృషి చేస్తోంది.**

**యువతరానికి స్ఫూర్తినిచ్చే 'యువవాహిని' శీర్షికలతో అలరారుతున్న ఈ పత్రికను 2008 జనవరి సంచిక నుంచి పొందగోరే (RP/ VIOL 01 నుంచి 8110 వరకు నెంబర్లు గల) విద్యార్థినీ విద్యార్థులు ఒక సంవత్సరం చందా రూ|| 85/-లు ఎమ్.ఓ./ డి.డి ద్వారా పై చిరునామాకు పంపవలెను. మరిన్ని వివరాల కోసం 2766 7799 కు ఫోన్ చేసి తెలుసుకోవచ్చు.**

*భగవత్సేవలో...*

**స్వామి అనుపమానంద**
**డైరక్టరు, వివేకానంద వాణీ సంస్థ**

# మనసు - మర్మం

యువవాహిని

- శ్రీరామ్

బాహ్య ప్రపంచాన్ని అధ్యయనం చేయడం అందరికీ అలవాటైన పని. దానిలోని అణువణువునూ పరిశోధించి, పరిశీలించి, వాటి రహస్యాలను కనుగొనడం ద్వారా పరిజ్ఞానాన్ని పెంపొందించుకుంటున్నాం. శాఖోపశాఖలుగా విస్తరించిన శాస్త్ర పరిజ్ఞానమే దీనికి నిదర్శనం. కానీ, ఈ ప్రగతి, సంపదలు శాంతినీ, ఆనందాన్నీ ఇవ్వలేకపోతున్నాయి. అంతః ప్రపంచాన్ని మరచిపోవడమే అందుకు అసలైన కారణం.




అయితే, మనస్సుతో ప్రయోగం చేయడం ప్రతి భారతీయుడికీ దాదాపు తెలిసే ఉంటుంది. అంతరార్థాలు తెలిసో తెలియకో రోజులో కొంతకాలమైనా ఆ పనికి కేటాయిస్తారు. భారతీయ ఆచార వ్యవహారాలు అలాంటివి మరి! వాటిలో ఎంతో మనోవిజ్ఞానం దాగి ఉంది.

మనస్సు గురించి తెలుసుకోవాలంటే, మనం కొన్ని విధి విధానాలను అవలంబించవచ్చు. రోజంతా మౌనంగా ఉండేందుకు ప్రయత్నించవచ్చు. ఇష్టమైన వస్తువుల్ని కొంతకాలం పాటు వదిలివేయవచ్చు. (కాశీలో మనకు అత్యంత ప్రియమైన వాటిని పూర్తిగా త్యాగం చేయాలనడం ఇలాంటిదే). ఆహారంలో మార్పును తీసుకురావచ్చు. మనస్సుతో పోరాటాన్ని స్వాగతించే ఇలాంటి విషయాలనే 'తపస్సు' అని పిలుస్తారు.



ఈ తపస్సు ఆరంభదశలో మనం కొన్నిసార్లు విఫలం కావచ్చు. కానీ, ఓటమి ఎదురైన ప్రతిసారీ మళ్ళీ దృఢంగా సంకల్పించుకొని ప్రయత్నించాలి. ఎందుకంటే, 'మనో నిగ్రహమనేది మాత్ర లాగ మింగడానికి సాధ్యమయ్యేది కాదు' అని స్వామి వివేకానంద అంటారు. 'వేదాంత పంచదశి'లో విద్యారణ్య మహర్షి ఈ కార్యాన్ని అత్యంత కష్టసాధ్యమైన పనిగా వర్ణించారు. సముద్రాన్ని గడ్డి పరకతో తోడివేయడానికి కావలసినంత ఓర్పు, పట్టుదల ఉంటేనే మనస్సును స్వాధీనం చేసుకోవడం సాధ్యమని ఆయన వివరించారు.

'భగవద్గీత'లో చెప్పినట్లు, 'మొదట ఈ అభ్యాసాలు చేదుగా ఉన్నా, కాలం గడిచే కొద్దీ ఆనందాన్నే ప్రసాదిస్తాయి'.

నిజం చెప్పాలంటే, పురుషుల కన్నా స్త్రీలు మానసికంగా బలవంతులని మనో వైజ్ఞానికుల విశ్లేషణలో వెల్లడైంది. వ్రతాలు, ఉపవాసాల పేరుతో ఎన్నో నియమాలను వారు పాటించడమే దీనికి కారణం. మనస్సుకు శిక్షణనిచ్చే నియమాలను పాటించడం వల్ల మనోబలం పెరుగుతుంది. నిగ్రహం కలిగి ఉండడం, నియమాలను పాటించడం బలహీనత కాదు.

"నియమ నిష్ఠలతో తమను బంధించుకొనేవారు నిజానికి స్వేచ్ఛ కలవారు. స్వేచ్ఛాజీవులమని అనుకొనే బలహీనులు మాత్రం మనస్సు విశృంఖలత్వానికి బందీలు" అని కబీర్ దాస్ అన్నారు. నియమ నిష్ఠలను పాటించేవారు జీవితంలో కష్టనష్టాలు ఎదురైనప్పుడు సంయమనాన్ని కోల్పోరు. మత్తుమందులకు బానిసలుగా, పిచ్చివారిగా మారరు. మనోదౌర్బల్యంతో ఆత్మహత్య చేసుకోవడం లాంటి పనులు చేయరు. ప్రతికూల పరిస్థితులను ధైర్యంతో ఎదుర్కొని, తిరిగి ఉన్నతిని పొందేందుకు కావలసిన సహనం, సంకల్పశక్తి వీరికి నియమ నిష్ఠలతో సొంతమవుతాయి.



# యువవాణి

**- స్వామి పరిజ్ఞేయానంద**

**రాకేష్, హైదరాబాద్**

**ప్రశ్న:** నేటి యువతీ యువకులు నిరాశా నిస్పృహలకు ఎందుకు గురవుతున్నారు? అందులో నుంచి బయటపడే మార్గం ఏమిటి?

**జవాబు:** యువతరమే కాదు, మనిషిగా జన్మించిన ప్రతి ఒక్కరూ ఏదో ఒక సమయంలో నిరాశా నిస్పృహలకు గురి కావాల్సివస్తుంది. చేపట్టే పనిలో ఆశించిన ఫలితాలు రానప్పుడూ, లేదంటే అవసరాలకు మించి కోరికల్ని పెంచుకొని ఆ కోరికలను తీర్చే ఆరాటంలో అపజయం పాలైనప్పుడూ మనిషి నిరాశలో కూరుకు పోవడం సహజం. కాబట్టి మన మనస్సులో నిరంతరం ఆశాజ్యోతి జ్వలించేలా జాగ్రత్త వహించాలి.

One of the toughest things in the world is a mind filled with hope.

*- Norman V. Peale*

జీవితంలో ఉన్నతస్థాయికి ఎదగాలని ఆశించడం హర్షణీయం. కానీ ఆ ప్రయత్నంలో విఫలమైతే నిరాశకు లోనుకావడం దయనీయం. అందుకే 'Hope for the best, prepare for the worst' అని అంటారు. ఈ సూత్రాన్ని గుర్తుంచుకుంటే కార్యసాధనలో విజయాన్ని సాధించలేక పోయినా మనస్సు నిరాశలోకి జారిపోకుండా స్థిరంగా, దృఢంగా ఉండగలదు.

అపజయాల గురించి ఆలోచిస్తూ మానసిక ఒత్తిళ్ళకూ, ఆందోళనలకూ దూరం కావాలంటే స్వామి వివేకానంద మనకిచ్చిన మహామంత్రాన్ని తరుచూ మననం చేయాలి. అది ఏమిటంటే,

The remedy for weakness is not brooding over weakness, but thinking of strength...

అపజయాలకు అధైర్యపడకుండా రెట్టింపు ఉత్సాహంతో పట్టువిడువకుండా ప్రయత్నించాలి.

**నవీన్, సూర్యాపేట**

**ప్రశ్న:** సమయ నిర్వహణ కోసం సూచనల్ని ఇవ్వండి.

**జవాబు:** కనకం కంటే కాలం విలువైనది. Time is more precious than money. ఇది మనం తరచూ వింటున్న సూక్తి. గడచిన కాలం తిరిగి రాదన్నది జగమెరిగిన సత్యం. మనిషి ఏది సాధించాలన్నా శారీరక, మానసిక శక్తులు అవసరం. కాబట్టి మానవ జీవితంలో యౌవనం ఎంతో విలువైనది. అందుకే స్వామి వివేకానంద 'నా ఆశలన్నీ యువత పైనే' అన్నారు.

"My faith is in the younger generation. *- Swami Vivekananda*

సమయాన్ని సద్వినియోగ పరచడానికి పాటించాల్సిన కొన్ని సూచనలు:

1. అనవసరపు కబుర్లు కట్టిపెట్టడం.
2. అర్థంలేని వ్యర్థ తిరుగుళ్ళను అరికట్టడం.
3. చేసిన తప్పుల్ని గతం గతః అని మరిచిపోవడం.
4. భవిష్యత్తు గురించి ఆలోచిస్తూ ఊహాలోకాల్లో విహరించడం మానడం.
5. వ్యర్థ కార్యకలాపాలకు దూరంగా ఉండడం.

సమయాన్ని వృథా చేయడం వల్ల వచ్చేదేముందో తెలియదుగానీ, పోయేది మాత్రం ఒకటుంది. అదే అతి విలువైన 'మానవ జన్మ'.

Life is too brief to waste even one moment in useless regret or vain expectation.

*- Dorothy Strange*

కాబట్టి సమయాన్ని సమయస్ఫూర్తితో సద్వినియోగం చేసుకోవడానికి ప్రయత్నించాలి.

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:
**యువవాణి**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్ గూడ, హైదరాబాద్ - 500 029
E- mail : rkprabhayuvavani@gmail.com



# శ్రీరామకృష్ణ మఠం

రిజర్వ్ లైన్ , న్యూ నాథమ్ రోడ్ , మదురై -625 014
E-mail: rkmath@ eth.net Ph: (0452) 2680 224, 2681 181





## విరాళాలకై విన్నపం

ప్రియ మిత్రులకు,

నమస్సులు, హృదయపూర్వక శుభాకాంక్షలు.

జగజ్జనని శ్రీ మీనాక్షి కొలువైన మదురై నగరం దక్షిణ భారత దేశంలోని ప్రముఖ యాత్రా స్థలాలలో ఒకటి. మదురైలోని శ్రీరామకృష్ణమఠంశాఖ 1987లో ప్రారంభించబడింది. 1998లో ఈ మఠం ఆవరణలో శ్రీ రామకృష్ణులవారి దేవాలయ సంప్రోక్షణ జరిగింది. అప్పటినుంచి మదురైలోని శ్రీ రామకృష్ణ మఠం అనేక ధార్మిక,సేవా కార్యక్రమాలను నిర్వహిస్తోంది. భవిష్యత్తులో ఎన్నో మహత్కార్యాలను సాధించవలసిన 9 ఏళ్ళ పసిపాప ఇప్పుడీ మఠం.





## నూతన భవన నిర్మాణం

1.గ్రంథాలయం, ఉచిత పఠనాలయం, ఆడిటోరియం...
2.రామకృష్ణ, వివేకానంద, సనాతనధర్మ ప్రచారానికి పుస్తక విక్రయశాల
3.కార్యాలయం, అభ్యాగతుల (విజిటర్స్) గది...

- మొదటి అంతస్తు :గ్రంథాలయం, ఉచిత పఠనాలయం, ఆడిటోరియంల నిర్మాణం (3423 చ.ద. అడుగులు)...
- క్రింది అంతస్తు : పుస్తక విక్రయశాల, అభ్యాగతుల గది, కార్యాలయాల నిర్మాణం. (3439 చదరపు అడుగులు)
- నిర్మాణదశలో ఉన్న ఈ కొత్త భవనానికి అయ్యే మొత్తం ఖర్చు సుమారు రూ. 45.3 లక్షలు అని అంచనా.
- ఈ భవన నిర్మాణానికి ఉదారులైన భక్తులు శ్రేయోభిలాషులు, స్నేహితుల నుండి విరాళాల్ని కోరుతున్నాం.

విరాళాలను 'Sri Ramakrishna Math, Madurai' పేరున చెక్కు లేదా డి.డి.తీసి Sri Ramakrishna Math, Reserve Line, New Natham Road, Madurai - 625 014 కు పంపవలసిందిగా మనవి. అన్ని విరాళాలనూ కృతజ్ఞతతో స్వీకరిస్తాము. ఒక లక్ష, అంతకుమించి విరాళాలిచ్చే దాతల పేర్లను ప్రత్యేకంగా ప్రదర్శించబడును.

మీ కోసం, మీ కుటుంబ సభ్యుల సంక్షేమం కోసం మదురైలోని జగజ్జనని శ్రీ శ్రీ మీనాక్షిని, శ్రీశ్రీ సుందరేశ్వరశివుణ్ణి, భగవాన్ శ్రీ రామకృష్ణులు, దివ్య జనని శ్రీ శారదాదేవి, స్వామి వివేకానందులను ప్రార్థిస్తూ,

ధన్యవాదములతో,

భగవత్సేవలో
**స్వామి కమలాత్మానంద**
అధ్యక్షులు

- ఆర్. కృష్ణ

# ఆత్మగౌరవమే ఆభరణం

వీరసింహ గ్రామం నుంచి 8 ఏళ్ళ బాలుడు తండ్రి వెంట కలకత్తాకు కాలినడకన వెళుతున్నాడు. దారి ప్రక్కనున్న మైలురాళ్ళను గమనించిన ఆ పిల్లవాడు, తన తండ్రితో "నాన్నా! ఈ రాళ్ళపై ఏమి వ్రాశారు?" అని అడిగాడు. "ఈశ్వర్! ఇవి మైలురాళ్ళు. ఒక రాయికీ మరొక రాయికీ మైలుదూరముంటుంది. ఆ రాళ్ళపై ఇంగ్లీషు అంకెలు వ్రాశారు" అని జవాబిచ్చాడు. ఆ బాలుడు తండ్రితో "మనం కలకత్తా చేరే లోపల నేను ఇంగ్లీషు అంకెలు నేర్చుకొంటాను" అన్నాడు. కలకత్తా చేరేసరికి వారు 19 మైలురాళ్ళు దాటారు. ఆ పిల్లవాడు ఇంగ్లీషులో అంకెలు నేర్చుకొని తండ్రిని సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తాడు. అతనే ఈశ్వర చంద్ర విద్యాసాగర్.



హుగ్లీ జిల్లాలోని వీరసింహ గ్రామంలోని ఒక బీద బ్రాహ్మణ కుటుంబంలో క్రీ.శ. 1820లో ఈశ్వరచంద్ర జన్మించాడు. అతని తండ్రి ఠాకూర్‌దాస్ నెలకు పది రూపాయల జీతంతో ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయుడిగా పనిచేసేవాడు. ధనవంతుల పిల్లలు నెలకు అయిదు రూపాయల రుసుము కట్టి, హిందూ కాలేజిలో చదివేవారు. సంస్కృత కళాశాలలో చదువు ఉచితంగా చెప్పేవారు. అందువల్ల ఈశ్వరచంద్ర సంస్కృత కళాశాలలో 1829 జూన్‌లో చేరాడు. 1841 వరకు సంస్కృత కళాశాలలో చదివాడు.

సంస్కృత వ్యాకరణం, సాహిత్యం, తర్కం, అలంకారం, వేదాంతాలలో ఈశ్వరచంద్ర అపార పాండిత్యం సంపాదించాడు. లా కమిటీ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. ఆంగ్ల భాషను ఐచ్ఛికాంశంగా చదివి అందులో ప్రావీణ్యం సంపాదించాడు. 21 ఏళ్ళ వయస్సులో విద్యార్థిగా ఉన్నప్పుడే ఉపాధ్యాయులు అతణ్ణి ఈశ్వరచంద్ర 'విద్యాసాగర్' అని పిలిచేవారు.

1841 నుండి 1858 వరకూ విద్యాసాగర్ ప్రభుత్వ సంస్థలలో నెలకు యాభై రూపాయల నుంచి 500 రూపాయల జీతంపై హెడ్ పండిట్‌గా, అసిస్టెంట్ సెక్రటరీగా, హెడ్ రైటర్‌గా, ప్రొఫెసర్‌గా, ప్రిన్సిపాల్‌గా, స్కూళ్ళ అసిస్టెంట్ ఇన్‌స్పెక్టర్‌గా పనిచేశాడు.

విద్యాసాగర్‌కు ఆత్మాభిమానం ఎక్కువ. ఆయన 1846లో సంస్కృత కళాశాలలో అసిస్టెంట్ సెక్రటరీగా నియమితుడయ్యాడు. పాఠ్యప్రణాళికలో, బోధనా విధానాలలో మార్పులు తేవడానికి సంస్కరణలను ప్రతిపాదించాడు. అయితే కళాశాల సెక్రటరీగా ఉన్న రాసమయిదత్తు మాత్రం విద్యాసాగర్ ప్రవేశ పెట్టిన సంస్కరణలకు సమ్మతించలేదు.

పదిహేను నెలలు పనిచేసిన విద్యాసాగర్ తన ఉద్యోగానికి రాజీనామా చేశాడు. నిజం చెప్పాలంటే విద్యాసాగర్ కుటుంబంలో బీద బంధువులు, స్నేహితులు కలిసి మొత్తం 20 మంది ఉన్నారు. అదీకాక ప్రతి నెలా ఆయన తన తల్లితండ్రుల పోషణార్థం కొంత డబ్బును తన గ్రామానికి పంపాలి. అతని తమ్ముడు ఒక్కడే ఉద్యోగస్థుడు. అలాంటి పరిస్థితులలో ఎవరూ ఉద్యోగానికి రాజీనామా చేయలేరు. "విద్యాసాగర్ ఇప్పుడెలా బ్రతుకుతాడు?" అని విద్యాసాగర్ స్నేహితులతో రాసమయి దత్తు హేళనగా అన్నాడు. అందుకు విద్యాసాగర్, "కూరగాయలమ్మి బ్రతుకుతాడని రాసమయి బాబుతో చెప్పండి" అన్నాడు.

విద్యాసాగర్ అప్పు తెచ్చి, తన స్నేహితుడైన మదనమోహన్ పెట్టుబడి పెట్టగా 600 రూపాయలతో సంస్కృత ముద్రణాలయాన్ని ప్రారంభించాడు. సొంతంగా పుస్తకాలు వ్రాసి, విద్యావిధానంలో ఎన్నో మార్పులు తెచ్చాడు. డబ్బు సంపాదించాడు.

ఎన్ని ఆపదలు ఎదురైనా మనిషికి ఆత్మగౌరవమే ఆభరణమని నిరూపించాడు విద్యాసాగర్.

# విమర్శలూ వింజామరలే...

– బి. సైదులు

గోధూళివేళ... ఓ గురువుగారు శిష్యునితో వ్యాహ్యాళికి బయలు దేరారు. శిష్యుడు తన సంశయాలు తీర్చుకుంటున్నాడు. ఇంతలో గురువుగారు శిష్యునితో 'నాయనా! అదిగో ఆ మూలమలుపులో గోడకూలి రాయి నా కాలిపై పడుతుంది. వెంటనే నన్ను ఆసుపత్రికి తరలించు' అంటూ మౌనంగా ముందుకు కదిలారు. శిష్యుడు మారుమాట్లాడకుండా గురువు గారిని అనుసరించసాగాడు. మూల మలుపు రావటం, ఆ గురువుగారు అన్నట్లే గోడకూలటం, కాలిపై రాయిపడటం క్షణాల్లో జరిగిపోయింది. ఆశ్చర్యం ఓ వైపు,



ఆందోళన మరో వైపు.... అయినా వెంటనే గురువుగారిని ఆసుపత్రికి తరలించి చికిత్స చేయించాడా శిష్యుడు. రాత్రి ఆశ్రమంలో కళ్ళుమూసుకొని దీర్ఘంగా ఆలోచిస్తున్న గురువుగారికి శుశ్రూష చేస్తూ సాయంత్రం నుంచి తన మనసును తొలుస్తున్న సంశయాన్ని గురువుగారి ముందుంచాడు ఆ శిష్యుడు. "గురువుగారూ! ఆ గోడకూలి రాయి మీ కాలిపై పడుతుందని ముందే తెలుసు కదా! అలాంటప్పుడు మీరు ఆ ప్రమాదం నుంచి తప్పించుకునే ప్రయత్నం చేయొచ్చుకదా!" అన్నాడు. అప్పుడు గురువుగారు మందహాసంతో 'నాయనా! రాయి కాలిపై పడటాన్ని తప్పించుకోవాలనుకుంటే, ఏకంగా అది నా తలపైనే పడేది. జ్ఞానమార్గంలో విమర్శల గాయాల కన్నా ఇవేమీ పెద్ద గాయాలు కావు, ప్రమాదాలూ కావు. అసలు ప్రమాదాన్ని పరిహరించాలనుకోవటం, దాని నుంచి పారిపోవాలనుకోవటం ధీరుల లక్షణం కాదు. అలాంటి ప్రమాదాల్ని ప్రసన్నవదనంతోనే స్వీకరించాలి. పాఠం నేర్చుకోవాలి" అన్నారు. ఆ రోజుకు ఓ గొప్ప ఉపదేశాన్ని నేర్చుకున్నాడా శిష్యుడు. ఏ గాయమూ, ఓటమీ లేని జీవితాన్ని ఆశించటమే అవివేకం. నిజానికి మన నిరంతర ప్రయాణంలో ప్రశంస చెప్పే పాఠం కన్నా, విమర్శ నేర్పే పాఠమే మధురం, మహత్తరం. అది మన నిబ్బరానికి నీలిపరీక్ష.

## విమర్శలకు వెరపెందుకు?

మనను విమర్శించే వారు పెరుగుతున్నారంటే మన గురించి ఆలోచించేవారు అధికమవుతున్నారని అర్థం చేసుకోవాలి. మనను మనకన్నా ఎక్కువగా పరిశీలిస్తూ, పరిశోధిస్తున్న వారిపై అసహనం కన్నా ఆత్మీయత కురిపిస్తే అదే వారిని ఉక్కిరిబిక్కిరి చేస్తుంది. ఎదుటివారి విమర్శల్లో నిజముంటే మన విధానాన్ని మార్చుకోవాలి. అసలు విమర్శలో విషయమే లేకుంటే పట్టించుకోకుండా ఉండాలి. ఇందులో బాధపడే అవకాశమే లేదు. విమర్శల్నీ వింజామరల్లా స్వీకరించే రీతిలో మనసుకు శిక్షణ నిచ్చుకోవాలి. శిలువ వేస్తే కాని క్రీస్తు విలువ తెలుసుకోలేని లోకంలో విమర్శల గాయాలు లేకుండా గమ్యం చేరాలనుకోవటం అత్యాశే.

## గాయం మనసుకైతే గల్లంతే....

మనను నిజానికి శారీరక గాయాలకన్నా మానసిక గాయాలే ఎక్కువ కల్లోలపరుస్తాయి. కారణం మనం మనసును దృఢంగా కాకుండా దూదిపింజలా బలహీన పరచుకుంటున్నాం. అదే సున్నితత్వమని భ్రమిస్తున్నాం, చిన్న మాటలకే బాధపడుతున్నాం. గౌతమబుద్ధుడ్ని అర్థం చేసుకోని కొద్దిమంది ఛాందసులు ఆయన ఎదుటే నిందించేవారు, విమర్శించేవారు. కాని తరగని మందహాసంతోనే ఉండేవాడు ఆ తథాగతుడు. మా దూషణలకు మీరేమీ స్పందించరా! అంటే 'మీరిచ్చే బహుమతులు నేను నిరాకరిస్తే అవి మీ వద్దే ఎలా ఉండిపోతాయో, మీ దూషణలను కూడా నా మనసు స్వీకరించనపుడు ఇక వాటికి స్పందించేదేముంటుంది' అంటూ అర్ధనిమీలిత నేత్రాలతో ధ్యానంలోకి వెళ్లిపోయేవారట. అదీ మనసును మలచుకునే పద్ధతి.

### మహామహులకే మాటల తూటాలు...

"ఏ మహత్తర కార్యమైనా ముందు విమర్శల నుంచే ప్రారంభమవుతుంది. ఆ తరువాతే ఆమోదానికి నోచుకుంటుంది" అనే వారు స్వామి వివేకానంద. ప్రపంచంలో ఏ నూతన ఆవిష్కరణైనా ముందు విమర్శల జడివానలోనే తడిసింది. ఆ తరువాతే శాశ్వత సూర్యబింబంలా ప్రజ్వలించింది. ఆత్మవిశ్వాసానికే అర్థం చెప్పిన స్వామీజీ



**మీ**రిచ్చే బహుమతులు నేను నిరాకరిస్తే అవి మీ దగ్గరే ఉండిపోతాయి. అలాగే మీ దూషణలను నా మనసు స్వీకరించనపుడు అవి కూడా మీ దగ్గరే ఉండిపోతాయి.

**- గౌతమ బుద్ధుడు**

మాటల భారాన్నే మోయాల్సి వస్తే, అహింసను మించిన ఆయుధమే లేదన్న గాంధీజీ ఏకంగా తూటాలకే బలికావలసి వచ్చింది. ఇలా మహామహులకే తప్పని మాటలతూటాల్ని మనం మల్లెలమాలల్లా స్వీకరించటం అలవాటు చేసుకోవాలి.

### ఆత్మవిశ్వాసమే ఆయుధం

ఎంతటి విమర్శనైనా ఎదుర్కొనే ఏకైక ఆయుధం ఆత్మవిశ్వాసం. ప్రేమ,నిజాయితీ, పవిత్రత ఉండేవారిని ఈ ప్రపంచంలోని ఏ శక్తీ ఓడించలేదనేవారు స్వామి వివేకానంద. మన ఆలోచనల్లో, లక్ష్యంలో ఆ లక్షణాలు త్రివేణి సంగమంలా ప్రవహిస్తే విమర్శల విచ్చుకత్తులు ఒక్కటొక్కటిగా నేలవాలిపోతాయి. ఈ ప్రపంచంలో అసలు ప్రయత్నమే చేయని చాలామంది విలువైన కాలమంతా, ప్రయత్నించి పోరాడుతున్న అతి కొద్దిమంది పై విమర్శలు కురిపించటంలోనే వృథా అవుతుందట. అందుకే విమర్శలకు కుంగిపోక మొక్కవోని దీక్షతో పోరాడుతున్న ఆ అతి కొద్దిమందిలో మనం ఒకరం కావాలి.

### సంయమనమే సమాధానం...

సమస్త మానవాళికీ ఆధారభూతుడు, ఆరాధ్యనీయుడు అయిన శ్రీకృష్ణభగవానుడు అడుగడుగునా అపనిందల్ని అనుభవించాడు. విమర్శల్నీ వీరోచితంగా ఎదుర్కొన్నాడు. సుయోధనుడి నుంచి శిశుపాలుని వరకు ఎందరో ఆయనను అనుక్షణం అవమానపరిచే ప్రయత్నించారు. కాని అదే మందస్మితం ముకుందుడిది. కారణం తన కార్యనిర్వహణపై అంత నమ్మకం ఆ భగవానుడికి. ఎంతటి ఉద్రేక, ఉద్వేగ పరిస్థితుల్లో కూడా శ్రీకృష్ణుడు సంయమనాన్ని కోల్పోలేదు. మన నడవడికపై, నిర్ణయాలపై మనకు నూరుశాతం నమ్మకం ఉంటే ఎందరు విమర్శించినా వెనకడుగు వేయాల్సిన పనిలేదు.

### అంతరాత్మదే అసలు విమర్శ...

నిజానికి మనలోనే మనం ఓ విమర్శకుణ్ణి పెంచిపోషించుకోవాలి. మన ప్రతి ఆలోచనను, ఆచరణను ముందు ఆ విమర్శకుడి విచక్షణకు వదిలివేయాలి. అక్కడి నుంచి సరయినదన్న అభిప్రాయం వచ్చాక ఇక ఎవరి విమర్శకూ మనం వెరవనవసరం లేదు. మనలో తీర్చిదిద్దుకున్న ఆ విమర్శకుడు అంతరాత్మలా నిరంతరం మనకు మార్గనిర్దేశం చేయాలి. మన తప్పొప్పుల్ని మనమే సమీక్షించుకుంటూ, మనకున్న శక్తుల్ని మనమే సమీకరించుకుంటూ ముందుకు సాగిపోతే ఎంతటి బాహ్య విమర్శకైనా ఎదురొడ్డి నిలబడవచ్చు.

### కువిమర్శకూ కృతజ్ఞత...

"ఏదో కారణం చేత నన్ను విమర్శిస్తూ కిందికి లాగాలని ప్రయత్నించి, నాలో పైకి రావాలన్న ఆసక్తిని, ఆ శక్తిని రెట్టింపు చేసి నా ఎదుగుదలకు కారకులైన వారికి నా వేవేల కృతజ్ఞతలు" అంటారు అబ్దుల్ కలామ్. సంకుచిత మనసుల పట్ల, మనుష్యుల పట్ల కూడా ఆయనది ఎంత ఉదారహృదయమో చూడండి! అసూయ చేతనో, మరే కారణం చేతనో మనను మాటలతో నిరుత్సాహ పరచాలని ఎందరు



**ఈ** ప్రపంచంలో అసలు ప్రయత్నమే చేయని చాలా మంది, పోరాడుతున్న అతి కొద్దిమందిపై విమర్శలు కురిపించడంలోనే తమ జీవితాల్ని వృథా చేసుకుంటున్నారు.

ప్రయత్నించినా కించిత్తు కూడా కుంగిపోకూడదు. మన ప్రయత్నం నుంచి నిష్క్రమించకూడదు.

### ఫలితమే ప్రతీకారం...

తత్త్వవేత్త సోక్రటీస్‌నే విమర్శలతో సంతృప్తిపడక విషం తాగించిన ప్రపంచమిది. కాని ఆయన ఘనత విశ్వవ్యాప్తమయ్యాక అదే ప్రపంచం విస్తుపోయింది. మనం లక్ష్యం చేరుకున్నాక, ఆ ఫలితమే విమర్శకుల నోరు మూయిస్తుంది. అందుకే ఎంతటి విమర్శకైనా సమాధానం మనం కాదు చెప్పాల్సింది.... మన పని.... దాని ఫలితం... `



# అనంత శక్తి మీలోనే ఉంది!

– స్వామి బోధమయానంద

మానవ చరిత్రలో ముందెన్నడూ లేనంత క్లిష్టపరిస్థితుల్ని నేడు యువతరం ఎదుర్కొంటోంది. మన దేశ జనాభాలో 54 శాతం మంది యువకులే. ఢిల్లీ విశ్వవిద్యాలయం వారు ఇటీవల చేసిన సర్వేలో ఢిల్లీకి చెందిన యువతరంలో 48% మంది అధైర్యంతో మానసికంగా క్రుంగిపోతున్నారని వెల్లడైంది. వారు నిరుద్యోగులు కారు, ఊరకే తిరిగే దేశద్రిమ్మరులు కారు, నిరక్షరాస్యులు కూడా కానే కారు! వారంతా వాణిజ్యవేత్తలు, వైద్యులు, కోటీశ్వరులు!! ఇలా వాళ్ళంతా సంఘంలో పలుకుబడి ఉన్నవారి సంతానమే! నేటి యువతరం పెడత్రోవ పట్టకుండా తమలో ఉన్న బలహీనతల్ని ఆత్మవిశ్వాసంతో, ఆత్మ స్థైర్యంతో ఎదుర్కోవాలి. ప్రతి ఒక్కరూ స్వయంశక్తిపై ఆధారపడాలంటే ముఖ్యంగా నాలుగు అంశాలను అభ్యసించాలి.

**అవగాహన:** స్వామి వివేకానంద అమెరికా వెళ్ళే ముందు కాలినడకన భారతదేశమంతా సంచరించారు. పరివ్రాజకునిగా బెల్గామ్‌లో 9 రోజులు ఉన్నప్పుడు, కన్యాకుమారిలో మూడురోజులు ధ్యానంలో గడిపినప్పుడు, మైసూర్ మహారాజును కలసినప్పుడు, చెన్నైలో విద్వాంసులను కలసినప్పుడు తను చేయబోయే కార్యం గురించి ఆయనకు స్పష్టమైన అవగాహన ఉంది. తానెందుకు అమెరికా వెళుతున్నదీ ఆయనకు తెలుసు. అమెరికా వెళ్ళక ముందే స్వామీజీ, 'మై మెసేజ్ టు ద వెస్ట్' అనే సందేశాన్ని హైదరాబాద్‌లో ఇచ్చారు. "నేను భారతదేశ సంగ్రహ రూపాన్ని" అని ఆయన అన్నారు.

పాఠశాలల్లో, కళాశాలల్లో విద్యాభ్యాసం చేస్తున్న విద్యార్థులకు తమలో అంతర్గతంగా ఉన్న శక్తి గురించి తెలియడం లేదు. స్వయంగా ఆలోచించే శక్తి వారికి లేదు. భవిష్యత్తులో ఏమి సాధించాలని అనుకుంటున్నారో దాని మీద నేటి యువతరానికి పూర్తి అవగాహన ఉండాలి.

**ఆత్మవిశ్వాసం:** దీనికి కావలసినవి సహనం, వివేకం. జీవితంలో సమస్యలు ఎదురైనప్పుడు వాటిని ఎదుర్కొనేందుకు మనలో సహనం చాలా అవసరం.

కొన్నేళ్ళ తరువాత మీరొక బాధ్యతాయుతమైన వైద్యులో, ఇంజనీరో, వాణిజ్యవేత్తో, పారిశ్రామిక వేత్తో కావచ్చు. మీరెలా ఉంటారో మిమ్మల్ని మీరు ఊహించుకోండి. అలా భవిష్యత్తు గురించి ప్రణాళిక లేకపోతే మీలో పరిపూర్ణత చేకూరదు.

స్వామి వివేకానంద కొలంబో నుంచి అల్మోరా వరకూ ఉత్తేజకరమైన 25 ఉపన్యాసాలిచ్చారు. ఆ ఉపన్యాసాల్ని అధ్యయనం చేస్తే మీలో ఉన్న ప్రతికూలభావాలు తొలగిపోతాయి. అప్పుడే మీ బాధ్యతల్ని మీరు సవ్యంగా నిర్వహించగలరు. రోజుకు 10 నిమిషాలు కూర్చొని మీ శక్తి సామర్థ్యాల్నీ, బలహీనతల్నీ విశ్లేషించుకోండి. స్వామి వివేకానందను ఆదర్శంగా తీసుకోండి. స్వామీజీ జీవిత చరిత్రను చదవండి; ఆయన తమ సమయాన్ని ఎలా గడిపారో, ఎన్ని ఆటంకాల్ని సహనంతో ఎదుర్కొన్నారో, ప్రపంచం మొత్తాన్నీ ఎలా ప్రభావితం చేశారో చదివి తెలుసుకోండి. మీ శక్తి సామర్థ్యాలను తెలుసుకున్నాక మీలోని బలహీనతల్ని ఎలా అధిగమించాలో తెలుసుకునేందుకు ప్రయత్నించండి. ప్రతి సమస్యకూ పరిష్కారం ఉండి తీరుతుంది. సహనం ఉంటే ప్రతికూల పరిస్థితులు కూడా అనుకూలంగా మారుతాయి.

**ఆదర్శం:** యువతరం తమలో దాగి ఉన్న శక్తిని వెలికి తీయాలి. తమ మనస్సులను అంతర్ముఖం చెయ్యాలి. అప్పుడే మనలో అనంత శక్తి ఉందని గ్రహించగలం.

***నిదురపోయెడు మీ ఆత్మ లేపినంతనే ఎంచక్కా***
***ప్రకాశించునో చూడండి, పరవశించునో చూడండి,***
***అప్పుడు మీలో ఆత్మ వల్లనే శక్తి వచ్చును, ఖ్యాతి వచ్చును;***
***మంచి వచ్చును, మాన్యత వచ్చును;***

మనలో నిద్రాణమై ఉన్న ఆత్మను మేల్కొలిపితే మనలో ఉన్న అనంత శక్తి వ్యక్తమవుతుందని అంటారు స్వామీజీ.

**ఆచరణ:** మానవజన్మ ఎంతో విలువైనది, ఎంతో యోగ్యమైనది. మనలో అద్భుతమైన శక్తి ఉంది. స్వామీజీ వ్యక్తిత్వాన్ని మీరు విశ్వసించి, హృదయంలో నిలపండి. కనీసం

మూడు వారాల పాటు స్వామీజీ బోధనల్ని చదివి, ధ్యానం చెయ్యండి. మొదట్లో మనస్సు పరిపరి విధాలుగా పరుగులు తీస్తుంది. మొదటి వారం ఆ మనస్సును వెనక్కి తీసుకురావడంతో సరిపోతుంది. రెండవ వారం అంతర్లీనమవడానికి సరిపోతుంది. మూడోవారం మీలో ఉన్న శక్తి బహిర్గతమవడం గ్రహించ గలరు. స్వామీజీ బోధనలు చిన్న చిన్న పుస్తకాలుగా లభిస్తాయి. వాటిని కొని, రోజూ పైకి గట్టిగా, స్పష్టంగా చదువుతూ కంఠస్థం చేయండి. మీ వ్యక్తిత్వంలో వచ్చే మార్పును మీరే గ్రహించగలరు.



1897లో మద్రాసులో చేసిన ప్రసంగంలో – "భారత దేశ జాతీయ నౌకకు రంధ్రాలు పడిమునిగి పోతోంది. ఈ జాతీయ నౌక కోటాను కోట్లమందిని జీవితమనే సముద్రం పైన స్వేచ్ఛా సౌఖ్యాల వైపు తీసుకొని వెళ్ళింది. అయితే ఏదో కారణంగా అది మునిగిపోతోంది. మనం దాన్ని విడిచిపెడతామా! అలా చెయ్యం. నేను అబద్ధమాడుతున్నానని మీరు నన్ను దేశం నుంచి బహిష్కరించినా సరే, నేను వెనక్కి తిరిగివస్తాను. ఆఖరి వరకూ మీతోనే ఉంటాను. కానీ మనమందరం నౌక రంధ్రాలను మూసి, భారతదేశం మునిగిపోకుండా బాధ్యత వహించాలి" అని స్వామి వివేకానంద అన్నారు. మీ శక్తినంతా ఉపయోగించి 'దేశ పురోభివృద్ధికోసం నేను తోడ్పడతాను' అని అనుకున్నప్పుడు దేశం ఉన్నతమవుతుంది.

స్వామి వివేకానంద 1897లోనే కుంభకోణంలో సుమారు 500 మంది హాజరైన సభలో 'నాయకత్వం' గురించి అద్భుతంగా ప్రసంగించారు. స్వామి వివేకానంద జీవిత చరిత్ర చదివితే ఇంత అద్భుతమైన సంస్థను ప్రారంభించిన ఆ మహానుభావుడు ఎంత ప్రతిభావంతుడైన నాయకుడో గ్రహించవచ్చు. ప్రారంభంలో తిరుగుబాట్లు ఎదురయ్యాయి. అయితే ఒక యువకుడు దేశ భవితవ్యాన్ని మార్చగలిగాడు. అతను తన సోదర శిష్యులనూ, భక్తులనూ, చుట్టూ ఉన్న ప్రజలనూ వ్యవస్థీకరించి 1897 మే 1న 'రామకృష్ణ మిషన్' ప్రారంభించాడు. నేడు ఈ సంస్థ ప్రపంచవ్యాప్తంగా ఉన్న 160 కేంద్రాల ద్వారా ఆయన సందేశాన్ని వ్యాపింపజేస్తోంది. "నేను ఇచ్చిన సందేశం 1500 సంవత్సరాల పాటు నిలచి ఉంటుంది" అని స్వామి వివేకానంద అన్నారు.

స్వామీజీ చేసిన బోధనల్ని అందరూ మననం చేయాలి. పాశ్చాత్య ప్రభావానికి లోబడకుండా మన లక్ష్య సాధనలో ముందుకు సాగేందుకు 'శ్రద్ధ' అవసరం.

## అంతర్గత శక్తికి పది సూత్రాలు!

**మ**న అపజయాలకి కారణం మనలో శక్తి లేక పోవడం కాదు. మనలో ఉన్న శక్తిని మనం గ్రహించ లేకపోవడమే!

1. మన ధ్యేయాన్ని నిర్దిష్టంగా గుర్తించడం.
2. ధ్యేయాన్ని చేరడం కోసం అవకాశాల్ని జాగ్రత్తగా పరిశీలించడం.
3. మనమున్న పరిస్థితుల్ని సరిగ్గా అర్థం చేసుకోగలగడం.
4. మనం చేస్తున్న పని వల్ల మనకు మానసిక ఒత్తిడి కలగదని నిర్ధారించుకోవడం.
5. ఇతరుల అనుభవాల్ని సమీకరించడం.
6. మనకున్న ఆర్థిక, మానసిక శక్తుల్ని పునః పరిశీలించుకోవడం.
7. గత అనుభవాలను దృష్టిలో ఉంచుకొని చేయబోయే పని గురించి విశ్లేషించుకోవడం.
8. సమయాన్ని సద్వినియోగ పరచుకోడానికి చక్కని ప్రణాళికను రూపొందించుకోవడం.
9. ఆటంకాల్ని ఎదుర్కోడానికి మానసిక శక్తిని వృద్ధి చేసుకోవడం.
10. ఇతరుల లోపాల్ని చూడడం కన్నా మనలోని శక్తుల్ని గురించి అధ్యయనం చేయడం.

# సమయస్ఫూర్తి

- రాబర్ట్ గ్రబ్

జపాన్‌లోని ఓ కొండ మీద ఒక చిన్న ఇల్లు ఉండేది. ఆ చిన్న ఇంట్లో ఒక వృద్ధుడు తన మనుమడితో కలిసి నివసించేవాడు. ఆ ఇంటి చుట్టూ ఉన్న భూమి మంచి పంట పొలం. కొండ మీద ఉన్న ఆ పొలమంతటిలో అతను చాలా ధాన్యం పండించేవాడు. ఆ కొండ దిగువన ఉన్న గ్రామంలో చాలా మంది ప్రజలు నివసించేవారు. వారంతా కొండ మీది వృద్ధుడి పొలంలో పని చేసేవారు. ఆ వృద్ధుడు ఉదయం, సాయంత్రం – ఇలా ఎప్పుడు ఆ గ్రామం వైపు చూసినా అక్కడ ఉన్న వాళ్ళంతా తమ తమ పనులు చేసుకుంటూ కనపడేవారు. ఆ గ్రామం సముద్రం ఒడ్డునే ఉంది.

ఒకరోజు ఆ వృద్ధుడు తమ ఇంటి బయట నిల్చొని, గ్రామం వైపు చూస్తూ ఉండగా అతని దృష్టి సముద్రం మీద పడింది. సముద్రం పైకి లేచి ఆకాశాన్ని ముట్టుకునే ప్రయత్నం చేస్తున్నట్లు ఆయనకు కనిపించింది.

ఈ దృశ్యాన్ని ఒక్క క్షణం తదేకంగా చూసి, తన మనుమడితో "బాబూ! వెంటనే మండుతున్న



కట్టెల్ని తీసుకొని రా" అంటూ గట్టిగా అరిచాడు.

ఆ బాలుడికి ఏమీ అర్థం కాలేదు. కానీ, అతడు తాత చెప్పినట్లే మండుతున్న కట్టెల్ని వెంటనే పట్టుకొని వచ్చాడు.

తాత ఆ కట్టెల్లో ఒకటి తీసుకొని పొలం వైపు పరుగెత్తాడు. ఆ బాలుడు కూడా మండుతున్న కట్టె పట్టుకొని, తాత వెనకాల పరుగుపెట్టాడు. అప్పుడు ఆ వృద్ధుడు బాగా పండిన తమ పొలంలోకి ఆ మండుతున్న కట్టెను విసిరాడు.

తాత వింత ప్రవర్తనను చూసి ఆ బాలుడు బాధ పడ్డాడు. అతడు ఏడుస్తూ, "తాతగారూ! మీరు ఏం చేస్తున్నారు? పంటంతా ఎందుకు కాల్చేస్తున్నారు?" అన్నాడు.

వృద్ధుడు అతడి మాటలు వినిపించుకోకుండా, "త్వరగా నేను చేసినట్లే చెయ్యి బాబూ! నీ చేతిలోని కట్టెను కూడా పొలంలోకి విసిరెయ్యి" అన్నాడు.

అతడు తాతకి పిచ్చెక్కిందనుకొని, ఏడుస్తూ తాత చెప్పినట్లే చేశాడు. చూస్తుండగానే పొలాలన్నీ మంటలకు ఆహుతి అయ్యాయి. కాలుతున్న పొలాల్లోని మంటలు ఆర్పాలని గ్రామస్థులంతా కొండ మీదకు పరుగు పరుగున వచ్చారు. కానీ, వారు పైకి వచ్చేటప్పటికి చాలా ఆలస్యం అయింది. కాలుతున్న పొలాల్ని ఎవరూ కాపాడలేకపోయారు.

"ఇది ఎవరు చేశారు? ఇదంతా ఎలా జరిగింది?" అని వాళ్ళంతా అడిగారు. వృద్ధుడు ఎంతో బాధగా "నేనే ఇదంతా చేశాను" అన్నాడు. అందరూ ఆశ్చర్యపోయారు.

బాలుడు కూడా ఏడుస్తూ "నిజంగా తాత గారే ఈ పని చేశారు" అన్నాడు.

గ్రామస్థులందరికీ తాత మీద చాలా కోపం వచ్చింది. "మీరు ఇలా ఎందుకు చేశారు"? అని అందరూ వృద్ధుణ్ణి అడిగారు.

వృద్ధుడు ఏమి మాట్లాడకుండా, సముద్రం వైపు చెయ్యి చూపించాడు. ఆ తరువాత నింపాదిగా, "అటు చూడండి" అన్నాడు.

అందరూ సముద్రం వైపు చూశారు. ఎప్పుడూ ప్రశాంతంగా ఉండే సముద్రం అప్పుడు ఉద్ధృతంగా కనిపించసాగింది. చూస్తుండగానే కెరటాలు ఉవ్వెత్తున ఎగసి, ఆ గ్రామాన్ని ఒక్క క్షణంలో ముంచేశాయి. గ్రామమంతా జలమయమైపోయింది. అయితే, పంటల్ని కాపాడేందుకు అందరూ కొండపైకి వచ్చేయడంతో, ప్రజలంతా ఏ ప్రమాదానికీ గురి కాకుండా సురక్షితంగా ఉన్నారు.

గ్రామస్థులతో పాటు ఆ మనుమడికి కూడా అప్పుడు తెలిసింది తాత గారు పంట అంతా ఎందుకు కాల్చివేసారో! గ్రామస్థులందరినీ కొండ పైకి రప్పించడానికి వృద్ధుడు అలా సమయస్ఫూర్తి చూపడంతో గ్రామస్థులంతా రక్షింపబడ్డారు.

*( రాయపూర్ రామకృష్ణ ఆశ్రమం 'వివేక జ్యోతి' మాస పత్రిక సౌజన్యంతో)*

యువవాహిని

# మహిళా లోకం మరువరాని సందేశం !

- స్వామి రంగనాథానంద

స్వామి వివేకానందుల జీవితాన్నీ, వారు చేసిన కృషినీ అధ్యయనం చేస్తే యువత రానికి ఆయన ఎంతటి మహత్తర వారసత్వాన్ని వదిలివెళ్ళారో ఎవరికైనా అర్థమవుతుంది. యువతరాన్ని ఆయన తమ ఆధ్యాత్మిక వారసులుగా భావించి ప్రేమించారు. తల్లితండ్రుల్నుంచి సంక్రమించే వారసత్వ సంపద కన్నా స్వామి వివేకానంద ఇచ్చిన వారసత్వ సంపద శాశ్వతమైనదీ, గణనీయమైనదీ. ఆయన ప్రేమ, ఆదరణలకు భారత దేశంలోని మహిళలు పాత్రులు కాగలిగారు. ఎందుకంటే మన సంస్కృతి సుసంపన్నం కావడం వెనుక మహిళల కృషి ఎంతో ఉంది. ఆయనకు వారి పట్ల అపార విశ్వాసం, అమిత గౌరవం ఉన్నాయి.

మధ్య యుగం నాటి భారత మహిళలు దుర్భర స్థితిని ఎదుర్కొన్నారు. విద్యావికాసం లేకపోవడంతో వారు మూఢనమ్మకాలతో ఆత్మవిశ్వాసం కోల్పోయి జీవిస్తూ ఉండేవారు. సమాజం వారిని అల్పులుగా, బలహీనులుగా చూసేది.

ఈ దీనస్థితిలో ఒక కాంతిరేఖ పొడసూపింది. మన మహిళల హృదయాల్లో, వారి జీవితాల్లో ఆనందోద్వేగాలను చిందించగలిగిన మహాపురుషులు, మహోద్యమాలు ఉద్భవించడం ఒక విశేషం. రాజా రామమోహన్‌రాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్ లాంటి మహాపురుషులు నిరంతరం శ్రమించి, మహిళల్ని విశృంఖలాల నుంచి విముక్తుల్ని చేశారు. వారి పట్ల సమాజ వైఖరిని మార్చగలిగారు. వారి కృషి ఫలించి, మన మహిళలకు విద్యా, సంఘసంస్కరణోద్యమాల ద్వారా ఎంతో స్వేచ్ఛా లభించాయి.

పందొమ్మిదవ శతాబ్ది చివరలో ఆవిర్భవించిన స్వామి వివేకానంద మహిళల విద్యావికాసానికీ, సర్వతోముఖాభివృద్ధికీ కృషి చేశారు. ఇంటా బయటా వారి వ్యక్తిగత స్వేచ్ఛకూ, భావ స్వాతంత్ర్యానికీ కృషి చేశారు. మహిళల్లో ఆత్మ విశ్వాసాన్నీ, ఆత్మబలం పట్ల అవగాహననూ ప్రేరేపించ గలిగారు. భారత మహిళలు సక్రమ పంథాలో విద్యావంతులు కాగలిగిననాడు తమ సమస్యలన్నింటినీ స్వయంగా తామే పరిష్కరించుకోగలరని స్వామీజీ భావించారు. భారత మహిళ విద్యాధికురాలు కావాలనీ, విద్యతోపాటూ ధీరత్వాన్ని అలవర్చుకోవాలనీ ఆయన ఆకాంక్షించారు.

విద్య ద్వారా సంతరించే జ్ఞాన జ్యోతి స్త్రీకైనా, పురుషుడికైనా మహోత్కృష్ట వరం. చీకటి ఉంటే భయం ఉంటుంది. మూఢనమ్మకాలకూ, మానసిక సంకుచితత్వానికీ భయమనేది తల్లి లాంటిది. మానవ మస్తిష్కం వికసించిన నాడు ఏ భీతీ, మూఢనమ్మకాలు దరిచేరవు. అవిద్య, పురుషాధిక్యం, మూఢ నమ్మకాలతో సహజీవనం చేస్తున్న అప్పటి మన మహిళలకు స్వామీజీ "మీలో మీరు జ్ఞాన జ్యోతిని వెలిగించుకోండి. ఆ జ్ఞానం నుండి శక్తి వస్తుంది. నిర్భయంగా, కరుణామయంగా విశాలహృదయంతో క్రియాశీల సామర్థ్యాన్ని సంతరించుకోండి" అని ఉపదేశించారు. 'కుమారులను ఎంత శ్రద్ధగా చదివిస్తారో, కుమార్తెలను కూడా అంతే శ్రద్ధతో చదివించండి. అప్పుడే మన యువతరంలో జ్ఞానం, బలం, నిర్భీతి, కరుణ, విశాలహృదయం, క్రియాశీలక సామర్థ్యం పెంపొందుతాయి' అని స్వామి వివేకానంద పదే పదే చెబుతుండేవారు.

సేకరణ: ఆర్. కృష్ణ

# సదాచారంతో శాంతి సౌభాగ్యాలు

షేక్ గౌస్ సాహెబ్

విచారణతో కూడిన ఆచారం సదాచారం. విచారణ లేని ఆచారం మూఢాచార మవుతుంది. మనం సదాచార సంపన్నులం కావాలి. అంతేకానీ, మూఢాచార ప్రియులం కాకూడదు.

ఎలాగో పుట్టి, పెరిగి, చనిపోవడం కాదు ముఖ్యం. శాశ్వతమైన సార్థక కార్యాలు చేసి చిరస్మరణీయులం కావాలి. సతి, సంపత్తి, సంతానం అశాశ్వతాలని గమనించాలి. త్యాగనిరతి, సంఘసేవా పరాయణత్వం, నిష్కామకర్మలు మనిషికి శాశ్వత ఖ్యాతిని చేకూరుస్తాయని తెలుసుకొని జీవించాలి.

భూమి మీద ఉన్న మానవుడు సత్యవాక్కునూ, దైవవాక్కునూ గౌరవిస్తే 'మానవత్వం' వృద్ధి చెందుతుంది. అందుకు భిన్నంగా ప్రవర్తిస్తే 'దానవత్వం' పెరుగుతుంది.

మతం అనేది సిద్ధాంతాలలో లేదు. రాద్ధాంతాలలో లేదు. ఆచరణ అనుష్ఠానాలలో మతం ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. ఎవడు ధార్మికుడో అతడు దేవునికి ప్రీతిపాత్రుడు. సత్య సంధత, పవిత్రత, పరిపూర్ణ భక్తి మానవత్వాన్ని చేకూరుస్తాయి. మానవతావాది సద్గుణరాశియై, సదాచారాలను ఆచరిస్తూ పరులకు మేలు చేకూరుస్తుంటాడు. డాంబికం, కేవలం పేరు ప్రతిష్ఠలకై ప్రయత్నించడం ఆశింపదగినవి కావు. నమ్రత, దయ, దైవ ప్రీతి, అభాగ్యులను ఆదుకోవడం మానవత్వాన్ని వృద్ధి చేస్తాయి.

ఈ కాలంలో సంకుచిత భావాలు, అకృత్యాలు, అన్యాయాలు, అత్యాచారాలు దేశంలో అనేక చోట్ల చోటు చేసు కుంటున్నాయి. మత వైషమ్యం, భాషా వైషమ్యం, జాతి దురహంకారం, ఆశ్రిత పక్షపాతం, బంధు ప్రీతి, ప్రాంతీయాభిమానం, పదవీ వ్యామోహం, కులమత భేదాలు పెచ్చుపెరిగాయి. ధన, జన, వస్తు, వాహన నష్టాలు కలుగజేస్తున్నాయి. దీన్ని అరికట్టాలి.

కష్టం ఎంత తీవ్రంగా ఉంటే దాన్ని అధిగమించినప్పుడు అంత ఘనత చేకూరుతుంది. ప్రతీ దినం, ప్రతీ క్షణం ఎందరో ప్రాణాల కోల్పోతున్నారు. కానీ తక్కినవారు మేము మాత్రం శాశ్వతంగా ఉంటామని భ్రమపడడం ఆశ్చర్యకరం.

అన్ని మతాలలోనూ, అన్ని దేశాలలోనూ, అన్ని కులాలలోనూ అవతార పురుషులు, ఋషులు, మునులు, ప్రవక్తలు, మహానుభావులు జన్మించి, మానవత్వంతో సమాజ శాంతికై పాటుపడ్డారు. మార్గదర్శకులయ్యారు. కాబట్టి, అందరూ సత్యప్రియులు, మానవతావాదులు, సదాచార సంపన్నులూ అయి సంఘ శ్రేయస్సుకు పాటుపడాలి.

## పతనానికి నాంది...

అసూయ పరుల పతనాన్ని కోరుతుంది. సాధారణంగా "తాము ఇతరుల కంటే ఏ మాత్రం తక్కువకాదు" అని చాలా మంది అనుకుంటూ ఉంటారు. కానీ కష్టపడి పనిచేయరు. వీరితోపాటు సమాన ప్రతిభ ఉండి, కష్టపడి ఎవరైనా పైకి వస్తే వీరు తమలో తాము బాధపడతారు. తమ కళ్ళముందే ఎవరైనా అభివృద్ధి చెంది, తాము మాత్రం ఎదుగూబొదుగూ లేకుండా ఉంటే తీవ్రమైన నిరుత్సాహానికి లోనవుతారు. ఆ నిరుత్సాహం అసూయగా మారుతుంది.

పాండవుల పట్ల అసూయని వదులు కోలేక దుర్యోధనుడు ఎలాంటి దురవస్థలపాలయ్యాడో మనందరికీ విదితమే!

మనలో అసూయ పొడచూపడం సహజమే. కానీ, దానిని సరిదిద్దుకోక పోతే పతనం కూడా అంతే సహజం.

**అసూయ అనేది మనసుకి పట్టిన చెద వంటిది. సాధ్యమైనంత వేగంగా దాన్ని వదిలించుకోవాలి.**

## విజయానికి పునాది...

ముగ్గురు స్నేహితులు అడవిలో కట్టెలు కొట్టుకొని జీవనాన్ని సాగించేవారు. ఒకసారి ఆ ముగ్గురు స్నేహితులూ అడవిలో చెట్లను కొట్టి తమ భుజాలపై దుంగలను మోసుకుంటూ వెళుతున్నారు. ఆ ముగ్గురిలో ఒకడు మాత్రం దుంగను మోసుకుంటూ కొంత దూరం వెళ్ళాక 'ఈ దుంగ చాలా బరువుగా ఉంది' అనుకొని దుంగను సగానికి నరికి, భుజంపై మోసుకుంటూ ముందుకు సాగాడు. త్రోవలో ఒక పెద్ద అగాధం వచ్చింది. తమతో వచ్చిన ఇద్దరు మిత్రులు వారు మోసుకెళ్తున్న పొడవైన దుంగల్ని ఆ అగాధానికి అడ్డుగా వేసి, అగాధాన్ని దాటి ముందుకు వెళ్ళిపోయారు. మూడో వ్యక్తి మాత్రం తాను మోసుకొస్తున్న దుంగను సగానికి నరకడం వల్ల అగాధాన్ని దాటలేకపోయాడు.

**కష్టాల్ని సహించి ముందుకు సాగేవారే విజయాన్ని సాధించగలరు. విజయానికి పునాది 'సహనమే'.**

# సంధ్యా సమయం

- రెంటాల జయదేవ

(గత సంచిక తరువాయి)

## బహు పుణ్యప్రదం బ్రాహ్మీ ముహూర్తం

**బ్రాహ్మీ ముహూర్తమంటే...**

**ఆ**ధ్యాత్మిక సాధనలన్నిటికీ అనుకూలమైనది, ప్రశస్త మైనది - 'బ్రాహ్మీ ముహూర్తం'.

*సూర్యోదయాత్ ప్రాగర్ధ ప్రహారే,*
*దౌ ముహూర్తౌ తత్రాద్యో బ్రాహ్మః ।*
*ద్వితీయో రౌద్రః పంచ పంచ ఉషః కాలః,*
*సప్త పంచా రుణోదయః ।*

బ్రాహ్మీ ముహూర్తమంటే, తెల్లవారు జామున సుమారు 3.30 గంటల నుంచి 4.45 గంటల వరకు అని చెప్పవచ్చు. ప్రకృతి సిద్ధంగా ఈ సమయం సత్త్వగుణ స్వభావంతో కూడినది. పైగా ఆ సమయంలో మన మనస్సు కూడా ప్రశాంతంగా, నిర్మలంగా ఉంటుంది. ప్రాపంచిక విషయాల గోల ఉండదు. వాతావరణం నిశ్శబ్దంగా ఉంటుంది. ఆ సమయంలో మహత్తర ఆధ్యాత్మిక శక్తి ప్రసారమవుతూ ఉంటుంది. కాబట్టి, అలాంటి సమయంలో చిత్త స్థైర్యం తనంతట తానే కలిగి, జప తపాలకూ, ధ్యానోపాసనలకూ ఉపకరిస్తుంది.

నిజానికి, రోజులో సూర్యోదయం మొదలు మళ్ళీ సూర్యోదయం వరకు 60 ఘడియల కాలం. అంటే, సుమారుగా పగలు 30 ఘడియలు, రాత్రి 30 ఘడియలన్న మాట. ఒక్కో ఘడియకూ 24 నిమిషాలు. సూర్యోదయం నుంచి 55 ఘడియలు దాటిన తరువాత వచ్చే 5 ఘడియల కాలానికి 'ఉషః కాల'మని పేరు. అందులో మళ్ళీ 57 ఘడియలు దాటాక వచ్చే 3 ఘడియల కాలాన్ని 'అరుణోదయ కాల'మని అంటారు. అలాగే, 58 ఘడియలు దాటాక వచ్చే 2 ఘడియల కాలానికి 'ప్రాతః కాల'మని పేరు. ఆ తరువాతే 'సూర్యోదయ కాలం'. ఇలా మొత్తం మీద చూస్తే, 55 నుంచి 58 ఘడియల కాలం కీలకం (అంటే 3 ఘడియల కాలం. ఇంకా చెప్పాలంటే, 3x24 నిమిషాలు=72 నిమిషాలు=గంట12 నిమిషాలు). పూజకూ, జప ధ్యానాలకూ అత్యంత ప్రశస్తం.



**సమయం దాటిపోతే?**: సదాచార సంపన్నులైన విప్రులు మూడు సంధ్యల్లోనూ తప్పనిసరిగా సంధ్యోపాసన చేయాలి. నక్షత్రాలు ఉండగానే ప్రాతః సంధ్యనూ, సూర్యుడు నడినెత్తి మీద ఉన్నప్పుడు మధ్యాహ్న సంధ్యనూ, సూర్యాస్తమయం కాక ముందు సాయం సంధ్యనూ ఉపాసించాలి. సూర్యోదయ, సూర్యాస్తమయాల తరువాత మూడు ఘడియల వరకూ సంధ్య వార్చవచ్చు. కాలాతిక్రమణం జరిగితే నాలుగో అర్ఘ్యం ఇవ్వాలి. లేదంటే, 108సార్లు గాయత్రీ మంత్రం జపించాలి.

**ఎక్కడ చేస్తే ఏం ఫలం?** సంధ్యావందనం ఎక్కడ చేస్తే ఏమిటి ఫలమనేది కూడా పెద్దలు తెలిపారు. ఇంట్లో చేసిన సంధ్యా వందనం సాధారణం. గోశాలలో సంధ్యోపాసన చేయడం మధ్యమ రకం. నదీ తీరంలో సంధ్యావందనం చేయడం ఉత్తమం. ఇక, దేవీ మందిరంలో సంధ్యోపాసన చేస్తే ఉత్తమోత్తమం అంటారు. సంధ్యోపాసన అయిన తరువాత అగ్నికార్యం ఆచరించి, ఆ తరువాత పంచాయతన పూజ చేసి, చివరకు వేదాధ్యయనం చేయాలని పెద్దల మాట.

**సంధ్య ఎందుకు కీలకం? :** మంత్ర పఠనమైనా, జపమైనా, ధ్యానమైనా, కీర్తనలైనా సరైన సమయంలో చేయడం శుభప్రదం, ఫలప్రదం. పూజకూ, జపానికీ సంధ్యా సమయాలు ఎంతో అనుకూలం. జపం వగైరా సక్రమంగా జరగడానికి అవి తోడ్పడతాయి. జ్ఞానవిదులైన మన ఋషులు ఉపాసనలకూ, మంత్ర జపాలకూ, పూజలకూ, అర్చనలకూ సంధ్యా కాలాలు ఉత్తమమైనవని పేర్కొన్నారు. ఆ సమయంలో శరీరంలోని కీలకమైన నాడులన్నీ దేనినైనా గ్రహించడానికి సిద్ధంగా ఉంటాయి. శరీరంలోని అంతర్గత శక్తులన్నీ శక్తిమంతమై ఉంటాయి. ముఖ్యంగా, ఉదయ సంధ్యా సమయంలో ప్రకృతి సిద్ధంగా ఉండే దివ్య వాతావరణంలో జప తపాలు చేసి, ఎందరో యోగులు, మునులు సిద్ధి పొందారు. ఏ ఉపాసన అయినా సరే ఈ సంధ్యా కాలాల్లో చేస్తే, ఫలిస్తుందన్నది వారి అనుభవ పూర్వకంగా మనం తెలుసుకోదగిన జ్ఞానం.

( 'సంధ్యావందనం అంతరార్థం' వచ్చే సంచికలో... )

దాసిమయ్య పరమ శివ భక్తుడిగా కాలం గడుపుతున్నాడు. కానీ కాలక్రమంలో – "శివునిలా ఇచ్చేవాడూ, నాలాగ అనుగ్రహింపబడినవారూ లేరు" అనే గర్వం అతనిలో చోటు చేసుకుంది. పరమేశ్వరుడు తన భక్తుణ్ణి సరిదిద్ది, సక్రమమైన మార్గంలో పెట్టాలని సంకల్పించాడు. అందుకోసం గందశిల అనే ఊళ్ళో ఉంటున్న శంకర దాసిమయ్య అనే మహా శివభక్తునికి కలలో కనబడి...




అలానే శంకర దాసిమయ్య తన శిష్యులతో శివక్షేత్రాలకు వెళ్ళసాగాడు. దారిలో ముదనూరుకు కూడా వచ్చాడు. అక్కడ ఆలయంలో ప్రసంగించాడు. ఆయన ప్రసంగం వినడానికి దాసిమయ్య కూడా వచ్చాడు.

దాసిమయ్య అహంకారం తొలగిపోయే సమయం ఆసన్నమైంది. శంకర దాసిమయ్య ప్రగాఢ భక్తి దాసిమయ్యను ఆకర్షించింది. మరుసటి రోజు అతను శంకర దాసిమయ్య ఉంటున్న చోటికి వెళ్ళాడు. అక్కడ శంకర దాసిమయ్య భార్య, తన భర్త శిష్యునితో...






'పరమేశ్వర అనుగ్రహం పొందినవానికి ఇంత గర్వం ఉండరాదు! సరే ఇతణ్ణి సరిదిద్దాలి' అని అనుకుంటూ... శంకర దాసిమయ్య అక్కడ కుప్పగా ఉన్న చెత్తను తీసి పారవేశాడు. తక్షణం అందంతా బంగారంగా మారిపోయింది.



ఇదిగో చూడు! అంతా బంగారమే!
నీకు కావలసినంత తీసుకో!

ఎంత నచ్చజెప్పినా, శంకర దాసిమయ్య ఒప్పుకోలేదు. ఇక చేసేది లేక దాసిమయ్య ఇంటికి తిరిగి వచ్చాడు. అప్పుడు...

ఎంత అపచారం జరిగిపోయింది స్వామీ!
మన సంపదంతా మాయమై పోయిందే!




ఆ మహనీయుడి దగ్గర ఎలా ప్రవర్తించారు?
మనం మనసారా క్షమాపణ కోరితే ఆయన
తప్పకుండా మనల్ని కరుణిస్తాడు.

పరమేశ్వర కృపా కటాక్షాన్ని పొందిన నువ్వు గర్విష్ఠివి అయిపోయావు. అందువల్ల పరమేశ్వరుడు నీ తపోనిధిని వెనక్కి తీసుకుంటాడు.



స్వామీ! నన్ను క్షమించండి.

ఇద్దరూ పరుగెత్తుకుంటూ శంకర దాసిమయ్య వద్దకు వెళ్ళి, క్షమించాల్సిందిగా కోరారు.

పరమేశ్వరుని అనుగ్రహం పొందినవారికి వినయం ఉన్నప్పుడే ఆ అనుగ్రహం కొనసాగుతుంది. నువ్వు నీ తప్పును తెలుసుకున్నావు. నువ్వు కోల్పోయిన తరగని సంపదను పరమేశ్వరుడు మళ్ళీ నీకు ప్రసాదిస్తాడు.



స్వామీ! మాకు పరమేశ్వరుని యందు
సంపూర్ణ శరణాగతి కలిగేలా ఆశీర్వదించండి.

**"సకలమూ భగవంతుడే చేస్తున్నాడనేది పరమ సత్యం. కానీ, తామే అంతా చేస్తున్నామని ప్రజలు గర్వంతో అనుకుంటారు.**



**సంపూర్ణ విశ్వాసం కలవారిని భగవంతుడు అన్ని కష్టాల నుండీ రక్షిస్తాడు."**

**– శ్రీ శారదాదేవి**

# గ్రంథ పరిచయం

## వీరనరేంద్ర వివేకానంద

**(స్వామి వివేకానంద జీవితంపై ఆనిమేటెడ్ మూవి)**
**వి.సి.డి–2 భాగాలు రూ. 150/–; డి.వి.డి. రూ. 200/–; సమయం: 90 నిమిషాలు; సమర్పణ: శ్రీరామకృష్ణ మఠం, మైలాపూరు, చెన్నై – 600 004, ఫోన్: 24621110. అన్ని రామకృష్ణ మఠ కేంద్రాలలో లభిస్తుంది.**

సనాతన ధర్మాన్ని పునరుజ్జీవింప చెయ్యడానికి ఎందరో మహాపురుషులు ఉద్భవించారు. ప్రాపంచిక బాధ్యతల్ని సునాయాసంగా నిర్వహించి శాంతిమయ జీవనం కొనసాగించడంలో మానవాళికి తోడ్పడడం వీరి లక్ష్యం. "నరేంద్రుడు సప్తర్షి మండలం లోని ఒక ఋషి సామాన్య మానవ రూపంలో భూమి మీదకు వచ్చిన సిద్ధుడు"అని సాక్షాత్తూ భగవాన్ శ్రీరామకృష్ణుల చేత శ్లాఘించబడిన మహాయోగి స్వామి వివేకానంద. "సత్యమనేది ఆ మతంలోనో ఈ మతంలోనో లేదు. అమూల్యరత్నమైన సత్యం మీలోనే ఉంది" అని లోకానికి చాటి చెప్పిన ఆధునిక ప్రపంచ శిల్పి స్వామీజీ. ఆ మహోన్నత యోగి జీవితాన్ని విసిడిలో ఎనిమేషన్ చిత్రంగా తీశారు. ఈ చిత్రంలో స్వామీజీ జననం, బాల్యం, విద్యాభ్యాసం, శ్రీరామకృష్ణులను కలిసిన విధానం, చికాగో సర్వమత మహాసభలలో పాల్గొనడం, రామకృష్ణ మిషన్ సంస్థను స్థాపించి పేదలకు సేవా కార్యక్రమాలు చేపట్టడం... ఇలా స్వామి వివేకానందుని జీవితంలోని ఎన్నో సంఘటనల్ని ఆకర్షణీయంగా చిత్రీకరించారు. జాతిమత వివక్షత లేకుండా మానవ జాతి యొక్క నైతిక, ఆధ్యాత్మిక ఉద్ధరణకై తమ జీవితాన్ని అంకితం చేసిన ఆ మహాచార్యుని జీవితాన్ని పసి పిల్లల నుండి వృద్ధుల వరకు అందరూ తెలుసుకునేలాగ అతి సరళంగా చిత్రించిన ఈ వి.సి.డి/డి.వి.డి ప్రతిఇంట్లో ఉండదగ్గది.

**– శ్రీమతి ఎన్. శేషు**

**గమనిక**

**'గ్రంథపరిచయం' కోసం పుస్తకాలు పంపేవారు తప్పనిసరిగా ప్రతి పుస్తకం రెండేసి ప్రతులు పంపాలి.**

## 'శ్రీమలయాళ యతీంద్రస్య ఉపదేశామృతమ్'

**రచన: శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, పుటలు: 128, వెల: రూ. 60/– ప్రతులకు: మేనేజరు, శ్రీవ్యాసాశ్రమం, ఏర్పేడు, చిత్తూరు జిల్లా – 517 621.**

స్వతహాగా మలయాళీలైన వేలప్పగారు మళయాళ సంస్కృతాలను అభ్యసిస్తూ, కేరళలోని ప్రముఖ "నారాయణ గురు ఆశ్రమం"లో ఆధ్యాత్మిక శిక్షణ పొందారు. భారతదేశమంతటా పర్యటించి చివరకు ఆంధ్రదేశంలో ఉంటూ, మలయాళ స్వామిగా ప్రసిద్ధి చెందారు. కులమత భేదాలకు అతీతంగా అందరికీ వేదాంతాన్ని అందించారు. శ్రీమలయాళ స్వామి వారి జీవిత చరిత్ర, ఉపదేశాలను సముద్రాల లక్ష్మణయ్య గారు సంస్కృత భాషలో "శ్రీమలయాళ యతీంద్రస్య ఉపదేశామృతమ్" రచించారు. 'అధర్మ మార్గంలో వచ్చే పంచభక్ష్య పరమాన్నాల కన్నా ధర్మమార్గంలో గంజి త్రాగి బ్రతకడం మేలు. పాపాలన్నింటికీ కోపమే కారణం' అంటూ ఈ కాలానికి తగినట్లు మలయాళ స్వాముల వారు చేసిన బోధనలెన్నో ఈ గ్రంథంలో అందించారు. 700 శ్లోకాలతో వేదాంతాన్ని అందించే అమూల్య గ్రంథం ఇది. సరళమైన సంస్కృతంలో (తెలుగు వ్యాఖ్యానంతో సహా) ఆధ్యాత్మ బోధ చేసే అద్భుత గ్రంథం. ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ఇది కరదీపికలా తోడ్పడుతుంది అనడంలో సందేహం లేదు.

**– పోపూరి విశ్వనాథ్**

## సప్తఋషి

**అష్టోత్తర శతనామావళి**




**సంకలనం: మల్లాప్రగడ వేంకటేశ్వర రావు, పేజీలు: 40, వెల: 10/–, ప్రతులకు: 1. మల్లాప్రగడ వెంకటేశ్వరరావు, 16/9, తుమ్మలపల్లి వారి వీధి, సత్యనారాయణపురం, గుడివాడ. ఫోన్: 08674 – 240653 2. వి.బి.యన్. శాస్త్రి, గాయత్రీ నిలయం, నిర్మలా కాన్వెంట్ వెనుక బజారు, ఎ.టి. అగ్రహారం, గుంటూరు. ఫోన్: 0863 – 2358318**

# వార్తావాహిని

## కదిరి శ్రీరామకృష్ణ సేవాసమితి దశమ వార్షికోత్సవాలు

**మూ**ర్తిత్రయ సందేశ వ్యాప్తిలో కదరి శ్రీరామకృష్ణ సేవాసమితి దశ వసంతాలు పూర్తి చేసుకుంది. ఈ సందర్భంగా సమితి సెప్టెంబరు 16,17,18 తేదీలలో దశమ వార్షికోత్సవాలను నిర్వహించింది.



ఈ కార్యక్రమాల్లో కడప రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి ఆత్మవిదానందజీ, రాజమండ్రి రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి అక్షరాత్మానందజీ, భావప్రచార పరిషత్ కన్వీనర్ డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి పాల్గొన్నారు. మూడు రోజుల పాటు జరిగిన సమావేశాలకు 400 మంది భక్తులు, 800 మంది విద్యార్థులు హాజరయ్యారు. స్వామీజీల ఉపన్యాసాలు, భజనలు భక్తుల్ని విశేషంగా ఆకర్షించాయి.

– నివేదిక: ఆర్. చంద్రశేఖర్ గుప్త

## వ్యక్తిత్వ వికాసానికి 'వివేకవాహిని'

**శ్రీ**రామకృష్ణ సేవా సమితులు (తాడేపల్లిగూడెం, తణుకు, నర్సాపురం) విజయవాడ రామకృష్ణ మిషన్ భావప్రచార రథం 'వివేకవాహిని'ని ఆహ్వానించాయి. ఈ సమితుల ఆధ్వర్యంలో

1. తాడేపల్లిగూడెం – సెప్టెంబరు 3,4,5
2. తణుకు – సెప్టెంబరు 11, 12, 13
3. గన్నవరం – సెప్టెంబరు 28
4. నర్సాపురం – అక్టోబరు 3,4,5 తేదీలలో

వివిధ పాఠశాలల, కళాశాలల విద్యార్థులకు 'వ్యక్తిత్వవికాస' సదస్సులు, భక్తులకు 'ఆధ్యాత్మిక సత్సంగ' సమావేశాలు నిర్వహించబడ్డాయి. వివిధ ప్రాంతాల్లో జరిగిన ఈ కార్యక్రమాల్లో స్వామి శశికాంతానందజీ, స్వామి



సుప్రియానందజీ పాల్గొని విద్యార్థుల్నీ, భక్తుల్నీ ఉద్దేశించి ప్రసంగించారు. ఈ సమావేశాలలో "శిలనూ నేనే – శిల్పినీ నేనే", "లేవండీ మేల్కొనండి", "యుగావతార" లఘు చిత్రాలను ప్రదర్శించారు. పదివేల మందికి పైగా విద్యార్థులూ, భక్తులూ ఈ సమావేశాల ద్వారా లబ్ధిపొందారు.

నివేదిక: సిహెచ్. ఎ.ఆర్.కె. వర్మ, డా॥ టి. రామబ్రహ్మం, డా॥ వి.పి. సుబ్బరాజు.

యువవాహిని

# విజ్ఞానం - వినోదం

సేకరణ: ఎస్.శివప్రసాద్ బొమ్మలు: సి.హెచ్. రమేష్

## క్రమాభివృద్ధి



అర్థేభ్యో -పి హి వృద్ధేభ్యః
సంవృతేభ్య ఇతస్తతః
ప్రవర్తన్తే క్రియాః
సర్వాః పర్వతేభ్యః ఇవాపగాః

పర్వతాల నుండి ప్రవహించే చిన్న చిన్న వాగులు కలిసి క్రమంగా మహానదులై సర్వార్థ సాధకాలైనట్లు పలు విధాలా ప్రయత్నించి పైసలుగా సేకరించి వృద్ధి పొందిన సంపదలే సర్వశుభాలను కలిగిస్తాయి.



## అదీ సంగతి!

ఒక మలేరియా రోగిని వైద్యుడు పరీక్షించి:

వైద్యుడు: రాత్రిపూట చలిజ్వరం వస్తుందా?

రోగి : అవునండి. వస్తుంది.

వైద్యుడు: రాత్రి చలివేసినప్పుడు పళ్ళు కటకటలాడుతాయా?

రోగి : ఏమోనండీ, రాత్రిళ్ళు పళ్ళుతీసి బీరువాలో పెడుతున్నాను. ఈరోజు రాత్రి తీసి చూస్తాను సార్!

## విద్య

మన అజ్ఞానాన్ని ఎంతబాగా తెలియజేస్తే అది అంత సరైన విద్య.

## వారసత్వ వైభవం : మయూరధ్వజుడు

మణిపుర రాజ్యాన్ని పాలించే మయూరధ్వజుడు గొప్ప రాజర్షి. స్వార్థం ఏకోశానా లేని సార్వభౌముడు. ధర్మరాజుతో పాటుగా ఇతడు కూడా ఒకేసారి రాజసూయ యాగాన్ని ఆరంభించాడు. ధర్మరాజు యాగాశ్వానికి రక్షణగా శ్రీకృష్ణార్జునులు బయలుదేరారు. వారికి మయూరధ్వజుడి యాగాశ్వం ఎదురైంది. ఏదో అతీత శక్తికి లోనై వారు దాన్ని బంధించలేకపోయారు. ఆ రహస్యాన్ని తెలుసుకొనేందుకు వారు మయూరధ్వజుడి దగ్గరకు మారు వేషాల్లో వెళ్ళారు. తమ పుత్రుణ్ణి ప్రాణాపాయం నుంచి కాపాడేందుకు ఆయన అర్ధ శరీరాన్ని ఇవ్వవలసిందిగా వారు అభ్యర్థించారు. అందుకు వెంటనే మయూరధ్వజుడు అంగీకరించాడు. మారు వేషంలో ఉన్న శ్రీకృష్ణుడు అతడి అర్ధ శరీరాన్ని ఖండించేందుకు కత్తిని పైకెత్తగానే మహారాజు శరీరంలోని ఎడమ కన్ను నుండి నీరు కారడం మొదలైంది. అది చూచి కృష్ణుడు కారణమడగగా మయూరధ్వజుడు 'నా శరీరంలోని కుడి భాగానికి పట్టిన అదృష్టం ఎడమ భాగానికి కలగలేదని ఆ కన్ను రోదిస్తోంది' అని విడమర్చాడు. శ్రీకృష్ణార్జునులు మయూరధ్వజుడి నిస్వార్థతను హృదయపూర్వకంగా ప్రశంసించి వెనుదిరిగారు.



## మన మహర్షులు: రైక్వుడు

మహావృష సామ్రాజ్యాన్ని పాలించే జానశ్రుతి గొప్ప పరిపాలనా దక్షుడు. ఆయన ఒక పున్నమి రాత్రి వేళ తన రాజ ప్రాసాద ఉపరితలంలో పచార్లు చేస్తున్నాడు. ఆ సమయంలో కొన్ని రాజ హంసలు అటువైపుగా రావడం రాజు చూశాడు. ఆయనకు పశుపక్ష్యాదుల భాషలు తెలుసు. ఆ హంసలు తమలో తాము మాట్లాడుకోవడం రాజుకు వినిపించింది.



"జానశ్రుతి మహారాజు ధర్మ పరిపాలకుడు" అని ఒక హంస అంది. "బండి తోలుకొని జీవించే మహాజ్ఞాని అయిన రైక్వుడి కన్నా ఈయన గొప్పవాడా?" అని రెండో హంస అడిగింది.

ఈ సంభాషణంతా విన్న మహారాజు ఆ రాత్రంతా రైక్వుడి గురించే ఆలోచిస్తూ గడిపాడు. మరునాడే తాను స్వయంగా వెళ్ళి రైక్వుణ్ణి సందర్శించుకొన్నాడు. రాజు వినయాన్ని పరీక్షించి, రైక్వుడు ఆయనకు ఆత్మజ్ఞానం ప్రసాదించాడు.

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.64-12, Sri Ramakrishna Prabha (Telugu Monthly) December 2007, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. H-HD-1071/2007-09. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2007-09.

# రామకృష్ణ సంఘ సర్వాధ్యక్షులు మహాసమాధి



పరమ పూజ్య స్వామి గహనానందజీ మహారాజ్
(అక్టోబరు 1916 – 4 నవంబరు 2007)

**రామకృష్ణ మఠం మరియు రామకృష్ణ మిషన్‌ల పద్నాలుగవ సర్వాధ్యక్షులు పరమ పూజ్య స్వామి గహనానందజీ మహారాజ్ కోల్‌కతా రామకృష్ణ మిషన్ సేవా ప్రతిష్ఠాన్ ఆసుపత్రిలో 2007 నవంబరు 4వ తేదీ సాయంత్రం 5.35 నిమిషాలకు మహాసమాధి పొందారు.**

**1965లో స్వామి గహనానందజీ మహారాజ్ రామకృష్ణ మఠం ట్రస్టీగాను, రామకృష్ణ మిషన్ పాలకవర్గ సభ్యుడిగాను ఎన్నికయ్యారు. 1989లో రామకృష్ణమఠం - మిషన్‌ల ప్రధాన కార్యదర్శిగా బాధ్యతలు స్వీకరించి మూడేళ్ళపాటు ఆ పదవిలో కొనసాగారు. 1992లో ఉపాధ్యక్షులుగా ఎన్నికైన పూజ్య స్వామీజీ 2005 మే 25న రామకృష్ణ సంఘ సర్వాధ్యక్షులుగా బాధ్యతలు స్వీకరించారు.**

స్వామి గహనానందజీ మహారాజ్ తూర్పు బెంగాల్ (ఇప్పటి బంగ్లాదేశ్)లోని సిలెట్ జిల్లా పహర్‌పూర్ గ్రామంలో 1916వ సం॥ అక్టోబర్‌లో జన్మించారు. శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులైన స్వామి అభేదానందజీ మహారాజ్‌ను, స్వామి వివేకానంద ప్రత్యక్ష శిష్యులైన స్వామి అచలానందజీ మహారాజ్‌ను స్వామీజీ దర్శించారు.

1939వ సం॥ జనవరిలో, 22యేళ్ళ వయస్సులో భువనేశ్వర్‌లోని రామకృష్ణ మఠం కేంద్రంలో చేరిన స్వామీజీ అప్పటి మఠం సర్వాధ్యక్షులు స్వామి విరజానందజీ మహారాజ్ నుండి మంత్ర దీక్షను స్వీకరించారు. 1944లో స్వామి విరజానందజీ మహారాజ్ ఆయనకు బ్రహ్మచర్య దీక్షనిచ్చి 'అమృతచైతన్య' అనే పేరును ప్రసాదించారు. 1948లో సన్న్యాసాశ్రమం స్వీకరించి 'స్వామి గహనానంద' అనే పవిత్రనామాన్ని పొందారు.

(మిగతా 3వ కవర్ పేజీలో...)

**శ్రీ రామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029
ఫోన్: 040–2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com



నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద**
సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**

(...2వ కవర్ పేజీ తరువాయి)

1942 నుండి 1952 వరకు కోల్‌కతా అద్వైత ఆశ్రమ శాఖ, మాయావతిలోనూ, 1953 నుండి 1958 వరకు షిల్లాంగ్ కేంద్రంలోనూ సేవలందించారు. 1958లో కోల్‌కతా లోని రామకృష్ణ మిషన్ సేవా ప్రతిష్ఠాన్, మిషన్ ఆసుపత్రి కేంద్రానికి 22 సంవత్సరాల పాటు కార్యదర్శిగా కొనసాగారు. స్వామి గహనానందజీ మహరాజ్ తీవ్రకృషి ఫలితంగా నేడు ఈ మిషన్ కేంద్రం ప్రసిద్ధ బహుళార్థక ఆసుపత్రిగా రూపుదిద్దుకొంది.

స్వామి గహనానందజీ మహరాజ్ దేశవ్యాప్తంగా పర్యటించడంతో పాటూ అమెరికా, కెనడా, ఇంగ్లాండు, ఫ్రాన్స్, స్విట్జర్లాండ్, హాలెండ్, రష్యా, ఆస్ట్రేలియా, జపాన్, మయన్మార్, శ్రీలంక, బంగ్లాదేశ్, సింగపూర్ మలేషియా, మారిషస్ దేశాలలో పర్యటించి, వేదాంత బోధనలతో పాటు భగవాన్ శ్రీరామకృష్ణ, దివ్యజనని శ్రీశారదాదేవి, స్వామి వివేకానందుల సందేశాలను వ్యాప్తి చేశారు. దేశ విదేశాల్లో వేలాదిమంది ఆధ్యాత్మిక సాధకులకు మంత్ర దీక్షను ప్రసాదించారు. స్వామీజీ తనకు కలిగే అసౌకర్యాలను పక్కనబెట్టి ఆధ్యాత్మిక మార్గదర్శకత్వం అవసరమైన ప్రతి ప్రాంతానికీ, కుగ్రామాలకు సైతం వెళ్ళి మూర్తిత్రయ సందేశాన్ని అందివ్వడంలో ఆద్యంతం అవిరామ కృషి చేశారు. U




...కన్యకుమారి ధీమహి తన్నో దుర్గిః ప్రచోదయాత్


ఆచార్యాణాం మహాచార్యో రామకృష్ణాయ తే నమః


సర్వవిద్యా స్వరూపాం తాం శారదాం ప్రణమామ్యహం


హితాయ నృణాం... వివేక-ఆనందం అహం నమామి


యత్కరోషి యదశ్నాసి... తత్ కురుష్వ మదర్పణమ్


అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ...


సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః...


రూపం అత్యద్భుతం హరేః... హృష్యామి చ పునః పునః


ఆపూర్యమాణమ్ అచలప్రతిష్ఠమ్ సముద్రమాపః ప్రవిశన్తి...


గురోరంఘ్రి పద్మే మనశ్చేన్నలగ్నం...